# ఉపోద్ఘాతము

ప్రపంచములోకెల్ల పెద్దది, మన దేశమునకు అనుకొనియున్నది యగు చైనాదేశపు చరిత్రను ప్రాచీనకాలమునుండియు నేటివరకును చైనావిప్లవము అను పేరున వ్రాసి ఆంధ్రమహాజనులకు సమర్పించు చున్నాను. చైనాయొక్క జనసంఖ్య అరవై కోట్లు. అరవై అయిదు కోట్లని కూడ కొందరిచేత అంచనా వేయబడుచున్నది. మన ఇండియా యొక్క జనసంఖ్య నలుబది కోట్లు. వైశాల్యములో చైనాప్రజల రిపబ్లికు మన దేశమునకు దాదాపు మూడు రెట్లు గలదు. ఈ రెండు దేశములు ప్రాచీననాగరికత కాలవాలములు. జ్ఞానసూర్యుడు ప్రథమ మున ఈ రెండు దేశములలోనే యుదయించెను. పదునెనిమిదవ శతా బ్దము వరకు ఈ రెండుదేశములలో ధర్మప్రధానమైన గ్రామనాగరికత, గ్రామ స్వరాజ్యము, గ్రామ గృహపరిశ్రమలు, సమిష్టి కుటుంబము, పితృదేవతల ఆరాధనము, సిరిసంపదలు ప్రబలియుండెను. ఇండియా నుండి బౌద్ధమతము చైనాకు పోయి వ్యాపించినందున చైనా ప్రధాన బౌద్ధదేశ మయ్యెను. 1774 నుండి ఇండియా బ్రిటిషుసామ్రాజ్యవాదుల ఏకపాలనముక్రిందకు వచ్చినది. స్వదేశ సంస్థానములు బ్రిటిషుపాలకు లచే నిలిపియుంచబడినవి. జమీందారీపద్ధతి స్థాపించబడ్డది. కాని అరాజ కము పోయి దేశైక్యత, శాంతి ఏర్పడినవి. 1842 నుండి బ్రిటిషు, ఫ్రెంచి, రుష్యా, జర్మను, జపాను సామ్రాజ్యవాదుల యాజమాన్యము క్రిందకు చైనా వచ్చినది. చైనా రాజరికము బలహీనమైనది. సైనిక నాయకులు విజృంభించినారు. భూస్వామందుల క్రింద రైతాంగము క్రుగ్గినది. అరాజకము పూర్తిగా వ్యాపించినది. రెండు దేశములలోను ఇరువదవ శతాబ్దములో జాతీయ స్వాతంత్రపోరాటములు సాగినవి. సన్ యటుసేను నాయకత్వమున చైనాలో 1911 లో స్వతంత్రపోరాటము

సఫలమై రాజరికము క్రూలద్రోయబడి రిపబ్లికు ఏర్పడినది. కాని విదేశస్థుల కుట్రవల్ల యూ యన్షికాయి రిపబ్లికు అధ్యక్షుడుగ ఎన్నుకొనబడి ప్రజాస్వామ్యతత్వము నాశనము గావించబడినది. రిపబ్లికు పేర సైనిక నాయకుల అంతః కలహములు, విదేశ సామ్రాజ్యవాదుల పలుకుబడి చెలరేగినవి. సన్ యటు సేను మరల 1923 లో క్యూమిన్ టాంగు మహాసభను పునరుద్ధరించి ప్రజారాజ్యము స్థాపించ యత్నించుచుండగ ఆయన 1925 లో పరమపదించెను. ఆయన ప్రజారాజ్య స్థాపనకొరకు సోవియటు రుష్యావారి సహాయమును కాంక్షించుట వలన కమ్యూనిస్టులు చైనాలో బలపడిరి. ఆయనయొక్క అనుచరులలో ముఖ్యుడగు చ్యాంగుకేషకు చైనాపైన క్యూమింటాంగు పాలనమును స్థాపించెను గాని, అది నామమాత్రావశిష్ట మైనది. క్యూమింటాంగు నాయకులు తమలో తాము అధికారముకొరకు పోట్లాడుకొనినారు. సుస్థిరప్రభుత్వ మేర్పాటుచేయలేకపోయినారు. భూసంస్కరణములను ప్రవేశ పెట్టలేదు; ఎన్నికలు జరపలేదు. లంచగొండితనము ప్రబలినది. అరాజకమునుండి దేశమును కాపాడలేకపోయినారు. కమ్యూనిస్టు నాయకులు క్యూమింటాంగు పార్టీతో ఇరువది సంవత్సరములు ఎడతెగనిపోరాటముసలిపి 1949 అక్టోబరు 1 వ తేదీన చైనా దేశముపైన కమ్యూనిస్టు రాజ్యమును స్థాపించినారు. చైనాపైన సామ్రాజ్యతత్వము నవలంబించిన జపానుయొక్క దండయాత్రలు క్యూమింటాంగు పతనమునకు కమ్యూనిస్టుల జయమునకు హేతువయ్యెను. ద్వితీయ ప్రపంచ సంగ్రామములో సామ్రాజ్యవాదులైన ఆంగ్లేయులు, అమెరికనులు కమ్యూనిస్టు దేశమైన రుష్యాతో జరిపిన మైత్రి, ఇండియాలోను, చైనాలోను కమ్యూనిస్టు పార్టీయొక్క విజృంభణకుతోడ్పడినది. జపానువారి దురాశ సఫలీకృతము కాకపోగా చైనాను మాత్రము కమ్యూనిస్టుల యాజమాన్యము క్రిందకు త్రోసినది. ఇండియాలో మహాత్మ గాంధియొక్క నాయకత్వముక్రింద స్వతంత్ర

పోరాటముజరిగి 1947 లో కాంగ్రెసు పార్టీక్రింద ప్రజారాజ్యము (Democracy), చైనాలో 1949 లో కమ్యూనిస్టుపార్టీక్రింద నియంతృత్వపాలనము (Totalitarian Rule) ఏర్పడి పంచవర్ష ప్రణాళికల ద్వారా ఆర్థికాభివృద్ధికి కృషిసలుపుచున్నవి. నా 'చైనా విప్లవము'లో రెండవభాగము కమ్యూనిస్టు విప్లవచరిత్రమై యున్నది. అందుకొరకు జరిగిన తీవ్రపోరాటములు, కమ్యూనిస్టు సమాజ స్థాపనలో జరిగిన పరిణామములు వివరించినాను. చైనా కమ్యూనిస్టులు కారలు మార్క్సును ఆదర్శముగా పెట్టుకొని అయన సిద్ధాంతములను పూర్తిగ అమలుజరుప యత్నించుచున్నారు. ఆ సిద్ధాంతములు ఉద్యోగులలో, విద్యాధికులలో, విద్యార్థులలో, రైతులలో, కార్మికులలో వ్యాపింపచేసి వారియుత్సాహమును కలుగచేసి కమ్యూనిస్టు సమాజమును అతిత్వరితముగ స్థాపించుచున్నారు. కారలు మార్క్సు సిద్ధాంతముల ప్రకారము మతము, ఆస్తి, కుటుంబము, వ్యక్తి స్వతంత్రము నాశనము గావింపబడి అందరుప్రజలను ప్రభుత్వము క్రింద కూలీలుగ మార్చి వివిధరంగములలో పనిచేయించి అందరికి సమానముగ తిండి, బట్ట, పిల్లల పోషణము, నివాసము, విద్యకలుగచేయుబాధ్యత ప్రభుత్వమే వహించుచున్నది. వర్గపోరాటము వలన ద్వేష పూరితమైన హింసావిధానము ప్రబలియున్నది. ఇంతకన్న ఇండియాయొక్క ప్రజారాజ్యము గాంధితత్వము అనేక విధముల శ్రేష్ఠమైనవి, గావున ఇండియాలో మహాత్మాగాంధిని ఆదర్శముగ పెట్టుకొని ఆయనసిద్ధాంతములను పూర్తిగ అమలు జరపవలసియున్నది. రాజకీయవాదులలో, విద్యాధికులలో, విద్యార్థులలో, రైతులలో, కార్మికులలో, వర్తకులలోనేగాక ఉద్యోగస్థులలోగూడ ఆ సిద్ధాంతములు బాగుగ నాటి యుత్సాహము కలిగినగాని ఇండియా స్థాపించదలచుకున్న సోషలిస్టు సమాజస్థాపన త్వరితముగను, బాగుగను జరుగనేరదు. లంచగొండితనము నిర్మూలము గావలెను. ఉపేక్ష, పనిలో ఆలస్యము ఉండ

గూడదు. ఇంక నెక్కుడుగ క్రమశిక్షణ, ఐకమత్యము స్థాపితము కావలెను. చైనాలో లంచగొండితనమును నిర్మూలించుటకు ఎప్పటి కప్పుడు జయప్రదముగ ప్రయత్నములు చేసియున్నారు. నయమునను, భయమునను క్రమశిక్షణ బాగుగనున్నది. ఇండియా ఇంక నెక్కుడుగ బలపడవలెను. గాంధి సిద్ధాంతముల ఆచరణ మూలమున సబలపడగలదు. చైనా పురోగతిలో కమ్యూనిస్టుపార్టి బాగుగ తోడ్పడినటుల ఇండియా పురోగతిలో కాంగ్రెసుపార్టి తనపాత్రను త్యాగముతో నిర్వర్తించ వలెను. ప్రజాప్రబోధము గావించవలెను. (కో-ఆపరేటివ్ ఫార్మింగు) వ్యవసాయ యుత్పత్తిదార్ల సహకారసంఘములు చైనాలో అత్యధిక యుత్పత్తి కెంతయో తోడ్పడినవి. ఆ పద్ధతివలన ఇండియాకు కూడ చాల మేలుకలుగగలదు. ఆహారసమస్య తీరును. అపైన చైనాలో స్థాపిం చబడిన సమిష్టి వ్యవసాయ క్షేత్రములను కమ్యూనులకు ఇండియా అంగీక రించదు. ఒక్క దృఢమైన ఆదర్శముతో ఒక్క నాయకత్వముక్రింద ఇండియా మంచి శిక్షణతో ముందుకు నడవవలెను. అప్పుడే ఇండియా యొక్క ప్రజారాజ్యము శాశ్వతముగ వర్ధిల్లగలదు. ఇండియా లోక కళ్యాణమునకు, లోకశాంతికి విశేషముగ తోడ్పడగలదు. కమ్యూనిస్టు చైనా, టిబెటుపైనను, ఇండియా భూభాగముల పైనను జరిపిన దురా క్రమణలను గూర్చి రెండు అధ్యాయములను వ్రాసినాను. పవిత్రమైన హిమవత్పర్వతములు ఇండియాకు కిరీటము. వాటి దక్షిణభాగమున నొక నదరపుగజము పైనను విదేశస్థు లాక్రమించుటకు సహించరానిదరము. కమ్యూనిస్టు చైనా యొక్క వైదేశిక నీతిని వివరించినాను. ఒక వైపున కమ్యూనిస్టు ప్రపంచములోను, రెండవ వైపున ఆశియా ఆఫ్రికాఖండ జాతులలోను నాయకత్వమును పొందవలెనను ఆశ చైనాకు మెండుగ నున్నది. అంతేగాక ఇండియామొదలైన ఆగ్నేయాశియా దేశముల నన్నిటిని కమ్యూనిస్టు దేశములుగ మార్చి తమ నాయకత్వముక్రిందకు తెచ్చుకునే దురాశ చైనానాయకుల కున్నటుల కూడ పత్రికలలో చదివి

నాము. ఇట్టిపరిస్థితులలో ఇండియాయొక్క స్వతంత్రము అచంచలము గను, నిరపాయముగను నున్నదని భారతీయు లెవరును భ్రమలో నుండగూడదు. ఇండియాయొక్క భూభాగములో చైనావా రాక్ర మించిన ప్రాంతములను మరల రాబట్టుకొనుటకే గాక దేశస్వతంత్ర మునకు ఎట్టి విఘాతము ఎప్పుడును కలుగకుండ కాపాడుకొనుటకు భారతీయులెల్లరు గట్టిఐకమత్యముతో తయారుగ నుండవలెను. ఎట్టి త్యాగములనైనను గావించి దేశ స్వతంత్రమును కాపాడుకొనవలెను.

శాస్త్రవిజ్ఞానము, చరిత్ర తెలుగు-ఉరుదూ అకాడమీ పక్షమున ఈ గ్రంథమును ప్రచురించుచున్నాము. నేను సంప్రదించిన పుస్తకముల, పత్రికల పేర్లు ఇచ్చినాను. అతి త్వరితముగను, మిగుల జాగ్రత్తగను దీనిని ముద్రించిన అజంతా ప్రింటర్సు వారికి నా కృతజ్ఞతను తెలుపు చున్నాను.

నాగార్జున విహార్
హిమాయత్ నగర్, హైదరాబాదు
26—7—1960

అయ్యదేవర కాళేశ్వరరావు

# అనుక్రమణిక

## మొదటిభాగము - జాతీయ విప్లవము
## ప్రాచీనకాలము నుండి 1930 వరకు

## రెండవ భాగము - కమ్యూనిస్టు విప్లవము
## 1927—1960

# చైనా విప్లవము

## ప్రథమాధ్యాయము

### 1

భరతవర్షమునకు తూర్పు సరిహద్దునను ఉత్తరసరిహద్దునను నొక గొప్ప సామ్రాజ్య మనేక శతాబ్దములు ప్రబలియుండెను. అందు చేరిన దేశములెల్లను భరతవర్షమునం దవతరించిన గౌతమబుద్ధుని మతము నవలంబించి భరతవర్షమును పుణ్యభూమిగ నెంచుకొను చున్నవి. భారతదేశమందలి సిద్ధార్థుడు జనన మొందిన లుంబినీ వనము, ఆయనకు జ్ఞానోదయమైన బుద్ధగయ, బుద్ధభగవానుడు తన యోగమృతమును వెదజల్లుట కారంభించిన సారానాథము, ఆయన తొలిసారి తన ధర్మచక్రమును త్రిప్పిన వారణాశి, ఆయన కొంతకాలము వసించి మతవ్యాప్తి గావించిన రాజగృహ, ఆయన నిర్యాణము జెందిన కుశి, బౌద్ధగాథల చిత్తరువులకు ప్రసిద్ధిగాంచిన కార్లి, అజంతాగుహలు, బౌద్ధ విశ్వవిద్యాలయములు వర్ధిల్లిన నలంద, తక్షశిల, అమరావతులు ఆ దేశములవారికి పావనక్షేత్రములు. ఆ చైనా సామ్రాజ్యము ఇటీవల లోకములో కెల్ల పెద్దదయిన చైనాప్రజల ప్రజాస్వామికముగ మారినది. నాటి సామ్రాజ్యమునకును నేటి ప్రజాస్వామికమునకును నాయకమణి చైనాదేశ మయ్యున్నది.

భరతవర్షము పుణ్యభూమి

భారతదేశము, ఈజిప్టు, మెసపొటేమియాలవలెనే చైనా దేశము కూడ మానవ విజ్ఞానమునకును, నాగరికతకును జన్మ స్థానము. ఇటీవల జరిగిన భూగర్భశాస్త్రపరిశోధనలవలన ఈ దేశములలో క్రీస్తుకు పూర్వము ఏడువేల సంవత్సరములకు పూర్వమే గొప్ప నాగరికతలు నిలిచియుండెనని రుజువైనది. భారతీయులవలెనే చైనావారును అనేక యుగములనుండి గొప్ప నాగరికతను కలిగి యున్నామని గర్వపడుచున్నారు.

చైనాయొక్క గొప్ప నాగరికత

ఒకప్పుడు ఆకాశ విమానములు, అద్భుతమగు యంత్రములు, మహాద్భుతములగు కార్యములను సాధించిన చక్రవర్తు లుండిరని నమ్ముచున్నారు. చైనాదేశపు ఋషిపుంగవుడును ప్రాచీన చరిత్రకారుడును నగు కన్ఫ్యూషియసు రచించిన షూచింగు అను గ్రంథమువలన క్రీస్తుకు పూర్వము 2852 సంవత్సరములనుండి యాదేశపు గొప్ప చరిత్ర వరుస తప్పకుండ తెలియుచున్నది. చైనాదేశము చాల పెద్దదై వివిధములగు శీతోష్ణములను గలిగి యుండుటవలన అన్నిరకముల పంటలును పండుచున్నవి. వ్యవసాయమునకును, తోటలకును ఆ దేశము ప్రసిద్ధి గాంచెను. అచటగల భాగ్యవంతములగు గనులను త్రవ్వి లోహముల నుపయోగించుచుండిరి. పట్టణముల లోను పల్లెలలోను చేతిపనులు, గృహపరిశ్రమలు ప్రబలి దేశము సిరిసంపదలతో దులతూగుచుండెను. విదేశ సరుకులతో గాని విదేశ వర్తకముతో గాని బొత్తుగ నవసరములేని స్వయం సంపూర్ణతను గలిగి యుండెను. ఇతర దేశములే చైనాతో వర్తకము చేసి కొనుట మహా భాగ్యమని తలచెను. ప్రథమమునుండియు

చైనా వారికి విద్యా వ్యాసంగమునం దెక్కువ యభిరుచి గలిగి పండితులను మిగుల గౌరవించుచుండిరి. చరిత్రలు వ్రాయుట యందును శ్రద్ధగలవారు. క్రీస్తుకు పూర్వము 2667 వ సంవత్సర మున హ్యూయాంగ్టె చక్రవర్తి వ్రాతలిపి యొక్క సంస్కరణ మును గావించినదాదిగ యాదేశపు వాఙ్మయము అనంతముగ బెరిగినది. చైనాభాషలో, అక్షరము లొకదానిక్రింద మరియొక దానిని వ్రాసెదరు. చైనా చక్రవర్తులు గొప్ప విద్యాపోషకులై విశేషముగ పాఠశాలలను నెలకొలిపిరి. సర్వకళాశాలలను స్థాపించిరి. వాఙ్మయమును వృద్ధిచేసిరి. ప్రకృతిశాస్త్రములు, జ్యోతిశ్శాస్త్రము, వైద్యశాస్త్రము, కళలు, చిత్తరువులు శిల్పము, సంగీతము మొదలగునవి కూడ బాగుగ వృద్ధిచెందెను. చిరకాలము క్రిందటనే అచ్చువేయుటను వారు కనిపెట్టిరి. ఇది గ్రంథసముదాయము విశేషముగ నభివృద్ధియై యా గొప్ప దేశమునం దంతటను వ్యాపించుటకు సౌలభ్యమును గలుగజేసెను. పట్టు, తేయాకు, పింగాణి, తుపాకిమందు, దిక్సూచీ యంత్రము, దంతపుపనులు, కాగితము, అచ్చు, సిరా, సముద్రములలో పడవలను నడపుట మొదలగువాటి నెన్నిటినో చైనావారు కనిపెట్టిరి. ఆనకట్టలను, జలాధారములను, వంతెనలను, సౌధములను నిర్మా ణము గావించు ఇంజనీరింగు పనులలో ప్రసిద్ధికెక్కినారు. చిత్ర లేఖనము నందును, శిల్పచాతురి యందును, రంగులు వేయుట యందును ప్రఖ్యాతి గాంచిరి. వారు పూర్వాచారపరాయణులై తమ నిలకడయైన రాజకీయ, సాంఘిక, ఆర్థికసంస్థల మూలమున నొకరీతిని తమ గొప్ప నాగరికతను వేలకొలది సంవత్సరములుగ

గాపాడుకొని యున్నారు. వారు నైతికముగ గొప్పస్థితిని పొందియుండిరి. తమరాజ్యము స్వర్గరాజ్యమనియు (**Celestial Empire**) తమ చక్రవర్తి స్వర్గపుత్రుడనియు (**Son of Heaven**) వారి నమ్మకము. విదేశస్థులను వారు అనాగరికులుగ భావించు చుండిరి.

## 2

జాతీయైక్యత

వైశాల్యమునందును జనసంఖ్యయందును మిగుల గొప్ప దేశమైనను చరిత్ర తెలిసినప్పటినుండియు చైనాదేశమునకు జాతీయైక్యత గలదు. భరతవర్షమునందలి చప్పన్న (ఏబదియారు) రాజ్యములవలె చైనాదేశ మెప్పుడును చిన్న చిన్న స్వతంత్రరాజ్యములుగ విభజింపబడి యుండలేదు. ఆదేశమంతయు నొకే చక్రవర్తిక్రింద పాలింపబడుచు నొకే రాజకీయవిధానమును గలిగియుండెను. పలుమారులు రాజ కుటుంబములు మారిపోయి క్రొత్తవి వచ్చినవి. కాని యే చక్రవర్తి యేలినను దేశమంతయు నేలినారుకాని పెక్కుమంది స్వతంత్ర రాజులు వివిధభాగములపై పాలనమును స్థాపింపలేదు. చెడు చక్రవర్తులు దుష్టపరిపాలనము గావించినపుడు వారిని వెడలగొట్టి క్రొత్తవారిని తెచ్చుకొనుట చైనాప్రజల కలవాటు. క్రీ. పూ. పదవశతాబ్దములో చౌవంశ చక్రవర్తులు చైనాదేశమందు మొఖాసాప్రభు పరంపరను (**Feudal System**) స్థాపించిరి. చక్రవర్తి క్రింద సామంతప్రభువులు, వారిక్రింద గొప్పప్రభువులు, వారిక్రింద చిన్నప్రభువులు, వారిక్రింద నింకను చిన్నప్రభువులు, వారిక్రింద

జమీందారులు నుండునట్లొక భూఖామందుల పరంపర యేర్పాటు చేయబడెను. కాని, కాలక్రమమున భూఖామందులు బలవంతులయి, తమలో తాము కలహించుకొని రైతులను పీడించిరి. వ్యవసాయము క్షీణించి క్షామము వ్యాపించెను. చక్రవర్తి బలహీనుడై దేశములో నరాజక మేర్పడెను. అట్టితరి క్రీ. పూ. రెండవ శతాబ్దమున చౌవంశ చక్రవర్తిపై గొప్ప తిరుగుబాటు జరిగి యాయన పడగొట్టబడి, చిన్‌వంశీయుడగు షిహ్వాయాంగుటీ చక్రవర్తి రాజ్యమునకు వచ్చెను. ఈ గొప్పచక్రవర్తి క్రీ. పూ. 221 వ సంవత్సరమున భూఖామందుల పరంపరాపద్ధతిని బూర్తిగ నాశనము గావించి యావత్తు చైనాదేశముపైనను తన యేకచ్ఛత్రాధిపత్యమును స్థాపించెను. మరల నెన్నడును మొఖాసాప్రభు పరంపరాపద్ధతి యా దేశమున తలయెత్తలేదు. ఆయన దేశమునంతను పదునెనిమిది రాష్ట్రములుగ భాగించి వాటిపై తన యాజ్ఞానువర్తులుగ పాలనము జేయుటకు గవర్నరులను నియమించెను. ఆ పదునెనిమిది రాష్ట్రములే నేటికిని నిలచియున్నవి. ఆయన యేర్పాటుచేసిన రాజ్యపద్ధతియే బహుకొలది మార్పులతో క్రీ. పూ. 1912 వ సంవత్సరమువరకును అమలులో నుండెను. ఉత్తరమునుండి అనాగరికులగు జాతులవారు దేశముపై దండెత్తకుండ చైనాకుత్తరమున, తూర్పున సముద్రము మొదలు పశ్చిమమున టిబెటుదేశపు ఉత్తరసరిహద్దువరకును, పదునెనిమిది వందల మైళ్ళ పొడవున, యిరువది రెండడుగుల యెత్తున, ఇరువది యడుగుల వెడల్పుగల యొక గొప్ప యిటుకగోడను ఆయన కట్టించెను. దీనికి గొప్పగోడ (**Great wall**) యని పేరు. ప్రతి

నూరుగజముల దూరమునను నలుబదియడుగుల యెత్తుగల బురుజు నిర్మింపబడెను. ఇది లోకములోని వింతలలో నొకటి యని చెప్పుదురు.

**ఒకే వాఙ్మయము**

మరియొక ముఖ్యవిషయమేమనగా ప్రాచీనచైనాదేశము భరతవర్షమువలె విదేశీయుల దండయాత్రలకు గురికాలేదు. పరిషియనులు, గ్రీకులు, సిథియనులు, శకులు, పహ్లవులు, కుషానులు, రాష్ట్రికూటులు, ఆఫ్ఘనులు, మొగలులు, మొదలగువారి దండయాత్రలనుండి చైనాను పశ్చిమమునసున్న గొప్ప యెడారులు సంరక్షించినవి. ఆ దేశపు జాతీయైక్యతను కాపాడిన మరియొక శక్తి వారి వాఙ్మయము. దేశమంతకును ఒకే గ్రాంథిక భాష, ఒకే లిపి, ఒకే వాఙ్మయ ముండెను. దేశములో నెచట వ్రాసినను, అన్ని భాగములలోను ప్రజలకు బోధపడెను. చైనా చక్రవర్తులు క్రీ. శ. 620 వ సంవత్సరమునుండియు నే ప్రభుత్వోద్యోగ మిచ్చినను చైనా వాఙ్మయమునందు పోటీపరీక్షలలో కృతార్థులయిన వారలకే యిచ్చుపద్ధతిని (Competitive Examination system) స్థాపించిరి. ఇది చైనా రాజ్యాంగపద్ధతియొక్క ముఖ్యలక్షణము. ఎంతటి చిన్న యుద్యోగమునకైనను ఈ పరీక్షలలో గెలుపొంద వలసినదే. ఇందువలన దేశములోని ప్రభుత్వోద్యోగు లందరికిని యొకేభాష యేర్పడెను. నవీన హిందూదేశ పాలనములో ఐ. సి. యస్. బృంద మాక్రమించిన స్థానముకన్న కూడ గొప్ప స్థానమును చైనాలోని మందారినులని పిలువబడు నీ యుద్యోగస్థుల బృంద మాక్రమించెను. ఇట్టి భాషైక్యతవలన, వివిధ

ప్రాంతములలో మాటలాడు భాషలో కొంత వ్యత్యాసమున్నను, ఆచారముల యొక్కయు, నడవడికల యొక్కయు తప్పొళ్ళలో గొంత భేదములున్నను, దేశమొత్తముపైన ప్రధానభావముల లోను, ఆదర్శములలోను సాంఘిక, ఆర్థికసంస్థలలోను ఏకత్వ ముండెను.

చైనాదేశము హిందూదేశమువలె ఆధ్యాత్మికదేశము కాదు. అచటి తత్త్వవేత్తలు తోడిమానవులతో నెటుల ప్రవర్తింప వలెనో బోధించిరేకాని ఈశ్వరారాధనమును గురించియు మోక్షమునుగూర్చియు బోధించియుండలేదు.

కణాఫ్యూషియను మహర్షి

వారి ప్రధానోద్దేశ్యము మానవులను లోకమును బాగుజేయు మార్గముల నన్వేషించుటయే యైయున్నది. క్రీ. పూ. 590 వ సంవత్సరమున జననమొందిన, లౌడ్జు యను యోగిపుంగవుడు టాయోమతమును స్థాపించెను. టాయోయనగ సత్యాన్వేషణమని యర్థము. శూన్యమునుండియే సృష్టి యేర్పడినది. సృష్టి చట్టములు దోషరహితమయి సాత్వికమైనవి. మానవకల్పితములైన సాంఘిక విధానము లన్నియు సృష్టిక్రమమునుండి దూరము సేయుచున్నవి. కోరికలను వదలి ప్రకృతి ననుసరించి నడచుటయే జ్ఞానము. నాగరికతయని మనము పలుకునది భ్రమప్రమాదజనితమైనది. కావున సృష్టి ప్రారంభమున మానవుడు పొందియున్న స్వభావమైనట్టియు కల్లకపటములేనట్టియు స్థితికి బోవుటలోనే మానవసౌఖ్యము గలదని యాయన వ్రాసెను. క్రీ. పూ. 551 వ సంవత్సరమున జన్మించిన కణాఫ్యూషియను చైనాజాతీయ నిర్మాత. ఆయన

షాంటుంగురాష్ట్రమున జన్మించెను. చరిత్రగ్రంథము, మహాకర్మల గ్రంథము, కీర్తనలగ్రంథము మొదలగు గ్రంథములను వ్రాసెను. ఆయనవద్ద మూడువేలమంది విద్యార్థులు చదువుచుండిరి. ప్రపంచము అధర్మభూయిష్ఠమై క్షీణించుచున్నదని యాయన కనుగొని ధర్మ స్థాపనకు గడంగెను. మానవులను సన్మార్గమున బెట్టుటకు పూను కొనెను. పెక్కుగ్రంథములను రచించెను. పితృభక్తి, మాతృభక్తి, బిడ్డలయందు దయ, సోదరులయందు వాత్సల్యము, భార్యాభర్తల కుండవలసిన ప్రేమ, స్త్రీలయెడ గౌరవము, రాజు ప్రజల సౌఖ్యముకొరకే పాలనము సేయుట, ప్రజలు రాజుయొక్క యాజ్ఞ లను చెల్లించుట, ఉద్యోగస్థులు సన్మార్గవర్తనము గలిగియుండుట, మానవులు పరస్పరగౌరవము గలిగియుండుట మొదలగు మానవ ధర్మములను గూర్చియే బోధించెను. స్తేయము, మద్యపాన, వ్యభి చారాదిదోషములు లేకుండుట, పరిశుద్ధమైన జీవనము, మానవ సౌఖ్యమునకును సంఘశాంతికిని అత్యావశ్యకములని యాయన వ్రాసెను. మానవుడు స్వభావముగ యోగ్యుడనియు, చెడు సాంగత్యమువలననే యాతడు చెడుననియు నాయన వాదము. ప్రథమమున నంతయు శూన్యముగ నుండెననియు పురుషుడు ప్రకృతియను రెండుభాగములుగల మహాశక్తి యుత్పన్న మయ్యెననియు, ఆ రెండుభాగముల అనగా పుంలింగము, స్త్రీ లింగముల కలయికవలన పృథివి, అగ్ని, జలము, వాయువు, లోహము లను పంచభూతము లుత్పన్నమయ్యెననియు, వాటి నుండి సృష్టియావత్తు ఏర్పడెననియు నాయన సిద్ధాంతీకరించెను. ప్రథమమున కొన్ని భావములు పూర్వులవలన కనుగొనబడె

ననియు, ఆ భావముల యర్థమును బాగుగ గ్రహించుటయే నాగరికతాభివృద్ధి యనియు, ప్రతిపేరునకును సరియైన యర్థ ముండవలెననియు, ప్రతిమాటను దాని నిజమయిన యర్థమున వాడవలెననియు నాయన బోధించుటవలన, మిగుల మర్యాద కరమైన పవిత్రమైన భావములను దెల్పు సంభాషణము వ్రాత గ్రంథములు మాత్రమే యాదేశమున బ్రబలెను. ప్రజ లవలంబించ వలసిన యాచారములు, నైతికధర్మములు, వివాహము, వార సత్వము, దాయభాగము, శుభాశుభకర్మలు, వృత్తిధర్మములు, ఆహారము, స్నానపానములు మొదలగు మానవుల దైనిక ప్రవర్తనమంతయు నాయన నిర్ణయించెను. పితృదేవతల యారాధనమును ఆయన బాగుగ నెలకొలిపెను. చట్టముల వలనను, శిక్షలవలనను ప్రభుత్వమును నడప గూడదనియు, శిక్షించుటవలన మానవులు సిగ్గును విడుతురనియు, నైతికబోధ వలనను, రాజులును ప్రభువులును ఉద్యోగస్థులును పండితులును పెద్దలును గౌరవకరమగు ప్రవర్తన నవలంబించి చూపుటవలనను మాత్రమే ప్రజలను సన్మార్గవర్తులుగ జేయవలెననియు నాయన వ్రాసెను. ప్రభుత్వము యొక్క ధర్మము ప్రజలను సన్మార్గవర్తు లుగను, ననుశమ ధర్మములను చక్కగ నెరవేర్చువారిగను జేయుటయే. సృష్టియొక్క శాసనములన్నియు నైతికమైనవి. వాటిననుసరించుటయే మానవధర్మము. ఆరాధించవలసినభగవంతు డాయనకు లేడు. తనకు వేరుగనున్న భగవంతు డనువానిని యారాధించుటవలన గాక తనలో నున్న నైతికస్వభావమును వృద్ధినొందించుకొని సృష్టిలోని శాసనముల నెక్కుడుగ ననుక

రించుటవలన మానవుడు పరిపూర్ణత నొందును. సత్యమనగా తనకు ధర్మమని తోచిన దాని నాచరించుట. ఆయన సిద్ధాంత ప్రకారము మానవుడు సృష్టికి ప్రభువు కాడు. సృష్టియొక్క మధురగానమున నొక శ్రుతియైయున్నాడు. "సృష్టిక్రమము నాచరించుటయే ధర్మము. ధర్మమును తెలిసికొనుటయే జ్ఞానము. సృష్టి క్రమమును పూర్తిగ సమలంబించినపుడు మానవులు యోగ్యత, సామర్థ్యము, జ్ఞానము గలవారిని రాజులుగ నెన్ను కొనిరి. మానవులందరిలోను ప్రేమ వర్ధిల్లెను. ఒకరినొకరు అపకారము జేయలేదు. వృద్ధులకు జీవనోపాధిని కలుగజేసిరి. శరీర పటుత్వము గలవారికి పని గల్పించిరి. పిల్లలను సంరక్షించిరి. అనారోగ్యవంతులకు అనాథలకు శరణాలయముల నేర్పాటు గావించిరి. ఎవరును నోముకరపోతులు కారు. ఉత్పత్తియైన ధనము నందరు ననుభవించిరి. స్త్రీలును పురుషులును సమాన గౌరవము గలిగి యుండిరి. దొంగలు, దుర్మార్గులు, తిరుగుబాటుదారులు లేకుండిరి. కాని యట్టి సృష్టిక్రమ మిప్పుడు గప్పినది. రాజ్యము వంశానుగతమయినది. ప్రతివారును తమ తల్లిదండ్రులను బిడ్డలను మాత్రమే ప్రేమించుచున్నారు. ఆస్తిని కూడబెట్టుకొని నాలుగ సత్వపు వంక్కగ ననుభవించుచున్నారు. కావున ప్రజలకును రాజులకును ఉద్యోగస్థులకును ధర్మమును నేర్పవలసి వచ్చినది. క్రమముగాం సృష్టియొక్క స్వాభావికస్థితికి మానవలోకమును మరలించుటయే ధర్మబోధయొక్క యుద్దేశ్యము. మానవుడు పరిపూర్ణదశను పొందుటకొరకు రాజ్య ముండుట సృష్టియొక్క శాసనమయి యున్నది. రాజు సృష్టిని జేసిన మహాశక్తియొక్క

పుత్రుడును ప్రతినిధియునయి యున్నాడు. ఆయన ప్రజల్లకు తండ్రి. ఆయన తన పవిత్రజీవితముచే ప్రజలకు మార్గదర్శిగా నుండవలెను. ప్రజలు సుఖమును యోగ్యతను గలిగియుండుటకై ధర్మపరిపాలనమును జేయవలెను. ప్రతి సంవత్సరము నొకసారి యీ మహాశక్తి నారాధన జేయుట కాయనకు మాత్రమే యధికారము గలదు. ఆయన యెడల ప్రజలు విధేయతను చూపవలెను. ఆయన సుపరిపాలనము గావించినంతవరకును మహాశక్తియొక్క యాశీర్వచన మాయనయం దుండును. దుష్ట పరిపాలనము గావించినపుడు ఆ యాశీర్వచనము తొలగిపోవును. ఆయనయొక్క లోపమువలననే ప్రజలలో దుర్మార్గప్రవర్తన, క్షామము, అంటురోగములు, భూకంపములు, వెల్లువలు మొదలగు బాధలు కలుగును. అట్టి వేర్పడుట మహాశక్తియొక్క యాశీర్వచన మాయననుండి తొలగిపోయెననుటకు చిహ్నము. అట్టితరి యీ రాజును వెడలగొట్టి మరియొకరిని దెచ్చుకొనుట ప్రజల ధర్మము" అని యాయన వ్రాసెను. కణ్‌ఫ్యూషియసు మహర్షి యొక్క బోధలు చైనాదేశమంతయు వ్యాపించి వారియొక్క రాజకీయ సాంఘికవిధానములకెల్లను మూలాధారము లయ్యెను. ఆయన క్రీ. పూ. 479 వ సంవత్సరమున మరణించెను. చైనా చరిత్రలో దుష్పరిపాలన గావించిన రాజులపై తిరుగుబాటు గావించి వెడలగొట్టి మరియొక క్రొత్తపాలకుని తెచ్చుకొనుట అలవాటు. చైనాకు విప్లవములభూమి యని పేరు వచ్చినది. ఫ్రెంచి విప్లవకారుడగు రూసో ఈ విప్లవసిద్ధాంతమును బోధ చేయకపూర్వము రెండువేల సంవత్సరముల పైకాలముననే ఇది

కణఫ్యూషియసుచే బోధించబడి చైనాలో అమలులో నున్నది. రాజకీయ సిద్ధాంతములకన్న న్యాయపరిపాలన చైనావారికి ముఖ్యమయి యున్నదని చరిత్రకారులు వ్రాసియున్నారు. అటు పిమ్మట క్రీ. పూ. 372 మొదలు 289 వరకు బ్రబలిన మెన్షియస్ మహార్షి కూడ చైనా జాతీయజీవితముపై గొప్పపలుకుబడి గలిగి యున్నాడు. "దయ, న్యాయము, గౌరవము, జ్ఞానము మానవు లకు సహజగుణములు. వాటిని వృద్ధిపరుచుకొని మానవుడు పరిపూర్ణతను పొందవలసినది" అని యాయన బోధించెను. కణఫ్యూషియసుయొక్క సిద్ధాంతములను ఆదర్శములను యాయన హేతువాదముచే గట్టిపరచి వ్యాపింపజేసెను. "మహాశక్తి యొక్క యుద్దేశ్యములు ప్రజాభిప్రాయములనే తెలియును. ప్రజలు నిర్ణయించినది మహాశక్తియొక్క నిర్ణయము యున్నది. ప్రజ లేది కోరిన మహాశక్తి దాని నిచ్చును" అని యాయన చెప్పెను. టావోయిమతము కాలక్రమమున యోగ మత మయ్యెను. ఆ మతావలంబకులు గాఢయోగము నభ్యసించి అయుష్యమును వృద్ధిచేసికొనుటకు ప్రయత్నము చేయసాగిరి. రోగములు కుదిర్చెదరనియు, దయ్యములను పారద్రోలుదు రనియు వారియందు ప్రజలకు నమ్మక మేర్పడెను. కణఫ్యూషి యసు రచించిన స్మృతియే ప్రజల దైనికవర్తనమును, ధార్మిక జీవితమును, ఆచారవ్యవహారములను, సాంఘికపద్ధతులను పూర్తిగ నడపుచున్నది.

చైనాదేశమునకు మతమును ప్రసాదించినది భరతవర్షమే. క్రీ. శ. ప్రారంభమున భరతవర్షములోని ఆంధ్రదేశమునుండి బౌద్ధ భిక్షువులు, పండితులు బౌద్ధమతమును చైనాకు గొనిపోయిరి.

బౌద్ధమతము

అపుడు ఆంధ్రదేశము బౌద్ధమత పోషకులగు శాతవాహన చక్రవర్తుల పాలనము క్రింద నుండెను. చైనానేలిన హాన్, టాంగు వంశముల చక్రవర్తులు ఆ మతమును తమ సామ్రాజ్యమంతటను వ్యాపింపచేసిరి. క్రీ. శ. 399 వ సంవత్సరమున ఫాహియాన్ అను బౌద్ధభిక్షువును భారతదేశమునుండి బౌద్ధమత గ్రంథములను తీసికొనివచ్చుటకు పంపిరి. ఆయన పలుదేశములందంతటను గ్రుమ్మరి పాటలీ పుత్రము, వారణాశి, గయ, తక్షశిల, రాజగృహము, కపిలవస్తు మొదలగు పుణ్యక్షేత్రములను, అమరావతి విశ్వవిద్యాలయమును దర్శించి, ఆరుసంవత్సరము లీ దేశమున సంస్కృతభాష నభ్యసించి, పలు గ్రంథములను సముపార్జించి, తామ్రలిప్తి నగరమున నోడనెక్కి సముద్రమార్గమున సింహళ, జావా ద్వీపములమీదుగ మరల చైనాదేశమును చేరెను. అతడు తనయాత్రా వృత్తాంతము లో నా కాలమున భారతదేశమున ప్రబలియున్న సంపద సుపరి పాలనము, నైతికజీవనము, విజ్ఞానము, నాగరికతలనుగూర్చి విశేష ముగ ప్రశంసించెను. అనేకమంది చైనా బౌద్ధులు భరతవర్షమును దర్శించి పోయిరి. ఒకప్పుడు చైనా చక్రవర్తి యొక్క కుమారు డును కొమార్తెయు భారతదేశమున సంచారముచేసి యమరావతి యందలి విహారములను స్థూపములను దర్శించి పోయినటుల

కనుపట్టుచున్నది. చైనాకు వచ్చిన బౌద్ధమతశాఖ మహాయానము. భక్తిప్రపూరితము. మహాయానమును భరతఖండమున స్థాపించిన యోగిపుంగవుడగు ఆచార్య నాగార్జునుడు క్రీస్తుశక ప్రారంభమున ఆంధ్రదేశమున వర్ధిల్లెను. ఆంధ్ర సామ్రాజ్యాధీశుడగు గౌతమీపుత్ర శాతకర్ణి పేర ఆయన సుహృల్లేఖమను సుప్రసిద్ధ కావ్యమును రచించెను. శ్రీపర్వతమను నందలి యొక సంఘారామమును వాసస్థలముగ చేసికొనెను. ఆ పర్వతము గుంటూరు జిల్లాకనతిదూరమున నాగార్జునకొండ యను పేరున పరగుచున్నది. గొప్ప రసాయన శాస్త్రపరిశోధకుడై ఆ కాలమున వర్ధిల్లుచున్న అమరావతి తక్షశిల విశ్వవిద్యాలయములలో తన శాస్త్రశోధనలను వెల్లడించి గొప్ప ఖ్యాతిని గడించెను. అంతవరకు బౌద్ధమతము నందు కేవలము నైతికోత్కృష్టత జ్ఞానవైరాగ్యములు మాత్రముండెనే కాని ఈశ్వరారాధన మనునది లేదు. ఆయన భక్తిమార్గము నా మతమునందు చొప్పించెను. గౌతమ బుద్ధుని నాతని యవతారములను ఆరాధించవలెను. బుద్ధుడు భగవంతుని యవతారము. బుద్ధత్వమును పొందుటయే నిర్వాణము. జీవాత్మ శాశ్వతమైనది. కర్మసిద్ధాంతము, పునర్జన్మము నమ్మవలెను. చేయుచున్న పుణ్యాపాపములనుబట్టి జీవునికి ఉత్తమ హీన జన్మములు కలుగును. పాపముచేసిన నరకబాధ కలదు. పవిత్ర జీవనము, నీతివర్తనము, సకల జీవరాసులయెడ ప్రేమ, ఇవి యనుష్ఠించవలసిన ధర్మములు. బుద్ధుడు, సంఘము, ధర్మము అను త్రయము నుపాసించవలెను. సంపూర్ణమగు వైరాగ్యము నవలంబించి బౌద్ధమత ధర్మములను నెరవేర్చినచో నిర్వాణము

లభించును. సన్యాస ముత్తమాశ్రమము. బౌద్ధధర్మము ననుష్ఠించుటయును సన్యాసమును స్వీకరించుటకును నిర్వాణము పొందుటకును పురుషులకును స్త్రీలకును అందరు మానవులకును సమాన మగు సర్వ్వాతరలను. కులభేదములు లేవు. ఇట్టి మహాయానమతము చైనా యందటను వ్యాపించి చైనా సామ్రాజ్యమునకు జాతీయ మతమయ్యెను. చైనావారు గౌతమబుద్ధుని, యాతని యవతారములను ఆరాధించుటకై దేవాలయములను నిర్మించిరి. విగ్రహములను నెలకొలిపిరి. వాహనముల పైనను రథముల పైనను ఉత్సవములు సలిపిరి. యాత్రలు గావించిరి. కాని టావోయో సిద్ధాంతమును కన్ఫ్యూసియసు యొక్క నైతిక సాంఘికవిధానమును బౌద్ధమతబోధలతో సమ్మేళనమై చైనావారిచే ననుష్ఠింపబడుచున్నవి. చైనాదేశము మతకలహముల నెరుగదు. చైనా నుండియే నాగరికతను, విజ్ఞానమును, కళలను శాస్త్రములను, మతమును జపాను నేర్చుకొనెను. జపానుకు తన స్వంత నాగరికత లేదు.

సంఘమునందలి తరగతులు

చైనాలోని సంఘము ఐదుతరగతులుగ విభజించబడినది. ఈ తరగతులు వృత్తులవల్ల నేర్పడినవిగాని పుట్టుకవల్ల నేర్పడినవి కావు. ఏవృత్తినైనను అవలంబించుటకు ప్రతివానికిని హక్కుగలదు. మిక్కిలి గౌరవము గల మొదటితరగతి పండితులు. వీరిలోనే ప్రభుత్వోద్యోగులందరును చేరియున్నారు. రైతులు గౌరవమునందు రెండవస్థానము నాక్రమించుచున్నారు. చేతిపనులవలనను పరిశ్రమలవలనను జీవించువారు మూడవతరగతికి చెందిరి. వర్త

కులు నాల్గవతరగతిలో చేరిరి. [illegible] సోల్జర్లును సైనికులునై యున్నారు. కాని పుట్టుకవలన నేర్పడిన కుల భేదములు చైనాలో లేవు. ఒక కుటుంబములోనే ప్రభుత్వోద్యోగులు, రైతులు, వర్తకులు, పాలేర్లు మొదలగువారుందురు. ఇతర జీవనోపాధి దొరకనివారు సోల్జర్లుగాను సైనికులుగాను పని చేసెదరు. హిందూదేశమునందువలె కులభేదములు, అంటరాని తనము బొత్తుగలేక, పాశ్చాత్యదేశములందువలె తెల్ల నల్ల రంగు భేదములులేక, చైనాదేశమునందు సంఘసమానత్వము బాగుగ స్థాపింపబడియున్నది.

సమిష్టికుటుంబము

చైనాదేశపు సాంఘిక జీవితము [illegible] కుటుంబమై యున్నది. అచట సమిష్టికుటుంబపద్ధతి ప్రబలియున్నది. కొన్నితరములవరకును ఆస్తిని పంచుకొనక కుటుంబ సభ్యులందరును కలిసియే నివసించుచుందురు. కుటుంబ గౌరవము చాల ప్రాముఖ్యమును వహించుచుండెను. కుటుంబములకు ఇంటిపేర్లు గలవు. ఒకే యింటిపేరు వారు చాల దూర బాంధవులైనప్పటికిని వివాహమాడుటకు వీలు లేదు. కొన్ని గ్రామములలో నొకే యింటిపేరుగలవా రుందురు. నూటికి తొంబదిమంది గ్రామములలోనే నివసించిరి. గ్రామములలో వ్యవసాయము పరిశ్రమలు ప్రబలియుండెను. ఇతర వృత్తిసాధనములులేక ప్రజలు కష్టజీవులై యుండిరి. ఈస్టు ఇండియా కంపెని వారు క్రీ. శ. పందొమ్మిదవ శతాబ్దమున హిందూదేశమునుండి చైనాకు దిగుమతిచేయువరకును చైనావారు నల్లమందు నెరుగరు. అటుపిమ్మట నల్లమందు పొగపీల్చు అభ్యాసము చైనాలో

విశేషముగ వ్యాపించెను. పాశ్చాత్యదేశములలో వ్యాపించి యున్న పొగాకుకన్న చైనాలోని నల్లమందు పొగపీల్చుట తక్కువ హానికరమని జైల్సు తన 'చైనాయొక్క నాగరికత' యను గ్రంథమునందు వ్రాసియున్నాడు. కుటుంబములలో జరుగు శుభాశుభకర్మలన్నియు కన్‌ఫ్యూషియసుయొక్క స్మృతి ననుసరించి జరుగుచుండెను. వివాహమాడుట పుత్రులను గనుట కుటుంబమును వృద్ధిచేయుట ప్రధాన ధర్మమని యెంచి బాలురకును బాలికలకును తలిదండ్రులే తప్పక వివాహమును గావించిరి. స్త్రీలకు ఘోషాపద్ధతి లేదు. పసిపిల్లల వివాహమునకు నిషేధము లేదుగాని సాధారణముగ బాలికలకు పదునారు వత్సరముల లోపునను బాలురకు పదునెనిమిది వత్సరములలోపుగను వివాహములు చేయుచుండిరి. వితంతువుల ఉద్వాహములు జరుగవచ్చును, గాని వివాహమాడక సద్వర్తనకలిగి యుండెడి వితంతువులకు సంఘమునందు గొప్ప గౌరవముండెను. బాలికలు వివాహితలగుటతోడనే అత్తవారిండ్లకు పోయిరి. మరణించిన పితృవులు దేవతలయ్యెదరు. పితృదేవతారాధనము ప్రధానమగు మతకర్మ. పెద్దలు చేసిన పుణ్యకార్యములవలన వారి వంశీకులకు సౌఖ్యము సంపద కలుగునని నమ్మబడుచుండెను. పితృదేవతారాధనను గావించుటకును మిగిలిన శుభాశుభకర్మల నాచరించుటకును ప్రతి కుటుంబమునకును నొక ప్రత్యేకచావడి గృహావరణయందుండెను. దానిలో కుటుంబచరిత్ర జననముల వివాహముల మరణముల తేదీలు మొదలగునవి వ్రాసియుంచబడెను. ఆ చావడికి సంబంధించి కుటుంబ లాభము నిమిత్తము అన్యాక్రాంతములు జరుపుటకు

వీలులేకుండ కొంత భూమి యుండును. కుటుంబాస్తి విభజనను జరిగినప్పుడెల్ల కొంత భూమిని విడిగదీసి నా చావడి కిచ్చెడివారు. దాని ఆదాయమునుండి కుటుంబమునకు చెందిన అనాథలకు పేదలకు సహాయము చేయుచుండిరి. తల్లిదండ్రులయెడ పిల్లలు చాల భక్తి నికలిగి యుండిరి. వృద్ధులైన జననీజనకుల సేవ పుత్రులకు పరమపవిత్రమైన ధర్మము. వృద్ధులైన తలిదండ్రుల సేవకొరకు తమకు దూరప్రాంతముల గల గొప్ప యుద్యోగములను వదలుకొనివచ్చిన పుత్రులనేకులుండిరి. వివాహవిచ్ఛేదము చైనావారిలో లేకుండెను. తన భార్యకు సంతానము లేకున్న పురుషుడు ఒక ఉపభార్యను తెచ్చుకొనుచుండెను. ఆ యుపభార్యకు పుట్టిన సంతతికిగూడ కుటుంబ ఆస్తిపైన హక్కుండెను. కాని భార్యకు గల గౌరవము ఉపభార్యకు లేకుండెను. కుమారుని దత్తుచేసుకొను ఆచారముకూడ వారిలో నుండెను. చైనావారి పండుగలలో ప్రధానమైనది సంవత్సరాది. అది యే తేదీన వచ్చునో ప్రభుత్వ పంచాంగమునందు నిర్ణయించబడెను. ఆ దినమున మిఠాయీలు వండుకొనుట క్రొత్త దుస్తులను ధరించుట బందుగులను స్నేహితులను పై యుద్యోగస్తులను దర్శించుట వర్తకులు క్రొత్త ఖాతాలను ప్రారంభించుట జరుగుచుండెను. ఆ రాత్రి దయ్యములను పారద్రోలుటకై బాణాసంచాలను టపాకాయలను అవాయిచువ్వాలను కాల్చెదరు. పితృవులు చనిపోయిన యిరువదియేడు నెలలవరకు కుటుంబమునందు వివాహములు చేయకూడదు. చక్రవర్తి మరణించిన నూరుదినములవరకును పురుషుడెవడును క్షురకర్మను చేయించుకొనకూడదు, నాటకశాలలు

మూయబడుచుండెను, ఉద్యోగస్తుల యిండ్లలో వివాహము చేయుటలేదు. క్రీ. శ. పదవ శతాబ్దమునుండియు అందముకొరకు స్త్రీల పాదములకు కట్లుకట్టి సన్నముగచేయు ఆచారము ప్రబలెను. ప్రతి గ్రామములోను బౌద్ధ దేవాలయ ముండెను. కొన్ని చోట్ల 'టావోమత' దేవాలయము కూడ నుండెను. దేవాలయపు ఆవరణస్థలములో ప్రతివారము సంతలు జరుగుచుండెను. అచటనే నాటకశాలకూడ నుండెను. గ్రామములోని పంచాయితీలును అచటనే సాధారణముగ జరుగుచుండెను. ప్రత్యేక మతగురువుల జాతిలేదు. అందరు కలిసియే ధ్యానము పూజ సలుపుచుండిరి. బౌద్ధసన్యాసులలో గొప్ప విద్వాంసు లుండిరి. చాలమంది సన్యాసులు పాళీలో రచింపబడి చైనాలిపిలో అచ్చొత్తించబడిన బౌద్ధమతగ్రంథములలోని సూత్రములను అర్థము తెలియకుండ వల్లించెడివారు.

చైనా జాతీయ జీవితముయొక్క మరియొక ప్రత్యేక లక్షణమేమనగ పారిశ్రామికులును వర్తకులును సంఘముల నిర్మాణము గావించుకొను ఆచారమై యున్నది. ప్రతి పరిశ్రమకును గ్రామసంఘములు మొదలు జిల్లాసంఘములు రాష్ట్రసంఘముల వరకును క్రిందనుండి పైవరకును శాఖోపశాఖలుగ నేర్పరచుకొనిరి. పరిశ్రమలు సాధారణముగ గృహపరిశ్రమలై నందున పెట్టుబడిదారుల యజమానుల జాతి వేరుగను, కార్మికులజాతి వేరుగను లేకుండెను. ఈ సంఘములే ధరలను, రకములను, పనిని నేర్చుకొనువారి సంఖ్యను, పనిచేయు నౌకర్ల మజూరీని, నిర్ణయించెను.

పారిశ్రామికుల వర్తకుల సంఘములు (Guilds)

పారిశ్రామికులందరును వారివారి వృత్తులకు సంబంధించిన సంఘములలో సభ్యులుగ నుండిరి. చందాలను చెల్లించిరి. అటుల సభ్యులుగ చేరనివారు తోడి పారిశ్రామికుల సానుభూతిని గోల్పోయిరి. ప్రతి సంఘమునకును సంవత్సరమున కొకసారి యెన్నికలు జరిగి యొక అధ్యక్షుని కార్యదర్శిని కార్య నిర్వాహక వర్గమును ఎన్నుకొనిరి. పారిశ్రామికులమధ్య తగవులు నిర్ణయించుకొనుటకు పారిశ్రామిక పంచాయితీలు గలవు. వారి తగవులు సాధారణముగ ప్రభుత్వ న్యాయాధికార్ల వద్దకు పోవు. మిగుల చిక్కులుగనున్న కేసులలో మాత్రము పంచాయితీ సభవారు తమ అభిప్రాయముతో న్యాయాధికార్ల వద్దకు పంపెదరు. పంచాయితీలక్రిందికి రాని పారిశ్రామికులు తోడి పారిశ్రామికులచే బహిష్కరింపబడెదరు. పారిశ్రామికులమీద వ్యక్తులుగ ప్రభుత్వ దండనాధికార్ల వద్ద నేరములు మోపబడినచో వారు చెందిన సంఘముల అధ్యక్షులు గాని, కార్యదర్శులు కాని అధికారులతో మాటలాడి న్యాయమును చేయించెదరు. వారి సలహాలను అధికార్లు తప్పక వినెదరు. చాలచోట్ల పారిశ్రామిక సంఘములకు ప్రత్యేకమైన చావిళ్ళుగలవు. వాటిలో నా సంఘసమావేశములు, పంచాయితీలు, వేడుకలు, నాటకములు జరుగుచుండెను. ఆ సంఘమునకు చెందిన పేదపిల్లల విద్యకొరకును, వృద్ధులకును, అనాథలకును సంఘమువారు ద్రవ్యసహాయము చేయుచుండిరి. ఇటులనే వర్తకులుకూడ పట్టణసంఘములను, జిల్లాసంఘములను, రాష్ట్రసంఘములను నిర్మాణము గావించుకొనిరి. పారిశ్రామికుల మీదగాని, వర్తకులమీద గాని, ఆచారబద్ధమైన పన్నులకన్న

నెక్కువ పన్నులను ప్రభుత్వోద్యోగులు వేయదలచినచో ఆయా సంఘములను సంప్రదించి వారి సమ్మతితోడనే వేయవలెను. వారి యొప్పుదల లేనిది క్రొత్తపన్నులను వేసినను, పన్నులను హెచ్చించినను పారిశ్రామికులును, వర్తకులును పన్నుల నిచ్చుటకు నిరాకరించెదరు. బలవంతముగ వసూలు చేసినచో సమ్మెలు కట్టెదరు; సమ్మెలలో చేరనివారిని బహిష్కరించెదరు. ఇట్టి గల్లంతు జరుగగనే ఉద్యోగస్తులను అసమర్థులని ప్రజానురాగమును కోల్పోయిరని చక్రవర్తి మరియొకచోటికి బదలాయించును. కావున పారిశ్రామిక వర్తకుల సంఘములకు వ్యతిరేకముగ ప్రవర్తించుటకు ప్రభుత్వోద్యోగులు జంకుచుండిరి. సమ్మెలును బహిష్కారములును అనాదికాలమునుండియు చైనాలోని పారిశ్రామికుల యొక్కయు, వర్తకుల యొక్కయు ముఖ్యమైన ఆయుధములై యుండెను.

## 4

రాజ్యాధికారమంతయు అనాదికాలమునుండియు చక్రవర్తియందుండెనని పైన చెప్పియున్నాము. ఆయన ఆరుగురు మంత్రులను నియమించెను. వారిలో నొకరు ప్రధానమంత్రి.

చక్రవర్తి

ప్రతి మంత్రిక్రిందను నొక పరిపాలనాశాఖ యుండెను. ఆయనకు సహాయము చేయుటకొక పాలనాసంఘముండెను. దాని కాయన యధ్యక్షుడు. క్రీ.శ. 1861 వ సంవత్సరమునుండియు విదేశాంగమంత్రియును నూతన మంత్రిని నూతనశాఖను నూతనపాలనాసంఘమును నిర్మాణము

గావించిరి. చక్రవర్తులు నిరంకుశులు. కాని 'కన్ఫ్యూషియసు మహర్షి స్మృతులు, పూర్వులచట్టములు, క్రమానుగతమైన ఆచారములు, మంత్రులసలహాలు, అన్నిటికన్న ముఖ్యముగ ప్రజాభిప్రాయము, వీటినిబట్టి నడచుచుండిరి. "ఒక మహాశక్తి అను గ్రహామువలన తాము రాజ్యమునకు వచ్చినామనియు, ఆ శక్తి అనుగ్రహాము తొలగగనే తాము రాజ్యభ్రష్టులమై నశింతుమనియు, ప్రజలేదికోరిన దాని నాశక్తి ప్రసాదించుననియు, ప్రజాభిప్రాయమే ఆ శక్తిదైన అభిప్రాయము" అను భావము చక్రవర్తుల మనమున సదా నాటుకొని యుండెను. ఋషులు వ్రాసిన ప్రతి గ్రంథములోను "రాజ్యాంగవిధానములో మొదటిస్థానము ప్రజలది; రెండవస్థానము ప్రతిష్ఠాపనములది; మూడవస్థానము చక్రవర్తులది" అని వ్రాసియుండిరి. ప్రజల కష్టములకన్నిటికిని చక్రవర్తి బాధ్యుడనియు, ప్రజలకు క్షామము అంటుజాడ్యములు మొదలగు కష్టములు సంప్రాప్తించినచో మహాశక్తి యొక్క అనుగ్రహాము చక్రవర్తినుండి తొలగి నందుకు చిహ్నమనియు, ఆ వెంటనే పారిశ్రామికులు, వర్తకులు సమ్మెలు కట్టుటకును, రయితులు పన్నులను చెల్లించుట మాని వేయుటకును, ప్రజలు తిరగబాటు చేయుటకును, హక్కు కలుగుననియు నను సిద్ధాంతముల ప్రాబల్యము చక్రవర్తులను ప్రజల క్షేమముకొరకు పాటుబడువారిగను ప్రజాభిప్రాయము ననుసరించి నడచువారిగను గావించెను. అందువలన సిద్ధాంతప్రకారము చైనారాజ్యము నిరంకుశరాజరికమైనను **(Absolute monarchy)** ఆచరణయందు ప్రజారాజ్యము **(Democracy)** అని చరిత్రకారు

లందరును వ్రాసియున్నారు. ప్రత్యేకముగ చైనాయందుమాత్రమే గల మరియొక ప్రభుత్వశాఖను గుర్తింపవలసియున్నది. అది ప్రభుత్వ విమర్శనాశాఖ. అది చక్రవర్తియొక్క 'కన్నులు చెవులు' అని యెంచబడెను. ఆశాఖకు చెందిన యుద్యోగస్తులు ఇరువది నలుగురు రాజధాని యందును; ఏబదియారుగురు రాష్ట్రముల లోనుఉండిరి. ఉద్యోగస్తులు చేయుచున్న లోపములను ప్రజాపీడన మును కనిపెట్టిఎప్పటికప్పుడు చక్రవర్తికి నివేదికలను పంపుకొనుట వారివిధి. చక్రవర్తి యొక్క తప్పులు కూడ నివేదించుకొనుట వారికి విధియైయున్నది. వీరినివేదికలను చక్రవర్తితన సుపరిపాలన మునకు పునాదియని యెంచెను. ఒక్కొక్కపుడీ యుద్యోగస్తులు చక్రవర్తి చేసెడు దుష్కృత్యములను నివేదించి వెంటనే ఆత్మ హత్య గావించుకొనిరి. ఇందువలన చక్రవర్తి పశ్చాత్తాపమునొంది తన చెడుప్రవర్తనను మానెను. ఉద్యోగములకన్నిటికిని యెటుల వాఙ్మయమునందు పోటీపరీక్షలుండెనో పైన చెప్పియున్నాము. విమర్శనాశాఖ, పోటీపరీక్షలు, చైనా రాజ్యపద్ధతి యొక్క ప్రత్యేక లక్షణములు. చక్రవర్తి దేశములో పెద్ద వ్యవసాయకుడని సూచించుటకై ప్రతిసంవత్సరము భూమిమీద ఎనిమిదిచాళ్ళను స్వయముగ దున్నెను. ప్రతి సంవత్సరము చక్రవర్తి రాజధాని లోని మహాశ్శక్తి యొక్క దేవాలయములో పూజసల్పి తన పరిపాలన యొక్క సాంవత్సర నివేదికను సమర్పించి యా సృష్టి కర్త యొక్క యాశీర్వచనమును కోరెను. యోగ్యులైన చక్రవర్తులకు సృష్టికర్తవద్దనుండి యుత్తరములు వచ్చెనని కూడ నమ్మబడుచుండెను. ప్రతిసంవత్సరము కాలమానము, గ్రహణ

ములు, అతివృష్టి అనావృష్టులను తెలియజేయు పంచాంగములను ప్రభుత్వమువారు ప్రకటించుచుండిరి. పికింగు నగరమునందు కణ్ఫ్యూషియసు యొక్క గొప్ప దేవాలయమును, శాస్త్రియము యొక్క గొప్ప దేవాలయమును గలవు. ఈ రెండవ దేవాలయము లోపల కణ్ఫ్యూషియసు రచించిన తొమ్మిది ప్రధాన గ్రంథముల లోని యావత్తు శ్లోకములును మూడువందలరాతిరేకులమీద చైనా భాషలో శాశ్వతముగ లిఖింపబడియున్నవి. చక్రవర్తి కణ్ఫ్యూషియసు మహర్షి యొక్క స్మృతిప్రకారము తాను నడచుచు ప్రజలను నడిపించుచు మతముయొక్క అధికారియై యుండెను. ఆయన మంత్రులలో నొకరు శుభాశుభ కార్యములయందు ప్రజ లొనరించవలసిన మతకర్మలను సక్రమముగ జరిపించు ప్రభుత్వ శాఖపై యాజమాన్యమును వహించెను.

చైనాదేశమున పదునెనిమిది రాష్ట్రములుండెను. ప్రతి రాష్ట్రముపైనను చక్రవర్తి యొక రాష్ట్రపాలకుని (గవర్నరును) నియమించెను. రెండుమూడు రాష్ట్రములను కలిపి యొక రాజప్రతినిధిని (గవర్నరు జనరలును) నియమించెను.

రాష్ట్రములు, జిల్లాలు.

రాజప్రతినిధులను రాష్ట్రపాలకులను చక్రవర్తి యిచ్ఛవచ్చినటుల బదిలీ చేయవచ్చును. తీసి వేయవచ్చును. రాష్ట్రముపైన గవర్నరునే గాక యొక కోశాధి కారిని, యొక యుత్తమ న్యాయాధికారిని, ధాన్యాధికారిని, ప్రభుత్వమునకు చెందిన ప్రత్యేక పరిశ్రమలమీద నొక యధికారిని కూడ చక్రవర్తి నియమించెను. గవర్నరు రాష్ట్రపాలనమునందు వీరి నందరిని సంప్రదించియే పనిచేయవలెను. ప్రతి రాష్ట్రము

కొన్ని జిల్లాలుగ విభజింపబడి యుండెను. ప్రతి జిల్లాపైనను నొకజిల్లా పాలకుడుండెను (**District magistrate**). ఇతను ప్రజలతో నిత్యసంబంధము కలవాడై యున్నందున ప్రజలకు తల్లి, తండ్రి యని పిలువబడెను. జిల్లాపాలనమునకు సంబంధించిన అన్ని అధికారములు ఇతనియందుండి యితను గొప్ప బాధ్యతను వహించెను. ఇతనిక్రింద వివిధ శాఖలకు వివిధ యుద్యోగస్థులు జిల్లాలో పనిచేయుచుండిరి. కొన్ని జిల్లాలపైన యొక కమీషనరు పర్పాటు కాబడెను. ఇతను సంచారము చేయుచు ముఖ్యమైన క్రిమినలు,సివిలు కేసులలో గ్రామములలోనే విచారణ గావించి తీర్పు లిచ్చుచుండెను. న్యాయవాదుల జాతి ప్రభుత్వమునందు లేదు. కక్షిదారులను, సాక్షులను న్యాయాధిపతి స్వయముగనే విచారించెను. చక్రవర్తియొక్క యుత్తరువు లేనిది యెవరికిని మరణశిక్ష విధించ వీలులేదు. శిక్షాస్మృతి (**Penal code**) ఔదార్యముగనుండి దారుణమైన శిక్షలు లేకుండెను.

ప్రాచీన హిందూదేశమునందు వలెనే చైనాదేశమందును గ్రామ స్వపరిపాలనము రాజ్యాంగము యొక్కయు నాగరికత యొక్కయు పునాదిగ నుండెను. ప్రతి గ్రామమునందును గ్రామ పెద్దల సంఘము అని పిల్వబడెడి పంచాయితీ సంఘము గలదు. ఆ సంఘసభ్యులను ఆ గ్రామము నందలి కుటుంబముల యజమాను లెన్నుకొనిరి. ఆ సంఘసభ్యులు తమ కొక యధ్యక్షుని యెన్నుకొనిరి. ఆతడు హిందూదేశము లోని గ్రామ మునసబును బోలి గ్రామమునుండి ప్రభుత్వమునకు చెల్లవలసిన శిస్తును వసూలు చేయుటకును, గ్రామము

గ్రామ స్వపరిపాలనము.

యొక్క సంరక్షణమునకు వలయు పోలీసు సిబ్బంది నేర్పరచి దొంగతనము మొదలగు నేరములు జరుగకుండ కాపాడుటకును, బాధ్యతను వహించుచున్నాడు. గ్రామములోని క్రిమినలు, సివిలు, పోలీసు వ్యవహారము లన్నియు గ్రామ పంచాయితీయే పరిష్కరించెను. గ్రామ పాఠశాల, గ్రామ పారిశుధ్యము, తోవలు, నీటివసతి, అడవి, గ్రామబంజర్లు, భూములకు నీటి పారుదల, సంత, పేదల అనాథల సహాయము, మొదలగున వన్నియు గ్రామపంచాయితీక్రింద నుండెను.

గ్రామములోని భూమియంతయు గ్రామస్థులదే నను భావము కలిగి గ్రామస్థులే యుపయోగించుకొనిరి. భూమియున్న రైతు శాశ్వతహక్కులను కలిగియుండెను. నిర్ణీతమయిన శిస్తు నిచ్చు షరతుతో అమ్ముకొనవచ్చును. అమ్ముకొనినప్పుడును, గుదువ నుంచినప్పుడును కొంచెముగ ప్రభుత్వమునకు భూమి మూల్పిడి పన్నును చెల్లించవలెను. భూములు సరిగా పండనపుడు శిస్తును తగ్గించి పుచ్చుకొనిరి. అసలే పండనపుడు పూర్తిగ తీసివేసిరి. ఈ విషయములలో జిల్లా అధికారి గ్రామపంచాయితీదార్ల సలహా లను తప్పక యంగీకరించెను. "ప్రజలకు గల శక్తినిబట్టి పన్నులను వేయవలెను. ఆదాయము లేనప్పుడు పన్నులు విధించరాదు. పన్నులు స్వల్పముగ నున్నపుడును, ప్రభుత్వము ప్రజలను దయతో చూచినపుడును ప్రజలు ప్రభుత్వముయెడ భక్తిని కలిగి సన్మార్గవర్తులై యుందురు." అని మెన్షియసుమహర్షి చెప్పి యుండెను

## 5

చైనా సామ్రాజ్యమునేలిన చక్రవర్తులలో చరిత్రకు తెలిసిన మొదటిచక్రవర్తి 'ఫ్యూహాసై'అయియున్నాడు. ఆయనే వివాహ పద్ధతులను సంస్కరించెననియు, స్త్రీలద్వారా ఆస్తి సంక్రమించు ఆచారమును తీసివైచి పురుషుల ద్వారానే చైనారాజ్యము సంక్రమించు పద్ధతిని నెలకొల్పినాడనియు; సంగీత వాద్యములను అక్షరామ్నాయమును ప్రవేశ పెట్టినాడనియు, పంచాంగమును తయారు చేయించినాడనియు వారు నమ్ముచున్నారు. ఆయనకు పిమ్మట రాజ్యమునకు వచ్చిన 'షెన్ సంగు' చక్రవర్తి వ్యవసాయమును వృద్ధిచేసెననియు, వైద్యశాస్త్రమును తయారు చేయించెననియు చెప్పబడుచున్నది. ఆయన తరువాత రాజ్యము నేలిన'హ్యూయాంగుసై' సామ్రాజ్యమును వృద్ధిచేసి పట్టణములను నిర్మాణము గావించి గొప్ప భవనములను కట్టించి వర్తక వ్యాపారములను వృద్ధిచేసెను! ఆయన భార్య పట్టుతో వస్త్రములను తయారు చేయించ మొదలిడెను. హ్యూయాంగుసైకి పిమ్మట నలుగురు రాజులు రాజ్యము చేసిరనియు, అటు పిమ్మట 'యూవ్' 'షన్' 'యూ' అను సుప్రసిద్ధ చక్రవర్తులు పాలించిరనియు చెప్పబడుచున్నది. ఈ ముగ్గురు చక్రవర్తుల పేర్లతోనే కన్ఫ్యూషియసు రచించిన చైనా చరిత్ర ప్రారంభ మగుచున్నది. వీరిలో ఆఖరువాడగు 'యూ' చక్రవర్తి 'హాసియా' రాజవంశస్థాపకుడై యున్నాడు. ఈ రాజవంశము క్రీ. పూ. 2205, మొదలు క్రీ. పూ. 1765 సంవత్సరము వరకు 440 సంవత్సరములు రాజ్యము చేసెను. వీరిలో ఆఖరు రాజగు

చైనా రాజవంశములు

'చీక్వ్యాయై' దుర్మార్గవర్తనుడై ప్రజలను పీడించినందున ప్రజలు తిరుగుబాటు గావించి 'షాంగు' వంశస్థాపకుడగు 'టాంగు'ను చక్రవర్తిగ గావించుకొనిరి. ఈ 'షాంగు' వంశమువారు క్రీ. పూ. 1765 మొదలు క్రీ. పూ. 1122 వరకు రాజ్యము చేసిరి. వీరి కాలములో మిగుల అందమైన కంచులోహపు సామానులు చేయబడెననియు, రథములు, గుఱ్ఱములు ప్రబలెననియు, సౌధముల నిర్మాణము జరిగెననియు, సమష్టికుటుంబము, పూర్వీకుల ఆరాధనము బాగుగ స్థాపితమయ్యెననియు తెలియుచున్నది. వీరిలో ఆఖరు రాజగు 'చౌహాసిన్' యొక్క దుష్ప్రవర్తనవలన ఈ వంశ మంతరించి 'చౌ' వంశమువారు క్రీ. పూ. 1122 మొదలు క్రీ. పూ. 249 వరకు రాజ్యము చేసిరి. ఇంత దీర్ఘ కాలము రాజ్యము చేసిన రాజవంశము చైనా చరిత్రలో లేదు. ఈ దీర్ఘకాలములో రాజ్యము విస్తరించి అనాగరికులగు తెగలవారు చైనాయొక్క నాగరకతను నేర్చుకొనిరి. అంతేగాక ఈ కాలములో చైనాలో మిగుల సుప్రసిద్ధులగు తత్త్వవేత్తలు ప్రబలిరి. కన్ఫ్యూషియసు మహర్షి క్రీ.పూ. 551 నుండి క్రీ.పూ. 479 వరకు ప్రబలెను. మెన్షియసు మహర్షి క్రీ.పూ. 372 మొదలు క్రీ.పూ. 289 వరకు జీవించెను. టావోమతస్థాపకుడగు లౌడుజు అను యోగిపుంగవుడు, మోటీ, యాంగ్యూలను తత్త్వవేత్తలు ఈ కాలపు వారే! 'చౌ' వంశ రాజ్యము యొక్క తుది కాలమున ఈ రాజులు బలహీనులైరి. వీరేర్పరచిన మొఖాసా ప్రభు పరంపరా పద్ధతిలో వీరి సామంతులు బలవంతులై తిరుగబాట్లను గావించసాగిరి. పిమ్మట ఈ రాజవంశము నోడించి సామంతులను

అణచివైచి. క్రీ.పూ. 249 లో 'చిన్' వంశపువాడగు షిహ్వా యాంగుటి రాజ్యమునకువచ్చెను. రాజ్యములో నైకమత్యమును నెలకొల్పెను. మొఖాసా ప్రభు పరంపరా పద్ధతిని నిర్మూలించెను. అనాగరికులను అణచిపెట్టెను. హాసియాన్‌పు వద్ద రాజధానిని నిర్మించెను. చైనా దేశమును పదునెనిమిది రాష్ట్రములుగ విభజించెను. అవి యిప్పటికిని నిలచియున్నవి. ఉత్తరమునుంచి రాగల మోటజాతుల దండయాత్రలనుండి కాపాడుకొనుటకై ప్రపంచములోని వింతలలో నొకటియైన చైనాయొక్క గొప్ప గోడను పదునెనిమిదివందల మైళ్ళ పొడుగున నిర్మాణముగావించెను. గాని వైద్యగ్రంథములను, వ్యవసాయ గ్రంథములను వదలిపెట్టి మిగతా గ్రంథముల నన్నిటిని తగులబెట్టించి పాత విషయములను గూర్చి చర్చించగూడదని తత్వవేత్తలకు ఆజ్ఞాపించెను. ఇందువలన దేశములో కల్లోలములు బయలు దేరెను. ఈయనకు పిమ్మట రాజ్యమునకు వచ్చిన 'ఈ' వంశపు రెండవ రాజు హత్యగావించబడెను. క్రీ.పూ. 206 లో లియుపాంగు అను సేనాని యావత్తు రాజ్యమును జయించి 'హన్' వంశమును స్థాపించెను. 'హన్' వంశమువారు క్రీ. శ. 220 వరకు 426 సంవత్సరములు పాలించిరి. వీరిక్రింద చైనా సామ్రాజ్యములో నైక్యత బాగుగ నేర్పడినది. ఈ వంశపు రాజులలో మిగుల ప్రసిద్ధికెక్కిన పూహై చక్రవర్తి క్రీ.పూ. 140 మొదలు క్రీ.పూ. 86 వరకు రాజ్యముచేసెను. ఆయన కాలములో సింకియాంగు, కొరియా దేశములు చైనా సామ్రాజ్యముక్రిందకు వచ్చెను. ఈ రాజు కాలములో వాఙ్మయము, కళలు, సిరిసంపదలు వృద్ధిచెందెను. పాత

మెట్టత్రోవలు సురక్షితముగ చేయబడి చైనానుండి సరుకులుమధ్య ఆశియా, పశ్చిమఆశియాలగుండ గ్రీసుదేశమువరకును మెట్టత్రోవల రవాణా అయ్యెను. సముద్రవర్తకము కూడ జావా, సుమాత్రా, బర్మా, ఇండియా, పారసీక సముద్రము వరకును పడవలలో చేయబడెను. ఈవంశపు రాజులకాలములోనే బౌద్ధమతము భరతవర్షమునుండి చైనాకు పంపబడెను. అది ఈ దేశములో బాగుగ వ్యాపించి క్రమముగ జాతీయ మతమయ్యెను. ఈ వంశము క్రీ. శ. 220 సంవత్సరమున అంతఃకలహముల వలన కూలిపోయెను. దేశములో స్వతంత్రరాజ్యము లేర్పడినవి. తుదకు క్రీ. శ. 589 సంవత్సరమున 'సూయి' రాజవంశమువారు చక్రవర్తులై దేశమునంతను ఏకముగావించి పాలించిరి. క్రీ. శ. 618 లో వీరి రాజ్యము నంతరించగ 'టాంగు' వంశమువారు యావత్తు సామ్రాజ్యమునకు చక్రవర్తులై క్రీ. శ. 618 మొదలు క్రీ. శ. 907 వరకు సుపరిపాలనను నిచ్చిరి. వీరి కాలములో చైనా సామ్రాజ్యము మిగుల బలమైన గొప్ప సిరిసంపదలు గల రాజ్యమయ్యెను. సివిలు సర్వీసు పరీక్షలలో నుత్తీర్ణులయినవారికే యుద్యోగములనిచ్చు పద్ధతి ఈ కాలములో సంపూర్ణతను పొందెను. కవిత్వము, శిల్పము, చిత్రలేఖనము బాగుగ వృద్ధిచెందెను. ఆఖరుభాగమున వివిధ దండయాత్రల వల్లను, తిరుగుబాట్లవల్లను ఈ రాజవంశము బలహీనమై క్రీ. శ. 907 వ సంవత్సరమున పడిపోయెను. మరల క్రీ. శ. 960 నుంచి రాజ్యపాలనము గావించిన 'సుంగు' వంశముకూడ చరిత్ర ప్రసిద్ధమైనదే. ఈ రాజవంశములలో సుపరిపాలనమునకు పేరెన్నికగన్న కొందరు రాణులుకూడ నుండిరి. 'హన్' వంశమునందు 'లూ'

అను రాణియు, 'టాంగు' వంశమునందు 'కూ' అను రాణియు మిగుల ప్రసిద్ధికెక్కినవారు.

చైనా సామ్రాజ్యమును 'సుంగు' వంశ చక్రవర్తి పాలించుచుండగ ఆయన పాలనమునందు చేరియున్న మంగోలియాలోని

**జెంఘిస్ ఖాన్ (Jenghis Khan)**

కారకోరం కొండల చెంగటనుండి చరిత్రలో మిగుల సుప్రసిద్ధుడుగ నున్న యొక రణశూరుడు బయలుదేరెను. అతని పేరు జెంఘిస్ ఖాన్. అతడు మంగోలు, తురుష్క, తార్తారు తెగలను తనక్రింద చేర్చుకొని మంచూరియాను జయించి మంగోలు చక్రవర్తి యను బిరుదమును వహించి, క్రీ. శ. 1206 వ సంవత్సరము నుండియు చైనాపై దండయాత్రలను సలిపి, 1214 వ సంవత్సరమున పికింగునగరము గాక మిగిలిన యుత్తర మధ్యచైనా నంతను స్వాధీనపరచుకొనెను. సూంగు చక్రవర్తి దక్షిణమునకు నెట్టివేయబడెను. జెంఘిస్ ఖాన్ తన కుమాళ్ళతో కూడ గొప్ప సైన్యములను వెంటగొని క్రీ. శ. 1216 వ సంవత్సరమున ప్రపంచమును జయించుటకు బయలుదేరి అడ్డగించినవారినెల్ల నోడించి లోకభయంకరుడై త్రోవలోని పట్టణములను రాజ్యములను ధ్వంసము చేయుచు; ఆఫ్ఘనిస్థానము, పారసీకము, మెసపొటేమియా, ఆర్మినియా, జార్జియా, అనటోలియా, అజ్జరబొౕజ్జన్ మొదలగు పశ్చిమ ఆశియా ఖండములోని యావత్తు దేశములను జయించుటయే గాక, యూరపుఖండమున జొరబడి బల్గేరియా, హంగెరీ, పోలండు, రుష్యా దేశములను స్వాధీనమును పొంది, యొక గొప్ప మంగోలు సామ్రాజ్యమును స్థాపించెను. భరతవర్షములోని పంజాబు, సింధు రాష్ట్రములలో జొరబడి

దోచుకొనిపోయెనే గాని రాజ్యస్థాపనను గావించలేదు. అతడు క్రీ. శ. 1227 వ సంవత్సరమున తన స్వదేశమునకు మరలివచ్చి మరణించెను. ఆతని కుమారుడగు ఒగతాయిఖాన్ ఆ గొప్ప సామ్రాజ్యమున కధిపతియై చైనాసామ్రాజ్య రాజధాని యగు పికింగునగరమును జయించి దానిని తనకు రాజధానిగ చేసికొనెను. ఆతని సేనానాయకుడగు సబుతాయిఖాన్ ఇంకను దండయాత్రలు సలిపి జర్మనీ, బొహీమియా, సైలీసియా, మొరేవియాలను కూడ లోబర్చుకొని మంగోలు సామ్రాజ్యము నందు చేర్చెను.

క్రీ. శ. 1259 వ సంవత్సరమున రాజ్యమునకు వచ్చిన కుబ్లేఖాన్ చక్రవర్తి మంగోలు చక్రవర్తులలోకెల్ల సుప్రసిద్ధుడు. ఆయన దక్షిణచైనాను కూడ జయించి సుంగువంశమును తుద ముట్టించి యావత్తు చైనాసామ్రాజ్యమునకు కూడ పాలకుడయ్యెను. బర్మా, అనాం దేశము లను లోబర్చుకొని యా రాజులనుండి కప్పములను గొనెను. పందొమ్మిదవ శతాబ్దమునందు బర్మాను ఆంగ్లేయులును, అనాంను ఫ్రెంచివారును స్వాధీనపర్చుకొను వరకును నా రెండు దేశము లును చైనా సామ్రాజ్యమునకు సామంతదేశములుగ నుండెను. కుబ్లేఖాన్ చక్రవర్తియొక్క తమ్ముడగు హులగుఖాన్ క్రీ.శ. 1258వ సంవత్సరమున ముసల్మాను ఖలీఫాచే పాలింపబడుచున్న బాగ్దాదు నగరరాజమును పట్టుకొని యా రాజ్యమును జయించెను. సిరియా, అలెప్పో, డెమాస్కసు మంగోలు సామ్రాజ్యముక్రింద చేర్చ బడెను. కుబ్లేఖాన్ పాలించిన సామ్రాజ్యము మానవచరిత్రలో

కుబ్లేఖాన్ చక్రవర్తి

నేర్పడిన సామ్రాజ్యము లన్నిటికంటెను విశాలమైనదని చెప్పిన నతిశయోక్తి కాదు. ఆ మహాసామ్రాజ్యమున కంతకును పికింగు నగరమే రాజధానిగ నుండెను. మంగోలు సామ్రాజ్యాధీశునిక్రింద పారసీకమునం దొకరును, ట్రాన్సు శాక్సోనియాయం దొకరును, రుష్యాయం దొకరును, ముగ్గురు రాజప్రతినిధులు వివిధదేశములను పాలించుచుండిరి. కుబ్లేఖాన్ చక్రవర్తి బౌద్ధమతస్థుడు. గొప్ప విద్యాపోషకుడు. ఆయన కాలమున చైనావాఙ్మయ మెంతయో విస్తరించెను. ఒక గొప్ప విశ్వవిద్యాలయమును వివిధ కళలతో నూతనముగ స్థాపించెను. సామ్రాజ్యముయొక్క వివిధ భాగ ములనుండి చైనాకు రప్పింపబడిన పారిశ్రామిక నిపుణులచే నూతన పరిశ్రమలు చైనాదేశమందు నెలకొల్పబడెను. దేశము సిరిసంపదలతో తులతూగుచు విదేశ బాటసారులకు నేత్రోత్సవ మును గావించెను. ఆ చక్రవర్తి చైనాదేశమునందు పికింగు మొదలు కాంటను నగరమువరకును రాకపోకలు చేయుటకును, వ్యవసాయమునకు నీటి నిచ్చుటకును, 650 మైళ్ళ పొడుగుగల గొప్ప కాలువను త్రవ్వించెను. ఆయన క్రీ. శ. 1294 సంవత్సర మున మరణించెను. ఆ పిమ్మట ఆయన మనుమడగు తైమూరు ఖాను సింహాసనారూఢు డయ్యెను.

మంగోలు చక్రవర్తులు 1368 వ సంవత్సరము వరకును చైనా సామ్రాజ్యమును పాలించిరి. పిమ్మట చైనా దేశీయులగు మింగువంశపు రాజులు మంగోలు రాజులను వెడలగొట్టి చైనా సామ్రాజ్యమును స్వాధీన పర్చుకొనగ పశ్చిమ ఆశియాలోను, యూరపు ఖండములోను

మంగోలులే మొగలులు

నున్న మంగోలురాజ్యము ఖండములుగ చీలెను. అందులో జంఘీస్ ఖాన్ యొక్క వంశీకుడగు తైమూరు లేక తామర్లేన్ అను నాతడు సమర్కాండును రాజధానిగ చేసికొని యొక రాజ్యమును క్రీ.శ. 1405 వరకును పాలించెను. ఆతడు ముసల్మాను మతమును స్వీకరించెను. క్రీ. శ. 1398 వ సంవత్సరమున హిందూ దేశముపై దండెత్తివచ్చి ఢిల్లీనగరమును పట్టుకొని ప్రజలను హత్యగావించి దోచుకొని పోయెను. ఆయన దండయాత్రవలన ఢిల్లీనగరమున స్థాపితమైన ఆఫ్ఘనుల రాజ్యము క్షీణించెను. ఆయన వంశీకుడగు బేబరు క్రీ. శ. 1526 వ సంవత్సరమున హిందూ దేశమును జయించి యచట మొగలు లేక మొగలాయి సామ్రాజ్యమును స్థాపించెను. ఆ సామ్రాజ్యము రెండుపందల సంవత్సరములు హిందూదేశమునకు సుపరిపాలనమును, శాంతిని యొసంగెను. ఇటుల చైనాపై నేలిన మంగోలుచక్రవర్తులును, హిందూదేశముపై నేలిన మొగలు చక్రవర్తులును సుప్రసిద్ధుడగు జంఘీస్ ఖాన్ యొక్క వంశమునకు చెందినవారై యుండిరి. 'మొగలు' అను పదము 'మంగోలు' అను పదముయొక్క రూపాంతరము. కాని మంగోలు చక్రవర్తులు బౌద్ధులై యుండగ మొగలు చక్రవర్తులు మహమ్మదీయమతమును స్వీకరించిరి.

ఆఖరు మంగోలు చక్రవర్తియగు షుంటీఖాన్ యొక్క దుష్పరిపాలనమును సహించలేక క్రీ. శ. 1368 వ సంవత్సరమున చూయుయన్‌చంగు అను బౌద్ధసన్యాసి గొప్ప సైన్యములను సమకూర్చుకొని మంగోలు చక్రవర్తిపై తిరుగుబాటును లేవదీసి మంగోలులను చైనానుండి తరిమివేసి ప్రజల కోరిక

ప్రకారము 'హంగువూ' అను బిరుదముతో చైనా సామ్రాజ్య సింహాసన మధిష్ఠించెను. మంగోలియా మంచూరియాలను జయించి తన రాజ్యములో చేర్చికొనెను. ఆతడు నాంకింగునగరమును రాజధానిగ జేసికొనెను.

మింగు చక్రవర్తులు

ఆతని వంశమునకు 'మింగు' వంశమని పేరు. ఆతడు విదేశీయు లగు మంగోలులను వెడలగొట్టి మరల స్వదేశరాజుల పాలనమును స్థాపించుటవలనను, గొప్ప విద్యాపోషకుడై, పాఠశాలలను, కళాశాలలను వృద్ధిచేయుటవలనను, న్యాయశాసనము లన్నిటిని సంగ్రహస్మృతిరూపమున ప్రకటించిన ధర్మశాస్త్రనిర్మాతయగుట వలనను, ప్రజల కౌదార్యమైన సుపరిపాలన మిచ్చుటవలనను, ఆయన నామము చైనావారిచే నత్యంతముగ గౌరవింపబడు చున్నది. ఆయన క్రీ. శ. 1398 వ సంవత్సరమున మరణించెను. ఆయన సమాధి నాంకింగు నగరమున ఊదాకొండ యొక్క అడుగుభాగమున నున్నది. మింగు వంశపు రాజులు క్రీ. శ. 1643 వరకును రాజ్యముచేసిరి. వారిలో క్రీ. శ. 1411 వ సంవత్సరమున రాజ్యమునకువచ్చిన యూంగులా చక్రవర్తి చైనా వాఙ్మయము నందు దేశచరిత్రలు, తత్వశాస్త్రము, వైద్యశాస్త్రము, జ్యోతిష శాస్త్రము, సాహిత్యము, మతములు, చేతిపనులు, పరిశ్రమలు, శిల్పములు, కళలు మొదలగు సమస్త విషయములను క్రోడీక రించిన యొక గొప్ప చైనా విజ్ఞానసర్వస్వమును పండితులచేత తయారుచేయించెను. అది 917480 పుటలు గలది. అచ్చుపడలేదు. దాని యొక్క రెండు ప్రతులు మంచూరియావారు చైనాపై సల్పిన దండయాత్రలలోను, మూడవప్రతి 1900 సంవత్సరమున

పాశ్చాత్యజాతులు పికింగుపై సల్పిన దండయాత్రలలోను నశించినవి. మంగోలు దండయాత్రలలో చైనాలోని గ్రంథము లేమియు నశించియుండలేదు.

మంచూ చక్రవర్తులు

క్రీ. శ. 1643 వ సంవత్సరమున మింగువంశపు ఆఖరు చక్రవర్తి పన్నుల నెక్కువ వేసినందున ప్రజల తిరుగుబాటు కలిగెను. తిరుగుబాటుదారులు జయించి, పికింగు వారికి స్వాధీనమయ్యెను. చక్రవర్తి ఆత్మహత్య గావించుకొనెను. తిరుగుబాటునాయకు లిద్దరకు కలతలు కలిగి, వారిలో నొకడు మింగువంశమునకు చెందిన వుంచియను పేరుగల మంచూరియా రాజుయొక్క సహాయమును నపేక్షించగ, నాతడు సైన్యములతో వచ్చి పికింగును జయించి తిరుగుబాటుదార్ల నిద్దరి నణచివేసి, క్రీ. శ. 1644 వ సంవత్సరమున చైనాపై తన రాజ్యమును స్థాపించెను. మంచూ రాజవంశమునందు చైనా ప్రజల కిష్టములేక నాంకింగునందు మింగు వంశపువారినే చక్రవర్తులుగ ప్రకటించి కొంతకాలము పోరాటము సాగించిరి. కాని, మంచూ చక్రవర్తియే జయమొంది యావత్తు చైనా దేశమును స్వాధీనముపొందెను. మింగు వంశ మంతరించెను. మంచూ చక్రవర్తులు కూడ చైనాభాషను నేర్చుకొనిరి. చైనా వాఙ్మయమును వృద్ధిచేసిరి. క్రీ. శ. 1912 వరకును పాలనము గావించిరి. వీరి కాలమున చైనాలోని ప్రతి రాష్ట్రముపైనను రాష్ట్ర పాలకుని (గవర్నరు) తో పాటు రాష్ట్ర సైన్యాధిపతిని కూడ నియమించిరి. క్రీ. శ. 1666 మొదలు 1722 వరకు నేలిన మంచూ చక్రవర్తి యగు కాంగుషీ గొప్ప విద్యాపోషకుడై చైనా

భాషలో నొక గొప్ప నిఘంటువును (**Standard Dictionary**) తయారు చేయించెను. అందులో నలుబదివేల పదము లుండెను. ప్రతి పదమును ఏయే గ్రంథములయం దెవ్విధముగ ప్రయోగింపబడినదో నుదాహారణముగ చూపబడెను. ఇంతేగాక నా చక్రవర్తి యొక చైనా విజ్ఞానసర్వస్వమును గూడ తయారు చేయించెను. అది 1628 సంపుటములు గలది. ప్రతి సంపుటమునకును 200 పుటలు గలవు. దానిలో మూడువేల సంవత్సరముల లోపుగ నుండిన సుప్రసిద్ధ పురుషుల జీవితములే గాక యిరువదినాలుగు వేలమంది గొప్ప స్త్రీల జీవితములు గూడ గలవు. ఆ రెండు మహాగ్రంథములును అచ్చుపడినవి. నేటికిని నిలచియున్నవి. క్రీ. శ. 1735 మొదలు 1799 వరకు నేలిన కీన్‌లూంగు చక్రవర్తి చైనా భాషయందు గొప్ప కవీశ్వరుడు. ఆయన నేపాళదేశమును జయించి యా రాజునుండి కప్పమును గొనెను. ఆయనకు పిమ్మట క్రీ. శ. 1820 వరకును కియాచింగు చక్రవర్తి పాలించెను. అటు తరువాత క్రీ. శ. 1820 మొదలు 1850 వ సంవత్సరము వరకును టౌకియాంగు చక్రవర్తి పాలనమును గావించెను. ఈతనికాలమందే పాశ్చాత్యజాతుల దండయాత్రలు సాగెను. మంచూ చక్రవర్తులు చైనాభాషను నేర్చి చైనా వాఙ్మయమునే వృద్ధి చేసి, చైనావారి ధర్మముల ననుష్ఠించుచుండినను, చైనావారిలో, ముఖ్యముగ దక్షిణ ప్రాంతముల వారిలో మంచూరియా రాజులు విదేశీయులనియు, వారిని వెడలగొట్టుట తమ ధర్మమనియు నను భావము తుదివరకును వ్యాపించియే యుండెను.

# చైనా విప్లవము

## ద్వితీయాధ్యాయము



### పాశ్చాత్యుల సామ్రాజ్యతత్వము

### 1

అనాదినుండియు ఆశియాఖండములోని తూర్పుదేశము లగు చైనా, హిందూదేశములకు ఆశియాఖండపు పడమటి దేశములతోను యూరపు ఖండముతోను వర్తక సంబంధము, రాకపోకలును గలవు. కాని వర్తక వ్యాపారములు విశేషముగ మెట్టత్రోవలను, కొంతవరకు సముద్రములమీదను జరుగుచుండెను. 1453 వ సంవత్సరమున కాన్‌స్టాంటినోపిలును తురుష్కులు జయించి ఆశియా, ఆఫ్రికా, యూరపుఖండముల కూడలి ప్రదేశము నాక్రమించి వర్తకపు త్రోవలను స్వాధీనమును పొందినప్పటినుండియు నవీన పాశ్చాత్య జాతులగు స్పెయిన్, పోర్చుగల్, హాలండు, ఫ్రాన్సు, ఇంగ్లండు మొదలగు దేశములవారు సముద్రములమీద హిందూ, చైనా దేశములకు చేరుటకు నూతనత్రోవలను కనిపెట్టసాగిరి. అదివరకు 1298 వ సంవత్సరమున ఇటలీదేశపు బాటసారియగు మార్కో-పోలో (**Morco Polo**) అను నతడు చైనాదేశములో కొంత కాలముండిపోయి, ఆ దేశపు గొప్ప నాగరికతను గూర్చియు ఐశ్వర్యమును గూర్చియు, అప్పుడు చైనా సామ్రాజ్యమును

మార్కో-పోలో

పాలించుచున్న విద్యాపోషకుడగు కుబ్లెఖాన్ చక్రవర్తియొక్క వైభవమును ఔదార్యమును గూర్చియు వ్రాసిన వ్రాతలు, చీని చీనాంబరములతోడను, సువర్ణముతోడను కళకళలాడుచుండిన యా దేశమునందు నవీన యూరపుజాతులకు గౌరవాశ్చర్యములను కలుగజేసెను.

పోర్చుగీసువారు

నవీన పాశ్చాత్య జాతులలో సముద్రములమీద ఆశియాకు చేరు త్రోవలను మొదట కనిపెట్టినవారును, హిందూదేశమునకును, చైనాకును వర్తకముకొరకై మొదట కాలిడినవారును పోర్చుగీసువారై యున్నారు. డచ్చివారును, ఫ్రెంచివారును, ఆంగ్లేయులును కాలక్రమేణ వీరి ననుకరించిరి. పోర్చుగీసువారు 1498 వ సంవత్సరమున ప్రథమమున హిందూదేశమునకు వచ్చి స్వదేశరాజుల నాశ్రయించి గిడ్డంగులను కట్టుకొని వర్తకము చేసికొనుటకు అనుమతిని పొందిరి. అటులనే చైనా ప్రభుత్వము నాశ్రయించి చైనాలో వర్తకస్థానము నేర్పరుచుటకు యత్నించిరి. కాని చైనావారి కపుడు తమకన్న మిగుల తక్కువ నాగరికత గలిగిన తెల్లవారిని తమ దేశములోనికి రానీయగూడదను పట్టుదల యుండెను. మరియు పాశ్చాత్యులు ప్రథమమున ఓడదొంగలుగ వచ్చి తమ తీరములను దోచుకొనిపోయి యుండుటచేత కూడ వారియందు చైనావారికి మిగుల వ్యతిరేకభావముండెను. కెవండిషు, డ్రేకు, లన్‌కాస్టరు మొదలగు నాంగ్లేయ నావికులు గూడ సముద్రములమీద యోడదొంగలుగ సంచరించుచు తమ కగపడిన చైనా నౌకల నెల్ల పట్టుకొని దోచుకొనుచుండిరి.

పోర్చుగీసువారు చైనాయొక్క ఒక్క రేవుపట్టణములో వర్తకము చేసికొనుట కనుజ్ఞ పొందునప్పటికి యేబది సంవత్సరములు పట్టెను. 1550 వ సంవత్సరమున మాకో (Maco) రేవులో నివసించి వర్తకముచేసికొనుట కనుమతిపొందిరి. అచటనైనను వారిప్రవర్తనము చైనావారి కేమాత్రమును గౌరవమును కలుగజేయలేదు. మాకో పట్టణమునకు తూర్పుదేశముల జూదపుగుహయను పేరు వచ్చెను. తర్వాత స్పెయిను వారును, డచ్చివారును చైనాలో వర్తక హక్కులను పొందుటకు యత్నించిరి గాని చైనా ప్రభుత్వమువారు అనుమతి నీయలేదు.

అంగ్లేయులు

1600 సంవత్సరమున ఆంగ్లేయులు ఆశియా ఖండము యొక్క తూర్పు దేశములతో వర్తకము చేయుటకు (East India Company) తూర్పు ఇండియా కంపెనీ యను వర్తక సంఘము నేర్పరచుకొనిరి. అటుపిమ్మట కొంచట సంవత్సరములకు అట్టి వర్తకసంఘమునే ఫ్రెంచివారేర్పరచుకొనిరి. అదివరకే డచ్చివారు ఆశియాఖండము లోని తూర్పు ద్వీపములతో బాగుగ వర్తకమును సాగించు చుండిరి. 1623 వ సంవత్సరమున డచ్చివారు అంబాయినా యుద్ధములో నాంగ్లేయులను పూర్తిగనోడించి తూర్పుద్వీపములనుండి తరిమివేసిరి. అప్పటినుండియు ఆంగ్లేయులు హిందూదేశములోని రాజుల నాశ్రయించి యచట వర్తకము చేసికొను హక్కులను సంపాదించుచువచ్చిరి. కాని చిరకాలమువరకును చైనాసామ్రాజ్యమునందు వర్తకముచేసికొను హక్కులను ఆంగ్లేయులు పొందజాలకపోయిరి. 1637 వ సంవత్సరమున నొకసారియు, మరల

1741 వ సంవత్సరమున నౌకసారియు ఆంగ్లేయ నావికులు దౌర్జన్యముగ చైనాలోని కాంటన్ (Canton) రేవులో ప్రవేశించ యత్నించి చైనావారిచే నోడింపబడి వెళ్ళగొట్టబడిరి.

పదునేడవ శతాబ్దాంతమున నెటులనో ఫ్రెంచి వర్తకులకును ఫ్రెంచి రోమను కాథలిక్కు మతబోధకులకును చైనా ప్రభుత్వమువారి యనుగ్రహము లభించి చైనాలో కొలదిగ ప్రవేశముకలిగెను. కాని చాలకాలమువరకును చైనాలో రోమను కాథలిక్కు మతమును వ్యాపింపజేయుటయందు చూపినంత శ్రద్ధను ఫ్రెంచివారు వర్తకమును రాజ్యమును వ్యాపింపజేయుటలో చూపలేదు.

ఫ్రెంచివారు

1727 వ సంవత్సరమున చైనా కుత్తరపు సరిహద్దున నున్న రుష్యా చక్రవర్తితో కూడ రెండువందలవంది రుష్యా వర్తకులును మతబోధకులును చైనా రాజధాని యగు పికింగు (Peking) నగరమున నుండవచ్చునని చైనా ప్రభుత్వమువారు ఒడంబడిక చేసిరి. 1792 వ సంవత్సరమున హిందూదేశమునుండి ఈస్టు ఇండియా కంపెనీవారు రాయబారమును బంపి కాంటన్ రేవులోమాత్రము వర్తకము చేసికొనుటకు హక్కును బడసిరి.

1793 వ సంవత్సరమున మరల నాంగ్లేయ రాజగు మూడవ జార్జిరాజు ఆంగ్లేయులకు చైనాలో నింక నెక్కుడుగ వర్తకపు హక్కు లివ్వవలెననియు ఆంగ్లేయ రాయబారిని చైనాలో స్థిరముగ నుంచుకొనవలెననియు కోరుచు చైనా చక్రవర్తి కొక విన్నపమును కొన్ని బహుమతులను మెకార్ట్నీ ప్రభువుచేత

ఆంగ్లేయ రాయబారము విఫలమగుట

బంపెను. ఆ కోరికను నిరాకరించుచు చైనా చక్రవర్తి మూడవ జార్జిరాజున కిటుల జవాబు వ్రాసెను ;— "ఓరాజా, మీరు చాల సముద్రముల కావల నున్నారు. ఐనను మా నాగరికతయొక్క లాభములను పొందవలెనను వినయపూర్వకమగు కోరికతో సగౌరవమగు నొక రాయబారమును మీరు పంపినారు. మీ దేశమునం దుత్పత్తి యయ్యెడి వస్తువులను కానుకగ బంపి మా యెడ భక్తిని చూపినారు. మీ దరఖాస్తును మేము చిత్తగించి నాము. మా సామ్రాజ్యములో వర్తకము చేసికొనవలెనను అభిలాషను ఎక్కువగ కనపర్చినారు. మా యెడ చూపిన గౌర వమునకు చాల సంతసించినాము.

కాని మీ రాయబారి మా నాగరికతను నేర్చుకొన జాలడు. మా ఆచారములకును చట్టములకును మీవాటికిని చాల భేదము గలదు. ఆతడు కొంతవరకు నేర్చుకొన్నను దానిని మీ దేశమునందు వ్యాపింపచేయజాలడు. కావున మీ రాయబారిని మా దేశమునం దుంచుటవలన ప్రయోజనము లేదు.

నేను గొప్ప సామ్రాజ్యమును పాలించుచున్నాను. నా పాలనమునం దొకే యుద్దేశ్యము గలదు. అది నా ప్రజలకు నా ధర్మమును సంపూర్ణముగ నెరవేర్చుటే. అంతేగాని నాకు విలువగలిగినట్టియు క్రొత్తవైనట్టియు వస్తువులయం దభిలాష లేదు. మీకానుకలవలన నా కుపయోగము లేదు. మా యఖండ సామ్రాజ్యమునందు అన్ని వస్తువులును సమృద్ధిగ నున్నవి. మా రాజ్యములో లేనివస్తువు లేదు. కావున మా దేశమునుండి సరు కులను బంపి అనాగరికులగు దేశములవారు తయారుచేసెడి

పారిశ్రామిక సరుకులను మా దేశమునకు దిగుమతి కానివ్వవల
సిన యావశ్యకత మాకు లేదు. కాని మా స్వర్గరాజ్యమునందు
తయారయ్యెడి తేయాకు, పట్టు, పింగాణీలు, యూరపు జాతుల
వారికిని మీకును అత్యావసరములు గనుక నిదివరకు కాంటన్
రేవునుండి మితముగ జరుగుచున్న విదేశవ్యాపారమునే ముందు
కూడ జరుగనిచ్చుటకు మా కభ్యంతరము లేదు" అని చైనా
చక్రవర్తి వ్రాసెను. "అప్పుడు చైనా చక్రవర్తి మనతో వర్తక
మును గూర్చి నుడివిన వాక్యములలో పొరబాటు లేదు. చైనా
దేశపు ప్రజల సౌఖ్యమునకు వలయు ప్రతి వస్తువును చైనా
దేశము తయారు చేయుచుండెను. కేవలము మన లాభము
కొరకే మన వర్తకమును వారిమీద బలవంతముగ నంటగట్టి
నాము. వారి సరుకులకు బదులుగ వారి కనవసరమగు సరుకులను
వారిలో ప్రవేశపెట్టినాము" అని బర్ట్రాండు రసలు అను ఆంగ్లేయ
గ్రంథకర్త (**The Problem of China**) 'చైనాయొక్క సమస్య'
అను గ్రంథమునందు వ్రాసియున్నాడు. చైనావారు తామధి
కుల మనియు, మిగిలిన దేశము లన్నియు తమకన్న తక్కువ
అనియు నను గర్వము నాడు చైనా చక్రవర్తుల కున్నటులే
నేడు చైనా ప్రజాస్వామిక నాయకులకు కూడ కలదనియు
కేవలము పశుబలమునకు మాత్రమే లోబడుట చైనావారి
సాంప్రదాయ మనియు ఫిడ్జుగెరాల్డు అను చరిత్రకారుడు
వ్రాసియున్నాడు.

పదునెనిమిదవ శతాబ్దములో చైనాకు వచ్చిన ఫ్రెంచి
రోమను కాథలిక్కు మతగురువులు చైనాయొక్క నాగరికతను,

నైతికోత్కృష్టతను చూచి యాశ్చర్యపడిరి. వారిలో కొందరు చైనాభాషలో గొప్ప విద్వాంసులై కన్ ఫ్యూషియసు (Confucius) మొదలగు చైనా తత్త్వశాస్త్రజ్ఞుల యొక్కయు, రాజనీతిజ్ఞుల యొక్కయు, కవీశ్వరుల యొక్కయు గ్రంథములను ఫ్రెంచి భాషలోనికి భాషాంతరీకరణమును గావించి చైనాదేశపు విజ్ఞానమును పాశ్చాత్యప్రపంచమునకు వెల్లడిచేసిరి. అప్పుడు చైనాలో ప్రబలియున్న రాజ్యాంగ సాంఘిక విధానములను గూర్చి పాశ్చాత్య రాజనీతిజ్ఞులు శ్రద్ధతో నేర్చికొనసాగిరి. చైనాకు గురువులుగ నుండదలచి వెళ్ళినవారు చైనావారి విజ్ఞానమునకు శిష్యులైరి. ప్రపంచములోకెల్ల కన్ ఫ్యూషియసు నైతిక, రాజకీయ తత్త్వములయందు మిగుల శ్రేష్ఠుడని పాశ్చాత్యులవలన నెంచబడెను. 1756వ సంవత్సరమున సుప్రసిద్ధ ఫ్రెంచి విద్వాంసుడగు వాల్టేరు (Voltaire) తన గ్రంథములందు "జ్ఞానసూర్యుడు ప్రప్రథమమున చైనా మొదలగు ప్రాగ్దేశములయం దుదయించెను. పాశ్చాత్యులు తమ జ్ఞానమునంతను ప్రాగ్దేశములనుండియే నేర్చికొనినారు" అని వ్రాసెను. "కన్ ఫ్యూషియసు నైతిక ధర్మమును గూర్చియే వ్రాసినాడు గాని నమ్ముటకు వీలులేని యద్భుత కథలను వ్రాయలేదు. ఆయనయొక్క బోధలు చైనాలోని సామాన్యజనులచే కూడ సనుష్ఠింపబడుచున్నవి. చైనాలోని రాజ్యాంగవిధానము ప్రపంచములోకెల్ల శ్రేష్ఠమయినదిగ నున్నది. నిజమైన మతమును ఆయనయే బోధించినాడు" అనియు ఆయన వ్రాసెను. డిడిరో (Diderot) క్వేస్నే (Quesnay) లేబ్నిజు

చైనా నాగరికత యొక్క యుత్కృష్టత

(**Leibniz**) మొదలగు నితర ప్రఖ్యాత పండితులును చైనావారి నాగరికతయందు గొప్ప గౌరవమును ప్రకటించుచు, ప్రాగ్దేశ విజ్ఞానముతో సమ్మేళము చేసినగాని పాశ్చాత్యజ్ఞానము సరియైన పద్ధతులమీద అభివృద్ధి చెందదని వ్రాసిరి.

## 2

కాని పదునెనిమిది పందొమ్మిదవ శతాబ్దములలో యూరపు ఖండమున ఆవిరియంత్రములతో పరిశ్రమలు సాగించబడి యంత్ర శాలలు విశేషముగ స్థాపింపబడెను. క్లైవు, వారన్ హేస్టింగ్సు దినములలో భరతవర్షమునుండివిశేషముగవచ్చిన ధనముతో ఇంగ్లాండు మిగుల ఐశ్వర్యవంతమై ముందుగ యంత్రశాలలను స్థాపించి పందొమ్మిదవ శతాబ్దపు ముప్పాతిక భాగము వరకును ముఖ్యముగ ఇనుప, వస్త్ర పరిశ్రమలలో ప్రపంచమునందు సాటిలేనిదిగ నుండెను. పందొమ్మిదవ శతాబ్దముయొక్క మూడవభాగము నుండియే అమెరికా, జర్మనీ, ఫ్రాంసు, ఇటలీ దేశములు తలయెత్తి ఇంగ్లాండుతో సరిసమానముగ పోటీని సలుపగలిగినవి. యూరపుజాతులు తమ దేశముల కవసరమగు వానికన్న నెన్నిరెట్లో యంత్రముల మూలమున పారిశ్రామిక సరుకులను తయారు చేయుచున్నారు. వాటినమ్ముటకు విదేశములలో అంగళ్ళు కావలెను. ఆ సరుకులను తయారుచేయుటకు ప్రత్తి, లోహములు, చర్మములు, జనుపనార మొదలగు ముడిపదార్థములు, రబ్బరు, పెట్రోలియం మొదలగు పదార్థములు దొరుకుచోట్లు కావలెను. పరిశ్రమలను నెలకొల్పి

సామ్రాజ్య తత్వము

ధనము సంపాదించుట కలవడి వ్యవసాయమును చాలవరకు తగ్గించుకొనినందున కాఫీ, తేయాకు, కోకో, బియ్యం, గోధుమలు, పంచదార మొదలగు ఆహారపదార్థములు దొరకు ప్రదేశములు కావలెను. పరిశ్రమల వలన ఐశ్వర్యవంతులైన తమ షావుకార్ల వద్ద మూలుగుచున్న మూలధనమును పెట్టుబడిపెట్టి, తేయాకు, కాఫీ, ప్రత్తి, రబ్బరుతోటలను వేయుట, లోహముల పెట్రో లియం గనులను త్రవ్వుట, రైళ్ళను టెలిగ్రాములను వేయుట, స్టీమర్లను పడవలను నడపుట, పరిశ్రమాలయములను స్థాపించుట, బ్యాంకీలు, ఇన్స్యూరెన్సు, ఇతర వర్తకసంఘములను పెట్టుట, మొదలగువిధముల విశేషలాభములను గడించుటకు వెనుకబడిన దేశములు కావలెను. వీటియన్నిటికొరకు యూరపుజాతులు బయలుదేరిపోయి ఆశియా ఆఫ్రికాఖండములలోని దేశములలో రాజ్యములను, వలసలను, సంరక్షకత్వములను, పలుకుబడి ప్రదేశ ములను, ద్రవ్యార్జనాసౌకర్యములను, ప్రత్యేక రాజ్యాంగ వర్తక హక్కులను సంపాదించెను. తమ పారిశ్రామిక సరుకులను తేలికగ దిగుమతిచేసి ముడిపదార్థములు ఆహార పదార్థములు మొదలగువానిని తమ దేశములకు కొనిపోవుటకును, తమ అధి కారమును హక్కులను నిలుపుకొనుటకు సైన్యములను రవాణా చేయుటకును, స్టీమరులను రైళ్ళను టెలిగ్రాములను టెలిఫోను లను అన్ని మారుమూలలకును వేసెను. నవీన ప్రపంచమునందు స్థాపింపబడుచున్న సామ్రాజ్యములన్నియు నీ జాతుల ఆర్థిక లాభముల కొరకే స్థాపించబడుచు వచ్చినవి. ఈ జాతులకీరాజ్య స్థాపనములలోను ఆర్థికహక్కుల సంపాదనములోను ద్రవ్యార్జ

నములోను కలుగుచున్న పోటీలవలన గొప్ప యుద్ధములు జరుగు చున్నవి. ఇదియే నవీన ప్రపంచమున తాండవమాడుచున్న సామ్రాజ్యతత్వము. రాజ్యసంపాదనము చేయకపోయినను మిగత నన్నివిధములను ద్రవ్యార్జనము చేయుటకు అమెరికా కూడ యూరపుజాతులతో చేరినది. చైనా సామ్రాజ్యము మిగుల పెద్దది. అప్పటికి నలుబదికోట్ల జనసంకీర్ణము కలది. జనులు మిగుల నాగరికులు. పారిశ్రామిక సరుకులను తెచ్చి అమ్ముటకు గొప్ప అంగడి కాగలదు. ముడిపదార్థములు ఆహారపదార్థములు లోహములు మొదలగునవి సమృద్ధిగ గలవు. పెట్టుబడి పెట్టి విశేష లాభములను గొనిపోవుట కెంతయో అవకాశముకలదు. కావున సామ్రాజ్యతత్వము నవలంబించిన పాశ్చాత్యజాతులు కాలక్రమేణ ఏదో పేరున చైనా సామ్రాజ్యములో ధారాళ ప్రవేశము చేయుటకు సమకట్టినవి. ఇంతేగాక నీ నవీనపాశ్చాత్య జాతులలో పదునెనిమిది పందొమ్మిదవ శతాబ్దములలో ప్రకృతి శాస్త్రములు చాలగ వృద్ధిచెందినవి. గొప్పగొప్ప పరిశోధనలు జరిగి రైళ్ళు స్టీమరులు టెలిగ్రాములు టెలిఫోనులు మొదలగు నవి కనిపెట్టబడినవి. విద్యుచ్ఛక్తి కనుగొనబడి యనేక రూపాంత రముల మానవులచే నుపయోగింపబడ సాగినది. యుద్ధములలో మానవులను తేలికగ భస్మీపటలము గావించు నవీన మారణ యంత్రములు కూడ నెన్నియో కనిపెట్టబడినవి. చైనా మొద లగు ప్రాచ్యదేశము లింకను తమ ప్రాచీనపద్ధతులనే అవలంబించి యుండుటవలన పాశ్చాత్యదేశములు నవీన ప్రకృతిశాస్త్రజ్ఞానాభి వృద్ధిచే ప్రాచ్యజాతులకన్న మిగుల బలిష్ఠములై యుండెను.

అటుల చైనాలో ధారాళప్రవేశము చేయుటకు ప్రథమమున ఆంగ్లేయులు 1839 వ సంవత్సరమున నొక యుద్ధమును సలిపిరి. చరిత్రకారులు దానిని నల్లమందు యుద్ధమని పిలుచుచున్నారు. అదివరకు కొంత కాలమునుండియు

నల్లమందు యుద్ధము

కొంతటి దేశీ గుండ నాంగ్లేయ వర్తకులు తమ పాలనములోనున్న భరతవర్షమునుండి నల్లమందును తెచ్చి చైనా దేశీయుల కమ్ముచుండిరి. 1839 వ సంవత్సరమున నల్లమందు అమ్మకమును నిషేధించుటకు చైనాప్రభుత్వమువారు పూనుకొనిరి. నల్లమందును తినుటవల్లను, నల్లమందు పొగ త్రాగుటవల్లను తమ ప్రజలలో నాస్తికముగను నైతికముగను హాని గలుగుచున్నదని తలచిరి. నల్లమందును తినెడివారిని, నల్లమందు పొగ త్రాగెడి వారిని కఠినముగ శిక్షించెదమని శాసించిరి. కాని ఆంగ్లేయ వర్తకులును వారితో వర్తకసంబంధముగల చైనా వర్తకులును దొంగతనముగ నల్లమందును తెచ్చి యమ్ముట మానలేదు. అందుమీద నీ విషయమును విచారణచేసి తగుచర్య పుచ్చుకొనుట కొక ప్రత్యేక యుద్యోగిని చైనా ప్రభుత్వమువారు నియమించిరి. ఆయన విచారించి వెంటనే వర్తకు లందరివద్ద నిలవయున్న నల్లమందు సంతను తనకు నప్పగింతచేయవలెనని యాజ్ఞాపించెను. చైనా వర్తకులు నల్లమందును తెచ్చి యిచ్చిరి. దానినంత నా యుద్యోగి తగులబెట్టించెను. ఆంగ్లేయ వర్తకు లా యుత్తరువును ధిక్కరించి నల్లమందును వశపరచుటకు నిరాకరించిరి. ఆయుద్యోగి యాంగ్లేయ వర్తకస్థానములలో జొరబడి నల్లమందును వెదకి పట్టుకొని తెచ్చి తగులబెట్టించెను. మరియు నొక చైనా

దేశీయుని కొంద రాంగ్లేయసైనికులు హత్య గావించగా నేరస్థులను పట్టుకొనుటకు చైనా యుద్యోగస్తులు ప్రయత్నించిరి. ఈరెండు విషయములలో చైనా ప్రభుత్వమువారి ప్రవర్తన ఆంగ్లేయుల కాగ్రహమును కలిగించెను. వెంటనే హిందూ దేశమునుండి ఆంగ్లేయసేనలు చైనా దేశముపై దండెత్తి వచ్చెను. ఈ యుద్ధమునందు ఆంగ్లేయులకు హైందవ సిపాయిలు తోడ్పడిరి. ఆంగ్లేయ యుద్ధనౌకలుగూడ చైనా రేవులలో ప్రవేశించెను. రెండు సంవత్సరములు చైనావారికిని ఆంగ్లేయులకునుయుద్ధము జరిగెను. సముద్రతీరముననున్నట్టియు యాంగ్సినదిమీద నున్నట్టియు చైనావారి పట్టణములను ఆంగ్లేయులు పట్టుకొనిరి.

చైనా ప్రభుత్వము లోబడి యాంగ్లేయులు విధించిన షరతులకెల్ల నొప్పుకొని 1842 వ సంవత్సరము ఆగష్టు 29 వ తేదీన నాంకింగు (**Nanking**) వద్ద సంధిని చేసికొనిరి. (1) చైనా ప్రభుత్వమువారు ఆంగ్లేయ ప్రభుత్వమువారికి నష్టపరిహారము క్రింద 2 కోట్ల అరువది లక్షల డాలర్లను చెల్లించిరి. (2) కాంటన్ రేవుకు సమీపముననున్న హాంకాంగు (**Hongkong**) ద్వీపమును ఆంగ్లేయులకు శాశ్వతముగ వశపరిచిరి. (3) కాంటన్ (**Canton**), షాంఘాయి (**Shanghai**), ఆమాయి (**Amoy**), ఫూచో (**Foochow**), నిన్గుపో (**Ningpo**) అను అయిదు సముద్రరేవు పట్టణములలో స్వేచ్ఛగ నివసించి గిడ్డంగులు కట్టుకొని వర్తకము చేసికొనుటకు ఆంగ్లేయులకు హక్కును కలుగజేసిరి. (4) ఈరేవులలో నివసించెడి ఆంగ్లేయులు, ఆంగ్లేయ చట్టములకును చైనాలో నుండెడి ఆంగ్లేయ

నాంకింగు సంధి

ప్రభుత్వ ప్రతినిధికిని సివిల్, క్రిమినల్ వ్యవహారములలో లోబడి యుండునేగాని చైనావారి చట్టములకును చైనా న్యాయాధిపతులకును పోలీసులకును లోబడ నక్కరలేదు. (5) ఈదేశాలలో గుండ నాంగ్లేయులు దిగుమతి యెగుమతిచేయు సరుకులపైన చైనా ప్రభుత్వమువారు తమ యిచ్చవచ్చినంత సుంకములను విధింపకూడదు. సరుకుల విలువపైన నూటికి అయిదుకన్న నెక్కువ సుంకమును విధించగూడదని నిర్ణయించబడినది. ఇవి నాన్కింగు సంధి షరతులు.

ఈ అయిదు సముద్ర రేవులలోగూడ వర్తకము చేసికొనుటకును, క్రైస్తవమతబోధకులను చైనాకు పంపుటకును, నాన్కింగు సంధి షరతులెల్ల వర్తించుచునటులను, 1844 వ సంవత్సరమున అమెరికా సంయుక్త రాష్ట్రములు, ఫ్రాన్సు

విదేశస్థులకు ప్రత్యేక హక్కులు

ప్రభుత్వములతోను, 1847 వ సంవత్సరమున నార్వే, స్వీడన్ ప్రభుత్వములతోను, చైనా చక్రవర్తి యొదంబడికలు చేసెను. కొలది కాలమునకు ఈ హక్కులన్నియు హాలండు, స్పెయిన్, ఇటలి దేశములవారికిని కలుగజేయబడెను. ఈ యొడంబడికలవలన పాశ్చాత్యులు తమ పారిశ్రామిక సరకులను చైనాసామ్రాజ్యములోనికి దిగుమతి జేసి అడ్డులేకుండ అమ్ముచుండిరి. చైనా యంగళ్ళు పాశ్చాత్య సరుకులతో నిండసాగెను. అదివరకు చైనాలో ననాదికాలమునుండియు ప్రబలియుండిన గృహపరిశ్రమలు, పాశ్చాత్యదేశములనుండి యంత్రములమీద తయారుచేయబడి విశేషముగ వచ్చుచున్న చవకయగు సరుకుల పోటీవలన, నతి త్వరితముగ నశించసాగెను. తమ దేశము

లోని సరుకులతో పోటీ చేయకుండ నాపుటకై అవసరమైనంత దిగుమతి సుంకములను విదేశ సరుకులపై విధించు హక్కును చైనాప్రభుత్వము పోగొట్టుకొనెను. చైనాలో నుండెడి పాశ్చాత్యులపై చైనా పోలీసులకును, చైనా ప్రభుత్వోద్యోగులకును అధికారము లేదు. చైనాతో వర్తకము చేసెడి ప్రతి పాశ్చాత్య ప్రభుత్వమును ఒక కాన్సలును (ప్రతినిధిని) చైనాలో నియమించెను: ఆయనకే తన దేశీయులపై నధికారము కలదు. ఒక పాశ్చాత్యు డొక చైనావానిని కొట్టినను, హత్యచేసినను ఆ పాశ్చాత్య కాన్సలువద్ద ఫిర్యాదు దాఖలుకావలెను. ఆ నేరస్తుని పట్టుకొనుటకును, విచారించుటకును ఆ విదేశ యుద్యోగికే యధికారము కలదు. పాశ్చాత్య ప్రభుత్వముల కీ విధమైన రాజ్యాంగమునకు సంబంధించిన న్యాయవిచారణాధికారములు (**Extra-territoriality**) చైనాలో స్థాపిత మయ్యెను. చైనాలోని పాశ్చాత్యులు తమ తమ దేశముల చట్టములకే లోబడిరి. చైనా వారి చట్టము లేమియు వారికి వర్తించవు. చైనాలో పాశ్చాత్యులు తమ పోస్టాఫీసులను పెట్టుకొనిరి.

క్రైస్తవమత బోధకులు

పాశ్చాత్య దేశములనుండి క్రైస్తవమత బోధకులు వచ్చి చైనాలో మతబోధ చేయుచుండిరి. అదివరకు చైనావారిలో ప్రబలియున్న భావములను, నమ్మకములను ఆచారములను తీవ్రముగ ఖండించి చైనా ప్రజల మనములలో కల్లోలము గావించుచుండిరి. క్రైస్తవమతమును స్వీకరించినవారు ప్రజలనుండి వేరైరి. విదేశీయులగు వర్తకులును మతబోధకులును మాత్రమే గాక క్రైస్తవమతమును స్వీకరించిన

చైనావారును, తక్కిన చైనాదేశీయులకన్న గొప్పవారమను గర్వమును కలిగి వారిని తమకన్న తక్కువవారిగను, అనాగరికులుగను చూచిరి. తమ పలుకుబడిని యాధిక్యతను నిలుపుటకు తమకు వెనుక బలమైనసేనలు గల పాశ్చాత్య ప్రభుత్వములు సిద్ధముగ నున్నవను నమ్మకమును తెల్లవారు కలిగియుండిరి. ఆనాటి నుండియు చైనాదేశము పదునెనిమిదవ శతాబ్దపు ప్రాంచి మత బోధకులకు కనబడినటుల, పాశ్చాత్యులకు జ్ఞానభూమిగ కనబడుట లేదు. బలవంతులు బలహీనులలో కనుగొను దోషము లన్నియు చైనావారిలో పాశ్చాత్యులకు కనబడుచుండెను. చైనావారు నీతిబాహ్యులనియు, మోసగాండ్రనియు నల్లమందు ధాయి లనియు వారికి మతమును, నీతిని, నాగరికతను నేర్పు పవిత్రమగు ధర్మము పాశ్చాత్యులకు కలదనియు పాశ్చాత్య గ్రంథ కర్తలు వ్రాయసాగిరి. తమ సరుకుల నెచట అమ్మగలరో, తమకు కావలసిన ముడిపదార్థము లెచట దొరకునో, వాని నెల్ల చూపు చైనాయొక్క పటములు అంకెల జాబితాలు తెల్లవారి దేశములలో ప్రచురింపబడుచుండెను. చైనాసామ్రాజ్యము ఏ మనుజునికిని చెందని భూభాగమనియు (**No man's land**) హక్కుల విచక్షణ లేకుండ సైన్యములవలన స్వాధీనమును పొందుట కర్హమై యున్నదనియు వ్రాయబడుచుండెను.

క్రైస్తవమతమును స్వీకరించిన హంగ్‌సియుట్సువాన్ అను చైనాదేశీయుడు తాను ఏసుక్రీస్తుయొక్క తమ్ముడననియు తనకు దైవసందేశము గలదనియు ప్రకటించి 1850 వ సంవత్సరమున చైనాచక్రవర్తిపై గొప్ప తిరుగుబాటును లేవదీసెను.

మంచురాజవంశము కూలిపోవలెనను భావములు గల చైనా ప్రజలు చాలమంది యీ తిరుగుబాటున చేరిరి.

తైపింగు తిరుగుబాటు

ఈ తిరుగుబాటు చైనా ప్రభుత్వముచే పూర్తిగ నణచబడునప్పటికి పదిసంవత్సరములు పట్టెను. దీని నణచుటలో చైనా చక్రవర్తి మగ్నుడైయున్న నీకాలమున పాశ్చాత్యులు చైనాలో నెక్కువగ జొరబడుటకు చక్కని వీలుకలిగెను.

## 3

1856 వ సంవత్సరమున నొక ఫ్రెంచి క్రైస్తవమతబోధకుడు ఈ తిరుగుబాటులో చేరి తీవ్రముగ పనిచేయుచున్నాడని చైనాప్రభుత్వమువా రాతనిని పట్టుకొని యురిదీసిరి. మరియొక

టీన్ట్సినుసంధి

రిని చంపి యొక చైనాదేశీయుడు బ్రిటిషు పతాక మెత్తబడియున్న పడవలో దాగుకొనగ వాని నా పడవ యజమాను లప్పగింతచేయనందున నా పడవను చైనాప్రభుత్వమువారు పట్టుకొనిరి. ఈ కారణములచే ఆంగ్లేయులును ఫ్రెంచివారును కలసి చైనా చక్రవర్తిపై యుద్ధమును ప్రకటించిరి. యుద్ధము రెండు సంవత్సరములు జరిగెను. చైనావారు ఓడిపోయి ఆంగ్లేయ ఫ్రెంచిప్రభుత్వములు నిర్ణయించిన ప్రకారము 1858 వ సంవత్సరమున టీన్ట్సినువద్ద (Tientsin) సంధిని చేసికొనిరి.

(1) చైనాలో పదు క్రొత్తసముద్రరేవులు పాశ్చాత్యుల వర్తకమునకై తెరువబడెను. (2) యాంగ్సి నదిగుండ చైనాలో ప్రవేశించి వర్తకమును చేసికొనుటకు పాశ్చాత్యులు హక్కును

పొందిరి. (3) చైనారాజధానియగు పికింగునగరమున ఆంగ్లేయ ఫ్రెంచిప్రభుత్వములు రాయబారుల నుంచెదరు. (4) ఎగుమతి దిగుమతి సరుకులమీద నదివరకు పాశ్చాత్యులు చెల్లించుచుండిన సుంకములు ధరలు తగ్గిన కారణమున తగ్గించబడినవి. (5) తెల్ల క్రైస్తవ మతబోధకులకును దేశీయక్రైస్తవులకును చైనాప్రభుత్వమువారు తగు సంరక్షణ నివ్వవలెను.

ఈసంధిపత్రముపై చైనా చక్రవర్తియొక్క సంతకమును పొందుటకై ఆంగ్లేయ ఫ్రెంచిరాయబారులు పీహో నదిగుండ పికింగు నగరమునకు వెడలిరి. ఆ నదిగుండ చైనాపతాకము లేని పడవలు అదివరకుగల యాచార ప్రకారము రారాదు. అచటి కావలివారు వారి నడ్డగించిరి. వెంటనే ఆంగ్లేయ ఫ్రెంచి సేనలచటికివచ్చి కావలివారలను చంపి ఆ నదియొడ్డుననున్న టాకుకోటలను పట్టుకొని, టీన్ట్సీను పట్టణమును ముట్టడించి చైనారాజధానిలో జొరబడి చక్రవర్తులకోటలను స్వాధీనముచేసికొంది, వాటిపైన ఆంగ్లేయుల యూనియన్ జాకును, ఫ్రెంచివారి త్రివర్ణపతాకమును ఎగురవైచిరి. చైనా చక్రవర్తి కుటుంబముతోసహా రాజధానిని విడిచి పారిపోయెను. ఆంగ్లేయ ఫ్రెంచి సేనలు రాజమందిరములను దోచుకొనుటయే గాక అనేక శతాబ్దములక్రింద కట్టబడిన మిగుల అందమైనట్టియు, అత్యద్భుతమైన శిల్పకౌశలమును ప్రదర్శించుచున్నట్టియు, చైనాదేశమునకు నందనవనం బనదగిన చక్రవర్తుల వసంతకేళీసౌధమును తగులబెట్టిరి. చైనాచక్రవర్తి నిస్సహాయుడై లోబడి టీన్ట్సీను సంధిషరతులమీద సంతకము చేయు

కౌలూనుఆంగ్లేయుల కివ్వబడెను

టయేగాక ఆంగ్లేయులకు హాంకాంగు ద్వీపమునకు సమీపమున చైనాలోని కౌలూను (Kowloon) ప్రాంతమును ఇచ్చెను. ఎక్కువైన నష్టపరిహారమును కూడ ఆంగ్లేయులకును ఫ్రెంచి వారికిని ఇచ్చెను.

ఈ సంధిని కుదుర్చుటలో చైనావారికి రుష్యావారు సహాయము చేసినందున ప్రతిఫలముగ టీన్ట్సీను సంధిషరతులన్నియు రుష్యావారికి కూడ వర్తించునటులను చైనాలోని ఆమూరునది కుత్తరముననున్న ప్రదేశమును రుష్యా కిచ్చునటులను చైనాచక్రవర్తి యొడంబడెను. ఇందువలన మంచులేని వ్లాడివాస్టకు (Vlodivostok) అను రేవు చైనాతీరమున రుష్యాకు లభించెను.

రుష్యావారు ఆమూరు ప్రాంతమును పొందుట.

ఈ రేవువరకును రుష్యావారు సైబీరియాగుండ రైలును వేసి తూర్పువైపున తమ రాజ్యవ్యాపకము చేసికొనుటకు దానిని పాదుగ చేసికొనిరి.

1858 వ సంవత్సరమున టీన్ట్సీను సంధి షరతులను అమెరికా సంయుక్త రాష్ట్రములకు వర్తింపజేయుచు చైనా చక్రవర్తి యొడంబడిక చేసికొనెను. ఏదేశమున కెట్టి హక్కులిచ్చినను, ఏయే రేవులు ఎవరికి వర్తకమునకొరకు తెరచినను, ఆ హక్కులును, ఆ వర్తక సౌకర్యములును, మిగిలినవా రందరికిని సంక్రమించునని, చైనాచక్రవర్తి పైన జెప్పబడిన పాశ్చాత్య జాతుల కన్నిటికిని ఫర్మానా లిచ్చెను. దీనికి (**Most favoured nations treatment**) మిగుల స్నేహముతో చూపబడెడి జాతుల హక్కులని

మిగుల స్నేహముతో చూడబడెడి జాతుల హక్కులు

పేరు. ఫ్రెంచివారును రుష్యావారును అవసరము వచ్చినప్పుడెల్ల తమ దేశీయుల సంరక్షణముకొరకు చైనా రేవులలోనికి యుద్ధ నావలను తీసికొని రావచ్చునని కూడ అనుజ్ఞను పొందిరి. ఈ అనుజ్ఞయే తక్కిన అన్ని జాతులకును వర్తించెను.

1870 వ సంవత్సరమున యూనాన్ రాష్ట్రములో మార్గరీయను నొక ఆంగ్లేయ యుద్యోగి కొందరు చైనా దుండగీడులచే హత్య గావింపబడెను. వెంటనే ఆంగ్లేయ ప్రభుత్వము

మరల కొన్ని రేవులు

జోక్యము కలుగజేసికొనెను. చైనాచక్రవర్తి తన పక్షమున క్షమాపణను స్వయముగ కోరుటకొక రాయబారిని ఆంగ్లేయ రాణివద్దకు లండనుకు బంపెను. మార్గరీయొక్క మరణమువలన ఇంగ్లాండుకు కలిగిన నష్టపరిహారము క్రింద కొంత సొమ్మును చైనా చెల్లించెను. మరియు చైనాతీరమున క్రొత్తగ అయిదు సముద్రరేవు పట్టణములు పాశ్చాత్యుల వర్తకమునకై తెరవబడెను. ఆంగ్లేయులు అమ్ముచున్న నల్లమందుమీద కూడ సుంకము తక్కిన సరుకులతోపాటు తక్కువ చేయబడెను.

1871 వ సంవత్సరమున చైనాసామ్రాజ్యములోని తుర్కిస్థానములో కొంత తిరుగుబాటు జరిగెను. తమ సరిహద్దున అల్లకల్లోలముగ నుండుటకు తాము సహించజాలమని శాంతిరక్షణముల పేర రుష్యా ప్రభుత్వమువారు తమ

రుష్యావారికి కొన్ని హక్కులు

సైన్యములను బంపి తురుష్కస్థానము నాక్రమించిరి. 1878 వ సంవత్సరమున చైనా ప్రభుత్వమువారు తిరుగుబాటు నణచి బాగుగ శాంతిని నెలకొలిపిరి

గాని రుష్యాసేన లా ప్రదేశమును విడిచి పోలేదు. తుదకు రుష్యాకైన ఖర్చులక్రింద తొంబదిలక్షల రూబినులను చైనాప్రభుత్వము చెల్లించి, చైనాసామ్రాజ్యమున నుత్తరప్రాంతమున మంగోలియాలోను, ఇలీరాష్ట్రములోను కొన్నిపట్టణములను రుష్యావారు వచ్చి వర్తకము చేసికొనుటకు తెరచి, రుష్యాసేనలను తురుష్కస్థానమునుండి మరలించుకొనగలిగిరి. ఇందువలన రుష్యావారికి మెట్టత్రోవలగుండ చైనాలోకి సరకులను బంపుటకు ప్రత్యేక హక్కులు గలిగెను.

చైనాలోని యొకప్రదేశమునుండి మరియొక ప్రదేశమునకు చైనాదేశీయులు సరుకులు గొనిపోయినపుడు త్రోవలో ననేక ఘాటీలవద్ద రహదారి సుంకమును చెల్లించవలెను. ఈ సుంకములకు లికిన్ (**Likin**) అని పేరు. విదేశీయులు తమ సరుకులను చైనా సముద్ర రేవుల నుండి చైనాదేశములో నేప్రాంతమునకైన తీసికొని పోయినపుడును, దేశములో నెచటనైన సరుకులను కొని సముద్రరేవులలోనికి చేర్చినపుడును, చైనాప్రభుత్వమునకు లికిన్‌ను చెల్లించకుండ ఎన్నిగేట్లయినను ఊరికనే దాటి యా సరుకుల విలువమీద నూటికి రెండున్నర చొప్పున మాత్రము రహదారి సుంకము చెల్లించునటుల చైనాచక్రవర్తినుండి అనుమతి బొందిరి. ఇందువలన చైనావర్తకులు నూటికి పదివరకును రహదారి సుంకమును చెల్లించుచుండగ, విదేశీయులు రెండున్నరమాత్రము చెల్లించుచుండిరి. ఇంతేగాక విదేశీయులు తమ గిడ్డంగులమీదను, స్థలములమీదను వ్యాపార లాభములమీదను చైనావారు చెల్లించి

విదేశీయులకు పన్నుల మినహాయింపు

నటుల స్థలపు పన్ను, ఇండ్లపన్ను, వృత్తిపన్ను, ఆదాయపుపన్ను మొదలయినపన్ను లేమియు చెల్లించనక్కరలేకుండ మినహా యించబడిరి.

చైనా యుద్యోగస్థులయందు పాశ్చాత్యులకు విశ్వాసము లేదని చెప్పినందున, పాశ్చాత్యులు చెల్లించు సుంకములను వసూలు చేయుపని విదేశరాయబారులకు వప్పగింతచేయబడెను. 1854 వ సంవత్సరము నుండియు నొక ఆంగ్లేయ ఇన్స్పెక్టరు జనరల్ క్రింద సుంకములను వసూలుచేయు శాఖనేర్పరచిరి. ఈ శాఖపైన ఎప్పుడును అధికారిగ ఆంగ్లేయుడే యుండితీరవలెనని 1889 వ సంవత్సరమున చైనాచక్రవర్తి యొడంబడిక చేసెను. ముఖ్యమగు నుద్యోగము లన్నియు విదేశీయుల కివ్వబడి చిన్నఉద్యోగములను మాత్రము చైనావారి కిచ్చుచున్నారు. వీరందరకును జీతమును చైనా ప్రభుత్వమే ఇచ్చుచున్నప్పటికని ఆ జీతముల నిర్ణయము, క్రింది యుద్యోగులపై అధికారము, పూర్తిగ ఆంగ్లేయ ఇన్స్పెక్టరు జనరల్ క్రిందనున్నవి. చైనా ప్రభుత్వమువారు పాశ్చాత్యులకు చెల్లించవలసియున్న నష్టపరిహారములను పాశ్చాత్యులవద్ద చేయుచున్న ఋణములను, ఈ సరుకుల సుంకములమీద ప్రథమ జవాబు దారిగ చేసియున్నారు. ఆంగ్లేయ ఇనస్పెక్టరు జనరల్ సుంకములను వసూలుచేసి ఆంగ్లేయుల షాంఘాయి హాంకాంగు బ్యాంకులో వడ్డిలేకుండ దాచి దానిలో నుండి చైనావారు విదేశీయుల కివ్వవలసిన సొమ్మును విదేశీయులకు సరాసరి చెల్లించుచున్నాడు.

సుంకపుశాఖపై ఆంగ్లేయ ఇనస్పెక్టరు జనరలు

## 4

చైనాలో వర్తకహక్కులను, పలుకుబడిని, యాధిక్యతను పొందుటయేగాక పాశ్చాత్యజాతులు చైనా సామ్రాజ్యములోని భాగములను స్వాధీనమును పొందుటకుగూడ ప్రయత్నములు సలిపిరి. పందొమ్మిదవ శతాబ్దముయొక్క మధ్య భాగము వరకును బర్మా, సయాము, టాంకిన్, కొచిన్‌చైనా, కాంబోడియా, ఆనామ్, దేశములును మలయారాష్ట్రములును కూడ చైనా సామ్రాజ్యమునకు సామంత రాజ్యములుగ నుండెను. జపానుదేశముకూడ చాల కాలము చైనా చక్రవర్తికి కప్పము చెల్లించినదే. తూర్పు ఆశియా ఖండమంతయు చిరకాలము చైనా సామ్రాజ్యముక్రింద చేరి యుండెను.

చైనాసామ్రాజ్యము కూలిపోవుట

ఆనాములో ముందుగ పాశ్చాత్య క్రైస్తవ మతబోధకులు అడుగుబెట్టిరి. వీరి ప్రవర్తనవలన యాగ్రహమును బొంది యెవరో యొక రోమను కాథలికు బిషపును హత్య గావించిరి. అందుపైన స్పెయిన్, ఫ్రెంచి సేనలు కలసి ఆనాము రాజుమీద దండువెడలెను. ఆనాము రాజు ఫ్రెంచివారిచే నోడింపబడి 1862 వ సంవత్సరమున తన క్రిందనున్న కొచిన్ చైనా రాష్ట్రములను ఫ్రెంచివారి కిచ్చివేసెను. ఆనాము రాజ్యములో ఫ్రెంచి స్పెయిన్ దేశస్థులగు మతబోధకులు స్వేచ్ఛగవచ్చి బోధలు సలిపి ప్రజలను క్రైస్తవమతములో చేరవచ్చుననికూడ యంగీకరించెను. ఇటులనే కాంబోడియాలోని తెల్లక్రైస్తవ మతబోధ

కొచిన్ చైనా కాంబోడియాలు

కులకు ఇబ్బందులు కలుగుచున్నవను నెపమున ఫ్రెంచి సైన్య మొకటి కాంబోడియాపై దండెత్తివచ్చి ఆ రాజు నోడించి కాంబోడియాను ఫ్రెంచివారి క్రింద సంరక్షకరాజ్యముగ నుండు నటుల యొడంబడిక చేయించుకొనెను.

ఇంకను ఆనాము రాజ్యము కలదు. టాంకిన్ దాని క్రింద నున్నది. టాంకిన్‌ను స్వాధీనపరుచుకొనినచో దక్షిణమునుండి ఎఱ్ఱనదిగుండా పోయి చైనాదేశములో వర్తకముచేయవచ్చును.

ఆనాము, టాంకిను

1873 వ సంవత్సరమున గార్నియరు (Garnier) అను ఫ్రెంచి నౌకా సేనాధిపతి నిర్హేతుకముగ ఎఱ్ఱనది ప్రాంతముపై దండెత్తి లోబరచుకొనెను. ఆనామురాజు ఫ్రెంచివారితో యుద్ధముచేసి ఫ్రెంచివారి నోడించెను. యుద్ధములో గార్నియరు మరణించెను. క్రొత్త ఫ్రెంచి సేనలు వచ్చి ఆనామురాజునోడించగా ఆయన పాదాక్రాంతుడై ఫ్రెంచివారి సంరక్షకత్వ మంగీకరించి సంధి చేసికొనెను. ఆనాముతో పాటు టాంకిన్ కూడ ఫ్రెంచివారి సంరక్షకత్వము క్రిందికి వచ్చినది.

ఈ దేశములన్నియు చైనా సామ్రాజ్యము క్రింద చేరియున్నవి. కావున వాటిని వదలి లేచిపొమ్మని చైనా చక్రవర్తి ఫ్రెంచివారికి తెలియపరచెను. ఫ్రెంచివారు నిరాకరించిరి.

ఫ్రెంచివారి ఇండో చైనా సామ్రాజ్యము

ఫ్రెంచివారికిని చైనావారికిని 1883 మొదలు 1885 వరకును యుద్ధముజరిగెను. ఫ్రెంచివారే జయమొందిరి. 1885, 1886, 1887 సంవత్సరములలో వరుసగ మూడు సంధులను చైనా చక్రవర్తి ఫ్రెంచివారితో చేసికొనెను. ఆనాము పైనను, టాంకిన్ పైనను,

కాంబోడియాపైనను ఫ్రెంచివారి సంరక్షకత్వము చైనా చక్రవర్తిచే నంగీకరింపబడెను. చైనాలోనికి దక్షిణముననుండి టాన్‌కిన్ ద్వారా మెట్టనవచ్చు ఫ్రెంచి సరుకులపైన మితమైన సుంకములను చెల్లించునటుల కూడ సంధిలో చేర్చబడెను. చైనా యొక్క దక్షిణభాగమున రైళ్ళు వేయదలచినపుడు ఫ్రెంచివారి చేతనే వేయించునటులను చైనా చక్రవర్తి యొడంబడెను. సయాము దేశము క్రిందనున్న లావోసు రాష్ట్రమును కూడ ఫ్రెంచివారు త్వరలోనే ఆక్రమించి యొక గొప్ప సామ్రాజ్యమును ఆశియా ఖండము యొక్క ఆగ్నేయభాగమున స్థాపించు కొనిరి. కాంబోడియా, కొచిన్‌చైనా, ఆనాము, టాన్‌కిన్, లావోసు దేశములు కలసి ఇండోచైనా సామ్రాజ్యమను పేరు గలిగి యొక ఫ్రెంచి గవర్నరు జనరలుచే పాలింపబడుచున్నది. ఈ సామ్రాజ్యము ఫ్రాన్సు దేశమునకు ఒకటిన్నర రెట్లున్నది. ఇందులో రెండుకోట్ల ప్రజలు కాపురమున్నారు. ఫలవంతమైన భూములు, మంచిగనులు, వివిధములగు పంటలను పండించు సౌకర్యములు ఇందు గలవు. ప్రజలు నాగరికులును కష్టించి పని చేయువారును నైయున్నారు. ఈసామ్రాజ్యములో ఫ్రాన్సులో తయారయ్యేడి సరుకులు బాగుగ అమ్ముడుపోవుచున్నవి. ఫ్రెంచి మత బోధకులు క్రైస్తవమతమును బోధించుచున్నారు. పాఠశాలలలో ఫ్రెంచిభాష నేర్పబడుచున్నది.

ఇటుల ఫ్రెంచివారు చైనాసామ్రాజ్యములోని కొన్ని దేశములను వశపరచుకొనుచుండగ, ఆంగ్లేయులు చైనాకు సామంతదేశమగు బర్మాను స్వాధీనపరచుకొనిరి. బర్మారాజు

ఆంగ్లేయులకన్న ఫ్రెంచివారి నెక్కువ గౌరవముగ చూచెను. తన రాజ్యములో కొన్ని వర్తక హక్కులను ఫ్రెంచివారికి కలుగజేయదలచెను. టాంకిన్ నుండి బర్మా రాజధాని యగు మాండలే వరకును రైలువేయు హక్కును ఫ్రెంచి వర్తకుల కిచ్చెను. బర్మా దేశమున నొక బ్యాంకిని స్థాపించుటకును, కెంపుల గనులను త్రవ్వుటకును ఫ్రెంచివారి కనుమతి యొసంగెను. తమ హిందూ దేశసామ్రాజ్యమునకు ప్రక్కన ఫ్రెంచివారి పలుకుబడి స్థాపింపబడుట అపాయకరమని ఆంగ్లేయులు తలచిరి. 1885 వ సంవత్సరమున హిందూదేశమునుండి సైన్యములను బంపి బర్మా రాజును ఖైదీగ పట్టుకొని హిందూదేశమునకు గొనివచ్చి బర్మాను హైందవ సామ్రాజ్యములో భాగముగ జేసిరి.

బర్మాను ఆంగ్లేయు లాక్రమించుట

ఆంగ్లేయులదగు బర్మాకును ఫ్రెంచివారిదగు ఇండోచైనా సామ్రాజ్యమునకును మధ్య సయామదేశ మున్నది. సయామములో దక్షిణముననున్న మలయా రాష్ట్రములను (**Malaya-states**) ఆంగ్లేయు లాక్రమించగా, సయామములో తూర్పుననున్న కాంబోడియా రాష్ట్రమును ఫ్రెంచివారు స్వాధీనపరచుకొనిరి. సయాము రాజు నిస్సహాయుడై చూచుచు నూరకుండెను. కాని ఆంగ్లేయులింకను తూర్పువైపునకును, ఫ్రెంచివారింకను పడమరవైపునకును జరిగి రాకుండ, మధ్యనున్న సయామురాజ్యములో మీనాము నదికి తూర్పుభాగము ఫ్రెంచివారి పలుకుబడిక్రిందను, పశ్చిమభాగ మాంగ్లేయుల పలుకుబడిక్రిందను ఉండునటులను సయాము

సయాం

దేశములోని యేభాగమును ఎవరును ఇంక నాక్రమించకుండ స్వతంత్రముగ (**Buffer State**) నుంచునట్లును 1904 వ సంవత్సరమున ఉభయులును ఏర్పాటు గావించుకొనిరి. ఈవిధముగ సయాముయొక్క స్వతంత్రత ఆంగ్లేయ పరాసుల పోటీమధ్య కాపాడబడుచున్నది. బలహీనుడైన చైనా చక్రవర్తి వీటి కన్నిటికిని హర్షించి యూరుకొనెను.

## 5

కొరియాను జపాను వారాక్రమించుట

1867 వ సంవత్సరమున మత్సహితొయను యువకుడగు చక్రవర్తి జపాను సింహాసనము నధిష్ఠించినప్పటి నుండియు, ఐటో ప్రభువు, యమగాటా మొదలగు యువకులగు ప్రభువుల సలహాపైన, అదివరకు ప్రబలియున్న ప్రభుకుటుంబముల వంశానుగతమైన యధికారమును అణచివైచి, జపానులో జాతీయప్రభుత్వమును స్థాపించియు, నవీనపద్ధతులమీద సైనికనివహాములను, నౌకాదళములను, పరిశ్రమలను, యంత్రశాలలను, ప్రకృతి శాస్త్రబోధనలను నిర్మాణము గావించియు, జపానుదేశమును ఇరువదియైదు సంవత్సరములలో పాశ్చాత్యదేశములతో సాటియగు బలవత్తరమైన రాజ్యముగ గావించెను. జపాను బహుచిన్నదగు దేశము. పాశ్చాత్యులవలె యంత్రములతో పరిశ్రమలను చాలగ వృద్ధిచేసికొనెను. పాశ్చాత్యజాతులవలె జపానుకూడ సామ్రాజ్యతత్వము నవలంబించి తన పారిశ్రామిక సరుకులను అమ్ముటకును, ముడిపదార్థములను వ్యవసాయికవస్తువులను, రాతిసిబొగ్గును, లోహములను తీసికొని

పోవుటకును, విశాలమైన చైనారాజ్యములో వలుకుబడిని సౌక ర్యములను సంపాదించవలెనని ప్రయత్నింపసాగెను. జపానువారు చైనాసామ్రాజ్యములో చేరిన కొరియాదేశములో వర్తకము చేసికొనసాగిరి. క్రమముగ కొరియారాజనగరులోని కుట్రలలో ప్రవేశించి తమపక్షమున నొకకక్షిని తయారుచేసిరి. 1894 వ సంవత్సరమున కొరియారాజకుటుంబములో కలతలు వృద్ధిచేసి జపాను ప్రభుత్వము కొరియాలో సైన్యములను దింపెను. కొరియాతో జపానువారు జోక్యము కలుగజేసికొన గూడదని చైనాప్రభుత్వ మాక్షేపించెను. జపాను సేనలు కొరియారాజును తొలగించి ఆయన తండ్రిని పట్టాభిషిక్తునిగ గావించిరి. చైనావారు కొడుకుపక్షమున నుండిరి. క్రొత్తరాజు చైనా చక్రవర్తియొక్క సామ్రాజ్యాధికారమును నిరాకరించి జపానుయొక్క సంరక్షకత్వము నొప్పుకొని చైనాపై యుద్ధమును ప్రకటించెను. చైనా జపానులకు యుద్ధము జరిగెను. చైనావారు ఓడిపోయిరి. జపానువారు కొరియాను, మంచూరియాలో దక్షిణభాగమును ఆక్రమించి చైనా రాజధానియగు పికింగు పట్టణమును పట్టుకొనుటకు వచ్చుచుండిరి. అట్టి సమయమున 1895 వ సంవత్సరము ఏప్రిలు నెల 17 వ తేదీన జపానుతో చైనా సంధిచేసికొనినది. కొరియాపై జపానుయొక్క సంరక్షకత్వమును చైనాప్రభుత్వ మంగీకరించినది. యుద్ధమున జపానుకైన నష్టమునకు పరిహారముక్రింద పదిహేనుకోట్ల డాలర్లను జపానుకు చెల్లించినది. ఫార్మోజాద్వీపమును, మంచూరియాలోని దక్షిణప్రాంతమగు లయోటంగు (**Liaotung**) రాష్ట్రమును జపానువారికి స్వాధీనపరచునట్టుల యొడంబడిక చేసినది. చైనా

యొక్క సముద్రతీరమునను, యాంగ్సినదియొడ్డునను పాశ్చాత్య జాతులకు వర్తకమునకై తెరచిన యన్నిపట్టణములను జపాను వారి వర్తకమునకు కూడ తెరచినది. పాశ్చాత్యజాతులు అప్పటికి చైనాలో పొందియుండిన హక్కులనన్నిటిని జపానువారికికూడ కలుగజేసినది.

లయోటంగు రాష్ట్రమును జపానువారు స్వాధీనపర్చుకొనుట రుష్యావారికి కంటకముగ నుండెను. ఇందువలన రుష్యావారు దక్షిణమునకు వ్యాపించుటకు శాశ్వతమగు అడ్డు కలుగును.

రుష్యా, ఫ్రాన్సు, జర్మనీల అసూయ

కొరియాను జపాను సంరక్షకత్వము క్రింద చేర్చి కొని జపాను బలవంతమైనది. మంచూరియాలోని లయోటంగును కలిగియున్నచో జపాను ఇంకను బలవంతమగును అని రుష్యా, ఫ్రాన్సు, జర్మనీ ప్రభుత్వముల అసూయ ప్రజ్వరిల్లినది. ఆ మూడు ప్రభుత్వములును కలిసి జపాను వెంటనే లయోటంగు రాష్ట్రమును చైనావారికి వదలి వేయవలెనని జపానుప్రభుత్వమున కంత్యసందేశ మంపిరి. జపాను ఆ మూడుదేశములతో యుద్ధము చేయుటకు జంకినది. చైనా ప్రభుత్వమునుండి మూడుకోట్ల రేల్సును అధికముగ పుచ్చుకొని జపానువారు లయోటంగును చైనావారికి వదలివేసిరి.

జపానునుండి లయోటంగు రాష్ట్రమును మరల నిప్పించి

దక్షిణరాష్ట్రములలో ఫ్రాన్సుపొందిన హక్కులు

నందుకు చైనావలన ఫ్రాన్సు, రుష్యా దేశములు గొప్ప ప్రతిఫలమును పుచ్చుకొనక మానినవి కావు. ఫ్రెంచివారి ఇండోచైనా సామ్రాజ్యమునకు సమీపమున నున్న చైనాలోని మూడు దక్షిణరాష్ట్ర

ములలో గనులు త్రవ్వుకొను హక్కును ఫ్రాన్సు చైనానుండి పొందినది. అనామునుండి చైనాలోని దక్షిణప్రాంతములకు రైళ్లు వేయు హక్కునుకూడ ఫ్రాన్సుకు ఇవ్వబడినది. మరియు ఇండో చైనానుండి చైనాలోనికి వచ్చు ఫ్రెంచివారి సరుకులపైద సుంక ములు తగ్గించబడెను. ఈ షరతులతో 1895 వ సంవత్సరము జూన్ 20 వ తేదీని ఫ్రాన్సు, చైనాలమధ్య యొడంబడిక జరిగెను.

చైనా ప్రధానమంత్రియగు లీహాంగుచాంగుకు రుష్యా వారు తామే చైనాయొక్క మర్యాదను కాపాడినామని జ్ఞాప కము చేసిరి. లీహాంగుచాంగు 1896 వ సంవత్సరమున క్రొత్త జారు రెండవ నికలసుయొక్క పట్టాభిషేక సందర్భమున రుష్యా రాజధానికి వెళ్ళెను. రుష్యావా రాయన యందు మిగుల గౌరవ మును జూపిరి. ఆయన జారునికలసును, రుష్యా మంత్రులను దర్శించి చైనాపక్షమున రుష్యాతో నొకరహస్యపు టొడం బడిక చేసికొని మరలి వచ్చెను. జపానుకు చైనా యివ్వవలసి యున్న సొమ్మును రుష్యావారు అప్పు నిచ్చుటకును, రుష్యా కొన్ని రైల్వేలను, తంతిమార్గములను చైనాసామ్రాజ్యములో వేయుటకును, నొక బ్యాంకిని చైనాలో రుష్యావారు పెట్టు టకును ఏర్పాట్లు జరిగెను. ఆ బ్యాంకికి చాలవరకు ఫ్రెంచి షాహుకార్లు పెట్టుబడి పెట్టిరి. జపానువారి దండయాత్రలనుండి సంరక్షించుకొనుటకు రుష్యా, చైనాలు పరస్పర సహాయము చేసికొనుట కంగీకరించిరి. ఆ సంవత్సరమే సెప్టెంబరు నెలలో మంచూరియాలో రుష్యావారు చైనా తూర్పురైల్వే (**Chinese**

మంచూరియాలో రుష్యా పొందిన హక్కులు

**Eastern Railway)** వేయుటకు హక్కునుపొందిరి. ఈ రైలు ముందు చరిత్రలో ప్రఖ్యాతి గాంచినది. సైబీరియాగుండ రుష్యా వారు తమ వ్లాడివాస్టకు పట్టణముకు వేసిన రైల్వేకు ఇది కలసెను. ఈ రైల్వే 1072 మైళ్ళ పొడవుగలది. త్రోవ పొడుగునను ఇరు ప్రక్కలనున్న ప్రదేశములలో గనులు త్రవ్వుటకు రుష్యావారికి హక్కును కలుగజేసిరి. ఈ రైలుమార్గము పొడుగునను శాంతిని కాపాడుటకు రుష్యాప్రభుత్వము సైనికుల నుంచవచ్చును. ఈ రైలువలన మంచూరియాయొక్క మధ్య యుత్తరభాగమును రుష్యావారి వర్తకమునకు పలుకుబడికి లోబడినవి. ఈ రైలుమీద మంచూరియాకువచ్చు రుష్యా సరుకులమీద దిగుమతి సుంకములను చైనా ప్రభుత్వమువారు మూడవవంతుకు తగ్గించిరి.

## 6

ఇంతవరకు జర్మనీకి చైనా సామ్రాజ్యములో ఆశ్రయము దొరకలేదు. 1870 వ సంవత్సరమున జాతీయైక్యతను పొందినప్పటి నుండియు జర్మనీ తనయొక్క ప్రకృతి శాస్త్రములను, కళలను, పరిశ్రమలను, సైన్యమును, నౌకాదళమును అత్యాశ్చర్యకరముగ వృద్ధిచేసికొని, అప్పటికి ప్రథమస్థానము నాక్రమించిన ఇంగ్లాండును మించుటకు ప్రయత్నించుచున్నది. చైనాదేశములో నేభాగము తమక్రింద నుండిన తమ నౌకలకు ఎక్కుడు వీలుగనుండునో కొంత కాలమునుండి జర్మను నిపుణులు పరీక్ష చేయుచుండిరి. షాంటుంగు **(Shantung)** రాష్ట్రమును స్వాధీనమునుపొందుట

**జర్మనీకి షాంటుంగు రాష్ట్రపు కౌలు**

మిగుల వాంఛనీయమని నిర్ణయించిరి. ఇందుకు రుష్యావా రడ్డు దగులకుండుటకై, రుష్యాను చైనాలోని పోర్టు ఆర్థరును తీసికొమ్మనియు, తాము షాంటంగును తీసికొందుమనియు, 1897 వ సంవత్సరమున జర్మన్ చక్రవర్తి రుష్యా చక్రవర్తికి వ్రాసి ఒప్పించెను. పిమ్మట అదృష్టవశమున ఇద్దరు జర్మను రోమను కాథలికు క్రైస్తవమతబోధకులు షాంటంగు రాష్ట్రము లోని చైనా ప్రజలచే హత్యగావింపబడిరి. ఈ అవకాశమును గైకొని జర్మనుసేనలు వెంటనే చైనావారికి బుద్ధిచెప్పుటకై చైనామీదికి దండెత్తివచ్చి, షాంటంగు రాష్ట్రములోని కయ చూబేలో దిగెను. చైనా యుద్యోగస్తులు ఆ హత్య దుండగీంద్ర పనియని పశ్చాత్తాపమును వెలిపుచ్చిరి. కాని జర్మనులకు కావలసినది వట్టి పశ్చాత్తాపము కాదు. రాజ్యము. కయచూబేను తమ కివ్వనిచో చైనాదేశమునంతను ఆక్రమించెదమని బెదరించిరి. చైనా చక్రవర్తి లోబడక తప్పినది కాదు. షాంటంగు రాష్ట్రము లోని కయచూబేను, దానికి సమీపముననున్న చిన్న లంకలను మొత్తము 193 చదరపుమైళ్ళ ప్రదేశమును తొంబదితొమ్మిది సంవత్సరములు కౌలుగ జర్మనీకి చైనావారు స్వాధీనపరచిరి. ఈ కౌలు ప్రదేశమునందు జర్మనులు కోటలును, రేవులను, నౌకాశ్రయములను నిర్మించవచ్చును. షాంటంగు రాష్ట్రములో జర్మను షాహుకారులు రెండు రైల్వేలను వేయుటకును, రైల్వేల కిరుప్రక్కలను పన్నెండు మైళ్ళ దూరమువరకున్న ప్రదేశములోని యావత్తు గనులను త్రవ్వుకొనుటకును హక్కు కూడ కలుగజేయబడెను. షాంటంగు రాష్ట్రములో చైనా

ప్రభుత్వమువారే నిర్మాణకార్యము గావించినను జర్మనుల పెట్టుబడితోడను జర్మను ఇంజనీర్లతోను చేయించవలెనని గూడ నొప్పుకొనిరి. షాణ్టంగు రాష్ట్రము అర్థికముగ జర్మనీ యొక్క పలుకుబడిగల ప్రదేశమయ్యెను (**Sphere of Influence**). కయచూబే యొద్దుననున్న ట్సింగుటౌ (**Tsingto**) రేవుపట్టణము నందు జర్మనులు మిగుల బలవత్తరమైన కోటలను వర్తకపు రేవును కట్టిరి.

జర్మనీకి కౌలివ్వగనే, రుష్యా తనమాట ఏమియని వచ్చినది. రుష్యాకు కూడ మరియొక ప్రదేశమును చైనా చక్రవర్తి కౌలుకివ్వక తప్పినదికాదు. మంచూరియాలో దక్షిణముననున్న 538 చదరపుమైళ్ళ వైశాల్యముగల లయోటఙ్గు (**Liaotung Peninsula**) ప్రాంతమును, పోర్టు అర్థరును (**Port Arthur**), డాల్నీ (**Dalney**) లంకలను ఇరువదియైదు సంవత్సరముల కౌలును రుష్యాచక్రవర్తి పొందెను. కయచూబేను జర్మనులకు స్వాధీనము చేయుటవలన తమకు మంచూరియాలో గల హక్కులకు జర్మనులనుండి అపాయము వాటిల్లవచ్చునుగనుక మంచూరియాలో తమ హక్కులు బలపడుటకై లయోటంగు తమకు కావలెనని రుష్యా చక్రవర్తి చెప్పి యా కౌలును పొందెను. ఈ లయోటఙ్గును వెనుక జపానుకు స్వాధీనము చేయబడినపుడు గట్టిగానాక్షేపించి దానిని మరల చైనా కిప్పించినవాడు రుష్యాచక్రవర్తియే. ఇప్పుడు చైనానుండి తానే దానిని కౌలుపొంది స్వాధీనమును పొందెను. మంచూరియాలో రుష్యావారు వేసిన చైనా తూర్పు రైల్వేను

రుష్యాకు పోర్టు ఆర్థరు కౌలు

పోర్టుఆర్థరు వరకును రుష్యావారు పొడిగించుటకుకూడ హక్కును పొందిరి. పోర్టుఆర్థరును ముఖ్యపట్టణముగ చేసికొని యచట కోటలను రేవును నిర్మించి యా ప్రాంతమునంతను రుష్యావారు పాలించసాగిరి.

జర్మనీ కిచ్చిన కౌలుపైన 1898 వ సంవత్సరము మార్చి 6 వ తేదీన దస్కతు చేయబడెను. రుష్యాకిచ్చిన కౌలు మార్చి 27 వ తేదీన దస్కతు చేయబడెను. ఈ కౌలు సంతకముచేయబడిన దినముననే చైనాలో దక్షిణప్రాంతమున ఫ్రెంచివారి ఇండోచైనా సామ్రాజ్యమునకు సమీపముగనున్న 190 చతురపుమైళ్ళ వైశాల్యము గల క్వంగుచోబేను (**Kwangchow Bay**) తమకు కౌలు కివ్వవలెనని ఫ్రెంచి ప్రతినిధి దరఖాస్తుపెట్టి ఆ ప్రదేశమును తొంబదితొమ్మిది సంవత్సరముల కౌలును చైనా చక్రవర్తివలన పొందెను. ఈ రాజ్యముల సంపాదనలో ఇంగ్లాండు మాత్రము చేరక యూరుకొనుట న్యాయమా? రుష్యావారు లయోటంగును కౌలుపొంది పోర్టు ఆర్థరులో స్థావర మేర్పరచుకొనుట వలన ఆంగ్లేయుల హిందూదేశ సామ్రాజ్యమున కెప్పటికైన అపాయము కలుగ గలదని ఆంగ్లేయులు చెప్పిరి. రుష్యావారి రాజధానినుండి సైబీరియా మంచూరియాలగుండ పోర్టు ఆర్థరు వరకును రైల్వేను వేయుటవలన రుష్యా సైన్యములు పసిఫిక్కు మహాసముద్రములోనికి తేలికగను నిరాఘాటముగను రావచ్చును. పోర్టు ఆర్థరు మంచికోటలచే బాగుగ సంరక్షించబడుచు అభేద్యముగ చేయబడినది. పసిఫిక్కు మహాసముద్రమునుండి సైన్యము

ఫ్రెంచి ఆంగ్లేయ కౌళ్ళు

లను సముద్రములమీద హిందూదేశమునకు తెచ్చుటకు రుష్యా వారికి వీలుకలిగినది. కాని పోర్టు ఆర్థరుకు సమీపమున దానికి పోటీగ నుండుటకై పోర్టు ఆర్థరు రుష్యావారి కౌలులో నున్నంత కాలము తమక్రింద నుండుటకై 400 చతురపు మైళ్ళ వైశాల్యము గల వైహాయివాయి (**Wei Hai wei**) ప్రదేశమును ఆంగ్లేయులు చైనా చక్రవర్తినుండి కౌలును పొందిరి. ఇంతేగాక దక్షిణమున ఫ్రాన్సు మిగుల బలపడకుండ పోటీగ నుండుటకై దక్షిణపు వైపుననున్న కౌలూను (**Kowloon**) ప్రాంతమును కూడ నాంగ్లేయులు తొంబది తొమ్మిది సంవత్సరముల కౌలును పొందిరి. మిగుల బలహీనుడగు చైనాచక్రవర్తి బలవంతులగు పాశ్చాత్య ప్రభుత్వములు కోరినప్రదేశములనెల్ల వారికి కౌళ్ళ క్రింద స్వాధీనపరచెను. అయిదు గొప్ప సామ్రాజ్యప్రభుత్వములు—ఇంగ్లాండు, ఫ్రాన్సు, జర్మనీ, రుష్యా, జపాను, చైనాసామ్రాజ్యమును చీల్చి స్వాధీనపొందుటకు సమకట్టినవి. బర్మా, సయాం, మలయారాష్ట్రములు, ఇండో చైనా, ఫార్మోజా, అమూరు, హాంగుకాంగులు సొంతముగ చైనానుండి పోయినవి. కొరియాపైన జపాను సంరక్షకత్వమును స్థాపించుచున్నది. కయచోజే, పోర్టు ఆర్థరు, క్యంగుచోటే, వైహాయివాయి, కౌలూనులు కౌళ్ల క్రింద మిగతా సామ్రాజ్యవాదులకు స్వాధీనపరచబడినవి. పాశ్చాత్య జపాను వర్తకులు, షాహుకార్లు, ఉద్యోగస్థులు, క్రైస్తవమత బోధకులు, సైనికులు చైనా సామ్రాజ్యములో నన్నివైపుల నుండియు ప్రవేశించినారు. వీరే సామ్రాజతత్వపు ఆయుధములు:

ఇంతేగాక ఆంగ్లేయ, ఫ్రెంచి, జర్మను, రుష్యా, జపాను ప్రభుత్వములు చైనాసామ్రాజ్యము నంతను తమ తమ పలుకుబడి క్రింద నుండు ప్రదేశములుగ (**Spheres of influence**) 1898, 1899 సంవత్సరములలో పంచుకొనుచు తమలో తాము ఒడంబడికలు చేసికొనిరి. మంచూరియా దేశము రుష్యావారి పలుకుబడిక్రిందను, కొరియాదేశము జపాను వారి పలుకుబడిక్రిందను, షాంటంగురాష్ట్రము జర్మనీవారి పలుకుబడి క్రిందను, దక్షిణముననున్న మూడురాష్ట్రములు ఫ్రెంచివారి పలుకుబడి క్రిందను, యాంగ్సినది ప్రవహించెడి మిగుల ఫలవంతమైనట్టియు మధ్యదేశమంతయు ఆంగ్లేయుల పలుకుబడి క్రిందను నుండునటుల నిర్ణయించుకొనిరి. ఎవరి పలుకుబడి క్రిందనున్న ప్రదేశములో వారు చైనా చక్రవర్తినుండి ద్రవ్యార్జన హక్కులు పొందుటలో నితరులు పోటీకి రాకూడదు. చైనా చక్రవర్తి యొక్క ఒప్పుదలతో నిమిత్తము లేకుండగనే ఈయొడంబడికలు జరిగెను. ఈ పలుకుబడి ప్రదేశములలో ఆయా జాతులవారిచేత బ్యాంకులు పెట్టబడెను; రైళ్ళు వేయబడెను; గనులు త్రవ్వ కొనబడెను; చైనాయొక్క నైసర్గికసంపద కొనిపోబడెను. ఈ ప్రదేశములను తమకు గాక మరి యెవరికిని కౌలుమూలముగ గాని, మరి యెవ్విధముగ గాని అన్యాక్రాంతము చేయకుండునటుల చైనా చక్రవర్తిచే ఖరారులు కూడ చేయించుకొనిరి, అచిర కాలములోనే పలుకుబడి ప్రదేశములు (**Spheres of influence**) తమ తమ రాజ్యముల క్రింద పూర్తిగ చేరిపోవునని యా జాతుల వారు ఆశించుచుండిరి.

పలుకుబడి ప్రదేశములు

ఈ కాలమునకు చైనాలో అమెరికా సంయుక్త రాష్ట్రములవారి వర్తకము కూడ చాలగ వృద్ధిచెందినది. ప్రధాన యూరపు జాతులును, జపానువారును చైనాలో కొళ్ళపేర కొన్ని భాగములను స్వాధీనపర్చుకొని దేశము నంతను పలుకుబడి ప్రదేశములుగ పంచుకొని వారివారి హైళ్ళు వేసికొనుటవలన అమెరికాకు స్థానమే లేకుండ బోవుచున్నది. వారు చైనాను చీల్చి రాజ్యస్థాపనము గావించుకొనుచో అమెరికా సరుకులపై పన్నులువేసి వాటిని అసలే రానివ్వరు. రెండే మార్గములు అమెరికాకు గలవు. ఒకటి, తాము గూడ చైనాయొక్క పంపిణీలో చేరి యొక ముక్కను తీసికొనవలెను. అపుడెవ రేవైపున యెంత భాగము తీసికొనవలె ననునది వారిలో వారికి గొప్పయుద్ధము లేకుండ తేలునదికాదు. అంతే గాక అమెరికా రాజ్యసంపాదనకు కడంగలేదు. కావలసినవి వర్తకము, పెట్టుబడి పెట్టుటవలన లాభము మాత్రమే. రెండవ మార్గము, చైనాయొక్క రాజకీయ స్వతంత్రమును కాపాడి అందరును ధారాళముగ వర్తకము చేసికొనుటకు, పెట్టుబడి పెట్టి లాభములను పొందుటకు, హక్కుగలిగియుండుట. ఈ మార్గమునే అమెరికా ప్రభుత్వ కార్యదర్శి యగు హే అవలంబించుటకు నిశ్చయించుకొనెను. 1899 వ సంవత్సరమున ఈ విషయములో యూరపు ప్రభుత్వములకును, జపానుకును ఆయన వ్రాసెను. ఇంగ్లాండు, అందరము కలసి చైనాయొక్క సైన్యములపైనను ఆర్థిక విషయములపైనను యాజమాన్యము వహింతమని అమెరికాకు సలహా నిచ్చెను. ఇది ఈజిప్టుపైన ఇంగ్లాండు, ఫ్రాన్సులు కలసి

అమెరికావారి రాజనీతి

పొందిన యాజమాన్యము వంటిది. కొలది కాలములోనే ఏదో సాకున ఈజిప్టును ఇంగ్లాండు స్వాధీనపర్చుకొని పాలనమును వహించెను. ఇట్టి యాజమాన్యమునకు అమెరికా ఒప్పుకొనలేదు. కావున కొంత యుత్తర ప్రత్యుత్తరముల నన్ని ప్రభుత్వములతోను జరిపి, హే అమెరికా యొక్క రాజనీతినే అందరిచేతను అంగీకరింప చేసెను. ఇందువలన చైనా రాజకీయ స్వతంత్రమును కలిగియుండవలెను. ఎవరును చైనాలోనే భాగమును తమ క్రిందకు కలుపుకొనగూడదు. కాని ఇదివరకు విదేశ ప్రభుత్వములు పొందిన హక్కులు నిలచి యుండునవే. చైనాలో అన్ని జాతులకును వర్తకముచేసికొనుట కును పెట్టుబడిపెట్టి లాభములు పొందుటకును సమానావకాశము లుండవలెను. దీనికి **(Open door Policy)** అని పేరు.

ఏ జాతులవారు చైనాలో నెచట రైళ్ళువేసినను రైళ్ళ మీద ప్రయాణముచేయు సరుకులమీదను మనుష్యులమీదను అన్ని జాతులవారివద్ద నుండియు రేట్లు సమానముగ వసూలు చేయ వలెనుగాని యొకజాతివారికిని మరియొక జాతివారికిని తమకును ఇతరులకును భేదముచూపరాదు.

★

# చైనా విప్లవము

## తృతీయాధ్యాయము

### జాతీయ దైన్యము

### 1

క్రీ. శ. ఇరువదవ శతాబ్ద ప్రారంభమునకు జాతీయదైన్యము పూర్తియయ్యెను. క్రమక్రమముగ విదేశీయులకు డెబ్బదియైదు రేవులు యొడంబడిక రేవులుగ (Treaty Ports) తెరువబడెను.

ఒడంబడికలను మీరి విదేశీయులు ప్రవర్తించిరి

ఈ రేవు పట్టణములలో పాశ్చాత్యులును జపాను వారును నివసించి వర్తకముచేసికొనిరి. చైనా ప్రభుత్వమువారు వీరి నివాసమునకై యిచ్చిన స్థలములకన్న నెన్నిరెట్లో ఎక్కువ స్థలముల నాక్రమించిరి. చైనాప్రభుత్వముతో చేసికొనిన యొడంబడికల వలన నట్టిహక్కు పొందనిదే, పాశ్చాత్యులును, జపానువారును ఒడంబడిక రేవులలో యంత్రశాలలను స్థాపించి పరిశ్రమలను నెలగొల్పిరి. చైనా ప్రభుత్వపు స్థలములను అక్రమముగ నాక్రమించి, ఇండ్లనుకట్టి అద్దెలకిచ్చి పెట్టుబడిపెట్టినదానికి నూటికి ముప్పది, నలుబది వంతున లాభములను గడించుచుండిరి. చైనాప్రభుత్వపు అనుమతి లేనిదే మ్యునిసిపాలిటీలను స్థాపించుకొనిరి. పోలీసులను నియమించిరి. పోస్టాఫీసులను పెట్టుకొనిరి. షాంఘాయిలో స్థాపింపబడిన మ్యునిసిపాలిటీకి శాస్త్రీయమైన అధికారములేదు. చైనాప్రభుత్వము

యొక్క నిస్సహాయతను విదేశీయులు పూర్తిగ అవకాశము తీసికొనిరి.

"తెల్లఫాదరీలు ఆధ్యాత్మిక రాజ్యమును స్థాపించుటకు బయలుదేరిపోయి, తరుచుగ తమదేశముయొక్క ఐహిక రాజ్యమునే స్థాపించుచున్నారు. కొందరు బుద్ధిపూర్వకముగను, కొందరుద్దేశ్యపూర్వకముగ గాకుండగను, ప్రవర్తించినను అందరును సామ్రాజ్య తత్వమునకు పనిముట్టులగుచున్నారు......తరుచుగ ముందుగ తెల్లమతబోధకులు కాలుపెట్టగ, కొలది కాలములోనే నాప్రదేశమున తెల్లవర్తకులును, అటుపిమ్మట తెల్లవారి మఱఫిరంగులును దిగుచున్నవి." అని డాక్టరు మూను అను అమెరికను పండితుడు 'సామ్రాజ్య తత్వము, (**Imperialism and World Politics**) ప్రపంచ రాజకీయములు' అను గ్రంథములో వ్రాసెను.

సామ్రాజ్యతత్వమునకు పనిముట్టులు

విదేశీయుల ప్రవేశమువలన ఆర్థికముగను సాంఘికముగను చైనా కెట్టి హానికలిగెనో దానినిగూర్చి పైన చెప్పబడిన 'నవీన చైనాయొక్క పునాదులు' అను గ్రంథముయొక్క గ్రంథకర్త ఇటుల వ్రాసి యున్నాడు :— "గత కాలమున చైనారాజ్యము మిగుల నిలుకడ గలిగినట్టియు, సుభిక్షమైనట్టియు ప్రజారాజ్యముగ నెంచబడుచు వచ్చెను. రాజవంశములు మారవచ్చును. రాజులు సింహాసనభ్రష్టులై నూతన పృథ్వీశులు రావచ్చును. కాని ప్రజల ప్రతిష్ఠాపనలు, భావములు రాజకీయ విప్లవములవలన చెక్కు చెదరలేదు. గడచిన కొన్నివేల సంవత్సరముల నుండియు ప్రజల సాంఘిక, ఆర్థిక స్థితి మార్పు

ఆర్థిక సాంఘిక దుస్థితి

చెందకుండ చక్కగ నున్నది. చైనాయొక్క ఆర్థిక పునాది వ్యవసాయమై దానికి తోడుగ ప్రజల కవసరమైన సమస్త పరిశ్రమలును, కళకళలాడుచుండెను. దేశములో నుత్పత్తియైన ద్రవ్యము బహుచక్కగ ప్రజలలో పంపిణీ యగుచుండెను. ప్రతి వ్యక్తికిని కడుపునిండ భోజనమునకు కొదువలేకుండెను. దేశీయులకు కావలసినవన్నియు దేశములోనే తయారై విదేశవర్తకముతో నవసరమేలేని స్థితిలో నుండిరి. పందొమ్మిదవ శతాబ్దములో పాశ్చాత్య పారిశ్రామికునియొక్కయు వర్తకునియొక్కయు రాకవలన చైనాయొక్క, సాంఘిక, ఆర్థిక జీవితమంతయు తారుమారు చేయబడినది. పాశ్చాత్య షాహుకార్ల ప్రవేశము, అదివరకు చైనా సామ్రాజ్యపు ఏ చక్రవర్తియొక్క దుష్పరిపాలనము గావించలేని దుస్థితిని చైనాకు కలుగ జేసినది.

ప్రథమమున పాశ్చాత్యులతోకూడ చైనాలోనికి నల్లమందు వచ్చెను. అది కోట్లకొలది ప్రజలను దరిద్రులుగను, నీతిరహితులుగను చేసినది. తరువాత ఒడంబడిక రేవులగుండ యంత్రములతో చేయబడిన చౌకయగు విదేశ వస్త్రములు వచ్చినవి. అవి చైనాయొక్క స్వదేశ వస్త్రపరిశ్రమను నాశముచేసి చైనాలోని కోట్లకొలది బీదప్రజల జీవనమును పోగొట్టెను. రైళ్ళు, స్టీమర్లు వచ్చి విదేశ సరుకులతో చైనా యంగళ్ళను నింపెను. మరియు నవి చైనాలోని ఆహారపదార్థములను, ముడిపదార్థములను విదేశములకు కొనిపోగ వాటిధర లపరిమితముగ పెరుగుటవలన కూడ ప్రజలకు చాలకష్టములు గలిగెను.

ప్రజల జీవనము పోయినది

ఇటుల ననేక వేల సంవత్సరములు ప్రపంచమునందు మహోన్నతపదవి ననుభవించిన చైనాజాతి పందొమ్మిదవశతాబ్ద మంతమగుసరికి పాశ్చాత్య జాతులకు పాదాక్రాంత మైనది. పాశ్చాత్య జాతులలో జపాను కూడ చేరినది. ధర్మము, మానవ హక్కులు అను పదములు అదృశ్యమై పశుబల మెంత ప్రదర్శించబడిన అంత జయము కలిగినది.

చైనా యొక్క నిస్సహాయత

## 2

జపానువలె నవీనపద్ధతులమీద తన రాజ్యాంగమును, సైన్యములను, విద్యాపద్ధతులను సంస్కరించినగాని తనరాజ్యము విదేశీయులచే మ్రింగివేయబడకుండ నాపుటకు వీలులేదని చైనాయొక్క యువకుడగు క్వాంఘుసు చక్రవర్తి గ్రహించి 1898 వ సంవత్సరమున కొన్ని సంస్కరణములను గావించ యత్నించెను. జపానులో విద్య నభ్యసించి వచ్చిన కాన్‌గుయూవై, లీయాంగు చీచో యను ఇద్దరు యువకులను సలహాదారులుగ నియమించుకొనెను. కాని విదేశీయులకు చైనాలోని ప్రదేశములను కౌళ్ళ కిచ్చుటవలన నాయన అతిత్వరితముగ ప్రజారంజకత్వమును గోల్పోయెను. ఆయన చర్యవలన నాగ్రహమునుపొందిన వృద్ధురాలగు రాజమాత జీహిసిదేవి 'పదివేల యుగములను' పేరుగల కొండమీదనున్న తన రాజనగరునుండి దిగివచ్చి చక్రవర్తిని నిర్బంధములోనుంచి రాజ్యపాలనమును వహించెను. ఆయన తలపెట్టిన సంస్కరణములను

రాజమాత

కొట్టివైచి ఆయనకు సలహాదారులుగ నున్నవారిని వెడలగొట్టించెను. దేశము నాక్రమించుచున్న విదేశీయుల నెటులైన వెడలగొట్టుట కుద్దేశించెను.

క్రీ. శ. 1900 సంవత్సరమున విదేశస్థులనందరను హత్య చేయవలెనని, వెళ్ళగొట్టవలెనని యొక ఉద్యమము చైనాదేశీయులలో బయలుదేరి తీవ్రముగ వ్యాపించెను. సక్రమ శాంతిస్థాపక

బాక్సరులు

సంఘము లను పేరున (**Harmonius and Peaceful Fists**) దేశములోని వివిధ ప్రాంతములలో రహస్య సంఘములు స్థాపింపబడెను. శరీరవ్యాయామమును, ముఖ్యముగ మల్లయుద్ధమును వీరు నేర్చుకొనుచుండినందున వీరిని బాక్సరులని (**Boxers**) తెల్లవారు పిలచిరి. తాము చేయుచున్నది దైవకార్యమనియు తెల్లవారి తుపాకిగుండ్లు తమ్ము చంపనేరవనియు నమ్మకముకూడ వీరిలో చాలమంది కుండెను. అనేకమంది రాజబంధువులు, రాష్ట్రపాలకులు వీరికి పోషకులైరి. చైనా ప్రభుత్వసేనలు కొన్ని వీరిలో చేరెను. సామ్రాజ్యమును పాలించుచున్న రాజమాత రహస్యముగ వీరికి సానుభూతిని చూపుచుండెను.

అకస్మాత్తుగ తెల్లమత బోధకుల పైనను, ఇతరవిదేశీయులపైనను పడి అక్కడక్కడ హత్యలు గావించుటతో వీరి కార్యాచరణము ప్రారంభమయ్యెను. చైనాదేశమునం దంతటను

దౌర్జన్యములు

విదేశస్థులకు గొప్పభీతి జనించెను. అన్నివైపుల నుండియు పారిపోయివచ్చి విదేశీయులు పికింగు పట్టణముననున్న విదేశ రాయబారుల కట్టడములలో శరణుజొచ్చ

సాగిరి. బాక్సరు విప్లవకారులు త్రోవలో దొరకినవారిని చంపుచుండిరి. తెల్లవారి దేవాలయములను, వర్తకస్థానములను, గృహములను నాశనము జేసిరి. సముద్రములమీద విదేశీయులు పారిపోకుండ పికింగుకును, సముద్రతీరమునకును మధ్యనున్న రైలుమార్గమునంతను పాడుచేసి పికింగుపట్టణములోని విదేశీయులను ముట్టడించుటకు బయలుదేరిరి. త్రోవలోని గ్రామములవారు వీరి కాతిథ్యమిచ్చి యనేకులు వీరితో జేరిరి. ఈ విప్లవకారులు పికింగుకుపోయి యచట విదేశ రాయబారులున్న గృహములను ముట్టడించిరి. జర్మను మంత్రిని, జపాను రాయబారిని ఇంక కొందరు విదేశీయులను హత్యగావించిరి.

విదేశ సైన్యములు

ఇంతలో పీచిలీ సముద్రములోనున్న విదేశ యుద్ధనౌకలు టాకుకోటలవద్ద సైన్యములను దింపెను. హిందూదేశమునుండి గూడ పదునేనువేలమంది సైనికులు దిగిరి. వారు బాక్సరులను ముట్టడించుటకై పికింగుకు బయలుదేరిరి. చైనా ప్రభుత్వమువారు వారిపై యుద్ధమును ప్రకటించిరి. చైనావారికిని విదేశీయులకును చిలీరాష్ట్రము యుద్ధరంగమయ్యెను. పశ్చిమోత్తర రాష్ట్రములలోని విదేశీయులను ముఖ్యముగ తెల్ల మతబోధకులను బాక్సరులు హత్యగావించిరి. ఇంగ్లాండు, ఫ్రాన్సు, జర్మనీ, అమెరికా సంయుక్త రాష్ట్రములు, రుష్యా, జపాను ప్రభుత్వములు కలసి చైనా ప్రభుత్వమును బాక్సరులను ఈ దుండగములకై శిక్షించుటకు గొప్పసైన్యములు బంపిరి. రెండు నెలలలో విదేశప్రభుత్వ సైన్యములు టాకుకోటలను టీఇాట్సీను (Tientsin) పట్టణమును పట్టుకొని 1901 వ

సంవత్సరము ఆగష్టు నెలలో చైనా సేనలను ఓడించి రాజధాని యగు పికింగును వశపర్చుకొని రాజమందిరములనెల్ల నాక్రమించిరి. చక్రవర్తి, రాజమాత, రాజబంధువులు మొదలగు వారందరును రాజధానిని విడచి పారిపోయి సయానుఫు పట్టణమున దాగుకొనిరి. విదేశసైనికులు పికింగునగరమును దోచుకొని పెక్కు దౌర్జన్యములను సలిపిరి. చైనా సేన లోడించబడెను. బాక్స రుద్యమము అణగిపోయెను.

సయానుఫులోనున్న చైనా చక్రవర్తి విదేశ ప్రభుత్వములకు హృదయపూర్వకమైన పశ్చాత్తాపమును తెలియపర్చెను. బాక్స రుద్యమములో చేరిన యుద్యోగస్థులను రాష్ట్రపాలకులను ఉద్యోగములలోనుండి తీసివేసెను. మరి కొందరికి వివిధములగు శిక్షలను విధించెను. వారి రాయబారిని, మంత్రిని బాక్సరులు చంపినందుకు జపాను ప్రభుత్వమునకును, జర్మను ప్రభుత్వమునకును విచారమును వెలిబుచ్చెను. బలహీనుడగు మంచూచక్రవర్తిని సింహాసనభ్రష్టుని చేసి ప్రజాప్రభుత్వమును స్థాపించుట యుక్తమని కొందరు చైనాలో తలచిరి గాని యింతటినుండి విదేశీయులను చక్కగ సంరక్షించుటకును, ఒడంబడికల ప్రకారము నడచుకొనుటకును పూచీబడినచో మంచూచక్రవర్తినే మరల రాజ్యభారమును పూననివ్వవచ్చునని జర్మను చక్రవర్తి సలహా నొసంగెను. మంచూరాజవంశమును తొలగించి ప్రజాస్వామ్యమును స్థాపించినచో వారు మంచూచక్రవర్తులు చేసిన యొడంబడికలను చెల్లించక పోవచ్చునని ఆయన తలచెను. ఇతర ప్రభుత్వములును ఇందుకే

విదేశప్రభుత్వములతో సంధి

అంగీకరించి తమ కిష్టమువచ్చిన షరతులను నిర్ణయించి మంచూ చక్రవర్తికి మరల చైనారాజ్యమును వదలివేసిరి. (1) వారి వారి యుద్యోగస్థుల హత్యలకు పశ్చాత్తాపములను తెలుపుటకు చైనా ప్రభుత్వము ప్రత్యేక రాయబారులను జర్మనురాజధానికిని జపాను రాజధానికిని పంపవలెను, (2) 135 కోట్ల ర్యూప్యములను చైనా ప్రభుత్వము విదేశప్రభుత్వములకు నష్టముక్రింద చెల్లించవలెను, (3) టాకూకోటలను నిర్మూలము గావించవలెను, (4) పికింగు పట్టణమునకును సముద్రతీరమునకును మధ్య విదేశసైన్యము లుండుటకు చైనాప్రభుత్వము సమ్మతించవలెను, (5) పికింగు పట్టణమున విదేశరాయబారులు వారి యుద్యోగస్థులు, సిబ్బంది, పోలీసులు నుండుట కొక విశాలమైన ప్రదేశము (**Foreign Legation**) ను విదేశీయులకు స్వాధీనపర్చవలెను. అందులోనికి చైనా వారు రాగూడదు. ఈ షరతులతో సంధి జరిగెను. అమెరికావారు మాత్ర మచిరకాలములో తమవంతు నష్టపరిహారమును బెట్టి చైనాలో నొక విద్యాలయమును స్థాపించిరి.

## 3

ఇతరచోట్ల బాక్సరుద్యమము జరుగుచున్న కాలములో రుష్యావారికిని చైనావారికిని మంచూరియాలో కలహములు కలిగెను. రుష్యావారిదేవాలయమును రైలువేలు ఇతరఆస్తులు పాడుచేయబడెను. మంచూరియాలోనికి రుష్యా వారు తమ సేనలను తెచ్చిరి. బాక్సరుద్యమము అణగిపోయిన తరువాత కూడ రుష్యాసేనలు

మంచూరియాను రుష్యావారు వదలలేదు

మంచూరియాను వదలలేదు. వివిధదేశ ప్రభుత్వముల మధ్య జరిగిన యేర్పాటు ప్రకారము బాక్సరు కలహము నవకాశము తీసికొని చైనాలో నెవరును రాజ్యమును ఆక్రమించ గూడదు. కాని రుష్యావారు ఆ సూత్రము చైనాకు మాత్రమే వర్తించునుగాని మంచూరియాకు వర్తించనేరదని చెప్పిరి. మంచూరియాలోని యుత్తరప్రాంతము రుష్యాయొక్క పలుకుబడిక్రింద నుండునటులను, మంచూరియాలో రైళ్లను నిర్మాణము గావించు స్వతంత్రము కేవలము రుష్యావారికే చెందునటులను, రుష్యావారికిగాక మరి యే విదేశ ప్రభుత్వమునకును మంచూరియా, మంగోలియా, టిబెటు దేశములలో రైళ్ళువేయు, గనులు త్రవ్వు హక్కులు చైనాప్రభుత్వము కలుగజేయకుండ నుండునటులను, ఉత్తరమున చైనావారి సైన్యమును నౌకాదళమును రుష్యావారు తరిబీతుచేయునటులను, రుష్యా చైనాలమధ్య రహస్యపు టొడంబడిక జరిగెననికూడ తెలియవచ్చెను. ఇందుకు జపానుకు పట్టరాని ఆగ్రహము కలిగెను. మంచూరియాలో తాముకూడ నెట్లైన దూరవలెనని అచటి గనుల, వ్యవసాయభూముల, ముడి పదార్థముల, అడవుల లాభములను తాముకూడ పొందవలెనని జపానుయొక్క కోరిక. మంచూరియా ఒకసారి రుష్యాకు లోబడినచో తమ ఆశలన్నియు క్రుంగిపోవలసినదే. జపాను వెంటనే రహస్యపు టొడంబడికసంగతి నిజమా యబద్ధమా యని రుష్యా నడిగెను. రుష్యా యట్టిది జరుగనేలేదనెను. రుష్యాయొక్క రాజ్యవ్యాపకము ఆంగ్లేయుల భరతవర్ష సామ్రాజ్యమున కపాయకరమని ఆంగ్లేయుల యుద్దేశ్యము. 1902 వ

సంవత్సరమున రుష్యాకు పోటీగ ఆంగ్లేయ జపానులమధ్య పరస్పర సహాయమునకై యొడంబడిక జరిగెను. రుష్యా ఫ్రాన్సుతో యొడంబడిక చేసికొనెను. జపాను తన సైన్యములను నౌకా దళమును నవీనపద్ధతులమీద బాగుగ నేర్పాటుచేసికొనియున్నది. ఆంగ్లేయుల సానుభూతితో తాను రుష్యా నొకదెబ్బ కొట్ట గలుగుదునని యువ్విళ్ళూరుచున్నది. రుష్యాను ఓడించినచో తమ దేశమునకు ప్రపంచజాతులలో గౌరవము ప్రతిష్ఠ కలుగునని జపాను రాజకీయవేత్తలు తలచిరి. వెంటనే మంచూరియాను వదలిపోవలెనని జపాను ప్రభుత్వమువారు రుష్యావారికి తెలియ పరచిరి. మూడుసార్లుగ తమయావత్తుసైన్యమును మంచూరియా నుండి మరలించెదమని రుష్యావారు జవాబు చెప్పిరి. ఒకసారి సైన్యము తీసివేయబడెను. రెండవసారి వచ్చునప్పటికి మంచూ రియాను, టిబెటును, చైనా రుష్యాలు కలసి పాలించుట కొక పరిపాలనా సంఘమును నియమించవలెనని రుష్యా కోరెను. మంచూరియా టిబెటుల పరిపాలనలో రుష్యాకు జోక్యముండుట చైనా కిష్టమయినను గాకున్నను జపానుకు మాత్రము బొత్తుగా యిష్టములేదు.

కావున జపానువారు కోపోద్దీపితులై రుష్యామీద 1904 వ సంవత్సరము ఫిబ్రేవరి 8 వ తేదీన యుద్ధమును ప్రకటించిరి. ఈ యుద్ధమునందు జపాను అత్యద్భుతమగు దేశాభిమానమును

జపానుకు రుష్యాతో యుద్ధము

శౌర్యమును ప్రదర్శించెను. ఈ యుద్ధములో చైనా తటస్థముగనుండెను. ఇంగ్లాండు జపాను నందును, ఫ్రాన్సు రుష్యాయందును సాను

భూతిని కలిగియుండెను. జపానువారి సైన్యములు కొరియా గుండ పోయి మంచూరియాలోని "యాలూ" వద్ద రుష్యావారి నోడించెను. జపానువారి పోర్టు ఆర్థరు ముట్టడి చరిత్రాత్మక మైనది. రుష్యావారు నౌకాదళమును నల్లసముద్రముగుండ సూయజు కాలువ మీదుగ హిందూదేశమును చుట్టి మంచూరియా వద్దకు పంపవలెను. అటుల పంప ప్రయత్నించగా దానిని సూయజు కాలువగుండ రాకుండ బ్రిటిషువా రడ్డుతగిలిరి. మంచూరియాలో జరిగిన యుద్ధములలో జపానుసైన్యములు రుష్యాసేనల నోడించెను. రుష్యావారి యుద్ధనౌకలను జపాను ముంచివేసెను. రుష్యా బహుగొప్పజాతియైనను నవయౌవనోత్సాహభరితమై బాగుగ తరిబీయతుచెందిన జపానుచే నోడింపబడెను. 1905 వ సంవత్సరము జూలై నెలలో అమెరికా వారి సహాయమున రుష్యా జపానుల మధ్య (**Portsmouth**) "పోర్ట్సుమతు" సంధిజరిగెను. (1) కొరియాలో జపానుయొక్క ఆర్థిక, రాజకీయ, సైనికపలుకుబడిని రుష్యా అంగీకరించెను. (2) చైనా వారినుండి లయోటన్గు, పోర్టుఆర్థరు, డాల్నే ప్రాంతములకు రుష్యావారు పొందిన కౌలుహక్కు జపానువారికి యిచ్చివేయబడెను. పోర్టుఆర్థరునుండి చాంగుచంవరకును రుష్యావారు వేసిన రైలుమార్గమును దానికిరుప్రక్కల రుష్యావారు సంపాదించిన గనులహక్కులును జపానుకు స్వాధీనపర్చబడెను. (3) ఈ యుద్ధ కాలమున ఆంటంగునుండి ముక్డన్ (**Mukden**) వరకును జపాను వారు వేసిన రైలుమార్గము జపానువారిక్రిందనే యుండవలెను. (4) రుష్యావారును జపానువారును వెంటనే మంచూరియాను

ఖాళీచేసి లేచిపోవలెను. కాని మంచూరియాలోని యొవరిరైలు మార్గముల పొడుగునను వారు సాయుధులగు భటులనుంచుకొనవచ్చును. (5) ఈ షరతులకన్నిటికిని చైనాప్రభుత్వముకూడ అంగీకరించి విదేశీయులు వర్తకము చేసికొనుటకై మంచూరియాలో ననేకరేవులను తెరచెను. (6) జపానుకుత్తరముననున్న సఖలిన్ ద్వీపములో సగభాగమును జపాను స్వాధీనమును పొందెను. ఇందువలన కొరియాలోను, దక్షిణమంచూరియాలోను, జపాను యొక్క అధికారము పలుకుబడి వర్తక సౌకర్యములు పూర్తిగ స్థాపితములయ్యెను. జపాను యొక్క అంతర్జాతీయ ప్రతిష్ఠ బాగుగహెచ్చి ప్రపంచములోని ప్రధానప్రభుత్వములలో నొకటిగ జపాను పరిగణింపబడసాగెను.

జపానుకును పాశ్చాత్య ప్రభుత్వములకును సంధులు

పాశ్చాత్య ప్రభుత్వము లొకటివెంట నొకటి జపానుతో సంధులు చేసికొనెను. చైనాయొక్క రాజకీయ స్వతంత్రమును చైనాలో నన్నిజాతులవారికిని సమానమగు వర్తకావకాశములను గుర్తించుచు, ఆంగ్లేయుల హిందూదేశ సామ్రాజ్యమును, జపానుకు మంచూరియా కొరియా దేశములలోగల ప్రత్యేకహక్కులను సంరక్షించుకొనుటలో పరస్పరసహాయము గావించుకొనుటకై, 1904 వ సంవత్సరమున ఆంగ్లేయ జపానుప్రభుత్వము లొకసంధిని గావించికొనిరి. ఈ సంధి మరల 1911 వ సంవత్సరమున ధృవపరచుకొనబడెను. 1910 వ సంవత్సరముననే జపానువారు కొరియా ప్రధాన మంత్రికి విశేషమగు లంచమిచ్చి తమ సంరక్షణలోనున్న కొరియారాజును వత్తిడిచేసి కొరియారాజ్యపాలనము తమ ఫక్ష

మున విడుదలచేయించుకొని కొరియాను జపానువారి పాలనము క్రిందకు తెచ్చుకొనిరి. కొరియా జపానువారి సామ్రాజ్యములో భాగమయ్యెను. ఇటుల కొరియాను జపానుక్రింద జేర్చుకొనిన దినముననే యొక కొరియా యువకుడు జపానుయొక్క ప్రధాన రాజకీయ ధురంధరుడగు ఐటో ప్రభువును హత్య గావించెను. అప్పటినుండియు కొరియాలో జాతీయోద్యమము బయలుదేరి, కొరియా దేశాభిమానులు దేశ స్వతంత్రమునకై తరుచుగ జపానుపై తిరుగుబాటులు గావించుటయు, జపానువారు నిర్దాక్షిణ్యముగ నా తిరుగుబాటుల నణచుటయు జరుగుచున్నది. 1911 వ సంవత్సరమున ఆంగ్లేయులకును జపానువారికిని జరిగిన సంధిలో ఆంగ్లేయుల హైందవసామ్రాజ్యమును జపానువారి కొరియా సామ్రాజ్యమును కాపాడుకొనుటకును, చైనా మంచూరియాలలోను, తూర్పుఆసియాలోను నుభయులకునుగల లాభములను సంరక్షించుకొనుటకును,పరస్పరసహాయము గావించుకొనవలెనని వ్రాసికొనబడెను. హిందూదేశమును కాపాడుకొనుటకు ఆంగ్లేయులు హిందూదేశపు సరిహద్దులలో పుచ్చుకొను చర్యకంతకును జపానువారు హర్షించి అవసరమైనచో తోడ్పాటు గావించుటకుకూడ నీ సంధిలో నంగీకరించబడినది. హిందూదేశపు పశ్చిమోత్తర సరిహద్దు వ్యాపకము, ఈశాన్య సరిహద్దుయొక్క రక్షణము, ఆఫ్ఘనిస్థానము టిబెటు దేశములలో నాంగ్లేయుల పలుకుబడి, యీసందర్భములలో చైనా, సయాం ప్రభుత్వములతో సంబంధములు, హిందూదేశపు సరిహద్దుల సంరక్షణ చర్యలలో చేరియున్నవి.

ఇటులనే ఫ్రెంచివారి ఇండోచైనా సామ్రాజ్యమును కాపాడుటకును జపానుయొక్క కొరియా, మంచూరియాలలోని హక్కులను సంరక్షించుకొనుటకును 1907 వ సంవత్సరమున ఫ్రాన్సు జపానుల మధ్య సంధి జరిగినది. ఆ సంవత్సరమే చైనా స్వతంత్రముగ నుండుటకును చైనాలో నన్నిజాతులకును సమానమైన వర్తకావకాశము లుండుటకును, ఇదివరకు జరిగిన యొడంబడికలవలనను, ఏర్పాటులవలనను జపానుకు కొరియాలోను మంచూరియాలోను, రుష్యాకు మంచూరియాలోను, కలిగి యున్న ప్రత్యేకభాగముల నన్నిటిని పరస్పర సంరక్షణ గావించుకొనుటకును, జపాను రుష్యాల మధ్య సంధి జరిగెను.

అమెరికా జపానుయొక్క హక్కుల నంగీకరించినది

చైనాప్రభుత్వమును వత్తిడిచేసి మంచూరియాలో నుత్తరవైపున రుష్యావారును, దక్షిణభాగమున జపానువారును అనేక హక్కులను సంపాదించిరి. ఉత్తర మంచూరియాలో రుష్యాయొక్క పలుకుబడిని, దక్షిణమంచూరియాలో జపానుయొక్క పలుకుబడిని, అంగీకరించుచు రుష్యా జపాను చక్రవర్తులు 1910 వ సంవత్సరమున మరల సంధిని చేసికొనిరి. చైనా రాజకీయముగ స్వతంత్రముగ నుండుటయును, అమెరికాతో సహా అన్నిజాతులవారికిని చైనాలో సమానమగు వర్తకావకాశము లుండుటయును, అను నీ రెండు సిద్ధాంతములను జపాను అంగీకరించునటులను చైనా సామ్రాజ్యమునకు జపాను ప్రక్కదేశమగుటచేసి జపానుకు చైనా సామ్రాజ్యములో స్వభావముగ గలిగినట్టియు, మంచూరియా కొరియాలలో జపాను సంపాదించుకొన్నట్టియు ప్రత్యేకలాభము

లను, సంబంధములను, హక్కులను అమెరికావారంగీకరించు నటులను, 1908 వ సంవత్సరమున అమెరికాసంయుక్తరాష్ట్రము లకును జపానుకును సంధి జరిగెను. జపాను ఇంగ్లాండు మొదలగు దేశములన్నియు కలసి తమను చైనాలో వర్తకము చేసికొను టకు అడుగుపెట్టనివ్వరను భయము అమెరికాకు ఆ కాలము నందు కలిగినందున వారి ప్రత్యేకలాభము లన్నిటికిని అమెరికా యంగీకరించుచు వచ్చినది. చైనాలో విదేశీయుల యాధిక్యత స్థాపితమగుటకును వర్తకము మూలమున చైనాయొక్క సంపద విదేశములకు ప్రవహించుటకును అమెరికాకూడ తోడ్పడినది. బాక్సరుద్యమము నణచుటలో నితర విదేశ ప్రభుత్వములతో కలసి అమెరికా పనిచేసినది. 1914 మొదలు 1918 వరకు జరిగిన ప్రపంచ యుద్ధమునకు పూర్వము ప్రపంచమునకు ఇంగ్లాండు పెట్టుబడి దారుగనుండి మొదటిస్థానమును వహించినది. ప్రపంచయుద్ధము నకు పిమ్మటనే అమెరికాకు ప్రపంచములో అనన్యసాధారణమగు నుత్తమస్థానము కలిగినది. అటుపిమ్మట అమెరికాయే ఇంగ్లాండు మున్నగు ప్రపంచజాతులకెల్ల పెట్టుబడిదారైనది. కావున ప్రపంచ యుద్ధమునకు పూర్వము అమెరికా తన రాజనీతిని ఇతరజాతులచే పూర్తిగ నవలంబింప చేయగలిగిన స్థితిలోలేదు.

## 4

బాక్సరు విప్లవము నణచివేయగనే 1901 వ సంవత్సరమున చైనాతో జరిగిన పోర్ట్సుమతు సంధిలో ఇంగ్లాండు, ఫ్రాన్సు, రుష్యా, జపాను, జర్మనీ, అమెరికా, ఆస్ట్రియా, ఇటలీ, బెల్జియం,

చైనాలో విదేశీయుల పలుకుబడి హెచ్చెను

హాలండు, స్పెయిన్ దేశముల ప్రభుత్వములు సంతకములు చేసినవి. చైనాప్రభుత్వము నష్టము క్రింద నివ్వవలసిన సొమ్మును ఎగుమతి దిగుమతి సుంకములనుండియు, ఉప్పుపన్నునుండియు ఇచ్చునటుల యొడంబడిక జరిగెను. ఎగుమతి దిగుమతి సుంకములతోపాటు ఉప్పు పన్నునుకూడ ఆంగ్లేయుడగు ఇన్‌స్పెక్టరు జనరలు వసూలుచేయు నటుల నిర్ణయించబడెను. ఆయనక్రింద ప్రతిరాష్ట్రములోను ఆ శాఖయొక్క ప్రధానోద్యోగిగ నొకవిదేశీయుడు నియమింప బడవలెననికూడ నిబంధనచేసిరి. రహదారిగేట్లను పూర్తిగ తీసివేసి విదేశవర్తకుల సరకులతోపాటు స్వదేశవర్తకుల సరకులమీద నూటికి రెండున్నర చొప్పునమాత్రమే సుంకము వసూలుచేయు హక్కును చైనా యడుగగ అమెరికా సమ్మతించెను. కాని పద మూడు విదేశప్రభుత్వము లేకగ్రీవముగ నంగీకరించినగాని విదేశ స్థులకు సంబంధించిన యెట్టిహక్కును మార్చుటకు వీలులేక పోయినది. కావున మామూలుప్రకారమే స్వదేశీయుల సరుకుల మీద రహదారి సుంకము లధికముగ పుచ్చుకొనుచుండగ విదేశీ యులుకొనిపోవుచున్న సరుకులమీద నూటికిరెండున్నర మాత్రము వసూలు చేయుచుండిరి. ఎట్టి దుర్గతి ? చైనాదేశములో చైనా దేశీయులు చెల్లించు పన్నులను విదేశస్థులు చెల్లించు పన్నులతో సమానముగ నుండునటుల తగ్గించుటకుకూడ విదేశీ ప్రభుత్వముల అంగీకారము కావలెనట ! చైనావారు పాశ్చాత్యుల కను గుణముగ క్రిమినలు చట్టములను ఇతర శాసనములను చెర సాలలను విచారణపద్ధతులను సంస్కరించుకొనినచో ఇతర అన్ని

ప్రభుత్వములును ఒప్పుకొనిన యెడల తమ్ము న్యాయ విచారణ హక్కులను వదలుకొందుమని ఇంగ్లాండు, అమెరికా, జపాను ప్రభుత్వములవారు అనుమతించిరిగాని తక్కిన ప్రభుత్వములు ఒప్పుకొనలేదు.

విదేశీయుల న్యాయవిచారణ హక్కులు పమాత్రమును పోలేదు. చైనాలోని యొడంబడిక రేవులలోని విదేశస్థుల కొరకు ప్రత్యేకించబడిన విశాలమగు ప్రదేశములలో ననేకమంది చైనా వారు విదేశోద్యోగుల ఆహ్వానముపైనను అనుమతి తోడను వచ్చి కాపురమున్నారు. గుమాస్తాలుగ, కూలీలుగ, వర్తకులుగ, పారిశ్రామికులుగ, పనివాండ్రుగ ననేకవృత్తులు కలిగి చైనావా రచట జీవించుచున్నారు. అచట విదేశస్థు లేర్పరచిన మ్యునిసిపలు పన్నులను చెల్లించుచున్నారు. గాని పన్నులు చెల్లించు చైనా వారికి ఓట్లు లేవు. మ్యునిసిపలు పాలనముతో సంబంధములేదు. మ్యునిసిపలు పాలనమంతయు విదేశీయులవలన నెన్నుకొనబడ్డ సంఘముల క్రింద నున్నది. పికింగు నగరమున విదేశరాయబారులు కోటలు కట్టుకొనవచ్చును. సైన్యముల నుంచుకొనవచ్చును. అచటికి చైనావారు పోవుటకే వీలులేదు. మరియు పికింగు నకును సముద్రమునకును మధ్యను, పికింగు—ముక్డెన రైలు పొడుగునను విదేశ సైన్యము లుండవచ్చును. చైనాయొక్క రేవుల కోస్తావర్తకమంతయు విదేశ పడవలచే నడుపబడుచు వచ్చినది. విదేశ ప్రభుత్వములు అనేకసార్లు చైనా ప్రభుత్వమును తొందరచేసి అప్పులిచ్చి రైళ్ళు వేయించసాగిరి. ఆ రైళ్ళు వేయు కాలములోనేగాక తరువాతకూడ వాటి యాజమాన్యమంతయు

విదేశ ఇంజనీర్ల యొక్కయు నుద్యోగస్థుల యొక్కయు చేతులలో నుండెను. బుద్ధిపూర్వకముగ తీసికొన్నను బలవంతముగ తీసికొన్నను చైనా ప్రభుత్వము విదేశీయులనుండి తీసికొనిన అప్పులకు కూడ సుంకములను, ఉప్పు పన్నును, ప్రథమ జవాబుదారి చేయుచు వచ్చినది. ఇటులే బాక్సరుద్యమము అణగిన పిమ్మట విదేశీయుల పలుకుబడి, ధనార్జనము, అధికారము, ఆధిక్యము, హక్కులు, ఎక్కువయ్యెనేగాని ఏమాత్రమును తగ్గలేదు. 1904 వ సంవత్సరమున టిబెటుదేశముపై హిందూదేశము నుండి బ్రిటిషువారి సైన్యములు దండు వెడలి టిబెటును బ్రిటిషువారి పలుకుబడి ప్రదేశముగ గావించుకొనిరి.

## 5

తమ సైన్యములను, రాజ్యాంగపద్ధతులను సంస్కరించనిచో చైనాసామ్రాజ్యము తెల్లజాతులచేతను, జపానుచేతను పూర్తిగ ఆక్రమించబడక తప్పదని రాజమాతగూడ గ్రహించెను. జపాను నూతనపద్ధతుల నవలంబించి కొలది వత్సరములలో నెటుల బలవత్తరమైన జాతియై పాశ్చాత్య ప్రభుత్వమగు రుష్యా నెటుల నోడించగలిగెనో ఆమెకు గోచరమయ్యెను. క్వాంఘుసు చక్రవర్తిని నిర్బంధము నుంచి వదలెను. రాజమాతయు చక్రవర్తియు కలసి కొన్ని సంస్కరణములను గావింప బూనుకొనిరి. 1905 వ సంవత్సరమున పాశ్చాత్యదేశములకు బోయి అచటి రాజ్యాంగపద్ధతులను తెలిసికొని యొక అభివృద్ధికరమైన రాజ్యాంగ విధానమును చైనాకు

చైనాచక్రవర్తి సంస్కరణములను ప్రారంభించెను

తయారుచేయు సూచనల నిచ్చుటకుగాను ఒక యుద్యోగస్థుల యుపసంఘమును యూరపుఖండమునకు పంపిరి. పాఠశాలలలో కేవలము భాషను నీతిని మతమును గరపు పురాణవాచకములకు బదులు ప్రకృతిశాస్త్రములను దేశచరిత్రలను ఆర్థికవిషయములను కూడ నేర్పవలెనని శాసించిరి. పికింగునగరముననున్న విశ్వవిద్యాలయమును అభివృద్ధిచేసిరి. విద్యార్థివేతనము లిచ్చి విద్యార్థులను అమెరికాకును, యూరపుకును, జపానుకును విద్యాభ్యాసమునకై పంపసాగిరి. చైనా విద్వాంసులు కొందరు పాశ్చాత్య గ్రంథములను చైనాభాషలోనికి భాషాంతరీకరణము చేసిరి. పాశ్చాత్య పద్ధతులమీద చైనా సైనిక నిర్మాణమును గావించుటకును, రైళ్లను వేయించుటకును ప్రయత్నించిరిగాని రైళ్ళను వేయించుటకొరకు పాశ్చాత్యులవద్ద ఋణములను చేసిరి.

యూరపుఖండమును చూచివచ్చిన యుపసంఘము క్రమక్రమముగా చైనా ప్రభుత్వమునందు ప్రజలకు బాధ్యతను హెచ్చించుట అవసరమని నివేదికను వ్రాసిరి. అచిరకాలములోనే నూతనరాజ్యాంగ సంస్కరణములను ప్రసాదించెదమని రాజమాత ప్రకటించెను. కాని 1908 వ సంవత్సరమున చక్రవర్తియును రాజమాతయును మరణించిరి. ఆరు సంవత్సరముల యీడుగల 'పూయి' అను నొక పసిబాలుడు చక్రవర్తియై ఆయన సవతితల్లి లంగుయూదేవి సంరక్షకురాలుగ రాజ్యభారమును వహించెను. మరల చైనాప్రభుత్వము బలహీనమయ్యెను. కొందరు విదేశీయులును, చైనా యుద్యోగస్థులును కుట్రలుచేసి నూతనసంస్కరణల కడ్డుతగిలిరి. మంచూసామ్రాజ్యము కూలిపోయి చైనాప్రభుత్వము

అమెరికా ప్రభుత్వమువలె సంపూర్ణమగు ప్రజాస్వామ్యమైనగాని చైనాదేశమునకు లోపలను, బహిః ప్రపంచములోను మోక్షము లేదని చైనాలోని యోచనగలవారందరకును దృఢనమ్మకము కలిగెను. అదివరకే కొన్ని సంవత్సరముల నుండియు చైనా దేశములో ముఖ్యముగ దక్షిణ ప్రాంతమున డాక్టరు సన్‌యటు సేనుయొక్క నాయకత్వమున మంచూ రాజరికమును కూల ద్రోసి సంపూర్ణ ప్రజాస్వామిక ప్రభుత్వమును స్థాపింపవలెనని ప్రయత్నించుచున్న జాతీయోద్యమము వ్యాపించుచుండెను. ఆ యుద్యమనాయకు లొక గొప్ప తిరుగుబాటును లేవదీసి 1912 వ సంవత్సరము జనవరి 1 వ తేదీన చైనాచక్రవర్తిని రాజ్య భ్రష్టుని గావించి చైనాదేశమును సంపూర్ణమగు ప్రజాస్వామికము (**Republic**) గ గావించిరి. చైనా జాతీయోద్యమకథను రాబోవు అధ్యాయములందు వివరించెదము.





సన్ యట్ సేన్

# చైనా విప్లవము

## చతుర్థాధ్యాయము

### సన్‌యటుసేను - ప్రథమ విప్లవ జయము

### 1

నవీన చైనా స్థాపకుడు

చైనా జాతియొక్క స్వతంత్రోద్యమ చరిత్ర సన్‌యటు సేనుయొక్క జీవిత చరిత్రతో సమైక్యమై యున్నది. ఆయన యొక్క మహోన్నతమైన ఆదర్శములు, సంపూర్ణమగు ఆత్మ సమర్పణము, పరమపావనమైన జీవితము, అకుంఠిత దీక్ష, యావజ్జీవకృషి, నవీన చైనాజాతిని సృష్టించినవి. దైన్యమునుండి సాహసోత్సాహములును, మృత్యువు నుండి జీవనమును కలుగజేసినవి. ఈ కర్మయోగిపుంగవుని చైనా దేశీయులెల్లరును అవతారమూర్తిగ పూజించుచున్నారు.

బాల్యము

ఈ మహనీయుడు క్రీ. శ. 1866 వ సంవత్సరము నవంబరు 12 వ తేదీన చైనాదేశములోని క్వాఁగుటంగు రాష్ట్రమునకు చేరిన హ్యాయంగుషాన్ జిల్లాలోని చాయిహోంగు అను చిన్న గ్రామమున నొక బీదక్రైస్తవ కుటుంబమున జననమొందెను. ఆ గ్రామము కాన్‌టన్ నగరమునకు ముప్పదిమైళ్ళ దూరమున నున్నది. ఆయన తండ్రియగు సఁటోచన్ ఆంగ్లేయ క్రైస్తవ సంఘముక్రింద బైబిలుగ్రంథమును ప్రజలలో పంచిపెట్టుచున్నందుకు స్వల్పమగు వేతనమును

పొందుచుండెను. కొలదిగా భూమి కలిగి దానిని సేద్యము చేసి కొనుచు నొక పూరియింటిలో నివసించుచుండెను. ఆ పూరియింటి లోనే యీ శిశువు జననమొందెను. ఈ శిశువునకు 'యటుసేను' అనగ శాంతిదూత యనుపేరును తల్లిదండ్రులు పెట్టిరి. సన్ యను నది కుటుంబనామము. సన్ యటు సేనును పదవయేట గ్రామము లోని బడికి విద్యాభ్యాసమునకు పంపి వడ్రంగిపనిని కూడ నేర్పించిరి. కుటుంబముయొక్క పొలములను సేద్యముచేయుటలో తండ్రి కీ బాలుడు సహాయము చేయుచుండెను. కుటుంబమువా రందరును తేయాకు పుచ్చుకొనువేళ విదేశస్థులు తమ మాతృదేశముపై చేయుచున్న దండయాత్రలను, దౌర్జన్యములను గూర్చిన కథలను చెప్పుకొనుచుండగ నా బాలుడు మిగులశ్రద్ధతో వినుచుండెను. ఒక క్రైస్తవుడు తాను ఏసుక్రీస్తు యొక్క సోదరుడనని చెప్పి పది సంవత్సరము లెడతెగకుండ తిరుగుబాటును సాగించిన సంగతిని ఆలకించెను. ఈ కల్లోలముల మధ్య నెటుల విదేశస్తులు దేశములో జొరబడి పికింగువరకును జయించి తమ చక్రవర్తి కవమానమును కలుగచేసిరో ఆ యుదంతమును, తమ ప్రక్కనున్న ఇండో చైనాలో ఫ్రెంచి వారెటుల అక్రమముగ నాక్రమణలు చేసిరో ఆ వృత్తాంతమును, బాలుడగు సన్ యటుసేను బాగుగా నాలకించెను. ఈ కథలను వినినకొలదియు చైనా దేశస్థులను విదేశీయులు కలుగ జేయుచున్న అవమానములనుండి కాపాడుటకు చైనాచక్రవర్తి యెంత దుర్బలుడుగా నున్నాడో యా బాలుని కోమల హృదయమునందు దృఢముగా నాటుకొనెను. తండ్రి యా

బాలుని కాన్‌టన్‌కు తనవెంట గొనిపోయినపుడెల్ల ఆతని తెలివి తేటలకును చురుకుదనమునకును సంతోషించిన ఆంగ్లేయ క్రైస్తవ స్త్రీలు కొన్ని ఇంగ్లీషు పదముల నాబాలునికి నేర్పుచుండిరి.

ఆతని యన్న హవాయి (Hawii) ద్వీపములలోని హానొలూలునందువర్తకుడుగనుండి పదమూడవయేట సన్‌యటు సేనును ఆంగ్లవిద్య నభ్యసించుటకై యచటికి గొనిపోయెను.

విద్యాభ్యాసము

అక్కడ అయిదు సంవత్సరములలో బాలుడు చదువుకొనెను. కుశాగ్రబుద్ధియని మెచ్చుకొనబడి 'వెన్' అనగ 'పండితుడు' అను బిరుదమును పొందెను. చాల కాలము సన్‌వెన్ అనియే ఆయనను పిలచిరి. అచటనుండగ క్రైస్తవమతమును స్వీకరించెను. బైబిలును శ్రద్ధగా చదువుచుండెను. పదునెనిమిదవయేట మరల స్వదేశమునకు వచ్చెను. హానొలూలులో నున్నకాలమున సన్‌యటుసేను విదేశీయ వేషభాషలను అభ్యాసములను అవలంబించుచుండెనని ఆతని యన్న తమతల్లికి పిర్యాదుగా వ్రాయుచుండెను. అందుమీద తల్లి సన్‌యటుసేనును మందలించుచుండెను. మతమునందు క్రైస్తవులైనను, నడవడికయందు స్వదేశీయులుగ నుండవలెనని వారి కుటుంబమునకు పట్టుదల గలిగియుండెను.

పదునెనిమిదేండ్ల వయసున సన్‌యటుసేను హవాయి ద్వీపమునుండి విద్యను పూర్తిచేసికొని చైనాకు చేరినపుడు జరిగిన యొక విషయము ఆతని మనమునందు శాశ్వతముగ నాటుకొని భావి ప్రవర్తనకు పునాదిని వేసెను. కాన్‌టన్ రేవులో నోడ దిగగనే యాయన యొక్కయు ఆయనతోడి

చైనా దేశీయులగు బాటసారుల యొక్కయు సామానుల నన్నిటిని ఆంగ్లేయ సుంకపు టుద్యోగస్తులు ఎండలో నిలువబెట్టి పరిశోధించిరి. తమతో దిగిన తెల్లబాటసారులను మాత్రము కడు మర్యాదగా చూచి తనికీ చేయకుండగనే పోనిచ్చిరి. తనకును, తన దేశీయులకును తమ దేశములో విదేశీయులకన్న అమర్యాద నైచ్యస్థితి కలుగుట ఆయన మనమును మిగుల బాధింపసాగెను. స్వగ్రామముచేరి యా విషయములను గూర్చి విశేషముగ యోచింపసాగెను. ఆ సంవత్సరమే మంచూ చక్ర వర్తులు ఫ్రెంచివారిచే నవమానకరముగ నోడింపబడి ఆనాం (Anaam) దేశమును ఫ్రెంచివారికి స్వాధీనపరచిరి. అట్టి చక్ర వర్తులు తమ ప్రజలను విదేశీయుల దండయాత్రలనుండియు, ఆక్రమణలనుండియు కాపాడగలుగుట యెటులని ఆయన ప్రశ్నించెను.

కొద్దికాలము తన స్వగ్రామమున గడపి ఆయన మరల విద్యాభ్యాసమునకై హాంకాంగు (Hongkong) ద్వీపమున కేగి యచట నొక విద్యార్థి వేతనమ్మును పొందెను. అచటి 'ఇంపీరియల్ బెనెవెలెన్సు ఎకడమీ' యందు రెండు సంవత్సరములు చదివి పట్టపరీక్షయందు మొదటివాడుగ కృతార్థుడయ్యెను.

వైద్యవిశారదుడు

అచటనే 1887 వ సంవత్సరమున డాక్టరు జేమ్సు కాణ్ట్లీయను నాంగ్లేయ మతబోధకు డొక పాశ్చాత్య వైద్యకళాశాలను స్థాపించగ నందు సణయటుసేను విద్యార్థిగ చేరి అయిదు సంవత్సరములు విద్య నభ్యసించి 1892 వ సంవత్సర మున వైద్యవిశారదుడుగ నుత్తీర్ణుడయ్యెను. ఇంక ముగ్గురు

విదేశములలో చదివివచ్చిన విద్యార్థులతో కలసి చైనా సామ్రాజ్యమును నవీనపద్ధతులమీద మార్చవలెననియు లేనిచో కూలద్రోసి సంపూర్ణ ప్రజాస్వామ్యమును స్థాపింపవలెననియు రాత్రింబవళ్ళు యోచింపసాగెను. ఆ నలుగురు విద్యార్థులును, ఇతర విద్యార్థులచే 'తిరుగుబాటుదారులని' పిలువబడుచు వచ్చిరి. తక్కిన ముగ్గురును కాలక్రమమున జాతీయోద్యమమునుండి జారిపోయిరి. వారిలో సన్‌యటుసేను ఒక్కడే తుదివరకును నిలచి చైనా జాతీయాభ్యుదయమునకై యావజ్జీవము కృషి సలిపెను. దేశసేవకు ఖర్చులకొరకు వైద్యవృత్తివలన కొంతసొమ్మును సంపాదించవలెనని యాయన మాకోపట్టణమునకు పోగ నచటి పోర్చుగీసు వైద్యులాపట్టణమున చైనాదేశీయులెవరును వైద్యులుగ నుండగూడదని నిషేధాజ్ఞను పుట్టించిరి. అందుమీద నాయన కాంటనుపట్టణమున స్థావర మేర్పరుచుకొని వైద్యుడుగ పనిచేయసాగెను. ఒక సంవత్సరము లోపల నీ యువకుడగు డాక్టరు ప్రజానురాగమును పొంది నాలుగుచోట్ల వైద్యాలయములను స్థాపించి పనిచేయుచుండెను. కాని రోగులకు చికిత్స చేయుచున్నపుడుకూడ ప్రపంచములోకెల్ల పురాతన నాగరికతను గలిగినట్టియు, పెద్దదయినట్టియు జాతికి కోల్పోయిన స్థానమును మరల కలుగచేయు యోచనలలోనే యాయన మనస్సు మగ్నమైయుండెను.

ఆయనకు త్వరలోనే యొక యాలోచన తట్టెను. ఒక దినమున నొక యువడగు వర్తకుని వెంటగొని సముద్రముమీద పదునారువందల మైళ్ళ దూరము పడవలో ప్రయాణముచేసి

మంచూసామ్రాజ్యమును కూలద్రోయవలెనను నిశ్చయము

టీంట్సిన్ నగరమును చేరెను. అచట చైనాను పాలించుచున్న రాజమాతయొక్క ప్రధాన మంత్రియగు లీహంగుచాంగు ప్రభువు నివసించు చున్న గొప్ప సౌధములో ప్రవేశించి ఆయనయెదుట నిలచెను. ముప్పదిసంవత్సరములనుండి చైనాసామ్రాజ్యమును పాలించుచు యూరపురాజులనుండి నజరానాలను పొందుచున్న యా వృద్ధ రాజకీయవేత్త కీ యిరువదియేడువత్సరముల డాక్టరు సామ్రాజ్యము నెటుల సంస్కరింపవలెనో సలహానిచ్చెను. ఈ యువకుని సాహస మునకు మన్నించి క్రొత్తరాజనీతి నవలంబించుటకు తాను వృద్ధుడ నగుటవలన శక్తిచాలదని ఆయన వేళాకోళముగ చెప్పి పంపి వేసెను. సన్‌యటుసేనుయొక్క సాహసకృత్యమును గూర్చి చైనాలో ముచ్చటించి యాశ్చర్యపడనివారు లేరు. ఆయన అందరి దృష్టి నాకర్షించెను. ఆ వృద్ధమంత్రియొక్క నిర్లక్ష్యము మంచూ సామ్రాజ్యమును కూకటివేళ్ళతో కూల్చివేయవలెనను సన్‌యటు సేనుయొక్క సంకల్పమును గట్టిపరచెను. మంచూసామ్రాజ్యము మంత్రులతోడను, ఉద్యోగస్తులతోడను నాశనముగానిది చైనా జాతికి మోక్షము గలుగనేరదని ఆయన తీర్మానించుకొనెను. ఆయన మరల తన మిత్రునితోకూడ కాంటన్ నగరము చేరెను.

## 2

ఆ కాలమున మంచూసామ్రాజ్యమును పారద్రోలవలెనను సంకల్పముగల రహస్యసంఘములు చైనాదేశమందేగాక విదేశము లందున్న చైనాదేశీయులలోకూడ వ్యాపించియుండెను. మంచూ

తెల్లకలువలు

రియానుండి మంచూరాజు కుటుంబము వచ్చి చైనాకుచెందిన మింగురాజుల నోడించి తమ పాలనమును చైనామీద స్థాపించుకొనినపుడు అనేక సంవత్సరములు చైనాదేశీయులలో చాలమంది తమ స్వదేశరాజుల పక్షమున పోరాడిరి. మంచూచక్రవర్తులు చైనాను జయించి శాంతిని స్థాపించునప్పటికి చాలసంవత్సరములు పట్టెను. రెండువందల సంవత్సరముల నుండియు సహాయము దొరికినపుడు మంచూరాజకుటుంబమును వెడలగొట్టవలెనను ఉద్దేశ్యముగల రహస్యసంఘములు చైనాలోని గ్రామములలోను, వర్తకసంఘములలోను నాటుకొని యున్నవి. వాటికి తెల్లకలువలని, సోదరసమితులని పేరు. వాటిని అక్రమసంఘములని చైనాప్రభుత్వమువారు ప్రకటించినప్పటికిని అవి రూపుమాసిపోక నిలచియే యున్నవి. వాటిలోనికి కొందరుమిత్రులసహాయమున సన్‌యటుసేనుకు ప్రవేశము కలిగెను. వాటిని తన యుద్దేశ్యములను నెఱవేర్చుటకు సాధనములుగ నుపయోగించుటకు ఆయన నిశ్చయించెను.

లీహాంగుచాంగు ప్రభువును దర్శించి వచ్చినతరువాత సన్‌యటుసేను చైనాలో సంచారముచేయుచు అక్కడక్కడ జాతీయ స్వతంత్రసంఘములను రహస్యముగ స్థాపించుచుండెను. ఉత్తరమున యాంగ్సీనది ప్రవహించుచున్న ఫలవంతమైన ప్రదేశములకు గూడ పోయి జాతీయసంఘములను స్థాపించి వచ్చెను. విదేశములలోనున్న చైనాదేశీయులు వర్తకమువలన ధనికులై యుండిరి. వారిలో తన యుద్దేశ్యములను వ్యాపింపజేసి వారి సహాయమును పొందు

స్వతంత్రోద్యమ వ్యాపకము

టకు ఆయన బయలుదేరి వెళ్లెను. ఆయన హోనొలూలు వెళ్ళునప్పటికి చైనా జపానుల మధ్య యుద్ధము ప్రారంభ మయ్యెను. ఆ యుద్ధములో చిన్నదగు జపానుచేత చైనా ఓడింపబడి నీచమైన షరతుల కొప్పుకొని సంధిచేసికొనెను. చైనా ప్రభుత్వముయొక్క బలహీనత ఇంక నెక్కుడుగా వెల్లడియయ్యెను. విదేశజాతులు వెంటనే చైనా చక్రవర్తిని బెదిరించి యా దేశములోని ప్రదేశములను కౌళ్ళపేర స్వాధీనమును పొందిరి. త్వరలోనే పోర్టు ఆర్థరు రుష్యాకును, కయచోజె జర్మనీకిని, వైహాయివాయి కౌలూను రాష్ట్రములు ఇంగ్లాండుకును, క్వంగుచోజె రాష్ట్రము ఫ్రాన్సుకును స్వాధీనపర్చబడెను. చైనా సామ్రాజ్యమంతయు విదేశ జాతులచే పలుకుబడి ప్రదేశములుగ పంచుకొనబడెను. తమ యొక్క దౌర్భాగ్యపు టునికిని ఎటులైన నిలుపుకొనుటకు మంచూ చక్రవర్తులు దేశమును విదేశీయులకు ముక్కలు ముక్కలుగ అమ్ముచుండుట ఆయనకు స్పష్టమయ్యెను.

హోనొలూలునుండి సన్‌యటుసేను జపానుకు వెళ్ళి అచటి చైనాదేశీయులను తన పక్షమునకు చేర్చుకొని అమెరికాకు వెళ్ళుటకు సిద్ధముగ నుండెను. 'హ్సిన్ చంగు హుయి' (చైనా పునరుద్ధరణ సంఘము) అను పేర నొక సంఘ మును స్థాపించెను. ఇంతలో షాంఘాయిలోని

ప్రథమ తిరుగుబాటు

యొక ధనికుడగు వర్తకుడగు సూంగుయారు (Soong yao-ru) వద్దనుండి తిరుగుబాటును లేవదీయుటకు సమయము వచ్చిన దనియు చైనాకు రావలసినదనియు సన్‌యటుసేనుకు కబురు

వచ్చెను. ఆవర్తకుని సలహాపైనను, సహాయమునను సన్‌యటు సేను కాన్‌టన్‌కు వచ్చి అచట సన్ అండు కంపెనీ యను పేరుతో నొక వ్యవసాయ వర్తక సంఘమును స్థాపించి దాని చాటున తిరుగుబాటును ఏర్పాటుచేయుటకు పూనుకొనెను. సన్ అండు కంపెనీవారు పీపాలకొలది సామానులను తెప్పించు చుండిరి. ఒకసారి ఖాళీపీపాలను బాగుగ పరీక్షించగ వాటి అడుగున సుంకపుటధికారులకు ఆరువందల పిస్తోళ్ళు (తుపాకీలు) దొరికెను. వెంటనే కొందరు స్వతంత్రవాదులను చైనా యుద్యో గస్థులు పట్టుకొనిరి. ఇండ్లను సోదా చూచిరి. డెబ్బదిమందిని చైనా సర్కారువారు శిరచ్ఛేదము గావించిరి. డాక్టరు సన్‌యటు సేనును మాత్ర మొక కూలివాని బుట్టలోపెట్టి ఆయన మిత్రులు కాన్‌టన్ నగరపు గోడమీదుగ బయటకుపడవేసిరి. ఆయనకొరకు ప్రతి గృహామును సిపాయీలు వెదకిరి. ఆయన తప్పించుకొని పారిపోయెను. ఆయన శిరమును తెచ్చి యిచ్చినవారికి పదునైదు లక్షల రూప్యముల బహుమాన మిచ్చెదమని చైనా ప్రభుత్వము ప్రకటించెను. మహాత్మాగాంధివలె సన్‌యటుసేను అహింసాపద్ధతిని తన స్వతంత్రోద్యమమును సాగించినవాడు కాడు. పాశ్చాత్య స్వతంత్రవాదులవలె దౌర్జన్యపద్ధతుల నవలంబించెను.

సన్‌యటుసేను జపానుదేశమునకు పారిపోయెను. దుస్తు లను మార్చెను. జుట్టును కత్తిరించుకొనెను. చంగుషాన్‌షో (కొండలలో కట్టెలు కొట్టువాడు) అను జపాను పేరునుదాల్చెను.

చంగుషాన్

ఆయన యొక్క అనుచరులు తరువాత కాల మున ఆయనను చంగుషాన్ అని ప్రియముగ

పిలచిరి. చైనాలోని బస్తీలలోని కొన్నివీథుల కాపేరు పెట్టబడు చున్నది.

## 3

ఆయన జపానులోని చైనావిద్యార్థులలో ఎడతెగకుండ పనిచేయుచుండెను. జపాను చైనాప్రభుత్వములు స్నేహముగా నున్నవి. ఆయనయొక్క యథార్థస్థితి జపాను ప్రభుత్వోద్యోగులకు తెలిసి తమ దేశమునుండి వెడలిపొమ్మని యాజ్ఞాపించిరి. ఆయన అమెరికాకు ప్రయాణమై పోయెను. సూంగుయారు(షాంఘాయివర్తకుడు) ఆయనకు కావలసిన ద్రవ్యము నిచ్చుచుండెను. త్రోవలో హోనొలూలులో నాయనదిగినపుడు ఇంగ్లాండుకు విశ్రాంతికై పోవుచున్న డాక్టరు జేమ్సుకాణ్ట్లీగారును వారి సతియును ఆయనను కలియుట తటస్థించెను. తమ పాతశిష్యుడగు సణయటుసేను తన మాతృదేశోద్ధరణమునకు పూనుకొనుటకును ఆయనయొక్క ప్రతిభకును ఆయన పొందిన పేరుప్రతిష్ఠలకును వారు గర్వమును చెందిరి. ఆయనకు ఇంగ్లాండుకురమ్మని యాహ్వానించిరి. ప్రాగ్దేశములకు నాగరికత నిచ్చుటకు ఆంగ్లవిద్యాధికుడును, క్రైస్తవుడునునగు సణయటువంటివాడు అర్హుడని వారి యభిప్రాయము. అమెరికాలో సణయటుసేను చైనాదేశీయులగు వర్తకులలో పలుకుబడిని సంపాదించెను. చైనాపునరుద్ధరణ సంఘపు శాఖలనేర్పరచెను. తన యుద్యమమునకును కొంత ధనసహాయమును పొందెను.

అమెరికాకు ప్రయాణము

గాని తనతోకూడ చైనాచక్రవర్తియొక్క ఉద్యోగస్థులు వెంబడించుచునే యుండిరి.

అచ్చటనుండి సన్యాయటు సేను ఇంగ్లాండుకు వెళ్లెను. లండను నగరమున డాక్టరు జేమ్సుకాంట్లీ దంపతులను దర్శించెను. మరల దర్శింతునని చెప్పి పోయి యదృశ్యుడయ్యెను. 1896 వ సంవత్సరం అక్టోబరు 17 వ తేదీన అర్ధరాత్రివేళ నొక స్త్రీ వచ్చి జేమ్సుకాన్ట్లీగారిని నిద్రనుండి లేవగొట్టి తా నత్యవసరమైన పనిమీద వచ్చితినని చెప్పెను. లండనునగరమున చైనాప్రభుత్వ రాయబారియొక్క యింటిలోని యొక నౌకరుయొక్క భార్యననియు తా నచటికి వచ్చిన సంగతి ఎవరికైన తెలిసిన తనకును తనభర్తకును ప్రమాదము వాటిల్లుననియు నామె చెప్పి యొక అచ్చున పేరు ముద్రింపబడిన కార్డును జేమ్సుకాంట్లీగారికిచ్చి వెడలిపోయెను. ఆ కార్డు మీద పెన్సలుతో వ్రాయబడినదానిని కాన్ట్లీగారు అతి ఆత్రతతోను, విచారముతోను మరల మరల చదువుకొనుచుండెను. దానిమీద నిటుల వ్రాయబడియున్నది:—

ఇంగ్లాండునందు మరణమునుండి తప్పించుకొనుట

"నన్ను అకస్మాత్తుగ ఆదివారమునాడు కొందరు పట్టుకొని చైనారాయబారియింటిలోని కెత్తుకొనిపోయి దాచినారు. నన్ను ఇంగ్లాండునుండి చైనాకు హత్యగావించుటకై పంపుచున్నారు. త్వరితముగ విడిపింపుడు. చైనారాయబారిచే నొక పొగయోడ కుదర్చబడినది. నన్నందులో బడవైచి బంధించి ఎవరికిని కనబడకుండ కొనిపోవుదురు. నేను దురదృష్టవంతుడను. ఈ లేఖను తెచ్చిన మనుష్యుని కాపాడుడు. అతను చాల

బీదవాడు. నాకు సహాయము చేసినందుకు తన నౌకరీని గోల్పోవగలడు."

సణ్యటుసేను పేరుగల ఆ కార్డును చదువుకొని కాణ్ట్లీ గారికి వెఱ్ఱియెత్తినట్లై వెంటనే టెలిఫోనుమూలమున లండను పోలీసు అన్వేషణశాఖ యగు స్కాట్లండుయార్డువారిని నిద్రలేపి సమాచారము చెప్పెను. వారు తాముచేయగల దేమియు లేదనియు, కాణ్ట్లీగారిని నిద్రపొమ్మనియు సలహా నిచ్చిరి. మరునాడును రెండవ దినమునను ఆయన డౌనింగువీధిలోని ఆంగ్లేయమంత్రుల కచ్చేరీలకు పోయి మొరపెట్టుకొనెను. కాని యాలకించువారు లేరైరి. అంతట ప్రతి ఆంగ్లేయునికిని ఆఖరు శరణ్యమగుపని నాయన జేసెను. సణ్యటుసేనుయొక్క నిర్బంధ యుదంతమంతయు లండనుటైమ్సు (Times) పత్రికకు వ్రాసెను. ఆ పత్రికారాజము దానిని ప్రాముఖ్యముగా ప్రచురించెను. పత్రిక లన్నియు వెంటనే పెద్దపెద్దవ్యాసములు వ్రాసెను. తమకండ్ల యెదుట తమదేశమున శరణుజొచ్చిన విదేశస్వతంత్రనాయకుని పట్టుకొని నిర్బంధించుటకు చైనారాయబారి కధికారము లేదనియు, హత్యానేరము గావింపబడుచున్న దనియు, వెంటనే ఆంగ్లేయప్రభుత్వమువారు జోక్యము కలుగజేసికొని ఆయనను విడిపింపవలయు ననియు పత్రికలన్నియు వ్రాసెను. ఇంగ్లాండులో నున్న చైనాదేశీయుని పట్టుకొనుటకు చైనాప్రభుత్వమువారి కధికారము లేదు. ఇంగ్లాండులోనున్నవా డే దేశస్థుడయినను ఆంగ్లేయుల చట్టములక్రిందనే ఆంగ్లేయుల న్యాయాధిపతులచేతనే శిక్షింపబడవలెను. ఇంతటితో, సణ్యటుసేనుయొక్క విఖ్యాతి

పాశ్చాత్యప్రపంచమునం దంతటను వ్యాపించెను. ఆయనచరిత్ర విపులముగ ఇంగ్లాండు, ఫ్రాంసు, జర్మనీదేశముల పత్రికలలో ప్రచురింపబడెను. స్వాతంత్ర్యప్రియుల సంఘమువారు చైనా రాయబారిగృహమును ముట్టడించి సణయటుసేనును విడిపించి తెచ్చెదమని లేఖలు వ్రాసిరి. ఇట్టి గందరగోళము కాగానే చైనా రాయబారికి గొప్పభీతి జనించెను. ఆంగ్లేయ ప్రధానమంత్రి యగు శాలిస్బరీప్రభువు సణయటుసేనును నిర్బంధించుట ఆంగ్లేయ చట్టములకు వ్యతిరేక మనియు, ఆంగ్లేయదేశమున విదేశ రాజకీయ స్వతంత్రవాదుల కందరకును శరణ్య మిచ్చుచున్న యాచారమునకు కూడ విరుద్ధమనియు చైనారాయబారికి వ్రాసెను. చైనాకు క్రూరహింసకొరకును మరణముకొరకును పంపుటకు నిర్ణయించిన దినమున సణయటుసేను చైనా రాయబారి యింటియొక్క వెనుకగుమ్మముగుండ బయటకు నెట్టివేయబడెను. ఈ విషయమునుగూర్చి ఆయన హాంగుకాంగు లోని తన మిత్రుడగు రెవరెండు యఫ్. సి. ఆల్ అను స్వదేశ క్రైస్తవునికి ఇటుల వ్రాసెను:— "కిటికీలకు ఇనుప చువ్వలను పెట్టించిరి. నన్ను బందోబస్తుగ కనిపెట్టియుండుట కొక యుద్యోగస్తుని ప్రత్యేకముగ నియమించిరి. ఆరు దినములు మిగుల నాత్రతతో ఈశ్వరుని ప్రార్థించితిని. ఏడవదినమున పరమేశ్వరుడు ఆత్మశాంతిని ప్రసాదించెను. నా నిర్బంధము సంగతి ఆ యిల్లు దాటి బయటకు తెలియుట ఎటులనియే సమస్య. నేనొక యుత్తరమును వ్రాసి బయటకు కొనిపొమ్మని యచటి ఆంగ్లేయ నౌకరు కిచ్చితిని. వాడు దానిని గొనిపోయి చైనా మంత్రి

కిచ్చెను. అందువలన నా నిర్బంధము మరింత హెచ్చినది. నా యొద్దనున్న కాగితమును కలమును ఊడలాగికొనిరి. నన్ను ఎక్కువగ కావలా గాయుచుండిరి. మరునాడు కావలావారు లేని సమయముచూచి యాగదిలోనికివచ్చిన మరియొక ఆంగ్లేయ నౌకరును లేఖ నెటులైన బయటకు గొనిపొమ్మని బ్రతిమి లాడితిని. భగవంతుడు వానికి జాలి గలిగించెను. వాడొక పెన్సలు ముక్కను తెచ్చియిచ్చెను. నాయొద్ద నాపేరు ముద్రింప బడిన కార్డొకటి యుండెను. వాడు తన యుద్యోగమును పోగొట్టుకొనుటకు సిద్ధపడెను. వాడీ పనిలో పట్టుబడినచో వాని నేమి చేసియుందురో! నా శరీరము యొక్క నూరు పౌండ్లకు పైగల మాంసము కొరకు ఎంతతాపత్రయము పొందుచున్నారు! ఒక పొగ యోడ ప్రత్యేకముగ కుదర్చబడినది. చైనాకు చెలి గ్రాములు పోయినవి......... ఈ యత్నముతో మంచూ ప్రభుత్వము ప్రపంచములో గౌరవమును పూర్తిగా పోగొట్టు కొనినది. నేను ఉత్తమ పురుషులతో సంబంధమును పొంది నాను............ఇల్లు విడిచి పారిపోయిన చెడుకుమారుని తండ్రి రక్షించినటులవలెను, పారిపోయిన గొర్రె మరల దొరికి నపుడు గొర్రెలకాపరి కాపాడినటులను, కరుణాసముద్రుడైన పరమేశ్వరుడు నన్ను రక్షించెనని నాకు గోచరమైనది. ఆ తండ్రి యొక్క కరుణ గాక మరియేమిటి? నాకు ఆధ్యాత్మిక విషయ ములమీద తరుచుగ వ్రాయుచుండుము. ఆధ్యాత్మిక చింతనము ఇంకను నాకెక్కువ దృఢమగు భక్తిని విశ్వాసమును గలుగ చేయగలదు. నా మూలమున చైనాదేశీయులకును ఉపయోగ

పడగలదు" అని వ్రాసెను. అంతటనుండియు తన దేశోద్ధరణము కొరకే తనకు పరమేశ్వరుడు జీవితమును ప్రసాదించెననియు, చైనా జాతీయోద్ధరణము మూలమున మానవ కల్యాణము గలుగుట భగవంతుని ఉద్దేశ్యమనియు నాయన దృఢముగా నమ్మి కృషి సలుపుచుండెను.

ఇంగ్లాండునుండిపోయి సన్‌యటుసేను యూరపుఖండము లోని మిగత దేశములలో సంచారముచేసెను. ప్రతిచోటను ఆయనను మిగుల గౌరవముగ చూచిరి.

**రాజకీయ సాంఘిక సిద్ధాంతములు**

ఆయన ఆయాదేశములలో నమలులోనున్న ప్రభుత్వవిధానములను, సాంఘికపద్ధతులను బాగుగ పరిశీలనము గావించెను. ఆకాలమున తన రాజకీయ సాంఘికసిద్ధాంతములను నిర్దుష్టము గావించుకొనెను. యూరపు ఖండములో ప్రబలియున్న రాజకీయస్వతంత్రము వాంఛనీయమే గాని యచట జరిగిన యద్భుత పారిశ్రామికాభివృద్ధివలన నేర్పడిన సాంఘిక, ఆర్థిక అసమానత్వము దుర్భరముగ నున్నదని యాయన తలచెను. పాశ్చాత్య దేశములు రాజకీయ స్వతంత్రము, ప్రజా స్వామ్యము, అను సిద్ధాంతములను అవలంబించిన తరువాత చాల సంవత్సరములకు సాంఘికతత్వము (**Socialism**) ను బోధించు ఆర్థికతత్వవేత్తలు బయలుదేరిరి. పాశ్చాత్య షాహుకార్లు, ధనికులు, రాజకీయవేత్తలు, రాజకీయ సమానత్వమను సిద్ధాంతమునకు దాసులైరి గాని ఆర్థిక సాంఘిక సమానత్వమును బోధించు సిద్ధాంతములకు ఇంకను బాగుగ ప్రతిఘటనము గావించుచున్నారు. ఆశియాఖండములోని జాతీయవాదులు తమ దేశముల స్వతంత్ర

మునకై కృషిసలుప పూనుకొనినప్పటికి రాజకీయ సమానత్వమును బోధించు రూసో (Russeau), వాల్టేరు (Waltair), జఫరుసన్ (Jefferson), పైన్ (Paine) మొదలగు రాజకీయ స్వతంత్రవాదుల గ్రంథములను చదివినటులే ఆర్థిక సాంఘికతత్వములను బోధించు కారల్ మార్క్సు (Karl Marx), లెనిన్ (Lenin), టాల్స్టాయి (Tolstoy), బెర్ట్రాండురసలు (Bertrand Russel) లను సాంఘిక తత్వవేత్తల (Socialists) గ్రంథములను గూడ చదివిరి. కావున ఇరువదవ శతాబ్దమున జరుగనున్న ఆశియా ఖండ స్వతంత్రోద్యమము యొక్క నాయకులు రాజకీయస్వతంత్రముతోపాటు సాంఘిక ఆర్థిక స్వతంత్రమునుగూడ నెలగొలుప ప్రయత్నించుటలో నాశ్చర్యములేదు. సణ్‌యటుసేను అదివరకే 'జాతీయభావము' (Nationality) ప్రజారాజ్యము (Democracy) అను సిద్ధాంతములను అవలంబించి యుండెను. వాటికి తోడుగ నిపుడు 'ప్రజల జీవనోపాధి' (Right to live) అను మూడవ సిద్ధాంతమును జేర్చెను. తన పాలనముక్రిందనున్న ప్రతి మానవునికిని సౌఖ్యముగ జీవించుటకు వలయు సాధనములను సమకూర్చుట ప్రతి ప్రభుత్వముయొక్క విధియనియు అటుల ప్రభుత్వము చేయునటుల ప్రభుత్వమును నిర్మాణము గావించుహక్కు ప్రతిమానవునికిని గలదనియు ఆయన వ్రాసెను. ఈ మూడు సిద్ధాంతములను కలిపి ఆయన సాగించెడు మహోద్యమము యొక్క ప్రాతిపదికముగ నేర్పరచెను. వీటికి (San Min Chu I) శాణ్‌మిణ్-చూ ఐ) అనగా ప్రజల మూడు సిద్ధాంతములు (The Three Peoples' Determinations) అని పేరిడెను. ఒకటి దేశము

లోని ప్రజలందరును కలసి యొకేజాతి; రెండవది ఆ దేశమును పాలించుకొనుటకు ఆ ప్రజలకే యధికారముగలదు; మూడవది, ఆదేశముయొక్క ప్రజాప్రభుత్వముయొక్క ప్రథమ కర్తవ్యమేమనగా ఆదేశములోని ప్రతిమనుజునికిని కడుపునిండ భోజనము, కట్టుకొనుటకు బట్ట, గృహావసతి, విద్య, వైద్యము సమకూరి సౌఖ్యముగ జీవించుటకు వలయు సమస్తసాధనములను విధానములను నిర్మాణము గావించుటయునై యున్నది. అంతేగాని షాహుకార్లు ధనికులు దేశములో నుత్పత్తి యయ్యెడి ధనమునంతను హరించి సామాన్యజనులలో చాలమందికి జీవనోపాధి లేకుండ నుండుస్థితిలో ప్రభుత్వము విడిచిపెట్టగూడదు. సామాన్యజనులయొక్క సౌఖ్యమే ప్రభుత్వముయొక్క ప్రధాన ధర్మము; అను నీ మూడు సిద్ధాంతములను ప్రజలు కలిగియుండవలెనని ఆయన యుద్దేశించి యీ సిద్ధాంతములకు 'ప్రజల మూడు సిద్ధాంతము' లని పేరుపెట్టెను. రాజ్యాంగవిధానమును నిర్ణయించుటలో అమెరికావారి పద్ధతులతో పురాతనచైనాదేశపు పద్ధతులను సమన్వయము గావించి ప్రజాపరిపాలనమునందు అయిదుశాఖ లుండవలెనని ఆయన నిశ్చయించెను. ఒకటి శాసన నిర్మాణశాఖ; రెండు కార్యనిర్వాహకశాఖ; మూడు న్యాయ విచారణశాఖ; నాలుగు ఉద్యోగనిర్ణయశాఖ; అయిదు ప్రభుత్వ విమర్శనాశాఖ అను అయిదుశాఖ లుండవలెనని నిశ్చయించెను. మొదటిశాఖ దేశమునకువలయు శాసనములను చేయుట, పన్నులను వేయుట, పన్నులఖర్చులను నిర్ణయించుట మొదలగు సమస్త శాసనాధికారములను కలిగియుండును. రెండవశాఖ శాసనసభ

వారి యుత్తరువుల నన్నిటిని అమలుజరుపుచు దేశమును పరిపాలించు మంత్రివర్గము. మూడవశాఖ క్రిమినలు సివిలు చట్టములను అమలుజరుపు న్యాయస్థానములు. నాలుగవది ప్రభుత్వములోని వివిధశాఖలను నడుపు ఉద్యోగస్థుల పరీక్షలను తరిబీయతు లక్షణములను నిర్ణయించు శాఖ. అయిదవది ప్రభుత్వముయొక్క వివిధ శాఖలలో జరుగుచున్న లోపములను ఎప్పటికప్పుడు కనిపెట్టి విమర్శించి చూపించుచుండెడి ప్రత్యేక ఉద్యోగియుల సంఘము. ఈ నాలుగైదు శాఖలు ప్రాచీన చైనాయొక్క రాజ్యాంగము నందు ప్రబలియుండుట చూచియున్నాము. ఈ సిద్ధాంతములను రాజ్యాంగ విధాన పద్ధతులను ఆయన క్లుప్తమగు సూత్రములుగ ప్రచురించెను. ఆ సూత్రములు చైనాదేశములోని ప్రతివానికిని బాగుగ తెలియును.

## 4

యూరపుఖండమునుండి బయలుదేరి సన్‌యటుసేను తురుష్కము, పాలస్తీన్, హిందూదేశములను దర్శించి సయాం, మలయా, ఆశియా తూర్పుద్వీపములగుండ జపానుదేశమును చేరెను. సయాం, మలయా, ఆశియా తూర్పుద్వీపములలో వర్తకము చేయుచున్న ధనికులగు చైనాదేశీయులు ఆయనను తమ మాతృదేశరక్షణము గావించుచున్న నాయకునిగ నంగీకరించి విశేష భక్తిశ్రద్ధలతో విరివిగా ధనసహాయమును గావించిరి. పురుషులకన్న గూడ స్త్రీలాయనయెడ నత్యంత గౌరవమును ఆయన అవలంబించిన

స్త్రీలసహాయము

మహోద్యమమునం దెక్కువ యుత్సాహమును చూపిరి. మానవ చరిత్రలోకెల్ల నెక్కువయగు బహుమానమును ఆయన శిరమును ఖండించి తెచ్చియిచ్చెడివారి కిత్తుమని చైనాచక్రవర్తి ప్రకటించి నట్టియు క్రూరమరణమును రెండుసార్లు తప్పించుకొని నట్టియు ఆ స్వార్థత్యాగియొక్క సుందరమగు రూపము మృదుమధుర వాక్కు, ఉదారమైన వినమ్రత, చైనా స్త్రీల కోమలహృదయ ముల నెక్కుడుగ నాకర్షించినదనుటలో నతిశయోక్తిలేదు. తరువాత విశేషముగ వృద్ధిజెందిన చైనా స్త్రీస్వతంత్రోద్య మమున కపుడు పునాదులు వేయబడినవి. తన జీవితమునందు తనకు రెండే పరమావధులు గలవని ఆయన చెప్పెను. ఒకటి రాజకీయ స్వతంత్రము. రెండవది స్త్రీల యౌన్నత్యము. స్త్రీల తోడ్పాటులేనిది చైనాకు కళ్యాణము గలుగదని ఆయన చెప్పెను. స్త్రీల వికాసములేనిది చైనాకు ఔన్నత్యము గలుగదని ఆయన నిశ్చయించెను.

విద్యార్థుల నాకర్షించుట

1898 వ సంవత్సరమున ఆయన జపానులో నుండెను. అచటి విద్యార్థి బృందమంతయు నాయనచే నాకర్షింపబడి ఆయన యొక్క శిష్యత్వము నంగీకరించెను. వారిలో కొందరు తరువాత జపానుదేశమునకు నాయకులైరి. అప్పుడు జపానులో చదువుకొని వెళ్ళిన ఇద్దరు విద్యార్థులు యువకుడగు చైనా చక్రవర్తికి సలహాదారులై కొన్ని సంస్కరణములను చైనా ప్రభుత్వములో ప్రవేశ పెట్టుటకు యత్నించుచుండిరి. కాని వాటివలన విశేషప్రయోజన ముండనేరదనియు కావలసినది సంపూర్ణ ప్రజాస్వామ్యమేననియు

సన్‌యటుసేను తలచెను. కొలదికాలములోనే చక్రవర్తిని నిర్బంధమునందుంచి రాజమాత రాజ్యభారమును వహించి సంస్కర్తలను వెడలగొట్టుటయు సంస్కరణములను సాగకుండ జేయుటయు జరిగెను. తరువాత బాక్సరురహస్య సంఘములు బయలుదేరుటయు, పాశ్చాత్య ప్రభుత్వములును జపానుప్రభుత్వమును కలిసి చైనాపై దండెత్తి బాక్సరుద్యమమును అణచివైచుటయు జరిగెను. అటుపిమ్మట కొలదికాలములో సన్‌యటుసేను మూలికలనమ్ము కోయవానివేషమును ధరించి చైనాదేశములో మరల ప్రవేశించెను. కాంటన్‌కు ఉత్తరమునకున్న హ్వాయిజో (**Hwayjo**) లోనున్న చైనాసైనికులలో స్వతంత్రోద్దేశ్యములను రహస్యముగ వ్యాపింపజేయసాగెను. అనేకులగు సైనికోద్యోగులు ఆయనకు శిష్యులై ఆయనను జాగ్రత్తగ కాపాడుచుండిరి. ఆయన యుద్యమ పక్షమున నొక పత్రిక హాంకాంగులో (**Hongkong**) లో నడపబడుచున్నది. ఆయుధ సామగ్రిని గొనితెచ్చుటకు ఆయన హాంకాంగుకు పోయెను. అచటనుండి ఆయుధ సామగ్రితో మరలి వచ్చుచుండగ సుంకపుటధికార్లు ఆయనను గుర్తించి కాన్‌టన్‌లో దిగనివ్వలేదు. పడవ వాళ్ళాయనను తీసికొనిపోయి ఫార్మోజా ద్వీపమున పడవైచిరి.

## 5

సన్‌యటుసేను యొక్క ప్రజాస్వామ్య సిద్ధాంతములు త్వరితముగ చైనా విద్యార్థులలో వ్యాపించి మొదట జపానుదేశ

ములో విద్య నభ్యసించుచున్న విద్యార్థులును, క్రమముగ అమెరికాలోను, యూరపుఖండములోను చదువుకొనుచున్న విద్యార్థులును స్వతంత్ర సంఘములుగ నిర్మాణము గావించుకొనిరి. అపుడు స్వతంత్రోద్యమములో చేరిన విద్యార్థులే తరువాత చైనాదేశము యొక్క నాయకులైనారు. సన్‌యటుసేను యొక్క ఉద్యమ వ్యాపకమునకు ప్రధానబలము (1) మంచూ చక్రవర్తులకు వ్యతిరేకముగ పనిచేయుచున్న తెల్లకలువలు (2) విదేశములలోనున్న చైనావర్తకులు (3) చైనా విద్యార్థులు అయ్యున్నారు. ఇందులో విద్యార్థుల యుద్యమము **(Students Movement)** కొలదికాలములో చైనాప్రభుత్వమును సంఘమును తారుమారు చేయనున్నది. (**'Dare to die'**) విద్యార్థులలో 'మరణమునకు సాహసించినవారు' అను సంఘములు స్థాపితమయ్యెను.

ఉద్యమమునకు ప్రధాన బలము

మరల సన్‌యటుసేను చైనానువదలి ఇండోచైనాకును, ఫిలిప్పైన్ ద్వీపములకును, అమెరికాకును, యూరపుకును వెళ్ళి రుష్యా-జపానుల మధ్య యుద్ధము జరుగుచున్న 1904 వ సంవత్సరములో జపానుకు వచ్చెను. అచట టోకియో నగరమున ప్రథమపర్యాయ మఖిల చైనా స్వతంత్ర మహాసభను సమావేశపరచెను. చైనాదేశము యొక్క పదునెనిమిది రాష్ట్రములలో పదునేడు రాష్ట్రముల నుండియు అయిదువేలమంది ప్రతినిధులు హాజరైరి. వీరిలో చాలమంది జపానులో విద్యనభ్యసింపుచున్న విద్యార్థులే. ఈ ఆందోళనా పరులయొక్కయు, విద్యార్థుల

అఖిల చైనా స్వతంత్ర మహాసభ

యొక్కయు విదేశములలో జరిగిన సమావేశము రానున్న గొప్ప యుద్యమమున కంతకును పునాదివేసినది. అపుడు **Tung Ming Hui** అను జాతీయ స్వతంత్ర సంఘమును స్థాపించిరి. ప్రతినిధు లందరును దానికి శాఖలుగ స్వతంత్ర సంఘములను స్థాపించెదమని ప్రమాణములు గైకొనిరి. తమ మాతృదేశ పునరుద్ధరణమునకై అత్యంతమగు ఉత్సాహమును జూపిరి. సంఘమునకు సణయటుసేను అధ్యక్షుడుగ నెన్నుకొనబడెను. టోకియోను ప్రధాన కార్యస్థానముగా చేసిరి. ఈ ప్రతినిధులు తమ తమ యిండ్లకు వెళ్ళి ప్రతిరాష్ట్రములోను శాఖలను స్థాపించిరి. ఒక సంవత్సరములో పదివేలమంది సభ్యులను చేర్చిరి. చైనాచక్రవర్తులయొక్క కండ్ల యెదుట చైనాదేశములోని టీణట్సినుపట్టణమునందుకూడ బ్రిటిషువారి ప్రదేశములో సణయటుసేను ఆ స్వతంత్ర సంఘముయొక్క మరియొక కార్యస్థానము నేర్పరచెను. చాల సంవత్సరము లీపట్టణము ప్రజాస్వామ్యవాదులకు ముఖ్యస్థానముగా నుండెను. సణయటుసేను కొంతకాలమునకు తన జాతీయ స్వతంత్ర సంఘమునకు 'క్యూమిన్ టాంగు' అని పేరు నిడెను.

1904 వ సంవత్సరము మొదలు 1909 వ సంవత్సరము వరకును అక్కడక్కడ తిరుగబాటులు లేవదీయ ప్రయత్నించగ వాటిని చైనాప్రభుత్వమువారు అణచివేయుచుండిరి. సణయటు సేను ఒకచోట తిరుగుబాటు ఓడిపోగనే మరియొక చోటికి పోవుచుండెను. హ్వాయిజోలోని సేనలు తిరుగుబాటు చేయుట జరిగెను. ప్రభు

తిరుగుబాటులు అణచివేయుట

త్వమువారు కొందరిని యురిదీసి తిరుగుబాటు నణచిరి. ఫ్రెంచి ఇండోచైనా నుండి సేనలను సహాయటుసేను తెచ్చుటకు ప్రయత్నించగ సైనికులను కొందరిని చెరసాలలోనుంచియు కొందరిని శిరచ్ఛేదము గావించియు నాప్రయత్నము నాపివేసిరి. కాంటన్ పట్టణమునం దప్పుడపుడు జరుపబడిన తిరుగుబాట్లుకూడ నీవిధము గనే అణచివేయబడినవి. 1907 వ సంవత్సరమున నామెయింటిలో రివాల్వరు దొరికినందున పట్టుకొని చీయుచిన్ యువతిని చైనా ప్రభుత్వము శిరచ్ఛేదము గావించెను. సహాయటుసేను చైనాలోని విదేశీయుల క్రిందనున్న ప్రదేశములలో నివసించుచు తన యుద్యమమును నడుపుచుండెను. విదేశీయులకుగల ప్రత్యేక హక్కులను ఆయన యుపయోగించు కొనుచుండెను. ఒక్కొక్కపుడు తన క్రింద జపాను, ఫ్రెంచి యుద్యోగస్తులనుకూడ నియమించి పని చేయించుకొనెను. అనేకులాయనకు ద్రవ్యము నిచ్చుచుండిరి. కొందరు తమ ఆస్తులనన్నిటిని ఇచ్చివేసిరి. ఆయన చేతిమీదుగ ఎనుబదిలక్షల రూప్యములను ఖర్చుచేసినను ఆయనకు చినిగిన చొక్కాలే మిగులుచుండెను. క్రమముగ చైనాలోని విదేశప్రభుత్వములవారు ఒకరితరువాత నొకరు సహాయటుసేనును తమ ప్రదేశములలో నుండవద్దని యాజ్ఞాపించిరి. జాతీయవాదులు జయించినచో తమతో చైనాచక్రవర్తులు చేసిన యొడంబడికల వలన తమకు గలిగినహక్కులు పోవునని విదేశప్రభుత్వముల భయము. చైనాలో సహాయటుసేను నిలుచుటకు నీడలేక ఇండోచైనాకుపోగ నచటి ఫ్రెంచి ప్రభుత్వమువారీ యపాయకరమైన స్వతంత్రనాయకుని తమ దేశమునందుండకుండ వెడలగొట్టిరి.

అచటనుండి జపానుకు వెళ్లెను. జపాను ప్రభుత్వముకూడ సన్‌యటు సేనను వెంటనే జపానును విడిచిపోవలెనని నిషేధాజ్ఞనిచ్చిరి. అచటినుండి ఫిలిప్పైన్ ద్వీపములకుపోగ అచటి అమెరికా ప్రభుత్వ ప్రతినిధి యీ శాంతినాశకుని తమ ద్వీపములు విడిచి వెళ్ళవలెనని యుత్తరువుచేసెను. ఇట్లు ఆశియాఖండములో నెచటను నిలుచుటకు శరణ్యములేక నీ ఆశియాఖండ స్వతంత్రమూర్తి అమెరికా ఖండమునకు చేరెను. ఆయన దేశమును విడిచి పోయినకాలములో నాయనయొక్క ప్రధానశిష్యులగు హ్యూహాన్‌మింగు (**Hu Han ming**) వాంగుచింగువై (**Wangching wei**) లు దేశములోని స్వతంత్రోద్యమమును నడపుచుండిరి. "సన్‌యటుసేను పాపము మంచివాడే కాని వట్టి పిచ్చివాడు. కానిపోనిపనిని నెత్తిమీద వేసికొని బాధలు పడుచున్నాడు" అని ఆయనతో సానుభూతిగల చైనాలోని ఒక రాష్ట్రపాలకుడు చెప్పెను. ఆయనయొక్క జాతీయోద్యమమునందు సానుభూతియున్నను చాలమంది ధనికులును పలుకుబడిగలవారును ఆయన తలపెట్టిన కార్యము నెరవేరునది కాదని తలచి దూరముగ నుండసాగిరి.

## 6

ఇటుల నిరాశతోగూడినకాలమున తన యాత్మసమర్పణము వలన స్వతంత్రోద్యమమునకు నూతన శక్తిని కలుగజేయవలెనని సన్‌యటుసేను తరువాత యుద్యమమున కంతకును నాయకుడుగ పనిచేయుచున్న వాంగుచింగువై సంకల్పించెను. ఆయనను బ్రతికి

వాంగుచింగువై యొక్క ఆత్మసమర్పణము

యుండగ పట్టుకొనివచ్చినవారికి పబదివేల డాలర్లను బహుమతిగ నిచ్చెదనని చైనా ప్రభుత్వము ప్రకటించెను. ఆయన జపానుకు పారిపోయి యచట స్వతంత్రపత్రికను నడుపుచుండెను. ఒక స్వతంత్రకమిటీని స్థాపించెను. దానిలో ఫెంగచన్‌యింగు, ఆయన సతీమణి, సెంగుహిసెంగు, పినాంగులోని భాగ్యవంతుడగు నొక వర్తకుని కూతురగు చన్‌పిచున్‌యువతి, ఇంకమరి ముగ్గురును కలరు. వీరందరును 1910 సంవత్సరము జనవరినెలలో టోకియో నుండి పికింగుకు వచ్చిరి. కొలదిరోజులలో వాంగుచింగువై వచ్చి వీరిని చేరెను. మార్చినెల 29 వ తేదీన చైనా చక్రవర్తికి సంరక్షకుడుగనున్న రాజకుమారుని హత్యగావించుటకు ప్రయత్నించిన నేరమునకై వాంగుచింగువైని, ఫెంగచన్‌యింగును, చైనా పోలీసువారు అనుమానముమీద పట్టుకొని సంకెళ్లువేసి పోలీసు స్టేషనుకు తీసికొనివచ్చిరి. విచారణకాలమున వారు నేరముచేసిన ట్లొప్పుకొనిరి. ప్రభుత్వముతో రాజీకుదిర్చినచో వారిని క్షమించి విడిచిపెట్టెదమని ప్రభుత్వప్రధానకార్యదర్శి చెప్పెను. "రాజీ కొకటేమార్గము గలదు. అది యేమనగ చైనాకు ప్రజాస్వామికమును ప్రకటించుటయే" అని వాంగుచింగువై బదులుచెప్పెను. "మీరు మరణశిక్షను పొందుదురు సుమా! మీ కక్షిని వదలి ప్రభుత్వములోచేరినచో మీకువిడుదల కలుగును." అని ప్రభుత్వకార్యదర్శి మరల చెప్పెను. వాంగుచింగువై తనకు విడుదల అక్కరలేదనియు తనదేశమునకు స్వతంత్రమే కావలయుననియు జవాబుచెప్పెను. వాంగుచింగువైకును ఆయన సహచరునికిని యావజ్జీవశిక్షై దుశిక్ష విధించబడెను. పికింగులోని సుప్రసిద్ధమైనచెఱసాలలో వారుభయు

లును ఖైదు చేయబడిరి. యావజ్జీవఖయిదీలయినందున నెల్లప్పుడును వారి చేతులకును, కాళ్లకును, మెడకును కలిపి ఇనుప సంకెలలు తగిలించి తాళములు వేయబడి యుండెను. వారితో నెవరును సంభాషించకుండ బందోబస్తు గట్టిగ చేయబడెను. అట్లు సంకెలలు తగిలించినవారిని సాధారణముగ మూడు సంవత్సరముల కాలములో శిరచ్ఛేదము గావింతురు. కావున తమ మరణమున కెదురు చూచుచు వారిద్దరును ఆసంకెలలతో చెఱసాలలో కాలము గడుపు చుండిరి.

తమ నాయకు డగు వాంగుచింగువై యొక్క యావజ్జీవ శిక్ష చైనాదేశములోని స్వతంత్రవాదులలో గొప్ప సంచలనమును కలుగజేసెను. మరల తీవ్రముగ పనిచేయవలెనని వారు నిశ్చయించిరి. 1911 వ సంవత్సరము మార్చినెల 29 వ తేదీన కాన్టన్ లోని స్వతంత్రవాదులు చైనారాజప్రతినిధి యగు లంగుచిక్సు యన్గు యొక్క సౌధమును ముట్టడించిరి. రాజప్రతినిధి సేనలను రావించి స్వతంత్రవాదులపై విడచెను. డెబ్బది యిద్దరు స్వతంత్రవాదు లగు యువకులను పట్టుకొని శిరచ్ఛేదము గావించిరి. చైనాలో ప్రజాస్వామ్య మేర్పడగానే ఆ యువకుల త్యాగస్మారకచిహ్నముగ కాన్టన్పురమునందలి శ్వేతమేఘనగము (**White cloud mountain**) మీద నొక స్వాతంత్ర్యదేవతయొక్క విగ్రహమును, దాని చుట్టును డెబ్బదిరెండు చలువరాతిగోరీలును చైనావర్తకసంఘము వారిచే నిర్మించబడెను. ప్రజాస్వామ్యభావములు గల యువకు లనేకచోట్ల చైనాసేనలలో చేరిరి. సన్యటుసేను కొంతకాలము

**స్వతంత్రోద్యమము యొక్క జయము**

నుండియు జపానులోని సైనిక కళాశాలలలో చదువుచున్న కొందరు చైనావిద్యార్థులకు ద్రవ్యసహాయము చేసి విద్యను పూర్తిచేయించెను. అట్టివారు చైనా సేనలలో చేరి సమయము వచ్చినపుడు స్వతంత్రపక్షమునకు తమ సేనలతో వచ్చుటకు సిద్ధముగ నుండిరి. అదివరకు చైనాప్రభుత్వమువారు వూచాంగురాష్ట్రములో రైల్వేను నిర్మాణముచేయు హక్కును చైనాదేశపు వర్తకుల కిచ్చి తరువాత దానిని రద్దుపరచి ఆ సంవత్సరము అక్టోబరునెలలో అమెరికాషాహుకార్ల కిచ్చిరి. ఇట్లు చైనాదేశీయుల కిచ్చినవానిని తీసికొని విదేశీయుల కిచ్చుటవలన బయలుదేరిన యసంతృప్తిని యవకాశముగ గైకొని వెంటనే హాంకోనగరమునను చుట్టుపట్లను స్వతంత్రవాదులు తిరుగుబాటును లేవదీసిరి. హాంకోనగరముగుండ ప్రభుత్వసేనలు వచ్చి తిరుగబాటును తాత్కాలికముగ నణచి పోయినవి. సేనలు మరలిపోగనే అక్టోబరు 9 వ తేదీన హాంకోనగరమున రుష్యావారిక్రింద నున్న ప్రదేశమునందొక కసాయివానియింటిలో ప్రేలుడుగుం డొకటి బ్రద్దలయ్యెను. రుష్యాపోలీసువా రా కసాయివాని యింటిని సోదా చూచి కొన్ని దస్తావేజులను పట్టుకొని కొందరు జాతీయవాదులను వూచాంగులోని రాష్ట్రపాలకునియొద్దకు ఖయిదీలుగ బంపిరి. ఆయన విచారించి కుట్రలోచేరినటుల కనబడిన పెక్కుమంది యువకులకును, యువతులకును మరణశిక్ష విధించెను. వారికి మరణశిక్ష విధించగనే వారితో సానుభూతిగల స్వతంత్రవాదులు గొప్ప తిరుగుబాటును లేవదీసి వూచాంగురాష్ట్రపాలకుని గృహమును ముట్టడించిరి. ఆయన సేనలను పిలచెను. సేనాధిపతి

యగు లీయున్‌హంగు (Lieyunhung) జపానులో విద్యనభ్యసించి వచ్చినట్టియు, జాతీయవాదులలో చేరినట్టియు వాడై యుండెను. ఆయన తిరుగుబాటు నణచుటకు నిరాకరించెను. తన క్రింద సేనలన్నియు జాతీయోద్యమముతో సానుభూతి గలిగి యున్నవనియు, తిరుగుబాటుదారులమీద తుపాకులను కాల్చుటకు నిరాకరించినవనియు రాష్ట్రపాలకుడు తిరుగుబాటుదారుల చేతిలో పడకుండ తప్పించుకొని పోవుటకు తన సహాయమును కోరినచో తాను సహాయము చేతుననియు చెప్పెను. రాష్ట్రపాలకుడు సేనాధిపతియొక్క సహాయమున అర్ధరాత్రివేళ నాచోటు విడచి పారిపోయెను. జాతీయవాదుల నిర్బంధముమీద జాతీయపక్ష సైన్యములపై లీయున్‌హంగు సేనాధిపత్యము వహించెను. ఈ సంగతి తెలియగనే పదమూడు రాష్ట్రములలోని సేనలు ప్రజాస్వామ్యపక్షమున చేరెను. అచటి రాష్ట్రపాలకులు చైనా చక్రవర్తినుండి స్వతంత్రులైనటుల ప్రకటించిరి.

అపుడు చైనా సామ్రాజ్యమును పసివాడగు పూయి చక్రవర్తిపేర ఆయన సవతితల్లియగు లంగుయూదేవి పాలించుచుండెనని పైన తెలిపియున్నాము. ఆమె తన సేనాధిపతులలో

చక్రవర్తి రాజ్యమును త్యజించుట

ప్రఖ్యాతిగాంచిన యూయన్ షికాయి (Yuan Shikai) అను నాయనను గొప్ప సేనలతో తిరుగుబాటులనెల్ల నణచి శాంతిని స్థాపించుటకు బంపెను. ఆయన హాంకోపట్టణమును ముట్టడించి అందలి జనులను వేలకొలదిగ కాల్చివైచి పట్టణమును భస్మీభూతము గావించెను. అట్లుల్లనే మరికొన్ని పట్టణములను ప్రజాస్వామ్యవాదులనుండి

స్వాధీనమును పొందెను. కాని ఆయన క్రిందనున్న యిరువది మంది సేనానాయకులు జాతీయవాదులతో పోరాడుటకు నిరాకరించి ఆ సంగతిని వ్రాసి యిచ్చిరి. ప్రజాస్వామ్యవాదులకును చైనా ప్రభుత్వమువారికిని సంధి రాయబారములు జరిగెను. రాజరికముతోపాటు పార్లమెంటును (ప్రజాప్రతినిధి సభను) కూడ స్థాపింతునని రాజమాతయగు లంగుయూదేవి యొప్పుకొనెను. కాని ప్రజాస్వామ్యవాదులు రాజరికము పూర్తిగ పోవలయునని పట్టుబట్టిరి. యూయన్ షికాయి స్వతంత్రోద్యమము నణచుటకు తన చేతకాదని చెప్పెను. అందుమీద రాజమాత నిరాశచెంది సింహాసనమును త్యజించుటకు నిశ్చయించెను. "ప్రజల యుద్దేశ్యమనగ సృష్టికర్త యొక్క యుద్దేశ్యము. అది చైనాదేశమునందు సంపూర్ణ ప్రజాస్వామికమును స్థాపించుటయై యున్నది. మా ప్రజల రక్తమును మేము కార్చుటకు యిష్టములేదు. కావున చైనా చక్రవర్తి పక్షమున మేము రాజరికమును విడిచిపెట్టుచున్నాము. ప్రజాపరిపాలనమును స్థాపనము గావించు ప్రతిష్ఠాపనలను ఏర్పాటుచేయుటకు యూయన్ షికాయికి అధికారము నిచ్చుచున్నా"మని ఆమె చక్రవర్తికి సంరక్షకురాలుగ ప్రకటించెను. అంతటితో చైనాపై వేల సంవత్సరములనుండియు పాలనము చేయుచుండిన రాజరికము అంతరించినది.

## 7

హాంకోలో తిరుగుబాటు జరుగుచున్నప్పుడు సన్‌యట్సేను అమెరికాలోని సెంటులూయిపట్టణమున నుండెను. పత్రి

**ప్రజాస్వామ్య స్థాపనము సన్‌యటుసేను అధ్యక్షుడుగ నెన్నుకొనబడుట**

కలలో ఆవృత్తాంతము చదువుచుండెను. గాని చైనాకు వెంటనే రాక అమెరికాలో చైనా వ్యవహారములను గూర్చి ఉపన్యాసముల నిచ్చుచు తన చుట్టును మూగి ప్రశ్నలు వేయుచున్న వర్తకులకును, పత్రికా ప్రతినిధులకును ప్రత్యుత్తరము లిచ్చుచు చైనాజాతీయోద్యమమునకై ధనమును వసూలుచేయుచుండెను. పసిఫిక్ మహాసముద్రమున కిరుప్రక్కలను వర్ధిల్లెడు రెండు గొప్ప ప్రజాస్వామ్యములు (అమెరికా చైనాలు) ఎటుల స్నేహముగ కలసి పని చేయగలవో మానవకోటియొక్క స్వతంత్రము నెటుల పునరుద్ధరించగలవో ఆయన అమెరికనులకు చెప్పుచుండెను. అమెరికా నుండి ఆయన ఇంగ్లాండుకు వెళ్లెను.

ఇచట చైనాలో నాంకింగుపట్టణమున క్యూమింటాంగు సంఘయాజమాన్యమున చైనా జాతీయవాదుల సమావేశము జరిగెను. నూతనచైనా ప్రజాస్వామ్యమునకొక (**Provisional Constitution**) తాత్కాలికపు రాజ్యాంగవిధానము తయారు చేయబడెను. ప్రజాస్వామికమునకు అధ్యక్షుడుగ నెవరుండవలెనను ప్రశ్నయుదయించెను. ఆ మహాపదవి నధిష్ఠించవలెనని చాల మందికి గలదు. కాని అందరివలనను మన్ననపొందిన వాడొక సన్‌యటుసేనుమాత్రమే. కావున అధ్యక్షపదవి నలంకరించుటకు వెంటనే చైనాకు రమ్మని పదునేడురాష్ట్రముల జాతీయసంఘము వారి పక్షమున ఆయనకు ఇంగ్లాండునకు తంతినంపిరి. ఆతంతి చేరునప్పటికాయన లండనులో తనపాత యుపాధ్యాయుడగు డాక్టరు జేమ్సుకాంట్లీగారితో మాటలాడుచుండెను. తనయొడిలో నొక

చిన్నపిల్లను పెట్టుకొని యామెతో నాటలాడుచుండెను. తంతిని చదివి కాక్టీగారికిచ్చెను. తమశిష్యుడు ప్రపంచములోకెల్ల గొప్ప ప్రజాస్వామ్యమున కధ్యక్షత వహించుననని తెలియుటతోడనే కాక్టీదంపతులకు కలిగిన సంతసమునకు మేరలేదు. వెంటనే భగవంతునికి వందనములర్పించిరి. మిత్రులకు విందుచేసిరి. వారి యొద్ద శలవుపుచ్చుకొని ఆయన చైనాకు వచ్చెను.

ఆయన హాంకాంగులో దిగగానే గొప్ప సన్మానసభ జరిగెను. 1911 వ సంవత్సరము డిశంబరు 24 వ తేదీన ఆయన షాంఘాయి చేరెను. గొప్ప యుత్సవముతో నాయన విడిదిగృహమునకు గొనిపోబడెను. తరువాత నయిదుదినములకు నాన్కింగు పట్టణమున చైనాయొక్క పదునేడు రాష్ట్రముల ప్రతినిధులుగల తాత్కాలికపు పార్లమెంటుచే తాత్కాలికపు అధ్యక్షుడుగ సన్‌యటుసేనెన్నుకొనబడెను. ప్రత్యేకరైలులో షాంఘాయి నుండి ఆయన నాన్కింగుకు వచ్చెను. కొన్నిశతాబ్దములనుండియు పాడుబడియున్న మింగుచక్రవర్తుల రాజమార్గముగుండఅధ్యక్షుని స్వాగతపుటూరేగింపు మిగులవైభవముతోపోయి రాష్ట్రపాలకుడుండినసౌధమునుచేరెను. అమెరికాఅధ్యక్షుడు కాపురముండెడు శ్వేతమందిరమువలె ఆసౌధమంతయు తెలుపుగచేయబడెను. 1912 సంవత్సరము జనవరి మొదటితేదీన చైనాయొక్క వివిధప్రాంతములనుండియు విచ్చేసినయుద్యోగస్తులు, సేనాధిపతులు, వర్తకులు, విద్యార్థులు, జాతీయవాదులు మొదలగువారియెదుట అత్యంతమగు నుత్సాహముతోడను, కోలాహలముతోడను చైనా ప్రజాస్వామ్యముయొక్క ప్రథమఅధ్యక్షుడగు సన్‌యటుసేను

యొక్క అభిషేకోత్సవము జరిగెను. ఆ దినమునుండియు (**Republican Calender**) నూతన ప్రజాస్వామ్యశకముయొక్క ప్రథమసంవత్సరము ప్రారంభముచేయబడినది. ప్రజాస్వామ్యమునకు చైనావారికిని, మంచూరియావారికిని మంగోలియనులకును, టిబెటువారికిని, మహమ్మదీయులకును, గుర్తుగ అయిదు వివిధ రంగులచారలుగల నూతనపతాకము నెలకొలుపబడెను. చెరసాలల లోని జాతీయవాదులనందరిని విడచిపెట్టిరి. వాంగుచింగువై మొదలగువారందరును చెరసాలలనుండి బయటకువచ్చిరి. మంచూ చక్రవర్తికిని, ఆయన కుటుంబమునకును సాలుకు నలుబదిలక్షల రూప్యములు పించన్ (ఉపకారవేతనము) ఇచ్చుటకును, పికింగు లోని యొకరాజనగరు వారిక్రిందనుండుటకును నిర్ణయించబడినది.

కాని చైనాలోని దక్షిణప్రాంతములును మధ్యప్రదేశము లును మాత్రమే జాతీయభావములతో నిండియుండెను. ఉత్తర ప్రాంతములలో నింకను ప్రజలు మేల్కొనలేదు. అచట యూాయన్ షికాయియొక్కయు, ఆయనమిత్రులయొక్కయు అధికారము బాగుగపాతుకొని యున్నది. వారు నాన్‌కింగు సమావేశమునకు రాకయూరుకొనిరి.

**సన్‌యటుసేను అధ్యక్షపదవిని త్యజించుట**

తాము ప్రజాస్వామ్యసిద్ధాంతమునకే అనుకూలురమని ప్రకటించిరి, గాని చైనాలో ప్రజాస్వామ్యమును స్థాపించవలసినదని రాజమాత యిచ్చిన ఆజ్ఞననుసరించి యట్టిబాధ్యత యూాయన్‌షికాయి మీదమాత్రమే కలదని చెప్పిరి. నాన్‌కింగు సమావేశము శాస్త్రీయమైనది కాదని వాదించిరి. సన్‌యటుసేను వారిపైకి సేనలు పంపవలసి వచ్చెను. యూాయన్‌షికాయి తన యభిప్రాయములను

మార్చుకొంటిననియు ప్రజాస్వామ్యమును స్థాపించుకొను అధికారము ప్రజలదే కాని రాజమాత యిచ్చిన అధికారప్రకారము కాదనియు ప్రకటించెను. కాని ఉత్తర దక్షిణప్రాంతముల వారందరు కలసి యొకేశాంతికరమగు మార్గమున నడచుట యుక్తమని వర్తమాన మంపెను. అన్నిప్రాంతములవారును ప్రజాస్వామ్య సిద్ధాంతము నవలంబించినందులకు సన్‌యటుసేను సంతసించెను. రాజరికము సాంతముగ పోయినది. మరలదానిని పునరుద్ధరించ దలచినవారులేరు. ఇది సన్‌యటుసేనుకును, ఆయన స్థాపించిన క్యూమిన్‌టాంగుకును సంపూర్ణమగు జయమని తలచబడెను. కాని దేశములో భేదాభిప్రాయము లన్నియు సమసిపోయి ఐక్యతతో పనిచేయనిచో విదేశీయులు శాంతిరక్షణముల పేర దేశములోని భాగముల నాక్రమించ వచ్చును. యూయన్‌షికాయిని అధ్యక్షునిగ నెన్నుకొనినచో తాము నూతన చైనా ప్రజాస్వామ్యము నంగీకరించి దాని యభివృద్ధికి తోడ్పడెదమని ఆంగ్లేయప్రభుత్వ ప్రతినిధి కబురంపెను. సన్‌యటుసేనువంటి అతివాది యధ్యక్షుడగుట వారి కిష్టములేదు. చైనాలో సౌష్ఠవముగల ప్రజాస్వామ్యమును స్థాపించుట, ప్రజలు సౌఖ్యముగ నుండగ చూచి యానందించుటయే సన్‌యటుసేను తన జీవిత ధర్మమని తలచెను. తన కేమియు పదవులు కావలెనని యాయన కాంక్షించలేదు. క్యూమిన్‌టాంగు సంఘము కొలదికాలములో తయారుచేయు రాజ్యాంగవిధానము ప్రకారము తాను అధ్యక్షుడుగ పనిచేతునని యూయన్ షికాయి యొప్పుకొనెను. కావున తాను అధ్యక్షపదవికి రాజీనామా నిచ్చి యూయన్ షికాయిని

అధ్యక్షునిగ చేయుటకు సన్‌యటుసేను నిశ్చయించెను. నాన్‌కింగు లోనే రాజధాని యుండవలెనని నాన్‌కింగు ప్రజాప్రతినిధి సభ వారు కోరిరి. పికింగులో స్థావర మేర్పరుచుకొని కోటలు కట్టు కొని యున్న విదేశ రాయబారులు అచటనుండి నాన్‌కింగుకు లేచి రానేరరనియు జపానుయొక్క ఆక్రమణలనుండి కాపాడు కొనుటకు జపానుకు సమీపముననున్న పికింగులోనే రాజధాని యుండుట యుక్తమనియు యూఆన్‌ షికాయి బదులు చెప్పెను. ఆయన నాన్‌కింగుకు వచ్చి అచటి ప్రజాప్రతినిధి సభ యెదుట అధ్యక్షపదవిని స్వీకరించి పికింగుకు పోవునటులను, పికింగునగరమే రాజధానిగ నుండునటులను నిర్ణయించబడెను. కాని పికింగులోని సేనలలో కొంత కల్లోలము కలిగినదను మిషతో తుదకు యూఆన్ షికాయి నాన్‌కింగుకు రానేలేదు. నాన్‌కింగు నుండి ప్రజాప్రతినిధిసభవలన నొక యుపసంఘము పికింగుకు పంప బడినది. 1912 వ సంవత్సరము ఫిబ్రవరి నెల 14 వ తేదీన తన దేశముయొక్క కల్యాణముకొరకై ప్రపంచములోకెల్ల గొప్ప ప్రజాస్వామ్యముయొక్క అధ్యక్షపదవిని త్యాగమూర్తి సన్‌యటు సేను త్యజించెను. ఆ దినముననే నాన్‌కింగులోని (పర్వులు) ఊఇదా కొండమీదనున్న మింగురాజవంశ స్థాపకుని గోరీయొద్దకు పోయి తాను విదేశీయులగు మంచూ రాజరికమును కూలద్రోసి సంపూర్ణ మగు ప్రజాస్వామ్యమును స్థాపించి తన జీవితమును ధన్యత గావించుకొంటినని ఆయన ప్రకటించెను. మార్చినెల 10 వ తేదీన పికింగునగరమున యూఆన్‌ షికాయి చైనా. ప్రజాస్వామ్య మున కధ్యక్షుడుగా నెన్నుకొనబడెను. 1913 వ సంవత్సరమున

చైనా ప్రజాస్వామ్యమును విదేశప్రభుత్వము లన్నియు నంగీకరించినవి.

సనయటుసేనుయొక్క అవివేకమైన ఔదార్యము చైనా దేశమునకు రానున్న విపత్తుల కన్నిటికిని కారణమయ్యెను. సనయటుసేను అధ్యక్షపదవికి రాజీనామా నిచ్చియుండగూడదు. ఆయన రాజీనామా నిచ్చి అభివృద్ధినిరోధకుడైన యూయన్ షికాయిని అధ్యక్షునిగ చేయుటవలన ఆయన జరిపిన విప్లవము ఆ విప్లవములో జరిగిన అఖండ త్యాగము వృథా అయినవి.



# చైనా విప్లవము

## పంచమాధ్యాయము

---

### సైనికనాయకుల పాలనము

### 1

నాన్‌కింగునుండి పోయి వివిధరాష్ట్రముల ప్రతినిధిసభ కొలదికాలములో పికింగునగరమున సమావేశమయ్యెను. చైనా పార్లమెంటునకు శిష్టసభ (Senate), ప్రజాప్రతినిధిసభ (House of Representatives) అను రెండు సభ లుండవలె నని వారు నిర్ణయించిరి. ఆ రెండు సభలకును ఎన్నికలు జరిగి నూతన పార్లమెంటుసభలు 1913 వ సంవత్సరము ఏప్రిల్ నెలలో సమావేశమయ్యెను. ఈ సభలలో క్యూమిన్‌టాంగుకు జెందిన జాతీయవాదు లత్యధిక సంఖ్యాకులుగ నుండిరి. పార్లమెంటు శాశ్వతమగు రాజ్యాంగ విధానము తయారుచేయ మొదలిడెను. క్యూమిన్‌టాంగుసభ యొక్క తీర్మానముల ప్రకారము అధ్యక్షుడును మంత్రులును పార్లమెంటుకు లోబడి నడవవలెను. అన్ని విషయములలోను పార్లమెంటుసభకే సంపూర్ణాధికార ముండవలెను. మంత్రులు ఇంగ్లాడులోవలె పార్లమెంటుకు బాధ్యత వహించి యుండవలెను. క్యూమిన్‌టాంగుయొక్క అభిప్రాయములే పార్లమెంటులో నవలంబింపబడుచు వచ్చినవి. అధ్యక్షుడగు యూయన్‌షికాయి

యూయన్‌షికాయి యొక్క నిరంకుశ పాలనము

పార్లమెంటును తనకు లోబడునటుల జేసికొని నిరంకుశముగ పాలించదలచెను. క్యూమిన్‌టాంగు తన కడ్డముతగులుచున్నదని తలచి రాజ్యాంగవిధాననిర్ణయ విషయమై శ్రద్ధగ పనిచేయుచున్న క్యూమిన్‌టాంగు సభయొక్క కార్యదర్శి యగు సజగు చౌజెజను దుండగీడులచే హత్యగావింపజేసెను. ఇందువలన అధ్యక్షునిపై పార్లమెంటుసభ్యులు కోపోద్దీపితులైరి. అధ్యక్షుని సందేశమును జదువనివ్వలేదు. అతని మంత్రులపై విశ్వాసరాహిత్యమును తీర్మానించిరి. యూాయజ షికాయి పార్లమెంటును లక్ష్యముచేయలేదు. పికింగులోనున్న విదేశప్రభుత్వముల రాయబారులతో కుట్రలు సలిపెను. విదేశీయులకు అడిగిన హక్కులనెల్ల యిచ్చి 1913 వ సంవత్సరము ఏప్రిలు నెల 27 వ తేదీన విదేశప్రభుత్వములవద్ద చైనాను అభివృద్ధిచేయునిమిత్తమని చెప్పి (**Re-organisation loan**) ఉప్పుపన్నును స్వాధీనతనఖాను పెట్టి రెండు కోట్ల యేబదిలక్షల సవరనులను (అనగా 33¼ కోట్ల రూప్యములను) ఋణమును తీసికొనెను. అప్పటి తాత్కాలిక రాజ్యాంగ విధానప్రకారము పార్లమెంటుయొక్క అనుమతిలేనిది యధ్యక్షుడు ఋణముచేయుట కధికారము లేదు. ఈ ఋణముచేయుట కవసరములేదని పార్లమెంటు తీర్మానించినది. పార్లమెంటు మంజూరుచేయనిదే యూాయన్ షికాయికి ఋణమునిచ్చుట యక్రమమనియు చైనాజాతి యాఋణమును మరల చెల్లించు బాధ్యత వహించదనియు క్యూమిన్‌టాంగు పక్షమున సజయటుసేను విదేశప్రభుత్వములకు దెలియజేసెను. ప్రథమమున అమెరికా, ఇంగ్లాండు, రుష్యా, జర్మనీ, ఫ్రాన్సు, జపానులు కలిసి ఋణము

నిచ్చునటుల యొడంబడిక జరిగెను. క్యూమిన్‌టాంగు యొక్క అసమ్మతి తెలుపబడిన తర్వాత తామీ ఋణమునందు జేరజాలమని యమెరికావారు వెనుకకుదీసిరి. మిగిలిన అయిదు జాతులవారే (ఇంగ్లాండు, రుష్యా, జర్మనీ, ఫ్రాన్సు, జపాను జాతులవారు) యావత్తు ఋణమును యూాయన్ షికాయికిచ్చిరి. ఆసొమ్ము చేతికిరాగ నాయన పార్లమెంటును తృణీకరించి తన చిత్తము వచ్చినటుల ప్రవర్తింప గలిగెను. తన యిష్టము వచ్చిన మంత్రులను నియమించెను. తన చిత్తమువచ్చిన సేనలను పెట్టుకొనెను. రాష్ట్రములమీద సేనాధిపతులను గవర్నరులుగ నియమించెను. తనకు వ్యతిరేకముగ నున్నవారిని జైలులో పడవేసెను. 1913 వ సంవత్సరము అక్టోబరు నెలలో వెనుకటి మంచూచక్రవర్తులు విదేశీయులకు కలుగజేసిన అన్నిహక్కులను, అధికారములను తాను అంగీకరించుచున్నాననియు పూర్తిగ అమలుజరిపెదననియు ప్రకటనము గావించెను. మంగోలియాలోని పడమటి భాగములో రుష్యావారు ప్రవేశించిరి. అచటివారిని పురిగొల్పి వారిచేత చైనా నుండి స్వతంత్రమును ప్రకటింప జేసిరి. అచట రుష్యావారు వచ్చి కాపుర ముండవచ్చుననియు వర్తకము జేసికొనవచ్చుననియు వారిచే హక్కులను పొందిరి. వీటికన్నిటికిని యూాయన్ షికాయి సమ్మతించి పశ్చిమ మంగోలియా తనకు సామంతదేశముగ నుండునటుల నొడంబడిక చేసికొనెను. టిబెటులో నాంగ్లేయులును మంచూరియాలో జపానువారును బలపడుటకు ఆయన హర్షించెను. ఇది సహించలేక సన్‌యటుసేను నాయకత్వమున చైనా జాతీయవాదులు షాంఘూయి పట్టణమున తిరుగబాటును లేవ

దీసిరి. అయిదు దక్షిణ రాష్ట్రములు తిరుగబాటులో చేరెను. కాని యీ తిరుగబాటును యూయన్‌షికాయి తేలికగ అణచ గలిగెను. తిరుగబాటులతో ప్రజలు విసిగియుండిరి. సన్‌యటు సేను జపానుకు పారిపోయెను. యూయన్‌షికాయి క్యూమిన్‌టాంగును అక్రమసంఘమని ప్రకటించెను. 1914 వ సంవత్సరము జనవరి నెలలో పార్లమెంటును విచ్ఛిన్నము చేసెను. శాశ్వతమగు రాజ్యాంగ విధానమును తయారుచేయుట కొరకు యుపసంఘమును నియమించెను. వారు తయారుచేసిన విధానప్రకారము పైసభయగు సెనేటుసభ అధ్యక్షునిచే (నామినేషన్) నియామకము చేయబడెను. క్రిందిసభయగు ప్రజాప్రతినిధిసభ (**House of Representatives**) యొక్క అధికారములు తగ్గించ బడెను. మంత్రులందరును అధ్యక్షునిచే నియమింపబడి యాయనకే బాధ్యత వహింపవలెనుగాని పార్లమెంటునకు బాధ్యత వహించ నక్కరలేదు. ఇట్టి రాజ్యాంగవిధానమును స్థాపించి యూయన్‌షికాయి 1915 వ సంవత్సర మాఖరువరకును అధ్యక్షుడుగ పాలనమును గావించెను.

జపానుయొక్క దౌర్జన్యము

1914 వ సంవత్సరమున యూరపుఖండమున ప్రపంచ యుద్ధము ప్రారంభమయ్యెను. అది యన్ని ఖండములకును వ్యాపించెను. ఇంగ్లాండు, ఫ్రాన్సు, రుష్యా, ఇటలీ మొదలైన దేశము లొక ప్రక్కన జేరెను. వీరికి మిత్రమండలి యని పేరు. వారికి వ్యతిరేకముగ జర్మనీ, ఆస్ట్రియా, తురుష్కము మొదలయిన దేశములు చేరెను. చైనావారు చాలకాలమువరకును నెటువైపు

నను జేరక తటస్థముగ నుండిరి. కాని జపాను త్వరలోనే మిత్ర మండలిపక్షమున జేరెను. 1914 వ సంవత్సరమున నవంబరు నెలలో చైనాదేశములో జర్మనీయొక్క తొంబదితొమ్మిది సంవత్స రముల కౌలుక్రిందనున్న కయచోశేరాష్ట్రము (షాంటూంగు) పై జపాను దండెత్తి దానిని యాక్రమించుకొనెను. హిందూదేశము నుండి వచ్చిన బ్రిటిషు సేనలు జపానుకు సహాయము చేసెను.

తక్కినదేశము లన్నియు ప్రపంచయుద్ధములో పడి యుండగ 1915 వ సంవత్సరము జనవరినెల 15 వ తేదీన యిరువది యొక్క నూతన హక్కులను కోరుచు జపానుప్రభుత్వము యూయన్‌షికాయి కొక యంత్యసందేశ మంపెను. యూయన్ షికాయి గడగడలాడెను. తమకు వెనుక చైనాజాతియున్నదన్న

జపాను ఇరువదియొక్క నూతన హక్కులను కోరెను

నైతికబలము లేదు. సైనికబలము వలననే నిరంకుశముగ పాలనము చేయుచున్నాడు. తన మిత్రులైన ఆంగ్లేయ రుష్యా రాయబా రుల నాలోచించెను. వారికి జపానువారు పరమ మిత్రులు. తాత్కాలికముగ లోబడి యేదోవిధముగ జపానుతో సంధి చేసి కొనవలసినదనియు ప్రపంచయుద్ధము ముగిసిన పిమ్మట సంధి జరిగినప్పుడు సంధిసమావేశమునందు చైనాకు కలిగిన యక్రమ మును గూర్చి చెప్పుకొనినచో వారు సరిచేసెదరనియు నా రాయ నకు సలహా నిచ్చిరి. ఆయన జపానుకు లోబడెను. వారు కోరిన వరములలో చాలవరకు నిచ్చి 1915 సంవత్సరము మే నెల 7 వ తేదీన జపానుతో సంధిచేసికొనెను.

ఈ సంధివలన (1) కయచోజే (షాణ్టంగు) రాష్ట్రపు కొలుహక్కును జర్మనీవారు జపాను కిచ్చినచో చైనాప్రభుత్వము సమ్మతించవలెను. (2) దక్షిణమంచూరియాలో జపానువారు స్వేచ్ఛగా నివసించి వర్తకము చేసికొనవచ్చును. పరిశ్రమలను స్థాపించవచ్చును. వ్యవసాయిక పారిశ్రామిక వర్తకపు పనుల నిమిత్తము భూములను సంపాదింపవచ్చును. అచటి జపానువారిమీద జపానుప్రభుత్వమునకే యధికార ముండును. (3) దక్షిణ మంచూరియాలోగాని తూర్పు మంగోలియాలోగాని చైనాప్రభుత్వమువారు రైళ్ళు వేయదలచినప్పుడు అందుకుగావలసిన ఋణములను ముందుగ జపానువారి నడుగవలెను. విదేశ సలహాదార్లు కావలసివచ్చినప్పుడును ముందుగ జపానువారి నడుగవలెను. వారు ఇవ్వనప్పుడే యితరులవద్దకు చైనావారు పోవచ్చును. (4) దక్షిణ మంచూరియాలో గనులెక్కడనున్నవో జపానువారు పరీక్షించి తమకు కావలసినవాటిని త్రవ్వుకొన వచ్చును. (5) చైనాలో నిదివరకు అనుమతిని పొందియున్న ఇనుప, ఉక్కు, గనుల పరిశ్రమల వర్తక సంఘమువారును జపాను వర్తకులును పరతు లేర్పరచుకొని సమ్మేళనమైనచో చైనాప్రభుత్వమువారు అభ్యంతరపర్చక, వారికి గనులు త్రవ్వుకొనుటకును పరిశ్రమలను సాగించుటకును అనుమతి నివ్వవలెను. జపాను వర్తకుల యనుమతిలేనిది యా గనులను చైనాప్రభుత్వము తన క్రిందికి తీసికొనకూడదు. ఇందువలన చైనాలోనున్న గొప్ప ఇనుప ఉక్కు కంపెనీ యగు హానియెపింగు సంఘము (**Hanyehping**) జపానువర్తకుల

జపాను విశేషమగు హక్కులను పొందెను

యాజమాన్యముక్రిందికి వచ్చినది. జపానుయొక్క పరిశ్రమాభి వృద్ధికి కావలసిన ఇనుము రాతిసిబొగ్గు తమ దేశములో లేదు. కావున ఈ సంఘముద్వారా ఇదివరకు కౌలును పొందిన చైనా లోని భాగ్యవంతమైన బొగ్గు, ఇనుప గనులను జపానుక ర్తకుల యాజమాన్యము క్రిందికి తెచ్చుకొనినారు. ఈ సంఘమువారు త్రవ్వించి తయారుచేయుచున్న ఇనుమునంతను బజారుధరలకన్న కొంత తక్కువధరలకు జపానుప్రభుత్వము కొనునటుల యేర్పాటు జరిగినది. వీరికి జపానుబ్యాంకివారు కావలసిన ఋణమిచ్చి సిరి ఆ స్తిని గనులయందుగల హక్కును తాకట్టును పొందినారు. వీరి క్రిందనున్న టాయే (Tayeh) ఇనుపగనులలో సాలుకు పదిలక్షల టన్నులచొప్పున యేడువందల సంవత్సరములవరకు త్రవ్వుకొన గలిగిన శ్రేష్ఠమైన ఇనుము గలదు. వాటిప్రక్కననున్న మిగుల విలువగల రాగి, సీసం, తుత్తినాగము మొదలగు గనులును వీరిక్రింద నున్నవి.

(6) జపానువారి వర్తకము నిమిత్తము దక్షిణమంచూరి యాలో కొన్ని రేవులను చైనా తెరవవలెను. తూర్పుమంగోలి యాలో కొన్ని వర్తక స్థానముల నివ్వవలెను.

(7) లయోటన్‌గు, పోర్టుఆర్థరు, డాల్నిలకు జపానువారి కిదివరకుగల కౌలు 1997 వ సంవత్సరమువరకును పొడుగించ బడెను.

అప్పటినుండియు చైనా ప్రజాస్వామికమునందు జపాను యొక్క ప్రాబల్యము చాలగ హెచ్చినది. యూయన్‌షికాయి కాలములోనేమి తరువాతనేమి జపాను పికింగులోని చైనా

చైనా స్వతంత్రమునకు జపాను ప్రబలశత్రువైనది

ప్రభుత్వపు అధికారముకొరకు చైనాసైనిక నాయకులలో జరుగుచున్న అంతఃకలహములలో ప్రవేశించి తన పలుకుబడిని వృద్ధి చేసికొనెను. వారిలో ముఖ్యులకు రుణములనిచ్చి లోబరుచుకొనెను. కయచోబే రాష్ట్రములోను దక్షిణ మంచూరియాలోను చాలగ రైళ్లను వేసెను. అందు నిమిత్తమని షుమారు నలుబది కోట్ల రూప్యములను చైనాప్రభుత్వమును స్వాధీనపర్చుకున్న వారికి అప్పుపెట్టి యాస్తులను తనఖా పొందెను. దక్షిణ మంచూరియాలోని అడవులలో కలపను తీసికొనుటకు హక్కును పొందెను. చైనాలో నొక మారకపు బ్యాంకిని స్థాపించి చైనా ప్రభుత్వముతో లావాదేవీలు నడపెను. 1915 సంవత్సరపు సంధి షరతులనుకూడ మీరి దక్షిణ మంచూరియాలో నక్కడక్కడ తన సైనికులను పోలీసులను పెట్టి కొన్నిచోట్ల తన పాలనమును స్థాపించుకొనెను. మిగత విదేశములకన్నకూడ జపాను చైనా యొక్క స్వతంత్రమునకు ప్రబలమైన శత్రువైనది.

## 2

1915 వ సంవత్సరమున 'శాంతిస్థాపనసంఘ' మొకటి యూాయన్‌షికాయి యాదరణముక్రింద బయలుదేరి ప్రజాస్వామికముకన్న రాజరికమే మంచిదనుభావమును ప్రజలలో వ్యాపింపజేయుచుండెను. ఆసంవత్సరము డిశంబరునెలలో

యూాయన్‌షికాయి చక్రవర్తియగుట

తన చెప్పుచేతలలోనున్న పార్లమెంటు చేత యూాయన్‌షికాయి వంశపర్యాయపు హక్కుగల

చక్రవర్తిగ నెన్నుకొనబడెను. ఈవిషయమున ఆయనకు ముఖ్య సలహాదారుగ ప్రొఫెసరుగుడ్నో అను ఆంగ్లేయుడు పనిచేసెను. 1916 వ సంవత్సరము జనవరి మొదటితేదీన యువాన్‌షికాయికి పట్టాభిషేకము జరుపవలెనని ప్రయత్నములు జరుగుచుండెను. ఈ మోసకార్యము చైనా ప్రజలలో నత్యధిక సంఖ్యాకులకు ఆగ్రహమును కలుగచేసెను. జపానుకు పారిపోయి యున్న సన్‌యటుసేను చైనాకు వచ్చి గొప్పతిరుగబాటును యువాన్ షికాయిపై లేవదీసెను.

సన్‌యటుసేను 1913 వ సంవత్సరమున చైనాను విడచి పోయి 1915 సంవత్సరము డిశంబరువరకును జపానులో నుండెను. తన జీవితము నర్పించిన స్వతంత్రోద్యమము యువాన్‌షికాయి యొక్క ద్రోహమువలనను విదేశస్థుల కుట్రల వలనను నాశనము గావింపబడుచున్నందుకు

చింగులింగుదేవి

వగచుచు సమయము కనిపెట్టి యువాన్‌షికాయిని అతని సైనిక బృందమును వెడలగొట్టి స్వచ్ఛమైన ప్రజాస్వామ్యమును పునరుద్ధరించుటకును విదేశీయుల అధికార ప్రాబల్యములను నిర్మూలము గావించుటకును యోచించుచుండెను. జపానులోనున్న చైనా విద్యార్థులలో పనిచేయుచుండెను. చైనాలోని మిత్రులతోను త్తర ప్రత్యుత్తరములు రహస్యముగ జరుపుచుండెను. 1915 వ సంవత్సరమున ఆయనతోకలసి చైనా స్వతంత్రోద్యమ సాఫల్యముకొరకు తన యావజ్జీవితమును ధారపోయదలచిన యొక ఇరువదిమూడు సంవత్సరముల యువతి అమెరికాలో విద్యాభ్యాసమునుపూర్తిచేసి వచ్చి జపానులో ఆయనను చేరెను. ఆమెతంద్రియగు సూంగు

షాంఘాయిలో గొప్ప వర్తకుడు. ప్రథమమునుండియు చైనా స్వతంత్రోద్యమమునందు అత్యంతముగ తోడ్పడుచున్నవాడు. ఆయన తన కుమారునికిని కుమార్తెలకును బాగుగ విద్య చెప్పించెను. వారు అమెరికాలోని విశ్వవిద్యాలయములలో పట్టబిరుదముల నందిరి. గొప్ప ఆదర్శములతో పెరిగిరి. వారిలో పెద్దకుమార్తె యగు రోజమండు చింగులింగు దేవి (**Rosamund Ching Ling**) విద్య పూర్తికాగనె జపానులో సన్ యటుసేనును చేరెను. అచిరకాలములోనే తన తండ్రియొక్క అనుమతిని బొంది సన్ యటు సేనును పెండ్లియాడెను. ఆయన కపుడు నలుబదితొమ్మిది వత్సరముల వయసుకలదు. అప్పటినుండియు నా సుందరాంగి విదుషీమణి సన్ యటు సేనుయొక్క జీవితాదర్శములలోను జీవితయాత్రలోను భాగస్వామియై యెల్లపుడు నాయనకు ధైర్యమును ప్రోత్సాహమును శక్తిని కలుగజేయుచు ఆయనకును ఆయనయొక్క మహోద్యమమునకును పట్టుకొమ్మయై పరగినది.

యూయన్ షికాయి చక్రవర్తి యగుటకు యత్నించుచున్నాడని తెలియగనె సన్ యటుసేను చింగులింగు దేవితో కూడ చైనాకు వచ్చి యూయన్‌షికాయిపై తిరుగుబాటు లేవదీయుటకు గొప్ప సన్నాహములను చేసెను. "ప్రజాస్వామ్యమునకు ద్రోహియు, విదేశ ప్రభుత్వములకు దాసుడును నగు యూయన్‌షికాయి చక్రవర్తిపై అందరును యుద్ధమును ప్రకటించవలసినదని లెక్కకుమించిన కరపత్రములను దేశముయొక్క అన్ని మూలలకును వ్యాపింపజేసెను. చైనాయొక్క దక్షిణభాగము

యూయన్‌షికాయిపై తిరుగుబాటు

తిరుగుబాటులోచేరి యూయన్ షికాయినుండి స్వతంత్రమును ప్రకటించి ప్రజాస్వామ్యమును స్థాపించెను.

యూయన్‌షికాయియొక్క అనుచరులలో చాలమంది తమకు వ్యతిరేకముగ ప్రబలిన ప్రజాభిప్రాయమునకు భయపడిరి. యూయన్‌షికాయికి గొప్ప భీతి జనించెను. చక్రవర్తిత్వమును త్యజించితినని ఆయన ప్రకటించెను. పార్ల మెంటుకు మంత్రులను బాధ్యులుగ గావించి యాపత్తు పాలనమును ట్యూయన్‌చిజుయి అను ప్రధాన మంత్రికిని యితర మంత్రులకును సప్పగింత చేసెను. కాని ఆయనకు వెంటనే పిచ్చియెత్తెను. 1916 వ సంవత్సరము జూన్ నెల 6 న తేదీన యూయన్‌షికాయి మరణించెను. ఆయన నిరంకుశుడే గాని బలాఢ్యుడు. ఆయన కాలమున దేశములో శాంతిగలిగి వర్తకవ్యాపారములు, విద్య, వ్యవసాయము, రోడ్లు మొదలగునవి అభివృద్ధి చెందెను. ఆంగ్లేయులు హిందూదేశము నుండి చైనాకు నల్లమందును పంపుట పూర్తిగ మానుకొనిరి. చైనాదేశములో నల్లమందు వాడుక నిషేధించబడెను. కాని తన యధికారమును బలముగ నిలువబెట్టుకొనుటకొరకు ఆయన విదేశస్తులకు లోబడి వారియొక్క హక్కులను ప్రాబల్యమును వృద్ధిచేసెను.

యూయన్‌షికాయి మరణము

## 3

యూయన్‌షికాయి మరణించగనే లియున్‌హుంగు సేనాని పార్లమెంటుచే నధ్యక్షుడుగ నెన్నుకొనబడెను. ఆయన జాతీయ

వాది. యోగ్యుడు. ఇదివరకు హాంకోలో జాతీయవాదులు తిరుగ బాటును సాగించినపుడు జాతీయపక్షమున కాయన సహాయమును చేసియుండుట చూచి యున్నాము. అధ్యక్షుడు కాగనే ఆయన యూాయన్ షికాయిచే వెడలగొట్టబడిన పార్లమెంటును సమా వేశపరచెను. కాని ప్రధానమంత్రి యగు ట్యూయన్‌చిజుయి సేనానికి కేవలము పార్లమెంటుకు బాధ్యతవహించి నడుచు కొనుట కిష్టములేదు. ఆయన తన స్నేహితులగు ఉత్తరరాష్ట్ర ముల పాలకులగు సేనాధిపతుల సహాయమును పొంది కొలది కాలములోనే అధ్యక్షుని కేవలము బొమ్మగ జేసెను. పార్ల మెంటు విచ్ఛిన్నము చేయబడెను. అప్పటినుండియు ఉత్తరమున నున్న సేనాధిపతులు తమలోతాము కలహించుచు పికింగులో నున్న అధ్యక్షులను తమచిత్తమువెంట తీసివేయుచు క్రొత్తవారి నెక్కించుచు చైనాప్రజాస్వామికము పేర పికింగులో పది సంవత్స రముల వరకు పాలనమును సాగించుచు వచ్చిరి. ఈ సేనాధిపతుల కక్షలలోను కుట్రలలోను విదేశరాయబారులు ప్రవేశించి వారికి ఋణముల నిచ్చుచు ఆయుధసామగ్రులను సప్లయిచేయుచు తమ తమ ప్రభుత్వ పలుకుబడిని వృద్ధిచేసికొనుచుండిరి. చైనాయొక్క అంతఃకలహములు విదేశప్రభుత్వముల ప్రాబల్యమునకు మిగుల సహకారి యయ్యెను.

లియున్‌హాంగు సేనాని అధ్యక్షత దగుట

పికింగులో కొంతకాలము లియుఞాహాంగు అధ్యక్షుడుగ నుండెను. పిమ్మట కియాంగ్సురాష్ట్రపాలకుడైన చాంగుహ్సూఞ

సేనానియొక్క సహాయమున ప్రధానమంత్రి యగు ట్యూయన్ చిజుయిని వెడలగొట్టెను. చాంగుహ్స్యాన్ సేనాని కొలదికాలములో అధ్యక్షుడగు లియున్ హాంగునే వెడలగొట్టి మంచూచక్రవర్తి యగు పూయిని రాజ్యాభిషిక్తుని చేసెను. అధ్యక్షుడు పారిపోయి మరల ట్యూయన్ చిజుయియొక్కయు అతని మిత్రులయొక్కయు శరణు జొచ్చగ వారు మంచూచక్రవర్తిని చాంగుహ్స్యాన్ సేనానిని వెడల గొట్టి లియున్ హాంగుయొక్క అధ్యక్షతను పునరుద్ధరించిరి. పిమ్మట కొలదిరోజులలో లియున్ హాంగు తనచుట్టు నున్న కుట్రలకు విసిగి అధ్యక్షపదవికి రాజీనామా నివ్వగ ఫెంగు క్యుచంగు సేనాని అధ్యక్షుడుగ నెన్నుకొనబడెను. అధికారమంతను ప్రధానమంత్రి యగు ట్యూయన్ చేతిలో నుంచుకొనెను. నూతన ఎన్నికల విధానమును తయారుచేసి తన చెప్పుచేతలలో నుండెడి పార్ల మెంటును స్థాపించెను. తన కిష్టమైన ఉత్తరాది సేనానులను దక్షిణరాష్ట్రములపైన కూడ పాలకులుగ నియమించెను.

ఫెంగుసేనాని అధ్యక్షుడగుట

1918 వ సంవత్సరము అక్టోబరు నెలలో ప్రధానమంత్రి యగు ట్యూయన్‌చే అధ్యక్షుడగు ఫెంగు వెడలగొట్టబడి యం హ్సుషిచంగు అధ్యక్షుడుగ చేయబడెను. ట్యూయన్ బృందము వారు జపానువద్ద ఇరవై కోట్ల డాలర్ల ఋణ మును తీసుకొని జపానుప్రభుత్వము యొక్క పలుకుబడికి పూర్తిగ లోబడియుండిరి. రైల్వేలు మొదలగువానిని వేయు హక్కులను జపాను షాహుకార్ల కిచ్చిరి. 1918 వ సంవ త్సరమున చైనాదేశముపై జపానుయొక్క సంరక్షకత్వము

ట్యూయన్ బృందము

నంగీకరించుచు రహస్యపు టొడంబడికలు చేసికొనినటుల కూడ బయలుపడినది.

ఇటుల ఉత్తరమున పికింగులో అధికారముకొరకు సైనిక నాయకులమధ్య పోరాటములు జరుగుచుండగ దక్షిణమున కాంటన్ నగరమున 1917 వ సంవత్సరము నుండియు సన్‌యటుసేను స్వతంత్రమగు ప్రజాస్వామికమును స్థాపించెను. కొంత నౌకాదళమును చేర్చెను. పికింగు అధ్యక్షుడు వెడలగొట్టిన చైనా పార్లమెంటును కాంటన్ నగరమున సమావేశపరచెను. ఆయనక్రింద ఆరు రాష్ట్రములు చేరెను. పికింగుప్రభుత్వమున కిచ్చిన ఋణములు చెల్లవని విదేశప్రభుత్వములకు తెలియజేసెను. ఉత్తరమున దేశద్రోహము గావించుచున్న పికింగుప్రభుత్వమును కూలద్రోసి యావత్తుదేశమును సరియైన ప్రజాస్వామ్యము క్రిందికి తెచ్చుటకుగాను పార్లమెంటువారు తీర్మానించిరి. కాని కొలదికాలములోనే కాంటన్ పార్లమెంటులోని కొందరు ముఖ్యులకును సన్‌యటుసేనుకును భేదాభిప్రాయములు కలిగి వారు స్వార్థపరులుగ ప్రవర్తించుచున్నారని ఆయన తలచి కాంటన్ పదలి షాంఘాయిలోని ఫ్రెంచివారి ప్రదేశమున నొక శాంతికుటీరమును నిర్మించి యందు భార్యతోకూడ నివసించెను. అందువలన కాంటన్ ప్రభుత్వము యొక్క పలుకుబడి క్షీణించెను. కాంటన్‌లో నుండగనేమి షాంఘాయికిపోయిన పిమ్మటనేమి సన్‌యటుసేను స్వతంత్రోద్యమ తత్వమునుగూర్చి గ్రంథములను కరపత్రములను వ్రాయుటలో విశేషకాలమును గడపెను. తన కుటీరమునందు గొప్ప

కాంటన్ ప్రజాస్వామికము

పుస్తకసముదాయమును చేర్చెను. ఈ గ్రంథరచనలో నాయన సతీమణి మిగుల తోడ్పడుచుండెను.

## 4

ఆ కాలమున జరుగుచున్న ప్రపంచయుద్ధమునందు చైనా దేశ మేపక్షమునను చేరక తటస్థముగ నుండుటయే సన్‌యటుసేను యొక్క యుద్దేశ్యము. చాలకాలము పికింగు ప్రభుత్వముకూడ ఎటుసుచేరలేదు. కాని తుదకు 1917 వ సంవత్సరమున పికింగులోని ట్యూయన్‌బృందమువారు మిత్రమండలి పక్షమున చేరుటకు తీర్మానించిరి. ఇంతలో అమెరికా అధ్యక్షుడగు విల్సన్ సభాపతి పదునాలుగు సూత్రములను ప్రకటించి మిత్రమండలి పక్షమున చేరుటకు తీర్మానించి తటస్థదేశముల నన్నిటిని తన పక్షమున చేరవలెనని సందేశ మంపెను. దాని ననుసరించియు, ట్యూయన్ బృందమువారు యుద్ధము ముగిసిన పిమ్మట జరుగు సంధులలో జపానుకనుకూల మగు షరతుల కొప్పుకొందురను భయముళవనను, సన్ యటు సేను కాంటన్ ప్రభుత్వమును అమెరికాతోపాటు మిత్రమండలి పక్షమున చేరునటుల గావించెను. యుద్ధములో చైనాకూడ కొద్దిగనో గొప్పగనో మిత్రమండలికి సహాయముచేసెను. కాని యుద్ధమధ్యమున ఆంగ్లేయ, ఫ్రెంచి, రుష్యా, ఇటలీ ప్రభుత్వములు చైనాకు వ్యతిరేకమైన షరతులతో జపానుతో రహస్యపు టొడంబడికలను చేసిరి. ప్రపంచయుద్ధము ముగిసిన తరువాత 1919 సంవత్సర ప్రారంభమున పారిసు నగరమున జరిగిన సంధి

కాంటన్ ప్రజాస్వామికము మిత్రమండలితో చేరుట

సమావేశమునం దా రహస్యపుటొడంబడికలు జపానుకును చాల లాభమును కలుగజేసెను. షాంటంగు రాష్ట్రము స్వయంనిర్ణయ సూత్రప్రకారము చైనాకు ఇవ్వబడవలసియుండగ జపాను కివ్వబడినది. అది కూడదని కాంటన్ ప్రభుత్వ పక్షమున ప్రతినిధిగ వెళ్ళిన సి. టి. వాంగు చాల గట్టిగ పోరాడెను. అమెరికా ప్రతినిధులును చైనాపక్షముననే వాదించిరి. కాని తక్కిన మిత్ర మండలి ప్రతినిధులు తమ ఓట్లను జపానుపక్షమున నిచ్చిరి. షాంటంగు రాష్ట్రము తొంబదితొమ్మిది సంవత్సరముల కౌలుక్రింద జపానుకు స్వాధీనపరచినటుల 1919 వ సంవత్సరము జూన్ నెలలో జరిగిన వర్సెల్సు సంధిలో వ్రాయబడినది. చైనాలోని విద్యార్థుల విద్యార్థినులవల్ల చేయబడిన గొప్ప ఆందోళనమువలన నా సంధి పత్రముమీద దస్కతులు పెట్టకుండగనే చైనా ప్రతినిధులందరును లేచివచ్చిరి.

జపాను సరకుల బహిష్కారము

1919 వ సంవత్సరాంతమునుండియు షాంటంగురాష్ట్రము నుండి జపానువారిని వెడలగొట్టుటకై చైనా యువజనులు గొప్ప యాందోళనమును లేవదీసిరి. చైనా దక్షిణ ప్రాంతములోవలెనే యుత్తర ప్రాంతమున కూడ యువజనులలో దేశాభిమానము పూర్తిగ ప్రజ్వరిల్లుచున్నది. వయసు ముదిరినవా రెంత స్వార్థపరులుగ ప్రవర్తించుచున్నను యౌవనులు తమయొక్క నిర్మలమైన జీవితములను మాతృదేశ స్వాతంత్ర్యమునకై బలిదానమిచ్చుచు చైనా యొక్క భావికళ్యాణమును నిర్మాణము గావించుచుండిరి. డాక్టరు సన యటుసేనుయొక్క పటములను తీసికొని జాతీయ కీర్తనలను

పాడుచు వేలకొలదిగ బయలుదేరి దేశమంతను సంచారము గావించి జపాను సరుకులను చైనాదేశీయులు బహిష్కరించు నటుల అఖండమగు ప్రబోధమును సలిపిరి. బహిష్కారాయుధము చైనా స్వాతంత్ర పోరాటమునందు ప్రధానముగ నుపయోగింప బడుచున్నది. జపానుసరుకుల బహిష్కారము చైనాదేశమం దంతటను పూర్తిగ కొనసాగినది. విశేషముగ వృద్ధియగుచున్న జపానుయొక్క వర్తకమునకు బాగుగ దెబ్బతగిలెను. 1922 వ సంవత్సరమున జరిగిన వాషింగ్టన్ సమావేశమునందు జపాను వారు షాంటంగురాష్ట్రమును చైనాకు వదలివేసిరి. అంతటితో బహిష్కారము వదలివేయబడినది.

జర్మనీ ప్రత్యేక హక్కులను వదలుకొనెను

1921 వ సంవత్సరము మే నెల 20 వ తేదీన చైనాదేశములో జర్మనీకిగల ఆస్తులను ప్రత్యేకహక్కులను అన్నిటిని వదలుకొనుచు జర్మను ప్రజాస్వామిక ప్రభుత్వము పికింగులోని చైనా ప్రజాస్వామికముతో సంధిచేసికొనెను. అంతటి నుండియు చైనాలోని జర్మనులు చైనాప్రభుత్వపు చట్టములకును చైనా న్యాయస్థానముల కును లోబడిరి. అంతేగాని జర్మను రాయబారియొక్క విచారణకు లోబడలేదు, జర్మనీదేశములో చైనావారి కెట్టి హక్కులుండునో అట్టి హక్కులే చైనాలో జర్మనులకుండును. బాక్సరుద్యమమువలన జర్మనీకి చైనాప్రభుత్వము చెల్లించవలసిన నష్టపరిహారమును జర్మనీ వదులుకొనినది. జర్మనీలోని చైనా విద్యార్థులకు విద్యను గరపువిషయమున అన్నివిధములైన సదుపాయములను చేయుటకు జర్మనుప్రభుత్వము సమ్మతించెను.

## 5

పసిఫిక్ మహాసముద్రమున యుద్ధము రాకుండుటకై అమెరికా ప్రభుత్వ కార్యదర్శియగు హ్యూజస్ పసిఫికు మహా సముద్రముతో సంబంధముగల తొమ్మిది ప్రభుత్వ ప్రతినిధులను 1922 వ సంవత్సరం ఫిబ్రవరినెల ఆరవ తేదీన అమెరికా సంయుక్త రాష్ట్రముల ముఖ్యపట్టణమగు వాషింగ్టన్‌నగరమున సమావేశ పరచెను. ఆ సమావేశమునందు అమెరికా యొక్కయు, ఇగ్లాండు యొక్కయు, జపాను యొక్కయు నౌకాదళములు 5, 5, 3 ప్రాప్తినమాత్ర ముండవలెనని నిర్ణయించుకొనిరి. సైబీరియాను వీలయినంత త్వరితముగ వదలివేయుటకు జపాను సమ్మతించెను. చైనాలోని షాన్‌టంగురాష్ట్రమును వెంటనే చైనాకు వదలి వేయుటకు జపాను అంగీకరించెను. అమెరికా సంయుక్తరాష్ట్రములు, ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీ, జపాను, హాలండు, పోర్చుగలు, బెల్జియం ప్రభుత్వములు పికింగులోని చైనా ప్రజా స్వామిక ప్రభుత్వముతో నొక సంధిని చేసికొనిరి. దీనికి తొమ్మిది ప్రభుత్వముల సంధి (**Nine Powers Treaty**) అని పేరు.

ఈ సంధివలన చైనాయొక్క స్వతంత్రమును ఐక్యతను కాపాడుటకును చైనాలో స్థిరమైనప్రభుత్వ మేర్పడుటకు అడ్డు కలుగచేయకుండుటకును ఆ యెనిమిది ప్రభుత్వములు అంగీకరించి నవి. వారిలో నెవ్వరును చైనాలో రాజ్యములనుగాని పలుకుబడి ప్రదేశములనుగాని సంపాదించకూడదు. అంద రును చైనాలో పెట్టుబడిపెట్టి లాభములను పొందుటకును చైనాతో వర్తకము చేసు

వాషింగ్టన్ సమావేశముయొక్క షరతులు

కొనుటకును సమానావకాశములు కలిగియుండవలెను. చైనాలో నిదివరకు విదేశప్రభుత్వములుగాని విదేశ కంపెనీలుగాని వ్యక్తులగు విదేశీయులుగాని పొందిన హక్కులను తెలిపెడి దస్తావేజులయొక్క నకళ్ళను వీలయినంత త్వరితముగ అమెరికా ప్రభుత్వ కార్యదర్శికి పంపవలెను. చైనాలో గల అంతఃకలహముల నవకాశము తీసికొని యెవరును తక్కినవారికిలేని ప్రత్యేక హక్కులను ప్రత్యేకవర్తక సౌకర్యములను పొందకూడదు. ఇంతటి నుండియు చైనాకుసంబంధించి యే పనిని చేసినను సదరు యెనిమిది ప్రభుత్వములవారును ఏకముగ పనిచేసికొనవలెను. చైనా ప్రభుత్వముక్రింద నున్నట్టిగాని విదేశీయులక్రింద నున్నట్టిగాని రైళ్లమీద నొకచోటనుండి మరియొకచోటికి చైనాలో సరుకులు రవానాయగుటకు సరుకుల మొత్తములనుబట్టియు దూరమును బట్టియు సుంకములను వసూలుచేయవలసినదేకాని వాటి యజమానుల జాతిభేదములనుబట్టి వ్యత్యాసము చూపరాదు. తమ దేశములో నేభాగమును ఇకముందు విదేశీయుల కెవరికిని అన్యాక్రాంతమును చేయననియు కౌలు కివ్వననియు చైనాప్రభుత్వ మొడంబడెను. ఇవి యీ సంధియొక్క ముఖ్యమైన షరతులు. ఇందులో నిదివరకు విదేశీయులు పొందిన కౌళ్ళను వదలుకొను షరతు లేమియు లేవు. వారు వెనుకటి చక్రవర్తులను బలవంత పెట్టి పొందిన ఆర్థికహక్కులు పోవుమార్గము లాలోచించలేదు. సుంకముల విషయములోను సాయరువిషయములోను చైనా ప్రభుత్వమున కుండవలసిన సపూర్ణమగు ఆర్థికహక్కు అంగీకరించబడలేదు.

పర్యవసాన మేమనగా విదేశ ప్రభుత్వములు తాము చైనాలో అక్రమముగపొందిన హక్కులను పలుకుబడిని అధికారములను శాంతముగను రాయబారముల మూలమునను ఒడంబడికల మూలమునను వదలుకొనరను దృఢమైన భావము చైనాలో దక్షిణప్రాంతపు ప్రజలలోను నాయకులలోనే గాక ఉత్తర ప్రాంతపు ప్రజలలోను ప్రముఖులలోను తీవ్రముగ వ్యాపించెను.

విదేశీయులు హక్కులను వదలుకొనరను భావము

## 6

అచట పికింగులో జపాను కనుకూలముగనున్న ట్యుయన్ బృందమును వూపిఫు సేనాని (**General wue-pei-Fu**) వెడల గొట్టి సోకన్ సేనానిని (**General tsokun**) అధ్యక్షునిగ గావించెను. కాంటన్ నాయకులుగూడ మరల షాంఘాయి నుండి సన్ యటుసేనను గొనిరాగ నచటి పార్లమెంటు ఆయనను ప్రజాస్వామికమునకు అధ్యక్షునిగ నెన్నుకొనెను. అచట నాదర్శప్రాయమైన ప్రజాపాలనము స్థాపించబడెను. అది నాగరకజాతు లందరి దృష్టి నాకర్షించెను. ఆరురాష్ట్రీయములు ప్రజాస్వామికముక్రింద చేరెను. సన్ యటుసేను యొక్క సాంఘిక సమానత్వపు భావములవలన నాకర్షింపబడిన చన్‌హాక్యాయను కొండజాతివాడు కాంటన్ ప్రభుత్వపు సేనలపై సేనాధిపతిగ నియమింపబడెను. చైనాదేశమునకంతకును నిజమైన ప్రభుత్వము కాంటన్‌లోని ప్రజాస్వామికమే నని ప్రకటించబడెను.

పికింగు కాంటన్ ప్రజాస్వామికములు

సన్ యటుసేను తన సేనాధిపతియగు చన్‌హాక్యాను వూపిఫుకు వ్యతిరేకముగ యుద్ధమునకు పొమ్మని యుత్తరువు చేసెను. చన్‌హాక్యా సేనాని వూపిఫుతో కుట్రసలిపి ఆతనికి వ్యతిరేకముగా సేనలను నడుపుటకు నిరాకరించెను. చన్‌హాక్యాను సేనాధిపత్యమునుండి తొలగించితినని సన్ యటుసేను చెప్పెను. అందుమీద చన్‌హాక్యా యొకదినమున సన్‌యటుసేనును పట్టుకొనివచ్చి నదిలో పడద్రోసి చంపవలసినదని తన సైనికుల కాజ్ఞాపించెను. సన్ యటుసేనుయొక్క యాజ్ఞలో సైనికులులేరు. చన్‌హాక్యాక్రిందనే యుండిరి. సన్‌యటుసే నొక నౌకలోనికి పారిపోయెను. ఆయనకును చన్‌హాక్యాకును రాజీనామా చేయుటకు మిత్రులు ప్రయత్నించిరి కాని విఫలమయ్యెను. చన్ హాక్యా నౌకలోనివారికి లంచమిచ్చి సన్ యటుసేను నొకగదిలో ఖయిదుచేయించెను. వారు చన్‌హాక్యా కాయనను వప్పగింత చేతుమని చెప్పిరి. సన్‌యటుసేను తననాతనికి వప్పగింత చేయవలదని పడవవారిని ఎంతగనో బ్రతిమిలాడెను. పడవవాండ్రు మూర్ఖతవహించిరి. ఆఖరు సందేశము వినవలసినదని వారినికోరెను. మూడుగంటలసేపు వారికి గంభీరోపన్యాస మిచ్చెను. దేశపుదైన్య స్థితిని వర్ణించెను. తాను నడపుచున్న మహోద్యమమునుగూర్చి చెప్పెను. చన్‌హాక్యా ఎంతద్రోహియో రుజువుచేసెను. ఎట్టి పాపమును వారు గావించ నొడికట్టుకొనిరో చూపెను. ఆ యుపన్యాసమును వారు శ్రద్ధగ నాలకించిరి. పశ్చాత్తాపము నొందిరి. కన్నీళ్ళను గార్చిరి. ఒక బ్రిటిషు పడవనెక్కించి ఆయన చిత్తము

సన్‌యటుసేను పారిపోవుట

వచ్చినటుల ఫొమ్మనిరి. ఆ కష్టకాలమున నాయనభార్యయగు చింగులింగుదేవి ఆయనతోకూడ నుండెను. ఆమెయొక్క దీన వదనముకూడ నా పడవవారికి జాలిని పురిగొల్పి యుండును. మరియొక యువకుడు, జపానులోని సైనికకళాశాలలో విద్యను పూర్తిచేసి సనయటుసేనక్రింద పనిచేయుటకు కృతనిశ్చయుడై అపుడే వచ్చినవాడు, రాబోవుకాలమునందు ప్రసిద్ధిని బడయనున్న వాడు నగు చ్యాంగుకేషక్ **(Chiang Kaishek)** అను పేరుగల వాడుకూడ నా దినములలో నాయనతోకూడ నుండి యా సంభాషణలనన్నిటిని శ్రద్ధతో తన దినచర్యలో నెక్కించెను. ఆయన సురక్షితముగ బ్రిటిషుపడవలో చేరిన పిమ్మట తన భార్యతోకూడ షాంఘూయికి వెడలెను. అప్పుడు చ్యాంగుకేషక్ ఆయనవద్ద శలవుపుచ్చుకొని మరలి వచ్చుచుండగ "దేశద్రోహియైన చనహాక్కాను నాశనము చేయవలసిన"దను సందేశమును వ్రాసి అధ్యక్షుడుగ సంతకముచేసి యాతనికిచ్చెను. సనయటుసేను చింగులింగుదేవితోకూడ మరల షాంఘూయిలోని తన శాంతికుటీరమునందు ప్రవేశించెను. కొలదికాలములో వాంగుచింగువై కూడ సనయటుసేనుతో చేరెను. అచట పికింగునగరమున వూపిపు సేనాని సోకనును అధ్యక్షపదవినుంచి తొలగించి శాస్త్రీయమైన అధ్యక్షుడగు లీయునహాంగును మరల తెచ్చిపెట్టెను. వెనుక 1911 వ సంవత్సరమున క్యూమింటాంగుసభచే చేయబడిన తాత్కాలికపు రాజ్యాంగవిధానము నమలులోపెట్టెదనని ప్రకటించెను. అదివరకు పికింగు అధ్యక్షునిచే వెడలగొట్టబడినట్టియు కాన్టన్ నగరమున చేరినట్టియు పార్లమెంటు సభ్యులందరను సనయటుసేను లేకుండ

పికింగునగరమున సమావేశముకండని యాహ్వానముల నంపెను. వారిలో కొంతమందికి లంచములుకూడ నిచ్చెను. పాతపార్లమెంటు సభ మరల పికింగునగరమున సమావేశమయ్యెను. శాస్త్రీయమైన పార్లమెంటును శాస్త్రీయమైన అధ్యక్షుని మరల పికింగులో సమావేశపరచితిననియు, దేశమున కశాంతిని కలుగచేయుచున్న సణయటుసేను రాజ్యమును వదలిపోయెననియు వూపిఫు సేనాని ప్రకటించెను.



# చైనా విప్లవము

## షష్ఠాధ్యాయము



### క్యూమిఁటాంగు పునర్నిర్మాణము

### 1

షాంఘాయిలోని తన శాంతికుటీరమున నుండగ 1922 వ సంవత్సరము డిశెంబరునెలలో రుష్యా సోవియటు ప్రభుత్వ ప్రతినిధియగు అబ్రహాం అడాల్ఫు జోఫి (**Abraham Adolph Joffe**) అను నాయన సఁ‌యటుసేనును దర్శించెను. చైనా స్వతంత్రోద్యమమును గూర్చి మాటలాడెను. సామ్రాజ్యతత్వము నవలంబించియున్న విదేశప్రభుత్వముల అధికారమునుండియు, పలుకుబడినుండియు, స్వలాభాపేక్షాపరులును నిరంకుశులును నగు చైనా సైనికనాయకుల అధికారమునుండియు, చైనాకు స్వతంత్రము కలుగుటకును, నిజమైన ప్రజాపాలనమును స్థాపించుటకును ముందు జరుగవలసిన పద్ధతులను గూర్చియు రుష్యాలోని అనుభవములను గూర్చియు నుభయులును చర్చించిరి. తురుష్క స్వతంత్ర పోరాటమునందు ముస్తఫా కెమాలుకును, పర్షియా యొక్క స్వతంత్రముకొరకు రజాఖాను పెహాల్వీకిని, ఆఫ్ఘనుస్థానము నొక స్వతంత్రజాతిగ చేయు ప్రయత్నమునందు అమానుల్లాకును, రుష్యా సోవియటు ప్రభుత్వము సహాయము చేసెను.

సఁ‌యటుసేనుకు సోవియటు రుష్యాయొక్క సహాయము

అటులనే చైనాయొక్క స్వతంత్ర పోరాటమునందు సన్‌యటు సేనుకు అవసరమైన సహాయమునంతను చేయుటకు సిద్ధముగ నున్నామని ఆయన సన్‌యటుసేనుకు చెప్పెను. ఆశియాఖండము లోని దేశములన్నియు పాశ్చాత్య సామ్రాజ్యముల అధికారము నుండి స్వతంత్రమును పొందునటుల సహాయము చేయుట రుష్యా సోవియటుప్రభుత్వముయొక్క ప్రధాన రాజనీతి యని ఆయన చెప్పెను. కమ్యూనిజమును (సాముదాయ తత్వమును) గూర్చి చర్చించి కమ్యూనిస్టు సిద్ధాంతములు చైనాయొక్క పరిస్థితులలో చైనాకు వర్తింప చేయబడనేరవని అంగీకరించి 1923 వ సంవత్సరం జనవరి 26 వ తేదీన యుభయులును సంతక ములు చేసియొక ప్రకటనను గావించిరి. అడాల్ఫు జోఫె, అప్పటికి లెనిన్ కమ్యూనిజమునందు పట్టుదల వీడి నూతన ఆర్థిక రాజనీతిని అమలు జరుపుచుండెనని కూడ చూపెను. రుష్యాయొక్క సహాయము నంగీకరించుటకు సన్‌యటుసేను సమ్మతించెను. చైనా జాతీయసేనలను తయారు చేయుటకు డెబ్బదిమంది సైనికోద్యోగు లను పంపుట కొప్పుకొని అబ్రహాము అడాల్ఫు వెడలిపోయెను. సన్‌యటుసేను అదివరకు చైనాదేశమును సైనికనాయకుల పాలనమునుండియు, అరాజకమునుండియు విముక్తి గావించి పాశ్చాత్యపద్ధతులపైన సంపూర్ణ ప్రజాస్వామికమును, ప్రజా రాజ్యమును స్థాపించుటకు తోడ్పడవలెనని అమెరికా, ఇంగ్లాండు ప్రభుత్వములను కోరియుండెను. గాని వారాయనకు తోడ్పడు టకు నిరాకరించిరి. చైనాలో తమకు గల ప్రదేశములను హక్కు లను వదలుకొనుటకు పాశ్చాత్య సామ్రాజ్యవాదుల కిష్టములేదు.

అట్టి సమయమును కనిపెట్టి సోవియటు రుష్యా నాయకుడగు లెనిన్ తన అనుచరులను తన ప్రక్కదేశమగు చైనాయొక్క నాయకుడగు డాక్టరు సణయటుసేను వద్దకు పంపి ఆయనను తనకు ఆప్తమిత్రునిగ గావించుకొనెను.

అక్కడే కాణటణలో చ్యాంగుకేషక్ (**Chaing Kai Shek**) సణయటుసేను యొక్క సందేశమును ప్రజలకు తెలిపి చణహాక్కాను వెడలగొట్టుటకు ద్రవ్యమును మనుష్యులను పోగు చేసికొనెను. కొలదికాలములోనే ఉత్తరము నుండి వచ్చుచున్న పికింగుసైన్యములతో వర్తకులు విసిగిరి. సణయటుసేనుకు చణహాక్కా గావించిన ద్రోహమునకు ప్రజలు ఆగ్రహపరవశులైరి. చ్యాంగు కేషక్ తగిన సైన్యమును సమకూర్చుకొని చణహాక్కానోడించి వెడలగొట్టి 1923 వ సంవత్సరమున సణయటుసేనును మరల కాణటనుకు రావించెను. సణయటుసేను కాణటణ ప్రజాప్రభుత్వ మునకు మరల నధ్యక్షుడుగ చేయబడెను. వాంగుచింగువై, చ్యాంగుకేషకులు ఆయనకు సహాయకులలో ముఖ్యులుగ నుండిరి.

కాణటణ ప్రజాస్వామ్య మునకు సణయటుసేను అధ్యక్షుడు

రుష్యానుండి డెబ్బదిమంది సైనికోద్యోగులు కాణటనుకు వచ్చిరి. సైనికులకును సామాన్యప్రజలకును రాజకీయ జ్ఞానము బాగుగ కలుగజేయు శాఖను నిర్మాణము గావించుటకై మైకెల్ బొరోడిణ (**Michael Borodin**) అను రుష్యా దేశీయుడు నియమింపబడెను. అదివరకు తురుష్క స్వతంత్ర పోరాటమునందు ముస్తఫా కెమాల్

జాతీయసైన్యముల తరిబీయతు

పాషాకు సలహాదారుగ పనిచేసియుండుటచే ఆశియాదేశముల యనుభవము మైకెల్ బొరోడిన్‌కు చాలగలదు. కాంటనుకు సమీపముననున్న వ్హాంపో (Whampoa) అనుచోట చ్యాంగు కేషకుయొక్క యాజమాన్యముక్రింద నొక సైనిక కళాశాల నేర్పాటుగావించిరి. అచట నీ రుష్యావారు జాతీయసైనికులను తయారుచేయుచుండిరి. చ్యాంగుకేషకు రుష్యాకుపోయి తరిబీయతునొంది వచ్చియుండెను. క్యూమింటాంగు సభ్యులతోపాటు కమ్యూనిష్టులుకూడ సైనిక శిక్షణమును పొందుచుండిరి. రుష్యాలో సోవియటు (బోల్షివికు) ప్రభుత్వము స్థాపితమైనప్పటి నుండియు నది సామ్రాజ్యతత్వమును వదలుకొనుటయే గాక, అదివరకు రుష్యాచక్రవర్తులు తురుష్కములోను, చైనాలోను సంపాదించిన రాజ్యభాగములను, పలుకుబడి ప్రదేశములను, ప్రత్యేక హక్కులను వదలుకొనినది. దీనికి చిచరిన్ రాజనీతి యని పేరు. అప్పటికి కారలుమార్క్సు యొక్క సిద్ధాంతములను లెనిన్‌మహాశయుని నాయకత్వముక్రింద సోవియటు రుష్యా చక్కగ అమలుజరుపుచుండెననియు, ఆయనకు పిమ్మట నాయకుడుగవచ్చిన స్టాలిను వాటికి విపరీతార్థములు చెప్పి దురాశగ ప్రవర్తించినాడనియు చార్లెసు పత్రికు ఫిడ్జుగెరాల్డు తన "చైనాలో విప్లవము" అను గ్రంథములో వ్రాసినాడు.

అచిరకాలములో కాంటన్ ప్రభుత్వము బలపడినది. ఈ ప్రభుత్వముయొక్క ఆర్థికస్థితిని వెంపొంద చేయుటకై తగిన కోశపుమంత్రి కావలెను. చింగులింగు దేవి యొక్క తమ్ముడగు టి. వి. సూంగు అను

టి. వి. సూంగు

యువకుడు అమెరికాలో ఆర్థిక విషయములలో ప్రవీణత నొంది వచ్చినవాడు. ఆతనిని కోశాధికారిగ నియమించిరి. అతను కొద్ది కాలములో ప్రభుత్వముయొక్క ఆదాయమును వృద్ధిచేసి సన్‌యటుసేనుబొమ్మ గల బ్యాంకినోట్లను ప్రచురించి బొక్కసమును మంచిస్థితిలోనికి తెచ్చెను. ఈ ప్రభుత్వము స్థిరముగ నిలువ గలదను విశ్వాసము ప్రజలకు గలిగెను.

క్యూమిన్‌టాంగు (Kmomintang) సభ అప్పటివరకు గొప్ప వర్తకులు, ధనికులు, విద్యాధికులు, సైన్యాధికారులు మొదలగు వారితోమాత్రము నిండియుండెను. సామాన్యప్రజలు గూడ అందులోచేరి యాసభ దేశమునకంతకును నిజమైన ప్రాతినిధ్యము వహించునటుల పునర్నిర్మాణము గావించవలెనను సంకల్పముతో 1924 వ సంవత్సరము జనవరినెలలో ప్రథమ అఖిల చైనా క్యూమిన్‌టాంగు మహాసభ (కాంగ్రెసు) డాక్టరు సన్‌యటుసేనుయొక్క అధ్యక్షత క్రింద జరుపబడినది.

ప్రథమ అఖిల చైనా క్యూమిన్‌టాంగు మహాసభ

ఆ కాంగ్రెసు మహాసభ జనవరినెల 20 వ తేది సాయంకాలము ప్రారంభమయ్యెను. జనవరి 30 వ తేదీవరకును జరిగెను. చైనాయొక్క పదునెనిమిది రాష్ట్రములనుండియు మంచూరియాయొక్క మూడు రాష్ట్రములనుండియు, మంగోలియా, టర్కీ స్థానములనుండియు, విదేశములనుండియు మొత్తము 199 మంది ప్రతినిధులు సమావేశమైరి. చింగులింగుదేవి (సన్‌యటుసేను సతి), చన్‌పిచున్‌దేవి (వాంగుచింగు వై సతి), హోషిహిసియాంగునింగుదేవి (లియోచంగుకే సతి) స్త్రీలపక్షమున ప్రతి

నిధులుగ వచ్చిరి. సభాయటుసేనుయొక్క అధ్యక్షోపన్యాసము నందు చైనాయొక్క స్వతంత్రమును సంపాదించుటకు క్యూమిన్టాంగు కక్షిని బలముగను మంచిపద్ధతులమీదను నిర్మాణము గావించి దేశమందంతటను శాఖోపశాఖలు స్థాపించు టెట్లు అవసరమో వివరించెను. పిమ్మట క్యూమిన్టాంగుయొక్క నిర్మాణమును గూర్చిన తీర్మానములు చేయబడెను. క్యూమిన్టాంగు యొక్క యుద్దేశ్యములను చేయదలచిన మహాత్కార్యమును అవలంబింపదలచిన పద్ధతులనుగూర్చి యొక సుప్రసిద్ధ ప్రకటనను వాంగుచింగువై తయారుచేసి దానిని సభాయటుసేను సరిచూచి కాంగ్రెసు ముందు పెట్టగ అధికసంఖ్యాకులచే నది యంగీకరించబడెను. అదియే చైనా జాతీయ స్వతంత్రమునకును జాతీయ పునర్నిర్మాణమునకును అధికారపత్రముగ విలసిల్లినది.

ఆ ప్రకటనలో మూడు భాగములు గలవు. మొదటి భాగములో చైనాయొక్క ప్రస్తుత స్థితినిగూర్చి వర్ణింపబడినది.

**జాతీయ స్వతంత్ర ప్రకటన**

స్వతంత్రోద్యమము అంతవరకు చేసినపని తెలుపబడినది. "1911 వ సంవత్సరపు స్వతంత్రోద్యమము యొక్క యుద్దేశ్యము మంచూరియా సామ్రాజ్యమును కూలద్రోయుటయే గాక పాశ్చాత్య ప్రభుత్వముల అధికారమునుండియు పలుకుబడినుండియు చైనాజాతిని స్వతంత్రముగ గావించి బలమైన ప్రజాస్వామ్యమును స్థాపించుట కూడ నైయున్నది. మంచూరాజులు చైనాజాతియొక్క రాజకీయ అభివృద్ధికి ఆటంకముగ నుండినందున వారిని వెడలగొట్టుట అవసరమయ్యెంచెను. ప్రజాస్వామ్యము స్థాపింపబడి

నప్పటికిని యువాన్ షికాయికి అధ్యక్షపదవి వదలుటవలన ప్రజాస్వామ్యముయొక్క యుద్దేశ్యము నెరవేరలేదు. ఉద్యోగ పదవులను సంపాదించుట మాత్రమే జీవితపరమావధిగ గల పాత మంచూ అధికారులకు యువాన్ షికాయి ప్రతినిధియై యుండెను. ఆయనకు ప్రజాస్వామ్యతత్వము బోధపడలేదు. యువాన్‌షికాయి చనిపోయిన తరువాత రాజ్యాధికారము సైనికాధికారుల చేతులలో పడినది. వారు స్వలాభపరులై, చైనా యొక్క పతనమునకు కారకులైన విదేశ సామ్రాజ్యవాదుల చేతులలో పడుచున్నారు. ఈ సైనికాధికారులమధ్య రాజీనామా కుదిర్చినచో కొంత శాంతి ఏర్పడునుగానివారికి ప్రభుత్వము హస్త గతము చేసిన యెడల రెండువేల సంవత్సరములకు పూర్వము చైనాలో రద్దుచేయబడిన (**feudal system**) మొఖాసా ప్రభు పరంపరాపద్ధతినే స్థాపించినవార మగుచున్నాము. అటులనే కేవలము వర్తకుల చేతిలో రాజ్యాధికారము పెట్టగూడదు. దేశములోని అన్ని జాతులయొక్క ప్రతినిధుల సభయే సరియైన ప్రజారాజ్యమును నడుపగలదు. అట్టి ప్రజారాజ్యము క్యూమిన్ టాంగుకు పునాదియైన ప్రజల మూడు సిద్ధాంతముల ననుసరించి యనగ జాతీయత, ప్రజాపాలనము, ప్రజల జీవనోపాధి అను మూడు సూత్రముల ననుసరించి యేర్పడవలసి యున్నది" అని వ్రాయబడినది.

రెండవ భాగమునందు డాక్టరు సన్ యటుసేనుయొక్క సన్‌మిను సిద్ధాంతమును గూర్చి వివరించి క్యూమిన్‌టాంగు చేయ దలచిన పనిని తెలిపినారు.

"చైనా జాతీయతలో (1) చైనా ప్రజల స్వతంత్రము (2) చైనా ప్రజాస్వామ్యములో చేరిన యన్ని జాతులమధ్య సమానత్వము అను రెండు సూత్రములు చేరి యున్నవి. విదేశ

చైనా జాతీయత

సామ్రాజ్యములయొక్క సైనిక ఆర్థికదాస్యము నుండి చైనాప్రజలు స్వతంత్రమును పొందుటకు, క్యూమిన్‌టాంగు పక్షమునకును దేశములోని వివిధ జాతులకును, అనగ విద్యావంతులు, రయితులు, కార్మికులు, వర్తకులు అను జాతులకును ఎక్కువ సహకారము తోడ్పాటు ఏర్పడవలెను. అన్ని జాతులకు విదేశస్థుల అధికారమునుండి స్వేచ్ఛ పొందుట అత్యంతమగు నవసరమై యున్నది. విదేశస్థుల పలుకుబడి యన్ని జాతులకును చెప్పనలవిగాని యపకారమును గావించినది. విదేశీయుల ఆర్థికదాస్యమునుండి విముక్తి పొందనిచో చైనాయొక్క పరిశ్రమ లెన్నటికిని తలయెత్తజాలవు. విదేశసాహుకార్లు చైనా కూలీలను పెట్టుచున్న బాధలు చైనాలో విదేశీయులకు గల ప్రత్యేక రాజ్యాంగ హక్కులన్నియు నశించినగాని పోవు. కావున జాతీయత యనగ సామ్రాజ్యతత్వమును కూలద్రోయుటయనియు ఇది ప్రజాసామాన్యము యొక్క తోడ్పాటు లేనిది సాధించుటకు వీలులేనిదనియు క్యూమిఁటాంగుయొక్క దృఢాభిప్రాయము. విదేశ సామ్రాజ్యవాదుల మీదను స్వదేశ సైనికాధికారులమీదను చైనాస్వతంత్రపోరాటము పూర్తిగ జయముపొందగనే చైనాలో చేరియున్న వివిధజాతులయొక్క స్వేచ్ఛాయుతమైన సమ్మేళన మైన ప్రజాస్వామ్యమును స్థాపించుటకు క్యూమిఁటాంగు ఉద్దేశించినది. అందులో చైనావారితో మంచూలకును, మంగోలియ

నులకును, టిబెట్టువారికిని, మహమ్మదీయులకును సమాన హక్కు బాధ్యత లుండును.

"క్వ్యామిఙ్‌టాంగు స్థాపించెడి ప్రభుత్వమునందు అయిదు స్వతంత్రశాఖ లుండును. చట్టనిర్మాణశాఖ, కార్యనిర్వాహక శాఖ, న్యాయవిచారణశాఖ, పబ్లికుసర్వీసు (ఉద్యోగస్థుల) శాఖ, తనికీచేసి **(Censorship)** శిక్షించుశాఖ అను అయిదుశాఖ లుండవలెను. ప్రజాపాలనములో ప్రజలకు పూర్తియగు హక్కు లుండవలెను. కాన అక్రమముగ ప్రవర్తించెడి ప్రతినిధులను నియమితకాలము ముగియకమునుపే లేచిరమ్మని కోరు హక్కు **(Recall)**, చట్టములను ప్రజలే సరాసరి తయారుచేసి ప్రవేశపెట్టు హక్కు **(Initiative)** కొన్నివేళల చట్టములు ప్రజలసమ్మతికై పంపు ఆవశ్యకత **(Referendum)** అను మూడుహక్కులుగూడ ప్రజలకుండవలెను. కాని క్వ్యామిఙ్‌టాంగు స్థాపించదలచిన స్వరాజ్యము మానవహక్కులమీద నాధారపడక చైనాప్రజల యావశ్యకముల మీదనే ఆధారపడును. అనగా చైనా ప్రజల యవసరముల కనుగుణముగ రాజ్యాంగవిధాన మేర్పడవలెను. రాజకీయ హక్కులు చైనాప్రజల స్వత్వములు గావున చైనాప్రజలు తమ హక్కులను స్థాపించుకొని సౌఖ్యముగ నుండుటకు ప్రయత్నించుచున్న స్వతంత్రోద్యమమునకు శత్రువులుగ నున్నవారి కెట్టి రాజకీయహక్కులు నివ్వబడనేరవు. స్వతంత్రకృషికి ద్రోహము గావించుచు విదేశసామ్రాజ్యవాదులకును స్వదేశసైనికాధికారులకును సహాయముచేయుచున్నవారి కెవరికిని రాజ్యాంగహక్కు-

అయిదు ప్రభుత్వశాఖలు

లేమాత్రము నివ్వబడవు. సోవియటురుష్యాలోవలె చైనాలోకూడ స్వరాజ్యోద్యమమును నడపుచున్న రాజకీయకక్షికి చెందినవారికిని దానితో సానుభూతిగలవారికిని దానికి వ్యతిరేకులుగానివారికిని మాత్రమే రాజకీయహక్కులు చెందగలవు. స్వరాజ్యకక్షీవారి రాజకీయాధికారము మాత్రమే స్థాపింపబడును.

"ప్రజలకు సౌఖ్యకరమగు జీవనోపాధి కలుగుటకుగాను భూములు లేనివారికి ప్రజాప్రభుత్వము భూములనిచ్చును. వ్యవసాయము బాగుగ వృద్ధిచేయును. రైతులయొక్క క్షేమమే చైనాదేశపుపునాది. కష్టములనన్నిటిని రైతు భరించియున్నాడు. స్వరాజ్యముయొక్క ప్రథమ కర్తవ్యము రయితుయొక్క స్థితిని సౌఖ్యకరముగ చేయుటయి యున్నది. నీటిపారుదలలు విశేషముగ వృద్ధిచేయవలెను. సముద్రము లోనికి వృధాగా పోవుచున్న నదీ ప్రవాహములను ఆనకట్టలమూలమున నాపి కాలువలద్వారా భూములకు నీటిని ఇవ్వవలెను. రయితులకు స్వల్పవడ్డీల కప్పునిచ్చుటకు బ్యాంకీలను స్థాపించవలెను. రయితు వత్తిడిలేక భూములున్న చోట్లకు రయితులను గొనిపోయి భూములిచ్చి వ్యవసాయము చేసికొనుటకు సదుపాయములను కలిగించవలెను. భూముల విలువనుబట్టి పన్నులు వేయవలెను. స్వల్పమగు భూములుగలవారి మీద పన్నులు విధించరాదు. వ్యక్తులు స్వంత పెట్టుబడిపెట్టి నడపలేని పెద్ద పరిశ్రమలన్నిటిని స్వరాజ్య ప్రభుత్వమే నడపవలెను. బ్యాంకులు, రైళ్ళు, స్టీమరులు, గనులు, విద్యుచ్ఛక్తి, అడవులు, నదీప్రవాహములు, ఇతర పెద్దపరిశ్రమలు ప్రజాప్రభుత్వము యొక్క చేతిలో నుండ

ప్రజల జీవనోపాధి

వలెను. వానివలన వచ్చు లాభమంతయు భాగ్యవంతులగు షాహుకార్లకుగాక దేశమునకంతకును చెందవలెను. ఇతరులను దాస్యములో నుంచగల షాహుకార్లజాతి యేర్పడకుండ ప్రజాప్రభుత్వము ముందుగనే అభ్యంతరములు కలిగించవలెను. పెద్దపరిశ్రమలన్నియు ప్రభుత్వముచేతిలో నుండుటవలన అందులో పనిచేయు కార్మికులకు హెచ్చగు వేతనముల నివ్వవచ్చును. వారి జీవనము సౌఖ్యావహామగును. కార్మికుల కష్టములను తొలగించు ఫాక్టోరీ చట్టములు, హెచ్చుమజూరి, తక్కువ కాలము పనిచేయుట, తప్పకుండ పనిదొరుకుట, ముసలితనము వ్యాధి అంగవైకల్యము కలిగినపుడు పనిచేయకుండగనే జీవనోపాధి కలుగుట, పసిపిల్లల సంరక్షణ, గర్భిణీస్త్రీల సంరక్షణ, మొదలగు సదుపాయములను కార్మికులకు స్వరాజ్యముచేయును.

"చైనాయొక్క ప్రతిభాగములోను రైతులయొక్కయు కార్మికుల యొక్కయు పేదరికము మిగుల దుర్భరమై యున్నది విదేశసామ్రాజ్యవాదులే అట్టి దుస్థితికి ముఖ్యకారకులు కావున విదేశస్థుల అధికారముమీదను పలుకుబడిమీదను ప్రతిఘటనము సలుపుటకు కార్మికులును రయితులును సిద్ధముగ నుందురు. 'రయితుల యొక్కయు కార్మికుల యొక్కయు హృదయపూర్వకమగు తోడ్పాటుమీదనే స్వతంత్రోద్యమముయొక్క అంత్యజయ మాధారపడి యున్నది. రయితుల కార్మికుల యుద్యమములకు క్యూమిన్‌టాంగు సర్వవిధముల సహాయము చేయును. విదేశస్థులకును సైనికాధికారులకును వ్యతిరేకముగ తమ పక్షమున చేరవలెనని రయితులను కార్మికులను

రయితులు, కార్మికులు

క్యూమిన్‌టాంగు కోరుచున్నది' అని వారికి ఉద్బోధన చేయబడినది. సైనికులు తమ దేశీయులకు వ్యతిరేకముగ ఉపయోగింపబడుటకై దేశమునకు శత్రువులగు సైనికాధికారులతో చేర వద్దనియు, తమ దేశమును రక్షించునట్టియు వారికి సేవచేయునట్టియు ధర్మమును బాగుగ గుర్తించవలెననియు, ముఖ్యముగ తమ తోడివారగు రైతులకు సహాయము చేయవలెననియు చైనా సైనికులను క్యూమిన్‌టాంగు కోరుచున్నది. ఈ సైనికులు కడుబీదవారై పొట్టకూటికి జరుగక దేశశత్రువులక్రింద పనిచేయుచున్నారనియు అజ్ఞానము వలన స్వల్పవేతనము కొరకు తమ దేశమునకు హాని గావించుచున్నారనియు, సైనికులలో సరియైన జ్ఞానము వ్యాపింపజేయు టవసరమనియు, క్యూమిన్‌టాంగు గుర్తించుచున్నది. దేశ స్వతంత్రము కొరకు పనిచేయు సైనికులకు స్వతంత్రపోరాటము ముగియగనే భూముల నిచ్చి వ్యవసాయమువలన సుఖజీవనముచేయు సదుపాయములను స్వరాజ్యము చేయునని వ్రాయబడినది. క్యూమిన్‌టాంగుయొక్క సిద్ధాంతములను, జరుపుచున్న మహోద్యమ స్వభావమును రానున్న స్వరాజ్య స్వరూపమును, చైనాయొక్క అన్ని ప్రాంతముల ప్రజలలో బాగుగ వ్యాపింపజేసి దేశమంతటిలోను క్యూమిన్‌టాంగుయొక్క నాయకత్వమును ప్రతిష్ఠించవలెనని సభ్యులనందరిని కోరుచున్నది" అని రెండవభాగమునందు వ్రాయబడినది.

పై యుద్దేశ్యములను నెరవేర్చుటకు క్యూమిన్‌టాంగు వెంటనే జరుపనున్న కార్యక్రమమును మూడవభాగములో చెప్పియున్నారు. "విదేశస్థులు చైనా చక్రవర్తులను భయపెట్టి

మోసముచేసి జరుపుకొనియున్న సంధు లన్నిటిని క్వ్యోమిం టాంగు రద్దుపరచుచున్నది. ఈ అక్రమపు ఒడంబడికల (**unequal treaties**) ననుసరించి విదేశస్తులు పొందిన ప్రత్యేక న్యాయ విచారణ హక్కులు, రాజకీయ హక్కులు, సుంకములశాఖమీద విదేశస్తుల అధికారము, మొదలగునవి వెంటనే రద్దుకావలెను. తమంతట తాము ప్రత్యేక హక్కులను వదలుకొను జాతులకు కొన్నిలాభములను క్వ్యోమింటాంగు కలుగజేయును. చైనా జాతికి నష్టకరమగు అన్ని యొడంబడికలు వాటి యంతట రద్దు అగును. వాటిస్థానే న్యాయమైనట్టియు పరస్పర గౌరవకర మైనట్టియు సంధులను విదేశప్రభుత్వములతో చేసికొనుటకు క్వ్యోమింటాంగువారు సిద్ధముగ నున్నారు. విదేస్తులవద్ద చైనా యొక్క ప్రభుత్వములు చేసియున్న ఋణములలో చైనా జాతికి లాభమును కలుగచేసిన ఋణము లన్నిటిని క్వ్యోమిం టాంగు చెల్లించుటకు పూచీబడుచున్నది. సైనికాధికారులు తమ యధికారమును నిలువబెట్టుకొనుటకు విదేశస్థుల వద్ద చేసిన ఋణములు చెల్లించబడనేరవు. పికింగు ప్రభుత్వములు అప్పుడప్పుడు విదేశస్తులవద్ద చేసియున్న ఋణముల నన్నిటిని పరీక్షించి వాటిలో న్యాయమైనట్టియు చైనాజాతికి లాభకరమై నట్టియు ఋణముల నన్నిటిని చెల్లించెదరు. చైనాజాతియొక్క స్వతంత్రములను అణగగొట్టుటకు చేయబడిన ఋణములు చెల్లించబడవు. సుంకములమీదను ఉప్పుపన్నుమీదను పెట్టబడిన తాకట్టులు రద్దుపరచబడును. తాకట్టులు లేకుండగనే న్యాయమైన ఋణముల నన్నిటిని ప్రభుత్వ బొక్కసములోనుండి చెల్లించెదరు.

ఈ ఋణముల న్యాయాన్యాయములను గూర్చి అందుకు సంబంధించిన విదేశ ప్రభుత్వములతో సంప్రదించుటకును పరిష్కరించుకొనుటకును క్యూమిన్‌టాంగు సిద్ధముగనున్నది. చెల్లించవలసిన ఋణములను చెల్లించు మార్గములను గూర్చి యోచించి ఋణ విముక్తి గావించుకొనుటకుగాను చైనాలోని సాంఘిక, వర్తక, ఆర్థికసంస్థల ప్రతినిధుల సమావేశము గావించబడును. ఇంతటి నుండియు చైనాయొక్క అధికారమునకును ఆత్మగౌరవమునకును భంగకరముగా ఋణములేమియు చేయబడవు. చైనాదేశపు ప్రజాప్రభుత్వమునకు లోబడి రాష్ట్రముల కన్నిటికిని రాష్ట్రీయ స్వపరిపాలనమును జిల్లాలకును గ్రామములకును స్వపరిపాలనమును ఇవ్వబడును. పౌరసైన్యము తయారుచేయబడును. సైనికులకు వృత్తి విద్యయు రాజకీయ విద్యయు నివ్వబడును. రైతుల కార్మికుల సంఘస్థాపనకు ప్రత్యేక ప్రోత్సాహ మొసగబడును. అన్ని విషయములలోను స్త్రీలకు పురుషులతోబాటు సమాన హక్కు లొసంగబడును. స్త్రీ యుద్యమమునకు సహాయము చేయబడును. ప్రతి పురుషునికిని స్త్రీకిని విద్య చెప్పించబడును." అని మూడవ భాగములో వ్రాయబడినది.

ఈ సిద్ధాంతములతోడను కార్యక్రమముతోడను క్యూమిన్‌టాంగు బాగుగ పునర్నిర్మాణము గావింపబడి క్యూమిన్‌టాంగు సభయొక్క ఏకపార్టీపాలనము స్థాపించుట కుద్దేశింపబడినది.

క్యూమిన్‌టాంగుయొక్క పాలనము

సుపరిపాలనకును నిర్మాణ కార్యక్రమమునకును బాధ్యత సన్‌యటుసేను నుండి క్యూమిన్‌టాంగు సభ వహించినది. ప్రజాపరిపాలనను

స్థాపించుటలో మూడుమెట్లుగ నిర్మాణము కావించుటకు తీర్మానించబడినది. (1) సైనిక పాలనము (2) ప్రబోధము (3) ప్రజా ప్రభుత్వము. జాతీయసైన్యములు పోయి యొక రాష్ట్రమును స్వాధీనపరుచుకొనగనే యచట ముందుగ తాత్కాలికపు ప్రభుత్వమేర్పరుపబడును. ఇది జాతీయ సైనిక ప్రభుత్వము. వెంటనే యా రాష్ట్రమందంతటను జాతీయపక్షమున ప్రజలలో ప్రబోధము సలుపబడి ప్రతి జిల్లాలోను స్వపరిపాలనము స్థాపింపబడును. ఇది రెండవమెట్టు. ఆ వెంటనే యా రాష్ట్రమునకు రాష్ట్రీయ స్వపరిపాలన యొసంగబడును. ఎక్కువ రాష్ట్రములలో స్వపరిపాలనము స్థాపితము కాగనే ఆ రాష్ట్రముల ప్రతినిధులు సమావేశమై ప్రజల మూడు సిద్ధాంతముల ననుసరించి ఐదు పరిపాలనా శాఖలను నిర్మాణము గావించుట కొక రాజ్యాంగ విధానమును తయారుచేతురు. అప్పుడు దేశముయొక్క తాత్కాలికపు జాతీయ ప్రభుత్వ మంతమై ఆ రాజ్యాంగ విధానము ననుసరించి యెన్నుకొనబడిన ప్రజాప్రతినిధి సభకు రాజ్యాధికారము సంక్రమించగలదు. ఇది క్యూమిఇటాంగు చేయదలచిన రాజ్యస్థాపనా పద్ధతి. అట్టిది స్థాపితమగువరకును స్వతంత్ర పోరాటము పూర్తికాదు గనుక అంతవరకును క్యూమిఇటాంగుసభ పాలనముచేయుచుండును.

## 3

క్యూమిఇటాంగు కాంగ్రెసుసభలో మిగుల తీవ్రముగ చర్చించబడి వాదోపవాదములు జరిగి తీర్మానింపబడిన ముఖ్యవిషయము, చైనాజాతీయవాదులకు రుష్యాసోవియటుతో నుండవల

చైనా సాముదాయ వాదులు

సిన సంబంధమును గూర్చియు క్యూమింటాంగు నందు చైనాలోని సాముదాయ వాదులను (కమ్యూనిస్టులను) చేర్చుకొనవలెనా లేదాయను దానిని గూర్చియునై యున్నది. చైనాదేశ మన్నివైపులను దురాశాపరులగు సామ్రాజ్య ప్రభుత్వములచే ముట్టడింపబడుచున్న దనియు వీరినెదుర్కొనుటకు సామ్రాజ్యతత్వమునకు పూర్తిగ వ్యతిరేకముగ నున్న రుష్యాసోవియటు ప్రభుత్వము యొక్క సహాయమును గైకొనుట చైనాకు లాభకరమనియు సంయటు సేను గట్టిగ చెప్పెను. ఆ కాంగ్రెసు మహాసభ జరుగుచున్న దినములలో కాంటను సమీపమున విదేశీయులు యుద్ధనౌకలను తెచ్చి యుంచుటను ఆయన చూపెను. "రుష్యాతో కలసి పని చేయుటలో రుష్యాయొక్క సాముదాయవాదము (**Communism**)ను చైనా అవలంబింపవలసిన పనిలేదు. సాముదాయవాదము చైనాకు పనికిరాదు. కాని రుష్యావారికి స్వతంత్రోద్యమము జయప్రదముగ నడపుటకును, నిర్మాణము గావించుటకును కలిగిన అనుభవములును కౌశలమును చైనా జాతీయవాదులు నేర్చుకొనుట యవసరము. సామ్రాజ్యవాదుల దండయాత్రల నుండియు దేశములోని అంతఃకలహముల నుండియు రుష్యాసోవియటు ప్రభుత్వము సంరక్షించుకొనినది. దానిని మనము నేర్చుకొనవలెను. రుష్యావారికి తమ ప్రతిష్ఠాపనలను చైనాలో జొరబెట్టు నుద్దేశ్యములేదనియు చైనాయొక్క జాతీయతను స్వతంత్రతను కాపాడుటకు తాము తోడ్పడుటకు సిద్ధముగ నున్నామనియు రుష్యాప్రతినిధియగు జోఫీ ఇదివరకే చెప్పియున్నాడు. చైనాలోని

సాముదాయవాద సిద్ధాంతములను నమ్మువారు మనయొక్క జాతీయ స్వతంత్రపోరాటములో త్యాగములుచేసి మనకు సహాయము చేతుమని ముందుకు వచ్చినపుడు వారిని మనలో కలుపుకొనుటమనకు ధర్మము. సాముదాయవాదులు క్యూమిణ్టాంగుకు వ్యతిరేకముగ సంచరించిన వెంటనే వారిని వెడలగొట్టుటకు నేను సిద్ధముగ నుందును." అని ఆయన చెప్పిన వాక్యములు అధిక సంఖ్యాకులను ఆయనతో నేకీభవింపజేసినవి. సాముదాయవాదులను కూడ క్యూమిణ్ టాంగులో చేర్చుకొనుటకును రుషాయ్తో కలసి పనిచేయుటకును కాంగ్రెసువారు తీర్మానించిరి. క్యూమిన్టాంగులో చేరిన సాముదాయవాదులు తమ సాముదాయవాద సంఘములనుండి సభ్యత్వమును రాజీనామా నివ్వవలెనని కొందరు కోరిరి. అందుకు సాముదాయవాదుల ప్రతినిధియగు వీటాచో లేచి తాము సాముదాయవాదులుగ గాక వ్యక్తులుగ మాత్రము క్యూమిణ్టాంగునందు చేరుచున్నామనియు తాము క్యూమిణ్టాంగుయొక్క విధానమునకును శిక్షణమునకును వ్యతిరేకముగ సంచరించినవెంటనే తమ్ము శిక్షించుటకు క్యూమిణ్టాంగు కధికారము కలదనియు అందుకు లోబడియే తాము చేరుచున్నామనియు చెప్పినమీదట వారు సాముదాయవాద సభ్యత్వమునకు రాజీనామా నీయవలెనను ప్రతిపాదన వీగిపోయెను.

క్యూమిణ్టాంగుసభల తీర్మానములకు వ్యతిరేకముగ నడచెడి సభ్యుల పేర్లను బహిరంగపరచి వారి సభ్యత్వమును తొలగించుట, క్యూమిణ్టాంగుపాలనముక్రింద నున్న ప్రదేశములలో నెట్టియుద్యోగములను వారి కివ్వకుండుట మొదలగు నిబంధనలు

చేయబడెను. లంచములు ప్రజాపీడనము మొదలగు నేరములు జేసిన సభ్యులకు మిగుల తీవ్రమగు శిక్షలు విధించునటుల తీర్మానించిరి.

యావత్తు రాజ్యాధికారమును అఖిల చైనా క్యూమింటాంగు కాంగ్రెసు చలాయించునటుల నిర్ణయించబడినది. కాంగ్రెసుసమావేశము యొక్క ఆఖరుదినమున అఖిలచైనా స్థాయిసంఘము (**Central Executive Committee**) నెన్నుకొనినది. ఈ స్థాయిసంఘము నందు సఇయటుసేనుయొక్క ప్రతిపాదనము పైన చాలమందిని క్యూమింటాంగు సభ్యులను, కొలదిమందిని మాత్రము సాముదాయవాదులను ఎన్నుకొనిరి. యావత్తు జాతీయ్యప్రభుత్వమునకును అధ్యక్షుడుగ సఇయటుసేను ఎన్నుకొనబడెను. అఖిలచైనా స్థాయిసంఘమువా రొక రాజకీయ శాఖను (**Political Bureau**), ఒక ప్రభుత్వశాఖను (**Governmental Council**), ఒక సైనికశాఖను (**Military Council**) ఎన్నుకొనిరి. ప్రభుత్వశాఖక్రింద నొక మంత్రివర్గ మేర్పడి వివిధ ప్రభుత్వ డిపార్టుమెంటులను పాలించును. ఈ విధముగ చైనాలో కూడ సోవియటు రుష్యాలోవలెనే ఏకపార్టీ రాజ్యము స్థాపిత మైనది. రుష్యాలో అది కమ్యూనిస్టుపార్టీ. చైనాలో ఇది క్యూమింటాంగు పార్టీ. క్యూమింటాంగు పార్టీయొక్క, ఆ పార్టీ రాజ్యముయొక్క అంగవిధాన మంతయు కమ్యూనిస్టు పార్టీ యొక్క, ఆ పార్టీ రాజ్యముయొక్క అంగవిధానమును కేవలము బోలియున్నది. చైనాక్యూమింటాంగు కేవలము రుష్యాకమ్యూనిస్టుపార్టీని అనుకరించినది.

అఖిల చైనా స్థాయిసంఘము

కాంగ్రెసు మహాసభ జరుగుచున్న దినములలో జనవరి నెల 24 వ తేదీన ఇంగ్లాండునందు కార్మికకక్షివారు (**Labour Party**) ప్రభుత్వమునకు వచ్చిరి. అదివరకు అణగద్రొక్కబడిన జాతుల స్వతంత్రమునందు సానుభూతిని ప్రకటించుచుండిన రామ్సే మాక్డొనాల్డు (**Ramsay Macdonald**) ప్రధాన మంత్రిత్వమును స్వీకరించెను. ఇందుకు మాక్డొనాల్డును కార్మికకక్షివారిని అభినందించుచు క్వ్యామిన్‌టాంగు కాంగ్రెసుపక్షమున సన్‌యటుసేను లండనుకు తంతిని పంపెను. కాని అందుకు ప్రత్యుత్తరమును ఆంగ్లేయ ప్రధానమంత్రి పంపలేదు. జనవరినెల 21 వ తేదీన రుష్యా సోవియటు ప్రభుత్వ నాయకుడగు లెనిన్ మహాశయుడు మరణించెనువార్త తెలియగనే క్వ్యామిన్‌టాంగు కాంగ్రెసు ఆయన గౌరవార్థము కొన్నిగంటలు సమావేశము నాపి ఆయన మరణమునకు సానుభూతిని తెలుపుచు రుష్యా సోవియటు ప్రభుత్వమునకు తంతిని పంపిరి. అందుకు కృతజ్ఞతావందనము లర్పించుచు రుష్యా ప్రభుత్వము నుండి మరల సన్‌యటుసేనుకు తంతివచ్చెను. కాంగ్రెసు మహాసభ జనవరి 30 వ తేది సాయంత్రము సంతోషధ్వానములతో ముగిసెను.

లెనిన్ మహాశయుని మరణము

ఇంతటినుండియు సన్‌యటుసేను నిర్మాణకార్యమునందు తన కాలము నంతను వినియోగించెను. రైతులయొక్కయు కార్మికులయొక్కయు చిన్నవర్తకులయొక్కయు విద్యార్థులయొక్కయు సంఘములను స్థాపించుట కాయన ప్రత్యేకముగ శ్రద్ధను వహించెను. "రైతులారా,

నిర్మాణ కార్యక్రమము

కార్మికులారా, వర్తకులారా, విద్యార్థులారా, ఏకమై పని చేయుడు" అనియు, "రైతులకును, కార్మికులకును సహాయము చేయుడు" అనియు రెండు కేకలు ప్రతిచోటను ప్రజ్వరిల్లెను. పై సంఘములు తండోపతండములుగ బయలుదేరెను. క్వూమిన్‌టాంగుయొక్క స్థాయిసంఘముక్రింద జాతీయ ప్రభుత్వమునం దొక కార్మిక రైతుశాఖను స్థాపించి దానిమీద సన్‌యటుసేను యొక్క ప్రధానశిష్యులలో నొకడగు లియోచంగుకేను నియమించిరి. చైనాలోని విద్యార్థుల యుద్యమము మిగుల బాగుగ వ్యాపించి ప్రపంచములోకెల్ల ప్రఖ్యాతిని పొందినది. చైనా యువకులును, యువతులును గొప్ప ఆదర్శములతోడను ధైర్య సాహసములతోడను చైనాలోని సామాన్యజనులలో ప్రబోధమును గావించసాగిరి.

సన్‌యటుసేను మిగుల శ్రద్ధవహించిన రెండవ విషయము జాతీయసైన్యముల తరిబీయతు. ఆయనకు బొరోడిన్ తగిన సలహాల నొసంగుచుండెను. వాటిని తనదేశమునకు తగినటుల మార్చి ఆయన అమలు జరుపుచుండెను. వ్హాంపో సైనిక కళాశాలలో దేశాభిమాన పూరితులగు పౌరసైన్యములు తయారు చేయబడెను. సైన్యములను నడపుటకు సైనికోద్యోగులు మంచి శిక్షణమును పొందుచుండిరి. ప్రథమదినములలో నీ కళాశాలా నిర్మాణమున కవసరమైన వ్యయముకొరకు రుష్యానుండి ద్రవ్యసహాయము కూడ వచ్చినది. ఇచట వాంగుచింగువై తన సుప్రసిద్ధమగు నుపన్యాసముల నిచ్చుచుండెను. క్వూమిన్‌టాంగు సభ్యుడగు చాంగు కేషకుతోపాటు

పౌరసైన్యములు

కమ్యూనిస్టు సభ్యుడగు చౌ ఎన్ లై కూడ ఈ సైన్యములను తరిబీయతు చేయుచుండిరి. ఈ కళాశాలలో తరిబీయతు నొందు సైనికులెల్లరును ఒక వ్యక్తియొక్క గౌరవముకొరకు గాని లేక తమ జీవనోపాధినిమిత్తముగాని పోరాడుచున్నామను భావము లను వదలి తమ మాతృదేశ కళ్యాణముకొరకును ఉత్కృష్టమైన సిద్ధాంతములకొరకును పోరాడుదు మను నుత్సాహమును పొందు చుండిరి. సైనికులలో రాజకీయవిద్య బాగుగ వ్యాపింపచేయ బడెను. స్వతంత్రోద్యమముయొక్క జయముకొరకు ప్రాణము లర్పించుటకు సిద్ధముగనున్న జాతీయసేనలు తయారగుచుండెను. 1925 వ సంవత్సర మాఖరగుసరికి జాతీయసేనలు నలుబదివేలు తయారయ్యెను. 1926 వ సంవత్సరము మధ్యభాగమువరకు ఒక లక్ష జాతీయ సైన్యము సిద్ధపరుపబడెను. అచిరకాలములో నీ జాతీయసైన్యములు పోయి రాష్ట్రములవెంట రాష్ట్రములను జయించి క్యూమిన్‌టాంగు ప్రభుత్వముక్రిందికి చేర్చగలిగెను.

"మా జయమునకు కారణములు మా సైనికులు క్యూమిన్‌టాంగు సిద్ధాంతములకు నమ్మకముగనుండుటయే. మా సైన్యము లన్నియు మా కక్షివారితో నిండియున్నవి. సైనికులందరును సైనిక తరిబీయతునేగాక క్యూమిన్‌టాంగు సిద్ధాంతములలో తరిబీ యతునుకూడ పొందియున్నారు. ప్రతి సైనికుడును మా కక్షి కొరకు పనిచేయువాడు. అతని సిద్ధాంతము లతనికి తెలియును. ఎందుకు తాను పోరాడుచున్నాడో తెలియును. యుద్ధముచేయని సమయములలో తానెందుకు పోరాడుటకు వచ్చినాడో ఆ సిద్ధాంతములను

సైనికుల దేశాభిమానము

చుట్టుపట్టుల నున్న రైతులకును కార్మికులకును బోధించు చున్నాడు. సైనికాధికారులకు తమ నౌకరిని అమ్ముకొను సైనికులు ద్రవ్యముకొరకు కెవరికిందికైన పోవుదురు. జాతీయ సైన్యములలో చేరు సైనికులు దేశపక్షమున మాత్రమే పని చేయుదురు.

"ఇంతేగాక ప్రతి జాతీయసైన్యముతోకూడను చాలమంది రాజకీయ బోధకులు పంపబడుచున్నారు. యుద్ధవిరామమునం దీ రాజకీయబోధకులును సైనికులును ప్రజలకు మిగుల నుత్సాహముతో స్వతంత్ర పక్షమున నుపన్యాసముల నిత్తురు. కొన్ని వేళల రాజకీయ బోధకులు ముందుగ వెళ్ళి ప్రజలలో ప్రబోధము సలుపగ సైన్యము లచటికి చేరుసరి కా ప్రజలు జాతీయపక్షమునచేరి సేనలకాతిథ్య మొసంగు చున్నారు. భోజనపదార్థములను సమకూర్చుచున్నారు. కొందరు సైనికులుగ చేరుచున్నారు. ఈ సైన్యములు ప్రజల సైన్యములు. ప్రజలకొరకు పోరాడుచున్నవి. వీని జయములు ప్రజల జయములు" అని యొక క్యూమిన్టాంగు ప్రకటనమునందు వ్రాయబడినది.

రాజకీయ బోధకులు

తన కండ్లయెదుటనే తన చుట్టునున్న భాగ్యవంతమగు ప్రదేశములనుండి విదేశీయ సుంకపు టధికార్లు సుంకములను వసూలుచేసి పికింగులోని ప్రభుత్వమునకు పంపుచుండుటకు సక్షయటు సేను సహించనేరకుండెను. అటుల విదేశీయులు సుంకములు వసూలుచేయుట చైనా యొక్క ప్రభుత్వహక్కులకు వ్యతిరేకమనియు విదేశీయుల కట్టి యధికారమును కలుగచేసిన యక్రమ యొడంబడికలను తా నంగీక

సుంకములు

రించననియు సుంకముల కచ్చేరీలను విదేశీయులు వదలి లేచిపో వలసినదనియు లేనిచో తాను వాటిపైన దండెత్తి వాటి నాక్ర మించబోవు చున్నాననియు ప్రకటించెను. అందుమీద విదేశీయు లకు చాల భీతిగలిగెను. ఆంగ్లేయప్రభుత్వము వెంటనే మూడు యుద్ధనౌకలను చైనాకు తెచ్చెను. అమెరికాప్రభుత్వము అయిదు యుద్ధనౌకలను తెచ్చెను. ఆంగ్లేయులు సన్‌యట్సేనుతో రాజీ పడిరి. దక్షిణప్రాంతము నుండి వచ్చు సుంకములను సన్‌యటుసేను కిచ్చునటుల యొడంబడిరి. ఇందువలన కాన్‌టన్‌లోని క్యూమిన్ టాంగు ప్రభుత్వముయొక్క బొక్కసము వృద్ధియయ్యెను.

## 5

వీటియన్నిటికన్న సన్‌యటుసేను గావించిన యుత్కృష్ట మైన కార్యము గ్రంథరచనము ఉపన్యాసములును నై యున్నవి. ఇవి భావితరముల వారికి శాశ్వతమైన లాభమును కలుగచేసి యాయనను నవీన చైనాజాతీయ స్థాపకునిగ గావించెను. ప్రాచీన చైనాలో కన్‌ఫ్యూషియసుకు కలిగిన యాచార్యస్థానము నవీన చైనాలో సన్‌యటుసేనుకు కలిగెను. సన్‌యటుసేను నవీనచైనాకు స్థాపకుడు, ఆచార్యుడు, నాయకుడుగ విలసిల్లు చున్నాడు.

**సన్‌యటుసేనుయొక్క గ్రంథరచన**

స్పష్టమైన రాజకీయతత్వముమీద నిర్మాణము గావింపబడనిచో తన రాజకీయకక్షి చిరకాలము నిలువదని సన్‌యటుసేను గ్రహించి సిద్ధాంతభాగమును తన కక్షివారికిని తన దేశీయుల కును బాగుగ బోధించుటకై పూనుకొనెను. 1918వ సంవత్స

రమునసే ఆయన 'జాతీయ నిర్మాణవిధానము'లను చిన్న పుస్తకములను ప్రచురించెను. పిమ్మట జరిగిన కల్లోలములలో నాయనకు స్థిమితము చిక్కలేదు. ఇపుడు కాంటనులో స్థావరమేర్పడినందునను, తన యుద్దేశ్యముల ననుసరించి కార్యక్రమము జరుగుచున్నందునను మరల నుపన్యాస ములకును గ్రంథరచనకును ఆయన బాగుగ పూనుకొనెను. క్యూమింటాంగు కాంగ్రెసు జరుగుచున్న దినములలోనే ఆయన తన యుపన్యాసములను ప్రారంభించెను. పిమ్మట కాంటనులోని లింగునాం విశ్వవిద్యాలయమునందు ప్రతి వారము చైనా యువజనుల కొరకు సన్‌యటుసేను ఉపన్యాసముల నిచ్చుచుండెను. ఇంకను తేలిక యగు భాషలో కార్మికులకును, రయితులకును ఉపన్యాసముల నిచ్చుచుండెను. ఆ యుపన్యాసములను వినగనే వారి కాత్మగౌరవము కలుగుచుండెను. భావిస్వరాజ్యము తమదేనను ఉత్సాహము పుట్టుచుండెను. కాయకష్టముయొక్కయు మానవ జీవితముయొక్కయు ఘనత బోధపడుచుండెను. ఆయన ఇచ్చిన యుపన్యాసముల నన్నిటిని సంక్షిప్తలిపి (Shorthand) లో వ్రాసుకొనుచుండిరి.

ప్రతిదినము గంటలకొలది బల్లవద్ద కూర్చొని ఆయన వ్రాయుచుండెను. ఆయనయందు అత్యంత గౌరవముగల యాయన భార్యయగు చింగులింగుదేవి ఆయన వ్రాసినదానినెల్ల ఆమెయొక్క ముద్దులొలుకు దస్తూరిన సాపుగ వ్రాయుచుండెను. ఆమెయే ఆయనకు కార్యదర్శిగ పనిచేయుచుండెను. ఆయనయొక్క

**చింగులింగుదేవియొక్క సహాయము**

మూత్రకోశములలో నొకదానికి వ్యాధి కలిగినది. తరుచుగ నాయనకు బాధ కలుగుచుండెను గాని ఆమెయొక్క సుందర మైనట్టియు, ఆనందదాయకమైనట్టియు వదనారవిందము చూడ గనే యాయనకు బాధ మాయమైపోవుచుండెను. ఆయనకొరకు వచ్చినవా రెప్పుడు చూడవచ్చునో ఆమెయే నిర్ణయించెను. బాధను లక్ష్యపెట్టక ఆయన వ్రాయుచుండెను. ఇటుల ఆయన వ్రాసిన గ్రంథములు పదమూడు గొప్ప సంపుటము లయ్యెను. మరియు నసంఖ్యాకములగు కరపత్రములను వ్రాసెను. కొన్ని ఉపన్యాస ములుకూడ గ్రంథరూపమున ప్రచురింపబడెను. ఆయనయొక్క గ్రంథములును కరపత్రములును దేశములోని అన్నిభాగముల లోను బాగుగ వ్యాపించినవి. ఆయన రాజకీయ, సాంఘిక, ఆర్థిక, నైతికవిషయములను గూర్చి వ్రాసెను. నవీనచైనాలోని ఆయనయొక్క వ్రాతలు చదువబడినంతగ ఎవరి గ్రంథములును చదువబడుటలేదు. కన్ఫ్యూషియసుయొక్క గ్రంథములు కూడ సన్‌యటుసేనుయొక్క గ్రంథముల తరువాతనే వచ్చుచున్నవి. సన్‌యటుసేను వ్రాసిన గ్రంథములలోకెల్ల ముఖ్యమగు గ్రంథము (**Twenty five articles for the Rehabilitation of China**) 'చైనాయొక్క పునరుద్ధరణముకొరకు ఇరువదియైదు సూత్ర ములు' అనునది. ఆయన కాన్‌టన్‌లోని విశ్వవిద్యాలయములో నిచ్చిన యుపన్యాసములు 'ప్రజల మూడు సిద్ధాంతములు' (**San Min Chu I**) అనుపేరుగల గ్రంథముగ ప్రచురింపబడినది.

## 6

ఈ కాలమునకు చైనాలో కమ్యూనిస్టులు (సాముదాయ వాదులు) స్థాపించుకున్న స్థితి యేమో తెలిసికొనుట అవసరము. చైనాకు ప్రక్కనున్న రుష్యాలో 1917 వ సంవత్సరము అక్టోబరు నెలలో కమ్యూనిస్టువిప్లవము జరిగి బోల్షివికు ప్రభుత్వము ఏర్పడి, ప్రపంచములోని అన్ని దేశములలోను కమ్యూనిజమును వ్యాపింపచేయుటకు అంతర్జాతీయ కమ్యూనిస్టు సంఘము (**Communist International**) స్థాపిత మైనప్పటినుండియు, చైనాలోని కొందరు యువకులలోకూడ కమ్యూనిజమునందు వ్యామోహము కలుగ సాగెను.

చైనాలో కమ్యూనిస్టుల స్థితి

1920 వ సంవత్సరము మే నెలలో షాంఘాయి నగరమున చెణ్టూష్యూహసి యను నాయకత్వమున కొందరు యువకు లొక కమ్యూనిస్టుబృందముగ నేర్పడిరి. ఆయనపుడు పికింగు జాతీయ విశ్వవిద్యాలయములో ఆచార్యుడుగ నుండెను. పిమ్మట కొలది కాలమునకు పికింగు, హ్యూపే, టీణ్ట్సిను, కాణ్టణ్ నగరములలోకూడ చిన్నచిన్న కమ్యూనిస్టు బృందము లేర్పడెను. 1921 వ సంవత్సర ప్రారంభమున ఫ్రాన్సులోను, జపానులోను, సోవియట్ రుష్యాలోను చదువుకొనుచున్న చైనా దేశపు విద్యార్థులలో కొందరు కమ్యూనిస్టు బృందములలో చేరిరి. ప్రస్తుత చైనా కమ్యూనిస్టు ప్రభుత్వ ప్రధాన మంత్రిగ నున్న చౌఎన్ లే, ఆ కాలమున ఫ్రాన్సులో విద్యనభ్యసించుచు కమ్యూనిస్టు బృందములో చేరినవాడు. హ్యూనాన్ రాష్ట్రములో మావోసిటంగు

(**Mao Tse Tung**) ప్రస్తుత కమ్యూనిస్టు చైనా నాయకుడు ఆ కాలమున విద్యార్థి నాయకుడుగా నుండి చైనా సోషలిస్టు యువజన సంఘమును స్థాపించి, కార్మికులలో కారలు మార్క్సు లెనిన్ సిద్ధాంతములను వ్యాపింప చేయ సాగెను. షాంఘాయిలోని కమ్యూనిస్టులు కార్మికులకు రాత్రిపాఠశాలలు పెట్టిరి; మిగిలిన చోట్ల కార్మికుల సంఘములను స్థాపించి వారిచేత సమ్మెలు చేయించ మొదలిడిరి. కమ్యూనిస్టు భావముల వ్యాపనకై కొన్ని పత్రికలను కూడ ప్రారంభించిరి.

కమ్యూనిస్టుపార్టీయొక్క స్థిరస్థాపనము

రుష్యాలో స్థాపించబడిన అంతర్జాతీయ కమ్యూనిస్టు సంఘమువారి సలహా సహాయములచే 1921 వ సంవత్సరము జులై నెల 1 వ తేదీన షాంఘాయిలో చైనాకమ్యూనిస్టుపార్టీ యొక్క ప్రథమ సమావేశము జరిగెను. దానికి హ్యూనాన్ రాష్ట్రమునుండి మావోసి టుంగు ప్రతినిధిగా హాజరయ్యెను. ఆ సమావేశములో రుష్యా బోల్షివిక్ పార్టి పద్ధతినే చైనాకమ్యూనిస్టు పార్టీ కూడ కారల్ మార్క్సు, లెనిన్ సిద్ధాంతములమీద నిర్మాణము గావింపబడి, అందుకవసరమైన వివిధ సంఘములు ఏర్పరుపబడినవి. ఇంతటితో చైనాలో కమ్యూనిస్టుపార్టీ యొక్క స్థాపనము స్థిరముగా జరిగినది. 1922 వ సంవత్సరము జులై నెలలో షాంఘాయిలోని రెండవ చైనా కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెస్సు జరిగి, చైనాలో కమ్యూనిజమును స్థాపించుటయే తమ అంతిమ ధ్యేయమనియు, ఈ లోపల మొదటిమెట్టుగ విదేశప్రభుత్వముల యాజమాన్యము నుండియు, సైనికనాయకుల నుండియు, ఒగొప్ప

భూషామందు పద్ధతినుండియు చైనాప్రజలను విముక్తిచేసి యొక ప్రజారాజ్యముగల ప్రజాస్వామ్యమును స్థాపించుటకు తోడ్పడుదుమనియు, నొక ప్రకటనను గావించిరి. అందులో చైనా ప్రజలందరును వెంటనే సామ్రాజ్యతత్వము పైనను, భూషామందు తత్వము పైనను తిరుగుబాటు గావించవలెనని కోరిరి. ఒక కార్మిక వార పత్రిక స్థాపించబడెను. చైనాలో విశేషముగా వృద్ధియగుచున్న పారిశ్రామిక సంస్థలలోని, రైల్వేలలోని, ఓడరేవులలోని కార్మికులకు సమ్మెలు కట్టుట జయప్రదముగా నడుపుటను నేర్పసాగిరి. 1922 జనవరి మొదలు ఫిబ్రవరి వరకు నూటి కన్న ఎక్కువ సమ్మెలు జరిగెను. వాటిలో మూడు లక్షలమంది కార్మికులు పాల్గొనిరి. కాని తాము స్వతంత్రముగా సమ్మెలు జరిపి విప్లవమును సాగించుటకు తగిన బలము లేదనియు, తాము బలమును సంపాదించుకొనుటకు డాక్టర్ సన్‌యటుసేను వంటి జాతీయనాయకునితో పొత్తు కుదుర్చుకొనుట అవసరమనియు కమ్యూనిస్టులు గ్రహించిరి.

ఇట్టిస్థితిలో డాక్టర్ సన్‌యటుసేనును ఆయన కాపురమున్న షాంఘాయిలోని శాంతి కుటీరములో రుష్యా ప్రభుత్వ ప్రతినిధి 1922 వ సంవత్సరము డిశంబరు నెలలో కలసి చైనాలో సాగించవలసియున్న స్వతంత్ర పోరాటమునుగూర్చియు, సన్‌యటుసేను అటుల సాగించుటకు రుష్యా ప్రభుత్వము చేయదగిన సహాయమును గూర్చియు తబిసీలుగా చర్చించెను. ఇంతటినుంచి చైనాలోస్వతంత్ర పోరాటములో తమతో కలసి వచ్చిన సైనిక నాయకుల మీదను

డాక్టర్ సన్‌యటు సేనుతో పొత్తు

కొందరు ద్రవ్యమిచ్చెడు వర్తకుల మీదను భూస్వామందులమీదను పై తరగతుల వారి మీదను ఆధారపడక, దేశములోని విద్యార్థులను, యువజనులను, రైతులను, కార్మికులను తరిఫీయతుచేసి వారి సహాయమున విప్లవము సాగించుటయే యుక్తమని ఆయన యిచ్చిన సలహాను సన్‌యటుసేనుకు బాగుగా నున్నటుల తోచెను. అపుడు సన్ యటుసేను మిగుల నిరాశాస్థితిలోనుండెను. చైనాలో ప్రజారాజ్యము స్థాపించుటకు తనకు సహాయము చేయవలసినదని అమెరికా ఇంగ్లాండులను కోరగా వారందుకు నిరాకరించిరి. గావున రుష్యా ప్రతినిధి తనవద్దకు వచ్చి సహాయము చేయుదునని చెప్పుట తన జీవితములో అదృష్టమని ఆయన భావించి యుండును. రుష్యా ప్రతినిధియొక్క సలహా నంగీకరించి తాను సాగించుచున్న విప్లవోద్యమమునకు రుష్యానుంచి సహాయము పొందుట కొప్పుకొనెను. లెనిన్ క్రిందనున్న రష్యా ప్రభుత్వము, రుష్యాలోని అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ, చైనాలోని కమ్యూనిస్టులు, సన్ యటుసేను సాగించుచున్న జాతీయ స్వతంత్ర పోరాటములో ప్రవేశించి, తమ పరిస్థితులు బలపడినపుడు తాము తిరుగుబాటు గావించి, జాతీయ వాదులను కూలద్రోసి, తమ కమ్యూనిస్టు విప్లవమును స్థాపించుకొనవచ్చునను భావము రుష్యా, చైనా కమ్యూనిస్టుల కుండియున్నచో నది అసహజము కాదు. వారి గమ్యస్థానము చైనాలో కమ్యూనిస్టు రాజ్యము స్థాపించుటే అయ్యుండెను. వారు సేనలలోను, కార్మికులలోను, కిసానులలోను, విద్యార్థులలోను శాంతముగా, నిరాటంకముగా కమ్యూనిస్టు భావములను వ్యాపింపచేయుచునే యుండిరి. ఏది

ఎట్లున్నను 1923 వ సంవత్సరము జనవరి 26 వ తేదీన చైనా జాతీయ నాయకుడైన డాక్టరు సన్ యటుసేను రుష్యా ప్రతినిధి యైన అబ్రహాం అడాల్ఫు జోఫీగార్లు పైన చెప్పబడిన యొడంబడికను గావించుకొని సంతకము చేసిరి. ఇది ప్రపంచములో కెల్ల పెద్ద దేశమగు చైనాయొక్క చరిత్రను పూర్తిగ మార్చివేసిన చరిత్రాత్మకమైన ఒడంబడిక అయ్యున్నది.

1923 వ సంవత్సరము జూన్ నెలలో కాన్టన్‌లో జరిగిన తృతీయ చైనాకమ్యూనిస్టు కాంగ్రెసులో చైనాకమ్యూనిస్టులు డాక్టర్ సన్‌యటుసేనుతో కలసి (**United Front**) ఐక్య సంఘముగా పనిచేయుటకు తీర్మానించిరి. అందుకు సన్‌యటుసేను అంగీకరించి తన ఖ్యూమిన్‌టాంగు కాంగ్రెసులో మూడవ వంతుకు మించకుండా కమ్యూనిస్టులను చేర్చుకొనుటకు నిశ్చయించెను. 1924 వ సంవత్సరము జనవరి నెలాఖరున జరిగిన ప్రథమ చైనా ఖ్యూమిన్‌టాంగు కాంగ్రెసుకు కమ్యూనిస్టు ప్రతినిధులుగ హాజరై అందులో చేరిన వారిలో ముఖ్యులు మావోసిటంగు, లీటాచో, చౌఎన్‌లై, విన్ పోచూ, చూ చి యో పై అయ్యున్నారు. అప్పటినుంచియే చైనాలో తీవ్రమైన జాతీయ స్వతంత్ర పోరాట యుద్ధము సాగెను. ఇంతలో 1925 వ సంవత్సరము మార్చి నెల 12 వ తేదీన చైనాజాతి యొక్కయు, ప్రపంచములోని దేశములలో ప్రజాస్వామ్య స్థాపనోద్యమము (డెమోక్రెసీ) యొక్కయు గొప్ప దురదృష్టము వలన డాక్టరు సన్‌యట్సుసేను పరమపదించెను. గాని చైనాలో కమ్యూనిజమును స్థాపించుటయే ప్రగమ్యస్థాన

సన్‌యటుసేను కమ్యూనిస్టులతో పొత్తు పెట్టుకొనుట అవివేకముకాదా?

ముగా గలిగినట్టియు, వర్గపోరాటమే తమ కార్యక్రమముగా పెట్టుకున్నట్టియు, రుష్యాలోని, అంతర్జాతీయ సంఘముచే నడుప బడుచుండినట్టియు; దేశములో తమ పార్టీ వ్యక్తిత్వమును నిలుపు కొని తమ కార్యక్రమమును జరుపుకొనుటకు ఎల్లప్పుడును కుట్రలు చేయునట్టియు కమ్యూనిస్టు పార్టీతో, కమ్యూనిజము చైనాలో అసలే పనికిరాదని వర్గపోరాటము కూడదని నమ్మె జాతీయవాది యగు డాక్టరు సన్‌యట్‌సేను పూర్తిగా పొత్తుకలుపుకుని దేశ ములో తనకు గల పలుకుబడిని కమ్యూనిస్టులకు కూడ పంచి యిచ్చి సైన్యముల నిర్మాణము కొరకు రుష్యామీదను చైనా కమ్యూనిస్టుపార్టీ మీదను ఆధారపడుట, కూ్యమింటాంగుయొక్క పతనమునకును కమ్యూనిస్టుల పలుకుబడి వృద్ధియగుటను దారి తీసినదనియు, అట్టుల పొత్తు కలుపుకొనుట చాల అవివేకమైనపని యనియు తలచువారు చాలామంది కలరు. అట్టుల తలచుటలో తప్పులేదని చెప్ప సాహసించుచున్నాము. కమ్యూనిస్టులతో కలయిక తనకు ప్రథమము నుండియు ఇష్టము లేదనియు, కమ్యూనిస్టులు రుష్యాలోని అంతర్జాతీయ కమ్యూనిస్టు సంఘము వారి సలహా ప్రకారము నడచుకొను రుష్యా ఏజంట్లనియు, వారు కమ్యూనిస్టు విప్లవ కార్యక్రమమును విడచిపెట్టి త్రికరణశుద్ధిగ జాతీయ ప్రభుత్వస్థాపనకు తోడ్పడు వారు కారనియు, అట్టి వారితో కలయిక జాతీయస్వతంత్ర విప్లవమునకు హానికరమేమో ననియు తాను సన్‌యట్‌సేనుతో చెప్పియుంటిననియు, ఆయన ఉత్తర దండయాత్రలను పూర్తిచేసి యావత్తు దేశముమీద జాతీయ ప్రభుత్వస్థాపన జరుగగనే మూడు ప్రజల సిద్ధాంతముల మీద

జాతీయ పార్లమెంటు స్థాపనచేతుమనియు, అంతటితో కమ్యూని స్టు బెడద వదలుకొందు మనియు తనతో చెప్పినాడనియు చ్యాంగ్ కేషకు తన "చైనాలో సోవియటు రుష్యా"అను గ్రంథము నందు వ్రాసియున్నాడు. గావున డాక్టరు సన్‌యటుసేను చిర కాలము బ్రతికియున్నట్లయిన ఈ తప్పును క్రమముగ దిద్దుకొని జాతీయవాదుల ప్రత్యేక నాయకత్వమును దేశముమీద స్థిరముగ స్థాపించి యుండునేమో? కమ్యూనిజము క్రమముగా బలహీనమై పోయి యుండునేమో? దురదృష్టవశాత్తు ఒక సంవత్సరమునకే ఆయన మరణించెను. మరల జాతీయవాదులకు అట్టి నాయకుడు లభింపకపోగా జాతీయవాదులలో నిరంతరము అంతఃకలహములే కలిగెను. ప్రజారాజ్యమును స్థైర్యముతోను, సమర్థతతోను, బహు జాగరూకతతోను నడుపగల నాయకుడు మరల లభించలేదు. ప్రజారాజ్యమని చెప్పినంత మాత్రముచేత నది జయప్రదము కాదనియు, దానిని సమర్థతతో నడుపగల మంచి యనుభవము గల నాయకులు కావలసి యున్నారనియు, అట్టివారు చైనాకు లభించలేదనియు ఫిట్జు గెరాల్డు తన "చైనాలో విప్లవము"అను గ్రంథము నందు వ్రాసి యున్నాడు.

అటులగాక ఇండియా స్వతంత్ర పోరాటములో కాంగ్రెసు నాయకులు కమ్యూనిస్టుల వంటి విదేశ ఏజెంట్లను దగ్గరకు రానీయలేదు. తమ పోరాటములో ఏ విదేశీయుల సహాయమును కోరలేదు. ఇతర పార్టీలమీద ఆధారపడలేదు. తమ స్వంతబలము మీదనే ఆధారపడినారు. అంతేగాక ఇండియా యొక్క గొప్ప అదృ

ఇండియా పరిస్థితులు వేరుగ నుండెను

ష్టమేమనగా కాంగ్రెసు యొక్కయు, జాతీయ స్వతంత్రపోరాటము యొక్కయు నాయకుడుగ మహాత్మగాంధి అనేక సంవత్సరములు జీవించి, తానే స్వయముగా తుదివరకును స్వతంత్రోద్యమమును జాతీయ పద్ధతులమీద 1920 వ సంవత్సరము మొదలు 1947 వ సంవత్సరమువరకు ఇరువది యెనిమిది సంవత్సరములు నడిపి, వేలకు వేలమంది జాతీయవాదులను తయారుచేసి, జాతీయ ప్రజారాజ్య ప్రజాస్వామ్యమును (డెమోక్రెటిక్ రిపబ్లికును) స్థిరమైన పునాదులమీద స్థాపించి, దేశములోని యావత్తు ప్రజల వల్ల ఎన్నుకొన బడిన పార్లమెంటు పాలనము నేర్పరచి, దానికి తన యనుచరులలో తగిన వారిని నాయకులుగ గావించి అదిస్థాపితమైన ఆరు నెలలకు పరమపదించినారు. అంతేగాక ఇండియా మీద ఒకే ఆంగ్ల విదేశ పాలన మేర్పడినందున వారు దేశము నంతను తమపాలనము క్రిందకు దృఢముగ తెచ్చుకొని శాంతి భద్రతలను స్థాపించి శాంతముగ ఏకపాలనము క్రిందనున్న దేశమును 1947 వ సంవత్సరములో మహాత్మగాంధి గారికి, ఆయన అనుచరులకు వప్పగింత చేసి పోయినారు. వారు ఐకమత్యముతో పాలనమును సాగించుచున్నారు. ఆంగ్ల ప్రభుత్వము వారు ఇండియాలో స్థాపించిన విశ్వ విద్యాలయములలో ఇంగ్లండులోను నవీన పాశ్చాత్య ప్రపంచములోను నేర్పడిన ప్రజారాజ్య విధానమును, 'అవి నడుపబడుచున్న విధమును తరతరముల విద్యార్థులకు బోధించుచు వచ్చినందున ఇండియాలోని విద్యాధికులలో ప్రజారాజ్య తత్వము బాగుగా వ్యాపించి యున్నది. మరియు ఆంగ్లప్రభుత్వమువారు ఇండియాలో నిచ్చిన

రాజకీయ సంస్కరణములు కూడ ప్రజారాజ్య పద్ధతినే అనుసరించి యున్నవి. మాంటేగు చెమ్స్‌ఫర్డ్ సంస్కరణములను, ఇండియా గవర్నమెంటు శాసనమును బట్టి ఇండియాలో శాసన సభలకు ఎన్నికలు జరుగుట, వాటి ద్వారా ప్రజా ప్రతినిధులు చాల అధికారములను చెలాయించుట మొదలగు విధముగ ఇండియా ప్రజలు ప్రజారాజ్య విధానము యొక్క అనుభవమును స్వతంత్రము రాకముందు అనేక సంవత్సరములనుంచి సంపాదించి యున్నారు. మునిసిపాలిటీలలోను, జిల్లాబోర్డులలోను కూడ జరిగిన ఎన్నికల వల్ల ప్రజారాజ్య అనుభవము భారత పౌరులకు కొంత కలిగినది. ఈ కారణములన్నిటి వల్ల స్వతంత్రము వచ్చిపిమ్మట సంపూర్ణ ప్రజారాజ్యమును స్థాపించుకొనుటయే గాక దానిని నడుపుటకు సమర్థతానుభవములు గల వేలమంది నాయకులు ఇండియలో నున్నారు.

చైనాలో అటుల గాక. వివిధ సామ్రాజ్యవాదులవల్లను, సైనిక నాయకులవల్లను అరాచక పరిస్థితులు తొంబది సంవత్సరములనుంచి పూర్తిగ కలుగజేయబడినవి. పికింగులోని కేంద్ర ప్రభుత్వము మిగుల బలహీనమైనది. క్రమముగ కూలిపోయినది. దేశములో ప్రజల ఎన్నికలు లేకపోగా ప్రజారాజ్యము లేకపోగా సైనికశక్తులమధ్య పోరాటములే తాండవమాడినవి. డాక్టరు సన్‌యటుసేను మరణించగనే జాతీయవాదులు తమలో తాము పోరాడుకొన్నారు. అరాచక పరిస్థితులనుంచి దేశమును కాపాడి శాంతియుతమైన ప్రజారాజ్యమును స్థాపించలేక పోయినారు. సైనిక నాయకులతో యుద్ధము, జపానుతో యుద్ధము, కమ్యూ

నిస్టులతో యుద్ధము విరామములేక జరుగుచుండెను. జాతీయ వాదుల సైనిక నిరంకుశత్వము మధ్యను, కమ్యూనిస్టుల సైనిక నియంతృత్వముమధ్యను జరిగిన పోరాటములో తుదకు కమ్యూనిస్టులే జయమును బొంది రాజ్యమును స్వాధీనపరచుకొన్నారు. ఇటుల రెండు గొప్పదేశములును, చైనా—ఇండియాలు - వివిధ పరిస్థితులను కలిగియుండుటచే వాటి చరిత్రలు వేరువేరుగ పరిణమించినవి.

★

# చైనా విప్లవము

## సప్తమాధ్యాయము

---

### సన్ యటుసేను మరణము - ఆయన సిద్ధాంతములు

### 1

అక్కడ పికింగులో మరల సైనిక నాయకులమధ్య పోరాటము ప్రారంభమయ్యెను. వుపిఫుయొక్క కతిని వెడలగొట్టుటకు మరల మంచూరియా సైనిక నాయకుడగు చాంగుసోలిన్ సేనాని పికింగుపై దండెత్తి వచ్చెను. వుపిఫు సేనాని చాంగుసోలిఙను, సఙ యటుసేనును కూడ వెడలగొట్టెదనని ప్రకటించెను. ఫెంగు సేనాని జాతీయవాది యగుటచే సఙ యటుసేనుయొక్క సలహాపైన వుపిఫుకు వ్యతిరేకముగ పనిచేసెను. వుపిఫు వెడలగొట్టబడెను. చాంగుసోలిఙ సేనాని తన అధికారమును పికింగులో స్థాపించెను. ట్యూయఙ సేనాని అధ్యక్షుడుగ చేయబడెను.

సన్ యటుసేనుకు పికింగునుండి యాహ్వానము

అధ్యక్షుడైన ట్యూయఙసేనానియు, సైనికనాయకులలో బలవంతుడైన చాంగుసోలిన్ సేనానియు, క్రైస్తవుడును జాతీయవాదియు నగు ఫెంగు సేనానియు కలసి సఙ యటుసేనును పికింగుకు వచ్చి రాజీగ దేశమున కంతకును ఐక్యత శాంతి కలిగెడి మార్గములను గూర్చి మాటలాడుట కాహ్వానమును బంపిరి. 1924 వ సంవత్సరము నవంబరు నెలలో జాతీయ స్వతంత్రోద్యమ

నాయకుడును చైనా జాతీయ ప్రభుత్వ అధ్యక్షుడును నగు సన్‌యటుసేను పికింగుకు పోవుటకు భార్యతో గూడ బయలు దేరెను. ఆయనకు కార్యదర్శిగ పనిచేయుటకు వాంగుచింగువై ముందుగనే పికింగుకు వెడలెను. పికింగులో నొక జాతీయ ప్రతినిధుల సమావేశము జరుగునని సన్‌యటుసేను ప్రకటించెను. దేశము యొక్క దృష్టి యంతయు ఆయన వంకకు మరలెను.

సన్‌యటుసేనుయొక్క పికింగు ప్రయాణము బహు జయప్రదముగ జరిగెను. త్రోవలో నాయన దిగినచోటనెల్ల అపూర్వమగు స్వాగత మొసంగబడెను. హాంకాంగు చాలకాలము నుండియు ఆయనకు వ్యతిరేకముగ నుండెను. ఇపు డాయనకు గొప్ప సన్మానమును చేసెను. ఆయనయొక్క యుపన్యాసముల నాతురతతో వినెను. అచటనుండి ఆయన జపానులో దిగెను. ఆసియాఖండ స్వతంత్రము కొరకును ఆత్మగౌరవము కొరకును నిరంతర పోరాటమును సల్పుచున్న ధీరుడగు సన్‌యటుసేనును గౌరవించుటకు జపానులోని ప్రజలు వేలకొలది మూగిరి. ఆశియాఖండ వాసులకు అమెరికాలో పౌరసత్వములు లేకుండ చేయుచు 1924 వ సంవత్సరము జూలై నెలలో అమెరికా ప్రభుత్వమువారు చేసిన (**American Immigration Act**) అమెరికా ఇమిగ్రేషన్ చట్టము జపానుదేశీయుల కాగ్రహము కలిగించెను. ప్రపంచ యుద్ధములో జర్మనీనోడించుటకు జపానుయొక్క సహాయము కావలెను. పౌరస్వత్వములు పొందుటకు మాత్రము తెల్లజాతులకే అర్హతకలదుగాని ఆశియాఖండవాసుల కెవరికిని లేదు. ఇందువలన

త్రోవలో అపూర్వమగు స్వాగతములు

విశేషముగ అమెరికాకు పోయి నివసించుచున్న జపానువారి కెక్కువ నష్టమును అవమానమును నైయున్నదని జపానువారికి మితిలేని ఆగ్రహము కలిగినది. జపానుదేశములోని కోబుపట్టణములోనున్న యువజనక్రైస్తవసంఘ మందిరమునందు పాశ్చాత్య జాతులచే నణచివేయబడిన జాతీయ గౌరవమును పునస్థాపనము చేసికొనుటకొరకు ఆశియాఖండజాతు లేకమై పోరాడవలెనని సణ్ యటుసేను ఇచ్చిన గంభీరోపన్యాసము జపానువారికి గొప్ప యుత్సాహమును కలుగచేసెను. పాశ్చాత్య క్రైస్తవ మతబోధకులు పాశ్చాత్య జాతుల సామ్రాజ్య వ్యాపకముకొరకు పనిచేయు దూతలనియు, బలహీనులగు చైనా చక్రవర్తులు భయమువలన పాశ్చాత్యజాతులతో చేసికొనిన యొడంబడికలను తాము రద్దు చేయుచున్నామనియు ఆయన చెప్పిన వాక్యములు, తెల్లమిషనరీలకును తెల్లవర్తకులకును, క్రైస్తవుడును పాశ్చాత్య విద్యా విశారదుడును నగు నాయన యందు గొప్ప ఆశాభంగమును కలిగించెను. అచటనుండి చైనాలోని యుత్తర ప్రాంతములోని ముఖ్యపట్టణములను దర్శించి ఆయన 1924 వ సంవత్సరము డిశంబరు నెల 31 వ తేదీన పికింగునగరమును చేరెను. ఆయనకు ప్రతిచోటను ప్రజలిచ్చిన అఖండమగు స్వాగతములు పికింగులోని సైనికనాయకులకు భీతిని కలుగచేసెను. ఆయనయొక్క పలుకుబడి ఉత్తరప్రాంతములలో కూడ నిటుల ప్రదర్శింపబడుట వారికి కష్టముగతోచకమానదు. ఆయన పికింగుచేరగ వారు గొప్ప స్వాగత మేర్పాటు చేయలేదు గాని ప్రభుత్వ భవనములందు బసనేర్పాటుచేసిరి. ఆయన వారి మనోమాలిన్యమును ఖండించెను.

వారి యాతిథ్యమును నిరాకరించెను. అచటి గ్రాండుహోటలు డిపికిఙ్ అను గొప్ప పూటకూలి భవనములో విడిదినేర్పాటు చేసి కొనెను. అచటనే దర్శనమునకు వచ్చినవారందరితోను మాట లాడుచుండెను. ఆయనను ఏమిచేయుటకును సైనిక నాయకులకు తోచలేదు. ఆయనయొక్క నాయకత్వ మంగీకరించవలెనా లేక ఆయనను ఖయిదులో నుంచవలెనా యను సమస్య యుద యించెను.

ఇంతలో నాయనకు చాల జబ్బుచేసెను. ఆయనను చికిత్స నిమిత్తము చింగులింగుదేవి గొనిపోయి రాకుఫెల్లరు ఫౌండేషఙ్ అను గొప్ప ఆసుపత్రిలో నుంచెను. ఆయనయొక్క వ్యాధి దినదినమునకు వృద్ధియగుచుండెను. సైనికనాయకులు ఆయన యందు విశేషమగు సానుభూతిని గౌరవమును గలిగి నటుల నటించుచుండిరి.

సన్‌యటుసేను మరణము

పుష్పములను కావలసిన వస్తుసామగ్రిని కొదువలేకుండ పంపుచుండిరి. తరుచుగవచ్చి దర్శించి పోవుచుండిరి. శత్రువులచే మూడు ఖండములలో వెంటాడబడిన ధీరుడిపుడు శత్రుస్థానమగు పికింగు పట్టణమున పడియున్నాడు. అన్నిప్రాంతముల నుండియు ఆయనయొక్క స్నేహితులు అనుచరులు ఆయన దర్శనమునకై మూగుచుండిరి. ప్రతిదినపు స్థితిగతులు పత్రికలలో ప్రచురమగుచుండెను. చింగులింగుదేవి విరామములేక శుశ్రూషచేయుచుండెను. తుదకు మూత్రకోశము అశ్రద్ధవల్ల చెడిపోయినదనియు శస్త్రచికిత్సచేసినను లాభములేదనియు నాయనజీవించడనియు వైద్యులు చెప్పిరి. పాశ్చాత్యవైద్యము మాని దేశీయవైద్యము

చేయించుకొనుట కాయన ఆసుపత్రిని విడిచి వెల్లింగ్టన్‌కూగారి యింటికి కొనిపోబడెను. కొద్దిరోజులు జీవింతునను ఆశతోనుండెను. తుదకు నిరాశ కలిగెను. తనతరువాత నెటులజాతీయోద్యమమును నడుపవలెనో నొకసందేశముగ నొక మరణ శాసనము వ్రాయవలెనని వాంగుచింగువై కోరెను. సన్‌యటుసేను భార్యను కాగితమును తెమ్మనెను.

మాస్కోలోని సోవియట్ ప్రభుత్వము వారికొకసందేశమును వ్రాసెను. అందులో నిటులున్నది:—"స్వతంత్రోద్యమమును సాగించి, పాశ్చాత్యసామ్రాజ్యవాదులచే దాదాపు వలసరాజ్యముగ గావించబడిన చైనాదేశమునకు స్వతంత్రమును సంపాదింపవలెనని, క్యూమిన్‌టాంగు సభను కోరుచున్నాను. అందుకొరకు కూంమిన్‌టాంగుకక్షిని మీతో (రుష్యాసోవియటుతో) నెడతెగని సంబంధమును కలిగియుండలసినదని నాజ్ఞాపించుచున్నాను. నాదేశమునకు మీ రిదివరకుచేసినసహాయమునే ఇకముందుకూడ మీరు చేతురని దృఢముగ విశ్వసించుచున్నాను. ప్రియసోదరులారా! కొలదికాలములో బలవత్తరమైనట్టియు, స్వతంత్రమైనట్టియు, స్నేహితుడుగను, చెలికాడుగను, చైనాజాతికి రుష్యాసోవియటు ప్రజాస్వామ్యమువారు స్వాగతమిచ్చు సుదినము రానున్నదనియు, అపుడు రెండుజాతులు కలసి ప్రపంచములో వత్తిడిచెందుచున్న జాతుల స్వేచ్ఛకొరకు జరుగు గొప్ప పోరాటములో సహాయముచేసి జయము పొందుదురనియు, నాకుగల ఆశను వెల్లడిచేయుచున్నాను."

మరణశాసనము.

ఈ పై ఉత్తరమును రుష్యావారికి వ్రాసి తనయొక్క మరణశాసనమును వ్రాయుటకు మరియొక కాగితమును తెమ్మని చింగులింగుదేవితో చెప్పెను. ఆమె తెచ్చినకాగితముమీద నిటుల వ్రాసెను.:—

"నేను నలుబది సంవత్సరములు పూర్తిగ నా యావచ్ఛక్తిని ప్రజలస్వతంత్రముకొరకు ధారపోసినాను. చైనాజాతికి స్వతంత్రమును సమానత్వమును సంపాదించుటయే నాయుద్దేశ్యము. ఈ యుద్దేశ్యమును మనము నెరవేర్చుకొన దలచినచో దేశములోని సామాన్యప్రజలలో భావోద్రేకము కలిగించుటయు ప్రపంచములో మనను తమతో సమానులుగ చూచు జాతులతో కలిసి పోరాడుటయును, అత్యవసరమని నలుబది సంవత్సరముల యనుభవమువలన నాకు బాగుగ తెలుసును.

"స్వతంత్ర పోరాటము పూర్తి కాలేదు. నా యుద్దేశ్యములనే గలవా రందరును మూడు ప్రజల నిశ్చయములలోను ప్రథమ అఖిల చైనాక్యూమింటాంగు కాంగ్రెసువారి ప్రకటనలోను నేను చెప్పియున్న కార్యక్రమము ననుసరించి, ఏకమై తుదివరకును పోరాడి వ్యవహార మార్పులనన్నిటిని యవకాశముగ గైకొని ప్రజల పార్లమెంటును (ప్రజాప్రతినిధి సభను) స్థాపించవలెననియు అక్రమపు సంధులనెల్ల రద్దు గావించవలెననియు కోరుచున్నాను. ఇంతేగాదు. అతి స్వల్పకాలములో జయమును పొందుటకు మీరు కృషి సలుపవలెను. ఇదియే నా యంత్యసందేశము"

అని వ్రాసి యా రెండు కాగితములను వాంగుచింగువైకిచ్చెను. ఆయనను చదువమనెను. ఆయన చదివి తప్పులు లేకుండ

సరిచూచెను. అంతట సన్ యటుసేను వాటికి సాపులు వ్రాసి తెమ్మని చింగులింగు దేవితో చెప్పెను. ఆమె వ్రాసి తెచ్చిన సాపులమీద నాయన దస్కతులు చేసెను. వాంగుచింగువై మొదలగు చాలమంది ప్రముఖులు వాటిమీద సాక్షి వ్రాళ్ళు చేసిరి. యావజ్జీవ మాయనకు స్వతంత్రోద్యమమే ఉద్యోగము, మరణకాలమందాయన విడిచిపెట్టిపోయిన ఆస్తియు నదే. ఆయన యొక్క ముఖ్యాభావముల నా రెండు కాగితములలో నిమిడ్చెను. ఆయన జీవించడని చింగులింగుదేవి గ్రహించినది. దుఃఖమును మ్రింగుకొని యామె గంభీరముగ నాయనకు సేవ చేయు చున్నది. ఆయనయొక్క శిష్యు లన్ని ప్రాంతములనుండియు వచ్చిరి. క్యూమిన్‌టాంగు సభకు చెందిన నాయకు లందరును హాజరుగ నుండిరి. తన శరీరమును నాన్ కింగుపట్టణమున ఊదా కొండ దిగువున మింగు చక్రవర్తి యొక్క గొప్ప సమాధి ప్రక్కన సమాధిచేయవలసినదని ఆయన యాజ్ఞాపించెను. లెనిన్ మహాశయునికి ఉపయోగించినటువంటి కంచుతోను గ్లాసుతోను చేయ బడిన పెట్టెలో తన కళేబరము నుంచవలసినదనికూడ చెప్పెను. 1925 వ సంవత్సరము మార్చినెల 12 వ తేదిన "పోరాడుడు - శాంతి స్థాపితమగుగాక - చైనాదేశమును కాపాడుడు" అను మాటలను చెప్పుచు నాయన మరణించెను.

ఆయన ప్రక్కక్రింద నాయన వ్రాసిన మరియొక కాగితము దొరకెను. అందులో నిటుల వ్రాయబడియున్నది. "నా పుస్తకములను, నా పాతబట్టలను, షాంఘాయిలోని నా యింటిని, నాకు సహచారిణిగను తోడునీడగను నుండిన నా భార్య చింగు

లింగుదేవిని తీసికొనవలెనని ప్రార్థించుచున్నాను" ఆయనకు గల ఆస్తి యంతయు నదే.

ఆయన సాంఘిక సాముదాయవాదము (కమ్యూనిజము) నంగీకరించెననియు మతమును విడిచిపెట్టెననియు కమ్యూనిస్టు పద్ధతుల ప్రకారము అంత్యసంస్కారములు జరుపవలెననియు కొందరు కమ్యూనిస్టువాదులు చెప్పిరి. ఆయన తుదివరకును క్రైస్తవ మతమునందే గాఢమగు నమ్మకము కలిగియుండెనని చింగులింగుదేవి చెప్పినందున యూనియన్ వైద్యకశాలాల కంటి యున్న క్రైస్తవ దేవాలయములో నాయన కంత్యక్రియలు క్రైస్తవమతప్రకారము జాతీయప్రభుత్వపు న్యాయవిచారణశాఖ మంత్రియగుజార్జిచిన్ హ్సుగారిచే జరుపబడెను. మతసంస్కారములు ముగిసినపిమ్మట నాయన శవమునకు చైనా జాతీయ గౌరవమును చూపుటకు గాను పెద్ద యుద్యాన వనములోని ప్రభుత్వ భాండాగారమునకు గొనిపోయిరి. అచటికి రుష్యా ప్రభుత్వ ప్రతినిధులు ఎఱ్ఱపుష్పములను ఎఱ్ఱజండాలను గొని వచ్చిరి. ఇతర విదేశప్రతినిధులు పుష్పమాలలను బంపిరి. పికింగు సైనికనాయకులు స్వయముగ పుష్పమాలలను వైచిరి. ఆయన యొక్క శిరమును ఖండించి గొనితెమ్మని యాజ్ఞ గావింపబడిన పికింగు నగరముననే ఎట్టి భేదాభిప్రాయములు లేకుండ కక్షిల కతీతమైనట్టియు ఏకగ్రీవమైనట్టియు నదివర కెవరికిని ఎన్నడును జరుగనట్టియు చైనాజాతీయ గౌరవము సన్యాటు సేనుకు జరిగెను. ఆయన కోరిన కంచుపెట్టె రుష్యానుంచి రావలెను. అంతవరకును నాన్కింగుకు శవమును గొనిపోవుటకు వీలులేదు.

కావున నొక కొయ్యపెట్టెలో పెట్టి యాశవమును తాత్కాలిక ముగ నుంచుటకు పికింగునగరము ప్రక్కనున్న పశ్చిమాద్రిమీది మేఘముచాటు దేవాలయములో (**Hidden cloud temple**) నికి జాతీయప్రముఖులు మోసికొనిపోయిరి. త్రోవపొడుగునను జన సముదాయములు బారులుతీర్చి యుండిరి. అచటచట శిల్పచాతు రితో నిర్మింపబడిన కొరములలో నాయన యొక్క పటము లమర్పబడి యుండెను. అక్కడ శవమును దింపగ ప్రజలు వేల కొలదిగ దర్శనముచేసి పుష్పములను సువాసన ద్రవ్యములను చల్లిరి. ఇటుల యాశవము కలిగిన పెట్టెను కొండమీదికి గొని పోయి దేవాలయములో నుంచిరి.

దుఃఖముల వలనను కష్టముల వలనను చింగులింగుదేవి యొక్క వదనారవిందమునందు యౌవనపు లావణ్యము అదృ శ్యమై పవిత్రమైన గంభీరత యేర్పడెను. భారతజాతిలో 'సీత'కు వలె చైనాజాతిలో నామెకు మాతృపదవి కలిగెను. చైనాజాతి కంతకును ఆమె పావనమగు మాతయయ్యెను. ప్రాచీనకాలమున శత్రువులను చెండాడి దేశస్వతంత్రమును కాపాడిన హాణ్‌వంశపు రాణియగు మూలాణ్ దేవివలెను, తరువాత కాలమున దేశముపై దండెత్తివచ్చిన మంగోలు దుష్టులు మానభంగము గావించ యత్నించినపుడు కత్తితో పొడుచుకొని యాత్మహత్య గావించు కొనిన సుందరాంగియగు చౌచణ్‌దేవి వలెను, నవీనచైనాకు చింగులింగుదేవి పూజనీయురాలగు దేవతయైనది.

## 2

సణ్‌యటుసేనుయొక్క సిద్ధాంతములను గూర్చి కొంతవ రకు పైనదెలిపియున్నాము. ఆయన రాజకీయ స్వతంత్రముతో

బాటు విజ్ఞానవిప్లవము (Cultural Revolution) ను కూడ స్థాపించెను. చైనాభాషను సామాన్యజనులకు బోధపడునటుల సరళముగ గావించెను. నవీన జ్ఞానము ప్రజలలో గ్రంథములమూలమున బాగుగ వ్యాపించినగాని స్వతంత్రభావములును సమానత్వమును జాతీయతయును శాశ్వత మైన అభివృద్ధియు కలుగ నేరవనితలచి చైనావాఙ్మయమునకు నూతనమార్గములను ఏర్పరచెను. ప్రకృతిశాస్త్రములు, చారి త్రలు, రాజకీయశాస్త్రములు, సాంఘికగ్రంథములు, ఆర్థికశాస్త్ర ములు, మొదలగువాని రచనకొరకై ఆయన ప్రోత్సహించగ ఆయన శిష్యులు వానినన్నిటిని రచించుచు నూతనమగు వాఙ్మ యమును సృష్టించుచు వచ్చినారు. ఈగ్రంథము లన్నియు ప్రజలు మాటలాడు సులభమగు భాషలో వ్రాయబడు చున్నవి. భాష లోని వివిధశాఖలన్నిటిని కలిపి యైక్యతను కలుగ చేసియున్నారు. చైనాకంతకును ఒకే తేలికయగుభాష ఏర్పడినది. వేదాంతశాస్త్ర మునందు కూడ నూతనపక్కీలేర్పడినవి. ప్రాచీనకాలమునుం డియు కన్ఫ్యూషియసుయొక్క సిద్ధాంతములు చైనాదేశమం తటను ప్రజలమనములలో రాజ్యము చేయుచున్నటులే నవీనకాల మున వాటిస్థానమున సన్‌యటుసేనుయొక్క సిద్ధాంతములు రాజ్యముచేయసాగెను. నూతన వాఙ్మయరచనకు పికింగుజాతీయ విశ్వవిద్యాలయమునకు అధ్యక్షుడగు డాక్టరు త్సైయుయన్‌పీ గారు నాయకత్వమువహించి చాలపనిచేసియున్నారు.

విజ్ఞానవిప్లవము

సన్‌యటుసేను గొప్పకర్మయోగి. విధి నొసట వ్రాసిన ప్రకారము లేక భగవంతు డిదివరకే నిర్ణయించినప్రకారము

జరుగునని కొందరు తత్వశాస్త్రజ్ఞులు వ్రాసినబోధలు ప్రజలను ఉపేక్షాపరులుగను కార్యాచరణరహితులుగను చేసెను. మరియు "తెలిసికొనుట తేలికయేగాని కార్యములో పెట్టుట కష్టము." అను ఫ్యూ ఫెయను తత్వబోధకుని సిద్ధాంతము ప్రజలలో వ్యాపించియుండెను. ఇట్టిభావములను ఖండించుచు నూతనమగు తత్వబోధనలను సన్ యటుసేను చేసెను. "తెలిసికొనుట కొంత కష్టమైన పనిగావచ్చును. తెలిసినపిమ్మట కార్యాచరణము సులభసాధ్యము" అను వాంగుయాంగు మిన్ అను తత్వశాస్త్రజ్ఞుని సిద్ధాంతమే సరియని ఆయన వ్రాసెను. ఆయన రచించిన తత్వశాస్త్రమను గ్రంథమునందు ఆర్థిక, సాంఘిక, భాషావిషయిక, వ్యవహారములలో కార్యాచరణ మెటుల తేలికయో మన కార్యాచరణము వలన నే కార్యము లెటుల సాధించ గలమో ప్రారబ్ధముతో తృప్తిపొందుట వలన నెటుల చెడిపోవుచున్నామో చూపుటకు కొన్ని యధ్యాయములు వ్రాసెను. ఎక్కడికక్కడికి సరిపుచ్చుకొని రాజీపడి కాలముగడుపు కొను పద్ధతిని ఖండించి మన యుద్దేశ్యములు ఆదర్శములు పూర్తిగ నెరవేరు వరకును కష్టపడి పోరాడుటయొక్క ప్రాశస్త్యమును గూర్చి ఆయన విశేషముగ వ్రాసెను.

కర్మయోగి

ఆయనవ్రాసిన 'ప్రజల మూడుసిద్ధాంతము' లను గ్రంథము నందు మానవకోటియొక్క పరమావధినిగూర్చి వర్ణించెను. సత్య యుగమునందు మనుజులందరును అన్ని తగాదాలను దౌర్జన్య కృత్యములమాని శాంతముగ నివసింతురనియు, అపుడు నీతిసత్యములు రాజ్యము చేయుననియు,

మానవకోటి యొక్క పరమావధి

వితంతువులకును తల్లిదండ్రులు లేనివారికిని పేదవారికిని సంరక్షణకు కొదువ యుండదనియు అందరికిని కడుపునిండ అన్నముండుటచే దొంగ లుండరనియు, ఎవరును తలుపులు వేసికొని పడుకొన నక్కరలేదనియు, జాతిభేదములును ఎక్కువ తక్కువలును లేక అందరును సమాన గౌరవమును పొందుదురనియు, అట్టి సత్యయుగమును స్థాపించుటకుగాను ప్రతిదేశములోను ప్రజల కొరకు ప్రజలచే పాలింపబడు ప్రభుత్వమును ఏర్పాటు గావించవలసి యున్నదనియు వ్రాసెను. విదేశజాతుల దాస్యమునుండి చైనాను స్వతంత్రముగ చేయుటయే గాక ప్రపంచములోని బలహీన మగునట్టియు నితరులచే వత్తిడి చేయబడుచున్నట్టియు జాతుల కన్నిటికిని స్వేచ్ఛకలిగి, వారికి ప్రజాపాలనము స్థాపిత మగువరకును, చైనాజాతి ప్రారంభించిన స్వతంత్రోద్యమము పూర్తి గానేరదని కూడ ఆయన వ్రాసెను. మనము బలహీనమైన జాతులకు సహాయము గావించవలెను. "దురాశాపరులగు బలవంతులగు జాతులతో పోరాడవలెను. మన దేశీయులందరును ఈ యుద్దేశ్యమును దృఢముగ కలిగియున్నచో మన జాతి యభివృద్ధి నొందును. చైనాయొక్క అభివృద్ధి ప్రారంభము కాకముందే ఈ దినముననే, పడిపోయినట్టియు దుర్బలులైనట్టియు వారి నుద్ధరించుటకు కృతనిశ్చయుల మగుదము. అటులయినచో మనము స్వతంత్రమునుపొంది బలవంతులమయినపుడు మనము గొప్ప జాతులక్రిందపడిన బాధలను జ్ఞాపక ముంచుకొనవలెను. మనమలెనే బాధనొందుచున్నవారికి సహాయము గావించి సామ్రాజ్యతత్త్వమును ప్రపంచములో లేకుండ చేతము. అప్పుడే

జాతులు సుపరిపాలనమును పొందును. మానవకోటికి శాశ్వతమైన శాంతికలుగును. మన న్యాయమైన స్థానమును మరల పొందుటలో న్యాయమును ధర్మమును మనకు పునాదులుగ నుపయోగింతము. ఆశియాఖండ జాతులకన్నిటికిని సోదరభావము వాత్సల్యము ఐక్యత కలుగచేతము." అని ఆయన 1924 వ సంవత్సరము నవంబరు 28 వ తేదీన నిచ్చిన సుప్రసిద్ధమగు నుపన్యాసములో చెప్పెను.

ఆశియా ఖండపు ఐక్యత

"కాని యూరపుజాతుల వారిని న్యాయముకొరకును ధర్మస్థాపనముకొరకును ఆశియాఖండములో ఇపుడు వారనుభవించుచున్న లాభముల నన్నిటిని వదలుకొమ్మని కోరుట నిష్ప్రయోజనము. మనకు పోయిన హక్కులను మరల పొందుటకుమనమునిశ్చయించుకొనినచో మనము గొప్ప పోరాటము సలుపవలసి యున్నది... ఆశియాఖండ వాసులమైన మనము ప్రపంచములోని జనసంఖ్యలో సగముమందిమి గలము. యూరపుఖండవాసులసంఖ్య నలుబది కోట్లు. ఆశియాఖండవాసులసంఖ్య తొంబదికోట్లు. చిన్నసంఖ్య గల యూరపుజాతులు అధికసంఖ్యాకులగు ఆశియాఖండవాసులను అణచివైచుట, న్యాయమునకును మానవధర్మమునకును వ్యతిరేకమైయున్నది. న్యాయమునకును మానవధర్మమునకు వ్యతిరేకముగ జరుపబడెడి యేకార్యమైనను తుదకు అపజయమునుపొందితీరును. స్వలాభము మీదను పశుబలము మీదను నిర్మింపబడిన పాశ్చాత్య నాగరికత, న్యాయముమీదను ధర్మముమీదను ఆధారపడెడి ప్రాగ్దేశముల నాగరికతకు దోసిలొగ్గవలసి యున్నది. అటుల దోసిలొగ్గుకాలము త్వరితముగనే రానున్నది...వత్తిడి

చేయబడు ప్రజలు ఆశియాఖండములో మాత్రమేలేరు. యూరపు దేశములలోకూడ కలరు. అచటి సామాన్య ప్రజలకు స్వతంత్ర మును కలుగచేయ నుద్దేశించిన యుద్యమములెల్ల నాగరికతకు వ్యతిరేకమని యచటి ధనికులు చెప్పుదురుగాని మనము నిర్మాణము గావించదలచిన నాగరికత నిరంకుశత్వమును పరపీడనమును కూలద్రోసి వత్తిడినొందుచున్న వారికి స్వతంత్రమును సమానత్వమును కలుగచేయ నుద్దేశించినదై యున్నది" అని కూడ ఆయన చెప్పెను.

సణాయటుసేను తన మూడవ సూత్రమగు 'ప్రజల జీవనోపాధిని' గూర్చి వ్రాయుటలో కారలుమార్క్సుయొక్క సిద్ధాంతములను విమర్శించి వాటిలో నేవి చైనాకెంతవర కుపయుక్తములో చర్చించెను. కారలుమార్క్సుయొక్క సిద్ధాంతములలో ప్రధానసిద్ధాంతమైన (**Class struggle**) సంఘములమధ్య పోరాటము (షాహుకార్ల సంఘము మధ్యను కార్మికులసంఘము మధ్యను పోరాటము) పాశ్చాత్య జాతులలో నేర్పడిన చారిత్రాత్మక పరిస్థితులవలన నావశ్యకమయ్యెనే గాని అట్టి పరిస్థితులు లేని చైనా దేశమున కన్వయించదని సణాయటుసేను వ్రాసినాడు. "చైనా యొక్క ప్రధానసమస్య పేదరిక మయ్యున్నది. గాని జాతీయ ధనముయొక్క అసమానవిభాజ్యము కాదు. జాతీయధన మెక్కువగ నుండి దానిని కొలదిమంది షాహుకార్లు భాగ్యవంతులు వశపరచుకొనిన దేశములకే కారలు మార్క్సుయొక్క సాంఘిక పోరాటసూత్రము వర్తించును. అచట ధనముయొక్క

చైనాయొక్క ప్రధాన సమస్య పేదరికము

పంపిణీలో సమానత్వమును పొందుటకు సాంఘిక పోరాట మావశ్యకము కావచ్చును. ఆ పోరాటమునందు అత్యధిక సంఖ్యాకులగు కార్మికులకు జయము కలిగి కార్మికుల యధికారము ఏర్పడ వచ్చును. ప్రస్తుత చైనా దేశమున యంత్రములతో చేయబడు పరిశ్రమలు విశేషముగ వృద్ధిగాకుండ నున్న స్థితిలో సాంఘిక పోరాటముతో గాని కేవలము కార్మికుల యధికారముతోగాని పనిలేదు. అసలు 'ధనమేలేనపుడు ధనము యొక్క పంపిణీనిగూర్చిన సమస్య లుదయించనేరవు" అని ఆయన వ్రాసెను.

ఆయన జాతీయధనము యొక్క అభివృద్ధినిగూర్చి విశేషముగ వ్రాసెను. చైనా యొక్క వ్యవసాయము, పరిశ్రమలు, వర్తకము విశేషముగవృద్ధిచేయవలెనని ఆయనసంకల్పము. "చైనా దేశమంతయు బీదదేశము. ఇచట గొప్ప షాహుకార్ల సంఘము లేదు. ఇచట ధనవంతులనబడు వారికిని పేదవారికిని భేదమేమనగ కొందరు సామాన్యమగు పేదరికముననుభవించుచుండగ తక్కినవారుఅత్యంతమగు పేదరికములో క్రుంగియున్నారు"అని వ్రాసెను. కాని జాతీయధనము నుత్పత్తిచేయుటలో గొప్ప పరిశ్రమలను షాహుకార్ల చేతులలో వదలిపెట్టగూడదు. దేశముయొక్క పరిశ్రమలను చాల వరకు స్వరాజ్య ప్రభుత్వమే నడపి షాహుకార్ల జాతి ఏర్పడకుండ గనే చేయవలెను. కారలు మార్క్సు యొక్క ఆదర్శములతో నాయన కొంతవరకు ఏకీభవించుచున్నాడుగాని షాహుకార్లను ఏర్పడనిచ్చి వారిని జయించుటకు బదులు షాహుకార్ల జాతి ఏర్పడకుండ

**షాహుకార్ల జాతిని ఏర్పడనివ్వగూడదు**

ముందుగనే ఆటంకపర్చవలెని యభిప్రాయపడుచున్నాడు. ఈ విష యములో సనయటుసేనుకు గొప్పసహాయముచేసిన లెనిన్ మహా శయుడును, సనయటుసేనుకు సలహాదారుగనున్న బొరొడిన్ గారును, నాయనతో నేకీభవించినారు. రుష్యాలో నవలంబించిన సాముదాయవాదమును (Communism) చైనాలో వ్యాపింప జేయవలెనని వారు కోరకపోవుటయేగాక చైనాయొక్క పరిస్థితుల కది వర్తింపనేరదనికూడ వా రొప్పుకొనియున్నారు. జరుగవలసిన పారిశ్రామికాభివృద్ధి విషయమున సనయటుసే నిటుల వ్రాసి యున్నాడు :—"ప్రభుత్వము పారిశ్రామికులగు షావుకార్ల మధ్యవర్తిత్వ మవసరములేకుండ పౌరుల కందరుకు సరాసరి ఆర్థిక లాభములను కలుగచేయవలెను. పాశ్చాత్య షావుకార్ల ప్రభుత్వ ములు పారిశ్రామికులకును షావుకార్లకును ధనోత్పత్తికి మార్గ ములను అవకాశములను కలుగచేసి, దేశములోని జనసామాన్యము యొక్కయు సంపదయొక్కయు జీవనోపాధియొక్కయు యావత్తు బాధ్యతను ఆ పారిశ్రామికులమీదను షావుకార్ల మీదను వదలి వేయుచున్నవి. అటుల వదలివేయుట అక్రమము. కాని మన పద్ధతి కారలు మార్క్సు సూచించిన పద్ధతి కాదు. సాముదాయ వాద పద్ధతిని బలవంతముగ ప్రవేశపెట్టి రుష్యాప్రభుత్వము ఆర్థిక సమానత్వమును రుష్యా ప్రజలలో స్థాపించుటకు యత్నించు చున్నది. అది యెంతవరకు జయప్రదమగునో సందేహముగ నున్నది. మనము మరియొక పద్ధతి నవలంబింతము. జాతీయ ధనోత్పత్తి యంతయు స్వరాజ్య ప్రభుత్వము చేతిలో నుంచుదము. బ్యాంకీలు, గనులు, అడవులు, నదీప్రవాహములు, రైళ్ళు మొదలగు రాక

పోకల సాధనములు, విద్యుచ్ఛక్తి, టెలిగ్రాములు, టెలిఫోనులు మొదలగు ప్రజల కుపయోగించునవి, ముఖ్యమయిన పరిశ్రమలు, మన ప్రభుత్వముయొక్క యాజమాన్యమున నుండవలెను. మన దేశముయొక్క పారిశ్రామికాభివృద్ధి వలనను ఐశ్వర్యాభివృద్ధి వలనను కలుగు లాభమంతయు కొందరు వ్యక్తులు మాత్రము పొందగూడదు. మనదేశములోని ప్రజలకందరకును చెందవలెను."

జాతీయైక్యత, జాతీయస్వతంత్రము, ప్రజల జీవనోపాధి, చైనాయొక్క ప్రధాన యావశ్యకములని తన వ్రాతలలోను బోధలలోను సన్‌యట్‌సేను వివరించెను. ఆయన గొప్ప ఆదర్శములను కలిగియుండుటయే గాక చైనాయొక్క రాజకీయ ఆర్థిక అవసరముల ననుసరించి కార్యక్రమముల నేర్పాటుచేసెను. ఆయన జీవితకృషి ఫలితముగ ప్రపంచములోకెల్ల పెద్దదగు చైనాజాతియందంతటను స్వతంత్రేచ్ఛయు ప్రపంచములోని యితరజాతులతో సమానమగు స్థానమును మరల పొందవలెనను దృఢనిశ్చయమును ప్రజ్వరిల్లినవి. ఆయన తమ జాతిని నాశనము గాకుండ పునరుద్ధరించుటకు జన్మించిన యవతారమూర్తి యని చైనాదేశీయు లెల్లరు పూజించుచున్నారు. మానవస్వతంత్ర వాదులలో సన్‌యట్‌సేను గొప్ప స్థానము నలంకరించుచున్నాడు.

అవతారమూర్తి

# చైనా విప్లవము

## అష్టమాధ్యాయము



### జాతీయ ప్రభుత్వ స్థానము.

### 1

1924 వ సంవత్సరము మే నెల 30 వ తేదీన మంచూరియా లోని తూర్పుచైనా రైలువేలోని హక్కునుతప్ప చైనాలోగల సమస్త అధికారములను ప్రత్యేకహక్కులను కౌళ్ళను వదలుకొని నామని సోవియటు ప్రభుత్వమువారు పికింగులోని చైనా ప్రజాస్వామ్య ప్రభుత్వమునకు తెలిపిరి. ఈ విధముగ తమంతట తాము వదలుకొనుటలో మోసము కలదనియు రుష్యావారిని నమ్మవద్దనియు సోవియటు ప్రభుత్వముతో నెట్టి స్నేహసంబంధము కలుగచేసికొనవలదనియు, పికింగులోని ఆంగ్లేయ, ఫ్రెంచి, అమెరికా రాయబారులు పికింగు ప్రభుత్వమును మందలించిరి, గాని యావత్తు ప్రత్యేక హక్కులు వదలుకొని చైనాదేశీయులతో సమాన ప్రతిపత్తిని మాత్రము రుష్యావారు కలిగియుండుట కొప్పుకొనినందున పికింగుప్రభుత్వము రుష్యా సోవియటుతో నాప్రకారము సంధిచేసికొనినది. అందువలన పాతచైనా ప్రభుత్వములు రుష్యా చక్రవర్తులతో చేసిన సంధులు రద్దైనవి. చైనాలోని రుష్యావారు చైనాకోర్టులకు చైనాచట్టములకు లోబడి చైనావారితో

సోవియటు రుష్యావారు ప్రత్యేక హక్కులను వదలుకొనిరి.

సమానముగ నున్నారు. చైనా దేశీయులతోపాటే పన్నులు చెల్లించుచు నివసించుచున్నారు. ఎట్టి అధిక్యత రుష్యా వారికి లేదు. చైనావారికిని రుష్యాలో రుష్యావారితో సమాన ప్రతిపత్తి గలదు. చైనాలో రుష్యావారి పోస్టాఫీసులు తీసివేసినారు. రుష్యావారి సైన్యములు గాని పోలీసులు గాని చైనాలో లేరు. చైనానుండి రుష్యాకుపోవు సరుకులమీద నెంతపన్ను వేసెదరో రుష్యానుండి చైనాకువచ్చు సరుకులమీదను అంతేపన్ను వేయు చున్నారు. రుష్యాకును చైనాకును వర్తకము ధారాళముగ సాగుచున్నది. ఈ విధముగ జర్మనులును రుష్యనులును చైనాలో తమకుగల అధికారమును ప్రత్యేక హక్కులను వదులుకొనగ, మిగిలిన విదేశజాతుల యధికారమును పలుకుబడిని ప్రత్యేకహక్కు లను పూర్తిగా తీసివేయుటకు చైనాజాతి పోరాడవలసి వచ్చినది. అటుల మిగిలిన విదేశజాతులలో ముఖ్యులు ఆంగ్లేయులు, జపాను వారు, ఫ్రెంచివారు, అమెరికనులు నైయున్నారు.

1925 వ సంవత్సరము మే నెల 30 వ తేదీన రుష్యా సోవి యటుప్రభుత్వము చైనాలోగల హక్కులన్నిటిని వదలివేసిన యొడంబడికయొక్క ప్రథమసంవత్సరోత్సవముచైనాదేశమునందు సలుపబడెను. షాంఘూయిలోని అంతర్జాతీయవల సలో చైనావిద్యార్థులును కార్మికులును గొప్ప యుత్సవమును బయలు దేరదీసిరి. విదేశీయు లచే స్థాపింపబడిన బట్టలయంత్రశాలలలోని కార్మికులదుస్థితినిగూ ర్చియు కార్మికులు కట్టుకట్టినపుడు వారిని విదేశీయులుపెట్టిన కష్టములనుగూర్చియు నుపన్యాసములు జరిగెను. అచట విదేశీ

షాంఘాయి కాల్పులు.

యులచే పాలింపబడుచున్న మ్యునిసిపాలిటీ గలదు. వారికి అధ్య క్షుడొక అమెరికాదేశీయుడు. దానిక్రింద సైనికపోలీసుదళము గలదు. అదియొక బ్రిటీషుఉద్యోగస్తునిచేనడుపబడి హిందూదేశము నుండి తెచ్చిన సిక్కుసిపాయిలను కలిగియున్నది. బ్రిటీషుపోలీసు ద్యోగి ఉపన్యసించుచున్న చైనావిద్యార్థులను ఇంకను చాలమంది నితరులను అరెస్టుచేసి పోలీసుస్టేషన్‌కు కొనిపోయెను. పదిక్షణ ములలో (శెకండులలో) చెదిరిపొమ్మని యాగుంపుకు బ్రిటీషు పోలీసు ఉద్యోగి చెప్పెను. వారు పోలేదు. వెంటనే ఆయన యా గుంపుమీద తుపాకులను కాల్పించెను. ముప్పదిమంది చైనా దేశీయులు మరణించిరి. వారిలో ఆరుగురు విద్యార్థులు గలరు. వీరితో సానుభూతి చూపుటకు హాంకోలోను కాన్‌టన్‌లోను చైనా విద్యార్థులును ప్రజలును ఉత్సవములు, సభలు జరిపిరి. జూన్ నెల 23 వ తేదీన కాన్‌టన్‌లో నుత్సవము విదేశీయుల ప్రదేశముయొక్క సరిహద్దున పోవుచుండగ విదేశ సైనికులచే కొంత కలహాము జరిగి నాటంక పర్చబడెను. ఆంగ్లేయ ఫ్రెంచి సైన్యములు వెంటనే మరఫిరంగులు తెచ్చి యా యుత్సవము లోని ప్రజలమీద కాల్చిరి. ఇరువదియిద్దరు చైనాసైనికులును, పన్నెండుమంది విద్యార్థులును పదునెనిమిదిమంది ప్రజలును మర ణించిరి. నూటపదునేడుమందికి బలమైన గాయములు కలిగెను.

వెంటనే చైనాదేశముయొక్క యొక కొన మొదలు రెండవ కొనవరకును గొప్ప యాందోళనము బయలుదేరెను. విదేశీయులయెడ ఆగ్రహాము పొంగిపొరలెను. కార్మికులు మొదలు స్వదేశ క్రైస్తవసంఘముల వరకును అన్నిజాతుల ప్రజలును

ఆగ్రహాము వెలిగ్రక్కిరి. పికింగులోని ప్రభుత్వము విదేశీయుల చర్యను ఖండించెను. ఫెంగు సేనాని తక్షణము విదేశీయులతో జరిగిన అక్రమ యొడంబడిక లన్నియు రద్దుకావలెననియు, విదేశీయులకు గల ప్రత్యేక హక్కులన్నియు నాశనము గావలెననియు, చైనా దేశీయులను చంపినందుకు విదేశీయులనుండి గొప్ప నష్టపరిహార మును వసూలుచేయవలసి యున్నదనియు ప్రకటించెను. క్యూమిన్ టాంగువారు విదేశీయుల హక్కులను వెంటనే తొలగించుటకు చైనాదేశములోని సమస్త జాతులును గట్టిగ పూనుకొనవలెనని తీర్మానించిరి. 1919 వ సంవత్సరమున జరిగిన జపాను సరుకుల బహిష్కార కాలమునుండియు బాగుగ వృద్ధిచెందిన చైనా విద్యార్థుల సంఘములు షాంఘాయి కాంటన్ కాల్పులలో రెంటిలోను పాల్గొనిన ఆంగ్లేయులకు తీవ్రముగ ప్రతీకారము సల్పుటకు నిశ్చయించెను. ఆంగ్లేయ సరకులను బహిష్కరించ వలెననియు, ఆంగ్లేయులపై సర్వవిధములగు బహిష్కారమును ప్రయోగించవలె ననియు దేశమంతను ప్రబోధము సల్పెను. క్యూమిన్‌టాంగు సంఘము లన్నియు తోడ్పడెను. యువజనులు తండోపతండములుగ సన్‌యటుసేనుయొక్క పటములను గైకొని బహిష్కారమును బోధించుటకు బయలుదేరిరి. 1925, 26 సంవ త్సరములలో చైనాదేశమందంతటను ఆంగ్లేయులపై మానవ చరిత్రలోకెల్ల బలవత్తరమైన బహిష్కారాయుధము ప్రయోగింప బడెను. చైనాదేశీయులు బహిష్కారమును జరుపుటలో నిపుణులు. 1919 వ సంవత్సరమున జయప్రదముగ జపానుయొక్క సరకులను

చైనా దేశమునందు మితిలేని ఆగ్రహాము

బహిష్కరించి షాంటంగు రాష్ట్రమును జపాను స్వాధీనపర్చు కొనకుండ చేయగలిగిరి. ఇపుడాంగ్లేయులమీద బహిష్కారమును ప్రయోగించిరి. చైనాదేశమందంతటను జాతీయభావము ఐక్యత దృఢపడెను. మరణించిన సన్‌యటుసేనుయొక్క ఛాయక్రింద దేశమంతయు నడచుటకు నిశ్చయించెను. ఆయన దేశమునకు నూతన యుగపురుషుడు, అవతారమూర్తి యయ్యెను. ఆయన యొక్క గ్రంథములు పవిత్రమైన వేదములైనవి.

ఆంగ్లేయులపై బహిష్కారము

దాదాపుగ పదునారు నెలల కాలము ఆంగ్లేయ వ్యాపారము నిలచిపోయినది. గిడ్డంగులలోని సరుకులు విడుదల కాలేదు. ఆంగ్లేయ వ్యాపారమునుండియు యంత్రశాలల నుండియు చైనా కూలీ లందరును పనిచేయుట మానుకొనిరి. రెండులక్షలమంది కూలీలు ఈ సమ్మెలో చేరిరి. ఇంత దీర్ఘకాలము జరిగిన సమ్మె ప్రపంచములో మరియొకటి లేదు. ఈ సమ్మెకాలములో నీ కార్మికుల కందరకును భోజనసదుపాయములను కొంత యితరపని కల్పించియు, కొంత యుచితముగను కలుగచేయుటకు క్యాంటన్‌టాంగు సంఘములు పూనుకొనెను. కాంటన్‌లోని జాతీయప్రభుత్వము లక్షలకొలది రూప్యములను సమ్మెలో చేరిన కార్మికులను పోషించుటకై ఖర్చు పెట్టుచుండెను.

ఈ బహిష్కారమునకు ప్రతీకారముగ సైన్యములను గొని పోయి కాంటన్ ప్రభుత్వమును ముట్టడించుటకు తమతో కలిసి రమ్మని ఆంగ్లేయులు అమెరికావారిని కోరిరి. కాని యా బహిష్కారదినములలో ఆంగ్లేయ సరుకులకు మారుగ విశేషముగ

అమెరికా సరుకులను చైనావారు కొనుచున్నందున లాభములను గడించుచున్న అమెరికావారు ఆంగ్లేయులతో కలసి కాంటను ప్రభుత్వమును ముట్టడించుట కొప్పుకొనలేదు. "జపాను సరుకుల బహిష్కారమువలనను, ఆంగ్లేయ సరుకుల బహిష్కారమువలనను అమెరికావా రెక్కువగ లాభమును పొందుచుండుటవలన కూడ వారికి చైనాయొక్క జాతీయోద్యమములో నెక్కుడు సాను భూతి కలిగి యుండవచ్చును" అని అప్టన్‌క్లోజు వ్రాసినాడు.

1927 వ సంవత్సరము ఫిబ్రవరి 8 వ తేదీన ఆంగ్లేయ ప్రభుత్వ విదేశాంగమంత్రి అంతర్జాతీయ సమితికి తెలియచేసెను. అంతర్జాతీయ సమితి చేయగలిగిన దేమియు కనపడలేదు. తుదకు చైనాప్రభుత్వమునకు ఎగుమతి దిగుమతి సరుకులమీద ఎక్కువ సుంకము లిచ్చుటకు బ్రిటిషుప్రభుత్వ మొప్పుకొని ఈ బహిష్కార మును అంతరింప జేసికొనిరి.

చైనాదేశీయులకు విదేశీయు లనిన భయము పోయినది. 1926 వ సంవత్సరమున వాన్‌హ్సైన్ పట్టణమున చైనావారికిని ఆంగ్లేయులకును కలహము కలుగగ నాంగ్లేయ సైనికులను చైనాప్రభుత్వ సైనికు లోడించి వెడలగొట్టిరి. ఇరుపక్షములను కొందరు మరణించిరి. ఆ కలహమునకు దోషమంతయు ఆంగ్లే యులదేనని పికింగుప్రభుత్వము నిరూపణ చేసినందున పికింగు ప్రభుత్వమునకు ఆంగ్లేయప్రభుత్వము క్షమాపణ కోరుటయేగాక చైనావారిని చంపినందుకు నష్టపరిహార మిచ్చినది. విదేశీయుల ప్రతిష్ఠ ఎటుల చైనాలో తగ్గిపోవుచున్నదో చూపుట కిదికూడ యొక నిదర్శనము.

## 2

సన్‌యటుసేను మరణించుటవలన ఉత్తరపు సైనిక నాయకులు తమ యధికారమునకు అడ్డుపెట్టగలవా రుండరని సంతసించిరి. ఇదివరకే తమతో చేరియున్న చహాక్యాకు సహాయమును బంపియు క్యూమిన్‌టాంగులో పేరునకు చేరియున్న కొందరు సైనిక నాయకులను చీలదీసియు, కాన్‌టన్ నగరమును

పికింగు సైనికనాయకులు క్యూమిన్‌టాంగును ముట్టడించి యోడిపోవుట

ముట్టడించి క్వాన్‌టంగురాష్ట్రమును స్వాధీనపరచుకొని జాతీయ ప్రభుత్వమును కూలద్రోయవలెనని గట్టి ప్రయత్నములను సలిపిరి. క్యూమిన్‌టాంగుయొక్క స్థాయి సంఘమువారు సమావేశమై కాన్‌టన్‌నగర సంరక్షణకువలయు నేర్పాటులను గావించిరి. వాంగు చింగువై, చ్యాంగు కేషకు, లియోచంగుకై, హ్సుచంగుచీ, హ్యుహాన్‌మినులు క్యూమిన్‌టాంగునందు ప్రముఖులుగ నుండిరి. ఉభయపక్షములవారికిని రెండుచోట్ల యుద్ధములు జరిగెను. క్యూమిన్‌టాంగు పక్షమునకే జయము కలిగెను. 1925 వ సంవత్సరము జూన్ నెల 12 వ తేదీకి కాన్‌టన్‌పట్టణమును, క్వాన్‌టంగు రాష్ట్రమును పూర్తిగ జాతీయవాదులకు స్వాధీనమై క్యూమిన్‌టాంగుయొక్క ప్రభుత్వము మరల స్థాపితమయ్యెను.

క్యూమిన్‌టాంగు ప్రభుత్వమును పునర్నిర్మాణము గావించుటకును సన్‌యటుసేను ప్రారంభించిన స్వతంత్ర పోరాటమును పూర్తిజేయుటకును 1925 వ సంవత్సరము జూన్ నెల 13 వ తేదీ మొదలు 28 వ తేదీ వరకును కాన్‌టన్ నగరమున క్యూమిన్‌టాంగు

క్యూమిన్‌టాంగు స్థాయిసంఘము

యొక్క స్థాయిసంఘము (**Central Executive Committee**) సమావేశమై వలయు నేర్పాటులను గావించెను. అదివరకు క్యూమింటాంగునకు సణాయటుసేను అధ్యక్షుడుగ నుండెను. ఇపు డాయన గౌరవార్థము అధ్యక్షపదవి ఖాళీగ నుంచబడెను. స్థాయి సంఘముయొక్క తీర్మానములకు లోబడి పనిచేయుటకు ప్రభుత్వ కౌన్సిలు నిర్మాణము గావించబడెను. ప్రభుత్వ కౌన్సిలు కొరకు ఉపసంఘ మెన్నుకొనబడెను. ప్రభుత్వ కౌన్సిలుకును, ఉపసంఘమునకును గూడ వాంగుచింగువై అధ్యక్షుడుగ నెన్నుకొనబడెను. స్థాయిసంఘమునకు రాజకీయవిషయములలో సలహా నిచ్చుట కొరకు రాజకీయ సంఘ (**Political Bureau**) మేర్పాటు చేయబడెను. సైనిక వ్యవహారములను నడపుట కొరకు సైనికసంఘము నెన్నుకొనిరి (**Military Council**). సైన్యముల యొక్క ఆర్థిక వ్యవహారమంతయు ప్రభుత్వ కౌన్సిలు క్రింద నుండును. సైనికసంఘముతోబాటు సైన్యములలో జాతీయ ప్రబోధము గావించుట కొరకు ప్రబోధశాఖ (**Propoganda Bureau**) నిర్మాణము గావించబడెను. జూలై నెల 1 వ తేదీకి ఈ సభలన్నియు అమలులోనికి వచ్చి పనిని ప్రారంభించెను. ఈ సభల కన్నిటికిని జరిగిన ఎన్నికలవలన వాంగుచింగువై, చ్యాంగు కేషక్, లియోచంగుకైలు జాతీయప్రభుత్వములో ప్రధాన నాయకులైరి. స్థాయిసంఘమువారి సమావేశము జరుగుచున్న దినములలోనే జూన్ 23 వ తేదీన కాంటన్‌లో జరుగుచున్న యుత్సవముపై ఆంగ్లఫ్రెంచి సైనికులు తుపాకులు గాల్చుటయు చైనావిద్యార్థులును సైనికులును ప్రజలును మరణించుటయు

చాలమందికి గాయములు తగులుటయు జరిగెను. అందుపైన చైనాదేశమందంతటను సలుపబడిన ఆంగ్లేయవర్తక బహిష్కారమును గూర్చియు సమ్మెగట్టిన చైనా కూలీలకు సమ్మెకాలములో కాంటన్ ప్రభుత్వముచేసిన గొప్ప సహాయమునుగూర్చియు పైన చెప్పియున్నాము. రుష్యాసలహాదారగు బొరొడిన్ నూతన క్యూమిన్‌టాంగు ప్రభుత్వమునకు కూడ సన్‌యటుసేనుకాలమునందు వలెనే ముఖ్యమగు సలహాల నిచ్చుచుండెను.

తెల్ల క్యూమిటాంగు

కాని కొలదికాలములో క్యూమిన్‌టాంగులోని కొందరొక కక్షిగచేరిరి. వారిలో కొందరికి సాముదాయవాదులను క్యూమిన్‌టాంగులో చేర్చుకొనుటకు ప్రథమమునుండియు ఇష్టము లేదు. అట్టివారు సన్‌యటుసేను బ్రతికియుండగ నాయనయొక్క ప్రతిభనుబట్టి యూరుకొనిరి. ఆయన చనిపోగనే తగవులు ప్రారంభించిరి. మరికొందరికి పైన చెప్పిన నాయకులగు వాంగుచింగువై, చ్యాంగుకేషక్, లియో చంగుకైల ప్రాముఖ్యమునకు ఓర్వలేమిచే నీ నూతనకక్షిలో చేరిరి. హ్యువాన్‌మినుకు తగిన గౌరవము కలుగలేదని ఆయన తమ్ముడీ కక్షిలో చేరెను. ఓడిపోయిన సైన్యాధిపతులును అక్రమ పనులు చేయుటవలన వెడలగొట్టబడిన యుద్యోగస్తులునుగూడ నిందుచేరిరి. దేశములోని వర్తకుల పారిశ్రామికుల సహాయము వీరికి కలిగెను. ఈ కక్షివారు 1925 వ సంవత్సరము నవంబరునెల 3 వ తేదీన పికింగునగరములోని పశ్చిమాద్రిమీద సన్‌యటుసేను శవ ముంచబడిన దేవాలయమున సమావేశమై తామే నిజమైన క్యూమిన్‌టాంగుసభ్యుల మనియు, కాన్‌టన్‌లోని జాతీయ ప్రభు

త్వము సాముదాయవాదులను ప్రోత్సహించుచున్నందున దేశ మున కుపద్రవమును కలుగచేయుచున్నదనియు, వాంగుచింగు వైని ఎవరును గౌరవించగూడదనియు, కాంటన్ ప్రభుత్వము నంగీకరించగూడదనియు, తామే దేశమున కంతకు సరియైన ప్రభుత్వమును ఏర్పాటు చేయబోవుచున్నామనియు ప్రకటించిరి. వారు తెల్ల క్యూమిన్‌టాంగు (**White Kuomintang**) అని పేరు పెట్టుకొనిరి. ఈ సమావేశము అశాస్త్రీయమైన సమావేశమనియు ఎవరును దానిని లక్ష్యపెట్టనక్కరలేదనియు కాన్‌టన్ ప్రభుత్వము ప్రకటించినది. పికింగు పశ్చిమాద్రి సమావేశము పికింగులోని సైనికనాయకులయొక్కయు, విదేశ రాయబారులయొక్కయు, విదేశ వర్తకుల యొక్కయు సానుభూతిని బడసినది. ఈ కక్షి వారికి జాతీయప్రభుత్వము స్వాధీనముగాక కాన్‌టన్ నాయకులే జాతీయప్రభుత్వమును సాగించుచు రాష్ట్రములవెంట రాష్ట్రము లను జాతీయప్రభుత్వము క్రిందికి తెచ్చుచున్నప్పటికిని, వీరి కుట్రలు క్యూమిన్‌టాంగునందు కొంత కల్లోలమును కలుగ చేసినవి. వీరిలో కొందరి కుట్రలవలన జాతీయప్రభుత్వ నాయకు లలో నొకడగు లియోచాంగుకై హత్యగావించబడెను. ఆయన భార్యపై తుపాకి కాల్చబడెను, గాని యామె తప్పించుకొనెను. ఈ దారుణకృత్యములకు హ్యూహాన్‌మిను యొక్క తమ్ముడు ముఖ్యకారకుడని రుజువైనది. మరియు నాంగ్లేయులదగు హాంకాంగులోని వర్తకులు కాన్‌టన్‌లోని జాతీయప్రముఖులను చంపినచో డెబ్బదిలక్షల రూప్యములను ఇచ్చుటకు వప్పుకొనినటు

లను బయలుపడినది. హ్యూహాన్మినుయొక్క తమ్ముడు పారిపో యెను. హత్యలకు సంబంధించిన కొందరురిదీయబడిరి.

1926 వ సంవత్సరమున జనవరి నెల 1 వ తేదీన రెండవ క్యూమిన్టాంగు కాంగ్రెసుమహాసభ కాన్టన్ నగరమున సమావేశమయ్యెను. దీనికి ఎనిమిది రాష్ట్రములనుండి ప్రతినిధులు వచ్చిరి. వాంగుచింగువై యధ్యక్షత వహించెను. జనవరి 12 వ తేదీవరకును కాంగ్రెసు జరిగెను. సన్యటుసేను యొక్క మరణ శాసనమును

ద్వితీయ క్యూమిన్ టాంగు కాంగ్రెసు మహాసభ

శిరసావహించి, ఆయన ప్రారంభించిన జాతీయోద్యమమును పూర్తిచేయుటకు తీర్మానించిరి. చైనా జాతీయోద్యమము యొక్క యుద్దేశ్యము సామ్రాజ్యతత్వమును పూర్తిగ దీసివేయుటయు, బలహీనమైనట్టియు, వత్తిడి చెందుచున్నట్టియు జాతులకు సహాయము చేయుటయు, స్వార్థపరులగు సైనికనాయకులను వెడలగొట్టి చైనాజాతికి స్వతంత్రము కలుగచేయుటయునై యున్నదని ప్రకటించిరి. చైనాలోని పరిశ్రమలను పునరుద్ధరించి, పేద రయితులకును, కార్మికులకును జీవనోపాధి కల్పించుట తమ ప్రధానోద్దేశ్యమని తీర్మానించిరి. దేశాభిమాన పూరితులైన ప్రజల సైన్యములను తయారుచేయుట మిగుల ముఖ్యమని మరల నిర్ణయించిరి. సాముదాయవాదులను ఇదివరకు వలెనే క్యూమిన్ టాంగులో చేర్చుకొనవచ్చుననియు గాని వారికి ప్రధానస్థానమొచటను ఇవ్వగూడదనియు ఏ సంఘములోను, కమిటీలోను వారికి 3 వ వంతుకన్న మించిన స్థానము లివ్వగూడదనియు తీర్మానించిరి. పశ్చిమాద్రిమీద నేర్పడిన మితవాద కక్షివారి నందరిని క్యూమిన్

టాంగులోనుండి సభ్యత్వమును తీసివైచిరి. దేశములోనివిద్యార్థుల, స్త్రీల, రైతుల, కార్మికుల, యుద్యమములకు సహాయము చేయుటకు నిశ్చయించిరి. ప్రభుత్వ నిర్మాణమునందు విశేషమగు మార్పు లేమియు చేయలేదు. క్యూమిన్‌టాంగు అధ్యక్షపదవి సన్‌యటుసేను గౌరవార్థము ఖాళీగనే యుంచబడెను. మరల నూతన స్థాయి సంఘము (**Central Executive Committee**) నెన్నుకొనిరి. ఇతర ప్రభుత్వ సంఘములుకూడ నెన్నుకొనబడెను.

## 3

అప్పటికి పికింగునగరమున చాంగుసోలిన్ సేనానికిని ఫెంగు సేనానికిని మనస్పర్థలు కలిగినందున చాంగుసోలిన్ సేనాని తన పాతశత్రువగు ఉపిఫు సేనానితో నేకమై ఫెంగు సేనానిని వెడల గొట్టెను. అధ్యక్షుడుగ నున్న ట్యుయన్ సేనాని పారిపోయెను. చాంగుసోలిన్ స్వయముగ పికింగు ప్రభుత్వమున కధ్యక్ష పదవి వహించెను. ఉత్తర రాష్ట్రములు కొన్ని చాంగుసోలిన్ క్రిందను కొన్ని ఉపిఫుక్రిందను, ఈశాన్యమూల నున్న రాష్ట్రములు ఫెంగు సేనానిక్రిందను నుండెను. 1926 వ సంవత్సరము ఫిబ్రవరి నెల 25 వ తేదీన కాన్‌టన్ జాతీయ ప్రభుత్వమువారు ఉత్తర రాష్ట్రముల మీద దండయాత్రలు సలిపి యావత్తు చైనాదేశమును జాతీయ ప్రభుత్వము క్రిందికి తెచ్చుటకు నిశ్చయించినటుల ప్రకటించిరి. ముఖ్యముగ చాంగుసోలిన్ సేనానియు ఉపిఫు సేనానియు దేశమునకు శత్రువులనియు, విదేశ సామ్రాజ్యములకు దాసులనియు,

చ్యాంగు కే షక్
(Chiang Kai Shek)

వారిని వెడలగొట్టి యొకే జాతీయప్రభుత్వమును స్థాపించు మహా త్కార్యమునందు చైనాజాతి యంతయు తమకు తోడ్పడవలె ననియు కోరిరి. ఉత్తరరాష్ట్రముల దండయాత్రకు వెడలు ఎనిమిది జాతీయ సైన్యములపై చ్యాంగు కే షక్ సర్వసేనాధిపతిగ నియమించబడెను. ఆయనక్రిందనున్న సేనలన్నియు తమ మాతృదేశ మగు చైనాదేశమునకు రాజకీయైక్యతను సంపూర్ణ స్వతంత్రతను స్థాపించుటకు దృఢదీక్షగల శూరులతో నిండియుండెను.

డాక్టర్ సన్యటు సేను మరణించగనే చైనా కమ్యూనిస్టులు ఎక్కువ ధైర్యముతో విజృంభించి తమ కమ్యూనిస్టు విప్లవ కార్యక్రమమును సాగించుటకు ప్రారంభించిరనియు, తదనుసారముగ 1926 సంవత్సరము మార్చి నెలలో చన్‌గుషాను యుద్ధనావలో తాను ప్రయాణము చేయుచుండగ కమ్యూనిస్టులు తనను అరెస్టుచేసి రుష్యాకు ఖైదీగ పంపుటకు కుట్ర పన్నిరనియు, దానిని తెలిసికొని తాను ఆ ఆపదనుండి తప్పించుకొంటిననియు చ్యాంగుకేషకు తన "చైనాలో సోవియటురుష్యా" అను గ్రంథములో వ్రాసినాడు. ఆ మరునాడుదయమున చాంగుకేషకు ఆ కుట్రనాయకులైన లిచిలన్‌గు మొదలగు కమ్యూనిస్టులను అరెస్టుచేసి సైనిక శాసనమును ప్రకటించి కాన్‌టన్ - హాంకో సమ్మె కమిటీని రద్దుపరచి ఆ యుద్ధ నౌకను స్వాధీనపరచుకొనుటకు సైన్యమును పంపెను. కాన్‌టన్ లోని రుష్యా ప్రతినిధి ఆ విషయమును గూర్చి ఆయనను అడుగగా తాను రుష్యాకు వ్యతిరేకముగ లేననియు కుట్ర దారులను మాత్రమే శిక్షించితిననియు చెప్పెను. బోరోడిన్

అపుడు రుష్యాకు పోయి ఇంకను రాని సమయమది. ఆ కార్య క్రమ ప్రకారమే కమ్యూనిస్టులు అటు పిమ్మట వాంగు చింగువై కును, చ్యాంగుకేషక్‌కును అభిప్రాయభేదములు కలిగించ సాగిరి. అందువల్లను వాంగుచింగుపైకి శరీర అస్వస్థత కలిగి నందునను మార్చి నెల 20 వ తేదీన వాంగు చింగువై ఆరోగ్యమును పొందుటకై ఫ్రాన్‌సుకు వెడలిపోయెను. జులై నెలనుండియు ఉత్తర రాష్ట్రముల దండయాత్ర ప్రారంభమయ్యెను. ప్రారంభమున వుపిపు సేనానితో పోరు కలిగెను. ప్రతిచోటను తేలికగ జాతీయ సేనలు జయమును పొందెను. అక్టోబరు 10 వ తేదీన వుపిపును వెడలగొట్టి జాతీయ సేనలు వ్యూహన్ రాష్ట్రమును స్వాధీనమును పొంది దాని ముఖ్యపట్టణమగు హాంకోలో ప్రవేశించెను. దానితో హ్యూనన్, హ్యుపే రాష్ట్రములు కూడ క్యూమిన్‌టాంగు ప్రభుత్వమునకు లోబడెను. అంతట జాతీయసేనలు వుపిపు సేనానియొక్క మిత్రుడగు సన్‌చూయన్‌ఫాంగు సేనానితో పోరాడవలసివచ్చెను. ఆయనక్రింద నపుడైదు రాష్ట్రములుండెను. ఆయన మిగుల బలవంతుడు. ఆయనతో పోరాడుటలో కొన్ని వేళల జాతీయసేన లోడిపోవుచు వచ్చెను. పోరు తీవ్రముగ జరిగెను. తుదకు నవంబరు 8 వ తేదీన కియంగ్సి రాష్ట్రము జాతీయసేనలకు స్వాధీనమయ్యెను. డిశంబరు నెలలో ఫూకిన్ రాష్ట్రము స్వాధీనమయ్యెను. 1927 వ సంవత్సరము ఫిబ్రవరి నెల 18 వ తేదీన చ్యాంగుకేషక్ స్వయముగ సన్‌చుయన్ ఫాంగు నోడించి చికియాంగు రాష్ట్రమును స్వాధీనమును

జాతీయ సైన్యము ఉత్తర రాష్ట్రములపై దండు వెడలుట

పొందెను. మార్చినెల 22 వ తేదీన చ్యాంగుకేషక్ పాంఘాయి మీదకు దండెత్తివెళ్లి యాపట్టణమును పట్టుకొనెను. ప్రతి రాష్ట్రములోను గొప్పదేశాభిమాన ప్రబోధముకలిగి యువ జనులును రయితులును కార్మికులును జాతీయసేనలకు స్వాగత మిచ్చుచు అన్నివిధములను తోడ్పడుచుండుట నీ జయములకు ముఖ్యకారణము.

ఈ మధ్యకాలమున 1926 వ సంవత్సరము అక్టోబరునెల 15 వ తేదీన వివిధరాష్ట్రముల ప్రతినిధులతోకూడిన క్యూమిన్ టాంగుస్థాయిసంఘము కాంటను నగరమున సమావేశమైనది.

చాలరాష్ట్రములు క్యూమిన్టాంగు క్రింద చేరుట

క్రొత్తగ క్యూమిన్టాంగు పాలనము క్రిందకు వచ్చిన రాష్ట్రములపైన కమిటీలపద్ధతిన పాలనము నేర్పరచెను. కార్మికుల సంరక్షణము, అక్రమపు పన్నులను తీసివేయుట, రైతులభూమిపన్నును రూపాయికి పావలావంతున తగ్గించుట, వడ్డీరేటును ఎక్కువగ పుచ్చుకొనగూడదను నిషేధము, వ్యవసాయముచేయు రైతులకు శాశ్వత జిరాయితీహక్కు, కార్మికులు సంఘముల నేర్పరుచుకొనుటకును, సమ్మెలు కట్టుటకును హక్కు, కార్మికుల యజమానులమధ్య తగవులు పరిష్కారముచేయు పంచాయితీసంఘముల నిర్మాణము, మొదలగు తీర్మానములను గావించెను. దేశమునకంతకును మధ్య ప్రదేశముగనున్న హాంకో (వూహాన్) పట్టణమునకు జాతీయ ప్రభుత్వ కార్యస్థానమును మార్చుటకు కూడ తీర్మానించబడెను. వీలయినంత త్వరితముగ దేశమునకు వచ్చి జాతీయోద్యమమును నడుపవలెనని వాంగుచింగువైని కోరుటకును తీర్మానించిరి.

డిశంబరు నెలలో క్యూమిన్‌టాంగు ప్రభుత్వమువారు కాన్‌టన్‌నగరమును వదలి హాంకోనగరమునకు తమ కార్యస్థానమును మార్చుకొనిరి. హాంకోలో నాంగ్లేయు లాక్రమించిన ప్రదేశము గలదు. అచటి కార్మికులు ఆంగ్లేయుల పనిపాటలు మానివేసి సమ్మెను గట్టిరి. చైనా జనసమూహాము లా ప్రదేశము నాక్రమించినవి. 1927 వ సంవత్సరము జనవరి నెల 4 వ తేదీన హాంకోనగరమున ఆంగ్లేయులకు గల మ్యునిసిపాలిటీని క్యూమిన్‌టాంగు ప్రభుత్వమునకు స్వాధీనపరచి అచటి యాంగ్లేయులు హాంకోను వదలి షాంఘాయికి వెడలిపోయిరి. ఇటులనే కియుకియాంగుపట్టణమున గల వలసప్రదేశమునుకూడ చైనా జాతీయప్రభుత్వమునకు వదలివేసి యచటి యాంగ్లేయులు షాంఘాయికి లేచిపోయిరి. 1927 వ సంవత్సరము మార్చినెల 24 వ తేదిన చ్యాంగు కేషక్ జాతీయ సేనలతో నాన్‌కింగునగరమును స్వాధీనమును పొందెను. అచటి ప్రజలు చ్యాంగు కేషక్‌కు గొప్ప స్వాగతమిచ్చిరి.

హాంకోనగరము జాతీయ ప్రభుత్వ కార్యస్థానమయినది

## 4

వాంగుచింగువై అస్వస్థతవలన ఫ్రాంసుదేశమున నుండుటవలనను, చ్యాంగు కేషక్ యుద్ధములలో నిమగ్నుడై యుండుటవలనను హాంకోనగరమున జాతీయప్రభుత్వ కార్యస్థానమున తగిన నాయకులు లేకుండిరి. సాముదాయవాదులు (కమ్యూనిస్టులు) ప్రాబల్యమును వహించిరి. జాతీయ ప్రభుత్వ ప్రధాన న్యాయాధిపతి

హాంకోలో కమ్యూనిస్టుల ప్రాబల్యము

యగు హ్సుజియన్ కమ్యూనిస్టు భావములు కలవాడయి బోరోడీన్ యొక్క సలహాపైన నడచుచుండెను. కొంతకాలమునకు బోరోడీన్‌కును చ్యాంగు కేషక్‌కును మనస్పర్థ లేర్పడెను. 1927 వ సంవత్సరము మార్చి నెల 10 వ తేదీన క్యూమింటాంగు స్థాయిసంఘము సమావేశమై చైనాయొక్క జాతీయ ప్రభుత్వమునందు క్యూమింటాంగు సభ్యులతోపాటు కమ్యూనిస్టులకును సమానస్థానమును కలుగచేసిరి. సన్‌యటుసేను కాలమునుండియు ఏర్పడియున్న క్యూమింటాంగు కక్షియే చైనాను పాలించవలెనను నియమమును తొలగించిరి. క్యూమింటాంగు మంత్రివర్గములో కమ్యూనిస్టులను చేర్చుకొనిరి. పోలీసు, స్థానిక పరిపాలన, వ్యవసాయశాఖ లోక కమ్యూనిస్టు మంత్రికి వప్పగింతచేసిరి. మరియు దేశములోని కార్మిక, కర్షక సంఘములపై యాజమాన్యము క్యూమింటాంగులోని కమ్యూనిస్టు ప్రముఖులకు ఒప్పగించిరి. హాంకోలోని కార్మిక సంఘములకును ఇతర చోట్ల కర్షక సంఘములకును ఆయుధములు లభించి వీరు రౌడీలను, పోకిరీలను పోగుచేసుకొని బస్తీలలోని పారిశ్రామికుల మీదను పల్లెలలోని రైతులమీదను దౌర్జన్యకృత్యములు జరిపించసాగిరని కూడ చ్యాంగు కేషక్ తన గ్రంథమునందు వ్రాసియున్నాడు. ఆ సమావేశమునకు చ్యాంగు కేషక్ రాలేదు. హాంకో ప్రభుత్వము చ్యాంగు కేషక్‌కు వ్యతిరేకులైనవారితో నింపబడెను. చ్యాంగు కేషక్ మితవాదియనియు, షాంఘాయి వర్తకులతో లాలూచిగ నున్నాడనియు నిందలు పలిపిరి. ఈ కాలమునకు రుష్యాకు నాయకుడుగ వచ్చిన స్టాలిను చైనాను

కమ్యూనిస్టు విప్లవమువైపుకు తయారుచేయవలెననియం. యన్. రాయి అను భారతీయ కమ్యూనిస్టు నాయకుని చైనాకు పంపెను. బొరోడిన్ మితవాది యని స్టాలిను తలచెను.

**నాన్కింగు అల్లరులు**

ఇంతేగాక మార్చి 24 వ తేదీన నాన్కింగునగరమును ఉత్తరప్రభుత్వసేనలు ఖాళీచేసి పోవుచు జాతీయసైన్యము లాక్రమించుచున్న సమయమున, జాతీయసైనికులలో కొందరానగరమున నున్నవిదేశీయులను వారి ఆస్తులను ముట్టడించిరి. ఆరుగురు విదేశీయులు హత్యగావింపబడిరి. చాలమందికి దెబ్బలు తగిలెను. విదేశ రాయబారుల గృహములు దోచుకొనబడెను. సాకనీ కొండమీద నున్న భవనమునందు నలుబది ఎనిమిదిమంది విదేశీయులుకూడి యాత్మసంరక్షణమును గూర్చియు నగరము విడిచిపోవుటను గూర్చియు నాలోచించుచుండగ నీ సైనికు లా భవనమును ముట్టడించిరి. అమెరికా, బ్రిటిషుప్రభుత్వముల సేనలువచ్చి ముట్టడివేసిన చైనాసైనికులపై కాల్చుచుండగ లోపలివారు గోడనుదుమికి పారిపోయిరి. ఆసమయమున ఏడుగురు చైనావారు మృతినొందిరి. పదునేనుగురు చైనావారు గాయములనొందిరి. ఆ వెంటనే ఇంగ్లాండు, అమెరికా, జపాను, ఫ్రాన్సు, ఇటలీ, ప్రభుత్వముల ప్రతినిధులు కలసి విదేశీయుల సంరక్షణమును క్షమాపణములను నష్టపరిహారములను కోరుచు చైనా జాతీయప్రభుత్వమునకు అంత్యసందేశము నంపిరి. ఆ సందేశముయొక్క ప్రతి నొకదానిని షాంఘాయిలోనున్న చ్యాంగుకేషక్కును మరియొక ప్రతిని హాంకోలోని క్యూమిన్టాంగు ప్రభుత్వపు విదేశాంగ మంత్రి

యగు యుజన్‌చన్‌కును బంపిరి. చ్యాంగుకేషక్‌కు విరోధియు కమ్యూనిస్టుల పలుకుబడిలో నున్నట్టియు నొకానొక సేనాధిపతియొక్క సేనలు పైన చెప్పబడిన దుండగములను విదేశీయులపై గావించిరని విచారణవలన తేలినది. చ్యాంగుకేషక్ ఆ సేనాధిపతిని వెడలగొట్టుటయే గాక విదేశీయులను ముట్టడించిన కొందరు సైనికులను ఉరిదీయించెను.

చ్యాంగుకేషక్ హాంకో ప్రభుత్వముపై తిరుగబడుట

ఇట్టి పరిస్థితు లేర్పడియున్న సమయమున ఏప్రిల్ ఒకటవ తేదీన వాంగుచింగువై యూరపునుండివచ్చి షాంఘాయిలో దిగెను. చ్యాంగుకేషక్ ఆయనను వెంటనే కలిసికొని యావత్తు పరిస్థితులను విశదముచేసెను. బోరోడిన్ కమ్యూనిస్టులకు ప్రాబల్యమును కలుగచేయుచున్నందున ఆయనను రుష్యాకు పంపివేసి మరియొకరిని తెప్పించుకొనుట యావశ్యకమని చెప్పెను. క్రొత్తగ మార్పులు జరిగిన హాంకోప్రభుత్వముయొక్క యుత్తరువులను తాను మన్నించదలచలేదనియు వాంగు చింగువైయొక్క యుత్తరువులను మాత్రమే మన్నింతుననియు కూడ చెప్పెను. మరల క్యూమిన్‌టాంగు కాంగ్రెసు మహాసభయొక్కగాని స్థాయిసంఘముయొక్క గాని సమావేశము జరిగి ఆ యేర్పాట్లు రద్దుగానిది అంతవరకు జరిగిన యేర్పాట్లపై తిరుగుబాటు చేయగూడదని వాంగుచింగువై సలహాచెప్పి ఏప్రిల్ నెల 6 వ తేదీన హాంకోకుపోయెను. క్యూమిన్‌టాంగు సంఘమును నాన్‌కింగు నగరముననే వీలయినంత త్వరితముగ సమావేశ పరచెదనని చెప్పిపోయెను.

కమ్యూనిస్టు విప్లవమువైపుకు తయారుచేయవలెనని యం. యన్. రాయి అను భారతీయ కమ్యూనిస్టు నాయకుని చైనాకు పంపెను. బొరోడిన్ మితవాది యని స్టాలిను తలచెను.

ఇంతేగాక మార్చి 24 వ తేదీన నాన్కింగునగరమును ఉత్తరప్రభుత్వ సేనలు ఖాళీచేసి పోవుచు జాతీయసైన్యము లాక్రమించుచున్న సమయమున, జాతీయసైనికులలో కొందరానగరమున నున్నవిదేశీయులను వారి ఆస్తులను ముట్టడించిరి. ఆరుగురు విదేశీయులు హత్యగావింపబడిరి. చాలమందికి దెబ్బలు తగిలెను. విదేశ రాయబారుల గృహములు దోచుకొనబడెను. సాకనీ కొండమీద నున్న భవనమునందు నలుబది ఎనిమిదిమంది విదేశీయులుకూడి యాత్మసంరక్షణమును గూర్చియు నగరము విడిచిపోవుటను గూర్చియు నాలోచించుచుండగ నీ సైనికు లా భవనమును ముట్టడించిరి. అమెరికా, బ్రిటిషుప్రభుత్వముల సేనలువచ్చి ముట్టడివేసిన చైనాసైనికులపై కాల్చుచుండగ లోపలివారు గోడనుదుమికి పారిపోయిరి. ఆసమయమున ఏడుగురు చైనావారు మృతినొందిరి. పదునేనుగురు చైనావారు గాయములనొందిరి. ఆ వెంటనే ఇంగ్లాండు, అమెరికా, జపాను, ఫ్రాన్సు, ఇటలీ, ప్రభుత్వముల ప్రతినిధులు కలసి విదేశీయుల సంరక్షణమును క్షమాపణములను నష్టపరిహారములను కోరుచు చైనా జాతీయప్రభుత్వమునకు అంత్యసందేశము నంపిరి. ఆ సందేశముయొక్క ప్రతి నొకదానిని షాంఘాయిలోనున్న చ్యాంగుకేషక్ కును మరియొక ప్రతిని హాంకోలోని క్యూమిన్టాంగు ప్రభుత్వపు విదేశాంగ మంత్రి

నాన్కింగు అల్లరులు

యగు యుజన్‌చన్‌కును బంపిరి. చ్యాంగుకేషక్‌కు విరోధియు కమ్యూనిస్టుల పలుకుబడిలో నున్నట్టియు నొకానొక సేనాధిపతియొక్క సేనలు పైన చెప్పబడిన దుండగములను విదేశీయులపై గావించిరని విచారణవలన తేలినది. చ్యాంగుకేషక్ ఆ సేనాధిపతిని వెడలగొట్టుటయే గాక విదేశీయులను ముట్టడించిన కొందరు సైనికులను ఉరిదీయించెను.

ఇట్టి పరిస్థితు లేర్పడియున్న సమయమున ఏప్రిల్ ఒకటవ తేదీన వాంగుచింగువై యూరపునుండివచ్చి షాంఘాయిలో దిగెను. చ్యాంగుకేషక్ ఆయనను వెంటనే కలిసికొని యావత్తు పరిస్థితులను విశదముచేసెను. బొరోడిన్ కమ్యూనిస్టులకు ప్రాబల్యమును కలుగచేయుచున్నందున ఆయనను రుష్యాకు పంపివేసి మరియొకరిని తెప్పించుకొనుట యావశ్యకమని చెప్పెను. క్రొత్తగ మార్పులు జరిగిన హాంకో ప్రభుత్వముయొక్క యుత్తరువులను తాను మన్నించదలచలేదనియు వాంగు చింగువై యొక్క యుత్తరువులను మాత్రమే మన్నింతుననియు కూడ చెప్పెను. మరల క్యూమిన్‌టాంగు కాంగ్రెసు మహాసభయొక్కగాని స్థాయిసంఘముయొక్క గాని సమావేశము జరిగి ఆ యేర్పాట్లు రద్దుగానిది అంతవరకు జరిగిన యేర్పాట్లపై తిరుగుబాటు చేయగూడదని వాంగుచింగువై సలహాచెప్పి ఏప్రిల్ నెల 6 వ తేదీన హాంకోకుపోయెను. క్యూమిన్‌టాంగు సంఘమును నాన్‌కింగు నగరముననే వీలయినంత త్వరితముగ సమావేశ పరచెదనని చెప్పిపోయెను.

చ్యాంగుకేషక్ హాంకో ప్రభుత్వముపై తిరుగబడుట

కాని అంతవరకును వేచి యుండక కమ్యూనిస్టులు జరుపుచున్న దౌర్జన్య కృత్యములను సహించలేక ఏప్రిల్ 12 వ తేదీన చ్యాంగు కేషక్ తన సైన్యములలోనుండి కమ్యూనిస్టులను కొందరిని వెడలగొట్టి ఖైదుచేసెను. షాంఘాయిలోని వర్తకబృందముయొక్క సహాయమును పొందెను.

నాన్‌కింగు ప్రభుత్వము

వారాతని ప్రభుత్వమునకు మూడుకోట్ల డాలర్లను ఋణముగ నిచ్చిరి. వారిపై సమ్మెలుగట్టి దౌర్జన్యములు గావించిన కార్మికులను వారు హత్యలుగావించగ హర్షించెను. చ్యాంగు కేషక్ భార్యయొక్క తండ్రియగు సూంగు షాంఘాయిలో గొప్ప వర్తకుడుగ నుండెనని పైన చెప్పియున్నాము. ఆయన కుమారుడగు టి. వి. సూంగు చైనా జాతీయ ప్రభుత్వములో ఆర్థిక నిపుణుడుగ పనిచేయుచుండెను. హాంకో ప్రభుత్వము కమ్యూనిస్టులకు లోబడిపోయినదని తలచి ఏప్రిలు 15 వ తేదీన హాంకో ప్రభుత్వమునకు ప్రతికక్షిగ వేరొక క్యూమిన్‌టాంగు స్థాయి సంఘమును, క్యూమిన్‌టాంగు జాతీయ ప్రభుత్వమును, నాన్‌కింగు నగరమునందు చ్యాంగు కేషక్ నిర్మాణము గావించెను. ఇందులో మితవాదులును బోరోడిన్ యొక్క పలుకుబడి కిష్టము లేని కొందరు క్యూమిన్‌టాంగు ప్రముఖులును చేరిరి. క్యూమిన్‌టాంగునుండి కమ్యూనిస్టులను పూర్తిగ తొలగించుటకు తీర్మానించిరి. ఆ ప్రకారమే నాన్‌కింగు, షాంఘాయి, కాన్‌టన్ నగరములలో కమ్యూనిస్టులను తీసివైచిరి. అందుమీద ఏప్రిలు 17 వ తేదీన వాంగుచింగువై యొక్క అధ్యక్షత క్రింద క్యూమిన్‌టాంగు స్థాయి సంఘము హాంకోలో సమావేశమై నాన్‌కింగు ప్రభుత్వము

అశాస్త్రీయమైనదని ప్రకటించి; చ్యాంగు కేషక్‌ను, ఆయనతో చేరినవారిని క్యూమిన్‌టాంగు సభ్యత్వమునుండి తొలగించినా మనియు, వారి యుద్యోగములను తీసివేసినామనియు తీర్మా నించిరి. అంతటినుండియు 1927 వ సంవత్సరము ఆఖరువరకును హాంకో, నాన్‌కింగు, జాతీయ ప్రభుత్వముల అంతఃకలహములతో కాలము గడచెను. ఈ మధ్య కాలమున రుష్యాలోని అంతర్జా తీయ కమ్యూనిస్టు సంఘ సలహాల ననుసరించి, క్యూమిన్ టాంగును కూలద్రోసి హాంకోలోని జాతీయప్రభుత్వమును స్వాధీన పరచుకొని బోల్షివిక్ సోవియటు పద్ధతిగల ప్రభుత్వమును చైనాలో స్థాపించవలెనని కమ్యూనిస్టులు కుట్రలు సలిపిరి. ఇది బైటపడినపుడు దీనికి కారణమేమని బోరోడిన్‌ను వాంగుచింగువై ప్రశ్నించగ తా నిందుకు జవాబుదారుడను గాననియు, రుష్యా నుండి స్టాలినుచే పంపబడిన యం. యన్. రాయియే ఇందుకు కారకుడనియు బదులు చెప్పెను. యం. యన్. రాయియొక్క సలహాప్రకారము కమ్యూనిస్టులు వూహన్‌రాష్ట్రములో కూలీ లచే ఫ్యాక్టొరీలలో సమ్మెలు చేయించిరి. హ్యునాన్‌రాష్ట్రములో భూములులేని రయితులు భూఖామందుల మీద దౌర్జన్యములు జరిపి వారి స్వాధీనములోని భూములను బలవంతముగ లాగికొని పంచుకొనునటుల ప్రోత్సహించిరి. వీటి నన్నిటిని హాంకోలోని క్యూమిన్‌టాంగు ప్రభుత్వమువారు నిరసించి సాముదాయ వాదులపై నిర్బంధములను ప్రయోగించిరి. చాంగ్షాలో సమావేశ మైన కమ్యూనిస్టులపై తుపాకులు కాల్చి చెదరగొట్టిరి. అచటి రైతాంగము కమ్యూనిస్టుల కెదురుతిరిగెను. కమ్యూనిస్టులు

హ్యూనాన్, హ్యూపె రాష్ట్రములలో కాపురమున్న ఆంగ్లేయులను ముట్టడించి, అల్లరులు చేయించగ దానినికూడ హాంకో ప్రభుత్వము ఆపివైచెను. క్యూమిన్‌టాంగు ప్రభుత్వము సామ్రాజ్య తత్వముతో పోరాడునే గాని, విదేశీయులను సంరక్షించుటకు పూనుకొన్నామనియు హాంకోప్రభుత్వము ప్రకటించెను. మే, జూన్ నెలలలో నాన్‌కింగు, హాంకో ప్రభుత్వములమధ్య యుద్ధము పొసగునటుల కనపడెను. ఆ యవకాశము తీసికొని జూన్ 1 వ తేదీన యం. యన్. రాయి తనకు స్టాలిన్‌వద్దనుండి వచ్చిన తంతిని హాంకోప్రభుత్వ నాయకుడగు వాంగుచింగువైకి చూపి కమ్యూనిస్టు కార్యక్రమమును స్వీకరించి సోవియటు ప్రభుత్వమును చైనాలో స్థాపించుటకు హాంకోప్రభుత్వము సహాయపడనిచో రుష్యాయొక్క సహాయమును క్యూమిన్‌టాంగు నుండి తీసివేయబడుననిచెప్పెను. ఆ సంగతి వాంగుచింగువై సన్‌యటుసేను సతికిని యూజన్‌చన్‌కును చెప్పగ వా రాశ్చర్యము నొందిరి. నాన్‌కింగు ప్రభుత్వముయొక్క భయమువలన హాంకో క్యూమిన్‌టాంగు వారు భయపడి తమ కమ్యూనిజమును స్వీకరింతురని యం. యన్. రాయి తలచెను. ఆ తంతి చూడగనే క్యూమిన్‌టాంగు సభ్యులు సమావేశమై వాంగుచింగువై యొక్క ప్రతిపాదనపైన కమ్యూనిస్టులను ప్రభుత్వమునుండియు, సేనలనుండియు వెడలగొట్టుటకు తీర్మానించిరి. వాంగుచింగువై కమ్యూనిజముకు అనుకూలుడు కాడు. డాక్టరు సన్‌యటుసేను ప్రబోధము గావించిన సాంఘిక తత్వము (**Socialism**) నందు నమ్మకము కలవాడై క్యూమిన్‌టాంగులో వామపక్షనాయకుడుగ నుండెను. లెనిన్ కాలములో

చైనాకు సాముదాయవాదము (కమ్యూనిజము) పనికిరాసే రాదనియు చైనాలో జాతీయ ప్రజాప్రభుత్వమును స్థాపించుటకు మాత్రమే సహాయము చేయుటకు తాము తమ ప్రతిధులను పంపుచున్నామనియు, రుష్యా ప్రతినిధి డాక్టరు సన్‌యటుసేనుతో కరారుచేసి యొడంబడిక మీద దస్కతు పెట్టియుండగ, అందుకు వ్యతిరేకముగ క్యూమిన్‌టాంగులో పొడసూప ప్రారంభించిన అభిప్రాయభేదముల నవకాశముగ తీసుకొని క్యూమింటాంగులోని కమ్యూనిస్టులు స్టాలిన్ సలహాపైన అదివరకు కంటె అత్యధికమైన ప్రాబల్యము పొంద యత్నించుచేగాక, హాంకో క్యూమిన్‌టాంగు ప్రభుత్వములో మంత్రిత్వములను కూడ సంపాదించినారు. అంతటితో నాగక చైనాలో వెంటనే కమ్యూనిస్టు ప్రభుత్వమును ఎటులైన స్థాపించవలసినదని యం. యన్. రాయికి స్టాలిన్ తంతి నిచ్చెను. స్టాలిన్ క్యూమిన్‌టాంగుకును, చైనాకును ద్రోహము చేయుటకును, కరారు భంగముచేయుటకును వెనుకాడలేదు. దాని ప్రకారము అతి జాగ్రత్తగా పనిచేయుటకు మారుగా యం. యన్. రాయి తొందరపడి వాంగుచింగువైకి ఆ తంతి చూపించి ఆయనను కమ్యూనిస్టు ప్రభుత్వ స్థాపనకు సమ్మతించవలసినదని, లేనిచో రుష్యాచేయు సహాయమును మానుకొని క్యూమిన్‌టాంగును సైనిక నాయకులకు ఒప్పగింత చేసి పోవుదుమని బెదిరించెను. ఇది లాభించుటకు బదులు కమ్యూనిజముకు ఎదురు తిరిగినది. అతివాదియగు వాంగుచింగువై మితవాదియగు చ్యాంగు కేషక్‌తో కలసినాడు. తాత్కాలికముగా క్యూమింటాంగులో ఐక్యత ఏర్పడినది. అందరు కలసి కమ్యూనిస్టులను సొంతముగ క్యూమిం

టాంగులోనుంచి వెళ్ళగొట్టినారు. కమ్యూనిస్టు సంఘము లక్రమ సంఘములని ప్రకటించబడినవి. ఇట్టి పరిస్థితులన్నియు యం. యన్. రాయియొక్క అవివేక ప్రవర్తనవల్ల జరిగినవని యెంచబడుటయే గాక, తాను ఆ తంతిని వాంగు చింగువైకి చూపించవద్దని సలహా నిచ్చినను వినక దానిని రాయి చూపి నాడని కూడ బొరోడిన్ స్టాలినుకు ఫిర్యాదు చేయుటవల్ల కూడ, రాయిని తంతిమీద స్టాలిను రుష్యాకు పిలిపించుకొని పార్టీలో నుంచి బర్తరఫు చేసినాడు. అదివరకు అంతర్జాతీయ కమ్యూనిస్టు పార్టీకి రాయి చేసిన సేవనుబట్టి ఆయనను తలకాయ కొట్ట కుండా విడిచిపెట్టగా రాయి ఇండియా వచ్చినాడు. ఇండియాలో వేరే పార్టీని స్థాపించ యత్నించెను గాని జయప్రదము కాలేదు. తరువాత మావొసిటంగు యీ సంఘటనలను గూర్చి అమెరికా పత్రికా ప్రతినిధి యగు ఎడ్గారు స్నోతో మాట్లాడుచు యం. యన్. రాయి బుద్ధిహీను (fool) డని చెప్పెనని చైనామీద ఎఱ్ఱ నక్షత్రమను గ్రంథములో వ్రాయబడినది. ఈ ఘటన జరిగేటప్పటికి చైనా దేశములో క్యూమింటాంగుయొక్క బలము ప్రతిష్ఠ ఉచ్చస్థాయియం దుండెను. కమ్యూనిస్టుల స్థితి మిగుల అధోగతి యందుండెను. హాంకో ప్రభుత్వములో చేరిన కమ్యూనిస్టు మంత్రులు తమ విప్లవ భావములను ఏ మాత్రము అమలుజరుపుటకు యత్నించక కేవలము క్యూమింటాంగు తీర్మానములకే విధేయులై నడచిరనియు, చైనా కమ్యూనిస్టులు తమకు కమ్యూనిస్టు విప్లవమును స్థాపించుటకు దొరికిన సదవకాశమును విడిచిపెట్టి బొరొడీన్ సలహాపైన క్యూమింటాంగుకు విధేయు

లుగా ప్రవర్తించిరనియు యం. యన్. రాయి తన "చైనా విప్లవము- విప్లవ వ్యతిరేకము" అను గ్రంథములో తీవ్రముగ ఆక్షేపించినాడు. అపుడేర్పడిన ఐకమత్యమును క్యూమింటాంగు నాయకులు నిలువబెట్టుకొని వివేకముతో కార్యక్రమమును సాగించినట్లయిన చైనాలో సుస్థిరమైన జాతీయప్రభుత్వ స్థాపనము జరిగియుండెడిది. కాని అట్టి ఐకమత్యమును నిలబెట్టుకొనలేదు. గనుక చరిత్ర వేరుగ పరిణమించినది. సన్‌యటు సేను సతియు, విదేశ మంత్రియగు యూజన్‌చన్ గారును సాముదాయ వాదులను వెడలగొట్టుటకు ఇంకను సమయము రాలేదని చెప్పి తమ వాదన అంగీకరించబడనందున రాజీనామానిచ్చి సోవియటు రుష్యాకు వెడలిపోయిరి. హాంకో ప్రభుత్వమునకును కమ్యూనిస్టులకును విరోధము కలుగుటతోడనే రుష్యానియంతయైన స్టాలిను చైనాలో కమ్యూనిస్టు ప్రభుత్వస్థాపన చేయుటకే నిశ్చయించెను. చైనాలో కమ్యూనిస్టు విప్లవము కొనసాగించి కమ్యూనిస్టు రాజ్యమును స్థాపించుటకు న్యూమాన్, లోమినాడ్జీ లను ఇద్దరు కమ్యూనిస్టు ప్రముఖులను స్టాలిను చైనాకు పంపెను. వారు వచ్చి కమ్యూనిస్టు విప్లవమును చైనాలో నిర్మాణము గావించిరి. 1 వ ఆగస్టు తేదీన చైనాలోని నాన్‌చంగునందు కమ్యూనిస్టుల తిరుగుబాటు లేవదీయబడెను.

దానిని హాంకో ప్రభుత్వము అణచివైచి సాముదాయ వాద సంఘము లక్రమ సంఘములని ప్రకటించెను. సాముదాయ వాదులు సైన్యములనుండియు ఉద్యోగములనుండియు తీసివేయబడి నిర్బంధ ప్రయోగములకు గురియైరి. జులై 15 వ తేదీననే

బొరోడిన్ రాజీనామానిచ్చి రుష్యాకు పోయెను. రుష్యావారంత వరకు చేసిన సహాయమునకు వందనములర్పించుచు హాంకో ప్రభుత్వమువారు బొరోడిన్‌ను సగౌరవముగ వీడుకోలు సలిపిరి.

**క్యూమింటాంగులో మరల నైక్యత స్థాపిత మయ్యెను. చ్యాంగు కేషక్ అధ్యక్షుడయ్యెను**

అప్పటినుండియు హాంకో, నాన్‌కింగు, జాతీయ ప్రభుత్వ నాయకులమధ్య ఐక్యత, స్నేహము కలుగజేయవలెనని వాంగు చింగువై ప్రయత్నించెను. బొరోడిన్ యొక్క కుట్రలవలన తాను హాంకో ప్రభుత్వమున కెదురు తిరిగితినని చాంగు కేషక్ పశ్చాత్తాపమును వెల్లడించెను. చాలకాలము రాజీనామా ప్రయత్నములు జరిగి మధ్య మధ్య కొందరి కుట్రలవలన విఫలమై పోవుచు 1927 వ సంవత్సరము డిశంబరు నెల 10 వతేదీన నాన్‌కింగు ప్రభుత్వము విచ్ఛిన్నమగు నటులను, హాంకోలోని పాత క్యూమింటాంగు స్థాయిసంఘము జాతీయ ప్రభుత్వము నాన్‌కింగు నగరములోనే కార్యస్థానమును గావించుకొనునటులను, సమస్తమైన జాతీయసైన్యములకును చ్యాంగు కేషక్ సర్వసేనాధిపత్యము వహించునటులను, 1928 వ సంవత్సరము జనవరి నెలలో నాన్‌కింగు నగరమున క్యూమింటాంగు స్థాయి సంఘ సమావేశము జరిగి ముందు జరుగనున్న కార్యక్రమమునంతను నిర్ణయించునటులను, ఉభయపక్షములకును రాజీ కుదిరెను. కాని చ్యాంగు కేషక్‌కును వాంగుచింగువైకిని మధ్య అభిప్రాయ భేదములు పోలేదు. చ్యాంగు కేషక్ బృందమువారు వాంగు చింగువై అతివాదియని ఆయనకు వ్యతిరేకముగ కుట్రలను సలుపుచుండిరి. ఈ కుట్రలకు పడలేకను అస్వస్థతవల్లను వాంగు

చింగువై 1927 వ సంవత్సరము డిశంబరు 17 వ తేదీననే మరల చైనాను వదలి ఫ్రాన్సుకు పోయెను. జాతీయ ప్రభుత్వము యొక్క యావత్తు నాయకత్వము బాధ్యత చ్యాంగుకేషక్‌కు వదలబడెను. చ్యాంగు కేషక్ క్యూమింటాంగులోని వివిధ బృందములను తన యాధిపత్యమున చేర్చి కూమింటాంగు ప్రభుత్వమును 1928 వ సంవత్సర ప్రారంభమునుండియు నాన్‌కింగు నగరమున స్థాపితముగావించెను. కాంటన్ కల్లోలముల నణచిన పిమ్మట 1928 వ సంవత్సరము ఫిబ్రవరి నెల 28 వ తేదీన క్యూమిన్‌టాంగుస్థాయి సంఘముయొక్క సమావేశము నాన్‌కింగు నగరమున జరిగెను. క్యూమిన్‌టాంగు ప్రభుత్వమునకు చ్యాంగుకేషక్ అధ్యక్షుడుగ నెన్నుకొనబడెను. ఉత్తరరాష్ట్రముల దండయాత్రను మరలసాగించి యావత్తు చైనాదేశమును జాతీయ ప్రభుత్వము క్రిందికి తెచ్చునటులను సన్‌యటుసేను ప్రారంభించిన జాతీయోద్యమమును పూర్తిచేయునటులను తీర్మానించబడినది.

## 5

1928 వ సంవత్సరము ఏప్రిల్ నెలనుండియు చ్యాంగు కేషక్ సేనాని జాతీయసైన్యములను వెంటగొని పికింగునగరమును స్వాధీనపరచుకొనుటకై బయలుదేరెను. మే నెల 3, 4 తేదీలను జపాను సైన్యములు షాంటుంగు రాష్ట్రమున మరల ప్రవేశించి జాతీయసైన్యముల నడ్డగించెను. గాని ఫెంగుసేనానియు షాన్సిరాష్ట్రపాలకుడగు యన్‌సేనానియు తమతమ సైన్యము

చ్యాంగుకేషక్ పికింగు నగరమును స్వాధీనమును పొందుట

లతోవచ్చి జాతీయవాదుల పక్షమునచేరి వెనుకవైపునుండి పికింగు నగరమును ముట్టడించిరి. అప్పుడు పికింగులో నధ్యక్షుడుగనున్న చాంగుసోలినువద్ద గొప్పసైన్యముగలదు. కాని వారిలో సణయటు సేను యొక్క బోధలు బాగుగ వ్యాపించియుండుటచే వారు జాతీయవాదులతో పోరాడుటకు నిరాకరించిరి. చాంగుసోలిను చేయునదేమియులేక పికింగునగరమును విడచి తన కాపుర స్థల మగు మంచూరియాలోని ముక్డనుపట్టణమునకు పారిపోయెను. జపానుసేనల నోడించి చ్యాంగుకేషక్ సేనాని జాతీయసైన్యము లతో జూన్ నెల 5 వ తేదీన పికింగునగరమున ప్రవేశించెను. పికింగు నగరవాసులు జాతీయ ప్రభుత్వాధ్యక్షుడగు చ్యాంగు కేషక్‌కు హృదయపూర్వకమగు స్వాగతము నిచ్చిరి. ఇంతటితో చైనా దేశమంతయు జాతీయప్రభుత్వమునకు లోబడెను. పికింగునగరము యొక్క పేరును పిపింగు అని మార్చిరి. నాఙకింగుపట్టణమే జాతీయ ప్రభుత్వమునకు రాజధానిగ నుండెను. పిపింగుపట్టణము ఆ రాష్ట్రప్రభుత్వమునకు మాత్రము కార్యస్థానముగ చేయబడినది.

చాంగుసోలినుసేనాని మంచూరియాకు పోయి తన రాజ్య మును బలపర్చుకొనుచుండెను. మంచూరియాలో పలుకుబడిని కలిగి లాభములను పొందుచున్న జపానువారితో నాతనికి కలహములు కలిగెను. 1928 వ సంవత్సరము జూలై నెల 6 వ తేదీన నాతడు రైలులో ప్రయాణము చేయుచుండగ కొందరు జపాను దేశీయు లాతని రైలుమీద బాంబును ప్రయో గించి యాతనిని హత్య గావించిరి. ఆతని హత్య గావించుటవలన

జాతీయ ప్రభుత్వమునకు మంచూరియా, మంగోలియా, టిబెటులు లోబడెను

మంచూరియాలో కల్లోలము అంతఃకలహములు కలుగుననియు, ఆ యవకాశమును తీసికొని తాము మంచూరియాలో తమ యధికారమును వృద్ధిచేసికొనవలెననియు జపానువారి తలంపు. చాంగుసోలిను హత్య గావించినందున జపానునందు భయమును ద్వేషమును ఆతని కుమారుడగు చాంగుహుసుయలియాంగు (**Chang Hsueh Liang**) కు ఎక్కువై చైనా జాతీయ ప్రభుత్వముతో సంధిచేసికొని మంచూరియాపైన కూడ చైనా జాతీయ ప్రభుత్వ పతాకమును స్థాపించెను. జపానుప్రభుత్వ ప్రతినిధియగు హాయషీ ప్రభువు చైనా జాతీయప్రభుత్వముతో చేరవద్దని చాంగు హుసుయలియాంగును మందలించెను. కాని తాను చైనా దేశీయుడ ననియు, చైనాయొక్క ఐక్యతకు తోడ్పడుట తన యొక్క పవిత్రమైన ధర్మమనియు, నాన్‌కింగు ప్రభుత్వము యొక్క స్థిరత్వమే చైనాజాతి కంతకును ఐకమత్యము అభివృద్ధి నివ్వగలదనియు చాంగుహుసుయలియాంగు జవాబు చెప్పెను. మంచూరియా చైనా జాతీయప్రభుత్వముక్రిందికి వచ్చెను. 1924వ సంవత్సరమున రుష్యాసోవియటుయొక్క పలుకుబడిక్రింద మంగోలియాలో పశ్చిమభాగము (**Outer Mongolia**) షుమారు డెబ్బది యారులక్షల జనసంఖ్యగల ప్రదేశము ప్రత్యేకముగ సోవియటు ప్రజాస్వామికమును స్థాపించుకొనెను. మిగిలిన తూర్పు మంగోలియాదేశము చైనా జాతీయ ప్రభుత్వపాలనముక్రిందికి వచ్చెను. ఇటుల నలుబది యెనిమిదికోట్ల జనసంఖ్యగల చైనా ప్రజాస్వామికమంతయు (**Chinese National Republic**) ఒకే

జాతీయ ప్రభుత్వముక్రిందకు వచ్చినది. ఇది ప్రపంచములో కెల్ల గొప్ప ప్రజాస్వామికము.

1928 వ సంవత్సరము నవంబరు నెలలో అమెరికాసంయుక్త రాష్ట్రముల ప్రభుత్వము, నాన్‌కింగు నగరమున ప్రతిష్ఠించబడిన క్యూమింటాంగు జాతీయ ప్రభుత్వమును యావత్తు చైనా ప్రజాస్వామికము యొక్క శాస్త్రీయమైన ప్రభుత్వముగా నంగీకరించినది. చైనా జాతీయ ప్రభుత్వము తన కిచ్చవచ్చిన సుంకములను ఎగుమతి దిగుమతి సరకులపై విధించ వచ్చునను ఆర్థిక స్వతంత్రము నంగీకరించుచు అమెరికా ప్రభుత్వము సంధి చేసికొనినది. డిశంబరు నెలలో బ్రిటిషుప్రభుత్వము చైనా జాతీయ ప్రభుత్వ అధ్యక్షుడగు చ్యాంగుకేషక్ యొక్క గౌరవార్థము ఇరువదియొక్కసార్లు ఫిరంగులను కాల్చినది. 1929 వ సంవత్సర ప్రారంభమున ఫ్రాన్సు, జపాను మొదలగు నితర విదేశ ప్రభుత్వము లన్నియు చైనా జాతీయ ప్రభుత్వము నంగీకరించినవి.

యావత్తు చైనా ప్రజాస్వామికము నాన్‌కింగులోని క్యూమింటాంగు పాలనము క్రిందకి వచ్చెను

సన్‌యటు సేనుయొక్క శవమును పికింగులోని దేవాలయమునం దుంచి జాతీయ పక్షమునకు చెందిన యువకులు కాపలా కాయుచున్నారు. దానిని నాన్‌కింగునకు తేవలసియున్నది. 1929 వ సంవత్సరము మార్చినెల 12 వ తేదిన ఆయన మరణముయొక్క మూడవ సంవత్సరము దేశమునందంతటను ఆబాలగోపాలము జరుపనున్నారు. ఆ మహాపర్వదినమున దానిని

సనుయటుసేను యొక్క శవమును నాన్‌కింగునందు సమాధిచేయుట

నాన్‌కింగు ఊదాకొండయొక్క అడుగుభాగమున మింగు చక్రవర్తియొక్క సమాధిప్రక్కన నొక గొప్ప సమాధిలో నుంచుటకు నిశ్చయించిరి. రుష్యానుండి వచ్చిన శవపుపెట్టె సరిపోలేదు. చైనాలోని శిల్పులచేత నొక మిగుల సుందరమైన పెట్టె తయారు చేయబడినది. దానిలో నాయనశవమును పెట్టితెచ్చుటకు నాన్‌కింగునుంచి ప్రభుత్వసభ్యుల సంఘమొకటి పికింగునగరమునకు పోయెను. దానిని పికింగునగరమునుండి గొప్ప యుత్సవముతో నొక ప్రత్యేకరైలులో వారు నాఁకింగునగరమునకు గొనివచ్చిరి. చింగులింగుదేవి ఆ పెట్టెతోకూడ నా ప్రత్యేకరైలులో నాఁకింగుకు ప్రయాణముచేసినది. ప్రతి రైలుస్టేషనులో నత్యంతమైన కోలాహలముతో జనులు వేలకొలదిగ చేరి సఁయటుసేనునందును చింగులింగుదేవియందును గల గాఢమగు భక్తిని ప్రదర్శించిరి. నాఁకింగులో నాదినముననే మూడవ క్యూమిఁటాంగు కాంగ్రెసు మహాసభ జరుగుట కేర్పాటులు జరిగెను. యావత్తుచైనా ప్రజాస్వామికమునుండియు విదేశములనుండియు వందలకొలది జాతీయవాద ప్రముఖులు నాఁకింగునకు వచ్చియుండిరి. వారందరును చ్యాంగుకేషక్ నాయకత్వమున రైలుస్టేషఁనుండి యా శవపుపెట్టెను అత్యంతమగు వైభవముతో నాఁకింగునగర రాజవీధులగుండ గొనివచ్చి ఊదాకొండమీది నూతన సమాధిలో నుంచిరి. అట్టి భక్తిపురస్సరమైన వైభవము రారాజులకేరికిని జరుగనేరదని చెప్పిన యతిశయోక్తి గానేరదు. సమాధిలో నుంచినపుడు ఫిరంగులు కాల్చబడెను. ఆసమాధిపై నిర్మింపబడిన గొప్ప మందిరము చైనా ప్రజాస్వామికములోని యుత్తమ శిల్ప చాతురిని

ప్రదర్శించుచు సర్వాంగశోభితమై తనరారుచున్నది. సాధ్వీమ తల్లియగు చింగులింగుదేవియెడ రాజకీయనాయకులందరును ఏక గ్రీవమగునట్టియు సిద్ధాంతముల విషయమున అభిప్రాయభేదముల కతీతమైనట్టియు అనన్యసామాన్యమగు భయభక్తులను వినమ్రతను చూపుచున్నారు. విదేశస్థులగు మంచూరాజులపాలన మేర్పడక పూర్వము చైనా జాతియొక్క నాగరికతను ఔన్నత్యమును పెంపొందచేసిన పురాతనరాజధానియు, నవీన చైనా జాతీయ నిర్మాణకర్తయగు సన్‌యటుసేను ప్రప్రథమమున అధ్యక్షుడుగ నభిషేకింపబడిన నగరరాజమునునగు నాన్‌కింగు నగరము రాజ ధానిగ సుస్థాపితమగుటవలన చైనాజాతీయవాంఛ నెఱవేరినది. ఆ నగరమునందు సాయంసమయచిత్రవర్ణముల శోభకు ప్రసిద్ధి చెందిన ఊదాకొండమీద మిగుల సుందరమగు సరోవరము ప్రక్కన విలసిల్లుచున్న సన్‌యటుసేనుయొక్క సమాధినుండి చల్లని స్వతంత్ర సందేశములు చైనాజాతికేగాక పారతంత్రములోనున్న జాతులకన్నిటికిని సంతతము ప్రసరించుచున్నవి.

★

# చైనా విప్లవము

## నవమాధ్యాయము

### క్యూమింటాంగు పాలనము

### 1

చైనా ప్రజాస్వామికమునందు నాలుగు భాగములు చేరియున్నవి. 1. చైనా, 2. మంచూరియా, 3. సింకియాంగు, 4. తూర్పు మంగోలియా. మొత్తము పరిమాణము నలుబదిరెండు లక్షల డెబ్బది ఏడువేల చదరపు మైళ్లు. 1959 వ సంవత్సరములో మొత్తపుజనసంఖ్య ఏబదితొమ్మిది కోట్లని అంచనా వేయబడినది. వీటిలో చైనా మిగుల ముఖ్యమైనది. ప్రాచీన నాగరికత కాలవాలమైనది, ఫలవంతమైనది, విజ్ఞానవంతమైనది. చదరపు మైలుకు 350 మంది జనసంఖ్యతో కలకలలాడుచున్నది. మంచూరియా కూడ మిగుల ఫలవంతమైన దేశము. వ్యవసాయమునకును, తోటలకును మిగుల అనుకూలమై మంచి మంచి అడవులను, గనులను కలిగియున్నది. సింకియాంగు రాష్ట్రములో తురుష్కులెక్కువగ కాపురమున్నారు. అది చాల వరకు ఎడారియైయున్నది. తూర్పు మంగోలియా దేశముకూడ చాలభాగము గోబీ ఎడారితో కప్పబడియున్నది. మిగిలిన భాగము పచ్చిక బయళ్లతో నిండియున్నది. ఇటీవల చైనా వారు అచటికి వచ్చి నివసించుచున్నారు. అందులో పదునాలుగు లక్షలమంది

చైనా ప్రజాస్వామికము

జనులు మంగోలులును, పదిహేను లక్షలు చైనావారును కాపురమున్నారు. చైనా ప్రజాస్వామికమునందు షుమారు మూడుకోట్లమంది మహమ్మదీయులు గలరు. స్వదేశ క్రైస్తవులు ఒక కోటిన్నరమంది కలరు. మిగిలిన ఏబదిఅయిదు కోట్ల ప్రజలును బౌద్ధ మతస్థులై యున్నారు. షుమారు ఒకకోటి నలుబది లక్షలమంది చైనావారు విదేశములకు పోయి వర్తకము చేసుకొనుచున్నారు. చైనాదేశము పదునెనిమిది రాష్ట్రములుగ విభజించబడి యున్నది. మంచూరియా మూడు రాష్ట్రములుగ చేయబడినది. సింకియాంగు ఒక రాష్ట్రముగను, తూర్పు మంగోలియా మరియొక రాష్ట్రముగను చేయబడినవి. టిబేటు దేశము లాసా రాజధానిగ గల "డెలేలామా" యను బౌద్ధమత గురువు క్రింద స్వతంత్ర రాజ్యముగ నున్నది. టిబేటుమీద అప్పుడపుడు చైనా ప్రభుత్వము సార్వభౌమత్వమును స్థాపించుకొనుచు విశేష కాలము టిబేటు ఆ సార్వభౌమత్వము లేకుండ పూర్తిగా స్వతంత్రముగ నుండుచు వచ్చిరి. 1906 వ సంవత్సరమున జరిగిన చైనా ఆంగ్లేయ యొడంబడికవల్ల టిబెట్టుపైన చైనాకు గల సార్వభౌమత్వము అంగీకరించబడినది. చైనా ద్వారానే టిబెట్టుతో యొడంబడికలను జరుపవలెనని ఆంగ్లేయులును, రుష్యావారును 1907 వ సంవత్సరమున అంగీకరించి యున్నారు. కాని 1911 నుండి 1950 వరకు టిబెటుపైన చైనా సార్వభౌమత్వము లేదు. టిబెటువారు స్వతంత్రమునే అనుభవించిరి. చైనాలో కమ్యూనిస్టు ప్రభుత్వ మేర్పడిన పిమ్మట 1950 లో టిబెటుపై కమ్యూనిస్టు సైన్యములు దండయాత్ర జరిపి టిబెటు

లోని డెలేలామా ప్రభుత్వముయొక్క పూర్తియైన ఆంతరంగిక స్వతంత్ర మంగీకరించుచు మరల చైనాయొక్క సార్వభౌమత్వ ముండవలెనని సంధిని చేయించుకొనిరి. పిమ్మట టిబెటుపైన చైనాకుగల సార్వభౌమత్వమును (Suzereinty) ఇండియా ప్రభుత్వము కూడ అంగీకరించినది. 1959 నుండి టిబెటును చైనాలో పూర్తి భాగముగ చేసికొనుటకు చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము జరిపిన దురాక్రమణములను గూర్చి ముందు అధ్యాయములో తెలిపెదము. పశ్చిమ మంగోలియాలో సోవియటు ప్రభుత్వ మేర్పడి సోవియటు రుష్యాకు అనుబంధముగ నున్నది. తూర్పు మంగోలియా మాత్రమే చైనా ప్రజాస్వామికములో చేరియున్నది.

చైనా ప్రజాస్వామికమును పాలించుట కేర్పాటు చేయబడిన జాతీయ ప్రభుత్వము క్యూమిటాంగు రాజకీయ కక్షికి చెందిన ఏకపార్టీ ప్రభుత్వమై యుండెను. పాలనాధికారమంతయు

**క్యూమిటాంగు రాజ్యాంగ విధానము**

అఖిల చైనా క్యూమిటాంగు కాంగ్రెసు మహాసభయందుండెను. క్యూమిటాంగు కాంగ్రెసు అప్పుడప్పుడు సమావేశమై ప్రజాస్వామికము యొక్క పరిపాలనము కాంగ్రెసు తీర్మానములకు లోబడి నడుపుటకొక సెంట్రల్ ఎగ్జిక్యూటివ్ కమిటీ (కేంద్ర స్థాయీ సంఘము) నెన్నుకొనెను. 1928 వ సంవత్సరము అక్టోబరు 4 వ తేదీన క్యూమిటాంగు కాంగ్రెసు మహాసభ యొక తాత్కాలిక రాజ్యాంగ విధానమును నిర్ణయించినది. దానిని మరల 1931 వ సంవత్సరము డిశంబరు నెలలో కొద్దిగ మార్పుచేసి యున్నది.

ఈ తాత్కాలిక విధానమే తుదివరకును నుండెను. చైనాలో స్థిరమైన శాంతి ఏర్పడిన పిమ్మట శాశ్వత రాజ్యాంగవిధానమును తయారుచేసి దాని ప్రకారము చైనా ప్రజలందరిచే నెన్నుకొనబడిన పార్లమెంటుకు జాతీయ ప్రభుత్వమును ఒప్పగింత చేయుటయే క్యూమిన్‌టాంగుయొక్క యుద్దేశ్యమని ప్రకటించబడినది. అంతవరకు ప్రధాన రాజకీయపార్టీయైన క్యూమిన్‌టాంగుయొక్క ప్రభుత్వమే యుండగలదు. ఈ తాత్కాలిక రాజ్యాంగ విధానము ప్రకారము, క్యూమిన్‌టాంగు కాంగ్రెసు మహాసభ, కాంగ్రెసు స్థాయీ సంఘమును ఎన్నుకొన్నది. ఈ కాంగ్రెసు స్థాయి సంఘము ఐదు ప్రభుత్వ సంఘములను ఎన్నుకొన్నది. ఈ ఐదు సంఘములును కాంగ్రెసు స్థాయి సంఘమునకు బాధ్యత వహించి పనిచేయవలెను. అటుల సక్రమముగ పనిచేయనివారిని తీసివేయుటకు స్థాయి సంఘమునకు అధికారము కలదు. ఈ ఐదు ప్రభుత్వ సంఘములేవనగ :

1. శాసనసభ (**Legislative Council**) : ఇందు 99 వరకు సభ్యులను కాంగ్రెసు స్థాయి సంఘము రెండు సంవత్సరముల కొకమారు ఎన్నుకొనును. ఆదాయవ్యయ పట్టికను మంజూరు చేయుట, చట్టములను చేయుట, పన్నులువేయుట, విదేశ వ్యవహారములు, యుద్ధము, సంధి మొదలగు ముఖ్య విషయము లన్నియు శాసనసభయొక్క అధికారముక్రింద నుంచబడెను. తమకొక అధ్యక్షుని, యుపాధ్యక్షుని శాసనసభ ఎన్నుకొనును.

2. మంత్రివర్గము (**Executive Council**) : మంత్రి వర్గమును కాంగ్రెసు స్థాయీ సంఘమే ఎన్నుకొనును. ప్రతి

మంత్రికిని ఒక సలహా సంఘము కలదు. మంత్రివర్గమునందు అధ్యక్షుడును, పన్నెండు మొదలు పదునారుగురు వరకు మంత్రు లుందురు. అన్ని ప్రభుత్వశాఖల కార్యనిర్వహణము, చట్ట ములను ప్రవేశపెట్టుట, శాసనసభచేయు చట్టములను, తీర్మాన ములను అమలు జరుపుట వీరిపని.

3. న్యాయాధిపతుల సంఘము (జుడిషియల్ సంఘము): ఈ సంఘము వారసత్వములు, ఉద్యోగస్థులు చేయు నేరములను విచారించి శిక్షించుట, నేరస్థులకు క్షమాపణ నిచ్చుట, దేశములో న్యాయస్థానముల నేర్పాటుచేయుట, వాటిపై తనిఖీ మొదలగు విషయములు వీరి యాజమాన్యమున నుండును.

4. ఉద్యోగస్థుల నియమించు సంఘము (**Examination Council**): ఈ సంఘము ఉద్యోగములకన్నిటికిని పరీక్షలు నిర్ణయించి ఆయా పరీక్షలలో నారితేరినవారికి నిష్పక్షపాత ముగ ఉద్యోగములిచ్చును. సివిలు సర్వీసు కంతకును పరీక్షల లోని పోటీలో ఎక్కువ మార్కులు వచ్చిన వారికే ఉద్యోగ ములనిచ్చు పద్ధతి, చైనా వారిలో ననేక శతాబ్దములనుండి యున్న పద్ధతి. దానినే క్యూమింటాంగు ప్రభుత్వముకూడ నేర్పాటుగావించినది.

5. తనిఖీచేయు సంఘము (**Control Council**): ఇందులో 19 మొదలు 29 వరకు సభ్యులుందురు. వీరు ప్రభుత్వముయొక్క వివిధ శాఖలను, వాటి లెక్కలను తనిఖీ చేయుచు, నేరములను చేయు ఉద్యోగస్థులపై న్యాయాధిపతుల సంఘమువద్ద ఫిర్యాదు లను దాఖలు చేయవలెను. ఈ ఐదు సంఘములపైన జాతీయ ప్రభు

త్వాధ్యక్షుని (President of the National Government) కాంగ్రెసు స్థాయీ సంఘమువారు ఎన్నుకొనెదరు. ఆయనకు సహాయము చేయుటకు 24 మంది సభ్యులుగల స్టేట్ కౌన్సిలును (State Council) కాంగ్రెసుస్థాయీ సంఘము వారు ఎన్నుకొనెదరు. ఈ కౌన్సిలులో పై ఐదు సంఘముల అధ్యక్షులును, ఉపాధ్యక్షులునుకూడ సభ్యులగుచున్నారు. దేశములోని న్యాయ విచారణకంతకును సుప్రీముకోర్టును ఉన్నత న్యాయస్థానముగ నేర్పాటుచేసినారు. దానికి సివిలు క్రిమినలు కేసులలో సంపూర్ణాధికారము కలదు. దానిక్రింద దేశములో 276 కోర్టు లేర్పడెను. అవి రాష్ట్రి హైకోర్టులు, జిల్లాకోర్టులు. రాష్ట్రిమునకు "షెంగు" అని పేరు, జిల్లాకు "హాసీను" అని పేరు. ఈ తాత్కాలిక క్యూమింటాంగు ప్రభుత్వవిధానము చాలవరకు సోవియట్ రుష్యా ప్రభుత్వము విధానమునే పోలియున్నది. రాష్ట్రిములకును జిల్లాలకును స్వపరిపాలన యొసంగబడెను. వాటిలో భూఖామందులు పెద్ద రైతులు బలముగ నుండిరి. కొన్నిచోట్ల పాత సైనిక నాయకుల ప్రాబల్యముండెను.

వాంగు చింగువై ఫ్రాన్సుకు పోయిన పిమ్మట 1926 వ సంవత్సర ప్రారంభము నుండియు చైనా జాతీయ ప్రభుత్వమునకు నాయకుడుగను, అధ్యక్షుడుగను ఛ్యాంగు కేషకు బాధ్యతను వహించి పనిచేసెను. కాని ఆయనకు సలహాదారులుగను, సహచరులుగను మితవాద బృందమేర్పడినది. ఈయన రుష్యా ప్రభుత్వముతో స్నేహ సంబంధమును త్రెంచివేసి అమెరికా, ఇంగ్లాండు మొద

ఛ్యాంగు కేషకు యొక్క నాయకత్వము

లగు ధనవంతులచే పాలింపబడు (**Capitalist**) ప్రభుత్వములతో స్నేహమును స్థాపించెను. అంతర్జాతీయ సమితివారి సహాయమును పొంద దలచెను. సన్యటుసేను సతియొక్క చెల్లెలగు సంగు మేలింగు యువతిని పెండ్లియాడి క్రైస్తవ మతమును స్వీకరించెను. ఆమె తండ్రి సూంగు షాంఘాయిలో గొప్ప వర్తకుడు, ఆయన కుమారుడగు టి. వి. సూంగు జాతీయ ప్రభుత్వములో ఆర్థిక నిపుణుడు. చైనాజాతీయ ప్రభుత్వమునుండి రుష్యా సలహాదారులు లేచిపోయినారు. అమెరికా దేశమునుండి ఇద్దరు ఆర్థిక నిపుణులను, జర్మనీనుండి కొందరు సైనికోద్యోగులను, ఇంగ్లాండు నుండి కొందరు ఉద్యోగస్థులను చైనాజాతీయ ప్రభుత్వమువారు తెచ్చి పెట్టుకొనినారు.

చ్యాంగు కేషకు యొక్క మితవాద బృందము

నూతన క్యూమిన్‌టాంగు ప్రభుత్వమునకు ఆర్థిక సౌష్ఠవమేర్పడలేదు. షాంఘాయి మొదలగు చోట్లనున్న వర్తకుల మీదను, పారిశ్రామికుల మీదను, తమతోచేరిన సైనికనాయకుల మీదను ఆధారపడవలసి వచ్చినది. వీరి సేనానులలో చాలమంది భూఖామందులే యుండిరి. రెండు మూడు రాష్ట్రములలో కన్న ఎక్కువ రాష్ట్రములలో క్యూమింటాంగు ప్రభుత్వమునకు పన్నులు వసూలగుటలేదు. చాల రాష్ట్రములలో ఈ ప్రభుత్వము యొక్క అధికారము నామమాత్రావశిష్టముగ నుండెను. అందువల్ల చ్యాంగు కేషకు బృందము చైనాలోని ధనికులతోను పారిశ్రామికులతోను ఎక్కువ స్నేహముగ నుండి రైతుల యొక్కయు, కార్మికులయొక్కయు ఉద్యమములకు ప్రోత్సాహ మొసగుట మానివేసిరి. ఏమాత్రము

సమ్మెలు కట్టినను సమ్మెలను, బలవంతముగ నణచివేయుటకు సమ్మతించిరి. సామ్యవాదులసంఘమును(కమ్యూనిస్టు)అక్రమసంఘ మని ప్రకటించి వారిపై మిగుల తీవ్రములగు నిర్బంధప్రయోగ ములను జరిపిరి. సన్యాటుసేను అవలంబించిన సాంఘికతత్వ రాజ నీతిని వదలిపెట్టిరి. సన్యాటుసేను తత్వమును బాగుగ నవలంబించి త్యాగములు చేసినవారి కుద్యోగము లిచ్చుటకు మారుగ వెనుక క్యూమింటాంగునుండి వెడలగొట్టబడినవారినే మరల ఉద్యోగము లలో ప్రవేశపెట్టిరి. చాలమంది సైనిక నాయకులు - ఫెంగు హుసియాంగు, ఎన్‌హ్సి, షాన్, చాంగు హుసుయలియాంగు, యాంగుహ్యాచంగు మొదలగువారు - దేశముయొక్క ఐక్యత, స్వతంత్రము అత్యావసరమని నమ్మి క్యూమింటాంగులో చేరిరి. వీరందరును మితవాద పక్షముననే యుండిరి.

1929 వ సంవత్సరము మార్చి నెల 12 వ తేదీన మూడవ క్యూమింటాంగు కాంగ్రెసు మహాసభను నాన్‌కింగు నగరమున చ్యాంగు కే షక్ సమావేశపరచెను. అప్పటికి వాంగుచింగువై చైనాకు మరలివచ్చెను. ఆ కాంగ్రెసు మహా సభకు అన్ని క్యూమింటాంగు శాఖలనుండియు సరియైన ఎన్నికలు జరిగి తగిన ప్రతినిధులు సమావేశము గాక చ్యాంగు కే షక్ యొక్క పలుకుబడిలో నున్నవారినే ఎక్కువమందిని తెచ్చునటుల తన యధికారమును వినియోగపరచెననియు, వేరొకదానిని సరియైన ఎన్నికలు జరిపి మరల సమావేశ పర్చవలెననియు, వాంగుచింగువై మొదలగు పదకొండు మంది క్యూమింటాంగు ప్రముఖులు

క్యూమింటాంగులో తగాదాలు.

ప్రకటించిరి. 1929 వ సంవత్సరము మే నెల 20 వ తేదీన పదునెనిమిది రాష్ట్రీయ క్యూమింటాంగు సంఘములలో పదునేను సంఘములు మార్చి నెలలో జరిగిన క్యూమింటాంగు కాంగ్రెసు సభ నాక్షేపించుచు వేరొక కాంగ్రెసును సమావేశపరచమని కోరుచు తీర్మానములను చేసి పంపెను. రెండవ క్యూమింటాంగు కాంగ్రెసు సభ ప్రకారమే నడచుట కొక యుపసంఘము స్థాపింపబడెను. చ్యాంగు కేషక్ తనకు వ్యతిరేకముగ నున్న కొన్ని క్యూమింటాంగు సంఘములను అణచివేసి కొన్ని పత్రికలను ఆపివేయించెను. కొందరు క్యూమింటాంగు సభ్యులను ఖయిదులో పడవేసెను. మరి కొందరిని అరెస్టుచేయ దలచెను. వారు విదేశస్థులక్రింద నున్న స్థలములలోకి పోయి దాగుకొనిరి. ఇటుల షాంఘాయిలోని ఫ్రెంచివారి స్థలములో దాగుకొనిన ఇద్దరు క్యూమింటాంగు ప్రముఖులను 1930 వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో చ్యాంగు కేషకు హత్యలు చేయించెను. 1929 వ సంవత్సరము జూన్ నెలలో క్యూమింటాంగు ప్రభుత్వముయొక్క ఆర్థిక స్థితిని పెంపొంద చేయుటకు దేశము లోని వర్తకుల, పారిశ్రామికుల ప్రతినిధులు షాంఘాయి నగర మున చర్చలు జరిపిరి. ఆదాయముకన్న ఖర్చు చాల ఎక్కువగ నుండెను. ప్రభుత్వ ఆర్థికమంత్రి టి. వి. సూంగు పరిస్థితుల నెల్లను తెలిపెను. క్యూమింటాంగులోని సైనిక నాయకులు కూడ హాజరైరి. సైనిక వ్యయమును తగ్గించవలెననియు, సైనిక నాయకులెల్లరును తమ సైన్యముల నెల్ల కేంద్ర ప్రభుత్వమునకు ఒప్పగింత చేయవలెననియు, యావత్తు సైనిక నాయకత్వము,

యాజమాన్యము నాన్‌కింగు ప్రభుత్వము క్రిందనే యుండవలె ననియు తీర్మానించిరి. సైనిక నాయకులు కూడ అంగీకరించిరి. గాని అమలుజరుప యత్నించు సరికి సైనిక నాయకులు తిరుగు బాటు చేసి పికింగు నగరములో నుత్తర రాష్ట్రములకు ప్రత్యేక ప్రభుత్వము స్వతంత్రముగ వాంగుచింగువై నాయకత్వమున స్థాపింప యత్నించిరి. కాని 1930 లో కమ్యూనిస్టులు విజృంభించు చున్నందున దాని నరికట్టుటకు క్యూమింటాంగులో ఐక్యత కావలెనని వాంగుచింగువై బోధించినందున ఆ ప్రయత్నము విరమింపబడెను. ఆ తిరుగుబాటు అటులనే సమసిపోయినది. కాని సైనిక నాయకులు సైన్యములను తమ క్రిందనే యుంచుకొని తమక్రింద నున్న ప్రాంతములపై నిరంకుశ పాలనమునే సాగించిరి. క్యూమింటాంగు ఏమియు చేయజాలక పోయెను.

ఇటుల చ్యాంగు కే షక్ బృందము క్యూమిన్‌టాంగు ప్రభుత్వమునందు పలుకుబడిని కలిగి పాలించుచుండెను. కాని 1931 వ సంవత్సరము సెప్టెంబరు నెలనుంచి జపాన్ సేనలు మంచూరియాలో ప్రవేశించి మంచూరియాను స్వాధీన పరచుకొనుటవలన, అమెరికావారి యొక్కయు, అంతర్జాతీయ సమితి యొక్కయు సానుభూతితో తమ విదేశ సమస్యలు న్యాయముగ పరిష్కార మగునను ఆశలు పెట్టుకొనినవారికి నిరాశ కలిగి, విదేశవ్యవహార విషయమున స్వయంసహాయముతో తీవ్రముగను స్వతంత్రముగను పనిచేయవలెననియు, జపానుకు బాగుగ ప్రతిఘటనము సలుప వలెననియు, తెలుపుచుండిన క్యూమింటాంగులోని అతివాదుల

అతి వాదులకు మరల ప్రాముఖ్యమేర్పడెను

కక్షికే ఎక్కువ ప్రాబల్యము కలిగెను. 1931 వ సంవత్సరాంత మున దేశమునందంతటను విద్యార్థుల సంఘములు, చ్యాంగు కే షక్ ప్రభుత్వమునకు వ్యతిరేకముగ అఖండమైన ఆందోళనమును జరిపిరి. డిశెంబరు 15 వ తేదీన అఖిల చైనా విద్యార్థి సభ షాంఘాయిలో సమావేశమై చ్యాంగు కేషక్ బృందము మంచూరి యాను జపానుకు అమ్మివేయుచున్నారనియు, వెంటనే చైనా జాతి మేల్కొని ప్రతిఘటనము సలుపవలెననియు తీర్మానించిరి. వారిని నిర్బంధములచే నరికట్టవలెనను ప్రయత్నములు జయ ప్రదము కాలేదు. వారితో కార్మికులును, రైతులును చేరిరి. చ్యాంగు కే షక్ పక్షపు మంత్రులు రాజీనామాలిచ్చిరి. చ్యాంగు కేషక్ అధ్యక్ష పదవికి రాజీనామా నిచ్చెను. 1932 వ సంవత్సరము ఫిబ్రేవరి నెలలో జాతీయ ప్రభుత్వమునకు నూతన ఎన్నికలు జరిగి లిన్ షెన్ అను అతివాది జాతీయ ప్రభుత్వమునకు అధ్యక్షుడుగ నెన్నుకొనబడెను. వాంగుచింగువై మంత్రివర్గమున కధ్యక్షుడు గను, టి. వి. సూంగు ఆర్థిక మంత్రిగను, డాక్టర్ లోవెంకన్ విదేశ వ్యవహార మంత్రిగను, ఫెంగు సేనాని అంతర్ వ్యవహార మంత్రిగను నెన్నుకొనబడిరి. సైనిక వ్యవహారములను నడుపు సంఘమునకు అధ్యక్షుడుగ నెన్నుకొనబడి చ్యాంగు కే షక్ సర్వ సేనాధిపతి యయ్యెను. జూన్ నెలాఖరున క్యూమింటాంగు ప్రభుత్వము మరల సోవియట్ రుష్యాతో స్నేహ సంబంధముల నేర్పరచుకొని రాయబారులను మార్చుకొనెను. కాని సర్వ సేనాధిపతి యగు చ్యాంగు కే షక్ తన సైన్యములను కమ్యూ నిస్టులతో పోరాడుటలోనే వినియోగించుచు ఇందుకొరకు

అత్యధిక వ్యయమును చేయుచు జపానుకు ప్రతిఘటనము సలుప నందున, 1933 అక్టోబరు నెలలో ఆర్థికమంత్రి యగు టి. వి. సూంగు రాజీనామా నిచ్చి వెడలిపోయెను.

జాతీయ తత్వము దేశములో వృద్ధి నొంది జాతీయ ప్రభుత్వము బలపడిన కొలదియు దేశములో కొంత అభివృద్ధి చెందినమాట వాస్తవము. విదేశస్థులు చైనాలో తమకుగల ప్రత్యేక హక్కులను వదలుకొనసాగిరి. 1927 వ సంవత్సరమున చైనా యొక్క సుంకములను విధించు సంపూర్ణ స్వతంత్రము నంగీకరించుచు జపాను ప్రభుత్వము చైనా జాతీయ ప్రభుత్వముతో నొడంబడిక చేసికొనినది. 1928 వ సంవత్సరము నవంబరు నెలలో అమెరికాకూడ ఇటులనే జాతీయ ప్రభుత్వముతో సంధి చేసికొనినది. యావత్తు దేశముమీద జాతీయ ప్రభుత్వము రాజ్యాధికారమును పొందిన తరువాత 1931 వ సంవత్సరము 1 వ జనవరి నుండియు దేశమునందంతటను లికిన్‌ను (సాయరు పన్నులను) జాతీయ ప్రభుత్వమువారు రద్దు పరచిరి. దేశములో నొకచోటినుండి మరియొకచోటికి పోవు సరకులమీద నూటికి అయిదు చొప్పునను, ద్రాక్ష సారాయములు పొగాకు మొదలగు భోగ్య సరకులమీద నూటికి ముప్పది వరకును పన్నులను విధించిరి. విదేశముల ఎగుమతి దిగుమతుల మీద తమ యిచ్చవచ్చిన సుంకములను, తమ యార్థిక అవసరములను బట్టియు తమ దేశ పరిశ్రమలకు వాటి వలన కలుగు పోటీని బట్టియు, విధించుటకు తమకు సంపూర్ణమగు స్వతంత్రము కలదని జాతీయ ప్రభుత్వము

జాతీయ ప్రభుత్వము క్రింద సుంకముల స్వతంత్ర మేర్పడినది.

ప్రకటించెను. ఈ ప్రకటనమునకు విదేశీయులందరును లోబడిరి. జాతీయ ప్రభుత్వము వేసిన సుంకముల నివ్వసాగిరి. ఎగుమతి దిగుమతి సుంకముల విషయమున సంపూర్ణ స్వతంత్రము చైనా మరల పొందినది. ఉప్పు పన్నును జాతీయ ప్రభుత్వమే వసూలు చేసుకొన సాగినది. ఉప్పు పన్ను విదేశీయుల స్వాధీన తనఖానుండి తీసివేయబడినది. సుంకముల విషయమున విదేశ ప్రభుత్వములు విడివిడిగ నప్పుడప్పుడు చైనా జాతీయ ప్రభుత్వముతో స్వతంత్ర మయినట్టియు సమాన ప్రతిపత్తి కలిగినట్టియు సంధులను చేసికొనిరి.

విదేశీయుల ప్రత్యేక హక్కులు నశించుచుండెను.

జాతీయ ప్రభుత్వము స్థాపితమైన పిమ్మట చట్టము లన్నిటి లోను నవీన పద్ధతులమీద సంస్కరణములను గావించిరి. చైనాలో నున్న అందరు విదేశస్థులకు గల అన్ని ప్రత్యేక హక్కులను న్యాయ విచారణాధికారములను 1930 వ సంవత్సరము జనవరి నెల 1 వ తేదీనుండి రద్దు పరచుచున్నామని చైనా జాతీయ ప్రభుత్వము అన్ని విదేశ ప్రభుత్వములకు తెలియజేసినది. జర్మనీ, రుష్యా, ఆస్ట్రియా, ఇటలీ, బెల్జియం, డెన్మార్కు, స్పెయిన్, పోర్చుగలు, ఫిన్‌లాండు, పర్షియా, బొలీవియా, చిలీ, మెక్సికో ప్రభుత్వములు అంగీకరించి తమతమ దేశములకు చైనాలో గల సమస్త ప్రత్యేక హక్కులను న్యాయవిచారణాధికారములను వదలుకొనిరి. కాని ఆ తేదీనుండి క్రమక్రమముగ తమ దేశీయుల ప్రత్యేక హక్కులను న్యాయవిచారణాధికారములను వదలుకొను సిద్ధాంతమును మాత్రమే తామంగీకరించుచున్నామని బ్రిటిషు ప్రభుత్వము

చైనా జాతీయ ప్రభుత్వమునకు జవాబు చెప్పెను. షాంఘాయి మొదలగు రెండు మూడు రేవు పట్టణములలో తప్ప మిగిలిన అన్ని ప్రదేశములలోను అందరు విదేశస్తులును చైనా చట్టముల క్రిందకును సివిలు క్రిమినలు న్యాయవిచారణ క్రిందకును వచ్చినారు. విదేశస్తులు చైనాయం దంతటను వచ్చి స్వదేశస్తులతో పాటు నివసించవచ్చుననియు స్వదేశస్తులతోపాటు పన్నులనుచెల్లించుచు చైనా యొక్క చట్టములకు, అధికారులకు లోబడవలెననియు జాతీయ ప్రభుత్వమువారును విదేశస్తులునుఒప్పుకున్నారు.

ఆ సొమ్ము నంతను చైనాలోని రోడ్లను వృద్ధిచేయుటకును రైళ్ళు వేయుటకును ఉపయోగించుటకు చైనా జాతీయ ప్రభుత్వ మంగీకరించినచో ఆంగ్లేయ ప్రభుత్వమునకు బాక్సరు నష్టపరిహారము క్రింద 1922 వ సంవత్సరమునుండియు చైనా ప్రభుత్వ మివ్వవలసియున్న సొమ్మునంతను వదలివేసెదమని 1930 వ సంవత్సరము సెప్టెంబరు నెల 22 వ తేదీన ఆంగ్లేయ ప్రభుత్వము తెలియపరచెను. ఇందువలన చైనాకు ముదరా వచ్చిన మొత్తము డెబ్బదిఎనిమిది లక్షల నలుబదియేడు వేల సవరను లయ్యున్నది. దానిని వాయిదాల ప్రకారము 1945 వ సంవత్సరము ఆఖరు వరకును చైనా జాతీయ ప్రభుత్వము రైళ్ళరోడ్ల అభివృద్ధి నిమిత్తము ఖర్చుపెట్టసాగెను. విదేశస్తులకు గల పన్నుల మినహాయింపులు రద్దు చేయబడి అన్ని పన్నులను చైనావారితో పాటు విదేశస్తులందరును చెల్లించుచున్నారు. విదేశీయుల పోస్టాఫీసు లన్నియు మూసివేయబడినవి.

ఆంగ్లేయులు బాక్సరు నష్టపరిహారము వదలుకొనిరి.

ఇంగ్లాండు హాంకో మొదలగు కొన్ని మ్యునిసిపాలిటీలను వదలుకొని చైనా జాతీయ ప్రభుత్వమునకు వశపర్చినది. 1930 వ సంవత్సరము అక్టోబరు నెల మొదటి తేదీన

ఆంగ్లేయులు వైహాయి వైని వదలుకొనుట

ఆంగ్లేయ ప్రభుత్వము తమక్రింద కౌలులో నున్న వైహాయివై ప్రదేశమును చైనాజాతీయ ప్రభుత్వమునకు వశపర్చిరి. 1931 వ సంవత్సరము జనేవరి నెల 15 వ తేదీన టీన్ట్సినులోని తమ ప్రదేశమును బెల్జియం ప్రభుత్వమువారు చైనా జాతీయ ప్రభుత్వమునకు స్వాధీనపర్చినారు. జర్మనీకి కౌలుకివ్వబడిన షాంటన్గు రాష్ట్రము వర్సెల్సు సంధి వలన జపానుకు సంక్రమించి జపాను సరుకుల బహిష్కారమునకు పిమ్మట 1922 వ సంవత్సరమున చైనాకు స్వాధీనమగుట పైన చూచి యున్నాము. కావున (మంచూరియా గాక) 1935 వరకు చైనా దేశములో కొన్ని ప్రదేశములింకను ఆంగ్లేయుల క్రిందను, ఫ్రెంచివారి క్రిందను కౌలు ప్రదేశములుగా నున్నవి.

1919 వ సంవత్సరము నుండియు చైనా జాతి యందొక నూతన జీవము నూతన వికాసము కలిగి విద్య.

దేశములో అభివృద్ధి

లోను, వ్యవసాయములోను, పరిశ్రమలలోను, రాకపోకల సాధనములలోను అభివృద్ధి చెందినది. ఇందుకు దేశములోని యువజనోద్యమము చాలగ తోడ్పడినది. జాతీయ ప్రభుత్వము యావత్తు దేశముమీద స్థాపిత మయినప్పటి నుండియు జాతీయాభివృద్ధి ఇంక నెక్కుడుగ జరిగినది. సుంకముల విషయమైన సంపూర్ణ స్వతంత్రము జాతీయ ప్రభుత్వమునకు కలిగిన

పిమ్మటను లికిన్ అను సాయరు పన్నులను స్వదేశీయులకును విదేశీయులతోపాటు వేసిన పిమ్మటను స్వదేశ పరిశ్రమల అభివృద్ధి బాగుగ సాగినది. 1935 వ సంవత్సరమున చైనా ప్రజాస్వామికము నందంతటను చైనా ప్రభుత్వోద్యోగులు విదేశ వస్త్రములను ధరించ గూడదని మంత్రివర్గమున కధ్యక్షుడగు వాంగు చింగువై యుత్తరువును గావించెను. జర్మను నిపుణుల సహాయమున సైనిక నివహములను నూతన పద్ధతులమీద జాతీయ ప్రభుత్వ మేర్పాటు చేసినది. కళాశాలలలోను హైస్కూళ్లలోను చదువుకొను ప్రతి విద్యార్థియు వారమునకు మూడు గంటలును, వేసంగి శెలవులలో మూడున్నర నెలలును సైనిక శిక్షణము పొంది తీరవలెనని 1935 వ సంవత్సరమున శాసించినది. అమెరికా నుండియు ఇటలీ నుండియు 292 ఆకాశ యుద్ధ విమానములను చేయించి తెప్పించినది. నావికా దళమును వృద్ధిచేసుకొనుచున్నది. ఆకాశ విమానములను నడుపు తరిబీయతు నిచ్చుట కొరకు కళాశాలను హాంగుచో పట్టణమున స్థాపించినది. చైనావారు ఆకాశ విమానములను నడుపుటలో మంచి యభిరుచిని కనపర్చసాగిరి. జాతీయ ప్రభుత్వము చైనా దేశమునంతను విశ్వ విద్యాలయ జిల్లాలుగ విభజించి విశ్వ విద్యాలయములను స్థాపించి అవి యన్నియు పికింగులోని జాతీయ విశ్వవిద్యాలయమునకు లోబడునటుల గావించిరి. అన్నిటిని విద్యాశాఖామంత్రి క్రింద నుంచిరి. ఫ్రెంచి పద్ధతులమీద విద్యా పద్ధతులను సంస్కరించిరి. 1935 వ సంవత్సరము నాటికి 34 విశ్వవిద్యాలయములు గలవు. పారిశ్రామిక విద్యలను నేర్పు గొప్ప కళాశాలలు 16 గలవు. ప్రాథమిక

విద్య బాగుగ వృద్ధిచెందుచున్నది. 1910 వ సంవత్సరమున నూటి కొక్కరు చదువుకున్నవారుండగ 1935 వ సంవత్సరమున నూటికి సామాన్యముగ 25 మంది చొప్పునను కొన్ని రాష్ట్రములలో నూటికి ఏబది వంతునను చదువుకున్న వారున్నారు. పూచో, టాకు, షాంఘాయి, హ్వాంహో, పట్టణములందు గొప్ప నౌకా నిర్మాణశాలలు నిర్మింపబడినవి. నీటి వసతులు వృద్ధియగుచున్నవి. తోటలువేసి పెంచుటలో చైనావారు నిపుణులు. 1932 వ సంవత్సరమున 61 లక్షల యెకరములలో ప్రత్తిపైరు వేయబడినది. ప్రపంచము యొక్క నాలుగవవంతు పట్టు చైనాలో నుత్పత్తి యగుచున్నది. చైనాలో 52 వేల మైళ్ళ టెలిగ్రాములు వేయబడినవి. టెలిఫోనులు తీగలేని తంతులు తీగలేని టెలిఫోనులు చాలగవేయబడినవి. 1929 వ సంవత్సరమున 12,263 పోస్టాఫీసు లుండెను. అవి యింకను వృద్ధియగుచున్నవి. 1928 వ సంవత్సరమున ఆర్థిక మంత్రియొక్క యాజమాన్యము క్రింద చైనాదేశపు సెంట్రలు బ్యాంకు స్థాపించబడెను. చాల స్వదేశ బ్యాంకులును చైనావారును విదేశస్థులును కలిసి పెట్టిన బ్యాంకులును గలవు.

భూసంస్కరణములను జరపలేదు ఎన్నికలు పెట్టలేదు

భూఖామందు పద్ధతి నుండియు, పెద్ద రైతుల ఒత్తిడి నుండియు సామాన్య పేద రైతాంగమును కాపాడునట్టి భూసంస్కరణములను, గ్రామ పునర్నిర్మాణమును, చ్యాంగు కే షకు ప్రభుత్వము తలపెట్టలేదు. మరియు ప్రజలకు ఎన్నికలు కలుగచేసి పార్లమెంటు పద్ధతిన ప్రజారాజ్యము స్థాపించుటకు ములు జరగనేలేదు. తుది వరకును ఒకే పార్టీయొక్క సైనిక నిరంకుశత్వము సాగుతూ వచ్చినది.

ఇంతేగాక క్యూమింటాంగు ప్రభుత్వమును రెండు అతి క్లిష్ట సమస్యలు - దేశములో కమ్యూనిస్టుల తిరగబాట్లు, జపాను ప్రభుత్వము చైనా ప్రజాస్వామికముపై జరిపిన దురాక్రమణలు ఎదుర్కొన్నవి. ఈ రెండువిషయములలోను అపజయమును పొంది చ్యాంగ్ కేషకు నాయకత్వముక్రింద క్యూమింటాంగు ప్రభుత్వము మిగుల బలహీనపడి ప్రజానురంజకత్వమును కోల్పోయినది.

# చైనా విప్లవము

## దశమాధ్యాయము

### యువజనోద్యమము

### 1

చైనా దేశముపైన ఆంగ్లేయులు నల్లమందు యుద్ధము చేసిన కాలము నుండియు తొంబది సంవత్సరముల కాలములో చైనాయొక్క కేంద్ర ప్రభుత్వము మిగుల బలహీనమైనది. విదేశ సామ్రాజ్యవాదుల వల్లను సైనిక నాయకుల వల్లను అరాజక పరిస్థితులు కలిగించ బడినవి. పెద్ద భూఖామందులు, గొప్ప రైతులు విశేషమగు భూముల నాక్రమించిరి. సేద్యగాండ్రగు రైతుల స్థితి దుర్భరమైనది. యావత్తు దేశము అంతఃకలహములతోను, విప్లవములతోను నిండి యుండెను. ఇట్టి పరిస్థితులలో యావత్తు చైనాప్రజాస్వామ్యము 1928 ఆఖరున క్యూమింటాంగు పాలనము క్రిందికి వచ్చినది. ఇంతటినుంచి యావత్తు దేశము పైనను సుస్థిర మైన ప్రజాపాలనమును, శాంతి భద్రతలను, సుపరిపాలనమును స్థాపించు బాధ్యత క్యూమింటాంగు ప్రభుత్వముమీద పడినది. దీనికి అయిదు అతి ముఖ్యమైన షరతులు కలవు. మొదటిది క్యూమింటాంగు పార్టీలో దృఢమైన ఐకమత్యము. రెండవది విదేశ దండయాత్రలనుండి దేశ సంరక్షణము. మూడవది అంతర్యుద్ధము

క్యూమింటాంగుయొక్క బాధ్యతలు

నుండియు అరాచకశక్తులనుండియు దేశమునుకాపాడి దేశములో శాంతిని నెలగొల్పుట. నాలుగవది ప్రజలందరికి హక్కు బాధ్యతలు గల ప్రజారాజ్య స్థాపనము గావించి ఆర్థిక సౌష్టవమును కలిగించి ప్రజలవిశ్వాస గౌరవములను పొందుట. ఈ నాలుగు షరతులు నెర వేరగా అయిదవది ప్రజా రాజ్యములో సణయటుసేను నిర్ణయించి పోయిన సాంఘికతత్వ కార్యక్రమము అమలు జరుపుట. ఈ అయిదు షరతులు నెరవేరినచో చైనా జాతి ప్రపంచములోకెల్ల గొప్ప ప్రజా రాజ్య సాంఘికతత్వ ప్రజాస్వామికము (**Democratic Socialistic Republic**) గా వర్ధిల్లెడిది. 1928 సంవత్స రాంతమునకు చైనాయొక్క సుస్థిరమైన శాంతియుతమైన అభి వృద్ధి కరమైన ప్రజా రాజ్య స్థాపనకును, భావి కళ్యాణమునకును, చైనాలోని అన్ని వర్గములవారును విద్యావంతులు, యువజనులు, రైతులేగాక పారిశ్రామికులు ధనవంతులు కార్మికులు కూడ సణయటుసేను స్థాపించిన క్యూమింటాంగునందే ఆశలను పూర్తిగ పెట్టుకొని యుండిరి. ఆ కాలమున క్యూమిన్‌టాంగు యొక్క ప్రతిష్ఠ అత్యున్నతస్థితి యందుండెను. కమ్యూనిస్టుపార్టి అత్యంత బలహీన స్థితిలోనుండెను. అమెరికా, ఇంగ్లాండు, ఫ్రాన్సు మొద లగు సామ్రాజ్యవాదులు తమ కౌలు ప్రదేశములను ప్రత్యేక హక్కులను వదలుకొనక తప్పదని తలచి వదలుకొనుటకు సిద్ధ పడుచుండిరి. గాని క్యూమిన్‌టాంగు నాయకులయొక్క, అందు ముఖ్యముగా చ్యాంగుకేషకు యొక్క అవివేక అక్రమ ప్రవర్తన వల్లను నిరంకుశత్వము వల్లను ఈ పైషరతులేమియు అమలు జరుగలేదు.

## 2

ఈ విషయములను గూర్చి చర్చించక ముందు నవ్య చైనాలో ఉజ్వలమైన చైతన్యమును నూతన జీవమును కలుగ చేసిన చైనా యువజనోద్యమమును గూర్చి కొంచెముగ వివరించెదము. దీనిలో ప్రధానముగ పాల్గొనుచున్నవారు విద్యార్థులగు యువకులును, యువతులును నైయున్నారు. చాలమంది కళాశాలల, పాఠశాలల అధ్యాపకులు కూడ నిందు చేరియుండిరి. చైనాలో ప్రాచీనకాలమునుండియు (intellectuals) విజ్ఞానవంతులకు ప్రథమస్థాన ముండెను. సన్ యటుసేను విద్యార్థులనే తన ప్రథమ స్వతంత్ర విప్లవమునకు పునాదిగా చేసుకొనెను. ముఖ్యముగ విద్యార్థులు అఖండమగు త్యాగములనుచేసి 1911 వ సంవత్సరమున ఆయనకు జయమును సమకూర్చి యున్నారు. 1924 వ సంవత్సరమున సన్‌యటుసేను క్యూమిన్‌టాంగును పునర్నిర్మాణముగావించి స్వతంత్రోద్యమమునకు నూతన రూపమును, నూతన శక్తిని కలుగచేసినపుడు కూడ విద్యార్థిసంఘములను విరివిగ స్థాపించుట ప్రధాన కార్యములలో నొకటిగ నిరూపించెను. చైనా దేశమునుంచి చాలమంది విద్యార్థులు అమెరికా, జపాను, ఫ్రాన్సు, జర్మనీ, రుష్యా, ఇంగ్లాండు దేశములకు పోయి ఏటేట విద్య నభ్యసించి వచ్చుచుండిరి. వీరిలో కొందరు యువతులును కలరు. 1927 వ సంవత్సరమున విదేశములలో చదువుకొనుచుండిన చైనా విద్యార్థుల సంఖ్య ఎనిమిదివేలని మదింపుచేయబడినది. ఇంతమంది యువకులును, యువతులును విదేశములలో విద్య నభ్యసించి వచ్చినప్పుడు

యువజనోద్యమము

విద్యార్థులలో భావ విప్లవము కలిగినదనుటలో నాశ్చర్యములేదు. చైనాలోని యువజనోద్యమము చైనాను విదేశస్థుల పలుకుబడి నుండియు, అధికారమునుండియు స్వతంత్రము గావించి, చైనా జాతి ప్రపంచములో కోల్పోయిన గొప్పతనమును మరల పొంద జేయుటకు సంకల్పించియుండెను. రాజకీయ స్వభావమును విశేష ముగ కలిగియున్నను, దేశాభిమాన తరంగములతో నిండి యున్నను, కేవలము రాజకీయరంగమునందేగాక జాతీయజీవితము యొక్క అన్ని శాఖలతోను పూర్తిగ సంబంధించియుండెను.

1911 వ సంవత్సరమున మంచూ చక్రవర్తులు రాజ్య భ్రష్టులై ప్రజాస్వామ్యము స్థాపింపబడగనే స్వతంత్రయుతమైన నూతన శకము అవిచ్ఛిన్నముగ సాగుననియు, త్వరితముగనే అమెరికావలె తమ దేశముకూడ స్వతంత్రమైన గొప్ప ప్రజాస్వామ్యమగుననియు విద్యావంతులగు యువకులు ఆశను చెందిరి. కొలదికాలములో యూఆయన్ షికాయ్‌యొక్క చేష్టలవల్ల వారి ఆశలు వ్యర్థ మయ్యెను. జాతీయ భావోద్రేకము, స్వతంత్ర తృష్ణ కొద్దిమంది నాయకులలోను, విద్యావంతులలోను మాత్రము కలదనియు, జనసామాన్యమంతయు అలక్ష్యభావమును కలిగి నిరంకుశత్వ మును ఏవగింపక హర్షించి లోబడిరనియు విదిత మయ్యెను. చైనాజాతియొక్క అన్ని తరగతులవారిలోను, స్త్రీలలోను, పురుషులలోను దృఢమైన జాతీయ భావమును, స్వతంత్రేచ్ఛను కలుగచేయనిది శాశ్వతమైన పునాదులమీద దేశ స్వతంత్రమును స్థిరముగ స్థాపించ వీలులేదని కనుగొనిరి. జాతీయ భావమున

నూతన జాతీయ నిర్మాణము

కును, స్వతంత్రోద్యమమునకును అడ్డమువచ్చు కొన్ని పాతభావములను, క్రుళ్ళిపోయిన ఆచారములను, సాంఘిక విధానములను నాశనము చేసి పాశ్చాత్య జాతుల కేవిషయములలోను తగ్గిపోని నూతన చైనా జాతిని సృష్టించవలెనని నిశ్చయించిరి. సన్యాటుసేను దక్షిణచైనాలో వ్యాపింపచేసిన జాతీయోద్యమము ఉత్తర చైనాలో వ్యాపించుటకు యువజనోద్యమము ముఖ్య కారణమైనది. 1919 వ సంవత్సరమున చైనాను దర్శించిన అమెరికను సుప్రసిద్ధ తత్వ శాస్త్రజ్ఞుడగు ప్రొఫెసరు జాన్‌డ్యూయి చైనాలోని యువజనోద్యమమును గూర్చి వ్రాయుచు "బయటికి చాలవరకీ యుద్యమము రాజకీయముగ నున్నటుల కనపడుచున్నను ఇది కేవలము రాజకీయోద్యమము కాదు. విద్య నభ్యసించుటవలన క్రొత్తభావముల యొక్కయు క్రొత్తవిశ్వాసముల యొక్కయు ఆవశ్యకతను గుర్తించిన యువకులలోను యువతులలోను ప్రదర్శింప బడుచున్న నూతన మానసిక వికాసము, నూతన వ్యక్తిత్వమునై యున్నది" అని వ్రాసెను. "మనము ప్రస్తుత కాలమునకు చెందిన వారమని బాగుగ జ్ఞాపకముంచుకొనవలెను. ప్రాచీనులు పురాతన కాలమునకు చెందినవారు. వారు వారి కాలమునకు అనుగుణ్యముగ వ్రాసియున్నారు. మనము వాటిని మన ప్రస్తుతావసరములకు ఎంతవరకు తగియున్నవో పరీక్షించవలసియున్నది. అటుల పరీక్షించకుండ వాటిని అంగీకరించుటకు ఇష్టపడకూడదని" ఒక విద్యార్థి నాయకుడు వ్రాసియున్నాడు. సరియైన ప్రజాపాలనమును స్థాపింపవలెనన్న, పాత రాజ్యాంగ విధానములతోను పాత సాంఘిక విధానములతోను మనము పోరాడక తప్పదు. సరియైన ప్రకృతి శాస్త్రములను మనము అవలంబించవలెనన్న పాతరకపు బోధలతోను పాతమత నమ్మి

కలతోను పాత విజ్ఞానముతోను మనము చాలవరకు వ్యతిరే కించక తప్పదు"అని ఆ ఉద్యమ నాయకులలో నొకరగు ఆచార్య చెంటూ్యాసి వ్రాసియున్నాడు. భావ స్వాతంత్ర్యము, మానవ సమానత్వము, ప్రజారాజ్యము అనునవి యువకుల ఆదర్శము లైనవి. 1915 వ సంవత్సరమున కొత్తయువకుడు (New Youth) అను పత్రిక స్థాపింపబడి విరివిగ వ్యాపింప చేయబడెను. అచిర కాలములో యువజనోద్యమ పక్షమున చైనాలో మూడువందల పత్రికలేర్పడెను. ఆ పత్రికలలో కొన్ని యువతులచే నడుపబడు చుండెను. 1917 వ సంవత్సరమున పెకింగులోని జాతీయ విశ్వ విద్యాలయమునకు డాక్టర్ సైయూఎన్‌పీ (చాన్సెలరుగ) అధ్యక్షుడుగ నియమింపబడినప్పటినుండియు నా విశ్వవిద్యాల యము యువజనోద్యమమునకు ఉత్తర చైనాలో బలమైన చేయూత నొసగినది. ఆయన చేసిన ప్రథమ కర్తవ్యము నీతిని వృద్ధి చేయు సంఘమును స్థాపించుటయ్యున్నది. దానిలోచేరెడి సభ్యులు పార్లమెంటు సభ్యత్వమునకై ఆశించకూడదు. ప్రభుత్వోద్యోగ లను స్వీకరించకూడదు. జూదము ఆడకూడదు. వ్యభిచారము చేయకూడదు. స్త్రీలను గౌరవింపవలెను. ఆ సంఘము వేయి మంది విద్యార్థి సభ్యులతో ప్రారంభమయ్యెను. ఆయన పూను కొనిన రెండవకార్యము చైనా భాషయొక్క సంస్కరణము. ఆయన నాయకత్వమున యువజనోద్యమ పక్షమువారు గ్రాంథిక భాషను వదలివేసి ప్రజలు మాట్లాడుచున్న భాషలోనే పత్రికా వ్యాసములను, గ్రంథములను వ్రాయుచు వచ్చిరి. 'మనము మన కాలములో ప్రజలు వాడుచున్న భాషలో వ్రాయవలెను.

అందరికీ తెలిసిన మాటలను ఉపయోగించవలెను. ప్రజల కొరకు ప్రజలభాషలో వ్రాయవలెను' అని బోధించిరి. ఎక్కువమందికి తెలిసిన తేలికైన ప్రజలభాష యగు మాండరిన్ అను భాషను దేశమందంతటను వ్యాపింపచేసిరి. సన్యాట్ సేనుకూడ నీ భాషలోనే వ్రాసెను. అదియే ఇప్పుడు చైనాయొక్క జాతీయభాషయైనది. అన్ని పాఠశాలలలోను ఈ భాషలో వ్రాయబడిన గ్రంథములనే జాతీయ ప్రభుత్వమువారు ప్రవేశపెట్టినారు.

**భావ విప్లవము**

ఇటుల అనాదికాలమునుండియు గ్రంథరచనకు వాడబడుచున్న భాషలో విప్లవమును కలుగచేయుటయే కాక వ్రాయబడుచున్న గ్రంథముల మూలమునను, పత్రికల మూలమునను యువజనోద్యమ కక్షివారు దేశములో భావ విప్లవమును కూడ కలుగచేసినారు. 1918 వ సంవత్సరమున సాంఘిక సేవను చేయుటకు గాను యువచైనా సంఘము (**Young China Society**) నవీన వాఙ్మయమును వృద్ధి చేయుటకుగాను మానసిక వికాససంఘము (**Renaissance Society**) పికింగు నగరమున స్థాపింపబడినవి. "యువజనోద్యమ పక్షమున మనము పూర్తిగ స్వతంత్రభావములను సామాన్య ప్రజలందరిలోను దేశమందంతటను వెదజల్లి వ్యాపింపచేయవలెను. మనము ప్రజల భాషలో మాట్లాడవలెను. ప్రజలభాషలో వ్రాయవలెను. పండితులమని గర్వపడు వారి గ్రాంథిక భాషతో మనకు పనిలేదు. పైతరగతుల వారికి అవసరమగు భాషతో మనకు పనిలేదు. ప్రజల కుపయుక్తమగు వాఙ్మయమును మనము సృష్టించవలెను. పై తరగతుల వారి యాధిక్యతను నిలువబెట్టు వాఙ్మయమును పడగొట్ట

వలెను. జనులందరును సమానమని బోధించు గ్రంథములను వ్రాయవలెను. పుక్కిటి పురాణములను వదలవలెను. సత్యమైన ప్రకృతి శాస్త్రములను వ్రాయవలెను. బహిః ప్రపంచముతో సంబంధములేని వాఙ్మయమునకు బదులు, ఇతర జాతులతో సంబంధము కలిగి వారితో సమాన ప్రతిపత్తిని పొందు గ్రంథ సముదాయమును సృష్టించవలెను. మనభాషను, మన వాఙ్మయమును సర్వ విధములను నవీనముగను, నవీనజాతుల భాషలకును, వాఙ్మయములకును తక్కువకాని దానినిగను మనము చేయవలెను." అని ఆచార్య చన్‌ట్యూసియు వ్రాసియున్నాడు. అటులనే చైనాభాషలో ప్రకృతి శాస్త్రములు, ఇంజనీరింగు, పరిశ్రమలు, వ్యవసాయము, వృత్తివిద్యలు, కళలు, రాజకీయ, సాంఘిక, ఆర్థికతత్త్వ శాస్త్రములు, దేశ చరిత్రలు, పరిపాలనా పద్ధతులు, దేశభక్తిని, ప్రజల హక్కులను బోధించు కవిత్వము, నాటకములు, నవలలు మొదలగు ప్రస్తుతకాలమున కవసరమగు విషయములమీద నెంతయో వాఙ్మయమును యువజనోద్యమ పక్షమువారు వ్రాసి యున్నారు. అనేకములగు స్వతంత్ర గ్రంథములును నవీన విదేశ వాఙ్మయములనుండి పెక్కులగు భాషాంతరీకరణములును చైనా భాషలో వ్రాయబడినవి.

### 3

1919 వ సంవత్సరమున జరిగిన పారిస్ శాంతి సమావేశమునందు చైనాయొక్క రాష్ట్రములలో నొకటగు షాంటంగు రాష్ట్రమును స్వయం నిర్ణయ సూత్రము ప్రకారము మరల

చైనాకు ఇచ్చుటకు బదులు మిత్రమండలివారు జపాను కిచ్చు నటుల తీర్మానించినారని తెలిసి చైనాలోని ప్రజలలో తీవ్రమగు ఆందోళనము కలిగినది. చైనాయొక్క విద్యావంతులును, వర్తకులును వెంటనే సభలు జరిపి షాంటంగు రాష్ట్రమును జపాను కిచ్చు నటుల, తమ దేశ ప్రతినిధుల మధ్యను, మిత్ర మండలి ప్రతినిధుల మధ్యను, జరిగెడి సంధిని చైనాదేశ మంగీకరించజాలదని ఖండిత ముగ తెలిపిరి. జపాను సరకుల బహిష్కారము జరుపుట యుక్త మని తలచిరి. అప్పుడు యువకుల మనములలో కలిగిన కలవర మునకు మేరలేకుండెను. 1919 వ సంవత్సరము మే నెల 3వ తేదీన మధ్యాహ్నము 1 గంటకు విద్యార్థుల బహిరంగ సభ జరుగునని ప్రకటించినారు. వేయిమంది విద్యార్థులు సమావేశమైరి. చైనా ప్రభుత్వము లంచగొండితనముచే జపానుకు లోబడుట వలనను, మిత్ర మండలివారికి జపానునందుగల పక్షపాతమువలనను చైనా నుండి షాంటంగు రాష్ట్రము పోవుచున్నదనియు, పశు బలము నకు ధర్మము మీద జయము కలుగకుండ చైనా విద్యార్థులు పోరాడవలెననియు తీర్మానించినారు. మరునాడు ఉదయము పది గంటలకు పికింగులోని అన్ని విద్యాలయములలోని అందరు విద్యార్థులును షుమారు పదివేల మంది న్యాయశాస్త్ర కళాశాల యావరణములో సమావేశమైరి. వారందరి చేతులలోను చిన్న చిన్న కాగితముల పతాకము లుండెను. వాటిమీద "స్వయం నిర్ణయము", "అన్ని జాతులకును న్యాయము", "జపానుయొక్క ఇరువదియొక్క షరతులను రద్దుపరచుడు", "మా షాంటంగు

షాంటంగు రాష్ట్రము కొరకు గొప్ప ఆందోళనము

రాష్ట్రమును మా కివ్వుడు", "దేశద్రోహులను కూలద్రోయుడు" అను మాటలు వ్రాయబడెను. ఆ సమావేశములో "ధర్మము, హేతువు, న్యాయము వర్ధిల్లవలెననియు, చైనా ప్రభుత్వోద్యోగుల అవినీతిపై దండెత్తవలె" ననియు తీర్మానించబడెను. ఈ తీర్మానములు పూర్తికాగానే పది వేలమంది విద్యార్థులు బారులు తీర్చి పికింగు నగరపు ప్రధానమగు వీధులలో తిరిగిరి. సైనికులు విద్యార్థులమీద తుపాకులను కాల్చిరి. 32 మంది విద్యార్థులను అరెస్టు చేసిరి. వారిని తుపాకి మడమలతో పొడిచి మామూలు ఖైదీలతోపాటు చేతికి సంకెళ్ళు వేసి నడిపించుకొని చెరసాలకు తీసుకొనిపోయిరి. ఎవరితోడను మాట్లాడనివ్వలేదు. విద్యాశాఖ మంత్రికి విద్యార్థులతో సానుభూతి కలదని ఎంచి రాజీనామా నిచ్చునట్లుచేసిరి. మరునాడు పికింగు విశ్వవిద్యాలయ న్యాయశాస్త్ర కళాశాల మందిరమున మూడువేలమంది విద్యార్థులు సమావేశమై "అరెస్టు చేయబడిన విద్యార్థులను విడుదల చేయవలె" ననియు, "జపాను ప్రభుత్వమునకు లోబడి సంచరించుచున్న దేశద్రోహులను ఉద్యోగములనుండి వెడల గొట్టవలె" ననియు, చైనా ప్రభుత్వాధ్యక్షుని కోరుటకు తీర్మానించిరి. మరియు "తమ తోడివిద్యార్థులు జైలునుండి విడుదల యగు వరకును పికింగు విద్యార్థులెవరును విద్యాలయములకు పోకూడదని తీర్మానించిరి. పత్రికాధిపతులును, వర్తకులును, విద్యాధికులును దేశమునందంతటను విద్యార్థుల తీర్మానములతో సానుభూతిని చూపుచు ప్రభుత్వమునకు తంతులనంపిరి. దీనితో ప్రభుత్వమునకు భయముకలిగి మే నెల 7 వ తేదీన జైలులోనున్న విద్యార్థుల

నందరిని విడుదలచేసిరి. కాని పికింగు విశ్వవిద్యాలయమును మూసివేయుటకు ప్రభుత్వోద్యోగులు నిశ్చయించిరి. అందువలన డాక్టర్ త్సై యూయన్ పి గారు విశ్వవిద్యాలయపు అధ్యక్ష పదవికి రాజీనామా నిచ్చిరి. ఆయన ననుసరించి పికింగులో చాల మంది ఉపాధ్యాయులు రాజీనామాలనిచ్చిరి. దీనితో దేశములో గొప్ప సంచలనముకలిగి పలుచోట్లనుండి ప్రభుత్వమునకు ఇట్టి పరిస్థితులు మార్చవలసినదని తంతులు వచ్చెను. ముప్పదిరెండు మంది విద్యార్థులను ప్రభుత్వమువారు విడుదల చేసిరి. కాని మరి కొందరిని మరల పట్టుకొని చెరసాలలో నుంచసాగిరి. విద్యార్థుల ఉద్యమముల నణచుటకు ప్రభుత్వము పూనుకొనెను. విద్యార్థులు ధైర్యము వదలక సమావేశములను చేయుచు వచ్చిరి. పారిస్ లోని చైనా ప్రతినిధులకు సంధిపత్రముమీద సంతకములు చేయ వద్దని పెక్కులగు తీర్మానములుచేసి తంతులద్వారా తెలియ పరచిరి. దేశములోని ముఖ్యమగు పట్టణములలో మే నెల 19 వ తేదీనుండి మే నెలాఖరువరకు విద్యార్థులు సమ్మెలుకట్టి పాఠశాల లను బహిష్కరించిరి. జూన్ 1 వ తేదీన మిషన్ స్త్రీ కళాశాలలోని విద్యార్థినులు కూడ సమ్మెలో చేరిరి. వందలకొలది విద్యార్థులను పోలీసువారు ఖైదుచేసిరి. కొందరిని కొరడాలతో కొట్టిరి. చెరసాల లన్నియు విద్యార్థులతో నిండెను. చెరసాలలబైట వేలకొలది సామాన్యజనులు మూగి 'ప్రజాస్వామ్యము వర్ధిల్లుగాక', 'విద్యార్థు లకు జయమగు గాక' అని కేకలువేయసాగిరి.

ఈ ఆందోళనము వర్తకులలో వ్యాపించెను. పికింగులోని వర్తకులు విద్యార్థులను వదలిపెట్టనిచో సమ్మెలు కట్టెదమని

తెలియపరచిరి. షాంఘైలో కూడ అల్లేచేసిరి. ఇందుకు ప్రభుత్వము భయపడి జూన్ 6 వ తేదీన చెరసాలల తలుపులన్నియు తెఱపించి విద్యార్థులను చెరసాలలనుంచి పొమ్మని చెప్పిరి. పోలీసు ఉద్యోగస్థులు క్షమాపణల నిచ్చిరి. మోటారు బస్సులలో విద్యార్థుల నెక్కించి తెచ్చి విడచిపెట్టిరి.

పికింగు పురవీథులగుండా నా దినమున పదివేలమంది విద్యార్థులు గొప్ప ఉత్సవమును గొనిపోయిరి. ప్రతిచోటను విద్యార్థుల గౌరవార్థము బ్యాండుమేళములు మ్రోగెను. దేశద్రోహులగు ముగ్గురు మంత్రులు రాజీనామాలనిచ్చిరి. ప్రభుత్వముయొక్క మంత్రివర్గము మారెను. పారిసులోనున్న చైనాదేశపు ప్రతినిధులు సంధి పత్రముమీద సంతకము చేయుటకు నిరాకరించిరి. అంత వరకు సంధి పత్రముమీద సంతకము చేయక తప్పదని గట్టిగ చెప్పుచున్న అధ్యక్షుడు ప్రజల అభిప్రాయమునకు లొంగి సంతకములు చేయవద్దని పారిస్‌లోని తన ప్రతినిధులకు తంతివార్త నిచ్చెను. "చైనా విద్యార్థులును, విద్యార్థినులును అంతర్జాతీయ వ్యవహారములో ఎట్టి జయమును తమ త్యాగములవల్ల తమ దేశమునకు సమకూర్చిరో అది నిరుపమానమైన"దని జాన్‌డ్యూయి పండితుడు వ్రాసెను. ఈ అఖండ జయమువలన యువజనోద్యమమునందు ప్రజలకు గొప్ప విశ్వాసము కలిగినది. అప్పటినుండియు యువజనోద్యమము విశేషముగ వ్యాపించి వారి కార్యక్రమము చాలగ విస్తరించెను. యువజన సంఘములు దేశములోని వివిధ ప్రాంతములలోను స్థాపింపబడి చక్కగ పనిచేసెను. అటుపిమ్మట షాంటంగు రాష్ట్రమును మరల రాబట్టుకొనుటకు చైనా దేశ

మంతటను 1919 సంవత్సరము మొదలు 1921 వ సంవత్సరము వరకు జరిగిన జపాను సరకుల బహిష్కారము నందేమి, అటు తరువాత 1925 మొదలు 1927 వరకు జరిగిన ఆంగ్లేయ సరకుల బహిష్కారము నందేమి, మరల మంచూరియా ఆక్రమణ సందర్భమున 1931 మొదలు 1933 వరకు జరిగిన జపాను సరకుల బహిష్కారము నందేమి చైనా యువజనులు అత్యంత తీవ్రముగ ప్రబోధము గావించి యా బహిష్కారముల కఖండ విజయమును సమకూర్చినారు. వేలకొలది యువకులును, యువతులును సణ్యటుసేనుయొక్క పటములను చేతులలో గైకొని ప్రతి పట్టణములోను పల్లెలోను గృహములవెంట వెళ్లి ప్రజలలో బహిష్కార ప్రబోధములను గావించుచుండుట చైనాలో చూడదగిన దృశ్యమైయుండెను. ఈ యువజనులకు ప్రతిచోటను వర్తకులును, స్త్రీలును, రైతులును, కార్మికులును చాలగ తోడ్పడి యున్నారు.

## 4

చైనా విద్యార్థులొనరించుటకు పూనుకొనిన ముఖ్యమైన మహాత్కార్యము ప్రజా ప్రబోధమై యున్నది. విద్యాలయములు తెరచియున్న దినములలో విద్యార్థులు విద్యాలయములకు సమీపముననున్న ప్రదేశములలోని సామాన్యజనుల కుపన్యాసముల నిచ్చిరి. వేసంగి సెలవులలో పట్టణములకును పల్లెలకును పోయి యుపన్యాసముల నిచ్చిరి. తరుచుగ స్వదేశీ సరుకులను వెంటగొనిపోయి ప్రజలకమ్మి వారిలో స్వదేశీయాభిమానము కలుగజేయుచుండిరి. ఒక్కొక్క

ప్రజా ప్రబోధము

పుడు సంగీతములోగూడ నుపన్యసించిరి. ఈ యుపన్యాసములలో రాజకీయ సాంఘిక విషయముల గూర్చియు దేశ పరిస్థితులను గూర్చియు చెప్పుటయేగాక ఆరోగ్యము, శరీర శాస్త్రము ప్రకృతి శాస్త్రము మొదలగు విషయములను గూడ బోధించిరి. ప్రతిచోటను సామాన్య జనులకొరకు పాఠశాలలను స్థాపించి అజ్ఞానమును పోద్రోలుటకు విద్యార్థులు చాలగ కృషిసల్పిరి. 1922 వ సంవత్సరమున చైనా దేశములోని కోట్లకొలది జనులలో వ్యాపించియున్న అజ్ఞానమును పోద్రోలి నూటికి నూరుమందికిని అక్షరజ్ఞానము కలుగచేయవలె' నను మహాప్రయత్నమును

ప్రజలలో చదువురాని వారుండగూడదు

చాంగ్షాజిల్లా విద్యార్థి సంఘమువారు ప్రారంభించిరి. ఇందునుగూర్చి జిల్లా యందంతటను ఉత్సవములను సభలను జరిపిరి. ('చదువురాని వాడు గ్రుడ్డివాడు.' 'నీ కుమారుడు గ్రుడ్డివాడా?' చదువురాని జాతి బలహీనమైన జాతి.' 'చైనాయొక్క మోక్షము ప్రజలలో విద్యా వ్యాపకము చేయుటలో నున్నది.) 'చైనాలో ముప్పాతిక భాగము అంధకారమునందుండగ సహించి యూరుకొనగలవా?' అను మొదలయిన ప్రబోధ వాక్యములను పతాకములమీదను గోడలమీదను లాంతరు స్తంభములమీదను వ్రాసిరి. వందలకొలది విద్యార్థులు జిల్లాలోని పట్టణములకును, పల్లెలకునుపోయి, 1922 వ సంవత్సరము మార్చినెల మొదలు జులై నెల వరకును అయిదు నెలలు వేలకొలది జనులకు ప్రాథమిక విద్యను నేర్పిరి. ఇటులనే ఛీఫోజిల్లాలోని విద్యార్థి సంఘమువారును విద్యను వ్యాపింప జేసిరి. యువతులు గృహములలోని స్త్రీలకు విద్య నేర్పుటకు

పూనుకొనిరి. ఈ రెండు జిల్లాలలోను జరిగిన పనియొక్క ఫలితములవలన నీ యజ్ఞానమును పారద్రోలు మహోద్యమము దేశముయొక్క పెక్కు ప్రాంతములలో కార్చిచ్చువలె వ్యాపించెను. విద్యా వ్యాపకమునందు ప్రజలలోను ప్రభుత్వమునందును శ్రద్ధ చాలగ హెచ్చెను. 1910 వ సంవత్సరమున చైనా దేశములో నూటికిఒకరు చొప్పున చదువు వచ్చిన వారుండగ, 1928 వ సంవత్సరమునకు నూటికి చాలరాష్ట్రములలో పదిహేనుమంది చొప్పునను కొన్ని రాష్ట్రములలో ఏబదిమంది చొప్పునను చదువు వచ్చిన వారుండిరి. చైనా జాతీయప్రభుత్వము బలపడినకొలదియు ప్రజలలో విద్యాభివృద్ధి యింకను పెంపుగాంచుచుండెను.

స్త్రీల యుద్యమము

విద్యార్థినులగు యువతుల కృషివలన చైనాలో స్త్రీల యుద్యమము బయలుదేరి వృద్ధిచెందినది. 1922 వ సంవత్సర వేసవి కాలమున ప్రభుత్వ న్యాయశాస్త్ర కళాశాల యొక్కయు ఉపాధ్యాయినుల కళాశాల యొక్కయు విద్యార్థినులు పికింగు నగరమున స్త్రీల స్వతంత్ర సంఘము నొకదానిని, స్త్రీల హక్కుల సంఘమను పేరున మరియొక సంఘమును స్థాపించిరి. (1) అన్ని విద్యాలయములలోను స్త్రీలను చేర్చుకొనవలెను. (2) స్త్రీలకు పురుషులతో సమానముగ రాజకీయ విషయములందును ఉద్యోగములందును హక్కులుండవలెను. (3) వివాహము, వివాహ విచ్ఛేదము, ఆస్తి సంక్రమణము, వారసత్వము, మైనరుల సంరక్షకత్వము మొదలగు వాటిలో స్త్రీలకు పురుషులతో సమానముగ హక్కు బాధ్యతలను కలుగచేయు చట్టములు కావలెను. (4) స్త్రీలు తమ పాదములను

కట్లుకట్టుకొని సన్నగచేయు ఆచారమును మానవలెను. (5) చిన్న పిల్లల వివాహములు నిషేధింపబడెను. (6) భార్య యుండగ పురుషులు రెండవమారు వివాహ మాడుటగాని ఉంపుడు కత్తెలను పెట్టుకొనుటగాని కూడదు. (7) సమిష్టి కుటుంబములు విచ్ఛిన్నము కావలెను. (8) కార్మికులలో స్త్రీలకు పురుషులతో సమానముగ వేతనములు, మజూరీలు యివ్వవలెను. గర్భిణీస్త్రీలకు మజూరీ నష్టములేకుండ సెలవు లివ్వవలెను; ఈ మొదలగునవి యీ సంఘముల సిద్ధాంతములు. అటుపిమ్మట ననేకచోట్ల ననేక స్త్రీ సమాజము లేర్పడి స్త్రీల యుద్యమము చాలగ వృద్ధిచెందినది. అన్ని వృత్తులలోను, ఉద్యోగములలోను స్త్రీలు వేలకొలదిగ ప్రవేశించినారు. స్త్రీలు ప్రాత ఆచారముల నతిక్రమించి పురుషులతో బాటు అన్ని విషయములలోను ముందుకు వచ్చి దేశము యొక్క బహిరంగజీవితమునందు స్వేచ్ఛగ పాల్గొనసాగిరి. స్త్రీల ఆందోళనాఫలితముగ 1932 వ సంవత్సరమున జాతీయప్రభుత్వము వారు బహు భార్యాత్వమును అనగ పురుషులు ఒకరికంటె నెక్కువ మంది స్త్రీలను వివాహ మాడుటను నిషేధించియున్నారు. ఆస్తి సంక్రమణయందు స్త్రీలకు పురుషులతో సమానమగు హక్కులను కలుగజేయుచు శాసనములను గావించియున్నారు.

## 5

చైనా విద్యార్థులు కార్మికులలో పనిచేసి అనేకములగు కార్మికసంఘములను నిర్మాణము గావించి గొప్ప కార్మికోద్యమమును కూడ స్థాపించిరి. కార్మికులలో బాగుగ దేశాభిమానము

కలిగి జాతీయ స్వతంత్రోద్యమమునకు వారు పునాదిగ నేర్పడిరి.

కార్మికోద్యమము

1919 వ సంవత్సరమున జపాను షాహుకార్ల హానేపింగు యినుప పనులలోను, 1920 వ సంవత్సరమున హాంగ్‌కాంగులోని ఆంగ్లేయుల నౌకా నిర్మాణ శాలలోను కార్మికులు సమ్మెలుగట్టి యధిక వేతనములను పొంద గలిగిరి. 1922 వ సంవత్సరమున హాంగ్‌కాంగు లోని ఆంగ్లేయ స్టీమర్లలో పనిచేయు కార్మికులు యేబదియారు దినములు సమ్మె కట్టిరి. ఆంగ్లేయులు సమ్మెదార్లపై తుపాకులను కాల్చి చంపుట వలన విద్యార్థుల సహాయముచే ఆంగ్లేయులపై సమ్మె అన్ని చోట్లను వ్యాపించి రెండులక్షల మంది కార్మికులు ఆంగ్లేయులకు వ్యతిరేకముగ సమ్మెలో చేరిరి. ఆంగ్లేయ షాహుకార్లు లొంగి సమ్మెదార్లు కోరినవాటినెల్ల నిచ్చి రాజీనామావడిరి. కాన్‌టనులో స్థాపితమైన జాతీయ ప్రభుత్వము కార్మికసంఘముల స్థాపనమునకు ప్రోత్సాహము కలుగచేసెను. కాని పికింగులోని సైనిక నాయకులు విదేశ షాహుకార్లతోను స్వదేశ పారిశ్రామికులతోను లాలూచీపడి 1922 మొదలు 1925 వరకును కార్మికోద్యమమును నిర్బంధములచే నణచివైచిరి. కార్మికులు సమ్మెలుకట్టినచో మరణ శిక్ష విధింతుమని పికింగు ప్రభుత్వము శాసనము చేసెను. కాని ఉత్తర చైనాలో కూడ కార్మికసంఘములు రహస్యముగ పని చేయుచుండెను. 1926 మొదలు 1928 వరకు దక్షిణమునుండి క్యూమిన్‌టాంగు జాతీయ సైన్యములు ఉత్తర రాష్ట్రములపై దండెత్తినప్పుడు ప్రతిచోటను కార్మికులు, రైతులు జాతీయ సైన్యములకు స్వాగతమిచ్చి వారి విజయమునకు తోడ్పడిరి.

ఉత్తరమున కూడ జాతీయప్రభుత్వ స్థాపనమైన కొలదియు మరల కార్మిక సంఘములకు స్వతంత్రముకలిగి కార్మికోద్యమము చైనా యందంతటను విజృంభించెను. ఈ మధ్య కాలమున కాన్టను నగరమున అఖిల చైనా కార్మిక మహాసభలు యేటేట జరుగుచుండెను.

1923 వ సంవత్సరమున కాన్టను నగరమున జరిగిన అఖిలచైనా కార్మిక మహాసభవారు కార్మికులు దినమునకు యెనిమిది గంటలకన్న పనిచేయగూడదనియు, కార్మికులకు సమ్మెలు కట్టు హక్కుండవలెననియు, సమ్మెలు కట్టు కార్మిక సంఘములకు ద్రవ్యసహాయము చేయవలెననియు తీర్మానించిరి.

అఖిల చైనా కార్మిక మహా సభలు

1925 వ సంవత్సరమున షాంఘాయిలో జరిగిన అఖిలచైనా విద్యార్థి మహాసభవారు కార్మిక సంఘముల నింకను నెక్కువగ స్థాపించి వారిలో నాత్మ గౌరవమును ఆత్మశక్తిని కలుగచేయవలెననియు, వారికి రాత్రి పాఠశాలల మూలమున విద్యను గరపవలె ననియు, వారిలో రాజకీయజ్ఞానము వ్యాపింపజేయవలెననియు, షాహుకార్ల నుండియు ప్రభుత్వమునుండియు సంరక్షణ పొందుటలో వారికి తోడ్పడవలెననియు, సమ్మెను గట్టినపుడు వారికి ద్రవ్యమును ప్రోగుచేసి యివ్వవలెననియు తీర్మానించిరి. 1925 మొదలు 1927 వరకును ఆంగ్లేయులపై జరిగిన గొప్ప బహిష్కారము నందు అఖిలచైనా కార్మికసంఘమువారు క్యూమిన్టాంగుతో కలసి పనిచేసి బహిష్కారముయొక్క జయమునకు మిగుల తోడ్పడిరి. ఆ బహిష్కారము వలన పదునారు నెలలు ప్రతిదినము

హాంగ్‌కాంగులోని యాంగ్లేయ వర్తకులకు యిరువది లక్షల డాలర్ల నష్టము కలిగెనని అంచనా వేయబడినది. దానితో నాంగ్లేయులు తమ ప్రతిష్ఠను విడిచిపెట్టి చైనా జాతీయ వాదులతో రాజీపడిరి. 1928 వ సంవత్సరమున చైనాకార్మిక సంఘములలో ముప్పది లక్షలమంది కార్మికులు చేరిరి. చైనా పారిశ్రామికులకును కార్మికులకును తగవులుకలిగినపుడు క్యూమిన్ టాంగు వారు రాజీగ పరిష్కరించుచుండిరి.

రైతుల యుద్యమము

కార్మికోద్యమముతోపాటు రైతుల యుద్యమము కూడ చైనాలో విద్యార్థులచే వ్యాపింపచేయబడి యున్నది. రైతులు, కార్మికులు, విద్యార్థులు కలసి పనిచేసి ప్రజా పాలనము స్థాపించవలసినదని సన్‌యటుసేను బోధించెను. జాతీయప్రభుత్వము అన్ని రాష్ట్రములలోను సైనిక నాయకుల నోడించి స్థాపితమగుటకు యీ మూడు తరగతుల వారును ముఖ్యముగ తోడ్పడియున్నారు. ఇంతేగాక క్యూమిన్ టాంగు పక్షపువారును సాముదాయవాదులునుకూడ జాతీయ స్వతంత్ర పోరాటమునకు తోడ్పడుటకుగాను 1923 వ సంవత్సర మునుండియు ముఖ్యముగ దక్షిణరాష్ట్రములలో రైతులసంఘము లను స్థాపించిరి. ప్రతియేట అఖిలచైనారైతు మహాసభలు జరుపబడు చుండెను. రైతు ఉద్యమము ప్రబలమై 1927 వ సంవత్సరము నాటికి రైతుసంఘములలో క్వాంగుటంగు రాష్ట్రములో ఎనిమిది లక్షల మందియు, హూనాన్‌రాష్ట్రములో 20 లక్షలమందియు, హూపె రాష్ట్రములో నైదులక్షల మందియు సభ్యులుండిరి. ఈ రైతు సంఘములలో పదునేడు యకరములకన్న తక్కువభూమి

గల రైతులనే చేర్చుకొనిరి. పీరే స్వంతభూములుగల రైతులలో నూటికి 64 వంతులు గలరు. స్వంతభూములు లేని కౌలుదార్లు కూడ నీ సంఘములలో చేరిరి. స్వతంత్రోద్యమము సాగుగవ్యాపించిన రాష్ట్రములలో భూఖామందులుండగూడ దనియు భూఖామందులయొక్కయు పెద్దరైతుల యొక్కయు భూములు వారికవసరమైనవి పోగమిగిలినది భూములులేనివారిలో పంపకము కావలెననియు తీర్మానములు బయలుదేరినవి. కొన్ని ప్రదేశములలో భూఖామందుల యొక్కయు పెద్దరైతులయొక్కయు భూములు బలవంతముగ లాగుకొనబడెను. దీనిని క్యూమిన్‌టాంగు ప్రభుత్వము ఆపివైచెను. బలవంతముగ గాక శాసనముల మూలము ననే భూముల సమస్య పరిష్కరించుట క్యూమిన్‌టాంగుయొక్క సిద్ధాంతము.

## 3

చైనాలో యువజనులు వ్యాపింపజేసిన మరియొక యుద్యమము స్వదేశీ యుద్యమము. అనాదినుండియు చైనా దేశము

**అనాది కాలమునుండియు గృహపరిశ్రమలు**

భరతవర్షమువలెనే వ్యవసాయమునకును గృహపరిశ్రమలకును ప్రసిద్ధిచెంది సిరిసంపదలతో తులదూగుచుండెను. చైనాలోని సమిష్టి కుటుంబములలో పురుషులు సేద్యము సేయుచుండగ స్త్రీలును, పిల్లలును నూలు వడుకుటను, నేతపనిని చేయుచుండిరి. వారి గృహమునకు కావలసిన బట్టలను వారే తయారుచేసుకొనుచు మిగిలిన వానిని గ్రామములలోని ఇతర అవుసరములకు మార్పిడి చేసికొనిరి. ఇటు

లనే పట్టునూలు తీయుట, పట్టు నేత నేయుట, కాగితములు తయారు చేయుట గృహ పరిశ్రమలుగా రైతుల యిండ్లలో ప్రబలియుండెను. పింగాణీ, లోహపుపాత్రలు, దంతపుపనులు, జరీ, తోలుపనులు, బొమ్మలు మొదలగు పనులుచేయు చేతిపని వాండ్రు గ్రామములలోను బస్తీలలోను నుండిరి. అవికూడ గృహ పరిశ్రమలుగనే నుండెను. వేరుగ పెట్టుబడిదార్లు లేరు. పనిచేయు వాడే పెట్టుబడిదారు. అతను అతని కుటుంబము కార్మికులు. అతని యిల్లు అంగడిగ నుండెను. అతను కష్టపడి తయారుచేసిన వస్తువు యొక్క ఫలితము పూర్తిగ నతను అతని కుటుంబము అనుభవించెను. పాశ్చాత్యులు చైనాలో ప్రవేశించిన 19 వ శతాబ్దము యొక్క మధ్యభాగమునుండియు పాశ్చాత్య దేశములలో యంత్రశాలల మూలమున తయారయ్యేటి సరుకులు చైనాలో దిగుమతియై వాటి పోటీవలన దేశీయ గృహపరిశ్రమలకు చాల వరకు క్షీణత కలిగెను. 1919 వ సంవత్సరమునుండియు విద్యార్థుల యుద్యమ మభివృద్ధి కాగనే స్వదేశ యుద్యమము చెలరేగెను. యువకులును క్వ్యామిన్‌టాంగు కక్షివారును స్వదేశికై ప్రత్యేకమగు కృషిని సలిపిరి. జాతీయ ప్రభుత్వము స్థాపితమైన కొలదియు స్వదేశ పరిశ్రమలు సత్వరముగ వృద్ధిని గాంచు చున్నవి. 1927 నుండి ఎగుమతి దిగుమతి సరుకులమీద ఇచ్చ వచ్చిన సుంకములను విధించు అధికారము జాతీయ ప్రభుత్వము పొందినది. (లికిన్) సాయరును జాతీయ ప్రభుత్వము పూర్తిగ రద్దు పరచినది. స్వదేశ పరిశ్రమకు రక్షణను నిచ్చుటకుగాను జాతీయ ప్రభుత్వము విదేశ సరుకులపై అవసరమైన సుంకములను

విధించినది. చైనాయొక్క నూలు, పట్టు, ఉన్ని పరిశ్రమలు వృద్ధిగాంచుచు విదేశ నూలును వస్త్రములను చైనాయొక్క అంగళ్ళలోనుంచి తరిమివేయసాగినవి. ముఖ్యముగ ఇంగ్లాండు లోని లంకాషైరు వర్తకులు చాలగ దెబ్బతినినారు. 1911 వ సంవత్సరమున చైనాలో 32 వస్త్రముల యంత్రశాలలుండగ, 1935 వ సంవత్సరములో 128 దూది వస్త్ర యంత్రశాల లుండెను. వాటిలో రెండు షాంఘాయిలో ఆంగ్లేయులవి. 41 జపానువారివి ముఖ్యముగ మంచూరియాలో నున్నవి. మిగత 85 యంత్రశాలలును చైనావారివై యున్నవి. ఇది గాక చైనావారివి 450 పట్టునూలు వడకు నేతనేయు యంత్ర శాలలు, పదునారు ఉన్ని వస్త్రముల యంత్రశాలలు ఏర్పడెను. ఇంతేగాక దూది పట్టు ఖద్దరును గ్రామములలో పునరుద్ధరించుట కును గ్రామ పునర్నిర్మాణమునకును గొప్ప యుద్యమము లేవదీయబడి బాగుగ పనిచేయసాగినది. చైనావారు దాదాపుగ 150 పెద్ద బ్యాంకిలను పెట్టుకొని యున్నారు. చైనా వర్తకులు ప్రతిచోటను వాణిజ్య సంఘముల నేర్పాటు చేసుకొన్నారు.

భావ స్వతంత్రమును కలిగి నాటకశాల, చిత్రలేఖనము, సంగీతము, శిల్పము మొదలగు వానిలోకూడ యువజనులు నూతన ఫక్కిలను త్రొక్కిరి. పాత ఆచారముల నిర్బంధముల నుండియు, మాంద్యము నుండియు చైనా జాతి విడివడినది. యువకులకు అద్భుత కార్యముల యందును, మహిమల యందును పితృ దేవతారాధనము నందును విశ్వాసము పోయి కన్‌ఫ్యూషియస్

నవ్యచైనా జాతీయ సౌధ నిర్మాణము, ఆదర్శములు

యొక్క నైతిక భావములను, బుద్ధునియొక్క సహేతుకమైన సిద్ధాంతములను వారు ఎక్కువగ ప్రేమించసాగిరి. పెక్కులగు బౌద్ధ యువజన సంఘములు స్థాపింపబడినవి. చైనాలోని క్రైస్తవులు కూడ విదేశ మతబోధకులనుండి స్వతంత్రముగ స్వదేశ క్రైస్తవ సమాజమును నిర్మాణము గావించుకొనినారు. తమ తోడి దేశీయులతో కలిసిమెలసి మాతృదేశ కళ్యాణమునకై పాటు పడ సాగినారు. రాజకీయ ఆర్థిక సాంఘిక విద్యా విషయములలో ననేకములగు మార్పులు యువజనులు ధైర్యముగ గావించు చున్నను పాశ్చాత్యుల ననుకరించవలెనను కోరిక వారికిలేదు. తమ ప్రాచీన నాగరికత పాశ్చాత్య నాగరికతకన్న ఉత్కృష్టమైనదను గర్వము వారు కలిగియుండిరి. తమ ఋషి పుంగవులయందును తత్త్వవేత్తల యందును వారికి అత్యంత గౌరవముండెను. పాశ్చాత్య పద్ధతులను అవలంబింపవలసి వచ్చినచో పూర్తియగు విమర్శన జరిగిన పిమ్మటనే వాటి నవలంబించిరి. సన్యాట్ సేన్ వారికి ఆదర్శము, ఆయన బోధలు వారికి పవిత్రమగు వేదము. చైనా నాగరికతయొక్క పునాదులు బలపరచబడి వాటిమీద నూతన జాతీయ సౌధము నిర్మాణము గావించబడ సాగినది. అమెరికా లోని యువజన సంఘములు పంపిన అభినందనములకు చైనా విద్యార్థి మహాసభ వారొసంగిన ప్రత్యుత్తరముతో నీ విషయ మును ముగించుచున్నాము. “మా ప్రాచీన ఋషిసత్తముడగు మెన్షియసు ప్రోక్తములగు నీ క్రింది సూత్రము ననుసరించి స్వతంత్రమునుకలిగినట్టియు, అంతర్జాతీయ వ్యవహారములలో ఆత్మ గౌరవ కరమగు స్థానమును పొంధినట్టియు నవ్యచైనా జాతిని

నిర్మాణము గావించు మహాకార్యమును సాధించుటకు మేము కృతనిశ్చయులమై యున్నాము.

పశు బలమునకు మేము భయపడము.

ధనముకొరకు మేము ఆశించము.

పేదరికమువల్ల నిరుత్సాహము చెందము." అని వ్రాసినాడు.

ఈ యువజనోద్యమము చైనా జాతిలో విప్లవమును కలుగచేసిన మహాశక్తి, చైనాలో ఇండియా రిపబ్లికు ప్రభుత్వ రాయబారిగా నున్న పాణిక్కరుగారు "1949 వరకు చైనా దేశములోని ప్రజాభిప్రాయమును విద్యావంతులగు యువకులు కళాశాలల పాఠశాలల ఆచార్యులు లాయర్లు విద్యార్థులు నడుపుచుండిరని వ్రాసినారు. చైనాలో విజ్ఞానవంతులు సైన్యాంగము రెండు గొప్ప శక్తులనియు. వీరుభయులు ఏ పక్షముననున్న దానికి జయము కలుగుననియు, అందరు చరిత్రకారులు వ్రాసియున్నారు. ఈ రెండు శక్తులు 1928 వరకు క్యూమింటాంగు పక్షమున నుండెను. వీరికి కావలసినది రెండు ముఖ్యమైన విషయములు. ఒకటి విదేశ దండయాత్రలనుండి, విదేశస్థుల యాజమాన్యమునుండి దేశమునకు విముక్తి. రెండవది ప్రజారాజ్యమును స్థాపించి జాతీయపితయైన సన్‌యటుసేను యొక్క సిద్ధాంతముల నమలుపర్చుట. ఈ రెండు విషయముల లోను క్యూమింటాంగును స్వాధీనపర్చుకొని అత్యహంకారముతో తుదివరకును సైనిక నియంతగా ప్రవర్తించిన చ్యాంగుకేషకు అత్యంతమైన లోపములు గావించెను. జపాను సామ్రాజ్యవాదులు

ప్రత్యక్షముగా చ్యాంగు కేషకు ఈ మహాశక్తి యొక్క సామర్థ్యమును బోధించెను

చైనాదేశముపై దండెత్తి ముక్కలు ముక్కలుగ స్వాధీన పర్చుకొనుచుండగ ప్రతిఘటనము చేయక చ్యాంగుకేషకు ఊరు కొనుటవల్ల విజ్ఞానవంతు లెదురుతిరిగిరి. సన్‌యటుసేను యొక్క (సాంఘుక తత్త్వమును) సోషలిజమును వదలిపెట్టి చ్యాంగుకేషకు పెద్ద భూఖామందులతోను ధనికులగు వర్తకులతోను చేరి భూసంస్కరణములను ప్రవేశపెట్టక, సేద్యగాండ్రగు రైతులను, కార్మికులను అణచుటవల్ల రైతాంగము చ్యాంగుకేషకుకు వ్యతి రేకమైనది. తుదివరకును ఏకపార్టి సైనిక నిరంకుశత్వమే అవలం బించి, ప్రజారాజ్యవిధానమును స్థాపించక, కమ్యూనిజమును అణచుటకై చ్యాంగుకేషకు అనుమాన గ్రస్తులందరి మీదను క్రూర నిర్బంధవిధానములను అతి విరివిగా అవలంబించుటకూడ ఆయనను విజ్ఞానవంతులకు విరోధిగ గావించినవి. ఈ కారణము లన్నిటివల్లను క్రమముగా ఈ ప్రజాశక్తులు క్యూమింటాంగును వదలిపెట్టి అన్ని విషయములలోను అతి మెళకువతో ప్రవర్తించిన కమ్యూనిస్టులతో చేరుటవల్ల కమ్యూనిస్టులు జయించి 1949 సంవ త్సరము అక్టోబరు మొదటితేదీన చైనా దేశముపైన కమ్యూనిస్టు రాజ్యము చైనా ప్రజల రిపబ్లికు పేర స్థాపించబడ్డది. ఆ కథ యంతయు రాబోవు అధ్యాయములలో వివరించెదము.

★

# చైనా విప్లవము

## ఏకాదశాధ్యాయము

## క్యూమింటాంగును ఎదుర్కొన్న దౌర్జన్య శక్తులు

### 1

1927 సంవత్సరము ఆగస్టు నెల 1 వ తేదీన నె 20 రు సైన్యము, హోలంగు, యేట్టింగు సేనానుల క్రింద నాన్‌చంగు వద్ద క్యూమింటాంగు ప్రభుత్వముపై తిరుగుబాటు గావించెను. వీరితో చాలమంది రైతులు, కార్మికులు చేరి మొత్తము ముప్పది వేలవరకు పెరిగెను. క్యూమింటాంగు - కమ్యూనిస్టు ఉమ్మడి రాజ్య సేనలలో కొంతమంది కమ్యూనిస్టు సేనానులు కమ్యూనిస్టు భావములు గల సైనికులు కూడ నుండిరి. నె. 20 రు సైన్యము ప్రభుత్వ సైన్యమే అయ్యుండెను. అది యిపుడు ప్రభుత్వముపై కమ్యూనిస్టు సేనానుల ఆజ్ఞల ప్రకారము తిరుగుబాటు గావించెను. కమ్యూనిస్టుల ఎఱ్ఱ పతాకముల సైన్య నిర్మాణమున కిదియే ప్రారంభము. ఆగస్టు నెల 7 వ తేదీన చైనా కమ్యూనిస్టు పార్టీ యొక్క స్థాయి సంఘము సమావేశమై, క్యూమింటాంగు, సామ్రాజ్యవాదుల కీలుబొమ్మ అయినదనియు, ప్రజా విప్లవమును సాగించుటకు అనర్హమైనదనియు, దానితో నెట్టి సహకారము సలుపక కమ్యూనిస్టు రాజ్య స్థాపనకై కమ్యూనిస్టులే ప్రత్యేకముగ

జాతీయ ప్రభుత్వముపై కమ్యూనిస్టుల తిరుగబాటుదా

విప్లవము సాగించవలసి యున్నదనియు తీర్మానించిరి. ఇంతటితో చైనాదేశముపై రాజ్యాధికారము కొరకు ఉభయ పక్షములకును తీవ్రమైన పోరాటము ప్రారంభమయ్యెను. ఈ కమ్యూనిస్టు సేనలు ప్రభుత్వ సైన్యములతో పోరాడి విజయమును గాంచి నాన్‌చంగును స్వాధీన పరచుకొని ఆగస్టు 5 వ తేదీన కాన్‌టన్ నగరమును స్వాధీనపరచుకొనుటకు బయలుదేరగ త్రోవలో ప్రభుత్వ సైన్యములు అడ్డగించినందున ఫ్యూకిను రాష్ట్రము గుండ క్వాంగుటంగు రాష్ట్రములో ప్రవేశించెను. అక్కడ ప్రభుత్వ సైన్యములు వీటిని ముట్టడించి యోడించెను. కమ్యూనిస్టు సైన్యములలో చాలమంది హతులైరి. ఇంకను రైతాంగము ఎక్కువగ కమ్యూనిస్టుసేనలకు తోడ్పడలేదు. అందువల్ల కమ్యూనిస్టు సేనలో కొంత భాగము హైఫెంగు లూఫెంగులకు పారి పోయి మిగత భాగము చూతే నాయకత్వము క్రింద దక్షిణ హ్యూనాన్‌లో చేరెను. ఆ కాలమునందే కమ్యూనిస్టులు దేశము లోని కొన్ని భాగములలో చిన్న రైతులచేతను భూములు లేని వ్యవసాయ కూలీలచేతను తిరుగుబాట్లు చేయించి భూఖామందుల నుండి పెద్ద రయితులనుండి బలాత్కారముగా భూములను లాగుకొని పంచుకొనునటుల గావించిరి, ఇందువల్ల కమ్యూనిస్టు పార్టి బలము హెచ్చెను.

హ్యూనాన్ కియాంగ్సి రాష్ట్రములమధ్య తమతో చేరిన కొంత ప్రభుత్వ సైన్యమును, గనుల పనివాండ్రను, రైతులను, కార్మికులను కలిపి మావొసిటంగు ఒక ఎర్ర సైన్యమును తయారు చేసి గొప్ప తిరుగుబాటును లేవదీయగ, దానిని ప్రభుత్వ సైన్య

ములు ఓడించెను. అందుమీద అక్టోబరు నెలలో మావొసిటంగు మిగత ఎఱ్ఱ సైన్యములను తీసుకొని కియాంగ్సి హ్యూనాన్ రాష్ట్రముల మధ్యనున్న చింగుకాంగు షాన్ కొండలలో ప్రవేశించి అచట నొక సోవియటు జిల్లాను కమ్యూనిస్టు రాజ్యమును స్థాపించెను. అదియే మొదటి కమ్యూనిస్టు రాజ్యము. అప్పటికాయనవద్ద ఒక

చింగుకాంగు షాన్ కొండలలో ప్రవేశము

వెయ్యిమంది కన్న విప్లవసైన్యము లేనప్పటికిని ఆ చుట్టునున్న ప్రాంతములోని రైతుల నందరిని నయముననో భయముననో కలుపుకొని తనను ముట్టడించుటకు వచ్చిన ప్రభుత్వ సైన్యములను ఓడించి వెళ్ళగొట్టుచు వచ్చెను. ఆ కొండలమీద కమ్యూనిస్టు ఎఱ్ఱజండా ఎగురవేయబడెను. డిశంబరు 11 వ తేదీన కాన్టన్ నగరమున కమ్యూనిస్టులు స్వతంత్ర ప్రభుత్వమును స్థాపించినటుల ప్రకటించిరి. కొంత సైన్యమును తెచ్చి ఆ పట్టణమును స్వాధీన పర్చుకొనిరి. 1928 జనవరి నెల 12,13 తేదీలలో ప్రభుత్వ సేనలు వచ్చి కమ్యూనిస్టు సేనలనోడించి ఆ నగరమును మరల స్వాధీనము పొందెను. అప్పటి కా నగరములోని కార్మికులు కమ్యూనిస్టులతో చేరలేదు. 1928 ప్రారంభమున చూటె సేనాని దక్షిణ హ్యూన్‌లో తిరుగబాటును లేవదీసి ప్రభుత్వ సేనలచే యోడించబడి త్రోవలో కొంతమంది రైతాంగమును తన సేనలలో చేర్చుకొని 1928 మే నెలలో చింగుకాంగు షాన్ కొండలలోనున్న మావొసిటంగుతో చేరెను. వారుభయులును నాలుగవ నెంబరు విప్లవ ఎఱ్ఱసైన్యమును నూతన పద్ధతులమీద నిర్మాణము గావించిరి. ఈ సైన్యము విప్లవ భావములుగల రైతులతోను కార్మికులతోను నిండి

యుండెను. ఈ సైనికులకందరికిని విప్లవ రాజకీయ విజ్ఞానమును కలుగజేసిరి. అందువల్ల విప్లవ జయమునకై ఎట్టి త్యాగములకైన సిద్ధపడిరి. చుట్టుపట్టు ప్రజలకుకూడ విప్లవ తృష్ణనుకలుగచేసి తమతో చేర్చుకొనిరి. గోరిల్లా పద్ధతులను అవలంబించిరి. చ్యాంగు కేషకు పంపిన సేనలన్నిటిని ఓడించిరి. ఆకస్మికముగా మీదపడి ఘాతుక కృత్యములు గావించి పారిపోయి దాగుకొనుచుండుట గోరిల్లా పద్ధతియని పిలువబడును. దీనిలో చైనా కమ్యూనిస్టులు నిపుణులుగ తయారైనారు.

1929 సెప్టెంబరు నాటికి పెంగుతేహ్యాయి మొదలగు నాయకులు హ్యూనాన్-హ్యూపే-కియాంగ్సి రాష్ట్రముల సరిహద్దులలో నొక కమ్యూనిస్టు రాజ్యమును స్థాపించిరి. డిశంబరు నాటికి వారి సైన్యములు కూడ చింగుకాంగుషాన్ కొండలలో తయారు చేయబడిన విప్లవ సైన్యమును చేరెను. ఈ సైన్యములన్నియు దక్షిణ కియాంగ్సిలోను, పశ్చిమ ఫ్యూకిన్‌లోను జొరబడి అచటి రైతాంగమును కలుపుకొని రెండు కమ్యూనిస్టు రాజ్యములను స్థాపించెను. ఈ చుట్టుపట్టు రాష్ట్రములలో మరికొన్ని చోట్లకూడ కమ్యూనిస్టు రాజ్యములు స్థాపించబడెను. అటుల 1930 సంవత్సరాంతమునకు మొత్తము పదిహేను సోవియటు జిల్లాలు కమ్యూనిస్టు రాజ్యములు స్థాపింపబడెను. అరువది వేలమంది సైనికులుగల ఎఱ్ఱసేనలు తయారయ్యెను. చింగుకాంగు షాన్ కొండలలో నదివరకు స్థావరమేర్పరచుకొనియున్న ఇద్దరు పేరుమ్రోగిన బందిపోటు నాయకులు తమతో చేరి కొంతకాలము తమకు మద్దతు గావించిరనియు

సోవియటు జిల్లాలు

పిమ్మట వారిని తమపార్టీవారే హత్య గావించిరనియు, మావోసిటుంగు "చైనామీద ఎఱ్ఱనక్షత్ర"మను గ్రంథకర్తయగు ఎడ్గారు స్నోతో చెప్పినాడు. ఈ బందిపోటు నాయకుల క్రింద నున్న గుంపులను కలుపుకొని చుట్టుపట్టు ప్రాంతముల ప్రజలపై బందిపోట్లు హత్యలు, చిత్రవధలు, గృహదహనములు గావించి విశేష సొమ్మును సంపాదించి కమ్యూనిస్టులు ఆ ప్రాంత ప్రజలలో అత్యంత భీత్యావహమును కలుగచేసి ఆ ప్రాంతములన్నిటిని తమ క్రింద చేర్చుకొనిరని చ్యాంగుకేషకు తన "చైనాలో సోవియటు రుష్యా"అను గ్రంథములో వ్రాసియున్నాడు. ఆ రాజ్యమంతయు తమక్రిందకు వచ్చినపిమ్మట, ఆ బందిపోటు నాయకులతో పని అయిపోయినందున కమ్యూనిస్టులు వారినిద్దరిని మరికొంతమంది వారి అనుచరులను చంపివేసిరి.

అప్పటినుంచి కమ్యూనిస్టులు తమక్రిందకు వచ్చిన ప్రాంతములలో చిన్న రైతులను, వ్యవసాయకూలీలను అందరిని తమ పార్టీలో చేర్చుకొని వారిచేత పెద్ద రైతులమీదను, భూఖామందుల మీదను దండయాత్రలు చేయించి వారిలో కొందరిని ఘోర హత్యలు గావించి మరికొందరిని వెళ్ళగొట్టి వారి భూములన్నిటిని బలవంతముగ లాగుకొని పంచుకొనునట్లు గావించిరి. రైతుకూలీ రాజ్యమును స్థాపించిరి. ప్రజల ఎన్నికలు పెట్టి పంచాయితీల నేర్పరచిరి. చిన్నరైతుల, వ్యవసాయ కూలీల చిన్న పారిశ్రామికుల ఋణములన్నియు రద్దుపరచి పన్నులను తేలికగావించి వారి సహాయముతో తమ రాజ్యములను బలపర్చుకొనిరి. తమ సేనలలో వీరినంద

*చైనాలో కమ్యూనిస్టు విప్లవము చిన్న రైతులంది*

రిని విరివిగ చేర్చుకొని క్రమశిక్షణమునిచ్చి విప్లవవీరులుగ తయారు చేసిరి. చాలకాలమునుండి చైనా దేశములో భూస్వామందుల, పెద్దరైతుల యాజమాన్యము విశేషముగ ప్రబలియుండెను. వ్యవసాయభూమిలో చాల భాగము వ్యవసాయము చేయక ఇతర చోట్ల సైనిక లేక ప్రభుత్వ ఉద్యోగములు చేయుచుండిన భూస్వామందుల క్రిందకు చేరెను. వీరి క్రింద వ్యవసాయము చేయు రైతులయొక్కయు, వ్యవసాయ కూలీల యొక్కయు స్థితి క్రమముగ నతి దుర్భరమయ్యెను. ఈ వ్యవసాయకులును, కూలీలును, చిన్న పారిశ్రామికులును కమ్యూనిస్టులను తమకు రక్షకులుగ నెంచిరి. సన్యటుసేనుయొక్క సాంఘిక సిద్ధాంతములలో భూస్వామందు పద్ధతిని, పెద్దరైతుల యునికిని సాంతముగ చట్టములద్వారా రద్దుపరచి భూ సంస్కరణములను సాగించుట అవసరమని చెప్పబడినప్పటికి, చ్యాంగుకేషకు భూస్వామందుల పక్షమునను, పెద్దరైతుల పక్షమునను చేరి భూ సంస్కరణములను ప్రవేశపెట్టక అత్యంత సంఖ్యాకులుగ నున్న వ్యవసాయకుల యొక్క, కూలీలయొక్క, చిన్న పారిశ్రామికుల యొక్క సానుభూతిని కోల్పోయినాడు. చైనాలోని కమ్యూనిస్టులు తమ విప్లవమునకు పట్టణములలో నున్న యంత్రశాలల కూలీల మీద ఆధారపడలేదు. పట్టణములన్నియు క్యూమింటాంగు పక్షముననే యుండెను. పారిశ్రామిక కార్మికులలో కొంతమంది మాత్రమే కమ్యూనిస్టులలో చేరిరి. అటులనే విద్యార్థులలోను, విద్యాధికులలోను కొలదిమంది మాత్రమే కమ్యూనిస్టు సంఘములలో చేరిరి. కారల్ మార్క్సు యొక్క సిద్ధాంతప్రకారము

పట్టణములలో యంత్రశాలలలో పనిచేయుచున్న కార్మికులే కమ్యూనిస్టు విప్లవమునకు పునాదియని చెప్పబడినను, రష్యా విప్లవములో అటులనే జరిగినను, చైనాలో మాత్రము మావోసిటుంగు, చౌ ఎన్ లే; చూతే మొదలగు కమ్యూనిస్టు నాయకులు అచ్చటి పరిస్థితులనుబట్టి తమ యొక్క విప్లవమును పల్లెలలోని చిన్నరైతులమీదను, వ్యవసాయకూలీల మీదను చిన్న పారిశ్రామికుల మీదను ఆధారపరచుకొనియే సాగించి జయమును పొందినారు. వీరందరును మరల క్యూమింటాంగు రాజ్యము వచ్చినట్లయిన తాము సంపాదించుకొన్న భూములు పోవుననియు, భూఖామందుల యాజమాన్యము మరల వచ్చుననియుభయముతో తుదివరకును కమ్యూనిస్టుల పక్షముననే యుండి వారికి సంపూర్ణ మద్దత్తును గావించినారు.

క్యూమింటాంగు ప్రభుత్వము కమ్యూనిస్టులను బందిపోటు గాండ్రని కమ్యూనిజములో చేరినవారికి మరణ శిక్ష విధింతుమని ప్రకటించినది. 1930సంవత్సరాంతమున కమ్యూనిస్టులను నాశనము చేయుటకై ఒక లక్ష సైన్యమును వారిపైకి పంపినది. అప్పటికి మావోసిటుంగ్ వద్ద నలుబదివేల సైన్యము మాత్రమే యుండెను. అయినప్పటికి అవి క్యూమింటాంగుసైన్యముల ముందరతాము పారిపోవుచున్నట్లు నటించి ఆ సైన్యములను తమ రాజ్యములోనికి రానిచ్చి నాంగ్టూా, కియాంగ్సిలవద్ద వాటిమీద ఆకస్మికముగ పడి ప్రభుత్వ సైన్యముల నోడించి తరిమివైచెను. 1931 వ సంవత్సరము ఫిబ్రేవరి నెలలో కమ్యూనిస్టుల కేంద్ర స్థానమును చుట్టు

చ్యాంగుకేషకు కమ్యూనిస్టులపై జరిపిన దండయాత్రలు అపజయమును పొందినవి

ముట్టి నాశనముచేయుటకు క్యూమింటాంగు ప్రభుత్వము రెండు లక్షల సైన్యమును రెండవ పర్యాయము పంపెను. మే నెలలో కియాంగ్సి, ఫ్యూకిన్ రాష్ట్రములవద్ద ఎర్ర సైన్యములు వారితో పోరాడి ఓడించి తరుమగొట్టెను. కాని ఈ పోరాటములో ఎర్ర సైన్యములలో చాలమంది మరణించి ముప్పదివేల సైన్యముల వరకు తగ్గెను. మరల ఆ సంవత్సరము జూలై నెలలోనే చ్యాంగ్ కేషకు స్వయముగ బ్రిటిషు, జపాను, జర్మన్ సైనిక సలహాదారుల సహాయముతో మూడు లక్షల సైన్యమును తీసుకొని కమ్యూనిస్టులపైకి దాడి వెడలెను. కమ్యూనిస్టు సేనలు అనేక విధములైన మాయోపాయములను జరిపి తుదకు మూడు పెద్ద యుద్ధములలో ప్రభుత్వ సైన్యముల నోడించి ముప్పది వేలమంది ప్రభుత్వ సైనికులను హతమార్చెను. దానితో మిగిలిన ప్రభుత్వ సైన్యములు చెల్లాచెదరై పోయెను. ఈ మూడు దండయాత్రల లోను కమ్యూనిస్టు సైన్యములు ప్రభుత్వ సైన్యముల మీద గొప్ప విజయములను పొందెను. ప్రభుత్వ సైన్యములు తమ మీదికి వచ్చినప్పుడు తాము పోరాడకుండ వెనుకకు తరలిపోవుట, ప్రభుత్వ సైన్యములను తమకు బలముగానున్న ప్రాంతములలోకి రానిచ్చి అనేక శాఖలుగ చీలి వాటిని చుట్టుముట్టి యోడించుట, ప్రభుత్వ సైన్యములు ఆగియున్నప్పుడు వాటిపై తటాలునపడి నాశనముచేయుట, తమ గోరిల్లాల ఆకస్మిక నాశనకృత్యములు, ప్రభుత్వ సైన్యములు పారిపోవునపుడు వెంటపడి తరుమగొట్టుట, కమ్యూనిస్టు సేనలు జరిపిన సైనికోపాయములు. ఇవి వారికి జయమును సమకూర్చుటకు తోడ్పడెను.

## 2

## జపాను దండయాత్రలు

చైనా జాతీయ ప్రభుత్వము బలపడక మునుపే మంచూరియా నాక్రమించుటకును, చైనా దేశముపై సంరక్షకత్వమును స్థాపించుటకును జపాను రాజకీయ వాదులు నిశ్చయించిరి. మంచూరియాలో ఏదో సాకున కలహములను సాగించుచు వచ్చిరి. అచటనున్న చైనా అధికారులు బలహీనులుగ నుండిరి. అంతేగాక చైనా జాతీయ ప్రభుత్వముపై తిరుగుబాట్లు గావించి వారిసేనల నోడించుచు కమ్యూనిస్టులు జాతీయ ప్రభుత్వమును మిగుల బలహీనపర్చుటగూడ జపానువారికి చైనాపై దండయాత్రలు చేయుటకు మంచి అవకాశముగ నేర్పడెను. సామ్రాజ్యవాదుల దురాశ వలననే ప్రపంచములోకెల్ల పెద్దదయిన చైనాదేశము కమ్యూనిస్టుల పాలైనది. 1931 వ సంవత్సరము జూలై నెలాఖరున జపాను సేనానియగు నకమోరా అను నాయన ముగ్గురు అనుచరులతో పశ్చిమ మంచూరియా, తూర్పు మంగోలియాలలో ప్రయాణముచేయుచు నదృశ్యుడాయెను. ఆయన చైనావారి సైనిక రహస్యములను తెలుపు ఛాయా పటములను గైకొనుచుండెనని తేలినది.

జపాను మంచూరియా నాక్రమించసాగినది

ఆయనను, ఆయన యనుచరులను గూఢచారులని ఆకస్మికముగా చైనా సైనికులు కాల్చి చంపిరని జపాను ప్రభుత్వము నేరారోపణ వేసినది. ఇందును గూర్చియు, కొరియా

వారికిని, చైనా రైతులకును మధ్య జరిగిన అల్లరులను గూర్చియు, చైనా జాతీయ ప్రభుత్వము విచారణ సలుపు చుండగ, ఆ విచారణ పర్యవసానము కొరకు తాము వేచియుండ జాలమనియు, తాము కోరిన షరతులకెల్ల యొప్పుకొని వ్యవహారము పరిష్కారము కావించుకొననిచో తగు చర్యను తీసుకొనెదమనియు మంచూరియాలోని జపాను సైనికాధికారులు చైనా ప్రభుత్వపు గవర్నరు జనరలగు చ్యాంగుహ్యూసియలియాంగుకు తెలియజేసిరి. ఈ వివాదములను జెనీవాలోని అంతర్జాతీయ సమితివారికి తెలియజేసి వారి పరిష్కార ప్రకారము ఉభయులము నడచుకొనుటకు తాము సమ్మతించుచున్నామని చైనా ప్రతినిధి జపానువారికి ప్రత్యుత్తరమును పంపెను. అంతర్జాతీయ సమితిలో చైనా జపానులు రెండును అప్పటికి సభ్యులే. కాని జపాను అంతర్జాతీయ సమితియొక్క తీర్పు కొరకు వేచియుండక హాంజో సేనాని క్రింద నాలుగు పటాలములను, కొంత నావికాదళమును మంచూరియాకు పంపినది. జపాను సైనికులు తొందరపడినను తాము ఎదిరించవద్దని చైనా సైనికులకు, పోలీసులకు చైనాజాతీయ ప్రభుత్వ నాయకుడగు చ్యాంగ్ కేషకు ఉత్తరు విచ్చెను. జపాను సైన్యములు మంచూరియాలో దిగినవి. ఇట్టిస్థితిలో 1931 వ. సంవత్సరము సెప్టెంబరు నెల 18 వ తేదీ రాత్రి 10-30 గంటలకు మంచూరియా రాజధానియగు ముక్డన్ నగరమున జపానువారి రైలుమీద యొక బాంబుపడి, యొక రైలుబండి ఇంజనుకును యొక కొయ్యపెట్టెకును కొంచెముగ దెబ్బతగిలినది. ఆ బాంబు చైనావారు వేసిరని జపానువారి

కథ. ఏదో యొక కలహకారణమును కల్పించుటకు జపానువారే దానిని వేసుకొనిరని చైనావారి కథ. విచారించిన అమెరికా పత్రికల ప్రతినిధులు జపానువారికథను విశ్వసించుటలేదు. ఎట్లయిన నేమి యొక బాంబుపడినది. ఆ రాత్రి నుండియే జపాను సేనలను వెంటగొని హాంజో సేనాని ముక్డన్ నగరము నాక్రమించెను. చైనా జాతీయ ప్రభుత్వ గవర్నరు జనరలగు చ్యాంగు హూసు యలియాంగు ప్రతిఘటన నేమి సలుపక ముక్డన్ నగరమును వదలి దక్షిణమున నున్న చించూ పట్టణమునకు పోయెను. జపాను సేనలు మంచూరియాను ఆక్రమించసాగెను. సెప్టెంబరు 21 వ తేదీన జెనీవా నగరమున అంతర్జాతీయ సమితియొక్క కౌన్సిలు సమావేశమై యుండగ చైనా ప్రతినిధి ఈ విషయము లన్నిటిని గూర్చి ఫిర్యాదు చేసెను. ఈ వ్యవహారము చైనా జపానుల మధ్య రాయబారముల మూలమున పరిష్కారము కావలసినదే కాని అంతర్జాతీయ సమితికి సంబంధము లేదని జపాను ప్రతినిధి వాదించెను. సుహృద్భావముతో చైనా జపానులు మెలగవలెనని చెప్పి ఈ విషయము వాయిదా వేసి సెప్టెంబరు 30 వ తేదీన అంతర్జాతీయ సమితి కౌన్సిలు వారు సభ ముగించిరి. అప్పటికి అంతర్జాతీయ సమితిలో ఇంగ్లాండు, ఫ్రెంచి ప్రభుత్వములు ప్రధాన స్థాన మాక్రమించియుండెను. అమెరికా సభ్యరాలు గాకున్నను అమెరికాకు కూడ నందులో చాల పలుకుబడి యుండెను. వీరందరికి తమతో సాటి సామ్రాజ్యవాదియైె చైనా మీద పలుకుబడిలోను చైనాలోగల ప్రత్యేక హక్కులలోను

తమతో భాగస్వామియైన జపానునందు సానుభూతి మొగ
మాటము కలదనుటలో నాశ్చర్యముండదు.

ఈ లోపున జపాను సెప్టెంబరు 24 వ తేదీన చించూ
మొదలగు మూడు పట్టణములపైన బాంబులు వేసెను. అక్టోబరు
28 వ తేదీ వరకు జపాను సైన్యములు దక్షిణముగ 150 మైళ్ళ
దూరము నాక్రమించెను. మరల అక్టోబరు నెలలో అంతర్జాతీయ
సమితి యొక్క సమావేశము జరిగినది. దానికి
అమెరికా సభ్యరాలు కాకున్నను ప్రతినిధులను
పంపినది. వారు ఏకగ్రీవముగ అక్టోబరు 24 వ
తేదీన జపాను యొక్క చర్యను ఖండించి నవంబరు 16 వ తేదీ
లోపున జపాను సైన్యములు మంచూరియాను పూర్తిగ వదలి
పోవలెనని తీర్మానించిరి. జపాను వారు ఆ తీర్మానమును లక్ష్య
పెట్టలేదు. జపాను సైన్యములు నవంబరు 9 వ తేదీన చైనా
దేశములోని టీన్‌ట్సిన్ పట్టణముపైకి వచ్చెను. పిమ్మట మంచూరి
యాలో నుత్తరమున 370 మైళ్ళ వరకు వ్యాపించి, చించో
పట్టణమును పట్టుకొని చైనా ప్రభుత్వమును ఉత్తర దక్షిణ
మంచూరియాల నుంచి తరుమగొట్టి, జపానువారు యావత్తు
మంచూరియాను స్వాధీనపరచుకొనిరి. మంచూరియాయొక్క
ముఖ్య ప్రదేశములన్నిటిలో జపాను సైన్యము లుంచబడెను.
జపానుకు వ్యతిరేకముగ తలయెత్తెడి ప్రతివారిని బందిపోటు
దారుడని పేరుపెట్టి జపానువారు హింసించసాగిరి. క్యూమిం
టాంగు ప్రభుత్వము ప్రతిఘటనము సలుపక యూరుకున్నది.

జపాను మంచూరియా
ఆక్రమణమును
పూర్తిచేసినది

జపానుయొక్క మంచూరియా ఆక్రమణము చైనాజాతి అంతటిలో అఖండమైన సంచలనము కలుగచేసినది. 1931 వ సంవత్సరము సెప్టెంబరు ఆఖరునుండియు చైనాయొక్క ఒక కొననుండి మరియొక కొనవరకును జపాను సరకుల బహిష్కారము బహు తీవ్రముగ సాగినది. చైనా యువకులును, యువతులును సన్యాటు సేనయొక్క పటములను గైకొని వాడవాడలను, ఇల్లిల్లు తిరిగి జపానుయొక్క బహిష్కారమును బోధించిరి. 1931 వ సంవత్సరము డిశంబరు నెలవరకు చైనాకు జపాను సరకుల దిగుమతి నూటికి ఎనుబది పాళ్ళు తగ్గెనని జపానువారే ప్రకటించినారు. పిమ్మట దాదాపుగ పూర్తిగ తగ్గెను. చైనాలో వృద్ధియగుచున్న జపానువారియందు ద్వేషభావమును, జపాను సరకుల బహిష్కారమును అణచివేయవలెననియు, లేనిచో తగుచర్య తీసుకొనెదమనియు జపాను ప్రభుత్వము చైనా జాతీయ ప్రభుత్వమునకు తెలియజేసెను. అందుకు తాము బాధ్యులము కామనియు, జపానువారు మంచూరియాను ఆక్రమించుటయే కారణమనియు, జపానువారి మానప్రాణములను మాత్రము కాపాడుటకు తాము సిద్ధముగనే యున్నామనియు చైనా ప్రభుత్వము బదులుచెప్పెను.

చైనాలో జపాను సరకుల బహిష్కారము

అందుమీద 1932 వ సంవత్సరము జనవరి నెల 13 వ తేదీన చైనాలోని టీన్ట్సిన్ రేవు పట్టణమున 600 మంది జపాను నావికులు దిగిరి. అచట క్యూమింటాంగు సభవారి కార్యాలయమును జపానువారు

చాపే ముట్టడి

తగులబెట్టిరి. జనవరి నెల 28 వ తేదీన అర్ధరాత్రివేళ షాంఘాయి నగరములోని చైనావారు నివసించు భాగమగు చాపే పట్టణమును జపాను నౌకాదళాధిపతి యగు షియోాను ఆధిపత్యము క్రింద జపానుసైన్యము ముట్టడించెను. కాని అచ్చటనున్న చైనావారి 19 వ పటాలము జపానువారి సైన్యమును ముందుకు పోకుండ అడుగడుగునకును ప్రతిఘటించెను. ఇది చ్యాంగ్ కేషకు యొక్క ఉత్తర్వులు రాకుండగనే జరిగెను. చైనా సైన్యములు ప్రదర్శించిన శౌర్యము వర్ణనాతీతము. చైనాలోని ప్రతిచోటను యువకులు నాన్‌కింగులోని జాతీయ ప్రభుత్వము జపానునకు ప్రతిఘటనము చేయక అంతర్జాతీయ సమితిని నమ్ముకొని యూరకున్నందుకు సభలను, యూరేగింపులను జరిపిరి. మిగుల శౌర్యమునకు ప్రసిద్ధికెక్కిన 87, 88 నెంబరు సేనలును, కొన్ని ఆకాశ విమానములును నాన్‌కింగునుంచి చాపేకు 19 వ పటాల సహాయార్థము వచ్చెను. చాపేను, ఊసంగుటూను జపాను సేనలు 34 దినములు ముట్టడి జరిపెను. చైనాసైన్యములు అనన్యసామాన్యమగు శౌర్యముతో వాటిని కాపాడెను. మరణించిన సైనికులకు బదులు అనేకమంది యువకులు చైనా సైన్యములలో క్రొత్తగా చేరుచుండిరి. జపానువారును క్రొత్త సైన్యములను తెచ్చుచుండిరి. 34 దినములకు పిమ్మట జపాను నిరాశచేసుకొని ముట్టడిని మానివేసి తమ సైన్యములను చైనా నుండి మరలించెను.

1932 వ సంవత్సరము ఫిబ్రవరి నెల 18 వ తేదీన మంచూరియా దేశమునంతను మంచూకో యను పేరున జపాను ప్రభు

త్వము స్వతంత్ర దేశముగ ప్రకటించెను. దాని పాలనకై యొక కార్యనిర్వాహక వర్గమును స్థాపించి దానికి 1911 వ సంవత్సరమున రాజ్యభ్రష్టుడైన మంచూ చక్రవర్తియగు 26 సంవత్సరముల ఈడుగల హెన్రీపూయీని యావజ్జీవపు అధ్యక్షుడుగా గావించెను. జపాను ప్రభుత్వపు సలహాదారులును, ఉద్యోగస్థులును జపాను సైన్యములును మంచూకో నాక్రమించినవి.

ఫిబ్రవరి 23 వ తేదీ నుంచియే జపాను విజృంభించి చైనా దేశములోని జీహోలురాష్ట్రముపై దండెత్తినది. జీహోలురాష్ట్రము నంతను ఆక్రమించినది. ఏప్రిలు మొదటి తేదీనుండియు చైనా గోడకు దక్షిణముననున్న ల్వాఙనది ప్రాంతముపై జపాను సేనలు దండెత్తెను. ఏప్రిలు 30 వ తేదీన జపాను సైన్యములు చైనాలో జొరబడి చైనా దేశములోని పికింగు టీన్ట్సిన్ మొదలైన నగర రాజములను పట్టుకొనుటకు వచ్చుచుండిరి. ఆ ప్రాంతములోనున్న చైనా సైన్యములు అతి శౌర్యముతో జపాను సైన్యముల నెదుర్కొన్నవి. కాని చ్యాంగ్ కేషకు నుండి జపాను నెదిరించుటకు సేనలు రాలేదు. చైనా జాతీయ ప్రభుత్వము జపాను ప్రభుత్వముతో సరాసరి రాయబారములు జరిపి మే నెల 31 వ తేదీ టాంగ్ కూ వద్ద తాత్కాలిక సంధి చేసుకొనినది. ఈసంధివలన మంచూరియా దేశమును, జీహోలు రాష్ట్రమును చైనా వదలుకొనినది. చైనా గోడకును, పికింగు నగరమునకును మధ్యనున్న ప్రదేశమునుండి చైనా సైన్యములు తీసివేయబడినవి. ఆ ప్రదేశములో జపానుకనుకూలమైన ప్రభుత్వమును చైనా స్థాపించినది. జపాను ప్రభు

జీహోలు రాష్ట్రము నాక్రమించిరి

త్వమువారు తమ సంరక్షకత్వము క్రిందనే హెన్రీపూయీని మంచూరియా దేశమునకును జీహోలు రాష్ట్రమునకును మంచూకో యను పేరున చక్రవర్తిగ పట్టాభిషేకమును గావించి, ఆయనకు సాలుకు 57 లక్షల రూప్యముల నిచ్చునట్లుగ నిర్ణయించి, ఆయన యొక్క ప్రభుత్వమును నడుపు బాధ్యత, సంరక్షించు బాధ్యత జపాను ప్రభుత్వము వహించినది. జపాను తన సేనలను, పోలీసులను పెట్టి ఆయనను తనక్రింద కీలుబొమ్మవలె చేసుకొనినది. 1931 వ సంవత్సరము డిశంబరు నెల 10 వ తేదీన చైనా జపానుల మధ్య తగవులను గురించి విచారించి యొక నివేదికను సమర్పించుటకై ఐదుగురు సభ్యులు గల లిట్టన్ కమిషన్ అను నొక విచారణ కమిషన్‌ను అంతర్జాతీయ సమితి నియమించినది. ఆ కమిషన్ వారు విచారణ సలిపి 1932 వ సంవత్సరము అక్టోబరు 2 వ తేదీన మంచూరియాపైన చైనా ప్రజాస్వామికపు పాలనాధికారము నంగీకరించుచు, జపానుకు మంచూరియాలో గల హక్కులను చైనా ప్రభుత్వము కాపాడవలెనని కోరుచు, జపాను వారు మంచూరియాపైన ఏర్పరచిన మంచూకో ప్రభుత్వము అశాస్త్రీయమని అంగీకరించుచు, ఏకగ్రీవమైన రిపోర్టును వ్రాసిరి. ఆ రిపోర్టు 1933 వ సంవత్సరము ఫిబ్రేవరి నెలలో అంతర్జాతీయ సమితియొక్క సమావేశములో నేకగ్రీవముగ నంగీకరించబడినది. నూతన మంచూకో ప్రభుత్వము నెవరును నంగీకరించ కూడదని తీర్మానము గావించినది. అందుమీద జపానుకు కోపము వచ్చి అంతర్జాతీయ సమితి యొక్క సభ్యత్వమునకు రాజీనామా నిచ్చినది.

1934 వ సంవత్సరము డిశంబరు నెలలో జపానుయొక్క సామ్రాజ్యమును విస్తరింప చేయవలెనను తీవ్రవాదియగు జీరో మనామి సేనానిని మంచూకో దేశమున జపానుయొక్క ప్రతినిధిగ నియమించిరి. ఆయన మంచూకోలో జపాను యొక్క వర్తక ఆర్థిక లాభమును గట్టిగ బలపరచి విదేశీయులకు స్థానము లేకుండ చేసెను.

ఉత్తర చైనాలో జపాను యొక్క కీలుబొమ్మ ప్రభుత్వము

చైనాను వత్తిడిచేసి చైనాపై జపానుయొక్క ఋణమును, జపానుయొక్క సరకులను అంటకట్టి వెనుక సైనికనాయకులు చేసిన పాతఋణములను చైనానుండి వసూలు చేయవలెనని, చైనాను తమ సంరక్షకత్వము క్రిందికి తీసుకొనవలెనని, ఆయన సంకల్పించెను. 1935 వ సంవత్సరము జూన్ నెలలో పికింగు, టీన్ట్సిన్ ప్రదేశములనుండి చైనాయొక్క సైన్యములను తీసివేయవలెననియు, ఆ ప్రదేశములలో జపానుకు వ్యతిరేకులుగ నున్న ఉద్యోగస్థులనందరిని తీసివేసి జపాను కనుకూలురగు వారిని నియమించవలెననియు, ఉత్తర చైనాలోని క్యూమింటాంగు కార్యస్థానముల నన్నిటిని మూసివేయవలె ననియు, పాఠశాలలలో జపానుకు వ్యతిరేక భావమును కలుగచేయుచు గఱుపబడుచున్న విద్యను మానివేయవలెననియు, జపానుకు వ్యతిరేకముగ వ్రాయబడిన గ్రంథములను నాశనము చేయవలెననియు నాన్‌కింగు ప్రభుత్వమునకు జపాను అంత్య సందేశమిచ్చినది. ఈ షరతులను అంగీకరించవలెనా లేక జపానుతో యుద్ధము చేయవలెనాయని చైనా మంత్రివర్గమునందు దీర్ఘమగు చర్చ జరిగినది. తీవ్రమగు అభిప్రాయ భేదములు మంత్రులలో కలిగినవి. ఏమి చేయుటకును తోచక

అప్పుడు కమ్యూనిస్టులపై దండయాత్రలు సాగించుచున్న చ్యాంగ్ కేషకు యొక్క సలహానడిగిరి. ఆయన అంగీకరించ వలెనని యే సలహానిచ్చెను. ఈ షరతుల నమలుజరిపి పికింగు టీన్ట్సిన్ లకును చైనా గోడకును మధ్యనున్న యా ‘త్తు ప్రాంతములలో జపాను తన కిష్టమైన యుద్యోగస్థులను నియమింప చేసుకొనినది. అచట చైనాయొక్క పోలీసులు తప్ప సైనికులు లేరు. ఆ ప్రదేశ మంతయు దాదాపుగ జపాను యొక్క పలుకుబడి ప్రదేశమైనది. ఆ సంవత్సరము నవంబరు నెలలో జపాను సైనికాధికారులు ఉత్తరచైనా రాష్ట్రములగు హూపే, షాన్ సే, షాంటంగు రాష్ట్రములను, తూర్పు మంగోలియా రాష్ట్రమును, చాహార్, సూయు యన్ రాష్ట్రములను, ఈ ఆరు రాష్ట్రములను కలిపి తమతో చేరిన చైనా సేనానియగు జనరల్ ఇంగు-చు-కింగు యొక్క ఆధిపత్య మున నొక ప్రత్యేక సంయుక్త కీలుబొమ్మ ప్రభుత్వమును స్థాపించినారు. దానిని సంరక్షించు బాధ్యత జపాను సేనలది. చ్యాంగు కేషక్ జపాను నెదిరించుటకుమారుగ యూరుకొన్నాడు. నాన్కింగులో క్యూమింటాంగు యొక్క స్థాయీ సంఘ సమా వేశము జరిగిన సమయమున జపానుకు లొంగుచున్నారను కోప మున నొక చైనా పత్రికా ప్రతినిధి వాంగుచింగువైని, ఇంక నిద్దరు సభ్యులను తుపాకితో కాల్చెను. దెబ్బలు తగిలెను. కాని వాంగుచింగువై బ్రతికినాడు. మంత్రివర్గపు అధ్యక్షపదవికి, విదే శాంగ మంత్రిత్వమునకు రాజీనామా నిచ్చినాడు. ఆ రెండు పదవులను చ్యాంగ్ కేషకు స్వీకరించినాడు. విదేశ దండయాత్రలను సహించి యూరుకొని దేశములోని భాగములను విదేశస్థుల

యాక్రమణమున కొప్పుకున్న చ్యాంగుకేషక్ ప్రభుత్వము మీద దేశమంతటిలోను హేయభావము కలిగిన దనుట నిస్సంశయము. అటు కమ్యూనిస్టులతోను ఇటు జపానువారితోను ఏక కాలములో ధైర్యోత్సాహములతో అత్యంత త్యాగముతో చ్యాంగ్ కేషకు పోరాడినట్లయిన చైనా దేశమంతయు చ్యాంగుకేషకు వెనుక నిలవబడేది. క్యూమింటాంగు బలపడేది. రెండు రంగములలోను జయమును పొందేది. చైనాదేశములో జాతీయ ప్రజాప్రభుత్వము సుస్థిరముగా నేర్పడేది. కమ్యూనిస్టు రాజ్యము వచ్చేది కాదు. విదేశదండయాత్రల కొప్పుకొని దేశద్రోహము గావించి చ్యాంగు కేషకు ప్రభుత్వము తన కప్పటికి గల యుచ్ఛస్థితిలోనుండి దిగజారి పతనమైనది. చైనావిద్యార్థిబృందము "జపానును వెళ్లగొట్టవలసి నది, ఉత్తరచైనాలోని నూతన సంయుక్త ప్రభుత్వమును విచ్ఛి న్నము చేయవలసినది. జపానుపై యుద్ధముచేసి చైనాయొక్క గౌరవమును కాపాడవలసినది" అను ఆందోళనమును చైనాదేశ ములో బాగుగ సాగించినారు. అన్నిచోట్లను చ్యాంగ్ కేషకుప్రభు త్వము ఈ ఆందోళనము నణచుటకుగాను సైనికశాసనమును ప్రకటించినది. జపానువారును విద్యార్థుల అల్లరిని అణచివేయ వలసినదని నాన్‌కింగుప్రభుత్వమును కోరినారు. కాని విద్యార్థుల అల్లరి అణగలేదు. దేశమంతటను జపానును ధిక్కరించి ప్రతిఘ టించి యుద్ధము గావించవలసినదనుభావము బాగుగ ప్రబలినది.

జపానుప్రభుత్వము తాము ఆసియాఖండమును కమ్యూ నిజమునుండి రక్షించుటకు పూనుకున్నామనియు, ఆసియాఖండ మాసియావారిదేననియు, ఆసియాలోని దేశములమీద తాము

ఆసియాఖండముపై జపాను నాయకత్వము కోరినది

నాయకత్వము వహించెదమనియు, చైనాలోని క్యూమింటాంగు ప్రభుత్వము తమ సంరక్షకత్వము క్రిందకు వచ్చినచో కమ్యూనిజమును నాశనము గావించి చైనాప్రజల కళ్యాణమునకు సర్వతోముఖ అభివృద్ధికి తోడ్పడెదమనియు ఎప్పటికప్పుడు ప్రకటనలు గావించుచుండెను. తూర్పుఆసియాలోని దేశములన్నిటియొక్క పటములను తయార్చుచేసి మంచూరియా, మంగోలియా, కొరియా, సింకియాంగు, టిబెటు, చైనా, ఇండోనీషియా, ఇండోచైనా, సయాము, బర్మా, మలయా, సింగపూరుల పైన తమ సామ్రాజ్యమును స్థాపింతుమనియు, తూర్పు ఆసియాను పాశ్చాత్యులనుండియు, కమ్యూనిస్టులనుండియు స్వతంత్రముగ గావించి ఆసియాయొక్క నాగరికతను, విజ్ఞానమును, సిరిసంపదలను పునరుద్ధరించెదమనియు ప్రకటించసాగెను. జపానుయొక్క సంరక్షకత్వ మంగీకరించి కమ్యూనిజమును వెడలగొట్టుటయే యుక్తమను భావములు గల దేశద్రోహకరబృంద మొకటి క్యూమింటాంగులో వృద్ధిచెందసాగెను.

జపాను క్యూమింటాంగులోని కొందరికి లంచమిచ్చికూడ లోబర్చుకొనినది. జపాను ప్రపంచఅంగళ్ళలో ఇంగ్లాండుతో పోటీపడుచు ఇంగ్లాండుకు, అమెరికాకు వ్యతిరేకమై ఫాసిస్టుపద్ధతి నవలంబించి యూరపులో బలమగుచున్న జర్మనీ, ఇటలీలతో స్నేహభావములను వృద్ధిచేసికొనినది. చ్యాంగ్ కేషక్ తమను ప్రతిఘటించనప్పటికి తమతో పూర్తిగ కలసిరాలేదని, తమకు లోబడలేదని జపానువారు చ్యాంగ్ కేషక్‌ను ఇంకను వత్తిడి

చేయుటకై చైనాలో నింక నెక్కుడు దురాక్రమణలను జరిపిరి. కమ్యూనిస్టులతో కలిసి జపానుతో పోరాటము సలుపవలెనను బృందము మరియొకటి క్యూమింటాంగులో బలముగ నుండెను. చ్యాంగ్ కేషక్ మాత్రము ముందుగ కమ్యూనిస్టులను నాశనముచేసి పిమ్మట జపానును యోడించి వెడలగొట్టుదునని ప్రగల్భములు కొట్టుచుండెను. ఆయన క్యూమింటాంగు పార్టీలో తనకు వ్యతిరేకించిన వారిని అరెస్టులు జరిపి, దేశభ్రష్టులను గావించి, కొందరిని శిరచ్ఛేదము గావించెను. ఈ విధముగ ఆయన ఒక సైనిక నిరంకుశత్వమును స్థాపించెను. కాని అటు కమ్యూనిస్టుల చేతిలోను ఇటు జపాను చేతిలోను ఓడిపోవుటవలన ఆయన దేశములో పలుకుబడిని పోగొట్టుకొనెను. ఆయన క్రింది సేనలలో కొన్నికూడ ఆయనయందు గౌరవము లేనివారై యుండిరి. చైనా జాతీయ ప్రభుత్వము జపానుకు లోబడుచున్నదని, చైనా యొక్క జీనీవా ప్రతినిధియగు డాక్టర్ వెల్లింగ్టన్‌కూ, జీనీవాలోని ప్రపంచపు కోర్టు జడ్జిగ నుండిన వాంగు చింగ్‌హ్యూ మొదలగు ప్రముఖులు తమ యుద్యోగములకు రాజీనామాలిచ్చి ఏ విదేశముతోను చేరక చైనావారు స్వబలము మీదనే ఆధారపడవలెనని వారు ప్రకటించిరి. 1934 వ సంవత్సరము ఆగస్టు నెలలోనే సన్యట్‌సేను సతి మొదలగు మూడువేలమంది చైనాలోని ప్రముఖులు జపానుమీద వెంటనే యుద్ధము ప్రకటించి, చైనా దేశములో జపాను చేసిన ఆక్రమణ ప్రాంతములను మరల స్వాధీనపర్చుకొన వలసినదనియు, చైనాలో జపానుకుగల బ్యాంకులు,

**చ్యాంగు కేషకు జపానుకు లొంగిపోవుట**

రైళ్ళు, గనులు, ఫ్యాక్టరీలు మొదలగు వానిని స్వాధీన పరచు కొనుట వలన యుద్ధవ్యయమంతయు సంపూర్ణముగ భరించవచ్చు ననియు, సంతకముచేసి యొక ప్రకటనమును గావించిరి.

## 3

మావోసీటుంగు నాయకత్వము క్రింద నున్న కమ్యూనిస్టులు ఇటుల జపానుయొక్క దండయాత్రలను క్యూమింటాంగు ప్రతిఘటించక సహించి అంగీకరించి యూరుకొనుట దేశద్రోహకరమైన విషయమనియు, తాము క్యూమింటాంగుతో పోరాటమును మానివేసి జపానుయొక్క దురాక్రమణలనుండి చైనా దేశము యొక్క స్వతంత్రమును కాపాడుటకు సిద్ధముగ నున్నామనియు ప్రజలందరును తమకు తోడ్పడవలెననియు, క్యూమింటాంగును బలవంతపెట్టి తమతో కలియునట్లుచేసి అందరును కలిసి విదేశ దండయాత్రలనుండి చైనా దేశమును రక్షించవలెననియు విన్నపమును పంపిరి. దానిని చ్యాంగ్ కేషక్ లక్ష్యపెట్టలేదు. జపాను వచ్చి చైనా ప్రజాస్వామికములోని భాగములను ఆక్రమించినను సరే, కాని కమ్యూనిస్టులు నాశనమయ్యే వరకు కమ్యూనిస్టుల మీదనే దండయాత్రలు సాగించుటకు ఆయన నిశ్చయించుకొనినాడు. కమ్యూనిస్టులతో రాజీ పడుటకు కాని, కమ్యూనిస్టులతో కలిసి జపానుతో పోరాడుటకు కాని ఆయన సమ్మతించలేదు. లేదా తానే యేమయినను సరే స్వయముగ జపానుతో యుద్ధము చేయుటకు తెగించినవాడు కాదు.

కమ్యూనిస్టుల జాతీయైక్య ప్రకటన

క్యూమింటాంగు కమ్యూనిస్టు పార్టీలమధ్య జరుగుచున్న అంతర్యుద్ధమును ఆపివైచి అన్ని శక్తులను ఏకముచేసి మాతృ దేశమును రక్షించుటయే తక్షణ ప్రధాన కర్తవ్యమని కమ్యూనిస్టుపార్టీ లేవదీసిన నినాదములు క్యూమింటాంగులో చేరియున్న దేశాభిమాన బృందములను ఆకర్షించెను. చాహారు వద్దనున్న వాంగ్ యూ హ్స్యాంగ్, ఫ్యాంగు చెన్ యూ అను ఇద్దరు క్యూమింటాంగు సేనానులు కమ్యూనిస్టులతో సహకారము సలిపి ప్రజల జపాను వ్యతిరేకపు సమిష్టి సైన్యమును తయారుచేసి జపాను సేనల నెదిరించి చాహారు ప్రాంతములో జపానువారు ఆక్రమించిన భూభాగములను మరల స్వాధీనము పొందిరి. ఇటులనే 19 నంబరు సైన్యముకూడ క్యూమింటాంగులోని దేశాభిమాన బృందములతోచేరి ప్రజల విప్లవ సంఘముల నేర్పాటుచేసి ఎర్ర సైన్యములతో సమీకరణము గావించి క్యూమింటాంగులోని దేశద్రోహ శక్తులను జపాను సైన్యములను కూడ ప్రతిఘటించుటకు నిశ్చయించుకొనెను. వీటిని చ్యాంగు కేషకు బృందము అణచివేసి జపాను వారికి మద్దతు చేసెను.

ప్రజలలో జపానుకు వ్యతిరేకోద్యమము

చ్యాంగ్ కేషక్ ప్రభుత్వము దేశములో కమ్యూనిస్టు భావములు కలిగినటుల అనుమానము గల యువజనులమీద అత్యంత నిర్బంధ విధానములను సాగించెను. కమ్యూనిస్టులకు మరణశిక్ష విధించబడునని శాసించెను. అటులనే జపాను కూడ శాసించెను. చైనాలోని విశ్వవిద్యాలయములలోను, విద్యాలయములలోను, విద్యార్థుల

అత్యంతమైన క్రూర నిర్బంధ విధానములు

వసతి గృహములలోను జొరబడి చైనా సైనికులు పోలీసులు సోదాలుచేసి కమ్యూనిస్టు గ్రంథముల నన్నిటిని తగులబెట్టుటయే గాక కమ్యూనిస్టులని అనుమానము గల ఆచార్యులను, గ్రంథ కర్తలను, యువకులను, యువతులను అరెస్టు చేయించిరి. జైళ్లలో పడవేసిరి. చాలమందిని శిరచ్ఛేదమును గావింపచేసిరి. అనేకమంది అమాయకులుకూడ ఈ అత్యాచారములకు గురియైరి. అందువల్ల కమ్యూనిజము ఇంకను వృద్ధియయ్యెను గాని, తగ్గలేదు. "సాము దాయవాదము (కమ్యూనిజము) నిర్బంధ విధానములచే రూపు మాపబడజాలదు. సన్యటుసేను యొక్క ఆదర్శములను, కార్య క్రమములను అమలులోపెట్టి సరియగు ప్రజారాజ్యమును స్థాపిం చినగాని అది పోదు." అని క్యూమింటాంగు ప్రభుత్వమున ఆర్థిక మంత్రిగనున్న టి. వి. సూంగు చెప్పెను. పైగా చాంగ్ కేషకు, జపానుకు వ్యతిరేకముగ వ్రాయబడిన గ్రంథములను, పత్రికలను నిషేధించెను. ముసోలినీ, హిట్లరుల చరిత్రలను చైనా భాషలో తర్జుమాచేయించి వ్యాపింపచేసెను. కమ్యూనిజమును ఖండించుచు ఫాసిజమును మెచ్చుకొనుచు గ్రంథములను, కరపత్ర ములను, పత్రికలను వ్రాయించెను. చైనాకు డిక్టేటర్ షిప్ (నిరంకుశత్వము) కావలెనని వ్రాయించెను. క్రొత్త జీవితపు ఉద్యమమను పేరున నొక యుద్యమము లేవదీసి బోధలు చేయించసాగెను. చైనాజాతి ఎల్లప్పుడును వాక్స్వాతంత్ర్యమును, రచనా స్వాతంత్ర్యమును పూర్తిగ ననుభవించినది. చ్యాంగ్ కేషక్ విద్యావంతులలోను, మధ్యమ తరగతి ప్రజలలోను, యువజనుల

లోను కూడ సానుభూతిని కోల్పోయినాడు. అదివరకే రైతుల కార్మికుల సహాయమును సానుభూతిని పోగొట్టుకొనెను.

చ్యాంగ్ కేషకు పంపిన మూడు దండయాత్రలను సంపూర్ణముగ నోడించి, కమ్యూనిస్టుపార్టీ 1931 వ సంవత్సరము నవంబరు 7 వ తేదీన కియాంగ్సి రాష్ట్రములోని జుయిా చిన్ వద్ద సమావేశమై చైనాలోని సోవియట్ జిల్లాలన్నిటిని కలిపి యొక కేంద్ర కార్మిక, రైతు ప్రజా ప్రభుత్వమును స్థాపించి దానియొక్క స్థాయీ సంఘమునకు మావోసిటంగును అధ్యక్షునిగ గావించెను. ఆకాలమున జపానువారు మంచూరియాలో సర్వ విధములైన దోపిడీలను గావించుచుండిరి. క్యూమింటాంగు పక్షమువారు ఎదిరించక యూరుకున్నారు. కమ్యూనిస్టు కేంద్ర ప్రభుత్వము, ప్రజలందరును జపాను నెదిరించవలెననియు దేశ స్వాతంత్ర్యముకొరకు తమకు సైనికసహాయము గావించవలెననియు చైనా ప్రజలకు విన్నపమును పంపెను. అంతియెగాక జపానుపై యుద్ధము ప్రకటించెను. గొరిల్లాలచే ప్రతిఘుటనము నలుపసాగెను. 1932 వ సంవత్సరమున కమ్యూనిస్టు ప్రభుత్వము క్యూమింటాంగు పైనకూడ యుద్ధమును ప్రకటించెను.

కమ్యూనిస్టులు జపాను పైనను క్యూమింటాంగు పైనను కూడ యుద్ధముప్రకటించి ప్రతిఘటించ సాగిరి

1932 వ సంవత్సరము జూన్ నెలలో చ్యాంగ్ కేషక్ స్వయముగ ఐదు లక్షల సైన్యమును వెంటబెట్టుకొని హ్యూపేలోని, ఇంకను ఇతర కేంద్రములలో నున్న సోవియటు జిల్లాలను ముట్ట

క్యూమింటాంగు జరిపిన ఆర్థిక దిగ్బంధనము

డించుటకు దండువెడలెను. తొమ్మిది నెలలు పోరాటము జరిగి, ఎర్ర సైన్యములే గెలిచి, ప్రభుత్వ సైన్యములను వెడలగొట్టెను. ప్రభుత్వ సైనికులు ప్రభుత్వ పక్షమును వదలి కమ్యూనిస్టులతో చేరిపోవుట కూడ చాలచోట్ల జరుగుచువచ్చెను. అందుమీద సోవియటు ప్రాంతములలో నున్న కమ్యూనిస్టులకును, వారి పాలనము క్రింద నున్న ప్రజలకును బయటినుండి ఎట్టి సరకులు రాకుండ ఆర్థికదిగ్బంధనము గావించి క్యూమింటాంగు సైన్యములు అన్ని వైపులను కావలాయుండి అటకాయించెను. గావున సోవియటుజిల్లాలలో నున్న ప్రజలవల్లనే వ్యవసాయము ఎక్కువగ జరిపించి భోజనపదార్థములను తయారుచేయించి బట్టలు మొదలైన చిన్న చిన్న పరిశ్రమలను స్థాపించి రైతులకును, ఎర్ర సైన్యముల కును మానవావసరములను తీర్చుటకు కమ్యూనిస్టు ప్రభుత్వము ప్రయత్నించెను. ఆ ప్రాంతములలో చిన్న పరిశ్రమలు, చేతి పరి శ్రమలు బాగుగ నెలకొల్పబడెను. ఇవి అచటి పేద ప్రజల జీవన భృతికి కూడ తోడ్పడి, వారందరును ఎర్ర సైన్యములలో చేరు నట్లును, కమ్యూనిస్టులకు సహాయము చేయునట్లును ప్రోత్సహిం చెను. అచటి ప్రజలకు విద్య గరుపబడెను. పత్రికలు ప్రచురించ బడెను. బీద ప్రజల కష్టములను వర్ణించు నాటకములు ప్రదర్శింప బడెను. గోర్కీ నాటక పాఠశాల తెరువబడెను. అందులో ఒక వేయిమంది నటకులు తయారైరి. సైనికులకు ప్రోత్సాహమిచ్చు, ఉద్రేకపర్చు నాటకములను ఆడుచుండిరి. నూతన విప్లవ విజ్ఞాన మును ఆ ప్రాంతములలో వృద్ధిచేసిరి.

ఈ సమయమున చ్యాంగ్ కేషకు ప్రభుత్వమువారు అమెరికా సంయుక్త రాష్ట్రములనుండియు, జపాను సామ్రాజ్యవాదుల నుండియు విశేష ధనమును ఋణముగ సంపాదించి, జర్మన్, అమెరికన్, జపానీస్, ఫ్రెంచి సైనిక సలహాదారులను పోగుచేసికొని 1933 వ సంవత్సరము అక్టోబరు నెలలో పదిలక్షల సైన్యముతో చ్యాంగ్ కేషకు అయిదవ దండయాత్ర వెడలెను. కమ్యూనిస్టు జిల్లాల చుట్టు రోడ్లు వేసి, చిన్న కోటలను నిర్మింపచేసి అన్నివైపుల ఏకకాలములో సైనిక నివహములను ఏర్పాటుచేసి ఒకేసారిగా అన్నివైపులనుండి కమ్యూనిస్టుసైన్యములను, బృందములను నాశనము గావించుటకు చుట్టుముట్టెను. క్యూమింటాంగు సైన్యములు అన్నివైపులనుంచి చుట్టుముట్టి వచ్చుచుండగ వారితో కమ్యూనిస్టు సైన్యములు కొన్నిచోట్ల పోరాడి చాలా అపజయములను పొందెను. చాల ఎర్ర సైన్యములు నాశనమయ్యెను. అందుమీద మావోసిటంగు యొక్క నాయకత్వము క్రింద ఆయన సలహా ప్రకారము మిగిలియున్న ఎర్ర సైన్యములన్నియు ఈ క్యూమింటాంగు సైనిక నివహములను తప్పించుకొని పారిపోయి చాల దూరముగ నున్న సురక్షిత ప్రాంతములను చేరుటకు నిశ్చయించి బయలుదేరెను.

**కమ్యూనిస్టుల దీర్ఘ పయనము (Long March)**

1934 వ సంవత్సరము అక్టోబరు నెలలో ఎర్రసైన్యము యొక్క ప్రధానభాగము జుయీ చిన్ వద్ద క్యూమిన్టాంగు సైన్యములను తప్పించుకొని, కొంతమంది గొరిల్లాలను వారిని బాధలు పెట్టుటకు వదలిపెట్టి, కియాంగ్సి, ఫ్యూకిన్ రాష్ట్రములలో

గుండ నడచిపోయి, క్వాంటంగ్, యునాను, క్వాన్సి మొదలగు రాష్ట్రములలోగుండపోయి, కొండప్రాంతములను దాటి, క్విజో వద్ద 'పుచియాంగు'నదిని చేరగ అక్కడ వారికి క్యూమిన్‌టాంగు సైన్యములు తలపడెను. ఒక తీవ్రమైన చలితో వణుకుచున్న ఉదయమున ఎర్ర సైన్యములు ఆ నదిని దాటి సున్‌యీ పట్టణమును ఆక్రమించెను. ఈ సైన్యములతో కూడ కమ్యూనిజము నందు నమ్మకముగల రైతులును, కూలీలును, సామాన్యప్రజలును కూడ వేలకొద్ది తమ సామానులను కంచరగాడిదలమీద నెక్కించుకొని వెంటతీసుకొని బయలుదేరి నడచిపోవుచుండిరి. కమ్యూనిస్టు ప్రాంతములలోని రైతులు ప్రజలు ప్రభుత్వ సైన్యములచే హత్యగావింపబడకుండ తప్పించుకొనుట కీవిధముగ వెడలిపోయిరి. సున్‌యీ పట్టణమున చైనా కమ్యూనిస్టుపార్టీ సమావేశము జరిగి మావోసీటుంగును నాయకునిగ ఎన్నుకొని అచటినుండి ఎర్ర సైన్యములు, వారితోనున్న ప్రజలు ఉత్తరముగా వెడలిపోయిరి. త్రోవలో మూడుచోట్ల క్యూమిన్‌టాంగు సైన్యములను ఎదుర్కొని ఓడించిరి. చిన్‌షా నదినిదాటి సికాంగ్‌లో ప్రవేశించిరి. అచటి నుండి పర్వతశ్రేణులను దాటిపోయి తాటూనదిని చేరిరి. క్యూమిన్‌టాంగు సైన్యములు కొన్ని అచట సిద్ధముగ నుండెను. రెండువైపులను గొప్ప యుద్ధములకు తయారగుచుండిరి. అర్ధరాత్రివేళ కొంత దూరముననున్న నొక పడవమీదుగ ఎర్రసైన్యములు దాటుచుండగ క్యూమిన్‌టాంగు సైన్యములు ముట్టడించెను. ఆ ముట్టడిని జయించి ఎర్రసైన్యములు నదిని దాటెను. ఎర్రసైన్యములలో కొన్ని మరణించెను. ఇంతలో మరియొక

ఎఱ్ఱసైన్యము అచటికి సమీపముననున్న లూటుంగు వంతెనవద్దకు రాగా ఆ వంతెనను ప్రభుత్వ సైన్యములు తగులబెట్టెను. ఎఱ్ఱ సైన్యములు మంటలలోగుండపోయి ఆ వంతెనను పట్టుకొని దానిని దాటెను. ఎదిరించిన ప్రభుత్వసైన్యములను ఓడించెను. ప్రభుత్వ సైన్యములు పారిపోయెను. అచటినుంచి అన్ని ఎఱ్ఱ సైన్యములు కమ్యూనిస్టు ప్రజలు మంచుతో కప్పబడియున్న కొండలను దాటి, పచ్చికబైళ్లలోగుండాను నీళ్లు నిలచిన ప్రదేశములగుండాను నడిచి ముందుకు సాగెను. కొన్నిచోట్ల ఆహారము దొరకనందున దుంపలను, ఆకులను, మాంసమును తినెను. చివరకు 1935 వ సంవత్సరము అక్టోబరు నెలలో జీవించియున్న ఎఱ్ఱసైన్యములును వారితో వచ్చిన ప్రజలును మంగోలియాకు సమీపముననున్న షెన్సి రాష్ట్రములో ఉత్తర ప్రాంతములోనున్న పోయాన్ పట్టణమునందు సురక్షితముగ చేరిరి. అచట నదివరకే లియూచిటన్ అను నాయకునిక్రింద నొక సోవియట్ జిల్లా స్థాపించబడి యుండెను. ఇటుల చరిత్రాత్మకమైన పరాక్రమముతో, ధైర్య సాహసములతో, విప్లవోత్సాహముతో ఆరువేలమైళ్ళు ఒకసంవత్సరము పొడుగుననడచి త్రోవలో అనేకమైన కష్టనష్టములను సహించి అచటికి సురక్షితముగచేరి విప్లవమును కాపాడుకొనిరి. త్రోవలో మావోసిటంగు యొక్క రెండవ భార్య, ఇద్దరు కుమారులు మరణించిరి. అదివరకే ఆయన ప్రథమభార్య చాంగ్ కేషక్ ప్రభుత్వముచే శిరచ్ఛేదము గావింపబడెను. జెన్ పి షి, హోలాంగు హ్సు, ప్సి యాంగు, చీన్ ఈ సేనానులక్రింద మరికొన్ని ఎఱ్ఱ సైన్యములుకూడ ఇటులనే అతి

కష్టమైన ప్రయాణముచేసి వీరితో చేరెను. ఈ దీర్ఘ ప్రయాణములో ఈ ఎర్రసైన్యములు త్రోవలోని 18 రాష్ట్రములలోనున్న ప్రజలకు విప్లవమును ప్రబోధించి కమ్యూనిస్టులతో సానుభూతిని సంపాదించుకొనిరి. పదిలక్షల క్యూమింటాంగు సైన్యములను తప్పించుకొని జయప్రదముగ ముగించిన ఈ దీర్ఘప్రయాణమువల్లను, జపానుపై యుద్ధమును ప్రకటించి జపాను సైన్యములను ప్రతిఘటనము గావించుటవల్లను కమ్యూనిస్టుల ప్రతిష్ఠ చాలగ హెచ్చెను. ఇటుల ఉత్తరప్రెస్సీలో చేరిన కమ్యూనిస్టులందరును కలసి ఈనాన్‌పట్టణమున నొక బలవత్తరమైన సోవియటు కేంద్రమును స్థాపించి అచటినుంచి చుట్టుపట్టులకు వ్యాపించిరి. ఈనాన్‌పట్టణము మావోసిటంగు నాయకత్వముక్రింద చైనా కమ్యూనిజమునకు పవిత్ర క్షేత్రమయ్యెను. ఈ పట్టణమునకు సమీపముననున్న కొండగుహాలలో చాలమంది కమ్యూనిస్టు నాయకులు ప్రజలు నివసించిరి.

మరియొక కారణముచేత కూడ చ్యాంగ్‌కేషక్ ప్రభుత్వము ప్రజానురంజకత్వమును కోల్పోయినది. క్యూమింటాంగులోని నాలుగు పెద్దకుటుంబములు, (1) చ్యాంగ్‌కేషక్ యొక్క సోదరుడు (2) ఆయన బావమరిదియగు టి. వి. సూంగు, (3) ఆయన షడ్డకుడగు హెచ్. హెచ్. కంగు, (4) చెన్‌సోదరులు, ప్రభుత్వ బ్యాంకులైన చైనా సెంట్రల్‌బ్యాంకు, చైనా బ్యాంకు, రాకపోకలకు సంబంధించిన బ్యాంకు, మరియు చైనారైతులబ్యాంకు ఈనాలుగు బ్యాంకులను తమయొక్క ప్రత్యేక 'యాజమాన్యము

నాలుగు కుటుంబముల అత్యంత ధనార్జనము

క్రింద నుంచుకొని విశేషమైన లాభములను గడించుచున్నారని దేశములో అప్రతిష్ఠ వ్యాపించినది. ఈ నాలుగుబ్యాంకులే దేశము లోని ఇతర చిల్లర బ్యాంకులన్నిటిని నడుపుచున్నవి. క్యూమిం టాంగు ప్రభుత్వము యొక్క ద్రవ్యము ఈ బ్యాంకులలోనే పడవేయ బడుచుండెను. ప్రభుత్వ కరెన్సీ నోట్లను, పత్రములను ఈ బ్యాంకులే వేయుచుండెను. 1927 వ సంవత్సరము నుండి జరిగిన తొమ్మిది సంవత్సరములలో క్యూమింటాంగు ప్రభుత్వము ముద్రించి ప్రచురించిన ప్రభుత్వ పత్రములు ఉత్తరపు సైనిక నాయకుల పాలనములో అదివరకు పదిహేను సంవత్సరముల కాలములో పంచిపెట్టిన వానికన్న నాలుగు రెట్లుగ నుండెనని అంచనా వేయబడెను. ఈ బ్యాంకులు ప్రచురించిన నోట్లు యావత్తు చైనా దేశమునకు ద్రవ్యముగ చెల్లతగినవని క్యూమింటాంగు ప్రభుత్వము ఉత్తరువు చేసినది. దేశములోని వెండినంతను ఈ నోట్లనిచ్చి పుచ్చుకొని ఈ బ్యాంకు లలో పడవేసినది. దేశము యొక్క పత్తి, ధాన్యము, ఇతర అవస రముల వర్తకమంతయు ఈ నాలుగు కుటుంబముల చేతిలోనే యుండియు, అనేక పరిశ్రమలను వీరే నడిపియు, వీరు దేశములో కెల్ల అత్యంతముగ భాగ్యవంతులైరి. 1939 లో ప్రపంచమంతట ఏర్పడిన ఆర్థిక మాంద్యము వల్ల చైనాదేశపు నాణెముల, నోట్ల విలువ పడిపోయెను. అందువల్ల ప్రజలు ఆర్థికకష్టములకు లోనైరి. అనేక బ్యాంకులు పారిశ్రామిక సంఘములు కూలిపోయెను. అందువల్ల మధ్యమ తరగతి వర్తకులలో కూడ చ్యాంగుకేషకు నందు సానుభూతి తగ్గిపోయినది. "బ్యాంకులలో ప్రబలిన అక్రమ

ములను, లంచగొండితనమును రూపుమాపి నాణెముల విలువను స్థిరపర్చి, దేశపు ఆర్థిక స్థితిని చక్కచేయుటకు చ్యాంగ్ కే షకు మిగుల న్యాయవంతుడును, సమర్థుడును, నిర్మొగమాటియు నగు తన ప్రథమ భార్య కుమారుడగు చ్యాంగ్ చింగ్ కియోను 1947 లో సర్వాధికారిగ నియమించెను. అనేకమంది అక్రమస్తులను ఆయన శిక్షించి, అక్రమ వ్యాపారములను మాన్పి, లంచగొండి తనమును తగ్గించసాగెను. కాని ప్రముఖులైన కొందరిని అక్ర మముల క్రింద అరెస్టుచేసినపుడు చ్యాంగ్ కే షకు గాని ఆయన రెండవ భార్యయగు మాదాము చ్యాంగ్ కేషకు గాని జోక్యము కలుగచేసుకొని నేరస్థులకు శిక్ష లేకుండ తప్పించుటవల్ల ఆ అధికారి రాజీనామా నిచ్చిపోయె"నని చైనాలో భారత రాయబారిగ నున్న పాణిక్కరు గారు "రెండు చైనాలలో" అను వారి పుస్తకములో వ్రాసియున్నారు.

"చ్యాంగు కేషకు గొప్పవాడు గాని యొక శతాబ్దముకు పూర్వము పుట్టవలసినవాడు. అటుల పుట్టినట్లయిన యొక రాజ వంశమును స్థాపించియుండెడివాడు...చ్యాంగు కే షకు 'కన్ ఫ్యూ షియసు' సిద్ధాంతములయందు నమ్మకము గల క్రైస్తవుడు. సైనిక నిరంకుశత్వమునందు నమ్మకము గల ప్రజా రాజ్యవాది. తాను ఎట్టి లంచములు తీసుకొనకుండ పవిత్రుడుగ నుండెను. గాని తన చుట్టునున్నవా రెంత లంచగొండులైనను, ఎన్ని యక్రమ సంపాదనలను చేసినను పూర్తిగ సహించి యూరకున్నాడు." అని ఆయన వ్రాసెను.

# చైనా విప్లవము

## ద్వాదశాధ్యాయము



### క్యూమింటాంగు కమ్యూనిస్టు కలయిక - పరస్పరమోసములు

### 1

జపానువారు చైనా నాక్రమించినకొలది, కమ్యూనిస్టుల పిలుపుమీద కమ్యూనిజము నంగీకరింపని దేశాభిమానులు కొన్నిచోట్ల జపానుకు వ్యతిరేకముగ యుద్ధముచేయుటకు కమ్యూనిస్టులతో కలిసి సమష్టిసైన్యములను తయారుచేసిరి. ఈ సమష్టిసైన్యములు, గొరిల్లాలు 1935 వ సంవత్సరములో రైల్వే స్టేషనులను ముట్టడించుట, జపానుసైన్యములు ముందుకు రాకుండ మార్గములను నాశనముచేయుట మొదలైన ప్రతిఘటన కార్యములను చేయసాగినవి. ముఖ్యముగ మంచూరియాలోని ప్రజలు పీరితో ఎక్కువ సానుభూతిని కలిగియుండిరి. జపానును డీకొనుటకు అచట దేశాభిమాన సమష్టిసైన్యములు వృద్ధియయ్యెను. 1937 వ సంవత్సరములో ఈ దేశాభిమాన సమష్టిసైన్యములు నలుబది యైదు వేల వరకు పెరిగెను.

సమష్టి దేశాభిమానసైన్యములు

1935 వ సంవత్సరము ఆగష్టు 1 వ తేదీన మరల చైనా కమ్యూనిస్టుపార్టీవారు చైనాదేశీయులందరును తమతో కలిసి జపానుతో యుద్ధముచేసి చైనాజాతికి స్వతంత్రము కలుగచేయ

వలెనని విన్నపమును పంపిరి. ఆ సంవత్సరము డిశంబరు 9 వ తేదీన పికింగులోని కళాశాలల, పాఠశాలల విద్యార్థులు సమావేశమై జపాను నెదిరించుటకు ఐచ్ఛికభటులుగ తయారైరి. జాతీయ స్వతంత్ర కీర్తనలు పాడుచు 'జపాను సామ్రాజ్యవాదులు కూలిపోవలెను', 'దేశద్రోహులు నశించవలెను', 'ఉత్తరచైనాను సైనికబలముచే స్వాధీనపర్చుకోవలెను' అను నినాదములతో క్యూమింటాంగు ప్రభుత్వమువద్దకు పోయి అర్జీ ఇచ్చుకొన ప్రయత్నించగ అది నిరాకరించబడెను. అందువల్ల వారు గొప్ప ప్రదర్శనములు చేయ సాగిరి. వారిమీద తుపాకులు కాల్చబడెను. కొందరు మరణించిరి. విద్యార్థులలో కోపోద్రేకములు హెచ్చినవి. మరునాడు చైనా దేశములోని అన్ని కళాశాలల పాఠశాలల విద్యార్థుల జాతీయ సమ్మె ప్రకటించబడెను. డిశంబరు 16 వ తేదీన పదివేలమంది పికింగు విద్యార్థులు, ఇంకా పెక్కుమంది అచటి కాపురస్తులు ఆ నగరము యొక్క దక్షిణభాగమున యొక మహాసభ జరిపి జపాను సామ్రాజ్యవాదులను ఏదిరించుటలో తమ ప్రాణముల నర్పించెద మని శపథములను తీసుకొనిరి. క్యూమింటాంగు సైన్యములు, పోలీసులు వచ్చి ఆ మహాసభను చెదరగొట్టిరి. అందుమీద చైనా దేశములోని ఊసియాన్, షాంగ్‌టు మొదలైన అనేక పట్టణము లలో విద్యార్థులు పాఠశాలలను బహిష్కరించి బహిరంగ సభలు గావించిరి. అన్ని వర్గముల ప్రజలును వారితో చేరి జపాను నెదిరించవలెనని తీర్మానములను చేసిరి. జాతీయ ప్రజాపాలనము (**National Parliament**) స్థాపించవలెననియు తీర్మానములు

విద్యార్థుల జపానువ్యతిరేక ఆందోళనము

చేసిరి. 1936 వ సంవత్సర ప్రారంభమున పికింగు, టీన్‌ట్సిన్ నగరముల విద్యార్థులు మూడువేల మంది కాలి నడకను బయలుదేరి పికింగు, హాంగ్‌కో రైలు మార్గమున నున్న ప్రదేశములన్నిటిలో సభలు జరిపి, జపాను నెదిరించవలెననియు, బస్తీలలోని పల్లెలలోని ప్రజలలోను, రైల్వే కార్మికులలోను, ప్రబోధము గావించిరి. ప్రజలందరును ఈ విద్యార్థులను మిక్కిలి గౌరవముతో నాదరించిరి. ఈవిద్యార్థులు పికింగు, టీన్‌ట్సిన్ నగరములకు తిరిగివచ్చి చైనా జాతి యొక్క రక్షణకొరకు వాలంటీరు దళమును నిర్మాణము చేసిరి. అది అతి త్వరలోనే యావత్తు దేశమునకు యువక దేశాభిమానుల సైనికబృందమయ్యెను. ఈ విధముగ యావత్తు చైనా దేశములో జపాను నెదిరించవలెనను ఉద్రేకము, నినాదములు వెల్లివిరిసినవి. 1936వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో కమ్యూనిస్టులు ఏర్పాటుచేసిన "ప్రజల జపాను వ్యతిరేక సైన్యము" ఎల్లోనదిని దాటి, జపానువారితో పోట్లాడుటకు బయలుదేరెను. త్రోవలో షాన్‌సీ వద్దను, కాన్‌సూ వద్దను క్యూమింటాంగు యొక్క గొప్ప సైన్యములు వచ్చి వీటిని అటకాయించెను. క్యూమింటాంగుతో పోట్లాడుటకు ఇష్టములేక జపాను వ్యతిరేక ప్రజాసైన్యములు వెనుకకు మరలిపోయెను. తాము క్యూమింటాంగుతో పోట్లాడ దలచలేదని, అందరును కలిసి జపాను నెదిరించుటయే తమ యుద్దేశ్యమని ఈ సైన్యములు ప్రకటించెను.

ఇంతే కాకుండ క్యూమింటాంగు యొక్క అధీనములోని ప్రదేశములలో కూడ కమ్యూనిస్టులు జపానువారికి వ్యతిరేకముగ సమ్మెలను కార్మికులచేత కట్టించిరి. షాంఘాయిలోను, ట్సింగ్‌టూ

లోను నున్న జపానువారి యంత్రశాలలలోని 45 వేల మంది కార్మికులు 1936 సంవత్సరములో సమ్మె కట్టిరి. జాతీయరక్షణ సంఘములు దేశమందంతటను స్థాపింప బడెను.

జాతీయరక్షణ అఖిల చైనా సంఘము

1936 సంవత్సరము మే నెలలో 'జాతీయ రక్షణ అఖిల చైనాసంఘము' షాంఘాయిలో స్థాపిత మయ్యెను. అనేకమంది దేశాభిమానులు అందులో చేరిరి. వీరు కమ్యూనిస్టుల జాతీయైక్యతా నినాదములను బలపరచిరి. అతి త్వరితముగ సుమారు వేయిపత్రికలు జపానును ప్రతిఘటించి చైనాను కాపాడవలెనని బోధించుటకు ప్రచురించబడెను. వాటిలో నూరుకంటె ఎక్కువ యువతులచే స్థాపింపబడెను. జపానుకు వ్యతిరేకభావము క్యూమింటాంగు సైన్యములలో కూడ ప్రవేశించెను. 1936 వ సంవత్సరము నవంబరు నెలలో సూయూాయన్‌లోని క్యూమింటాంగు సైన్యములు జపానువారిని ముట్టడించి కొంత భూభాగమును స్వాధీన పరచుకొనెను. ఆ సైన్యమునకు సహాయము చేయుటకు దేశమంతటినుంచి విరాళములు పోగుచేయబడి గొప్ప ద్రవ్యసహాయము పంపబడెను. షెన్సీ రాష్ట్రములో కమ్యూనిస్టులను ముట్టడించుటకు చ్యాంగ్ కేషకు పంపిన క్యూమింటాంగు సైన్యములు తమంతట తాము ఎర్ర సైన్యములతో యుద్ధము చేయకుండ మానుకొనెను. ఎర్రసైన్యములతో సోదర సంబంధములను పెట్టుకొనెను. ఇట్టి దేశాభిమాన తరంగములను అణచివేయుటకు క్యూమింటాంగు ప్రభుత్వము కఠినచర్యలు పుచ్చుకొనెను. అనేకమంది దేశాభిమానులను అరెస్టుచేసి జైళ్లలో పడవైచెను. జాతీయ రక్షణ

అఖిల చైనా సంఘముయొక్క చున్‌టూ మొదలగు ఏడుగురు నాయకులను అరెస్టుచేసి జైళ్ళలో పెట్టెను. కమ్యూనిస్టులమీద ఇంకను గొప్ప దండయాత్ర సలుపవలెనని చ్యాంగ్ కేషక్ తయారగుచుండెను.

## 2

1936 వ సంవత్సరము డిశంబరు మొదటిభాగములో షెన్సీ రాష్ట్రములోని క్యూమింటాంగుకు చెందిన చ్యాంగ్ హుసు యలియాంగు, య్యాంగు హ్యు చ్యాంగు సేనానులక్రిందనున్న సైన్యములచేత కమ్యూనిస్టులమీద దండయాత్రలు జరిపించుటకు చ్యాంగు కేషకు స్వయముగ సియాన్‌కు వచ్చెను. అది యొకపుడు చైనాచక్రవర్తుల రాజధానిగ నుండిన ప్రముఖ పట్టణము. డిశంబరు 9 వ తేదీన అచటి విద్యార్థులు గొప్పప్రదర్శనములు జరిపి జపానుతో వెంటనే యుద్ధముచేయవలెనని చ్యాంగు కేషకును కోరిరి. ఆ విద్యార్థి నాయకులను ఆయన జైలులో పడవేయించెను. అపుడు క్యూమింటాంగు సేనాను లిద్దరును సియాన్‌కు వచ్చిన చ్యాంగు కేషకును జపానుతో యుద్ధముచేయుటకు బలాత్కారముచేసి యొప్పించవలెనని యొక పన్నాగమును పన్నిరి. చ్యాంగ్ హుసు యలియాంగు సేనాని క్యూమిన్‌టాంగు సేనానులలో ద్వితీయ స్థానమాక్రమించినవాడు. ఆయన మంచూరియాను క్యూమిన్‌టాంగుకు వశపరచి ఆ దేశము మీద జాతీయ పతాకము నెగురవేసినాడు. మంచూరియాలో చైనా జాతీయప్రభుత్వ పక్షమున గవర్నర్

సియాన్ సంఘటన

జనరలుగ నుండగ జపాను సేనలువచ్చి ఆయనను వెడలగొట్టినవి. ఆయన అప్పటినుంచి షెన్సీ రాష్ట్రములో ఒకలక్ష ముప్పదివేల సైన్యమును పెట్టుకొని క్యూమిన్‌టాంగు ప్రతినిధిగ నున్నాడు. ఈ సైనికులందరు మంచూరియా నుంచి జపానుచే వెడలగొట్ట బడినవారు. వారి కుటుంబములన్నియు జపాను సేనలచే నాశ నము చేయబడినవి. కావున వీరందరును జపానుతో పోరాటమును సలిపి మంచూరియానుంచి జపాను ప్రభుత్వమును వెడలగొట్టి మరల స్వాధీనపరచుకొనవలెనను గాఢమైన వాంఛ గలవారు. ఈ సేనలు అప్పుడప్పుడు జపాను సైన్యములతో తలపడి పోరాటము జరుపుచునే యుండెను. జపాను ప్రభుత్వము జర్మనీతోను, ఇటలీ తోను సంధులు చేసుకొనుట, ఇటలీయొక్క అబిసీనియా ఆక్ర మణమును జపాను అంగీకరించినందుకు గాను ఇటలీ ప్రభుత్వము జపానుయొక్క మంచూరియా ఆక్రమణను అంగీకరించుట కూడ వీరికి ఆగ్రహము కలుగచేసెను. అందువలన చ్యాంగ్ హుసుయలి యాంగు సేనానియు, ఆయన క్రిందనున్న సైనికులందరును కమ్యూనిస్టులతో జరుపుచున్న పోరాటములను మానివేసి వారితోకలిసి జపానుతో యుద్ధము చేయవలెనను తీర్మానమునకు వచ్చి, తమకు ప్రక్కనున్న యాంగు హ్యు చ్యాంగ్ సేనానితో ఏకమై చ్యాంగ్ కేషక్‌ను బలవంతపెట్టి జపానుతో యుద్ధము చేయించవలెనని, కమ్యూనిస్టులతో యుద్ధమును మాన్పించ వలెనని నిశ్చయించుకొనిరి. సియాన్ పట్టణమునకు చ్యాంగుకేషక్ వచ్చినపుడు ఆయనను అరెస్టుచేయుటకు దృఢ నిశ్చయులైరి. అప్పుడు సియాన్ పట్టణమునకు పదిమైళ్ల దూరమున బిన్‌టింగు

వద్ద కొండమీదనున్న భవనములో చ్యాంగ్ కేషక్ విడిది ఏర్పరచుకొని యుండెను. డిశంబరు 12 వ తేదీ అర్ధరాత్రివేళ చ్యాంగ్ హ్స్యుసుయలియాంగు సేనానిక్రింద పనిచేయుచున్న సన్‌మింగుచ్యూ సేనాని రెండువేల సైనికులను తీసుకొనివెళ్లి తెల్లవారుఝామున మూడుగంటలప్పుడు చ్యాంగ్ కేషక్ విడిదిచేయుచున్న భవనమును చుట్టుముట్టి ఆయనను అరెస్టుచేసెను. సన్‌మింగుచ్యూ సేనాని ఆయనకు నమస్కరించెను. చ్యాంగ్ కేషక్ నవ్వి "నాకు స్నేహితుడవైనచో నన్ను వెంటనే కాల్చివేయుము" అని చెప్పెను. "మేము మిమ్మును హత్యగావించ దలచలేదు. మా దేశమును జపానుపైకి యుద్ధములో నడుపవలెనని మిమ్ము లను కోరుచున్నాము" అని అతడు చెప్పెను. "చ్యాంగు హ్సుసుయలియాంగును పిలువవలసినది, నేను మీతోకూడ వచ్చెదను" అని చ్యాంగ్ కేషక్ బదులు చెప్పెను. "ఆయన ఇక్కడలేడు, చుట్టూ సైన్యములుమాత్ర మున్న" వని సన్ సేనాని చెప్పెను. చ్యాంగ్ కేషక్‌ను కొండమీదనుంచి దించి క్రిందనున్న మోటారుకారు మీద ఎక్కించి ఆ సేనాని ఆయనను 'సియాన్' పట్టణమునకు తీసుకొనిపోయెను. చ్యాంగ్ కేషక్ జపానుతో పోరాడుటకు తేలికగా ఒప్పుకొనలేదు. అనేకమంది నాయకులచేత దస్కతు పెట్టించి జపానుతో పోరాడవలెనని ఒక మహజరు చ్యాంగ్ కేషకుకు దాఖలు చేయబడెను. "కమ్యూనిస్టులతో అంతర్యుద్ధము మానవలెను, నాన్‌కింగు ప్రభుత్వములో అన్ని రాజకీయపక్షములను చేర్చుకొనవలెను, ఖైదులో పెట్టబడిన దేశాభిమానులందరిని విడుదలచేయవలెను, రాజకీయఖైదీలందరికి క్షమాపణ నివ్వవలెను,

ప్రజలకు రాజకీయ స్వాతంత్ర్యము కలుగచేయవలెను, డాక్టర్ సన్యట్ సేన్ యొక్క మరణశాసనమును అమలులో పెట్టవలెను, జాతీయ మోక్షమహాసభను పిలువవలెను" అని అందులో నున్నది. దానిమీద చైనాకమ్యూనిస్టు నాయకులు కూడ దస్కతు పెట్టిరి. చ్యాంగ్ కేషకును తన స్వాధీనములో భద్రముగ నుంచుకొని చ్యాంగ్ హుసుయలియాంగు తన స్వంత విమానమును పొయాను కు పంపి ముగ్గురు కమ్యూనిస్టు ప్రతినిధులను సియాన్ కు రప్పించెను. వారు చౌ ఎన్ లై, ఎ. చైన్, ఇంగ్ పోగు గారలు. వారు వచ్చి చ్యాంగ్ కేషక్ తో మర్యాదగ మాటలాడిరి. తనకు పరమ శత్రువులైన కమ్యూనిస్టులకు తనను వప్పగించెదరేమో నను భయ మాయనకు కలుగకపోలేదు. వారు తన్ను చిత్రవధ చేతు రనియు దానికన్న తుపాకిగుండుతో తన సేనానులచేత మరణించుటయే అదృష్టమనియు ఆయన భావించెను. కాని ఆయనను హత్యగావించవలెనని వారి యుద్దేశ్యము కాదు. బెదిరించి బలవంత పెట్టి ఆయనను తమవైపునకు త్రిప్పుకొనవలెనని వారి కోరిక. తమకుకూడ సర్వసేనాధిపతిగా యుండి జపానుతో సమష్టిపోరాటము జరిపించవలెనని ఆయనను కమ్యూనిస్టు ప్రతినిధులు కోరిరి. ఆ కోరికను మన్నించకపోయినచో ఆయనకు మరణము తప్పదు. కావున ఆయన అంగీకరించక తప్పినదికాదు. చ్యాంగు కేషకు కమ్యూనిస్టులతో కలిసెను.

జపానుతో పోరాడుటకు డిశంబరు 14 వ తేదీన సియాను లోనే క్యూమింటాంగు కమ్యూనిస్టుల సంయుక్తసైన్యము స్థాపన మయ్యెనని ప్రకటించబడ్డది. అందులో లక్షా డెబ్బదివేల క్యూమిం

టాంగు సైన్యమును, తొంబదివేలమంది ఎఱ్ఱసైనికులును చేరి యుండిరని తెలుపబడినది. తమ దేశముపై దండెత్తి కొన్ని భాగ ముల నాక్రమించిన విదేశప్రభుత్వ మగు జపానును ఎదిరించక ప్రతిఘటించక యూరుకున్న క్యూమింటాంగుప్రభుత్వము చైనా దేశము నేలుటకు శాస్త్రీయమైన హక్కును కోల్పోయినది. అంతేగాక తిరుగుబాటుదార్లయిన కమ్యూనిస్టులను సొంత సేన లను పెట్టుకొనుటకు అంగీకరించుట, వాటితోకలిసి సమష్టిగ జపానుతో యుద్ధముచేతుమని యొప్పుకొనుట మిగుల అవివేక మైన పని. క్యూమింటాంగుకు రాజ్యముచేయుటకు బలములేదని స్పష్టపడినది. చైనాయొక్క అప్పటి పరిస్థితులలో ఏ విషయమైన శాస్త్రీయమా, అశాస్త్రీయమా; వివేకమా, అవివేకమా అను వివేచన బొత్తుగా ఎగిరిపోయినది. ఎవరి కెక్కువ సైనికబల ముండిన వారిదే రాజ్యమని తేలినది. చ్యాంగుకేషకుప్రభుత్వము, కమ్యూనిస్టు తిరుగుబాటుదార్లు ఉభయులు తమతమ సైనిక బలముమీదనే ఆధారపడినారు. ప్రజల ఓట్లమీద ఆధారపడలేదు. రాజీపడినా, యుద్ధముచేసినా సైనికబలమే. ఆ యుద్ధములో తుదకు కమ్యూనిస్టుల సైనికబలము ముందర చ్యాంగుకేషక్ యొక్క సైనికబలము ఓడిపోయినది.

చ్యాంగుకేషకును తప్పక హత్యగావింతురని వార్త కొన్ని పత్రికలలో ప్రకటించబడెను. ఈ ఘట్టము 'నాన్‌కింగు'లోని వారికి విషాద విస్మయములను కలుగచేసెను. అనేకవిధములైన వాడు కలు వ్యాపించెను. చ్యాంగ్‌కేషకు తప్పక మరణించునని తలచి, నాన్‌కింగ్‌లో వాంగుచింగువై బృందము యొక్కయు, జర్మన్

ఇటాలియన్ సలహాదారుల యొక్కయు ప్రోత్సాహము మీద, క్యూమిన్‌టాంగు ప్రభుత్వములో జపాను కనుకూలుడగు యుద్ధ మంత్రియగు 'హోయింగు చిన్' ప్రభుత్వాధికారమును స్వాధీన పరచుకొనుటకు తరుణము వచ్చినదని ఆశించినాడు. గొప్ప సైన్యములను తయారుచేసి సియాన్ రాష్ట్రముపైకి పంపినాడు. కాని చ్యాంగ్ కేషక్ సతి అందువల్ల తన భర్తయొక్క ప్రాణమునకు అపాయము కలుగునే కాని వేరుఫలితముండదని నమ్మెను. ఆ సైన్యమును ముందుకుపోకుండ త్రోవలో ఆపివైచెను. చ్యాంగ్ కేషక్‌ను విడిపించి తెచ్చుటకు సర్వప్రయత్నములను చేయవలెనని ఆజ్ఞాపించెను. ఇంతలో సియాన్ పట్టణమునుంచి యథార్థ వార్తలు వచ్చెను. అప్పుడే హోపే, షాంటంగు రాష్ట్రపాలకులు శాంతముగ వ్యవహారము పరిష్కారము చేయుట ఉచితమని తంతి ద్వారా తెలిపిరి. సియాను వద్దనున్న క్యూమిన్‌టాంగు సైన్యములలోని యువక సేనానులు చ్యాంగ్ కేషకును దేశద్రోహిగ విచారించి తగినశిక్ష విధించవలెనని తీర్మానములను చేసినమాట వాస్తవము, కాని కమ్యూనిస్టులు అందుకు అంగీకరించలేదు. ఆయనను హత్యగావించినచో దేశములో నతి ఘోరమైన అంతర్యుద్ధము జరుగును. జపానుకు దేశమంతయు లోబడును. ఇందువల్ల తాము కమ్యూనిస్టు విప్లవము సాగించ వీలులేకపోవును అని వారు తలచిరి. రాజకీయముగను, ఆర్థికముగను, సాంఘికముగను అన్ని విధములుగను చైనాలో అన్ని పార్టీల ఐక్యత, శాంతి కావలసి యున్నదని, వెంటనే అన్ని పార్టీలకు ప్రాతినిధ్యము గల ప్రజారాజ్యము స్థాపనకావలెనని, అందరు కలిసి జపానుతో

యుద్ధముచేసి వారిని చైనానుంచి వెడలగొట్టవలెనని, వారు నిశ్చయించిరి. అట్టి ప్రజా రాజ్యము ముందుగా ఏర్పడనిచో కమ్యూనిస్టు విప్లవము సాధ్యపడదని వారి భావము. అందువలన కమ్యూనిస్టులు చ్యాంగ్ కేషకును దర్శించి సహేతుకమైన షరతుల మీద ఆయనతో రాజీకి దిగిరి. ఆయనయొక్క సర్వసేనాధిపత్యము క్రిందనే తమ సైన్యములనుకూడ నడిపించి జపానుతో పోరాడెద మని వారు హామీనిచ్చిరి. మరియు తమ స్వతంత్ర ప్రభుత్వమును వదలుకొని సరిహద్దు జిల్లా పాలనముగ పేరుపెట్టుకొనుట కంగీక రించిరి. ఆ ప్రాంతములలో భూస్వాములనుంచి భూములను లాగుకొని చిన్నరైతులకు పంచిపెట్టు విధానమును మానుకొను టకు కూడ నొప్పుకొనిరి. భూమి శిస్తును తగ్గించుటను మాత్రమే తాము చేతుమని చెప్పిరి. ఎర్రసైన్యము అను పేరును తీసివేసి ఎనిమిదవ రూట్ సైన్యము అని పిలుతుమనియు, ఆ సైన్యము చైనా దేశమునకు శాస్త్రీయమైన ప్రభుత్వ నాయకుడగు చ్యాంగ్ కేషక్ యొక్క సర్వసేనాధిపత్యము క్రిందనున్న జాతీయ సైన్య ములో భాగముగ నుండుననియు వారు అంగీకరించిరి. ఇందు వలన కమ్యూనిస్టులు చైనా దేశకళ్యాణముకొరకు తమ యొక్క స్వలాభమును వదలుకొనుటకు సిద్ధపడిన దేశాభిమానులుగ తమను విద్యావంతులు గౌరవింతురని వారికి తెలియును. రెండు వార ములు రాజీ సంభాషణలు జరిగి రాజీ కుదిరెను. రాజీకి ఆయన యొక్క మూజువాణియొప్పుదల చాలుననిరి. దస్కతు చేయించు కొనలేదు. ఈలోపల డిశంబరు 20 వ తేదీన ఆర్థికమంత్రియగు టి. వి. సూంగు, చిన్‌సీ, కాన్‌సూల గవర్నరుల్ను మరియొక

మంత్రి, వీరందరు సియాన్‌కు చ్యాంగ్ కేషక్ వద్దకు వచ్చిరి. చ్యాంగ్ కేషకు సలహాదారగు ఆస్ట్రేలియా జాతీయుడగు డొనాల్డుకూడ అపుడు అచటనే యుండెను. 19 వ తేదీననే దాదాపుగ షరతులన్నియు అంగీకరించ బడెను. 22 వ తేదీన చ్యాంగ్ కేషక్ సతి సియాన్‌కు వచ్చెను. 25 వ తేదీన చ్యాంగ్ కేషక్ విడుదల చేయబడెను. వారందరు విమానములో నాన్ కింగుకు వెడలిపోయిరి. చ్యాంగ్ హుసుయలియాంగు సేనాని కూడ తన స్వంత విమానములో నాన్‌కింగుకు పోయెను. నాన్ కింగు చేరినపిమ్మట చ్యాంగ్ కేషక్, సియాన్‌లో జరిగిన సంఘటన వృత్తాంతమంతయు క్యూమిన్‌టాంగు స్థాయీ సంఘమునకు వివరించెను. తన పదవులకన్నిటికి రాజీనామా నిచ్చెను. వారు రాజీనామాల నొప్పుకొనలేదు. ఆయనకును, కమ్యూనిస్టులకును జరిగిన సంధి షరతులనెల్లను వారంగీకరించిరి. నవంబరు నెలలోపల ప్రజల ఎన్నికలుజరిపి ప్రజల కాంగ్రెసు (పార్లమెంటు)ను సమావేశ పర్చుటకును అన్ని పార్టీలకును ప్రాతినిధ్య మిచ్చుటకును తీర్మానించిరి. సర్వసేనానియగు చ్యాంగ్ కేషక్‌పై తిరుగు బాటునుచేసి అవిధేయతను కనబరచినందుకు చ్యాంగ్ హుసు యలియాంగు సేనానికి సైనిక న్యాయస్థానమువారు పది సంవత్సరముల శిక్ష విధించిరి. ఆ మరునాడు చ్యాంగ్ కేషకు ఆయనను క్షమించి యావత్తు శిక్షను రద్దుచేసెను. క్యూమింటాంగు ప్రభుత్వమువారు కమ్యూనిస్టులతో యుద్ధము మానుకొనిరి. క్యూమింటాంగు, కమ్యూనిస్టు ఉమ్మడి సైన్యములు తయారుచేసి జపాను నెదిరించుటకు సమ్మతించిరి. చాలమంది రాజకీయ ఖైదీ

లను విడుదలచేసిరి. జపానుకు అనుకూలముగ నున్నవారిని పద వులలోనుంచి తొలగించిరి. ఇటుల సియాన్ సంఘటనయొక్క సంధి షరతులు చాలవరకు నెరవేర్చబడెను.

## 3

కమ్యూనిస్టు సంఘముల మీద నున్న నిషేధములన్నియు తొలగింపబడినందున వారికి వాక్స్వాతంత్ర్యము, సభా స్వాతం త్ర్యము, పత్రికా స్వాతంత్ర్యము వచ్చినవి. వారు తమ సిద్ధాంత ములను వ్యాపింపచేసికొనుటకై ఈ స్వతంత్రము లన్నిటిని బాగుగ వినియోగించుకొనిరి. తమ ఈనాన్ ప్రాంతమునకు పక్కనున్న విశాలమైన ప్రాంతముల నన్నింటిని తమ క్రిందికి తెచ్చుకొనిరి. షెన్సీ రాష్ట్ర ములో చాలభాగము వారిక్రిందకు వచ్చెను. 60, 70 వేల చదరపు మైళ్ల వైశాల్యము కలిగినట్టియు, 20లక్షల జనసంఖ్య కలిగినట్టియు ఆ చుట్టుపట్ల ప్రాంతమునంతను వారు స్వాధీనపరచుకొనిరి. ఇందు మూలమున కమ్యూనిస్టుల పలుకుబడి క్రింద నున్న ప్రదేశము రష్యాక్రింద నున్న పశ్చిమమంగోలియా ప్రజాస్వామికమువరకును వ్యాపించెను. రష్యానుండి ఆయుధములు తెచ్చుకొనుటకు వీలు కలిగెను. అదివరకు ఆ ప్రాంతము చుట్టూ క్యూమింటాంగు ప్రభుత్వము నిర్మించిన ఆర్థిక అటకాయింపు లిపుడు తొలగినందున ఆ ప్రాంతమునకును మిగతా చైనాకును వర్తక సంబంధములు బాగుగ వృద్ధిచెందెను. రైల్వే, టెలిగ్రాఫ్ మార్గములు తెరువ బడెను. చాల అమెరికా లారీలను కమ్యూనిస్టులు విక్రయము

విశాల ప్రాంతములు కమ్యూనిస్టుల క్రిందకు వచ్చెను

పొంది, బస్ సర్వీసుల నేర్పాటుచేసిరి. ఒక బలవత్తరమైన కమ్యూనిస్టుల రాజ్యము స్థాపితమయ్యెను.

ఈనానులో కమ్యూనిస్టులచే నొక విశ్వవిద్యాలయము, మార్క్స్ - లెనిను ప్రతిష్ఠాపనము, ఒక గొప్ప గ్రంథాలయము, లిబరేషన్ దినపత్రిక, మరియు కొన్ని వార పత్రికలు, లలితకళల అకాడమీ స్థాపించబడెను. చైనా నుండియు, రష్యా నుండియు కమ్యూనిస్టు గ్రంథములు విరివిగ అచట చేరెను. ఆ పట్టణము షెన్సీ రాష్ట్రములో అతి ప్రధాన పట్టణముగ వృద్ధిచెందెను. చైనాలోని వివిధ పట్టణములలోని కమ్యూనిస్టు భావములు గల యువకులకు అది విజ్ఞానకేంద్రమయ్యెను. ఎర్ర విశ్వవిద్యాలయమను పేరును తీసివేసి, జపాను వ్యతిరేక విశ్వవిద్యాలయమని పేరు పెట్టిరి. రెండువేల మంది విద్యార్థులు అక్కడ చదువుకొనుచుండిరి. అనేక మంది విద్యావంతులు కమ్యూనిస్టులు కాకపోయినను, అక్కడికి వచ్చి చదువుకొనుటవలన కమ్యూనిస్టు భావములను ఆర్జించుకొని వెడలిపోయిరి. వారందరిపై కమ్యూనిస్టుల ప్రభావము బలపడెను. అచ్చట సాంకేతిక నిపుణులు, ఇంజనీరులు, సైనిక నాయకులు, విప్లవకారులు, జపానును ప్రతిఘటించువారు విశేషముగ తయారు చేయబడిరి. జూన్ నెలలో అక్కడ జరుగుచున్న పని విషయములో అనుమానములు కలిగి క్యూమింటాంగు ప్రభుత్వమువారు దానిని దర్శించి, రిపోర్టుచేయుటకొక అనధికారబృందమును పంపగ వారు అచటకు వెళ్లి పరిశీలించి, జపానుకు వ్యతిరేకమైన ఉపన్యాసముల నిచ్చి అచట జరుగుచున్న పనియంతయు జపానును ప్రతిఘటించు

ఈనానులో విశ్వవిద్యాలయము

టకు ఎక్కువ ఉపయోగకారిగ నున్నదని తమ నివేదికలో వ్రాసినారు. జపానువారినుండి జీతములను దీసికొనుచున్న అనేకమంది చైనా ఏజెంట్లను ప్రభుత్వమువారు జైళ్ళలో పడవేసిరి. జూన్ నెలలో చ్యాంగ్ కేషక్ తన స్వంతవిమానమును సియాన్ పట్టణమునకుపంపి కమ్యూనిస్టు నాయకుడైన చౌ-ఎన్‌లైను కూలింగు పట్టణమునకు పిలిపించుకొని అనేక విషయములు చర్చించెను. అతి త్వరితముగ ప్రజారాజ్యమును స్థాపింపవలెననియు, అందులో తమ పార్టీకికూడ భాగమిప్పించవలెననియు చౌ-ఎన్‌లై కోరెను. కమ్యూనిస్టు లాక్రమించిన ప్రాంతమునుండి తొమ్మిదిమంది ప్రతినిధులను చైనా పార్లమెంటుకు ఎన్నుకొనునట్లు అంగీకరించబడెనని కూడ పత్రికలలో ప్రకటించబడెను.

"ఇన్ని జరుగుచున్నను ఉభయ పార్టీలకును ఒకరిమీద నొకరికి నమ్మకము కుదరనేలేదు. పరస్పర అవిశ్వాసముతోనే

కమ్యూనిస్టులకే లాభము కలిగెను

ప్రవర్తించిరి. ఈ నూతన వాతావరణమును ఉభయులును తమతమ స్వంత ప్రయోజనముల కొరకుపయోగించుటకే యుద్దేశించిరి. చైనా రాజకీయవేత్తలు బయటకు తియ్యగ మాటలాడుచునే, లోలోపల మోసగించుటయే అలవాటు. ఈ షరతులవలన కమ్యూనిస్టులకే నిజమైనలాభము కలిగెను. కమ్యూనిస్టులను కొండలలోనికి వెడలగొట్టి మరికొన్ని దండయాత్రలను జరిపి వారిని నాశనము గావించుటకు సిద్ధముగనున్న సమయములో చాంగ్ కేషక్ తన ప్రాణరక్షణము కొరకు వారికి స్వతంత్రమిచ్చి వారితో సంధి చేసుకొనెను. జపానును ప్రతిఘటించవలెనను కమ్యూనిస్టుల

వాదమును తాను బలవంతముమీద అంగీకరించెను. అంతర్యుద్ధ మును ఆపివైచి క్యూమింటాంగు ప్రభుత్వముచేత జపానుతో యుద్ధము చేయించు గౌరవము కమ్యూనిస్టులకు దక్కెను. అందువలన వారికి విద్యావంతులలో అదివరకులేని పలుకుబడి కలిగెను. కమ్యూనిస్టులు గౌరవకరమైన దేశాభిమానులుగ నెంచబడిరి. వారు భూసంస్కరణ వాదులు మాత్రమేనని తీవ్ర వాదులు కారని విద్యాధికులు తలచగ, అందుకు కమ్యూనిస్టులు అభ్యంతరము చెప్పలేదు. పది సంవత్సరములు గొరిల్లా యుద్ధమునందు అనుభవము గల కమ్యూనిస్టులు ఎన్ని సంవత్సరములైనను పోరాటము సలిపి తామే చైనా దేశమును విదేశ దండయాత్రలనుండి రక్షించుటకు సమర్థుల మని పేరు పొందుటకు నిశ్చయించిరి. ఈలోపల క్యూమింటాంగు సైన్యములు జపానువారిచేత నాశనము గావింపబడుననియు, తామే దేశము యొక్క నాయకత్వమును వహించుటకు మిగిలి యుందుమనియు వారు ఆశించిరి. అంతేగాక యుద్ధముల వలన, సంఘమునకు కలుగు నాశముల మూలముసను ప్రజలకు కలుగు కష్టముల మూలమునను, పాత సాంఘిక విధానములన్నియు మారిపోయి ఆర్థిక సమానత్వ ప్రాతిపదికపై నూతనసమాజ స్థాప నకు చాల దోహదము కలుగుననియు, అందువల్ల క్యూమింటాం గుతో స్నేహముగ నున్నట్టుల నటించి, ఆ కక్షి నాశనమయ్యే వరకు పోరాటము సలిపి, దేశము యొక్క యాజమాన్యమునకు తామే హక్కుదార్లమగుదుమనియు కమ్యూనిస్టులు భావించిరి. వారే విదేశముమీదను ఆధారపడదలచలేదు. దీర్ఘకాలయుద్ధము

జరిగినకొలది గ్రామప్రజలలో ప్రవేశించి, గ్రామ పునర్నిర్మాణము గావించి, గ్రామస్థులను సైనికులుగ తయారుచేసి వారిపై తమ పలుకుబడిని గట్టిగ స్థాపించుకొనుటయే వారి కార్యక్రమము"అని ఫిడ్జు గెరాల్డు "తన చైనాలో విప్లవము" అను గ్రంథమునందు వ్రాసియున్నాడు.

క్యూమింటాంగు పాశ్చాత్య జాతుల మీద ఆధారపడినది

"క్యూమింటాంగు నాయకులు తమకు క్షీణించుచున్న గౌరవమును మరల పొందుటకు జపానుతో యుద్ధములోకి దిగిరి. ఇందువలన జపానుతో పోటీపడుచున్న పాశ్చాత్య ప్రభుత్వముల యొక్క సహాయము తమకు కలుగుననియు, అట్టి సహాయముతో అంతిమ జయమును తామే పొంది, కమ్యూనిస్టులను అణచివేయగలుగుదుమనియు తలచిరి. వీరు సామాన్య జన సముదాయము యొక్క మద్దతును వదలి అమెరికా వంటి విదేశ ప్రభుత్వ సహాయము మీద ఆధారపడదలచుటయే వీరి పతనమునకు కారణమైనది." అనికూడ ఆయన వ్రాసియున్నాడు. ప్రథమమున 1924 మొదలు 1927 వరకు జరిగిన క్యూమింటాంగు - కమ్యూనిస్టు ఐక్యత (United Front) జయప్రదము కాక క్యూమింటాంగ్‌కు నష్టమే కలుగ జేసినది. మరల రెండవ పర్యాయము 1936 నుండి 1946 వరకు ఏర్పడిన ఈ రెండు పార్టీల కలయిక క్యూమింటాంగుకు పూర్తిగ ఆత్మవినాశకరమైనది. క్యూమింటాంగుసంస్థ ఐక్యత, క్రమశిక్షణలేని బలహీనమగుసంస్థ అయినది. కమ్యూనిస్టు సంస్థ గట్టి క్రమశిక్షణ, మంచి ఐక్యత గల కార్యాచరణసంఘమైనది.

## 4

1937 వ సంవత్సరము జూలై నెల 7వ తేదీన పికింగు నగరమునకు నైరుతిమూల నున్న మార్కోపోలో వంతెనను జపాను వారు ముట్టడించిరి. చైనాప్రభుత్వ సైన్యములు గొప్ప ప్రతిఘటనమును జరిపెను. గాని జపాను సైన్యములే గెలిచెను. అందుమీద క్యూమింటాంగు ప్రభుత్వము జపాను మీద యుద్ధమును ప్రకటించెను. ఆగష్టు 13 వ తేదీన జపాను సేనలు షాంఘాయిని ముట్టడించెను. అచటి చైనా సేనలు వారి నెదిరించి పోరాడినవి. క్యూమింటాంగు యొక్క సేనలు అతి పరాక్రమముతో మూడు నెలలు పోరాడి, షాంఘాయి నుండి జపాను సైన్యములను వెడలగొట్టి, దేశములో గొప్ప ప్రతిష్ఠను సంపాదించినవి. మరియు షాంటుంగు రాష్ట్రములో క్యూమింటాంగు సేనలు తైయరు చు యాంగు వద్ద జపాను సేనలతో యుద్ధముచేసి జయముపొందెను. కమ్యూనిస్టుల క్రిందనున్న ఎనిమిదవ రూటు సైన్యముకూడ ఆగష్టునెలలో షెన్‌సీరాష్ట్రమునుండి బయలుదేరి పింఘు సింగు క్యుయాన్ వద్ద జపాను సేనల నోడించెను. కమ్యూనిస్టుల గొరిల్లాలకు నూతన నాలుగవసైన్య మని పేరు పెట్టిరి. మరియు ఎనిమిదవ రూటు సైన్యము కియాంగ్ సూ లోను, చౌహార్ సరస్సు వద్దను జపాను సేనల నోడించెను. అచట కొన్ని సోవియట్ జిల్లాలను స్థాపించెను. 1937 వ సంవత్సరము సెప్టెంబరు నెలలో క్యూమింటాంగు ప్రభుత్వమువారు ఒక జాతీయరక్షణ సలహాసంఘమును నియమించిరి. అందులో యువకచైనాకక్షి, జాతీయ సోషలిస్టుకక్షి,

జపానుతో యుద్ధములు

చైనాకమ్యూనిస్టుపార్టీ, ఇంకను కొన్ని వైజ్ఞానికసంఘములు, వీటియొక్క ప్రతినిధులు చేరియుండిరి. వారు క్యూమింటాంగు ప్రభుత్వమునకు సలహాల నివ్వవలెను. ఆ సలహాలను సాధారణ ముగ పాటించుచునే యుండిరి. 1938 వ సంవత్సరము జూలై 6 వ తేదీన చైనాలోని వివిధ రాజకీయపార్టీల యొక్కయు, వృత్తులయొక్కయు, ప్రాంతములయొక్కయు ప్రతినిధులు గల 'ప్రజల రాజకీయ కౌన్సిలు' ఏర్పాటు చేయబడెను. అందులో డాక్టర్ సన్యటుసేను యొక్క ప్రజల మూడు సిద్ధాంతములు జాతీయ మోక్షమునకు నిర్మాణమునకు ముఖ్యసూత్రములనియు, యావత్తు చైనాదేశముపైనను సైనికసర్వాధికారము చ్యాంగు కేషకునందే యుండవలెననియు, ఆయనక్రిందనే అన్ని సైన్యము లును నడుచుచుండవలెననియు తీర్మానము గావించబడెను. కాని చైనాకమ్యూనిస్టులు తామే జపానును ప్రతిఘటించుటకు దృఢ నిశ్చయము గలవారమనియు, తామే ధైర్య సాహసములతో చైనాయొక్క స్వతంత్రముకొరకు పోరాడుచున్నవారమనియు ననుభావములను ప్రజలలో వ్యాపింపచేయుటకు ఆ కౌన్సిలును వేదికగ నుపయోగించుకొనిరి. ఆ కౌన్సిలులో ఎల్లప్పుడును క్యూమింటాంగును తీవ్రముగ విమర్శించుచు తమకు మెజారిటీ లేనిచో ఆ కౌన్సిలునుండి బైటకు పోవుచు వచ్చిరి. "1937 వ సంవత్సరము సెప్టెంబరునెలలో చైనాకమ్యూనిస్టు నాయకుడు మావోసిటుంగు ఈనానులోని తన సైన్యములకు సందేశమిచ్చుచు జపానుతో చైనా జరుపుచున్న యుద్ధకాలములో కమ్యూనిస్టు కక్షి వృద్ధియగుటకు మంచి యవకాశము కలుగుననియు, మన

యావత్తు కృషిలో నూటికి 70 పాళ్ళు మన పార్టీని వృద్ధి చేసుకొనుటకే యుపయోగించుకొనవలెననియు, 10 పాళ్ళు మాత్రమే జపానుతో పోరాడుట కుపయోగించుకొనవలె ననియు ఉపన్యాస మిచ్చెను. ఈ రాజనీతి మూడు దశలుగ అమలు జరుపవలెనని ఆయన చెప్పెను. మొదటి దశలో క్యూమిం టాంగుతో రాజీపడి కమ్యూనిస్టుపార్టీ మీదనున్న నిషేధములను తొలగించుకొని కమ్యూనిస్టుపార్టీ వ్యాపించి వృద్ధిచెందుటకు ప్రయత్నించవలెను. రెండవ దశలో క్యూమిన్‌టాంగుతో సమాన మైన బలమును సంపాదించవలెను. మూడవ దశలో మధ్య చైనా యొక్క భాగములలో బాగుగ జొరబడి క్యూమిన్‌టాంగును ఓడించుటకు సోవియట్ జిల్లాలను స్థాపించవలెను అని ఆయన సందేశమిచ్చెను. ఆ సంవత్సరము అక్టోబరు నెలలో చైనా కమ్యూ నిస్టుల కేంద్ర రాజకీయ సంఘము సమావేశమై చైనా రాజకీయ ములలో సైనికబలము మాత్రమే ప్రధానస్థానము నాక్రమించు చున్నందున కమ్యూనిస్టుపార్టీ యొక్క సైన్యములను బాగుగ వృద్ధిచేసి భావికాలములో రాజ్యాధికారము కొరకు క్యూమిన్ టాంగుతో పోరాటము జరుపుటకు తయారు కావలెనని తీర్మా నించెను. చైనా కమ్యూనిస్టులు ఈ రాజనీతిని, ఈ తత్వమునే అప్పటినుంచి ఏకరీతిగ ఎనిమిదిసంవత్సరములు కార్యాచరణమునం దుంచిరి. వారిని నడుపుటకు, వారికి మద్దతు చేయుటకు, రుష్యా నియంతయగు స్టాలిన్ వారివెనుక నుండెను" అని చ్యాంగుకేషకు తన "చైనాలో సోవియటు రుష్యా" అను గ్రంథమునందు వ్రాసినాడు.

## 5

చైనాలో జపాను ఆక్రమణలు, జాతీయ ప్రభుత్వము చుంకింగులో చేరెను

1937 వ సంవత్సరము ఆఖరుభాగమున క్యూమిన్‌టాంగు సేనలు ఉత్తర చైనాలో జపానువారి చేతులలో నోడిపోయి పికింగు, టీన్‌ట్సిన్ పట్టణముల నుండి వెడలి పోయెను. చాహార్, సుయూాయన్ రాష్ట్రి ములు తిరిగి జపానువారి స్వాధీనమయ్యెను. నవంబరు నెలలో షాంఘూయి నగరము జపాను వారికి లోబడెను. డిశంబరు నెలలో నాన్‌కింగును జపానువారు స్వాధీనపరచుకొనిరి. క్యూమిన్‌టాంగు ప్రభుత్వము దేశద్రోహము గావించుచున్నదనియు, జపానుతో లాలూచీఅయి లోబడుచున్న దనియు కమ్యూనిస్టులు నిందలు మోపసాగిరి. 1938 వ సంవత్సరము అక్టోబరు నెలలో జపానువారు కాన్‌టన్, వూహాను పట్టణముల నాక్రమించిరి. చైనా ఉత్తర ప్రాంతము, తూర్పు సముద్ర ప్రాంతము, యాంగ్సినదిలోయ యావత్తు జపానువారి స్వాధీనము లోనికి వచ్చెను. ఇదియే చైనాలోని మిగుల భాగ్యవంతమైన నాగరికమైన భాగము. క్యూమింటాంగు ప్రభుత్వము పశ్చిమవైపున పర్వత ప్రాంతములలోనున్న చున్‌కింగు నగరమునకు తరలిపోయి దానిని యుద్ధకాలపు రాజధానిగ గావించుకొనిరి. వారితోకూడ అనేకమంది విద్యార్థికులు మధ్యమ తరగతిప్రజలు చున్‌కింగు నగరమునకు తరలివచ్చిరి. అక్కడనే విద్యాలయములను స్థాపించుకొనిరి. ఈ యుద్ధకాలములో జపానువారు చైనాలోని పెద్ద పట్టణములను మాత్రమే ఆక్రమించుచుండిరి. అచట వారి నెదిరించిన క్యూమింటాంగు సేనలు నాశనమగుచుండెను. చాల

కాలమువరకు చైనా దేశముయొక్క పల్లె ప్రాంతముల జోలికి జపానువారు పోలేదు. అచట కమ్యూనిస్టులయొక్క సైన్యములు, గొరిల్లాలు విశేషముగ వృద్ధిచెందుచుండెను. తరువాత కొంతకాలమునకు మాత్రమే జపానువారు ఈసంగతి తెలిసికొని చైనాలోని గ్రామముల వైపుకు తమదృష్టిని మరల్చిరి.

1939 వ సంవత్సరము సెప్టెంబరు నెలలో రెండవ ప్రపంచ యుద్ధము ప్రారంభమయ్యెను. ఇంగ్లాండు, ఫ్రాన్సులు ఒకవైపున జర్మనీ, ఇటలీ లొకవైపున యుద్ధము సాగించెను. కొంతకాలము అమెరికా తటస్థముగ నుండెను. 1939 వ సంవత్సరము ఆగష్టు 23 వ తేదీన రుష్యాకమ్యూనిస్టు నియంత యగు స్టాలిన్, జర్మనీఫాసిస్టు నియంత యగు హిట్లరుతో పరస్పరసహాయ యొడంబడికను గావించుకొనెను. ఈ రుష్యా-జర్మనీ (కమ్యూనిస్టు-ఫాసిస్టు) ఒడంబడికను చైనా కమ్యూనిస్టులు విశేషముగ ప్రశంసించిరి. 1941 వరకును చైనా కమ్యూనిస్టులు అమెరికాకును, ఇంగ్లండుకును వ్యతిరేకులుగ నుండిరి. చ్యాంగ్ కేషకు అమెరికాకును, ఇంగ్లండుకును స్నేహితుడుగ నున్నందున ఆయనను వారు తీవ్రముగ ఖండించిరి. సోవియటురుష్యా నియంతయగు స్టాలిన్ అప్పటినుంచి సుమారు 2 సంవత్సరములవరకు జపానుకు అనుకూలముగ నుండి జపానువారు తమపైకి దండయాత్ర జరుపకుండగను, వారు బ్రిటన్ అమెరికాలతో మాత్రమే పోరాడునట్లును కుట్రలు పన్నెను. చైనాకమ్యూనిస్టులు కూడ ఆ కాలములో జపానుతో సరిగ పోరాడుటలేదనియు, పోరాడుచున్నట్లు నటన మాత్రమే సలుపు

ద్వితీయ ప్రపంచయుద్ధము

చుండిరనియు, డాక్టర్ సన్యటుసేను యొక్క ముఖ్య శిష్యుడును, క్యూమింటాంగు ప్రభుత్వమునకు ఉపాధ్యక్షుడును నైన వాంగు చింగువై జపానుకుపోయి జపాను సామ్రాజ్యవాదులతో చేరుటకు ప్రోత్సహించిరనియు, చ్యాంగ్ కేషకు తన "చైనాలో సోవియటు రుష్యా" అను గ్రంథమునందు వ్రాసియున్నాడు. అది ఎంత వరకు నిజమో కాని, వాంగు చింగువై జపానుతోచేరి జపాను యొక్క సహాయమును పొంది జపాను సంరక్షకత్వము క్రింద నొక కీలుబొమ్మ ప్రభుత్వమును చైనా దేశముపైన నాన్‌కింగు నగరమున స్థాపించుట మాత్రము జరిగినది. చ్యాంగు కేషకు కమ్యూనిస్టులతో కలయుట వాంగుచింగువై కిష్టములేక ఆయన జపానుతో కలసెననియే చాలమంది యభిప్రాయ పడుచున్నారు. శాంతి, కమ్యూనిస్టులకు వ్యతిరేకత, జాతీయ పునర్నిర్మాణము అనునవి ఈ కీలుబొమ్మ ప్రభుత్వము యొక్క ఆదర్శములని ప్రకటింపబడెను. 1941 ఏప్రిలులో స్టాలిను కూడ జపానుతో తటస్థ విధాన యొడంబడికను గావించుకొనెను.

క్యూమింటాంగు క్రింద నుండిన రాష్ట్రములలో జపాను వారు తాత్కాలికముగ ఆక్రమించుకొన్న భూభాగములలోనికి జపానువారిని ప్రతిఘటింతుమను పేరున కమ్యూనిస్టు గొరిల్లాలు, సైన్యములు జొరబడసాగినవి. అక్కడ కూడ కమ్యూనిస్టు రాజ్యమును స్థాపించుటయే వారి యుద్దేశము. అందువలన ఉభయ పార్టీలకును కలతలు మరల వృద్ధిచెందెను.

1939 వ సంవత్సరము ప్రథమభాగమున క్యూమింటాంగు క్రింద నుండిన షెన్‌సీ రాష్ట్రములోనికి కమ్యూనిస్టుల 18 వ

రూట్ సైన్యము జొరబడినది. అక్కడ నున్న క్యూమింటాంగు సేనలను గొరిల్లాలను ముట్టడించి, వాటిలో కొన్నిటిని తమ క్రిందికి చేర్చుకొన్నది. ఇటులనే కమ్యూనిస్టు సైన్యములు పహీంషాన్ వద్దనున్న క్యూమింటాంగు తాలూకు జపాను వ్యతిరేక సేనలను చుట్టుముట్టి ముట్టడించి వాటి సేనానాయకుని హత్య గావించిరి. మధ్యహోపే, పశ్చిమ షాంటంగు రాష్ట్రములలోకూడ కమ్యూనిస్టుసేనలు జొరబడి అక్కడనున్న క్యూమింటాంగు సైన్యములను ముట్టడించి, నిరాయుధులను గావించి, అచటి ప్రభుత్వాధికారులను వెడలగొట్టినవి. ఇంతేగాక క్యూమింటాంగు క్రిందనున్న ఇతర స్థలములలోకూడ క్యూమింటాంగు ప్రభుత్వముపై కమ్యూనిస్టులు తిరుగుబాట్లను లేవదీసిరి. షెన్‌సీరాష్ట్రములో ప్రభుత్వ సేనలలో కొందరు ప్రభుత్వముపై తిరుగుబాట్లు గావించిరి. ఆ సంవత్సరము జూన్ నెల 10 వ తేదీన చ్యాంగ్ కేషక్, కమ్యూనిస్టు నాయకులు చౌ ఎన్ లైను, యహ చీయన్ ఇంగ్‌ను పిలిపించి చైనా కమ్యూనిస్టులు సియాన్ ఒడంబడిక ప్రకారము నడచుకొనవలెననియు, ప్రభుత్వముయొక్క ఉత్తర్వులకు లోబడవలెననియు, ప్రభుత్వ చట్టములను ధిక్కరించకూడదనియు చెప్పెను. 1940 వ సంవత్సరము జనవరి నెలలో క్యూమింటాంగు సైన్యముల ప్రధాన సేనాధిపతియగు హోయింగ్‌చిన్ కమ్యూనిస్టులు తమ సేనలను వృద్ధిచేసికొనకూడదనియు, క్యూమింటాంగు ప్రభుత్వముయొక్క ఉత్తరువులు లేనిది నూతన కమ్యూనిస్టు జిల్లాలను స్థాపించకూడదనియు, కమ్యూనిస్టు ప్రధాన సేనాధిపతి యగు యహచీయన్ ఇంగుతో చెప్పెను. ఈ ఉత్తరువు

లను కమ్యూనిస్టులు లక్ష్యపెట్టలేదు. వారు వారి ఇచ్ఛవచ్చి నట్లుగ సైన్యములను పెంచుకొనుచుండిరి, గొరిల్లాలను వృద్ధి చేసుకొనుచుండిరి. జిల్లాలను స్థాపించుచుండిరి. ఉత్తరచైనా లోను, ఈశాన్య చైనాలోను తమ చిత్తము వచ్చినటుల గ్రామములలో వ్యాపించుచుండిరి. వీటిని ఆపుటకు చ్యాంగు కేషకునకు చేతగాకపోయెను. కమ్యూనిస్టులు హోపేలో నున్న క్యూమింటాంగు సేనలను వెళ్ళగొట్టి, షెన్సీలోనున్న క్యూమిం టాంగు సేనలను ముట్టడించి, ఎల్లోనదికి తూర్పుగ సాగనంపిరి. అటులనే షాంటంగు రాష్ట్రములో నున్న క్యూమింటాంగు సేన లను ఎల్లోనదియొక్క ఉత్తరభాగమునకు తరిమివేసిరి. 1940 వ సంవత్సరము జూలై 16 వ తేదీన మరల చౌ ఎన్ లైని యహాచీ యన్ ఇంగును చ్యాంగ్ కేషకు పిలిపించి మందలించెను. కాని కమ్యూనిస్టుల నూతన నాలుగవనంబరు సైన్యము యాంగ్‌సీ నదిని దాటి ఉత్తరముననున్న రెండు పట్టణములను పట్టుకొనెను. అప్పుడు ప్రభుత్వపక్షమువారు కమ్యూనిస్టుల నూతన నాలుగవ నంబరు సైన్యపు సేనాధిపతికి ఇక ముందుకు సాగిపోకూడదని అక్టోబరు 19 వ తేదీన తంతి నిచ్చిరి. డిశంబరు 9 వ తేదీన చ్యాంగు కేషక్ స్వయముగ కమ్యూనిస్టుల 18 వ పటాలమును డిశంబరు 30 వ తేదీలోపల ఎల్లోనదిని దాటి ఉత్తరముగ పోవలసినదనియు, నూతన నాలుగవ ప్రభుత్వపటాలమును యాంగ్‌సీనదిని దాటి ఉత్తరముగ పోవలసినదనియు అచటినుండి జనవరి 31 వ తేదీ లోపల ఎల్లోనదిని దాటి ఉత్తరముగ పోవలసినదనియు ఉత్తరువు నిచ్చెను. ఈ ఉత్తరువును కమ్యూనిస్టుల నూతన నాలుగవ నంబరు

సైన్యము ధిక్కరించెను. 1941 వ సంవత్సరవము జనవరి 5 వ తేదీన కమ్యూనిస్టుల నూతన 4 వ నంబరు సైన్యము షెన్‌సీలో ప్రభుత్వసేనలను ముట్టడించెను. అందుమీద జనవరి 17 వ తేదీన జాతీయసైనిక కౌన్సిలువారు ఆ నూతన నాలుగవనంబరు పటాలమును రద్దుపరచిరి. ఆ పటాలముయొక్క సేనానాయకుడైన ఏటింగ్‌ను పట్టుకొని విచారించి శిక్షవేసిరి. దేశములో కమ్యూనిస్టుపార్టీయావశ్యకత లేదనియు, కమ్యూనిస్టు సైన్యములు, గొరిల్లాలు చేసిన గ్రామముల ఆక్రమణ అశాస్త్రీయమైనదనియు చ్యాంగ్ కేషకు ప్రభుత్వము ప్రకటనమును కూడ గావించెను. ఈనాను ప్రాంతమునుండి పడమరకు కమ్యూనిస్టులకు రాకపోకలు, సామగ్రిసరఫరాలు లేకుండ అటకాయించుటకు క్యూమింటాంగు సైన్యములు దక్షిణ షెన్‌సీలో నుంచబడెను.

1940 వ సంవత్సరము జనవరినెలలో "నూతన ప్రజారాజ్యము"అను గ్రంథమును కమ్యూనిస్టు నాయకుడగు మావోసిటుంగు ప్రకటించెను. ముందుగ జాతీయ ప్రజావిప్లవమును సాగించి అందులోనుంచే కమ్యూనిస్టు విప్లవమును నడుపుదుమనియు, ఇందుకు తాము కార్మిక వర్గములమీదను, రైతాంగము మీదను ఆధార పడుచున్నామనియు ఆయన అందులో వ్రాసెను. 1940 వ సంవత్సరము ఆగస్టు 29 వ తేదీన కమ్యూనిస్టులు నాలుగులక్షల సైన్యమును పోగుచేసుకొని జపాను సైన్యమునకు వ్యతిరేకముగ ఉత్తర చైనాలో బయలుదేరిరి. ఆగస్టు 20 వ తేదీ మొదలు డిశంబరు 5 వ తేదీవరకు కమ్యూనిస్టు సైన్యములు జపాను సేనలను ఎదుర్కొని, రైలువేలను, మోటారుబండ్లను

పాడుచేసి, అనేకచోట్ల జపాను సైన్యముల నోడించెను. కమ్యూనిస్టు గొరిల్లాలు రాష్ట్రములలోని పల్లెలలోను బస్తీలలోను ఆకస్మికముగ జపానువారిపై పడి ఘాతుక కృత్యములను సలిపిరి.

## 6

1941 వ సంవత్సరము జూన్ 21 వ తేదీన సోవియటు రుష్యాపైన జర్మనీ దండెత్తెను. ఆ సంవత్సరము డిసెంబరునెల 8 వ తేదీన పసిఫిక్ మహాసముద్రములో అమెరికావారి నౌకాశ్రమయగు పెరల్ హార్బర్ను జపానువారు ముట్టడించిరి. సోవియటు రుష్యాకును, ఇంగ్లాండు అమెరికాలకును స్నేహము కుదిరెను. వీరందరును మిత్రమండలిగచేరి జపాను, జర్మనీ, ఇటలీలతో వివిధ రంగములలో యుద్ధము సలిపిరి. 1942 వ సంవత్సరము జనవరి 1 వ తేదీన చ్యాంగుకేషకు ప్రభుత్వము, అమెరికా, ఇంగ్లాండు, రుష్యాలతో చేరెను. చైనా ప్రాంతపు సైన్యమున కంతకును మిత్రమండలివారు చాంగ్ కేషక్నే సర్వ సేనాధిపతిగ నియమించిరి. చైనా ప్రాంతములో చైనా ప్రజాస్వామికము, ఇండోనీసియా, ఫార్మోజా ద్వీపము, ఇండో చైనా చేర్చబడెను. ఈ ద్వితీయ ప్రపంచ యుద్ధములో మిక్కిలి ధనవంతమైన అమెరికాకు ముఖ్యస్థానము లభించెను. సోవియటు రుష్యా అత్యంతముగ బలపడెను. సోవియటు రుష్యా ప్రభుత్వము యూరపు ఖండములోని తూర్పు దేశములను, పోలెండును, జర్మనీలో తూర్పు భాగమును ఆక్రమించెను.

రష్యా, చైనా, ఇంగ్లాండు, అమెరికా లొకేపైపున

ఈ ద్వితీయ ప్రపంచసంగ్రామము 1945 వరకును జరిగెను. ఈ కాలములో సోవియటు రుష్యా యొక్క రాజనీతిననుసరించి చైనా కమ్యూనిస్టులు క్యూమిన్‌టాంగుతో స్నేహముగ నున్నటులే నటించిరి. చైనా ప్రజాస్వామికములోని ఉత్తర- ఈశాన్య భాగములను మంచూరియా దేశమును కమ్యూనిస్టులు వశపరచుకొనిరి.

కమ్యూనిస్టులు మంచూరియాను వశపర్చుకొనిరి

అచట కమ్యూనిస్టులు జపానుకు తీవ్రమైన ప్రతిఘటనమును సలిపిరి. జపానువారు తమయొక్క సేనలలోనికి నూటికి అరువదియవ వంతు భాగమును, తమక్రింద కీలుబొమ్మగనున్న నాన్‌కింగు లోని వాంగుచింగువై యొక్క సేనలలో నూటికి తొంబది పాళ్లను, మంచూరియాలోను, చైనాయొక్క ఉత్తర ఈశాన్య ప్రాంతములలోను జొరబడి వ్యాపించియున్న కమ్యూనిస్టులపైకి పంపిరి. కమ్యూనిస్టులు తాము చక్కగ తయారుచేసిన సైన్యముల మూలముననుу, గొరిల్లాల మూలముననుు వాటిని పూర్తిగను, జయప్రదముగను ఢీకొనిరి.

1943 వ సంవత్సరములో చైనాయొక్క ఉత్తరప్రాంతములను దర్శించిన విదేశ పత్రికాప్రతినిధులు కమ్యూనిస్టుల 18 వ రూటు సైన్యమువలన డెబ్బదిలక్షల గొరిల్లాలు తయారుచేయబడిరనియు, ఇంతేకాక మామూలు సైన్యములు ఆరులక్ష లుండెననియు, ఈ కమ్యూనిస్టు సైన్యములకు భోజనపదార్థములు, గృహవసతులు, వస్త్రములు, సామగ్రులు అమర్చుటకు బాగుగ తయారు చేయబడిన ఒక కోటి ఇరువది లక్షలమంది స్వచ్ఛంద సైనికులు

కమ్యూనిస్టు సైన్యములు గొరిల్లాలు

పనిచేయుచుండిరనియు వ్రాసియున్నారు. 1944 వ సంవత్సరము వరకు కమ్యూనిస్టులక్రింద మంచూరియాలోను, ఉత్తర ఈశాన్య చైనాలోను గల గ్రామముల జనసంఖ్య తొమ్మిదికోట్ల ఏబది లక్షలని అంచనా వేయబడెను.

ఈ గ్రామము లన్నిటిలోను భూసంస్కరణలు, శిస్తు తగ్గింపులు, విద్యా వైద్య సౌకర్యములు, ప్రజలచే సరాసరి ఎన్నుకొనబడిన గ్రామ పంచాయితీలు స్థాపింపబడెననియు, ప్రతి పంచాయితీలో పార్టీ భేదములేకుండ ఎన్నికలు జరిగెననియు, కమ్యూనిస్టు పార్టీ సభ్యులు మూడవ వంతు మాత్రమే యుండునట్లు ఏర్పాటుచేసిన ప్రజారాజ్య మయ్యెననియు తెలిపియున్నారు.

కమ్యూనిస్టుల పాలనము, భూసంస్కరణములు

ఈ ప్రజలందరును విదేశ దండయాత్రలనుండి తమను కాపాడి తమయొక్క సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడుచున్న రక్షకులుగ కమ్యూనిస్టులను గౌరవించిరి. వారి యాజ్ఞల ప్రకారము అసంఖ్యాకులుగ కమ్యూనిస్టు సైన్యములలోను, గొరిల్లాలలోను ఈ ప్రజలు చేరిరి. వ్యవసాయము వృద్ధిచెందెను. అనేక భూములు వ్యవసాయములోకి తేబడెను. నీటివనరులను ఏర్పాటు చేసిరి. గ్రామపరిశ్రమలను పునరుద్ధరించిరి. గ్రామములయొక్క దారిద్ర్యమును పోగొట్టుటకు తోడ్పడిరి. సర్వవిధములైన పునర్నిర్మాణము ఈ కమ్యూనిస్టుల రాజ్యములో జరిగి వారియందు ప్రజలు భక్తిని కలిగియుండిరి. ఈ కమ్యూనిస్టు రాజ్యమునకు మావోసిటంగు అధ్యక్షుడుగను, చౌఎన్‌లై ఉపాధ్యక్షుడుగను, చూతే సర్వసేనాధిపతిగను ఎన్నుకొనబడిరి. 1942 వ సంవత్సరములోను,

1943వ సంవత్సరములోను జపానువారికిని, కమ్యూనిస్టులకును పెద్ద పెద్ద యుద్ధములు జరిగెను. ఒకప్పుడు వారు, ఒకప్పుడు వీరు గెలుచుచుండిరి. తమయొక్క జాతీయ విప్లవ కార్యక్రమమును గ్రామములలోకి, ప్రజలలోకి తీసికొనిపోక కేవలము సైనికబలము మీద ఆధారపడుట క్యూమింటాంగుప్రభుత్వము చేసిన గొప్ప తప్పిదమనియు ఇందువల్లనే ఆ ప్రభుత్వము పడిపోయినదనియు "చైనాలో విప్లవము" అను తన గ్రంథమునందు ఫిడ్జిగెరాల్డు వ్రాసియున్నాడు.

ఈ ప్రపంచయుద్ధ కాలములో దక్షిణ ఆగ్నేయ, పశ్చిమ చైనా యంతయు క్యూమింటాంగుపాలనముక్రిందనే యుండెను. చైనాప్రజాస్వామికములో ముప్పదికోట్ల జనసంఖ్య గల గొప్ప భాగము క్యూమింటాంగుప్రభుత్వమునకే చెందియుండెను. కాని దీనిలో చాలభాగమును జపానువారు ఆక్రమించిరి. అచట క్యూమింటాంగుపాలనము నామమాత్రముగ నుండెను. చుంకింగు లోని క్యూమింటాంగుప్రభుత్వమే శాస్త్రీయప్రభుత్వ మైనందున

**చుంకింగులో కమ్యూనిస్టురాయబారి**

సియాన్ ఒడంబడిక ప్రకారము కమ్యూనిస్టులు తమ రాయబారులను చుంకింగులో నుంచిరి. కాని ఆ రాయబారులకును, క్యూమింటాంగు ప్రభుత్వమునకును స్నేహసంబంధములుగాని, సహకారముగాని, ఉమ్మడి కార్యక్రమములుగాని, కలయికగాని లేక తటస్థముగ మాత్రముండిరి. ఉత్తరమున, ఈశాన్యమున జరుగుచున్న కమ్యూనిస్టు రాజ్య వ్యాపకమునకు, నిర్మాణమునకు క్యూమింటాంగు ప్రభుత్వము ఎట్టి ఆటంకములు కలుగచేయుటలేదు, కలుగచేయ

గల స్థితిలోకూడ లేదు. అమెరికావారుమాత్రము చ్యాంగ్ కేషకు ప్రభుత్వమునకే జపానును ఎదిరించి పోరాడుటకు తమయొక్క ద్రవ్యమును, ఆయుధసామగ్రిని ఇచ్చుచుండిరి. క్యూమింటాంగుకు జపానుకు అప్పుడప్పుడు జరుగుచున్న పోరాటములలో క్యూమింటాంగు సైన్యములు కొన్నిచోట్ల గెలిచినను చాలచోట్ల ఓడిపోయి జపానుకు లొంగిపోవుచుండెను.

ఇంగ్లాండు అమెరికాలు చైనాలోని అన్ని ప్రత్యేక హక్కులను వదులుకొనెను

1942 వ సంవత్సరము అక్టోబరు 9 వ తేదీన అమెరికా ఇంగ్లాండు ప్రభుత్వములు తమకు చైనాలో గల సమస్తమైన ప్రత్యేకహక్కులను వదులుకున్నామని చైనా ప్రభుత్వాధ్యక్షుడగు చ్యాంగుకేషకుకు తెలిపిరి. ఇందువలన చైనాప్రజలలో అమెరికా, ఇంగ్లాండులయందు ఎక్కువ స్నేహాభావము కలిగెను. కమ్యూనిస్టులు మాత్రము దీనిని సామ్రాజ్యవాదుల పన్నాగమని పరిహసించిరి.

1945 వ సంవత్సరము మే 2 వ తేదీన సోవియటు రుష్యా సైన్యములు బెర్లిను నగరమును పట్టుకొనెను. నాజీ జర్మనీ పడిపోయెను. ఆగస్టు 8 వ తేదీన సోవియటు రుష్యావారు జపాను మీద యుద్ధమును ప్రకటించిరి. వెంటనే మంచూరియాలో జొరబడి అచటనున్న జపాను సైన్యముల నోడించి మంచూరియాను అంతను ఆక్రమించిరి. చైనా కమ్యూనిస్టులు కూడ చూతే యొక్క సర్వసేనాధిపత్యము క్రింద "ప్రజల విముక్తిసైన్యము" అను పేరున ఒక గొప్ప సైన్యమును తయారుచేసి సోవియటు రుష్యా సేనలతోకలిసి జపానువారితో పోరాటములను సలిపిరి.

జపాను మంచూరియాలో ఓడిపోవుటవలన, క్యూమిన్‌టాంగు సేనలు అమెరికా సహాయముతో దక్షిణమున జపానును ఓడించి తమ రాజ్యమును స్వాధీన పరచుకొనుటకు ప్రయత్నించుచుండెను.

ఆటంబాంబుతో ద్వితీయ ప్రపంచ సంగ్రామము ముగిసినది

ఇంతలో అమెరికా వారియొక్క ఆటంబాంబులు జపానుదేశము లోని హిరోషిమా, నాగసాకీ పట్టణముల మీద వేయబడినందున జపానువారు పాదాక్రాంతులై ఆగస్టు 10 వ తేదీన తాము యుద్ధము చాలించి మిత్రమండలికి లొంగి పోవుచున్నామని జపాను ప్రభుత్వము స్విట్జర్లాండు, స్వీడను ప్రభుత్వములద్వారా లేఖను పంపెను. ఆగస్టు 11వ తేదీన ఏవిధముగ జపాను ప్రభుత్వము లొంగి పోవలసినది ఆ కార్యక్రమము నంతను జపాను ప్రభుత్వమునకు తెలియపరచుచు అమెరికావారు స్విట్జర్లాండు ప్రభుత్వమునకు ప్రత్యుత్తరమును పంపిరి. జపానులొంగిపోవుటకు సంసిద్ధతను తెలుప

నలుబదియొక్క దిన ములు క్యూమింటాంగు కమ్యూనిస్టులమధ్య సంధి సమావేశములు

గనే చ్యాంగు కేషకు మావోసిటుంగును చుంగుకింగు పట్టణమునకు రావలసినదని వార్తాహరులను పంపెను. అదివరకు 1944వ సంవత్స రములోఅమెరికా వారి మధ్యవర్తిత్వమున చ్యాంగు కేషకుకు కమ్యూనిస్టులకు రాజీప్రయత్నములు జరిగి అవి విఫలమాయెను. మరల 1945 సంవత్సరము ఆగస్టునెల 27వ తేదీన అమెరికా రాయ బారియగు పాట్రికు హర్లే చైనా కమ్యూనిస్టు ప్రధాన కార్య స్థానమగు ఈనాను పట్టణమునకు విమానములోపోయి మావోసి టుంగును చుంగుకింగుకు తీసికొనివచ్చెను. 41 దినములు వరుసగ చైనా ప్రభుత్వ ప్రతినిధులును, కమ్యూనిస్టు ప్రతినిధులును ఐదు

సమావేశములు జరిపిరి. అక్టోబరు నెల 10 వ తేదీన ఉభయ పార్టీల మధ్యజరిగిన సంభాషణలయొక్క సారాంశము ప్రకటించ బడెను. అది ఏమనగ :

(1) చైనా జపానుయుద్ధము జయప్రదముగ ముగిసి నందున నూతన శాంతియుతమైన జాతీయ పునర్నిర్మాణ యుగ మును ప్రారంభించవలసి యున్నది. అందుకు జాతీయ అంతర్యుద్ధ మును మాన్పించుటకును, ఉభయ పార్టీలమధ్య శాశ్వతమైన ఐక్యత, సహకారము కలుగుటకును, శాంతి, ప్రజారాజ్యము, జాతీయైక్యత స్థాపించబడి చైనా దేశమును స్వతంత్రమైన, స్వేచ్ఛాయుతమైన, సంపన్న యుక్తమైన, బలవంతమైన జాతిగ నిర్మాణము గావించుటకును, డాక్టర్ సన్యటుసేను యొక్క మూడు ప్రజల సిద్ధాంతములను పూర్తిగ అమలు జరుపుటకును చ్యాంగుకేషకు నాయకత్వముక్రింద సమష్టి ప్రయత్నములు చేయవలసి యున్నది. సైన్యముల నన్నిటిని జాతీయముగ చేయ వలెను. అన్ని రాజకీయ పార్టీలకు చట్టసమ్మతమైన హోదా, సమానత్వము లుండవలెను.

(2) చైనా ప్రభుత్వ మొక రాజకీయ సలహా సమావేశ మును పిలువవలెను. అందులో అన్ని పార్టీలయొక్క ప్రతినిధు లును ఏ పార్టీకి చెందని నాయకులును సభ్యులుగ నుండవలెను. వారందరును శాంతియుతమైన జాతీయ పునర్నిర్మాణము యొక్క కార్యక్రమమును, జాతీయ పార్లమెంటును సమావేశ పరచు పద్ధ తిని గూర్చి చర్చించవలెను.

(3) జాతీయ పార్లమెంటుకు రావలసిన ప్రతినిధులను గూర్చియు, జాతీయ పార్లమెంటు యొక్క అంగవిధానమును గూర్చియు, ఎన్నికల చట్టమును గూర్చియు ఏర్పడిన సమస్యలలో ఉభయ పార్టీలమధ్య ఏకాభిప్రాయము కుదరనందున రాజకీయ సలహా సమావేశము దానివిషయమై నిర్ణయమునకు ప్రయత్నించ వలెను.

(4) చైనాలోని సైన్యముల నన్నిటిని ప్రభుత్వమే పున ర్నిర్మాణము గావించి దేశమునంతను సైనిక జిల్లాలుగ విభజించి ఎక్కడెక్కడ ఏ సైన్యములుండవలెనో నిర్ణయించవలెను. తమ సైన్యములను 20, 24 పటాలములుగ నుంచుటకును మాంగే రైలువేకు ఉత్తర ప్రాంతమునను, కియాంగ్సిలోని ఉత్తర భాగ మునను తమ సైన్యములను స్థావరముగ నుంచుటకును కమ్యూ నిస్టులొప్పుకొనిరి. ప్రభుత్వ పక్షమున, జాతీయ సైన్యములనన్ని టిని పునర్నిర్మాణము చేయుటకు ఒక కార్యక్రమము నేర్పాటు చేయవలసి యున్నదనియు, అప్పుడు చైనా కమ్యూనిస్టు సేనలను పునర్నిర్మాణము చేయు విషయము ఆలోచింపబడుననియు, ఈ విషయములనన్నిటిని గురించి సలహానిచ్చుటకు ముగ్గురు సభ్యులు గల ఒక ఉపసంఘమును ఏర్పాటు చేయవలెననియు చెప్పబడెను.

(5) ఏ ఏ ప్రాంతములలో జపానువారు విడుదల చేసిన ప్రదేశముల నెవరాక్రమించుకోవలెనో నిర్ణయము కావలెనని కమ్యూనిస్టులు కోరిరి. ప్రభుత్వముయొక్క ఉత్తరువులకు కమ్యూ నిస్టు సేనలు పూర్తిగ లోబడి నడచినపుడే జపాను విడుదల చేసిన ప్రాంతములను కమ్యూనిస్టులు స్వాధీన పరచుకొను సంగతి

ఆలోచింతుమని ప్రభుత్వ పక్షమున జవాబు చెప్పబడెను అని అందులో నున్నది.

చుంగుకింగు నుంచి ఈనాను పట్టణమునకు వెళ్లుచు మావో సిటంగు చైనాకు ఒక్కటే మార్గము కలదని, అది శాంతియేనని అదియే అతి ముఖ్యమైనదని, తక్కిన ఆలోచనలు తీసుకొని రాకూడదని చెప్పెను. ఆ విషయములలో సహకరించుటకు క్యూమింటాంగు కాని, చైనా కమ్యూనిస్టుపార్టీ కాని, ఇతర పార్టీలు కాని ఏ విధమైన సంకోచములు, భయములు కలిగియుండ కూడదనియు, అందరును కలిసి చ్యాంగు కేషకు యొక్క నాయకత్వముక్రింద శాంతిని, ప్రజారాజ్యమును జాతి వైక్యతను స్థాపించవలసినదనియు, డాక్టర్ సన్యాటుసేను యొక్క మూడు ప్రజల సిద్ధాంతములను అమలుపరచవలెననియు ఆయన చెప్పెను. కాని ఆయన ఈనానుకు వచ్చిన ఒక నెల లోపలనే ఈ పై ఒడంబడికలను పూర్తిగ తిరస్కరించెను అని చ్యాంగుకేషకు తన గ్రంథములో వ్రాసినాడు. అంతేకాక ఈ 41 దినములు చుంగుకింగులో జరిగిన చర్చలన్నియు చైనాదేశము నంతను ఆకర్షించెననియు, వాటిని తమకు అనుకూలముగ త్రిప్పు కొనుటకై చైనా కమ్యూనిస్టులు ఉపయోగించుకొనిరనియు, ఈ 41 దినములలోనే తాము చేయదలచిన తిరుగుబాట్లను సాగించు చుండిరనియు కూడ ఆయన వ్రాసియున్నాడు. అక్టోబరు నెల 17 వ తేదీన కమ్యూనిస్టు పత్రికయైన 'సింకన్ డై లీ న్యూస్'లో సెప్టెంబరు 11 నుంచి అక్టోబరు 11 లోపల కమ్యూనిస్టులు రెండు వందల పట్టణములను వశపరచుకొనిరనియు, అనేక రైల్వే మార్గ

ములను స్వాధీనపరచుకొనిరనియు, ఉత్తర చైనాకును, మధ్య చైనాకును రాకపోకలు లేకుండ అన్ని ఆటంకములు కలుగచేసిరనియు, షాన్ హైక్ వాన్ నుండి దక్షిణమున హాంగ్ చూ వరకు గల సముద్ర మార్గము నంతను ఆక్రమించిరనియు, వాంచూ నుండి మూచే వరకు ఎల్లోనది పొడుగున నున్న కియాంగ్ అన్హ్వై రాష్ట్రములను స్వాధీనము పొందిరనియు వ్రాయబడ్డది. ఈసంధి రాయబారముల కాలమునంతను తన కనుకూలముగ వినియోగించెను. "ఈసంధి షరతులు మాట్లాడుచునే చ్యాంగు కేషకు ద్రోహముచేయ తలపెట్టెను. బందిపోటుదొంగలను అణచి వేయు చట్టము నమలులో పెట్టి కమ్యూనిస్టుల ప్రజల విముక్తి సైన్యమును చాహారు, షాన్సీ రాష్ట్రములలో ముట్టడింపజేసి యోడించెను. 10వ అక్టోబరు ఒడంబడిక షరతులను ప్రకటించిన మరు దినముననే పదిహేడులక్షల క్యూమింటాంగు సేనలను అనేక చోట్ల కమ్యూనిస్టు సేనలను ముట్టడించుటకు పంపెను. అమెరికా సామ్రాజ్యవాదులు కేవలము చ్యాంగు కేషకుకు ధనసహాయమును, ఆయుధ సామగ్రిని సరఫరాచేసిరి." అని కమ్యూనిస్టు పక్షమున ప్రచురించబడిన 'చైనాయొక్క సంగ్రహ చరిత్ర' అను గ్రంథములో వ్రాయబడ్డది. ఏమిజరిగిన నేమి, పై సంధిషరతులన్నియు భగ్నమైనట్లు ఉభయపార్టీలును ప్రకటించిరి. అట్టి భగ్నమునకు కారణభూతులని ఒకరినొకరు నిందించిరి.

సెప్టెంబరు 2 వ తేదీన ప్రపంచ ద్వితీయ సంగ్రామము ముగిసినది. జపానువారు అప్పటివరకు చైనా ప్రజాస్వామికము యొక్క ఉత్తర దక్షిణ భాగములలో ఆక్రమించియున్న ప్రాంత

ములనన్నిటిని చైనా యొక్క శాస్త్రీయమైన ప్రభుత్వాధ్యక్షు డగు చ్యాంగు కేషకు కేరష్యావారును, అమెరికా వారును వప్పగింత చేయవలసివచ్చినది. కమ్యూనిస్టులు దేశములో నొక రాజకీయ పక్షము మాత్రమే గాని, చైనా యొక్క శాస్త్రీయమైన ప్రభుత్వము కాదు. అంతేగాక సియాన్ యొడంబడిక వలన వారు క్యూమింటాంగు ప్రభుత్వమునకు లోబడి నడచుకొనవలసియున్నది. 1928వ సంవత్సరము నుండియు క్యూమింటాంగు ప్రభుత్వమే చైనా ప్రజాస్వామికము యొక్క శాస్త్రీయమైన ప్రభుత్వమని అన్ని జాతులవారును అంగీకరించిరి. క్యూమింటాంగు ప్రభుత్వముతోనే సంధులు ఒడంబడికలు జరుపుకొనుచుండిరి. ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలములోకూడ క్యూమింటాంగు ప్రభుత్వమునే మిత్ర మండలిలో చేర్చుకొని చ్యాంగుకేషకును చైనారంగమునకు సర్వ సేనాధిపతిగ గావించిరి. 1945 సంవత్సరమున స్థాపించబడిన ఐక్య రాజ్య సమితిలో (United Nations Organisation) చ్యాంగు కేషకు ప్రభుత్వమే చైనా ప్రభుత్వముగ సభ్యతనుపొందినది.

చ్యాంగుకేషకుకు ఉత్తర చైనాను వప్పగింతచేయుట

అంతేగాక 1945 వ సంవత్సరము ఆగస్టు నెలలో చ్యాంగ్ కేషకునకును సోవియటు రుష్యాకును ఒక సంధి జరిగినది. దానికి చైనా - సోవియటు మైత్రి యొడంబడిక అని పేరు. దానిలో నున్న షరతు లేమనగ :

చైనా సోవియటు మైత్రి యొడంబడిక

(1) చైనా రుష్యాలు శాంతియుతమైన సహజీవనమును కలిగియుండవలెను.

(2) పశ్చిమమంగోలియాయొక్క స్వతంత్రమును చైనా అంగీకరించుచున్నది. చైనాలోని చ్యాంగు చున్ రైలువేలో చైనా రుష్యాలకు సమష్టి హక్కుండవలెను.

(3) డైరెను రేవులోకి స్వేచ్ఛగ సోవియటు రాజ్యము నుండి సరకులు ఎగుమతి దిగుమతులు జరుపుకొనవచ్చును. ఆ సరకులమీద చైనా ఎట్టి పన్నును విధించకూడదు.

(4) పోర్టు ఆర్థర్ రేవును సైనిక రేవుగ ఉభయ దేశముల వారును ఉపయోగించవచ్చును.

(5) సోవియటు రుష్యా ప్రభుత్వము చైనా యొక్క జాతీయ ప్రభుత్వమైన చ్యాంగు కేషకు ప్రభుత్వమునకే సర్వవిధము లైన నైతిక, సైనికసహాయము చేయవలెను.

(6) మంచూరియాయొక్క మూడురాష్ట్రములు చైనా యొక్క భాగముగనే సోవియటు ప్రభుత్వము అంగీకరించినది. సోవియటు రుష్యా సైన్యములు జపానుమీద యుద్ధము చేయు టకు చైనాయొక్క భాగములో జొరబడినందున జపానువారు లోబడిన మూడు వారములలో రుష్యా సైన్యములను ఆభాగము నుండి తీసివేయుట ప్రారంభించి మరియొక మూడు నెలలలో పూర్తిగ చైనా యొక్క భూభాగము నుండి రుష్యా వెడలి పోవును.

ఈ షరతుల ప్రకారము కూడ రుష్యా ప్రభుత్వము చైనా యొక్క శాస్త్రీయమైన ప్రభుత్వాధ్యక్షుడుగ చ్యాంగు కేషకును అంగీకరించినది. ఈ కారణములన్నిటి వలన అమెరికా వారును, రుష్యావారును కూడ జపానుయొక్క ఆక్రమణనుండి విడుదల

చేయబడిన చైనా యొక్క భాగముల నన్నిటిని చ్యాంగుకేషకు నకు వప్పగింతచేయుటకు నిర్ణయించిరి. చైనాయొక్క దక్షిణ భాగములో జపాను సేనలను అమెరికా యోడించెను. చైనా యొక్క ఉత్తర వాయువ్య భాగములలోను మంచూరియా లోను జపాను సేనలను సోవియటు రష్యా యోడించెను. ఉత్తర వాయువ్య దక్షిణ చైనాలను, మంచూరియాను అనగ యావత్తు చైనా ప్రజాస్వామికమును ఈరెండు ప్రభుత్వములును చ్యాంగు కేషకునకే వప్పగింత చేయవలసియున్నది. కావున ముందుగ ఏయే ప్రాంతమును తాను వప్పగింత చేసుకో దలచిననాడో ఆసంగతి చ్యాంగుకేషకు నిర్ణయించి ఈ ప్రభుత్వములకు తెలుపవలెను. ఆయనయొక్క నిర్ణయము ప్రకారమేవప్పగింత జరుగును. ఉత్తర వాయువ్య చైనాను తాను ముందుగవప్పగింత చేసుకొన దలచితి నని చ్యాంగుకేషకు రుష్యా అమెరికాలకు తెలియచేసెను. ఈ నిర్ణయము ఆయనయొక్క దురదృష్టమునకు, నాశనమునకు కారణ మయ్యెను. అప్పటికి క్యూమింటాంగు క్రిందనున్న భాగములు కమ్యూనిస్టు స్వాధీనమందున్న భాగములకు దాచాపుగ మూడు రెట్లుగ నుండెను. క్యూమింటాంగు క్రింద 30 కోట్ల జనసంఖ్యగల భాగములు ఉండగా కమ్యూనిస్టుల క్రిందనున్న భాగములలో పదమూడుకోట్ల జనసంఖ్య మాత్రమే యుండెను. క్యూమింటాంగుకు 43 లక్షల సేనలుండగా కమ్యూనిస్టులకు 12 లక్షల సేనలు మాత్రమే యుండెను. తన పెద్దరాజ్యములోని విద్యాధికులు, ప్రజలు ఇంకను క్యూమింటాంగు పక్షమున నున్నారు. వారు అంతర్యుద్ధమును మాత్రము కూడదనుచున్నారు. కమ్యూ

నిస్టులకు కొంతకాలముపాటు ఉత్తర వాయువ్య చైనాను, మంచూరియాను స్వాధీనపరచి తాను తన పెద్దభాగములో రాజ్యము చేసినయెడల వారందరు సంతోషించుచుండెడివారు. కొలది కాలములో చైనాజాతియొక్క ఐక్యతకొరకు గొప్ప ప్రయత్నములు జరిగి డాక్టర్ సన్యటుసేన్ యొక్క ప్రజల మూడు సిద్ధాంతములమీదను, రైతులయొక్క భూసంస్కరణ కార్యక్రమము మీదను, అదివరకు సియాన్ పట్టణములో జరిగిన షరతుల మీదను మావోసిటంగు చౌ-ఎన్‌లేలు ఆయనతో రాజీకి వచ్చెడివారు. శాంతియుతమైన రాజీనామా జరిగి యుండెడిది. అటుల రాజీనామా జరుగకున్నను తూర్పు పశ్చిమ జర్మనీలవలె క్యూమింటాంగు దక్షిణ పశ్చిమ చైనాలోను, కమ్యూనిస్టులు ఉత్తర వాయువ్య చైనాలోను రాజ్యముచేయుచుండెడివారు. అతి దురాశవలన కేవలము అమెరికా సేనలమీదను, అమెరికాద్రవ్యము మీదను ఆధారపడి చ్యాంగుకేషకు శత్రువులకు బలముగానున్న ప్రాంతములలోనికి జొరబడినాడు. తన సేనలను నాశనము గావించుకొని ఉత్తర దక్షిణ చైనాల రెంటిలోను ఓడిపోయి చైనాను వదలి ఫార్మోజాకు పారిపోవుట తటస్థించినది.

ఏమైననేమి, ఆయన ఉత్తర వాయువ్య చైనాను వప్పగింత చేసుకొనుటకు ప్రయత్నించెను. ప్రజల విముక్తిసైన్యము అను పేరున నున్న కమ్యూనిస్టు సైన్యములే ఆ ప్రాంతమునంతను వప్పగింతచేసుకొనుటకు సిద్ధముగ నుండెను. ఎట్టి సైన్యములు ఆ ప్రాంతములో జపానును ఓడించినందున ఆ ప్రాంతమును వప్పగింతచేసుకొను అధికారము హక్కు తమకే కలదని కమ్యూ

నిస్టులు చెప్పిరి. కాని వారిని లక్ష్యపెట్టినవారు లేరు. వారు అటుల వప్పగింతచేసుకొనకుండ చ్యాంగు కేషకు అభ్యంతరపరచెను. ఆయన కోరికయే రష్యా, అమెరికా ప్రభుత్వములచే నంగీకరింప బడెను. చైనా కమ్యూనిస్టుల సేనలు, ఇతర సేనలు ఎక్కడ నున్నవి అక్కడే ఉండవలెననియు తన ఉత్తరువులు లేనిదే ఎచ్చటికిని కదలిపోకూడదనియు ఆయన గట్టిగ ఉత్తరువులను పంపెను. సియాన్ ఒడంబడిక ప్రకారము ఆ సేనలన్నియు ఆయన యొక్క ఆధిపత్యము క్రిందనే యుండెను. కాని, యీ ఉత్తరువులను కమ్యూనిస్టులు ప్రజల విముక్తి సైన్యములు లక్ష్య పెట్టలేదు. ఆయన ఉత్తర వాయువ్య చైనాను, మంచూరియాను స్వాధీనపరచుకొనకుండ పూర్తియైన విఘాతము కలిగించుటకే కమ్యూనిస్టులు దృఢనిశ్చయులైరి. ఆయన ఉత్తరువులకు వ్యతిరేక ముగ ఈనాను ప్రభుత్వపక్షమున చైనా కమ్యూనిస్టు సర్వసేనాని యగు చూతే వివిధ సేనానుల క్రిందనున్న కమ్యూనిస్టు సేనలు బయలుదేరి వెంటనే చాహారు, జిహోలు, లయోనింగు, కిరిన్ మొదలైన ప్రాంతములకు పోయి వాటిని ఆక్రమించవలెననియు వివిధ రైల్వేలను, రోడ్లను ఆక్రమించవలెననియు ఉత్తరువులు ఇవ్వగా ఆ సేనలన్నియు ఆ ప్రకారముగ చేసెను. కొరియా కమ్యూనిస్టుల సేనలును, మరికొన్ని చైనా కమ్యూనిస్టు సేన లును మంచూరియాలో జొరబడి ఆ దేశమంతటను వ్యాపించెను.

జపాను నోడించిన రుష్యావారు, జపాను సేనలలో కొంత భాగమును యుద్ధఖైదీలుగ పట్టుకొని, షుమారు పదిలక్షలమంది జపాను సైనికులవద్దనుండి తాము తీసికొనిన ఆయుధములను,

యుద్ధసామగ్రిని చైనా కమ్యూనిస్టులకు వశపరచిరి. అందువల్ల చైనా కమ్యూనిస్టుల సైనికబలము అత్యంతముగ వృద్ధిచెందెను.

అక్టోబరు 1 వ తేదీన సోవియటు రాయబారి, తమ సోవియటు సేనలను మంచూరియాలో నుంచి కొలది రోజులలో తరలించి తీసుకొనిపోవుటకు నిర్ణయించినామనియు, అక్టోబరు 10 వ తేదీ లోపల చైనా ప్రభుత్వము యొక్క ప్రతినిధిని సోవియటు సేనాధిపతితో చైనావారికి ఆ ప్రాంతమును వప్పగింత చేయు విషయములో సంప్రతింపులు జరుపుటకు చాంగుచన్ పట్టణమునకు పంపవలసినదనియు చ్యాంగుకేషకునకు తెలియపరచెను. చ్యాంగు కేషకు ప్రభుత్వము చాంగుచన్‌కు తమ ప్రతినిధిని పంపెను. చైనాప్రభుత్వ సైన్యములను డైరెనురేవు మీదుగ పడవలలో పంపెదమనికూడ తెలియపరచెను. అక్టోబరు 5 వ తేదీన డైరెనురేవు, సరకుల ఎగుమతి దిగుమతులకే యుద్దేశించినది కాని సైన్యములను దింపుటకు ఉపయోగించుటకు వీలులేదని, ఆ రేవులో చైనాయొక్క సైన్యములు దిగుటకు సోవియటు ప్రభుత్వమంగీకరించ నేరదని, రుష్యా ప్రభుత్వమువారు చైనా రాయబారికి తెలిపిరి. అందుమీద చైనాప్రభుత్వ ప్రతినిధి తమ సేనలను హాల్‌టావ్, ఇంగుకూ రేవులలో దింపుటకు నిర్ణయించినామని రుష్యా ప్రభుత్వమునకు తెలిపెను. అందుకు రుష్యా ప్రభుత్వము అభ్యంతరము తెలుపలేదు. కాని చైనా ప్రభుత్వ సేనలు అక్టోబరు 27 వ తేదీన హాల్‌టావ్ రేవులో దిగగనే అక్కడ అదివరకే వచ్చియున్న చైనా కమ్యూనిస్టు సేనలు వాటి

చ్యాంగుకేషకు ఉత్తర చైనాను వప్పగింతచేసు కొను యత్నము, కమ్యూనిస్టుల ఆటంకములు

మీద తుపాకులను కాల్చెను. చైనా ప్రభుత్వసేనలు ఆ రేవులో దిగుటకు వీలులేకపోయినది. అందువలన వెనుకకు తిరిగిపోయిరి. ఆ సేనలు చింగు వాంగుటోకు చేరి అచటినుండి రైలుమార్గము వెంబడిగ షాన్ హైక్ వాన్ పట్టణమునకు చేరెను. నవంబరు 5 వ తేదీన హోల్ టోవు రేవును కమ్యూనిస్టులు ఆక్రమించిరనియు, ఇంగుకూ రేవులోకూడ ప్రవేశించిరనియు రుష్యా రాయబారి చైనాప్రతినిధికి తెలియపరచెను. అంతేకాక నవంబరు 10 వ తేదీ నుండి సోవియటు సేనలు ఉత్తరముగ వెడలిపోవుననియు, తాము ఖాళీచేసిన ప్రదేశములను గురించి తమకేమియు జవాబుదారీ యుండ నేరదనియు రుష్యా రాయబారి తెలిపెను. రుష్యావారు ఖాళీచేసిన ప్రాంతములను శాంతముగ చైనా ప్రభుత్వము స్వాధీన పరచుకొనుటకు తోడ్పడవలసినదని రుష్యా ప్రభుత్వమును కోరినను ఆ విషయములో ఎట్టి సహాయము చేయుటకు వా రొప్పుకొనలేదు. ఈ కాలమునకు చైనా కమ్యూనిస్టు సేనలు షాంటంగు రాష్ట్రమునుండి సముద్రముమీదుగ మంచూరియాలో ప్రవేశించి అన్ టంగు పట్టణమును స్వాధీన పరచుకొనెను. నవం బరు 11 వ తేదీన కమ్యూనిస్టులు చాంగుచున్ పట్టణమునుకూడ వశపరచుకొనిరి. ముకడను నగరములో చైనా ప్రభుత్వ సేనలను తీవ్రప్రతిఘటనమును సలుపుటకు తయారగుచుండిరి.

సోవియటు రుష్యావారు మంచూరియాలోనుండి తరలి పోవుచు అచటి ప్రజలమీద దోపిడీలు, హత్యలు, గృహాదహన ములు, మొదలగు ఘోర కృత్యములను సలిపిరని చ్యాంగుకేషకు తన గ్రంథములో వ్రాసియున్నాడు. అంతేకాక మంచూరి

యాలో అదివరకు షుమారు ఏబది సంవత్సరములనుండి జపాను వర్తకులు అత్యంత ధనవ్యయముతో నిర్మించిన పెద్దపెద్ద యంత్రశాలలను, త్రవ్వించిన గనులను రుష్యావారు స్వాధీన పరచుకొని వాటియొక్క యంత్రములను, పనిముట్లను, సామగ్రిని, లోహములను యావత్తు సోవియటు రుష్యాకు తరలించుకొని పోయిరనియు, మంచూరియాలోని మిక్కిలి ధనవంతమగు యంత్ర శాలలన్నియు నాశనమయ్యెననియు ఫిడ్జి గెరాల్డు వ్రాసియున్నాడు. అవి ఆసియా ఖండములోకెల్ల ధనవంతమైనవి. అమెరికా ప్రభుత్వ మొక ప్రతినిధినిపంపి మంచూరియా నుండి రుష్యావా రటుల దోచుకొనిపోయిన యంత్రముల సామగ్రుల గనుల కిమ్మతునుగూర్చి నివేదికను తెప్పించుకొనగ వాటి కిమ్మతు రెండువేలకోట్ల డాలర్లని అనగ పదివేలకోట్ల రూప్యములని అంచనా వేయబడినది. జపానువారు మంచూరియానుండి లేచిపోగానే దాని హక్కుదారు నిజముగా క్యూమింటాంగు ప్రభుత్వమేగాని ఆ ప్రభుత్వమునకు వదలిపెట్టుటకు రుష్యాకిష్టములేదు. కమ్యూనిస్టులకు వప్పగింత చేయుటకు, కమ్యూనిస్టులు గెలిచి యాప్రాంతమును లోబరచుకొని దానిమీద రాజ్యము స్థాపింతురను నమ్మకము అప్పటికి రుష్యావారికి లేకుండెను. అందువల్ల తామే వాటినన్నిటిని తమ దేశమునకు తరలించుకొని పోయిరి. ఇందుకు అమెరికావారు తమ అసమ్మతిని తెలిపిరి. ప్రయోజనము లేదయ్యెను. చైనా ప్రభుత్వము వారు వప్పగింత కార్యక్రమమునకు సంబంధించిన యుద్యో

సోవియటు రుష్యావారు మంచూరియాలోని పారిశ్రామిక సామగ్రిని తరలించుక పోయిరి

గస్టుల కార్యస్థానమును చాంగుచున్‌నుండి షాన్ హైక్‌వాన్ పట్టణమునకు మార్చుకొనిరి. నవంబరు 15వ తేదీన చైనా ప్రభుత్వమువారు అమెరికా అధ్యక్షుడగు ట్రూమన్‌కు రుష్యా వారు చేసిన ద్రోహము నంతను తెలియపరచి ఈశాన్యోత్తరవాయువ్య చైనాయొక్క, మంచూరియాయొక్క వప్పగింత కార్యక్రమములో తమకు తోడ్పడవలెనని కోరిరి. అమెరికా అధ్యక్షుడు చైనా ప్రభుత్వమునకు ఈ విషయములో సహాయము చేయుటకు అంగీకరించెను. రష్యా ప్రభుత్వమువారు కూడ వ్యతిరేకతను మానివేసిరి.

చైనా ప్రభుత్వ సైన్యములు కొన్ని భూమి మీదనే ప్రయాణముచేసి చిన్‌చూషాన్ హైక్‌వాన్ రైలుమార్గము వెంబడి ప్రయాణముచేసి చిన్‌చో పట్టణమును స్వాధీనము పొంది హోల్టోవు రేవును కూడ ఆక్రమించెను. మరికొన్ని ప్రభుత్వసేనలు తమకు అమెరికావారు సరఫరాచేసిన పడవలమీద సముద్రము మీదుగ మంచూరియాలో దిగెను. గొప్పసంఖ్యగల బలమైన ప్రభుత్వసేనలు 1946వ సంవత్సరము జనవరి 26వ తేదీన మంచూరియా రాజధానియగు ముక్డన్ నగరములో ప్రవేశించెను. ఇక్కడనుంచి మంచూరియా నంతను ఆక్రమించవలెనని క్యూమింటాంగు ప్రభుత్వమువారి యుద్దేశ్యమై యుండెను. అక్కడనున్న ఎఱ్ఱసేనలే జపానువారిని వెళ్లగొట్టినందునను, తామిదివరకే ఆక్రమించుకొని యున్నందునను తమకే ఆ ప్రాంతములు వప్పగింతచేయవలసి యున్నదని కమ్యూనిస్టుల భావము. కావున క్యూమింటాంగుయొక్క ఆక్రమణమునకు కమ్యూనిస్టులు తీవ్ర ప్రతిఘటనము సలుపుటకు తయారైరి. అంతర్యుద్ధము తప్పదయ్యెను.

అంతర్యుద్ధము

★

# చైనా విప్లవము

## త్రయోదశాధ్యాయము

---

### యావత్తు చైనాపై కమ్యూనిస్టు రాజ్య స్థాపనము

**1**

అమెరికావారు క్యూమింటాంగు సేనలను ఉత్తర చైనాలో విమానములతో దింపిరి

ఉత్తర చైనాలోని పికింగ్, టీన్ట్సీన్ మొదలైన పట్టణములకును, ఎల్లోనది లోయలోనున్న పట్టణములకును క్యూమింటాంగు సేనలను అమెరికావారు తమ విమానములలో తీసుకొని వెళ్ళి దింపిరి. ఆ పట్టణముల నన్నిటిని క్యూమింటాంగు ప్రభుత్వము స్వాధీనము పొందినది. ఆ పట్టణములనుండి క్యూమింటాంగు ప్రభుత్వము క్యూమింటాంగు సేనలు, జపానువారి దౌర్జన్యముల యెదుట తాళలేక ఎనిమిది సంవత్సరముల క్రింద లేచిపోయిరి. ఆ ఎనిమిది సంవత్సరములలో వారిని ఆ ప్రజలు చూడలేదు. జపాను దాడులనుండి తమను రక్షించక పారిపోయి ఇపుడు అమెరికా సైన్యములను వెంటబెట్టుకొని వచ్చిన క్యూమింటాంగు ప్రభుత్వమునందు వారి కెట్టి గౌరవము, భక్తి యుండనేరదు. తమ చుట్టుపట్టు ప్రాంతములలో జపాను సేనలను ప్రతిఘటించుచుండిన కమ్యూనిస్టులయందే వారికి భక్తి గౌరవము లేర్పడెను. అక్కడ జపాన్ కీలుబొమ్మ ప్రభుత్వముక్రింద నుండిన సేనలు, ఉద్యోగస్థులు ఇపుడు మరల క్యూమింటాంగు

ప్రభుత్వము క్రిందకు వచ్చిరి. కాని, ఆ పట్టణముల చుట్టునున్న పల్లెప్రాంతము లన్నిటిలో కమ్యూనిస్టు గొరిల్లా సైన్యములు వ్యాపించి యుండెను. ఆపల్లెప్రాంతము లన్నియు కమ్యూనిస్టుల స్వాధీనమునందుండెను. ఆ పల్లెప్రాంతముల ప్రజలు కమ్యూనిస్టులే తమకు రక్షకులని భావించిరి. కమ్యూనిస్టు ఉత్తర దక్షిణ చైనాల మధ్యనున్న రైలు మార్గములను, రోడ్లను పాడుచేసి ఉత్తర దక్షిణ చైనాల మధ్య రాకపోకలకు పూర్తిగా ఆటంకము లను కలిగించిరి.

అమెరికా సహాయము, నాలుగు పెద్దకుటుంబముల దోపిడి, సంయుక్తప్రభుత్వమునకై ఆందోళనము

క్యూమిన్‌టాంగు కమ్యూనిస్టు పార్టీలమధ్య మరల అంతర్యుద్ధము చెలరేగుట చైనా దేశీయులలో నెవ్వరికిని ఇష్టముగ లేదు. 1943 వ సంవత్సరము జనవరి నెలలో చ్యాంగుకేషకు ప్రభుత్వమునకు ఆర్థిక, సైనిక సహాయమును అమెరికా వారు చేయునటుల చైనా- అమెరికా వర్తక ఒడంబడిక జరిగెను. దానిననుసరించి అమెరికా వారు చ్యాంగు కేషకు ప్రభుత్వమునకు ఆర్థిక, సైనిక సహాయమును చేయు చుండిరి. అమెరికా సరుకులు, అమెరికా పెట్టుబడులు విరివిగా చైనాలో దిగినవి. అమెరికా వర్తకులు చైనాలో యంత్రశాల లను స్థాపించసాగిరి. మరల చైనా- అమెరికా ఒడంబడిక 1946 వ సంవత్సరములో పునరుద్ధరించబడెను. ద్వితీయ ప్రపంచ యుద్ధము ముగియగనే చైనా దేశమును ప్రజాస్వామిక నవీన జాతిగా గావించుటకు, పది సంవత్సరముల పునర్నిర్మాణ కార్యక్రమమును చ్యాంగుకేషకు ప్రభుత్వము సాగించుటకు నిశ్చయించెను. దానికి

కావలసిన ధనసహాయమును, నిపుణుల సహాయమును అమెరికా ప్రభుత్వము చేయుటకు అంగీకరించెను. మరియు ఏబది కోట్ల డాలర్ల రుణము నిచ్చుట కంగీకరించెను. అమెరికా యొక్క ఆర్థిక సహాయము వలన పైన చెప్పబడిన సూంగు, కంగు, చ్యాంగు, చెన్ అను నాలుగు కుటుంబములు అపరిమితముగ భాగ్యవంతులైరి. జపాను వదలిపోయిన చైనాప్రజల ఆస్తిని చైనా ప్రజల కిచ్చుటకు మారుగా నీ నాలుగు కుటుంబములే పంచుకొనిరి. చైనా బ్యాంకులు, పరిశ్రమలు అన్నియు వీరి వశమందేయుండెను. ఇదంతయు చైనా దేశీయులలో చ్యాంగు కేషకు మీద వ్యతిరేకతను బలపరిచెను. చ్యాంగు కేషకు ప్రభుత్వమునకు సహాయము చేయుటకై అమెరికా సేనలు ఉత్తర దక్షిణ చైనాలోని కొన్ని పట్టణములలో నుంచబడెను. చ్యాంగు కేషకు ప్రభుత్వము స్వతంత్రముగ నుండక, యుద్ధములో జయమును పొందిన చైనా దేశమును మరల అమెరికాకు లోబరచుచున్నదనియు, అది గొప్ప జాతీయ అవమానమనియు, అమెరికా వారివల్ల ఎట్టిసహాయము పొందకూడదనియు, అమెరికా సేనలు వెంటనే చైనాను వదలి పోవలయుననియు. కమ్యూనిస్టులు క్యూమింటాంగు పక్షము వారు అంతర్యుద్ధమును మాని సంయుక్త (కొయలిషన్) ప్రభుత్వమును స్థాపించి దేశములో శాశ్వతశాంతిని నెలకొల్పుట అత్యావశ్యకమనియు, కమ్యూనిస్టులు, వారి సానుభూతిపరులు ప్రారంభించిన ఆందోళనము చైనా దేశమంతటిలో వ్యాపించెను. చైనాలోని విద్యార్థులెల్లరు ఉభయపార్టీల అంతర్యుద్ధమువలన

చైనా సర్వనాశనమగుననియు, సంయుక్త (కొయలిషన్) ప్రభుత్వమే దేశమునకు శరణ్యామనియు భావించిరి.

1945 వ సంవత్సరము నవంబరు నెలలో అనేక వర్గములకు చెందిన ప్రతినిధులు చైనాప్రభుత్వ రాజధానిగ నుండిన చుంకింగు నగరమునందు సమావేశమై ఒక 'అంతర్యుద్ధ వ్యతిరేక సంఘము'ను స్థాపించి, వెంటనే అంతర్యుద్ధము నాపవలెననియు, చైనాయొక్క అంతర్వ్యవహారములలో అమెరికావారి జోక్యమును ప్రతిఘటించవలెననియు, దేశములోని ప్రజలను కోరిరి. క్యూమింటాంగు స్వాధీనముననున్న కొన్ని యితర పట్టణములలోకూడ అట్టి సంఘము లేర్పడి, అట్టి నినాదములే చెలరేగెను. నవంబరు 25 వ తేదీ సాయంకాలమున కున్మింగు పట్టణమున విశ్వవిద్యాలయముల, కళాశాలల విద్యార్థి సంఘములు ఇందుకుగాను గొప్ప సమావేశమును జరిపినవి. క్యూమింటాంగు ప్రభుత్వము దానిని భగ్నము చేయుటకు తమ సేనలను పంపిరి. మరునాడు దానికి హాజరయిన ఉపాధ్యాయులను, విద్యార్థులను బందిపోటుదారులని నిందించిరి. దానిమీద ముప్పదివేలమంది విద్యార్థులు పాఠశాలలను మాని సమ్మెకట్టిరి. అంతర్యుద్ధము మానవలెననియు, చైనానుండి అమెరికా సైన్యములు వెడలిపోవలెననియు, ప్రాథమిక హక్కులు రక్షింపబడవలెననియు, క్యూమింటాంగు కమ్యూనిస్టుల సంయుక్త ప్రజాప్రభుత్వము ఏర్పడవలెననియు తీర్మానములు చేసిరి. ఆ విద్యార్థులలో కొందరిని క్యూమిన్‌టాంగు పోలీసులు అరెస్టు చేసిరి. కొందరిని కొట్టిరి. డిసెంబరు 1 వ తేదీన క్యూమింటాంగు

అంతర్యుద్ధ వ్యతిరేక సంఘము, విద్యార్థుల సమ్మెలు

సేనలు కారులలో బయలుదేరి విద్యార్థి నాయకులను పట్టుకొనుటకై వివిధ పాఠశాలలలో జొరబడిరి. వారికినీ, విద్యార్థులకును హోరాహోరీగా పోరాటము జరిగెను. అప్పుడు ఒక (స్త్రీ) విద్యార్థిని కత్తిపోటులతో మరణించెను. నలుగురు విద్యార్థులు హత్య గావింపబడిరి. షుమారు అరవై మంది విద్యార్థులకు బలమైన గాయములు తగిలెను. వేలకొలది విద్యార్థులు తమ పోరాటమును తుదివరకు సాగింతుమని శపథములను తీసికొనిరి. ఒక నెలవరకు వారిసమ్మె జయప్రదముగా జరిగి, దేశమంతటిలో అంతర్యుద్ధము మాని అమెరికావారితో సంబంధము వదులుకొని ఉభయపార్టీలతోను ప్రభుత్వమును ఏర్పాటుచేయవలెనను సంధియుద్యమము బాగుగ వ్యాపించెను. అప్పటికి క్యూమింటాంగు ప్రభుత్వము తమ రాజధానిని నాంకింగునగరమునకు మార్చుకొనిరి. డిసెంబరు నెలలో చ్యాంగు కేషకునకును చైనా కమ్యూనిస్టులకును రాజీ కుదుర్చుట యుక్తమని తలచి అందులకై జార్జి మార్షల్ సేనానిని అమెరికా అధ్యక్షుడు చైనాకు పంపెను. ఆనెల 17 వ తేదీన మార్షల్ సేనాని చైనాలో దిగెను. 1946 వ సంవత్సరము జనవరినెలలో క్యూమింటాంగు కమ్యూనిస్టు ప్రతినిధులమధ్య జార్జి మార్షల్ సేనాని యాజమాన్యముక్రింద కొన్ని రాజీ సమావేశములు జరిగెను. జనవరి 10 వ తేదీన చైనా ప్రభుత్వమును, కమ్యూనిస్టులును తమతమ సేనాధిపతులకు యుద్ధము చాలించవలసినదని ఉత్తరువులు పంపిరి. ఉభయపక్షముల సైన్యములును ఒక చోటనుండి మరొకచోటికి కదలకూడదనికూడ ఆజ్ఞాపించిరి. కాని

జార్జి మార్షలు సేనాని రాజీ ప్రయత్నములు

రష్యా సైన్యములు మంచూరియానుంచి వెడలిపోయిన కొలదియు చైనా ప్రభుత్వ సైన్యములు మంచూరియాలో ప్రవేశించి చైనాయొక్క అధికారమును అచట స్థాపించుటకు మాత్రము ఎట్టి అభ్యంతర ముండకూడదనికూడ ఆ ఉత్తరువులలో నున్నది. చైనా అంతర్వ్యవహారములు శాంతముగ పరిష్కార మయ్యేవరకు రుష్యావారు మంచూరియాలో నుండజాలరు కావున వారు ఖాళీచేసిన ప్రాంతమునంతను క్యూమిన్‌టాంగు ప్రభుత్వమునకే ఒప్పగింతచేసి పోవలసి యున్నది. ఎవరును రైళ్ళు, రోడ్లు మొదలైన రాకపోకలను నాశనము గావించకూడదు. ఈ యుద్ధ విరామమును అమలు జరుపుటకు చైనా ప్రభుత్వ ప్రతినిధి యొకడు, కమ్యూనిస్టు ప్రతినిధి యొకడు, అమెరికా ప్రతినిధి యొకడు ముగ్గురుగల ఒక కమిటీని నిర్ణయించిరి. ఆ కమిటీయొక్క ఉత్తరువుల ప్రకారమే ఉభయ పార్టీలవారును నడుచుకొనుచుండ వలెను. యుద్ధవిరామము జరిగిన దినముననే రాజకీయ సలహా సమావేశము జరిగెను. త్వరలో నేషనల్ అసెంబ్లీ అను పేరన ఒక ప్రజా పార్లమెంటు సమావేశపరచబడవలెనని అంగీకరించబడెను. ఈ లోపలనే చైనా ప్రభుత్వము యొక్క స్టేటు కౌన్సిలులోను, మంత్రివర్గములోను కమ్యూనిస్టు మొదలగు ఇతర రాజకీయ పార్టీల ప్రతినిధులను కూడ చేర్చుకొనవలెను. 21 రోజులు సమావేశముజరిగి రాజకీయ సలహా సమావేశము కొన్ని సిద్ధాంతములను అంగీకరించెను. అందులో ముఖ్యమైన వేమనగా—

(అ) స్టేటు కౌన్సిలులో నలుబదిమంది సభ్యులుండవలెను. వారిని క్యూమింటాంగు సభ్యులనుండి, ఇతరులనుండి ప్రభుత్వాధ్యక్షుడు నియామకము చేయవలెను. వివిధ రాజకీయ పక్షముల సభ్యులును, రాజకీయ పక్షమునకు చెందని నాయకులును మంత్రి వర్గములో చేరుటకు అర్హత కలిగియుందురు. ప్రజా ప్రభుత్వము శాంతియుతమైన జాతీయ పునర్నిర్మాణము గావించుటయందే మగ్నము గావలెను.

(ఆ) డాక్టరు సన్యటుసేను యొక్క మూడు ప్రజల సిద్ధాంతములను ఆచరణలో పెట్టవలెను. చైనా జాతి యావత్తు ప్రభుత్వాధ్యక్షుడగు చ్యాంగు కేషకు యొక్క నాయకత్వము క్రింద ఏకమై, స్వతంత్ర నవ్య చైనాను నిర్మించుటకు కృషి సలుపవలెను. సైన్యములన్నియు జాతీయముగ చేయబడి చ్యాంగుకేషకు క్రిందనే యుండవలెను. అన్ని రాజకీయ పార్టీలకు చట్టసమ్మతమైన హోదా యుండవలెను. వివిధ రాజకీయ పార్టీల మధ్య నున్న తగాదాలన్నియు శాంతియుతముగ పరిష్కరింపబడవలెను. ఒకే జాతీయ సైన్యము నిర్మాణము కావలెను. సైన్యములలో తిరుగుబాట్లను ఏ రాజకీయ పక్షమువారును ప్రోత్సహించకూడదు. ఈ జాతీయ సైన్యమంతయు సైనిక శాఖాధిపతి యగు యొక మంత్రిక్రింద నుండవలెను. చైనా కమ్యూనిస్టు సేనలను కూడ పునర్నిర్మాణముచేసి జాతీయ సైన్యములో భాగముగ చేయవలెను.

(ఇ) 1946 వ సంవత్సరము మే 5 వ తేదీన జాతీయ పార్లమెంటు సమావేశము కావలెను. ఆ పార్లమెంటు మొదటి

పనిగ యొక్క రాజ్యాంగ విధానమును నిర్ణయించవలెను. ప్రాంతీయ వృత్తుల ప్రతినిధులు పన్నెండువందలమందియు, ఫార్మోజానుండియు, మంచూరియానుండియు 150 మంది ప్రతినిధులును దానికి హాజరు కావలెను. ఇందులో రాజకీయ పక్షములనుండి ఎన్నుకొనబడిన ప్రతినిధులు ఏడువందలుందురు.

(ఈ) ఇంతేకాక సైనిక విషయములను నిర్ణయించు ఉపసంఘమువారు ఫిబ్రవరి 14 మొదలు 25 వ తేదీవరకు సమావేశమై ప్రభుత్వ సైన్యములు 354 పటాలములనుండి 90 పటాలములకు తగ్గించబడవలెననియు, కమ్యూనిస్టు సేనలు 18 పటాలములుగ చేయబడవలెననియు నిర్ణయమును చేసిరి. తరువాత ఆరు నెలల లోపల ప్రభుత్వ సేనలు 50 పటాలములకును, కమ్యూనిస్టు సేనలు 10 పటాలములకును తగ్గించబడవలెను. కమ్యూనిస్టుల కంటె ప్రభుత్వసేనలు ఎల్లప్పుడును ఐదురెట్లు ఎక్కువగ నుండవలెను. చాలవరకు సైన్యములు ప్రభుత్వ కమ్యూనిస్టు సైనికులు కలిసిన మిశ్రమ సైన్యములుగ నుండవలెను.

ఈ షరతులను ఛ్యాంగుకేషకు చౌ ఎన్‌లై ఉభయులును అంగీకరించిరి.

ఈ విధమైన పరిష్కారము గావించుకొని మార్షల్ సేనాని యీ సంగతులన్నియు తమ ప్రభుత్వమునకు తెలుపుటకు అమెరికా రాజధానియగు వాషింగ్టనుకు పయనమై వెళ్లెను.

కమ్యూనిస్టులు రాజీషరతులను భగ్నముగావించిరి

కాని, ఈనానులోని కమ్యూనిస్టు కమిటీవారు ఈ షరతులను అంగీకరించలేదు. తమ సేనలను తగ్గించుకొని ఛ్యాంగుకేషకుకు లోబడుటకు

వారికిష్టములేదు. వారికి క్యూమిన్‌టాంగుతో సమాన స్థాయి కావలెను. తక్కువస్థాయిని వారంగీకరింపలేదు. కావున, మార్షల్ సేనాని చైనాను వదిలివెళ్లిన కొద్దిరోజులలోనే కమ్యూనిస్టులు యుద్ధవిరామ సంధిని పూర్తిగ భగ్నముచేసి, తమ సైన్యములను, గొరిల్లాలను, ఉత్తర వాయువ్య చైనాలోను, మంచూరియాలోను నున్న పల్లెప్రాంతములలో బాగుగ వ్యాపింపచేసిరి. రాజీ కొరకు గడుపబడిన కాలమునంతను తమ సైనిక వ్యూహాములను బలపరచుకొనుటకే కమ్యూనిస్టు లుపయోగించుకొనిరి. కమ్యూనిస్టులు తమసైన్యములను 'చేపింగుకై' పట్టణమున చేర్చిరి. ముక్డన్ పట్టణమునుండి, ప్రభుత్వ సేనలు మంచూరియాలో జపానువారు ఖాళీచేసిన ప్రాంతములను స్వాధీనపరచుకొనుటకై ఉత్తరముగ సాగిపోకుండ, కమ్యూనిస్టు లభ్యంతరపరచిరి. ఉభయసేనల మధ్య ఒక వారమురోజులు తీవ్రమైన యుద్ధము జరిగి కమ్యూనిస్టు సైన్యము లోడిపోయెను. మే 25 వ తేదీన ప్రభుత్వసేనలు ముందుకుపోయి చాంగుచన్ పట్టణమున ప్రవేశించెను.

## 3

ఇంతలో అమెరికానుండి మార్షల్ సేనాని మరల చైనాకు వచ్చెను. చ్యాంగుకేషకు ఆయనను కలసి సంప్రదింపులు జరిపెను. చ్యాంగుకేషకు సైనిక వ్యవహారములను చూచుటకు ముక్డన్ నగరమునకు ఆకాశ విమానములో వచ్చెను. మార్షల్ సేనానియొక్క సలహా

రాజీ విఫలమయ్యెను

మీద మరల మంచూరియా విషయములో యుద్ధ విరామము, రాజీ ప్రయత్నములు చేయుటకు అంగీకరించెను. తన సైన్యములను ముందుకుపోకుండ ఆజ్ఞాపించెను. పదునైదు దినములు క్యూమింటాంగు కమ్యూనిస్టు ప్రతినిధులమధ్య మార్షల్ సేనాని యాజమాన్యమున రాజీ సంభాషణలు జరిగి విఫలమయ్యెను.

ఉభయ పార్టీల మధ్యను మరల అంతర్యుద్ధము సాగెను. 1946 వ సంవత్సరము జూన్ నెలలో కమ్యూనిస్టుసేనలు జీహోల్, చాహోరు, హోపే, షాంటుంగ్ రాష్ట్రములలో ప్రవేశించి చీఫెంగు, చంగ్ చె, ఛేచో, షైయాన్, లాంట్ సన్ మొదలైన పట్టణములను పట్టుకొనెను. అక్కడనుంచి కమ్యూనిస్టు సేనలు యాంగ్సినదిని దాటి ముందుకుపోయి కియాంక్యూ రాష్ట్రములోని షైపాసీన్ పట్టణము వైపుకు పోవుచుండగా నాంకింగునుంచి ప్రభుత్వ సేనలువచ్చి ఉత్తర కియాంగ్సులో యుద్ధముచేసి కమ్యూనిస్టుల చేతిలో ఓడిపోయెను. అంతట కమ్యూనిస్టులు షాన్సీ రాష్ట్రములో ప్రవేశించి యూచి, చీషియూ మొదలైన 22 జిల్లాలను స్వాధీనపరచుకొనిరి. దక్షిణ షెన్సీలోను, టూటంగ్ వద్దను జరిగిన యుద్ధములలో కమ్యూనిస్టులు గెలిచిరి. మరల ఆగస్టు 14 వ తేదీన మార్షల్ సేనానియొక్కయు, చైనాలోని అమెరికా రాయబారిగానున్న డాక్టరు స్టూవర్టు యొక్కయు జోక్యము మీద రాజీ ప్రయత్నములు ఉభయ పక్షములకు జరిగెను. కమ్యూనిస్టులు ఆక్రమించిన అన్ని పట్టణములు కాకపోయినను కొన్ని పట్టణములనైనను కమ్యూనిస్టులు ఖాళీచేసి పోవలెనని

క్యూమింటాంగు కమ్యూనిస్టు అంతర్యుద్ధము

ప్రభుత్వ పక్షమున కోరబడెను. కమ్యూనిస్టులు అందుకు ఒప్పుకొనలేదు. సెప్టెంబరు 20 వ తేదీన కమ్యూనిస్టు సైన్యములు కాల్గన్ పట్టణమును స్వాధీనమును పొందెను. ఇందువలన, పికింగు, టీన్‌ట్సీన్ నగరములకు అపాయము వాటిల్లెను. ఈ రెండు ఉత్తర చైనాలో ప్రభుత్వముయొక్క ముఖ్యమైన నగరములు. అక్టోబరు అయిదవతేదీన మరల యుద్ధవిరామమును చ్యాంగు కేషకు అంగీకరించి పదిరోజులు రాజీకై ప్రయత్నము చేసెను. ఆయన యుపపాదించిన రాజీషరతులను కమ్యూనిస్టులు ఒప్పుకొనలేదు.

చైనాలో అంతర్యుద్ధము జరుగుచున్నప్పుడు క్యూమింటాంగు ప్రభుత్వమునకు అమెరికావారు యుద్ధసామగ్రిని సరఫరా చేయుటను మానవలెననియు, అమెరికా సేనలు చైనానుంచి తేచిపోవలెననియు నీరెండు షరతులు నెరవేరనిది తాము అమెరికావారి మధ్యవర్తిత్వమున జరిగే సంధి ప్రయత్నమునకు తోడ్పడజాలమనియు కమ్యూనిస్టు నాయకుడగు చౌ-ఎన్‌లై

**అమెరికాకు మార్షలు నివేదిక**

నిర్మొగమాటముగ చెప్పెను. 1946 డిశంబరు నెలలో మార్షల్ సేనాని అన్ని సంధి ప్రయత్నములను మానివైచి వట్టిచేతులతో నాంకింగు నగరమునకు పోయెను. అక్కడనుంచి అమెరికాకుపోయి తన నివేదికను అమెరికా అధ్యక్షునికి సమర్పించెను. ఉభయపక్షముల వారును రాజీయొక్క మూల సిద్ధాంతముల నంగీకరించ లేదనియు, తమతమ స్వలాభములకే ప్రయత్నించినారనియు, ఉభయులు రాజీభంగమునకు సమానబాధ్యులనియు ఆయన తన నివేదికలో వ్రాసెను. చైనాలో డెమొక్రాటిక్‌లీగు ఒక్కటే సరి

మైనజాతీయప్రజారాజ్య భావములు కలిగియున్నదనియు, కాని దానిని చ్యాంగుకేషకు తలయెత్తకుండ నాశనముగావించెననియు కూడ వ్రాసెను. చట్టసమ్మతమైన ప్రభుత్వముచైనాలో క్యూమింటాంగు ప్రభుత్వము మాత్రమేనన్నియు గాని అది బలహీనముగను, నమ్మకూడనిదిగను, త్రోవతెన్నులేని విధమున మార్పు చెందుచున్నదిగను నున్నదనియు కూడ ఆయన వ్రాసెను.

"1946 వ సంవత్సరములో మార్షల్ సేనానిని అమెరికా అధ్యక్షుడుపంపిన ఉద్దేశ్యము చైనాలోని రెండు రాజకీయపార్టీల మధ్య సంయుక్త ప్రభుత్వమును ఏర్పాటు చేసుకొనుటకు వారిని యొప్పించి, అంతర్యుద్ధమును మాన్పుటయై యున్నది. చైనాలోను, విదేశములలోను ప్రతి వారు ఇట్టి సంయుక్త ప్రభుత్వము ఏర్పడుట అవసరమని భావించిరి. కాని మార్షల్ సేనానియొక్క రాయభారము పూర్తిగ విఫలమయినది. ప్రజారాజ్యముగల దేశములోనే సంయుక్త ప్రభుత్వము ఏర్పరచుట కష్టమైన కార్యము. సాధారణముగా విదేశ దండయాత్రవంటి ఆపద కనబడుచున్నప్పుడే సంయుక్త ప్రభుత్వము తేలికగా ఏర్పడును. అంతేకాక సంయుక్త ప్రభుత్వము ఏర్పడుటకు ఉభయపార్టీలును రెండవవారు రాజ్యములో భాగమును పొందు హక్కును అంగీకరించవలెను. ఇవి చైనా దేశములోలేవు. అక్కడ ఒక ప్రజారాజ్య ప్రభుత్వము లేదు. చ్యాంగుకేషకు సేనాని నియమించిన మంత్రివర్గము తప్ప ప్రజల ఓట్లవల్ల వచ్చిన ప్రభుత్వములేదు. మంచూ సామ్రాజ్యము కూలిపోయినప్పటినుంచి చైనాలో రాజకీయాధికారము సైనిక

డెమోక్రాటికు లీగును చ్యాంగుకేషకు నాశనము గావించెను

బలముతో ఐక్యమైయున్నది. సైనికబలములేని రాజకీయశక్తి అక్కడ యుండుటకే వీలులేదు. మార్షల్ సేనాని చైనాలోనున్న కాలములోనే విద్యార్థికులు, ఉపాధ్యాయులు మొదలైనవారు ప్రజారాజ్య ఆదర్శములతో డెమోక్రాటికులీగు అను ఒకపార్టీని స్థాపించుకొని యుండిరి. ఉత్తమమైన మేధావులందరు అందులో సభ్యులుగానుండిరి. నిజమైన ప్రజారాజ్యము చైనాలో స్థాపితము కావలెనని వారి కోరికయైయుండెను. క్యూమింటాంగు యొక్క ఫాసిస్టు విధానమునకు, కమ్యూనిస్టుల నియంతృత్వ పద్ధతికిని వారు వ్యతిరేకులుగనుండిరి. అప్పుడు సామాన్య ఎన్నికలు జరిపి శాంతముగ ప్రజలఓట్లు తీసుకొని యుండినచో ఆ డెమోక్రాటికు కక్షియే జయమును పొందియుండెడిది. కోట్లకొలది ఓటర్లు వారిని బలపరచి యుండెడివారు. కాని చైనాలో ఎన్నిక అనునది ఎరుగరు. డెమోక్రాటికు కక్షికి సైనికబలము లేదు. ఏ సైనిక నాయకుడును దానివెనుక లేడు. మార్షల్ సేనానితో రాజీ సంభాషణలు జరుపుచున్న కాలములోనే చ్యాంగుకేషకు డెమోక్రాటికు లీగుకు చెందిన నాయకులను హత్యగావించెను. కొందరిని దేశభ్రష్టులను గావించెను. ఆ కక్షిని నిషేధించెను. దానిలో మిగిలిన కొద్దిమంది కమ్యూనిస్టులవద్ద శరణుజొచ్చి కమ్యూనిస్టులు అంతిమ విజయమును పొందినప్పుడు వారియొక్క సంయుక్త ప్రభుత్వములో నామమాత్రముగ సభ్యులైరి. కేవలము సైనిక బలముతోనే ఒకరినొకరు జయించవలెనని తీవ్రముగ తయారగుచున్న క్యూమింటాంగు కమ్యూనిస్టుల మధ్య రాజీ సంభాషణలు విఫలమగుటలో ఆశ్చర్యము లేకుండెను. కమ్యూనిస్టులు తమ

కమ్యూనిస్టు రాజ్యస్థాపనా యత్నమును, భూఖామందు పద్ధతిని నాశనము గావించి బలాత్కారముగా భూములను రైతులలో పంపకముచేయు సాంఘిక విప్లవమును వదిలిపెట్టుటకు ఇష్టపడ లేదు. చ్యాంగు కేషకు ప్రభుత్వము ఈ రెంటికినీ ఎక్కువ వ్యతి రేకముగా నుండెను. భూములు పంచిపెట్టు సాంఘిక విప్లవ మును ఆయన ఖండించెను. చ్యాంగు కేషకు బలహీనుడనియు, ఆయన రాజ్యము లంచగొండితనముతో నిండినదనియు, ఆయన ఆర్థిక విధానము లోపభూయిష్టమైనదనియు అమెరికావారికె తెలుసును. కమ్యూనిస్టులకు రైతుల మద్దతు మాత్రమే కలదని పారిశ్రామిక కార్మికులతో వారికి ఎక్కువ సంబంధము లేదని, వారు సాగించుచున్న విప్లవము కారల్ మార్క్స్ నిర్వచించిన ప్రకారముగా జరుగుటలేదని రష్యావారికి తెలియును. కమ్యూ నిస్టులు ఎప్పటికైనా చైనాపైన రాజ్యమును సంపాదించ గలు గుదురాయను సందేహము రష్యావారికి కలదు. కాని, అమెరికా వారును, రష్యావారును చెరియొక పార్టీని బలపరచక తప్పినది కాదు. ఇటుల బలపరచుచున్నంతవరకు ఈ రెండు పార్టీలమధ్య రాజీ కుదురుట కూడ అసాధ్యమైన పని. ఇందువలననే రాజీ సంభాషణలు విఫలమయ్యెను" అని ఫిడ్జిగెరాల్డ్ తన "చైనా విప్లవము" అను గ్రంథములో వ్రాసియున్నాడు.

## 4

ప్రభుత్వ సేనలు కాల్గన్ పట్టణమును మరల ఆక్రమించెను. అక్టోబరు నెల 25, 29, 30 తేదీలలో చైనాలోని ఏపార్టీకినీ

చెందని నాయకులు. క్యూమింటాంగు కమ్యూనిస్టు పార్టీలమధ్య రాజీ కుదుర్చుటకు అంతిమ ప్రయత్నములను గావించిరి. కాని రాజీ కుదరలేదు. నవంబరు నెల 11 వ తేదీన చ్యాంగుకేషకువలన చైనా జాతీయ ఎసెంబ్లి సమావేశపరచబడెను. వివిధసంఘముల రాజకీయ పార్టీల ప్రతినిధులు ఆ సమావేశములో పాల్గొనిరి. కాని, చైనా కమ్యూనిస్టు పార్టీవారును, డెమోక్రాటిక్ లీగువారును ఆ పార్లమెంటులో పాల్గొనుటకు నిరాకరించి తమ ప్రతినిధులను పంపలేదు. అది దేశమందంతట ప్రజల ఎన్నికలు జరుపగ నేర్పడినది కాదు. కొన్ని సంఘములు, పార్టీలు పంపిన ప్రతినిధులతో కూడినది మాత్రమే. ప్రభుత్వాధ్యక్షునకే విశేషాధికారము లొసంగుచు ఆ ఎస్సెంబ్లి రాజ్యాంగవిధానమును తయారుచేసి 1947 వ సంవత్సరము 1 వ జనేవరి తేదీన ప్రకటించినది. దీనివలన అంతర్యుద్ధము ఆగలేదు.

జాతీయ ఎసెంబ్లీ సమావేశము-కమ్యూనిస్టులు చేరలేదు

అమెరికాకు వ్యతిరేక ఉద్యమము దేశములో కమ్యూనిస్టుల వల్లను, ఇతర పార్టీలవల్లను తీవ్రముగ సాగించబడినది. డిశంబరు 24 వ తేదీన పికింగు విశ్వవిద్యాలయములోని ఒక విద్యార్థినిగాయున్న చైనా యువతిని ఒక అమెరికా సైనికుడు బలాత్కారముగా మానభంగము గావించెనను వార్తకూడ వ్యాపించినది. దానిని కమ్యూనిస్టులు, వారి పక్షమువారు బాగుగా ఉపయోగించుకొని అన్ని పట్టణములలోని విద్యార్థులను రెచ్చగొట్టి అమెరికా వ్యతిరేకోద్యమమును బలపరిచిరి. విద్యార్థి సంఘములు అమెరికా

అమెరికాకు వ్యతిరేక ఆందోళనము

సైన్యములు చైనాలో నున్నయెడల వాటిని ప్రతిఘటింతుమని ప్రకటించిరి. 1947 వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో అమెరికా వారిని వెళ్ళగొట్టుటకు అమెరికా సరుకులను బహిష్కరించుటకు విపరీతముగ ప్రచారము చేసిరి. అమెరికా సరుకుల బహిష్కారము డెమోక్రాటికు లీగువారిచేత కూడ ప్రచారము చేయబడెను. అది అంత జయప్రదము కాలేదు.

కాకపోయినను అమెరికాకు వ్యతిరేక ఉద్యమము దేశములో అత్యంతముగా వృద్ధిచెందినందున 1947 వ సంవత్సరము ఏప్రిలు నెల నుంచియు అమెరికావారు క్రమముగా పికింగు, టీన్‌ట్సిన్, స్టింగ్‌టో మొదలైన పట్టణములనుంచి తమ సేనలను వెడలించుకొని పోవుటయు, చైనాకు అంతవరకు ఇచ్చుచున్న సైనిక సహాయమును చాలవరకు ఆపివేయుటయు జరిగినది. అమెరికావారు చైనా ప్రభుత్వమున కిచ్చెదమని వాగ్దత్తముచేసిన ఏబదికోట్ల డాలర్ల రుణము నిచ్చుటను కూడ మానివేసినది. ఈ అంతర్యుద్ధములో తాము క్యూమింటాంగుకు సహాయము చేసినచో రెండవవైపున సోవియటు రుష్యా చైనా కమ్యూనిస్టులకు సహాయము చేయుననియు ఇది మరియొక ప్రపంచయుద్ధమునకు దారితీయుననియు తలచి అమెరికావారు చ్యాంగుకేషకుకు చేయుచున్న సైనిక ఆర్థిక సహాయమును మానివేసిరి.

అమెరికా సహాయము తగ్గినది

చైనా ప్రభుత్వము తమపై తిరుగుబాటు చేయుచున్న కమ్యూనిస్టులపై యుద్ధమును ప్రకటించినది. 1947 వ సంవత్సరము జులై నాలుగవ తేదీన చైనా ప్రభుత్వ సైన్యములు

క్యూమింటాంగు సేనల అపజయము

కమ్యూనిస్టుల ముఖ్యకార్యస్థానమైన ఈనాను పట్టణమును పట్టుకొనెను. కాని ఉత్తరచైనాలో కీలకస్థానము వహించిన పాంటంగు నగరము నాక్రమించుటకుగాను చ్యాంగుకేషకు తన శూరత్వమునకు పేరుగన్న సేనలను పంపగ నవి కమ్యూనిస్టుల చేతిలో పూర్తిగ నోడించబడినవి. సేనల నష్టము విశేషముగ కలిగినది. ఆయనకిది గొప్ప పరాజయము. ఇంతటనుంచి మంచూరియాలోకి ఆయన సైన్యములు పోవుటకు పూర్తిగ నభ్యంతరము కలిగెను. 1947 వ సంవత్సరాంతమునకు మంచూరియాలో కొన్ని పట్టణములలో మాత్రము క్యూమింటాంగు సేనలు లంకలలో నున్నటుల నుండెను. అచటికి పోవుటకు రాకపోకలను కమ్యూనిస్టులు పూర్తిగ నాశనము గావించిరి. నాంకింగునుంచి క్యూమింటాంగు సేనలు మంచూరియాలోని పట్టణములలోనున్న తమ సేనలకు సహాయార్థము రాజాలకపోయెను.

ద్వితీయ ప్రపంచయుద్ధము ముగిసిన పిమ్మట అమెరికా వారు జపానుయొక్క పునర్నిర్మాణమునకు తోడ్పడుటకుగాను జనరల్ మెకార్థర్ అను తమ ప్రతినిధిని జపానుకు పంపి, విశేష ధన సహాయమును జపానుయొక్క పునర్నిర్మాణముకై చేయ సాగిరి. చైనా దేశముయొక్క కష్టములకు

జనరల్ మెకార్థరు జపానుకు చేసిన సహాయము చైనాలో అమెరికా యందున్న వ్యతిరేకతనువృద్ధిచేసినది

దైన్యమునకు ప్రధానకారణమైన జపానుకు అమెరికావారు సహాయము చేయుచున్నందుకు అమెరికాయందు వ్యతిరేక భావమును ప్రకటించుచు చైనా దేశమందంతటను విద్యార్థులు,

ఉపాధ్యాయులు కార్మికులు మొదలగువారు గొప్ప ప్రదర్శ నములు జరిపిరి. 1947 జులై నెలలో కమ్యూనిస్టు సేనలు ఎల్లో నదిని దాటి క్యూమింటాంగు సేనల నోడించి, నాంకింగు, ఊహాన్ పట్టణముల మధ్యనున్న టాపే పర్వత ప్రాంతముల నాక్రమించెను. దీనితో రాజధానియైన నాంకింగుకు అపాయము వాటిల్లెను. ఎప్పటికినీ ఛ్యాంగుకేషకు ప్రభుత్వమునకు జయము కలుగదని దేశములో అపనమ్మకము బాగుగ వ్యాపించెను.

1948 వ సంవత్సరము జనేవరి నెలలో షాంఘాయి నగర ములో గొప్ప కార్మిక సమ్మె జరిగెను. దానిని ప్రభుత్వసేనలు కఠినముగ అణచవలసివచ్చినది. ఏప్రిలు 22 వ తేదీన కమ్యూ నిస్టులు గెలిచి ఈనాను పట్టణమును మరల స్వాధీనము పొందిరి. సెప్టెంబరు నెల నుండియు కమ్యూనిస్టులు ఉత్తర వాయువ్య చైనాలో దండయాత్రలను సాగించి చించో పట్టణమును పట్టు కొనిరి. నవంబరు నెలలో ఉత్తర వాయువ్య చైనా నంతను ఆక్ర మించిరి. హ్సుచో అను గొప్ప యుద్ధములో క్యూమింటాంగు సేనలు కమ్యూనిస్టుల చేతిలో పూర్తిగ నోడిపోయెను.

హ్సుచో యుద్ధములో కమ్యూనిస్టుల గొప్ప జయము

1948 మొదలు 1952 సంవత్సరము వరకు చైనా దేశములో భారత ప్రభుత్వ రాయబారిగా నుండిన కె. ఎం. పాణికర్ గారు అప్పటి పరిస్థితులను గూర్చి 'రెండు చైనాలు' అను తన గ్రంథములో ఇటుల వ్రాసియున్నారు :

"క్యూమింటాంగుయొక్క చరిత్రలో అత్యంత క్లిష్టముగ నున్న సమయములో నేను రాజధానియైన నాంకింగు నగరము

నకు చేరితిని. నేషనల్ ఎస్సెంబ్లి (చైనా పార్లమెంటు) అపుడచ్చట సమావేశమైయుండెను. చైనా దేశమునందంతటను ఎన్నికలు జరిపి అందులో వచ్చిన ప్రతినిధులు పార్లమెంటు సభ్యులుగనుండిరి. కాని, చాల ప్రాంతములలో ఎన్నికలు జరగలేదు. కమ్యూనిస్టులు, వారి సహచరులు తమ ప్రతినిధులను పంపలేదు. ఆ పార్లమెంటు చేయవలసిన మొదటిపని అధ్యక్షుని, ఉపాధ్యక్షుని ఎన్నుకొనుటయై యున్నది. చట్టములు చేయుటకు శాసనసభ వేరుగ గలదు. అధ్యక్షులు ఎవరు కావలెనను విషయములో ప్రజలలో గందర

*చ్యాంగుకేషకు లేచిపోవలె నను ఆందోళనము. లీట్సుంగుజెన్ సేనాని ఉపాధ్యక్షుడుగ నెన్నుకొనబడెను*

గోళముగ నున్నది. దేశములో చాలమంది చ్యాంగుకేషకు అధ్యక్షపదవిని మానుకొని, దానిని మరియొకరికి యొప్పగింత చేయుట సమంజసమని అభిప్రాయపడుచుండిరి. ఆయన ఒకప్పుడు ఆ పదవిని మానుకొనుటయే యుక్తమని తలచెను. డాక్టరు హూ్యాషీగారిని అధ్యక్షుడుగా ఎన్నుకొనవలెనని సూచించెను. కాని ఆయనయొక్క స్నేహితులు క్యూమింటాంగు పార్టీలో చాల ప్రధానులైనవారునగు చెన్ లీ ఫ్యూ పార్లమెంటులో అధ్యక్షపదవికి చ్యాంగుకేషకు పేరునే సూచించెను. పోటీలేకుండ చ్యాంగుకేషకు అధ్యక్షుడుగా నెన్నుకొనబడెను. ఉపాధ్యక్షపదవికి మాత్రము తీవ్రమైన పోటీ కలిగినది. చ్యాంగుకేషకు ఉపాధ్యక్ష పదవికి డాక్టరు సన్యాటుసెన్ యొక్క కుమారుడగు సన్‌ఫోను అభ్యర్థిగ నిలబెట్టెను. చ్యాంగుకేషకు లేచిపోయినదాకా కమ్యూనిస్టులలో రాజీ కుదరదని దేశములో శాంతి కలుగదని ఎంచుచున్నవారు క్యూమింటాంగులో చాల

మంది కలరు. వారు లీట్సుంగుజన్ సేనానిని ఉపాధ్యక్షునిగా సూచించిరి. ఆయన మొదటినుండియు చ్యాంగుకేషకుకు వ్యతిరేకుడుగ నున్నవాడు. ఆయన శాంతస్వభావుడు. ప్రజారాజ్య భావములు కలవాడు. నిరంకుశత్వమును ఏవగించువాడు. ప్రవర్తనలో మిగుల యోగ్యుడు. ఆయనను ఉపాధ్యక్షుడుగా నిలబడ వద్దని చ్యాంగుకేషకు గట్టి ఒత్తిడిని ఆయనమీదకు తెచ్చెను. గాని ఆయన అందుకు లొంగలేదు. అమెరికనులు కూడ ఆయనకు ప్రోత్సాహము నిచ్చిరి. ఆయన ఎక్కువ మెజారిటీతో ఉపాధ్యక్షుడుగా ఎన్నుకొనబడెను. ఇదిచ్యాంగుకేషకుకు గొప్పఅపజయము. సన్‌ఫోకు శాసనసభ అధ్యక్షుపదవి నిచ్చిరి. అక్కడనున్న వారందరు ఉపాధ్యక్షుఎన్నిక చ్యాంగుకేషకునందు విశ్వాసరాహిత్య ప్రకటనయేనని తలంచిరి. ............ అధ్యక్షు, ఉపాధ్యక్షులు ఎన్నుకొనబడగనే నేను భారతరాయబారిగా చైనా ప్రభుత్వ దర్బారులో హాజరయితిని. ఆ దర్బారులో చైనా ప్రజాస్వామ్యము యొక్క అధ్యక్షుడుగా చ్యాంగుకేషకు, మూడు నెలలలో కమ్యూనిస్టు సైన్యములను నాశనముచేసి క్యూమింటాంగుకు జయమును సంపాదింతునని ఉపన్యాసమిచ్చెను. అందుకు అమెరికనులు, బ్రిటిషువారు సంతోషించిరి. తప్పకుండ చైనా శాంతియుతమైన అభివృద్ధిని పొందునని, ప్రజారాజ్యము సుస్థిరమగునని భావించిరి. అక్కడ నున్నవారికెవరికినీ ప్రజల విముక్త సైన్యములను గురించికాని, పర్వత ప్రాంతములలో మావోసిటంగు స్థాపించిన ప్రభుత్వమును గురించి కాని ఎట్టి తాపత్రయము కలుగలేదు...కాని నూతన ఉపాధ్యక్షుడైన లీట్సుంగ్‌జన్ సేనాని

నాంకింగును వదలిపెట్టి తన స్నేహితుడైన ఫ్యూటోస్యి సేనాని యొక్క రక్షణక్రింద పికింగులో కాపురము ఏర్పరచుకొనెను. ఫూటోస్యి సేనానియే ఉత్తర చైనాయొక్క రక్షణకు బాధ్యుడుగ నుండెను. కాని, అప్పుడు అందరిని కలవరపెట్టిన ముఖ్యవిషయము చైనా డాలరుయొక్క విలువ అతిత్వరితముగ పడిపోవుచుండుటయు, చైనాలోని పదార్థములన్నిటియొక్క ధరలు అపరిమితముగ పెరుగుటయు నయియున్నది. చైనా నాణెములలో చెల్లించినచో బజారులలో సరుకులు దొరుకవు. ప్రతివారును అమెరికా డాలర్లనే కోరుచున్నారు......ప్రజల యొక్క దౌర్భాగ్యమునకు మేరలేకుండెను. గంటగంటకు చైనా నాణెముల విలువ పడిపోవుచుండెను......నేను చ్యాంగు కేషకు సేనానిని, ఆయన భార్యయగు మదాము చ్యాంగుకేషకును కొన్ని సార్లుకలుసుకొంటిని. వారిద్దరునన్ను ఎంతో గౌరవముతో చూచిరి. వారు ఇదివరకు భారతదేశమునకువచ్చి మన అతిథులుగనుండిరి. భారత దేశముయొక్క స్వాతంత్ర్య పోరాటముతో గొప్ప సాను భూతిని చూపిరి...నాంకింగులో అదివరకు వాంగ్ చింగ్‌వై క్రిందనుండిన విశాలమైన తోటలు అమెరికావారు క్లబ్బులక్రింద నుపయోగించుకొనిరి. అమెరికావారు చైనావారిని హీనముగ చూచుచుండిరి. వారు చైనా స్త్రీలయెడ అగౌరవముగ ప్రవర్తించుచున్నారను భావముకూడ వ్యాపించెను. పికింగు విశ్వ విద్యాలయములో విద్యార్థినిగానున్న ఒక చైనా యువతిని యొక అమెరికా సైనికుడు బలాత్కారముగా మానభంగము గావించెననువార్త దేశములో అమెరికావారియందు వ్యతిరేక

భావమును కలుగజేసినది. అంతేగాక, చైనాకు శత్రువుగనున్న జపానును అమెరికావారు పునర్నిర్మాణముచేసి గొప్ప జాతిగా చేయుచున్నారను విషయముకూడ చైనావారిలో అమెరికా వారియందు వ్యతిరేకభావమును కలుగజేసినది.........కొంత కాలము నాంకింగులో గడిపి నేను షాంఘాయి పట్టణమునకు పోతిని. పండిట్ నెహ్రూగారు నాకిచ్చిన ఉత్తరముతో మదామ్ సన్యటుసేనుగారిని చూచితిని. ఆమె చ్యాంగుకేషకు ప్రభుత్వమునకు అనుకూలముగ లేదు. షాంఘాయిలో ఆమెను పోలీసు నిఘాక్రిందనే ఉంచిరి. అక్కడ అనేకమైన సేవాసంఘములలో ఆమె పనిచేయుచుండెను. తన సానుభూతి క్యూమింటాంగుతో లేదని ఆమె బహిరంగముగనే చెప్పుచుండెను. మావోసిటంగుతోను, కమ్యూనిస్టులతోను ఆమెకు సానుభూతి యుండెనని చాలమంది నమ్ముచుండిరి. నన్ను ఆమె మిగుల మర్యాదతో నాదరించెను...."

"జులై నెలలో నాణెముల సంస్కరణ చేయుటకు క్యూమింటాంగు ప్రభుత్వము ప్రయత్నించెను. చ్యాంగుకేషకు మొదటి భార్య కుమారుడగు చ్యాంగుచింగు క్వోను ఆర్థిక సంస్కరణలు జరుపుటకు నియమించిరి. ఆయన మిగుల ధైర్యశాలి. నీతిపరుడు. కాని మదాము చ్యాంగు కేషకుయొక్క జోక్యమువల్లనే నాలుగు పెద్ద

ఆర్థిక సంస్కరణముల విఫలత

కుటుంబములయొక్క లంచగొండి తనమును స్వలాభమును ఆయన ఎదిరించజాలక తన పదవికి రాజీనామానిచ్చి వెడలి పోయెను. ఆర్థిక విషయములలో ప్రబలియున్న లంచగొండితనము

నకు, స్వార్థపరత్వమునకు ఆ నాలుగు కుటుంబములే మూలస్థాన ముగ నుండెను. ...... పిమ్మట రెండువారములకు చ్యాంగు కేషకు కోరికమీద విమానములో నేను ఉత్తర రాజధానియగు పికింగు నగరమునకు చేరితిని. చ్యాంగు కేషకు యొక్కయు, క్యూమింటాంగు యొక్కయు, పతనము అంతత్వరలో వచ్చునని నేను అనుకొనలేదు. నేను పికింగుచేరగనే అచటి వాతావరణ మంతయు ఆందోళనముతో కూడియుండెను. అప్పుడే ఉత్తరమున నున్న ఒక రాష్ట్రరాజధానియగు ట్సీనాను పట్టణమును కమ్యూనిస్టులు ఆక్రమించిరని వార్త పికింగుకుచేరెను. కమ్యూనిస్టులు పికింగునుకూడ ముట్టడించి ఆక్రమింతురేమోనను భయము అందరికిని కలిగెను. ఆ నగరమునందున్న ప్రజలందరు భీతావహ మును చెందియుండిరి. కమ్యూనిస్టులు, కమ్యూనిస్టు సేనలు ఆ నగరమునకు 50 మైళ్లలోపువరకు వచ్చిరని తెలిసెను. పెద్ద నగర మైనందున పికింగును వారు ముట్టడించరేమోనను ఆశ కొందరికి మాత్రముండెను. పికింగు నగరము మిగుల అందమైన నగరము. కాని మేము చూచినప్పుడు అత్యంతమైన హీనదశలో నుండెను. ఇరువది సంవత్సరములనుండి ఆనగరము నిర్లక్ష్యముగ చూడబడెను. మునిసిపల్ పన్నులు బజారు ఊడ్చువారి ఖర్చుకు సరిపోవుటలేదని అక్కడివారు చెప్పిరి. అక్కడి సుందరమైన సరోవరములన్నియు మట్టితో పూడియుండెను. కమ్యూనిస్టులు ఆక్రమించిన ప్రాంత ములనుండి వేలకొలది శరణాగతులు వచ్చి ఆ పట్టణములో ఎక్కడ పడితే నక్కడ నివసించుచుండిరి. అచటి అపరిశుభ్రత వర్ణనాతీతము. ఈ నగరములో ఫూటొస్సొయి రక్షణకు బాధ్యుడైన సేనానిగా

నుండెను. ఈయన సంరక్షణలోనే చైనా ఉపాధ్యక్షుడగు శ్రీ సేనాని యుండెను. ఈయనయందు చ్యాంగుకేషకుకు ఇష్టము లేదు. అమెరికావారు సహాయము చేసినయుద్ధసామాగ్రిని యీాయనకు నిచ్చుటలేదు. ఈయనయొక్క ఫిర్యాదుమీద అమెరికావారు యుద్ధసామగ్రిని యీాయనకే నేరుగా సరఫరాచేసిరి. ఈయన చాల గొప్పసైనికుడు. కాని నేను వెళ్ళిన మరుదినమునుంచి యీాయన చ్యాంగుకేషకుకు వ్యతిరేకుడై కమ్యూనిస్టులతో లాలూచీ పడు చున్నాడని తెలిసినది. ఆయనకు సప్లయి చేయుచున్న ఆయుధ సామగ్రి కమ్యూనిస్టులకు అమ్మబడుచుండెనని వాడుకలు వ్యాపించెను. అది నేను నమ్మలేదు, గాని తరువాత మూడు నెలలకు ఆసేనాని క్యూమింటాంగునువదిలిపెట్టి మావోసిటుంగుతో చేరెను. అక్కడ విద్యాధికుల, విద్యార్థుల స్థితి మిగుల దైన్యముగ నుండెను. వారిలో చాలమందియొక్క సానుభూతి మావో సిటుంగునందే యుండెను. విద్యార్థులు, విద్యాధికులు జట్లుజట్లుగా బయలుదేరి తమకు కొన్నిమైళ్ళదూరములో నున్న కమ్యూనిస్టులతో చేరుచుండినటుల నేను వింటిని... నేను 12 రోజులు పికింగులో నివసించితిని. మేము అక్కడ ఉండగనే చ్యాంగుకేషకు అక్కడకువచ్చి ముక్డనుకు ఆకాశవిమానములో వెళ్ళెను. అక్కడ తన సేనాధిపతుల సమావేశము జరిపి కమ్యూనిస్టులతో సరిగ యుద్ధము చేయుటకు నిర్ణయించెను...... మేము ఇంతలో నాంకింగు చేరుకొంటిమి. అక్కడ 'అక్టోబరు 10 వ దినము' క్యూమింటాంగువారు జరుపుదురు....ఆ ఉత్సవములు ఆ సంవత్సరము జరుగనేలేదు. చ్యాంగుకేషకుకుగల సైన్యములలో

మిగుల ప్రశస్తినిగన్న మంచూరియా సైన్యములు ముక్డను నగరములో చిక్కుకొనెననియు అశేషమైన కమ్యూనిస్టు సైన్యములు లిన్‌ఫియా సేనాని నాయకత్వముక్రింద ఆ నగరమును అన్ని వైపులను ముట్టడించెననియు తెలిసినది......"

"చ్యాంగుకేషకును పరిపాలననుండి తప్పించుకోమని అన్ని వైపులనుండి ఒత్తిడి ఎక్కువఅయ్యెను. సైన్యములు, రాజకీయవాదులు, విద్యాధికులు, గొప్ప ఉద్యోగస్థులు అందరుకూడ ఆయన ప్రభుత్వమును వదిలిపెట్టవలెనని ఏక కంఠముతో కోరిరి. శాసనసభ చ్యాంగుకేషకునకు ఎదురుతిరిగెను. ఆయన నియమించిన మంత్రివర్గమును ఖండించెను. ఆయన నెరవేర్చిన ప్రతి కార్యమును విమర్శించెను. వారు ఏకగ్రీవముగ అంతర్యుద్ధము మానవలెననియు, శాంతిని స్థాపించవలెననియు తీర్మానముచేసిరి. కంట్రోలు సంఘమువారు చ్యాంగుకేషకు నిర్మాణము చేసిన యాంగ్సీ అభివృద్ధి కార్పొరేషనులో చ్యాంగుకేషకు పడ్డకుడగు డేవిడ్ కంగు చేసిన అక్రమములనుగూర్చి విచారించవలెననికోరిరి. మదాము చ్యాంగుకేషకును పూర్తిగ విమర్శించిరి."

"ప్రతిదినము చ్యాంగుకేషకునకు వ్యతిరేకత అత్యంతముగ వృద్ధి చెందుచున్నదనియు, దేశములో శాంతిస్థాపన జరుగవలెనని వాంఛించుచుండిరనియు స్పష్టమయ్యెను. ఆయన కమ్యూనిస్టులను మూడు నెలలలో అణచివేసెదనని మరొక ఉపన్యాసము నిచ్చెను. కాని, అది ఎవ్వరును నమ్మలేదు. 1948 వ సంవత్సరము నవంబరు నెలలో ఆయనమాటలు వట్టి ప్రగల్భములని

క్యూమింటాంగు సైన్యములు కమ్యూనిస్టులకు లోబడెను

తలచబడెను. చ్యాంగుకేషకుయొక్క కొన్ని లక్షల సంఖ్యగల మంచూరియా సైన్యములు కమ్యూనిస్టుల చేతిలో పరాజయమునుపొంది కమ్యూనిస్టులకు లోబడెను. నాంకింగు నగరమునకు ముఖ్యమైన రక్షణయగు హ్యూచో పట్టణమువద్ద ఒక నెల రోజులు కమ్యూనిస్టులకును చ్యాంగు కేషకుకును తీవ్రమైన యుద్ధములు జరిగెను. చ్యాంగుకేషకు సైన్యములు ఓడిపోయి చాలగ నాశనమయ్యెను. కమ్యూనిస్టులు గొప్ప జయమును పొందిరి." అని ఆయన తన గ్రంథమునందు వ్రాసెను.

చ్యాంగుకేషకుచే విద్యాధికులమీద క్రూర నిర్బంధ విధానములు

చ్యాంగుకేషకు లేచిపోవలెనని, కమ్యూనిస్టులతో రాజీ పడవలెనని, దేశములో శాంతి ఏర్పడవలెనని, ఆందోళనము హెచ్చినకొద్దీ విశ్వవిద్యాలయములలోను, కళాశాలలలోను ఉన్న విద్యార్థులమీదను, విద్యాధికులమీదను, ఇతర ప్రజలమీదను చ్యాంగుకేషకు ప్రభుత్వము అతి క్రూరమైన నిర్బంధ విధానములను జరిపెను. 'టీవు' అను రహస్య పోలీసు సిబ్బందిని అందరిమీదకు విడిచిరి. తన కనుకూలముగ పనిచేసి వ్యతిరేకులను పట్టియిచ్చుట కొక విద్యార్థి బృందమును ఏర్పాటుచేసెను. వ్యతిరేకులైన అనేక మందిని రహస్యముగ అరెస్టుచేసి ఎవరికీ తెలియకుండ మాయము చేసిరి. అనేక మందిని హత్య గావించిరి. ఒక భయానకపాలనము ఫాసిస్టు రాజ్యము ఏర్పడెను. కాని ఫాసిస్టు రాజ్యమున కున్న సమర్థత కూడ దీనికి లేదు. స్వాతంత్ర్యములన్నియు అణచివేయబడెను. ప్రజారాజ్యము మృగ్యమయ్యెను.

అదివరకు క్యూమింటాంగుకు అనుకూలురగనున్న విద్యార్థికులలో నత్యధిక సంఖ్యాకులు కమ్యూనిస్టు రాజ్యమునే అభిలషించిరి. క్యూమింటాంగు ఇదివరకే రైతులను పోగొట్టుకున్నది.

క్యూమింటాంగు విద్యార్థికులను పోగొట్టుకొన్నది

ఇప్పుడు విద్యార్థికులను పూర్తిగ పోగొట్టుకొన్నది. రుష్యాలోని అంతర్జాతీయ కమ్యూనిస్టు సంఘమువారు తొందరపడవద్దని, నిదానముగా పొమ్మని మావోసిటంగుకు సలహానిచ్చిరి. ఆయన దానిని పాటించలేదు. అన్నివైపులకు పోయి ముట్టడించినట్లయిన క్యూమింటాంగు ప్రభుత్వమును తేలికగ కూలద్రోయవచ్చునని ఆయన నమ్మి అన్నివైపుల తన దాడులను సాగించెను. సెప్టెంబరు నెలలో షాంటంగు రాష్ట్రములోని ట్సినాను పట్టణము కమ్యూనిస్టులకు స్వాధీనమయ్యెను.

అక్టోబరులో కమ్యూనిస్టులు యాంగ్సీ ప్రాంతమునంతను స్వాధీనము పొందిరి. మంచూరియా రాజధాని అయిన ముక్డన్ నగరములో చ్యాంగుకేషకు యొక్క ప్రశస్తి గన్న రెండులక్షల సైన్యము బయటకురాకుండ ఆ పట్టణముచుట్టు ముట్టడివేసిన అసంఖ్యాకమైన కమ్యూనిస్టు సైన్యములు, గొరిల్లాలు అడ్డపరచిరి. దినదినము వారికి భోజనపదార్థములు దొరకవయ్యెను. ఒక సంవత్సరమునుంచి వారు ఎటును బయటకు పోలేక ముక్డన్ నగరములోనే యుండిరి. ఎటువైపునుంచి సైనిక సహాయము గాని, ద్రవ్యసహాయము గాని, ఆహారపదార్థములు గాని వారికి సప్లయిచేయుటకు వీలులేకుండ నలువైపులను కమ్యూనిస్టులు చుట్టుముట్టియుండిరి. ఆకాశ విమానములనుండి కొన్నిసార్లు

భోజనపదార్థములు తీసుకొనిరాబడెను. అది విశేషకాలము జరగదు. ఒక సంవత్సరము గడచినది. శీతకాలము వచ్చుచున్నది. మంచూరియాలో శీతకాలము అతి తీవ్రముగ నుండును. ఆ బస్తీ లోని ప్రజలు కూడ భోజనపదార్థములు లేక ఉపవాసములు చేయుచుండిరి. కమ్యూనిస్టులు వారిని ముట్టడించినను, ముట్ట డించకున్నను ఈ దిగ్బంధన ఫలితముగ శీతాకాలము వచ్చుసరికి ముక్డన్‌లోని సైన్యములు కమ్యూనిస్టులకు లోబడక తప్పదు. మంచూరియాలోని మరొక పట్టణమైన చాంగుచన్ నగరములో నున్న క్యూమింటాంగు సైన్యములస్థితికూడ అటులనేయుండెను. అక్కడి శీతలము ఇంక నెక్కువ దారుణముగనుండెను. ఆ పట్ట ణములోనిసైన్యము ఇంకను పెద్దదిగనుండెను. కాబట్టి యీ రెండు పట్టణములలో నున్న తమ సైన్యములను విడిపించి తేజాలనిచో ఆ సైన్యములన్నియు మలమల మాడి చచ్చునని చ్యాంగుకేషకు తెలిసికొని వాటిని జయప్రదముగ బయటకు తెచ్చుటకు ఆఖరు ప్రయత్నము చేసెను. 1948 వ సంవత్సరము అక్టోబరు నెలలో చ్యాంగుకేషకు పికింగుకు వచ్చెను. క్యూమింటాంగు యొక్క ఉత్తమశ్రేణికి చెందిన, అమెరికావారి క్రింద తర్ఫీదు పొందిన సైన్యములను ముక్డన్‌లోను చాంగుచన్‌లోను ప్రవేశించుటకు చ్యాంగుకేషకు పంపెను. ఆ సైన్యములు చించో వరకు చొచ్చుకొని పోయినవి. అక్కడ వాటిని కమ్యూనిస్టుసేనలు చుట్టుముట్టెను. కొంచెము సేపు పోరాటము జరిపి యావత్తు క్యూమింటాంగుసేన కమ్యూ నిస్టులకు లోబడెను.

చించో యుద్ధము. కమ్యూనిస్టుల జయము

ముక్డనులోనున్న క్యూమింటాంగు సైన్యముకూడ ఆ నగరమునుండి బయటకు వచ్చుటకు ప్రయత్నించి కొద్దిమైళ్లు ముందుకు సాగగా అసంఖ్యాకములైన కమ్యూనిస్టు సైన్యములు వాటిని ముట్టడించెను. కొంచెము పోరాటము జరిపి ఆ క్యూమింటాంగు సైన్యములన్నియు ఆయుధములను క్రింద పడవైచి కమ్యూనిస్టు సేనలకు లొంగెను. అంతటితో ముక్డన్, చాంగుచన్ రెండు పట్టణములు కమ్యూనిస్టులకు స్వాధీనమయ్యెను. మంచూరియాలో తనకు బలముగనున్న ప్రాంతములు కమ్యూనిస్టుల చేతిలోకి పోయినందున ఉత్తరచైనా అంతయు చ్యాంగుకేషకు చేతినుంచి జారిపోయినది. అక్టోబరు చివర చ్యాంగుకేషకు పికింగును వదలిపెట్టిపోయెను. ఆయన మరల పికింగుకు రాలేదు. అదివరకే యాంగ్సీలోయలో ఆయనక్రింద నున్న ప్రాంతములు కమ్యూనిస్టుల స్వాధీనములోకి వచ్చినవి. వారు నవంబరు డిశంబరు నెలలలో హ్యూచౌ యుద్ధములో క్యూమింటాంగు సేనలను ఓడించి ఆ సంవత్సరాంతమునకు యాంగ్సీనదిని దాటి నాంకింగు సమీపమునకు వచ్చుచుండిరి. ఈ లోపల ఉత్తరచైనా యంతయు సంరక్షించువారులేక కమ్యూనిస్టులకు వశమయ్యెను.

**ముక్డన్, చాంగుచన్ పట్టణములు కమ్యూనిస్టులకు స్వాధీనమయ్యెను**

పికింగు నగరములో సంవత్సరము పైకాలమునుంచి క్యూమింటాంగులోని వామపక్షములవల్ల చ్యాంగుకేషకుకు వ్యతిరేకముగ కుట్రలు తీవ్రముగ జరుగుచుండెను. చ్యాంగుకేషకును వెళ్ళగొట్టి సంయుక్త ప్రభుత్వమును స్థాపించ

**ఉపాధ్యక్షుడు కమ్యూనిష్టులతో రాయబారములు విఫలమైనవి. పికింగు నగరము కమ్యూనిస్టులకు లోబడెను**

వలెనని ప్రయత్నములు చేయబడెను. వీరందరు ప్రభుత్వ ఉపాధ్యక్షుడగు లీ సంగుజన్ సేనానిమీద తమ ఆశను పెట్టుకొనిరి. ఆ సంవత్సరము వేసంగిలో కమ్యూనిస్టులతో ఆయనకు రాయబారములు జరిగెను. చ్యాంగు కేషకును, ఆయనతో కలిసి పనిచేయు వారిని చైనా జాతీయ ప్రభుత్వమునుండి వెళ్ళగొట్టవలెనని, యుద్ధ విరామమును కోరి అంతర్యుద్ధము నాపి కమ్యూనిస్టు పార్టీతో కూడిన సంయుక్త ప్రభుత్వమును స్థాపించవలెనని నిర్ణయించబడెను. కాని వీటిని అమలు జరుపుట ఎట్లు? ముందుగ చ్యాంగు కేషకును వెళ్ళగొట్టవలెను. ఆయన తేలికగా వీరు పొమ్మనగనే పోవువాడు కాడు. ఈ షరతుల ప్రకారము పికింగులోని క్యూమింటాంగు సేనాధిపతి పూటోస్యియీ పికింగుయొక్క రక్షణను వదలి పెట్టెను. ఆయన ఏమియు చేయజాలక కమ్యూనిస్టులకు లోబడెను. డిశెంబరు 12 వ తేదీన పికింగు నగరము కమ్యూనిస్టుల వశమయ్యెను. ఫిబ్రవరి 3 వ తేదీన కమ్యూనిస్టు సేనలు పికింగు నగరములో ప్రవేశించెను.

అందుమీద చ్యాంగు కేషకు అధ్యక్షపదవికి రాజీనామా నిచ్చెను. కాని చైనాను వదిలిపెట్టలేదు. రహస్యముగ కుట్రలు చేయుచునే యుండెను. ఉపాధ్యక్షుడగు లీ సంగుజన్ యొక్క ప్రయత్నములు జయప్రదము కాలేదు. 1949 వ సంవత్సరము ఫిబ్రవరి మొదలుకొని ఏప్రిల్ వరకు ఉపాధ్యక్షునికిని కమ్యూనిస్టులకును మరల రాయబారములు జరిగెను. అప్పటికి యాంగ్సీ నదికి ఉత్తరమున నున్న యావత్తుభాగము కమ్యూనిస్టుల స్వాధీనములో నుండెను.

చ్యాంగు కేషకు రాజీనామా నిచ్చెను

క్యూమింటాంగు ఇంకను దక్షిణ పడమర ప్రాంతములను కలిగి యుండెను. ఏప్రిల్ నెలాఖరున ఉపాధ్యక్షుడైన లీ సంగుజన్ తాము నిర్ణయించిన షరతులను ఒప్పుకొని తమకు లోబడునని కమ్యూనిస్టులు తలచిరి. వారి షరతులప్రకారము ప్రభుత్వములో కమ్యూనిస్టులే ప్రాధాన్యమును వహించి సైన్యములన్నియు వారి క్రిందకే వచ్చి వారే యావత్తు చైనాదేశము మీద యాజమాన్యము వహించునట్లును క్యూమింటాంగుకు ఒక రాజకీయ పార్టీగా ప్రభుత్వములో కొంత భాగము ఇచ్చునట్లును వారు ఒప్పుకొనిరి. ఇవి తప్పకుండ క్యూమిటాంగు పక్షమున ఉపాధ్యక్షుడు అంగీకరించునని వారు తలచిరి. కాని అవి అంగీకరించినచో క్యూమింటాంగు సర్వనాశనమగునని క్యూమింటాంగు యొక్క రహస్య పోలీసు అధికారి ఉపాధ్యక్షుడికి తెలిపి వాటి నంగీకరించినచో హత్య గావింతుమని బెదరించగా ఆయన ఆ షరతులను ఒప్పుకోక, నాంకింగు నగరమునకు పారిపోయెను. అందుమీద యాంగ్సీనదిని దాటి పశ్చిమ చైనాను జయించవలెనని కమ్యూనిస్టులు తమ సైన్యముల కుత్తరువు చేసిరి. కొద్ది రోజులలో నాంకింగు నగరము కమ్యూనిస్టుల వశమయ్యెను. అక్కడనున్న క్యూమింటాంగు సైన్యములు పారిపోయెను. షాంఘాయి నగరము, దక్షిణ రాష్ట్రములో కాంటను నగరము, ఇంక నెన్నియో పట్టణములు కమ్యూనిస్టుల వశమయ్యెను. అంతటితో క్యూమింటాంగు నాయకులెల్లరు చైనాను వదలి ఫార్మోజా

మరల ఉపాధ్యక్షునితో రాజీ విఫలమైనది

నాంకింగు కమ్యూనిస్టుల వశమయ్యెను. చ్యాంగు కేషకు ఫార్మోజాకు లేచిపోయెను

ద్వీపములో తలదాచుకొనిరి. ఇంతటితో కమ్యూనిస్టుల యొక్క జయము పూర్తి అయ్యెను.

1949 వ సంవత్సరము జులై ఒకటవ తేదీన ప్రజల డెమోక్రాటిక్ నియంతృత్వము అను వ్యాసమును మావోసిటుంగు ప్రచురించెను. అందులో నిటుల వ్రాయబడినది :- "చైనా ప్రజలొక ప్రజల రిపబ్లికును స్థాపించుకొనవలెను. ఆ రిపబ్లికు కార్మిక వర్గముయొక్క నియంతృత్వము క్రింద నుండవలెను. కార్మికుల, కర్షకుల సమ్మేళనముమీద ఆధారపడవలెను. దానిని కమ్యూనిస్టు పార్టీ నడపవలెను. ప్రజల రిపబ్లికులో కార్మికులు, కర్షకులు, కొద్ది ఆస్తి గల మధ్యమతరగతి ప్రజలు, జాతీయ పెట్టుబడిదార్లు ప్రజారాజ్య హక్కులను అనుభవింతురు. వారు కమ్యూనిస్టు పార్టీ యొక్కయు, కార్మికవర్గము యొక్కయు నాయకత్వముక్రింద నడపబడి భూఖామందుల మీదను పారిశ్రామికుల మీదను ధనిక వర్గము మీదను నియంతృత్వ అధికారమును కలిగియుందురు. అంతర్జాతీయముగ చైనాప్రజల రిపబ్లికు సోవియట్ యూనియన్ తోనూ, కమ్యూనిస్టు ప్రభుత్వములు గల ఇతర దేశములతోను ఏకత్వమును గలిగి అంతర్జాతీయ సంయుక్త కమ్యూనిస్టు బృందముగ నేర్పడవలెను. చైనా విప్లవముయొక్క నిజమైన పంథా ప్రజల రిపబ్లికుద్వారా సోషలిజమును, కమ్యూనిజమును స్థాపించుటయై యున్నది." 1949 వ సంవత్సరము సెప్టెంబరు నెలలో కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధులు, వారితో సానుభూతిగల ఇతర రాజకీయ పార్టీల ప్రతినిధులు సమావేశమై పికింగు నగరములో చైనా

మావోవ కమ్యూనిస్టు ప్రభుత్వ విధానము

ప్రజల రాజకీయ సలహా సంఘముగ నేర్పడిరి. ఈ రాజకీయ సలహా సంఘమువారు ప్రభుత్వ కార్యక్రమమును, రాజ్యాంగ విధానమును తయారుచేసిరి. ఆ సమావేశముననే చైనాప్రజల కేంద్రప్రభుత్వమునకు అధ్యక్షుడుగ మావోసిటంగును ఎన్నుకొనిరి. పికింగునగరమే చైనా రిపబ్లికు యొక్క రాజధానిగ నుండవలెను. ఐచ్ఛిక సైనికుల పురోగమన కీర్తనయే జాతీయ కీర్తనగ నుండవలెను. ఐదు నక్షత్రములు గల ఎర్రజండా చైనా జాతీయ జెండాగ నుండవలెను.

1949 సంవత్సరము ఒకటవ అక్టోబరు తేదీ మధ్యాహ్నము రెండుగంట లప్పుడు చైనా కేంద్ర ప్రజల ప్రభుత్వ మంత్రి వర్గము పికింగు నగరములో తమ ఉద్యోగములను స్వీకరించిరి.

**1949 అక్టోబరు 1వ తేదీన చైనా ప్రజల రిపబ్లికు స్థాపనమైనది**

ఆ కేంద్ర ప్రజల ప్రభుత్వమే చైనా యావత్తు యొక్క చట్టసమ్మతమైన ప్రభుత్వమనియు, సమానత్వము మీదను, పరస్పర గౌరవము మీదను, ఏ విదేశ ప్రభుత్వముతోను స్నేహసంబంధములు ఏర్పరచుకొనుటకు రాయబారులను మార్చుకొనుటకు సిద్ధముగ నున్నదనియు ప్రకటించిరి. ఆ దినము మధ్యాహ్నము మూడుగంట లప్పుడు పికింగు నగరములోని టీయన్ అన్ మెన్ చౌకులో మూడు లక్షలమంది ప్రజలు సమావేశముకాగా మావోసిటంగు చైనా ప్రజల రిపబ్లికుయొక్క కేంద్రప్రభుత్వము స్థాపితమయ్యెనని ప్రకటించి ఐదు నక్షత్రములుగల ఎర్ర జెండాను ఎగురవేసెను. ఇంతటితో చైనా ప్రజల రాజకీయ, సాంఘిక విప్లవము పూర్తియయ్యెను. యావత్తు చైనా ప్రజాస్వామికము ఈ ప్రభుత్వము



చౌ ఎన్-లై
కమ్యూనిస్టు చైనా ప్రధానమంత్రి

క్రిందకు వచ్చెను. చైనాలో మార్క్స్, లెనిన్ సిద్ధాంతములకు ఇది గొప్ప విజయము. 1917 వ సంవత్సరము అక్టోబరు నెలలో జరిగిన రష్యా విప్లవము తరువాత నీ చైనా విప్లవమే ప్రపంచములో అతి గొప్ప ప్రఖ్యాతమైన కమ్యూనిస్టు విప్లవమై యున్నది.

ఈ కాలములో భారత రాయబారి పాణికరు గారి అనుభవములు

ఇందునుగూర్చి భారత రాయబారి అయిన కె. యం. పాణికర్ గారు 'రెండు చైనాలు' అను తమ గ్రంథములో నిటుల వ్రాసిరి: "హ్యూచౌ, పెంగ్పూ పట్టణములు కమ్యూనిస్టుల వశమగుట తోడనే చ్యాంకు కేషకు స్థితి ఉత్తర చైనాలో దుర్భర మయ్యెను. నాంకింగులో తనను కలవవలసినదని సేనా నాయకులకును, రాష్ట్రి గవర్నరులకును చ్యాంగు కేషకు కబుర్లంపెను. కాని ఆ సమావేశమునకు వారిలో కొద్దిమంది మాత్రమే వచ్చిరి. కనుక ఇంతటితో ఆయన చైనాపైన యాజమాన్యమును మానుకొనవలెనని చైనా పత్రికలు వ్రాసెను........ఇట్టి పరిణామములు జరుగుచుండగా మదాము చ్యాంగు కేషకు అమెరికాకు వెళ్లి వచ్చినదని చైనా పత్రికలు ప్రకటించెను.........తన ముఖ్యులందరు గట్టిగ సలహా ఇచ్చిన మీదట చ్యాంగు కేషకు రాజీనామా నిచ్చుటకు అంగీకరించెను. అంతకన్న ముఖ్యకారణము తన భార్య అమెరికాకు పోయి వట్టిచేతులతో తిరిగి వచ్చుటయై యున్నది. పడిపోవుచున్న చ్యాంగు కేషకునకు అమెరికా వారు సహాయము చేయుటకు నిరాకరించిరి. ఆపత్సమయములో ఆయనను విడిచి పెట్టిరి. బలవంతము మీద చ్యాంగు కేషకు తన అధికారమునంతయు

ఉపాధ్యక్షుడు, ఆక్టింగు ప్రెశిడెంటు అయిన లీసంగుజన్‌కు ఒప్ప గించి చికియాంగు రాష్ట్రమునకు వెళ్ళిపోయెను. అక్కడ రాష్ట్రి పాలకుడుగ నున్న చియన్ ఐ సేనాని ద్రోహమును తలపెట్టిన వాడై చ్యాంగుకేషకును అరెస్టుచేసి కమ్యూనిస్టులకు వప్పగింత చేయుటకు సిద్ధపడెను. గాని చ్యాంగుకేషకు కీ సంగతి తెలిసి చియన్ ఐ సేనానిని అరెస్టు చేయించి తనతోకూడ ఫార్మోజాకు తీసుకొనిపోయి అక్కడ విచారణ జరిపి శిరచ్ఛేదము గావించెను. కాని చైనా యొక్క పరిస్థితు లన్నియు తెలిసికొనగా క్యూమింటాంగును రక్షించుటకు సమర్థుడైనవాడు చ్యాంగుకేషకు ఒక్కడేనని తేలినది. ఆయనకొక్కనికే తగిన అధికారము సైన్యము లలో ప్రతిష్ఠ, క్యూమింటాంగు క్రిందనున్న ప్రాంతములోని ప్రజ లలో గౌరవము ఉండెను. ఆయన ఒక్కడే దృఢమైన తీర్మానమును చేసుకొనువాడు. ఎట్టి ఆపత్సమయములోను లొంగనివాడు. కాని, మధ్యతరగతి ప్రజలు, మేధావులు, విద్యార్థికులు అంత ర్యుద్ధము అనగా సోదరులమధ్య, రక్తపాతము, రాజీనామాలవల్ల తుదముట్టించబడగలదని ఎంచిరి. చ్యాంగుకేషకు లేచిపోయినగాని రాజీనామా కుదరదని ప్రముఖులలోని బలమైన బృందము తలచెను. ఆయన ప్రభుత్వమునుండి తప్పించుకొనినచో చాల కాలము క్రిందనే చైనాలో ఐక్యత, శాంతి కలిగియుండెడివను నినాదములు చెలరేగెను. నవంబరు మధ్యభాగమునుండి ఆయన రాజీనామానిచ్చుటకు యోచించి అచటినుండి యుద్ధమును సాగించుటకు కావలసిన ధనమును, సామగ్రిని, ఇతర అవసరము లను ఫార్మోజా ద్వీపములో (తైవాన్) ఏర్పాటు చేసుకొను

చుండెను. జపానులో నిర్మాణము గావించుచున్న మెకార్థర్ సేనాని ఫార్మోజాను కమ్యూనిస్టులకు లోబడకుండ కాపాడి చ్యాంగు కేషకుకు వప్పగించెను. ఒకరోజున నిశ్శబ్దముగ ఎట్టి ఆర్భాటములేకుండ చాంగు కేషకు ఆకాశ విమానములో ఫార్మో జాకు వెళ్లుచు తాను ఎప్పుడు యుక్తమని తలచిన అప్పుడు మరల అధ్యక్ష హోదాను స్వీకరింతునని ప్రకటన గావించెను... ఆక్టింగు ప్రశిడెంటు అయిన లీ సంగు జన్ తన అధికారము ననుసరించి కొన్ని ప్రజానురంజకమైన కార్యములను వెంటనే సాగించెను. రహస్య పోలీసును రద్దుపరచెను. సంవత్సరములకొద్ది జైళ్ళలో మ్రగ్గుచున్న రాజకీయ ఖయిదీల నందరిని విడుదల చేసెను. విశ్వవిద్యాలయములను, మిగతా విద్యార్థులను అణచి వేయుచున్న క్యూమింటాంగు యువక సంఘమును రద్దుపరచెను. కాని, వీటివల్ల ప్రయోజనమేమీ కలుగలేదు. సేనాధిపతులెవ్వరు ఉపాధ్యక్షుడైన లీ సంగు జన్ ను లక్ష్యపెట్టలేదు. ఆయన ఉత్తరువులను వారు అమలుపరచలేదు. అందువల్ల నాంకింగు నగరము సర్వవిధముల అల్లకల్లోలముగనే యుండెను. ఇట్టి కష్టసమయములో ఉపాధ్యక్షుడు పార్లమెంటులోని సభ్యులమీద నాధారపడెను. ఆఖరున నాంకింగు ప్రక్కన పారుచున్న యాంగ్సీ నదికి అవలి ఒడ్డున నున్న పూచో పట్టణమునకు కమ్యూనిస్టు సేనలు చేరినప్పుడు రాజీపడుటకు సిద్ధముగనున్నానని ఉపాధ్యక్షుడగు లీ సంగుజన్ మావోసీటంగుకు ఒక తంతిని పంపెను. కమ్యూనిస్టు నాయకులు నాంకింగులో జరిగిన విషయములన్నియు పూర్తిగ తెలుసుకొనియేయుండిరి. క్యూమింటాంగు కూలిపోయినదని

వారికి తెలియును. రాజీనామా పడుటకు ఎనిమిది షరతులు పెట్టిరి.........చైనా ఉపాధ్యక్షుడు పలురకములైన సలహాల మధ్య కొంత మనోచాంచల్యమునుపొంది తుదకు మావోసిటంగు తెలిపిన ఎనిమిది షరతులతో రాజీనామా పడుటకు తన రాయబారవర్గమును పికింగు నగరమునకు పంపెను. 1949 మార్చి మూడవ వారములో రాయబార సంఘము పికింగు చేరెను. మావోసిటంగు, చౌ ఎన్ లై మొదలైన కమ్యూనిస్టు నాయకులు వారిని మిక్కిలి గౌరవముతో చూచిరి. వారికి విందులు కూడ చేసిరి...... ఈ లోపల నాంకింగు నగరములోని క్యూమింటాంగు ప్రభుత్వముయొక్క ఆఫీసులన్నియు కాంటను నకు మార్చబడెను. కాని ఆక్టింగు అధ్యక్షుడు, శాసనసభ నాంకింగు లోనే యుండిరి. విదేశ రాయబారుల నందరిని కాంటనులో నుండమని అడిగిరి. మేమందరము నాంకింగులోనే ఉండుటకు నిశ్చయించితిమి. సోవియట్ రాయబారి మాత్రము క్యూమింటాంగు కచేరీలతో కూడ కాంటనుకు వెళ్ళుటకు ఒప్పుకొనెను. అప్పటికి అతిత్వరలో కమ్యూనిస్టులు సంపూర్ణ జయము పొందుదురని నమ్మకము రష్యావారికిలేదు......క్యూమింటాంగు రాయబారులు పికింగు నగరమునకు వెళ్లిన పిమ్మట ఒక మూడు వారములైనను విరామము ఉండుననియు, యీ లోపల ఢిల్లీ వెళ్లి సంప్రదింపులు జరిపి రావచ్చుననియు నేను తలచితిని. నేను ఇండియాకు పోయి నాంకింగును కమ్యూనిస్టులు స్వాధీనపరచుకొన్నట్లయిన నేను ఏమిచేయవలెననుదానిని ఇండియా ప్రభుత్వమునుండి తెలుసుకొని ఏప్రిలు 21 వ తేదీన నాంకింగుకు

వచ్చితిని. 23 వ తేదీన కమ్యూనిస్టులు యాంగ్సీ నదిని దాటి నాంకింగులో ప్రవేశించిరి."

ఆయన మరియునిటుల వ్రాసెను :

"ఏప్రిల్ 22 వ తేదీన ప్రభుత్వ రాజధానిఅయిన నాంకింగు నగరమంతయు అల్లకల్లోలముగ నుండెను. ప్రభుత్వోద్యోగు లెల్లరు నాంకింగును వదలిపెట్టి పారిపోయిరి. రౌడీజనము ఆ పట్టణములోని భవనములన్నియు దోచుకొనెను. ముఖ్యముగ, క్యూమింటాంగు నాయకులయొక్క ఇళ్ళనన్నిటిని దోచుకొనిరి. ఆ నగరముయొక్క మేయరుగారి కాపురస్థలము చుట్టుపట్ల ప్రజలు దోచుకొనుచుండుట నేను కళ్లారా చూచితిని. సైనిక కార్య స్థానములు, యువజన సంఘములు ఎక్కువ నష్టమును పొందెను. కాని మధ్యాహ్నమునకు శాంతిస్థాపన సంఘము ఆ బస్తీమీద యాజమాన్యమును వహించి ప్రజలను శాంతముగ నుండమని, దోపిళ్లు మానమని ప్రకటనలు చేసినందున అంతయు శాంతించెను. మరుసటి ఉదయమున కమ్యూనిస్టు సేనలయొక్క సప్లయిశాఖ ముందుగ నాంకింగు నగరములో ప్రవేశించెను. కమ్యూనిస్టు సేన లన్నియు ఎట్టి ఆటంకములు లేకుండ పడవలలో యాంగ్సీనదిని దాటెను. కమ్యూనిస్టు సేనలు నాంకింగులోనికి చొరబడుటను చూచుటకై వీథులలోకి వెళ్లితిని. వీథులన్నియు జనసమర్దముగ నుండెను. ప్రజలెవ్వరును ఉత్సాహమునుగాని, వ్యతిరేకతనుగాని చూపక తటస్థముగ నుండిరి. ప్రజల విముక్తి సైన్యము ప్రసిద్ధి కెక్కిన చంగ్‌షాన్ వీథిలోగుండ యూరేగింపుతో సాగిపోవుటకు కొన్నిగంటలుపట్టెను. మేము మాకారులలో ఆ సైనిక యూరే

గింపును చూచుటకు వెళ్లితిమి. నేను, బర్మా రాయబారి, సోవియట్ రాయబారి ఆ ఉత్సవమును చూచుటకు వెళ్లితిమి. మిగిలిన రాయబారులు తమతమ భవనములలో దాగికొనిరి. సాయంకాలమగుసరికి ఆ సేనంతయు నదిని దాటివచ్చి క్యూమింటాంగు రాజధాని అయిన నాంకింగు నగరమును ఆక్రమించెను. కమ్యూనిస్టు ప్రముఖుడైన లియుపోచంగ్ సేనాని ఆ నగరమునకు మేయరుగ కమ్యూనిస్టు సైన్యములచేత ప్రకటించబడెను. విదేశ రాయబారులమైన మేము చాల ఆత్రతతోను, అనిశ్చితత్వముతోను నుంటిమి. కమ్యూనిస్టులే మమ్ములను ఆహ్వానింతురని మేము వేచియుంటిమి. ............ ఇంతటిలో బజారులనిండ సరుకులు కనబడెను. యూాయన్ పికాయ్ యొక్క వెండి నాణెములే తాత్కాలికముగ నాణెములుగ కమ్యూనిస్టులు ప్రకటించిరి............విదేశ రాయబారులు ఉపయోగించు మోటారులు ఎక్కువగ నుండకూడదని కమ్యూనిస్టులు మితపరచిరి. అమెరికా రాయబారివద్ద 110 మోటారులు ఉండెను. వాటిని ఐదుకు తగ్గించిరి. బ్రిటన్, ఫ్రాన్స్, రష్యా, ఇటలీ మొదలైన దేశముల వారి మోటారులుకూడ మూడుకు తగ్గించబడెను. ఇండియా, ఇరాన్ మొదలైన దేశముల రాయబారుల మోటారులు రెండుగ నుండుట కంగీకరించిరి............మా జీవితముతో కమ్యూనిస్టులు జోక్యము పుచ్చుకొనలేదు. రెండువారములైన పిమ్మట ధరలు తగ్గెను. నాణెములు స్థిరపడెను. జీవితము కొంత సుఖమయ్యెను. కాని, చైనా నౌకరులు మాత్రము అవిధేయతను కనబరచుచుండిరి............1949 వ సంవత్సరము జులై

నెల ఒకటవ తేదీన నాంకింగు నగరములో మావోసిటంగ్ నవచైనా, కమ్యూనిస్టు విధానములనే పూర్తిగ నవలంబించు ననియు ఆ దేశము సోవియట్ రుష్యాతో సర్వవిధముల చేరుటకు నిశ్చయించినదనియు తన సుప్రసిద్ధ ఉపన్యాసము నిచ్చెను. ఇది తక్కిన రాయబారులకంటె అమెరికా రాయబారి అయిన డాక్టరు స్టూవర్టుకు అత్యంతమైన ఆశాభంగమును కలిగించెను. కొద్దిరోజులలో ఆయన తనస్వంత విమానమును బాగుచేయించు కొని చైనాను వదలి అమెరికాకు వెళ్ళెను............పికింగు నగరములో ఏమి జరుగుచున్నది మేము తెలుసుకొనుచుంటిమి. కమ్యూనిస్టుపార్టీనే గాక తమతో సానుభూతి కలిగిన మిగత పార్టీల నాయకులనందరిని సమావేశపరచిరి. ఒక సంయుక్త ప్రభుత్వము అనుపేర కమ్యూనిస్టులచే నడపబడుచుండిన రాజ్యము మును స్థాపించిరి.........1949 వ సంవత్సరము అక్టోబరునెల మొదటితేదీన పికింగు నగరములో చైనా ప్రజల ప్రజాస్వామ్యము (**Peoples Republic of China**) అనుపేర చైనాదేశము యావత్తుపైనను ఒక ప్రభుత్వము మావోసిటంగుచేత ప్రకటించ బడినది. ఆ ప్రభుత్వమునకు మావోసిటంగ్ అధ్యక్షుడు. ఉపాధ్యక్షుల పేర్లలో మదామ్ సన్యటుసెన్, చాంగులన్, లీ చీష్యన్ సేనాని పేర్లు గలవు. చౌ ఎన్‌లై ప్రధానమంత్రిగను, విదేశాంగ మంత్రిగను చేయబడెను. ఆయనచేసిన మొదటి పని నాంకింగులో నున్న విదేశ రాయబారుల నందరిని పికింగు నగరమునకు రమ్మని ఆహ్వానించుటయై యున్నది. పికింగు నగరమే నూతనచైనా ప్రజల రిపబ్లికుకు రాజధానిగ చేయబడినది. నాకు అట్టి ఆహ్వానము

వచ్చినప్పుడు దానిని ఢిల్లీకి పంపి భారత ప్రభుత్వముయొక్క అంగీకారమును తెప్పించుకుందునని చెప్పితిని. రెండురోజులకు పిమ్మట ఇండియా ప్రధానమంత్రి పండిట్ జవహర్లాల్ నెహ్రూ గారి వద్దనుంచి మిక్కిలి స్నేహభావముగ నూతనచైనా ప్రభుత్వ ప్రధానమంత్రికి జవాబు వ్రాయబడెను. త్వరలోనే నూతన చైనా కమ్యూనిస్టు ప్రభుత్వమును ఇండియా ప్రభుత్వము అంగీకరించుననియు, రెండు ప్రభుత్వములును రాయబారులను మార్చుకొందురనియు ఆ ఉత్తరములో వ్రాసెను. కాని, క్యూమింటాంగు ప్రభుత్వము ఇంకను చైనాయొక్క దక్షిణ భాగములలో అధికారమును వహించి యుండెను. అందువలన చైనాలోని అంతర్యుద్ధము రెండు, మూడు నెలలు జరుగునని నేను తలచితిని. ఈ లోపుగా ఇండియాకు వచ్చుటకు నాకు అనుమతి నివ్వవలెనని ఇండియా ప్రధానమంత్రిని కోరితిని. తక్కిన రాయబారులు కూడ చైనాను వదలి వెళ్లిరి. నేనుకూడ చైనాను వదలి ఇండియాకు వచ్చితిని. షాంఘాయి నగరమువద్ద సాయర్ ఉద్యోగస్థులు నన్ను, బర్మా రాయబారిని గౌరవముగనే పోనిచ్చిరిగాని యూరపుదేశములకు చెందిన రాయబారుల సామానులను విప్పి అమర్యాద పరచిరి. తమను కమ్యూనిస్టులు ఎక్కువ గౌరవముగ చూతురని వారు తలచిరి. కాని అట్లు జరగలేదు............ అప్పటికి క్యూమింటాంగు ప్రభుత్వము చైనాను వదలిపెట్టి ఫార్మోజాకు లేచిపోయెనని తెలిసినది. చైనాయొక్క దక్షిణ భాగమంతయు ప్రజల విముక్తి సైన్యములకు లోబడుట కొద్ది రోజులలో జరుగునని అందరికిని నిశ్చయము కలిగెను. ముఖ్యముగ

చైనాలో కోటీశ్వరులగు వర్తకులు తమకు అపాయము వాటిల్లునని తలచి హాంకాంగులో తలదాచుకొనిరి. హాంకాంగు బ్రిటిషు వారికి చెందిన చైనాను ఆనుకొనియున్న ద్వీపము. ఇట్లు తలదాచుకొనిన వారిలో సన్యట్ సేన్ కుమారుడగు సన్‌ఫో, పెన్సీసైనిక నాయకుడగు హెన్‌హ్సిష్యాన్ మొదలైన క్యూమింటాంగు ఉద్యోగస్థులెల్లరు గలరు. వీరిలో హెన్‌హ్సిష్యాన్ చైనానుండి తాను పారిపోవలసి వచ్చునని కొంతకాలము నుండి నిశ్చయము కలిగినవాడై హాంకాంగులో మిగుల శోభాయమానమైన భవనమును నిర్మించుకొనెను. హాంకాంగులోని బ్రిటిష్ ఉద్యోగస్థులు తమను కమ్యూనిస్టులు ముట్టడింతురేమోనను భయమును కలిగి యుండిరి. హాంకాంగులో మూడు వేలమంది భారతీయ కుటుంబములు గలవు. వారు మంచి వర్తకులై, సిరిసంపదలను కలిగి యుండిరి. నేను అక్కడనుంచి బయలుదేరి బర్మాలో దిగితిని. అచట కారెన్ సంఘమువారి తిరుగుబాటు సాగుచుండెను. కాని బర్మా ప్రభుత్వము దినదినమునకు బలపడుచుండెను. అక్కడనుంచి నవంబరు ప్రారంభమునకు ఇండియాకు చేరితిని. ప్రధానమంత్రి నెహ్రూగారు నన్ను మరల చైనాకు పొమ్మని బలవంతపెట్టెను."

"భారత ప్రభుత్వము నూతన కమ్యూనిస్టు చైనా ప్రభుత్వమును అంగీకరించి, రాయబారులను మార్చుకొనువరకు నేను ఇండియాలో నుండవలసివచ్చినది. నూతన చైనా ప్రభుత్వము నంగీకరించు విషయములో అప్పుడు గవర్నరుజనరలుగానున్న సి. రాజగోపాలాచారి

నూతన చైనా ప్రభుత్వమును భారతప్రభుత్వ మంగీకరించినది

గారును, సర్దారు వల్లభాయ్ పటేల్ గారును ఈ విషయములో త్వరపడవద్దని సలహానిచ్చిరి. చాలమంది సివిల్ సర్వీసు ఉద్యోగస్థులు కూడ అటులనే అభిప్రాయపడిరి. నా అభిప్రాయమడుగగా క్యూమింటాంగు ప్రభుత్వము చైనాదేశముమీద పాలనము సాగించుట మానుకున్నప్పుడు నూతన ప్రభుత్వము నంగీకరించుటయే మంచిదని నేను సలహా చెప్పితిని. అమెరికావారు క్యూమింటాంగు ప్రభుత్వమునకు తగిన సహాయము చేయలేదు. పూర్తి సహాయము చేసియున్నట్లయిన చ్యాంగుకేషకు ఇంక కొంతకాలము దక్షిణ చైనామీద రాజ్యమును సాగించెడివాడు. కమ్యూనిస్టులతో పోరాటమును సలిపెడివాడు. మదాము చ్యాంగుకేషకు అమెరికాకు వెళ్లి సహాయమడిగెను. అమెరికా వారివ్వలేదు. అపుడు అమెరికావారి మనోభావములు సందిగ్ధముగ నుండెను. చైనాలోని అమెరికా రాజనీతి సక్రమముగ లేదని అమెరికా సెనేటరులలో కొందరు విమర్శనలు సాగించిరి. అందుమీద అమెరికా ప్రభుత్వమువారు సుప్రసిద్ధమైన తమ శ్వేత పత్రమును ప్రకటించిరి. అందులో క్యూమింటాంగు రాజనీతి, క్యూమింటాంగు కార్యక్రమము, చర్యలు సక్రమముగలేవని; క్యూమింటాంగు ప్రభుత్వము అమెరికావారి సహాయమునకు అర్హముగ లేదని స్పష్టపరచబడెను. ............ అప్పటికి నూతనచైనా ప్రభుత్వమును అంగీకరించవలెనా, లేదా యను విషయములో అమెరికావారు బ్రిటిషు ప్రభుత్వముతో ఉత్తరప్రత్యుత్తరములు జరుపుచుండిరి. కాని, అప్పుడు ఏమియు నిర్ణయమునకు రాలేదు. ఇతర ప్రభుత్వములు నూతనచైనా ప్రభుత్వమును అంగీకరించి

నట్లయిన అమెరికాకు ఎట్టి అభ్యంతరము లేనట్లు తలచబడు చుండెను. (అమెరికా ప్రభుత్వ కార్యదర్శి) ఫాస్టర్ డల్లెస్ వ్రాసిన 'యుద్ధమా సంధియా' అను గ్రంథములో కమ్యూనిస్టు చైనాను అంగీకరించుటయే అవసరమని వ్రాసెను. చ్యాంగుకేషకు మొదలైన క్యూమింటాంగు ప్రభుత్వ నాయకులు చైనాను వదలి ఫార్మోజా ద్వీపములో ప్రవేశించినందున పండిత జవహర్లాల్ నెహ్రూగారు నూతన కమ్యూనిస్టుచైనా ప్రభుత్వమును అంగీకరించితినని తెలియపరచెను. ఆ సంవత్సరము ఆఖరు భాగమున ఇండియా ప్రభుత్వముయొక్క అంగీకారము చైనాకు పంపబడెను. బర్మా ప్రభుత్వముకూడ నూతన చైనా ప్రభుత్వమును అంగీకరించెను. 1950 వ సంవత్సరము జనేవరి మొదటి వారములో బ్రిటన్, పాకిస్తాన్, ఇండోనీషియా, ఇంకను ఆసియా ఖండములోని వివిధ ప్రభుత్వములు నవ్యచైనా ప్రభుత్వము నంగీకరించినవి. కొద్దికాలములో నేను చైనాలో రాయబారిగ నుండుటకు, నూతన చైనా ప్రభుత్వము భారత ప్రభుత్వమునకు తమ అంగీకారము తెలిపెను. 1950 వ సంవత్సరము ఏప్రిలు నెలాఖరున నేను ఇండియానువదలి పికింగునగరమునకు చేరితిని. ఒక నూతన ప్రపంచములో దిగుచున్నానని నాకు తెలియును. అంతవరకు పాశ్చాత్యదేశములలోను, క్యూమింటాంగు చైనాలోను నాకు కలిగిన అనుభవములన్నియు నిష్ప్రయోజనమని నేను భావించితిని. నేను కమ్యూనిజమునుగూర్చి పుస్తకములలో చదివితినేగాని నాకు స్వంత అనుభవము ఏమియు లేదు. కమ్యూనిస్టు నాయకులతో నాకు ఎట్టిపరిచయము

అదివరకు లేదు. మార్క్సుయొక్క సిద్ధాంతములు నాకు కొంత వరకు తెలియును. కాని వ్యక్తి స్వాతంత్ర్యమును పూర్తిగ అణచి వేయుచున్న రాజకీయ సంస్థ అయిన కమ్యూనిస్టు సంస్థయందు నా కెట్టి సానుభూతి లేకుండెను. చైనా ప్రజలతో మాత్రము నాకు సంపూర్ణమైన సానుభూతియే యుండెను. వారు గత నూరు సంవత్సరములనుండి అంతర్యుద్ధములలో, కష్టములలో అరాజకములో, పేదరికములో దైన్యములో మునిగియుండిరి. చైనా దేశము సర్వవిధముల క్షీణించెను. అట్టి స్థితిలో నూతన శక్తివంతమైన ఒక ప్రభుత్వము - కమ్యూనిస్టు ప్రభుత్వమే గాని మరొకటి గాని - యావత్తు చైనా పైన ఏర్పడి, చైనా నంతను స్వాధీనముపొంది, చైనాదేశము నైక్యపరచి ఒక సర్వ స్వతంత్రముగల ప్రభుత్వమును స్థాపించగలుగుట నాకు సంతోష మును కలిగించెను. అదివరకు వంద సంత్సరములనుంచి చైనాను అణచివేయుచున్న విదేశములనుండి ఈ ప్రభుత్వము చైనాను కాపాడగలిగెను. ఈ నూతన ప్రభుత్వము ఆశియాయొక్క మనో వికాసమును పునరుద్ధరణమును ప్రతిధ్వనించెను. చైనా ఇండియాదేశములు రెండును, ఆశియా ఖండము మేల్కొనవలె నని, వృద్ధి చెందవలెనని, పునరుద్ధరించబడవలెనని కోరుచున్నవే, కాని, రెండు దేశములయొక్క రాజకీయ, ఆర్థిక, సాంఘిక కార్యక్రమములు వేరుగ నుండెను. మా వాసిటంగు తటస్థముగ నుండక కేవలము కమ్యూనిస్టు పద్ధతి నవలంబించి సోవియట్ రష్యాతో ఐక్యతను స్థాపించుకొనెను. ఇట్టి స్థితిగతులలో తటస్థముగ నున్న భారతదేశమునుంచి వెళ్లి కమ్యూనిస్టు చైనాలో రాయ

బారిగ నుండుట కష్టతరమైన కార్యమే. కాని ఆ పదవిని స్వీకరించి ధైర్యముతో భారతదేశమునకు నేను చేయవలసిన విధ్యుక్త ధర్మమును నిర్వర్తించుటకు నిశ్చయించితిని, 1950 వ సంవత్సరము మే నెల 14 వ తేదీ ఉదయము ఆరున్నర గంటలకు హాంకాంగు నగరమునుండి రైలులో పికింగు నగరమును చేరితిని. నా రైలు పెట్టిలోకి చైనా విదేశశాఖకు చెందిన వాంగ్ పింగ్ నాన్, పికింగు మునిసిపల్ ఉపాధ్యక్షుడైన ఊహాన్ మరికొందరు ఉద్యోగస్థులు వచ్చి చైనా భాషలో నాకు ఆహ్వానమును తెలిపిరి. అది ఇంగ్లీషులోకి తర్జుమా చేయబడెను. నా జవాబు ఇంగ్లీషులో చెప్పితిని. నేను పికింగు నగరములోని రాయబారుల భాగములోనికి తీసుకొనిపోబడితిని. అక్కడనున్న గొప్ప హోటలులో ప్రవేశపెట్టబడితిని. ఆ హోటలులోనే ఇతర దేశ రాయబారవర్గములకు సంబంధించినవారందరు అప్పుడు నివసించిరి. కొద్ది రోజులలో నాకు ఒక మంచి భవనము దొరికెను. అందులోకి కాపురమునకు వెళ్లితిని."

"నేను వెళ్ళిన మూడు రోజులకు చైనా ప్రభుత్వము యొక్క విదేశ శాఖ కార్యాలయములో ప్రధానమంత్రి అయిన చౌ ఎన్ లై నన్ను సత్కరించెను. ఆయన దృఢకాయుడు, అందమైనవాడు, యౌవనాకారము గలవాడు. తలవెంట్రుకలు నల్లగనున్నవి. ముఖము సంతోషముగనున్నది. నన్ను మిగుల ఆదరముతో చూచెను. ఒక గంటన్నరసేపు మేమిద్దరము మాట్లాడితిమి. ఇండియాలోని పారిశ్రామికాభివృద్ధి, వ్యవసాయ

చౌ ఎన్ లై ను మావొసిటంగును ఇతర మంత్రులను భారత రాయబారి దర్శించెను

భూములు, రైతుల స్థితి మొదలైన విషయములను ఆయన తెలిసికొనగోరెను. ఇండియాకు చైనాకు గల తారతమ్యమును గ్రహించవలెనని ఆయన కున్నట్లు నాకు కనబడెను. ఇనుము యొక్క, విద్యుచ్ఛక్తి యొక్క ఉత్పత్తిని గురించి బాగుగ తెలుసుకొనగోరెను. ఈ రెండు వృద్ధిగానిది ఆశియా ఖండము లోని దేశములు ప్రముఖ స్థానమును పొందజాలవని ఆయన నాతో చెప్పెను. ఆయనే కార్యశూరుడుగ నాకు కనబడెను. కాని, దృఢమైన కమ్యూనిస్టు. ఆ సిద్ధాంతములను గట్టిగ నమ్మిన వాడు......మరునాడు అనగా 20 వ తేదీన నన్ను రమ్మని అధ్యక్షుడైన మావోసిటంగు కబురంపెను. ఆయన నాతో మాట్లాడినమీదట నన్ను రాయబారిగ అంగీకరించెను. ఆయన చైనా వాఙ్మయమును బాగుగ చదివినవాడని నేను వింటిని. ఆయన గొప్ప ఆలోచనపరుడుగ నాకు కనబడెను. ఆయన వ్రాసిన గ్రంథములను పిమ్మట చదవగా ఆయన మంచి గ్రంథ కర్తయని తోచినది. సైనిక బలముమీద ఆధారపడి జయమును పొందిన ఆశియాలోని మిగుల పెద్ద దేశమగు చైనాయొక్క చరిత్రను పూర్తిగ మార్చినవా డాయన. కొద్దిసేపు మేము ఉభయులము సంభాషించితిమి. ముఖ్యముగ చైనాకును ఇండియాకును స్నేహ బంధములను దృఢపరచుకొను విషయమును గూర్చియే మాట్లాడితిమి. ఈ రెండు దేశములయొక్క పాత చరిత్రను గూర్చి, ఈ రెండు దేశములును స్వాతంత్ర్యమును పొందుటకు జరిపిన పోరాటములను గూర్చి ఆయన మిగుల ప్రశంసించెను. మరియొక గదిలోకి నన్ను తీసుకొని పోయి



లియు షా-చి
చైనా పీపుల్స్ రిపబ్లిక్ ఛైర్మను

ఇండియా చైనాలను గూర్చి అర్ధగంటసేపు మాట్లాడెను. అప్పుడు చౌ-ఎన్-లై కూడ నుండెను. చైనా భాషలోనుంచి ఇంగ్లీషు లోకి తర్జుమా చేయగల మరియొకరు కూడ నుండిరి. ఒక పురుషుడు యోగ్యమైన జీవితమును గడపినట్లయిన అతడు ఇండియా దేశములో పునర్జన్మము నెత్తునని నమ్మకము పాత చైనా దేశములో కలదని మావోసిటంగు నాకు చెప్పెను. యూరపియనుల యొక్క ఆర్థిక బలము ఆశియా ఖండములో నున్నంత కాలము ఆశియాకు లభించిన స్వాతంత్ర్యము నామ మాత్రావశిష్టమగునని ఆయన చెప్పెను. మనకున్న నైసర్గికావ కాశములను ఉపయోగించుకొని బలపడుట ఆశియాఖండ దేశ ముల విధ్యుక్త ధర్మమనియు ఇండియా దేశము అటుల చేసుకొను టకు దృఢమైన నిశ్చయము గైకొన్నదనియు నేను జవాబు నిచ్చితిని. ఇంకను కొన్ని ఆశియా ఖండదేశములను గూర్చి మాట్లాడితిమి. అంతటితో నేను సెలవు పుచ్చుకొని వచ్చితిని. ఆశియాఖండ చరిత్రయందు ఆయనకు ఎక్కువ శ్రద్ధ యుండెనని నాకు తోచెను. ఆయన దాదాపు 60 సంవత్సరముల వయస్సు గలవాడు. పెక్కు కష్టములకు లోనైనప్పటికీ మంచి ఆరోగ్య వంతుడుగనే కనబడెను......... పిమ్మట కొద్ది రోజుల వరకు చైనాలోని గొప్ప పురుషులను దర్శించితిని. చూతె, లియు షౌచీ, లిచీష్యన్ మొదలైన ఉపాధ్యాయులను, మంత్రులను దర్శించితిని. ప్రజల విముక్తి సైన్యమును నిర్మించి దానిని సమర్థ వంతమైన దానినిగ చేసి క్యూమింటాంగు సేనలను నాశనము చేయుటలో మావోసిటంగుకు కుడిభుజముగ పనిచేసినవాడు

చూచే. ఆయన మావోసిటంగుతో పాటు రైతు కుటుంబము నందు జన్మించినవాడే. మావోసిటంగుకు పిమ్మట చైనా కమ్యూనిస్టు పార్టీకి నాయకత్వము వహించదగినవాడు లియుషాచీ అని చెప్పబడెను. భూసంస్కరణల యందు, భూమియొక్క పంపకము నందు ఆయన మిగుల పట్టుదలను కనబరచెను. మంత్రివర్గములో డెమోక్రటికు పార్టీ తరపున చాంగులాన్ గారిని ప్రతినిధిగ నియమించిరి. ఆయనకు 75 సంవత్సరముల వయసు గలదు. ఆయన గొప్ప మేధావి. రాజకీయములలో ప్రవేశించకముందు విశ్వవిద్యాలయములో ఆచార్యుడుగ నుండెను. న్యాయశాఖ మంత్రిణిగనున్న మదామ్‌షీల్యాంగును, ఆరోగ్యశాఖకు మంత్రిణిగ నుండిన మదామ్‌లీ‌చేచుఆన్‌ను దర్శించితిని. వీరందరిని దర్శించిన మీదట కమ్యూనిస్టు పద్ధతుల క్రింద కమ్యూనిస్టు కార్యక్రమముల ప్రకారము చైనాదేశమును నిర్మాణము చేయవలెనని దృఢనిశ్చయులైనట్టియు సమర్థులైనట్టియు మంత్రివర్గము నూతనచైనా ప్రభుత్వములో నేర్పరుపబడెనని నాకు తోచెను." అని యం. కె. పాణికర్ గారు తమ "రెండు చైనాలు" అను గ్రంథములో వ్రాసియున్నారు.

★

# చైనా విప్లవము

## చతుర్దశాధ్యాయము

### భూముల పంపిణీ - వ్యవసాయ ఉత్పత్తిదారుల సంఘములు

### 1

చైనా ప్రజల రిపబ్లికను అను పేరున కమ్యూనిస్టు రాజ్యము యావత్తు చైనా ప్రజాస్వామికము మీదను స్థాపింపబడినది. విదేశ దండయాత్రల భయము, అంతర్యుద్ధముల భయము, సాంతముగ పోయినది. దేశములో ఐక్యత శాంతి నెలకొలుపబడినది. కమ్యూనిస్టు ప్రభుత్వము సుస్థిరముగను, బలవత్తరమైనదిగను నున్నది. తక్కిన అన్ని నాగరికత దేశములతోబాటు తమ దేశమును కూడ తాము నమ్మిన పద్ధతులమీద సర్వవిధముల అభివృద్ధి గావించుటకు ప్రయత్నించుచున్నది.

సుస్థిర ప్రభుత్వము

చ్యాంగు కేషకు వర్గము చైనా ప్రజా స్వామికమును వదలిపోయి ఎనుబది లక్షల జనసంఖ్యగల, చైనా తూర్పు తీరమునకు తొంబది మైళ్ళ దూరమున నున్న, ఫార్మోజా (తైవాను) ద్వీపములో ప్రవేశించి అచట తమ రాజ్యమును స్థాపించుకొని యున్నారు. వారి క్రింద నేడు అమెరికనుల వలన తర్ఫీయతు పొందిన 6 లక్షల 50 వేల సైన్యములు గలవు. వారికి అచట వ్యతిరేకత లేదు.

ఫార్మోజాలో చ్యాంగు కేషకు రాజ్యము

కమ్యూనిస్టులు కొద్దిమంది యున్నను వారిని తేలికగ అణచ కలిగినారు. ఫార్మోజా ద్వీపములో చ్యాంగుకేషకు యాజమాన్యము క్రింద క్యూమింటాంగు ప్రభుత్వము సుస్థిరముగ నేర్పడియున్నది. అచట సన్‌యటుసేను సిద్ధాంతముల ప్రకారము రాజ్యము నడచుచున్నది. అక్కడ భూ సంస్కరణలు ప్రవేశపెట్టబడి సక్రమ పద్ధతులమీద క్యూమింటాంగు ప్రభుత్వము నడచుచున్నదనియు, ఆ ద్వీప పునర్నిర్మాణమునకు, సత్వరాభివృద్ధికి అవసరమైన ధన సహాయమును అమెరికా చేయుచున్నదనియు, అపుడు క్యూమింటాంగు ప్రభుత్వము మంచిదా కమ్యూనిస్టు ప్రభుత్వము మంచిదా యను పోటీ పర్పడుచున్నదనియు, అట్టి పరిస్థితులలో ఫార్మోజా జాతీయ ప్రభుత్వమును చైనా కమ్యూనిస్టు ప్రభుత్వమును కూడ ఐక్యరాజ్య సమితివారంగీకరించి రెంటిని శాంతముగ సహజీవనము కలిగి యుండునట్లు చేయుట మంచిదనియు పాప్‌లైన్ బార్జెరు, డ్జాంగుచు, బర్క్సు గార్లు తమ "తూర్పు దేశముల ప్రభుత్వ విధానములు, రాజకీయములు" అను గ్రంథములో వ్రాసి యున్నారు. గాని ఫార్మోజా ప్రభుత్వము కేవలము అమెరికాయొక్క సైనిక ఆర్థిక సహాయము మీద ఆధారపడి తనకాళ్లమీద తాను నిలచుటకెట్టి శక్తి లేకున్నదని, గావున దాని నంగీకరించుటయు, రెండు చైనాల సిద్ధాంతమును ఒప్పుకొనుటయు సమంజసము కాదని, ఇండియా ప్రభుత్వముయొక్క యుద్దేశ్యము. అమెరికావారు వారి బృందము కమ్యూనిస్టు చైనాను అంగీకరించక ఇంకను ఐక్యరాజ్య సమితిలో ఫార్మోజాలో నున్న క్యూమిన్‌టాంగు

జాతీయ చైనానే అంగీకరించుచున్నారు. ఇదివదలిపెట్టి కమ్యూని స్టు చైనాను మాత్రమే అంగీకరించవలెనని ఇండియా నేటికిని ఐక్యరాజ్య సమితిలో గట్టిగ వాదించుచున్నది. ఆ వాదన ఇంత వరకు నెగ్గలేదు. తైవాన్ క్యూమిన్‌టాంగు ప్రభుత్వమును చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము మ్రింగకుండ అమెరికా నౌకాదళము అచట సముద్రములో మకాముచేసి దానిని కాపాడుచున్నది.

ఇవతల వైపున 30 లక్షల చదరపుమైళ్ల వైశాల్యము, 59 కోట్ల 30 లక్షల జనసంఖ్య గల చైనా ప్రజాస్వామిక భూభాగ మంతయు మావోసిటంగు, చౌ ఎన్‌లై, చూతే, లియూ షౌచిల నాయకత్వము క్రింద 1949 అక్టోబరు నెలనుండి చైనా ప్రజల రిపబ్లికు యొక్క పాలనములో నున్నది.) ఈ పది సంవత్సరములు కమ్యూనిస్టు నాయకుల పరిపాలనము ఏ పద్ధతులమీద జరుగు చున్నదో, ఎవ్విధమైన అభివృద్ధి ఎంతవరకు సాధించినారో వాటిని గూర్చి తెలుపుచు విభిన్న దృక్పథముల ననుసరించి పెక్కు గ్రంథ ములు వ్రాయబడినవి. వాటిలో భారతదేశమునుండి అప్పుడప్పుడు సుహృద్భావ సంఘములుగను, ఇండియా ప్రభుత్వ ప్రతినిధులు గను, వ్యక్తులుగను వెళ్లి చైనా ప్రజల రిపబ్లికులోని పరిస్థితులను విచారించి వ్రాసిన వ్రాతలు మనకెక్కువ యుపయోగకరము లనుటలో నతిశయోక్తిలేదు. గాని ఈ సందర్భములో నొక సంగతి చెప్పకతప్పదు. చైనాను దర్శించుట యనగ ప్రజారాజ్య దేశములలోవలె, భారతీయులేమి యితర విదేశస్థులేమి వారిచ్చ వచ్చిన చోటికిపోయి వారిచ్ఛవచ్చిన వాటిని చూచుటకు వీలు లేదు. చైనా ప్రభుత్వోద్యోగులు ఏవి ఎంతవరకు చూపించెదరో

అంతవరకే చూచి రావలసియున్నది. తక్కిన చోట్లకు పోవుటకు వీలేలేదు. చైనాలో విదేశస్థులకు చూపించుటకు కొన్ని కొన్ని గ్రామములను, సంస్థలను ఏరి యుంచినారు. ఎప్పటి కప్పుడు జరిగే అభివృద్ధిని గూర్చి ప్రభుత్వ పక్షమున ప్రచురించబడెడు అంకెల జాబితాలు ప్రజలకు బోధచేయుట కొరకును విదేశస్థులకు చూపుటకొరకును ప్రతిచోటను అట్టలమీద కనపడును. ప్రతి కార్యకర్తకూడ వాటినే వకరువు పెట్టును. వాటిని విమర్శించు వారు దేశములో నుండజాలరు. విదేశ పత్రికలు ధారాళముగా చైనాలోకి రాకూడదు. కమ్యూనిజముకు అనుకూలమైన వాటినే రానిచ్చెదరు. అట్టి వాటినే అక్కడ ప్రచురించనిచ్చెదరు. ప్రప్రథమమున భూసంస్కర్తలను, సక్రమాభివృద్ధివాదులే గాని తీవ్రవాదులు కారని, చైనా కమ్యూనిస్టు నాయకులు చాల మంది చేత తలచబడినారు. కాని కొలది కాలములో సోషలిస్టు సమాజమునే గాక కమ్యూనిస్టు సమాజమును కూడ నిర్మింప వలెనని మావోసిటంగు మొదలైన నాయకులు తీవ్రకృషిని సలుపుట బాగుగ విదితమైనది.

నవచైనాలో స్థాపింపబడుచున్న రాజ్య విధానమును గూర్చి చైనా కమ్యూనిస్టు పార్టీయొక్క 28 వ సంవత్సరోత్సవమునాడు యీ క్రింది విధముగ మావోసిటంగు చెప్పినాడు.

ప్రజల రాజ్యమనగ నేమి?

"ప్రజల రాజ్యముయొక్క నియంతృత్వమును, అధికారమును మేము అమలు పెట్టుచున్నాము. అందువలన ప్రజల అభివృద్ధికి అడ్డమువచ్చే వర్గములకు వాక్స్వాతంత్ర్యము నివ్వము, వారికి మాట్లాడుటకు హక్కు

లేదు. ప్రజలకు మాత్రమే అట్టి హక్కుకలదు. చైనాలో ప్రజలనగా ఇప్పటి పరిస్థితులలో కార్మికవర్గము, కర్షక వర్గము, కొద్ది ఆస్తిగల మధ్యమతరగతిప్రజలు, జాతీయ పెట్టుబడిదారులునై యున్నారు. ఈవర్గములవారందరు కార్మికవర్గము యొక్కయు, కమ్యూనిస్టు పార్టీయొక్కయు నాయకత్వము క్రింద ఏకమై తమ స్వంత రాజ్యమును, తమ స్వంత ప్రభుత్వమును స్థాపించుకున్నారు. సామ్రాజ్య వాదులగు శునకములమీదను, భూఖామందు వర్గము మీదను, ధనికవర్గము మీదను, క్యూమింటాంగు అభివృద్ధి నిరోధక పక్షముల మీదను ప్రజాప్రభుత్వము నిరంకుశ అధికారమును చెలాయించును. నిర్బంధములను కూడ విధించును. వారి ఇష్టము వచ్చినట్లు మాట్లాడనివ్వము. వారిచ్చవచ్చిన విధముగ వర్తింప నివ్వము. సంపూర్ణమైన నిర్బంధముక్రింద వారిని ఉంచెదము." అని ఆయన చెప్పెను. ఈ క్రొత్త సిద్ధాంతములు పాత చైనా భాషలోనివి కావు. కాని మార్క్సిస్టు సిద్ధాంతములు చైనా జాతివి కాకపోయినప్పటికీ సర్వ ప్రపంచమునకు వర్తించునవై యున్నవి. వాటికి ప్రవక్త లెనిన్. లెనిన్ రష్యావాడే. ఈనూతన ప్రపంచమునకు నాంది రష్యా విప్లవమై యున్నది. లెనిన్ యొక్క, మార్క్స యొక్క సందేశములు అంధకారములోనున్న చైనా వారికి వెలుతురు నిచ్చుచున్నవి. రష్యా వైపునకు ఎందుకు మొగ్గుచున్నారని మావోసిటంగును కొందరు విమర్శకులు ప్రశ్నించగా తాను రష్యానుంచే కమ్యూనిజమును నేర్చుకొని అవలంబించు చున్నాడు. గనుక రష్యా ఒక్కటియే చైనాకు నిజమైన స్నేహితుడుగ నుండగలదనియు, తాను కేవలము

రష్యా పక్షముననే యుందుననియు ఆయన స్పష్టపరిచినాడు. జాతీయ పెట్టుబడిదార్లను ప్రజల క్రింద ఆయన చేర్చినప్పుడు కొన్ని కారణములచేత చేర్చెను. ఈ పెట్టుబడిదార్లకు మిగిలిన వర్గములతో సమాన స్థానము కలుగజేయలేదు. నిజమైన అధికారము గల స్థానములను వారు ఆక్రమించుటకు వీలులేదు. విప్లవ పురోగమనములో వారు ముందుకు రాలేరు. కాని, ప్రస్తుత పరిస్థితులలో చైనాయొక్క పారిశ్రామికాభివృద్ధి మిగుల హీనముగ నున్నందున, ఆర్థికస్థితి కూడ మిగుల బలహీనముగ నున్నందున జాతీయ పెట్టుబడిదార్ల యొక్క అవసరము గలదు. వారికి కమ్యూనిజమునందు నమ్మకము లేకపోయినను, వారు కమ్యూనిస్టు ప్రభుత్వము యొక్క ఆజ్ఞల ప్రకారము నడుచుటకు ఒప్పుకొనినందున ప్రజలలో భాగముగ చేర్చబడినారు. "ఈ నూతన ప్రజాప్రభుత్వము సోషలిజముగను, అటు పిమ్మట కమ్యూనిజము గను మార్చబడవలసి యున్నది. అటుల మార్చబడి దూరముగ నున్న భావికాలములో వర్గరహిత సమాజ స్థాపన జరిగి స్వర్ణ యుగము స్థాపించ బడును. అపుడు కమ్యూనిస్టు పార్టీ గాని, ప్రభుత్వ యంత్రము గాని యుండదు. మానవ సమాజము మాత్రమే నిలుచును" అని కూడ ఆయన చెప్పెను. వర్గరహిత సమాజస్థాపన ఎప్పటికైనా కలుగునను నమ్మకము అధికసంఖ్యా కులకు లేదు. ఆ పేరు పెట్టుకొని కమ్యూనిస్టులు ప్రస్తుత కాల మున కార్మికవర్గ నియంతృత్వమునే—దానికి ప్రతినిధియైన తమ పార్టీయొక్క నియంతృత్వమునే—బలపరచుచున్నారు. చైనా దేశములోని ప్రజలలో కమ్యూనిజమునందు సుహృద్భావము

విశేషముగ కలుగుటకు కారణమేమియో విచారింతము. రాజరికము నుండి ప్రజాస్వామ్యమునకు, జాతీయ ప్రభుత్వ స్థాపనము నుండి కమ్యూనిస్టు ప్రభుత్వ స్థాపనకు చైనా దేశమును మార్చిన రాజకీయ విప్లవకాలములో చైనా దేశములోని విద్యావంతులలో, విద్యార్థులలో కొంతవరకు ఇతర ప్రజలలో యీ మార్పులకు అనుగుణ్యముగ యీ మార్పులను సమన్వయము చేయుచు; సమర్థించుచు పెక్కు గ్రంథములను వ్రాసి వ్యాపింప చేయుట వలన భావ విప్లవము గూడ కలిగినది. అందువల్లనే కమ్యూనిస్టులు చైనాలో కేవలము తమ సైనికబలము వల్లనే రాజ్యమును సాగించుటలేదు. విద్యావంతులలోని అధిక సంఖ్యాకులు కమ్యూనిస్టు ఉద్యమమునకు వెనుక బలముగ నున్నారు. మావోసిటుంగును, ఆయన పక్షమును వారు బాగుగ సమర్థించుచున్నారు. అందువలన రుష్యాలోను, ఇతర కమ్యూనిస్టు దేశములలోను కంటె చైనా, ప్రజలలో ముఖ్యముగ విద్యావంతులలో నిజమైన భక్తి విశ్వాసములు కమ్యూనిజము నందును మావోసిటంగుయొక్క నాయకత్వమునందును గలవు." అని ఫిడ్జు గెరాల్డు తన గ్రంథములో వ్రాసినాడు. గాని కమ్యూనిస్టు ప్రభుత్వము స్థాపనమైన వెంటనే ఆయన తన గ్రంథమును వ్రాసినాడు. పిమ్మట సత్వరముగ మార్పుల వెంట జరిగిన మార్పులవలన చైనాలోని విద్యావంతులలో నధిక సంఖ్యాకుల యొక్క హృదయపూర్వక సానుభూతి నవ చైనా ప్రభుత్వమున కెంతవరకు కలదో చెప్పుటకు వీలులేదు. చైనాదేశములో చిర

**విద్యావంతుల ఆశాభంగము**

కాలమునుండియు రైతాంగము యొక్కయు. విద్యావంతుల యొక్కయు పలుకుబడి అత్యధికముగ నున్నదనియు, ఆ రెండు వర్గములయొక్క సానుభూతి సహాయముల వలననే చైనా కమ్యూనిస్టులు 1949 వ సంవత్సరమున రాజ్యస్థాపన గావించినారనియు పైన తెలిపియున్నాము. గాని కమ్యూనిస్టు రాజ్యము స్థాపనమైన పిమ్మట క్రమముగ రైతులనందరిని కమ్యూనిస్టు ప్రభుత్వము కూలీలుగ మార్చినది. విద్యావంతులు తమ భావస్వాతంత్ర్యమును, ప్రకటనా స్వతంత్ర్యమును, వాక్స్వాతంత్రమును రచనా స్వాతంత్ర్యమును పూర్తిగ కోల్పోయినారు. కమ్యూనిస్టు ప్రభుత్వము కొత్త విద్యార్థులను, విద్యావంతులను కమ్యూనిస్టు భావములుగల వారినిగ తయారు చేయుచున్నారు. చైనా విద్యావంతులు చ్యాంగ్ కేషకు యొక్క క్రూరనిర్బంధ విధానముల వలన కమ్యూనిస్టులవైపు చేరిరి. వారిలో అధిక సంఖ్యాకులు క్యూమింటాంగుకును కమ్యూనిజముకును మధ్య మార్గమున పోదలచిరి గాని క్యూమింటాంగు యొక్క దుష్పరిపాలన, క్రూర నిర్బంధ విధానములు వారిని కమ్యూనిజము వైపునకు నెట్టినవి. కమ్యూనిజపు స్థాపనాచార్యుడైన కారలు మార్క్సుయొక్క పేదలయందు గల ప్రేమకూడ వారిని ఆకర్షించినది. అంతే కాని వారు కమ్యూనిజముయొక్క అతి కఠినభావ స్వాతంత్ర్య నిరోధమును అప్పుడు గ్రహించలేదు. వారికి గొప్ప ఆశాభంగము కలిగినది. ప్రజారాజ్య దేశములలో శరీరము నిర్బంధించబడినను మనస్సు సర్వస్వతంత్రముగ నుండును. కమ్యూనిస్టు చైనాలో అటులకాదు. మనస్సేఖైదు చేయబడినది.

"చైనా విద్యావంతులు క్యూమింటాంగు కాలములో కొన్ని వేళల మాత్రము బహిరంగముగ మాట్లాడుటకు భయపడిరి. గాని వారి భావములను, ఆదర్శములను, ప్రకటనా స్వాతంత్ర్యమును అరికట్టినవారు లేరు. నేనాకాలములో చైనాకు వెళ్లినపుడు వారు నిర్భయముగా చ్యాంగుకేషకు ప్రభుత్వమును విమర్శించుచు నాతో బహిరంగముగ మాట్లాడిరి. అటులగాక నిపుడు కమ్యూనిస్టుల రాజ్యములో నేర్పడిన భావప్రకటనా స్వతంత్ర నిరోధ విధానమునందు నాతో రహస్యముగ మాట్లాడుటకు కూడ చైనా విద్యావంతులు భయపడుచున్నారు. పసిపిల్లలవలె తలకాయ త్రిప్పడము తప్ప వారినోటినుంచి మాటలు రాలేదు. "అని చైనాను 1952 లో దర్శించివచ్చిన ఫ్రాంకు మారేస్ తన "మావో యొక్క చైనామీద నివేదిక" అను గ్రంథములో వ్రాసియున్నాడు. చైనాదేశములో ప్రభుత్వమే పౌరుల భావములను, అభిప్రాయములను పూర్తిగ వశపరచు కొనినది. చైనా విద్యావంతులయొక్క స్థితి చాల దుర్భరముగ నున్నదని, వారు కమ్యూనిస్టు సిద్ధాంతముల నవలంబించి కమ్యూనిజము పక్షమున మాట్లాడనిది వ్రాయనిది వారికి నవచైనాలో నెట్టి తావు లేదని స్పష్టపడినది. వారిలో కమ్యూనిజమునకు వ్యతిరేకులని నమ్మినవారిని ప్రజాకోర్టులలో మరణదండనలకు లేక కార్మిక శిబిరములలో కఠినశిక్షలకు పంపిరి. చాలమంది ఆత్మహత్యలు గావించుకున్నారుకూడ.

మిగిలిన కమ్యూనిస్టు దేశములలోవలెనే నవ్యచైనాలో కూడ ప్రభుత్వమును విమర్శించుహక్కు, కమ్యూనిజమునకు

వ్యతిరేకముగ మాట్లాడుహక్కు ఎవరికిని లేదు. ఫ్రాంకుమోరెసు వ్రాసినట్లు మాట్లాడేహక్కు కమ్యూనిస్టులకు మాత్రమే కలదనియు, వారికి జవాబు చెప్పకుండ వినుటకు మాత్రమే హక్కు మిగిలినవారికి కలదనియు సిద్ధాంతీకరించబడినది. ఓట్ల విషయములో, ఓట్లు విప్లవమును వెనుకకు తీసుకొనిపోవు వారికివ్వబడ నేరవనియు, మిగిలిన ప్రజలందరికి మాత్ర మివ్వబడుననియు మావోసిటంగు స్పష్టముగ వ్రాసినాడు. దేశములో ప్రజలు (People) రాజ్యమునకు హక్కుదారులనియు, మిగతావారు దేశీయులనియు (Nationals) వారికి రాజ్యములో భాగములేదనియు, దేశీయులమీద ప్రజలకు నియంతృత్వహక్కు కలదనియు ఆయన వ్రాసినాడు.

## 2

చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము ప్రారంభదశనుండియు క్యూమింటాంగు, భూస్వామందు, ధనికతత్వ, విప్లవ నిరోధక, వర్గములకు చెందినట్లు తమకు తోచిన చైనా పౌరులను తండోపతండములుగ బహిరంగ విచారణలని పేరు పెట్టి మరణ శిక్షలను విధించి అమలు జరిపి యున్నది. ఆ విచారణలలో నేరములు చేసినటుల నేరస్థులమీద సాక్ష్యము లివ్వబడును. నేరస్థులు క్రాసు పరీక్ష చేయుటకు అవకాశములేదు. ఉత్తర సాక్షులను తెచ్చుకొనుటకు వీలుపడదు. వీరిలో చాలమందిని దారుణ హింసలకు లోనుచేసి బలవంతపెట్టి తాము నేరస్థులమని యొప్పుకొనునట్లు చేసినారు.

ప్రజా కోట్లు లక్షల మందిని హత్యలు

నిందితులు ఒప్పుకొనుట (Confessions) కమ్యూనిస్టు దేశములలో నొక విచిత్రమైన ఘట్టము. ఇటీవలనే హిందూదేశపు సరిహద్దులలోకి చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము జరిపిన దురాక్రమణలో కొంతమంది భారతీయ పోలీసులను చైనా ప్రభుత్వ సైనికులు పట్టుకొనిపోయి పికింగులో వారిని క్రూర హింసలకు లోను గావించి నేరములను ఒప్పుకొనునట్లు వారిచేత వ్రాయించుకొనుట కూడ మనము తెలిసికొని యున్నాము. తండోపతండములుగ వందలమందియే కాదు వేలమంది కమ్యూనిస్టు వ్యతిరేకుల యొక్క భూఖామందుల యొక్క విచారణలు కమ్యూనిస్టు బోధలకు లోనైన అనేక వేలమంది ప్రజల ఎదుట జరుపుట, ఆ ప్రజలందరు ఆగ్రహావేశముతో, ద్వేషానలముతో ఆ నిందితులను "వీరు ద్రోహులు, వీరికి మరణశిక్ష విధించండి" అను నినాదములను బలుకుచుండగ వారిని దోషులని తీర్పుచెప్పి హత్యలు గావించుట చైనాలో జరిగినపని. ఆ విచారణ జరిపిన న్యాయాధిపతులు కమ్యూనిస్టు పార్టీ సభ్యులు. వీటికి ప్రజల కోర్టులని పేరు. ఈ విధముగ ఒక వర్గమును నాశనము గావించి ప్రజలకు వర్గపోరాటమును నేర్పినారు. నూతన చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము ప్రజలలో, యువజనులలో, విద్యార్థులలో, కన్ఫ్యూషియసు ఋషియందు, ఆయన సిద్ధాంతముల యందు వ్యతిరేక భావమును, అసహ్యమును వ్యాపింపచేసి యున్నారు. కన్ఫ్యూషియసు బూజుపట్టిన బూర్జువాయని అచటి బాల బాలికలకు నేర్పి యున్నారు. కన్ఫ్యూషియసు మహర్షి తల్లి దండ్రులను, కుటుంబమును, గురువులను కడు మర్యాదగ

చూడవలెనని ఆదేశించి యుండగ, ఆ ఆదేశము లేవియు పనికి రావనియు, అవన్నియు బూర్జువా భావములనియు, తమ జాతికి రక్షకుడైన, తండ్రియైన మావోసిటంగును మాత్రమే పూజించవలెననియు, ప్రభుత్వమునకు, సమాజమునకు, పార్టీకి ప్రతివ్యక్తి సంపూర్ణముగ లోబడి నడచుకొనుచు అత్యంతమైన వినమ్రతతో ప్రవర్తించవలెననియు, ననుభావములను వ్యాపింప చేసియున్నారు. మాతా పితరులకు, కుటుంబమునకు బదులు ప్రభుత్వము, సమాజము, పార్టీ వచ్చినవి. వక్తికి వ్యక్తిత్వ ముండ కూడదు. వాక్స్వాతంత్ర్యము, పత్రికా స్వాతంత్ర్యము సభా స్వాతంత్ర్యములేదు. స్వంతముగ ఆలోచించుటకు అవకాశములేదు. కమ్యూనిస్టుపార్టి నాయకులు చెప్పినదానినే రామచిలుకవలె ఏకరువు పెట్టవలెను. ప్రభుత్వము నేర్పిన నినాదములనే చేయు చుండవలెను. రాత్రింబవళ్లు దేశములో ప్రతిచోటను ప్రభుత్వము చేసిన ఘనకార్యములను తెలుపుచు రేడియోలు మ్రోగుచుండును విచారణ దినమునాడు దూరశ్రవణ యంత్రములతో నలుమూలల ప్రచారముగావించి ప్రజలందరిని రావింతురు. ఈ విచారణలు గొప్ప మైదానములలో జరుగును. అటుల పోగైన లక్షలకొలది ప్రజలు ద్వేషపూరిత నినాదములను చేయుచుండగ పైన చెప్ప బడిన వేలకొలది కమ్యూనిస్టు వ్యతిరేక నిందితులు హత్యగావింప బడినారు. ఇటుల హత్యలు గావింపబడినవారు పదిహేను లక్షలకు తక్కువగ నుండరని చైనాలోని భారత రాయబారి పాణిక్కరు తన గ్రంథములో వ్రాసి యున్నాడు. చైనాను దర్శించిన ఇండియన్ ఎక్స్‌ప్రెస్ పత్రికాధిపతి ఫ్రాంక్ మోరిసు తన "మావో

యొక్క చైనామీద వ్రాసిన రిపోర్టు"లో ఇటుల హత్య చేయబడిన వారిసంఖ్య ఇరువదిలక్షల వరకుండునని అంచనా వేసినాడు. పికింగులోని పబ్లికు సెక్యూరిటీ బ్యూరో ప్రకారమే పికింగు నగరములో 29,626 బహిరంగ విచారణసభలు, టీన్ట్సిను నగరములో 21,400 ల బహిరంగ విచారణ సభలు జరిగినవని తెలియుచున్నది. ఇతర చోట్లకూడ నీ విధముగనే జరిగినవి. తరువాత సంవత్సరములలో కూడ ఈ విచారణలు, ఈ హత్యలు జరుగుచునే వచ్చినవి. ఇందులో మానవత్వానికి మిగుల దారుణముగ కనుపించునదేమనగ నేరస్థులమీద చాలచోట్ల వారి సమీప బంధువులచేతనే సాక్ష్యము చెప్పించి హత్యలుగావించి యున్నారు. అటుల సాక్ష్యమిచ్చినవారు కమ్యూనిస్టుపార్టీ సభ్యులై యున్నారు. భర్తలమీద భార్యలు, తండ్రులమీద కుమార్తెలు సాక్ష్యములిచ్చి మరణశిక్షలను విధించవలెనని కోరిన కొన్ని కేసులను ఎగేలు గ్లాకుస్టీన్ తన "మావో యొక్క చైనా" యను గ్రంథములో నుదహరించి యున్నాడు. ఇటుల వేలకొలది ఉత్తరములను సమీప బంధువుల చేత తెప్పించుకున్నారు. తమ పార్టీకి వ్యతిరేకముగ సంచరించుచున్న సమీప బంధువులను పోలీసులకు వప్పగింత చేయకపోవుట కూడ నేరమగునని అధికార ప్రకటనములను గావించినారు. సత్యమును, అహింసను, ప్రేమతత్వమును, క్షమను బోధించిన కరుణామయుడైన బుద్ధుని మతమును చైనా కమ్యూనిస్టులు తుడిచివైచి, నిరంతర ద్వేషమును పురిగొల్పు వర్గపోరాటమును, క్రోధము, క్రూరహింస సాధనములుగ గల కమ్యూనిజమును నెలకొల్పినారు. క్యూమిన్టాంగులు బందిపోటుగాండ్రని, అమెరి

కనులు సామ్రాజ్యవాదులగు దోపిడిగాండ్రని, భూషామందులు రైతుల రక్తము త్రాగే ఘాతకులని పిలచుటను ప్రజలకందరికి ప్రతి బాలునికి బాలికకు నేర్పినారు. వారిని ఈ పేర్లతోనే పిలవ వలెను. ఒకానొక కమ్యూనిస్టుపార్టీకి చెందిన సైనికుడు కేవలము తన భార్య భూషామందు యొక్క కూతురైన కారణము మీదనే ఆమెను విడిచిపెట్టుటకు విడాకులిప్పించవలెనని దావా వేయుటను తాను చైనాలో నున్నప్పుడు స్వయముగ చూచితి నని సర్. సి. పి. రామస్వామి అయ్యరుగారు వ్రాసియున్నారు. చైనాలో కమ్యూనిస్టుపార్టీ యొక్క సభ్యుల మీద నెంత కఠిన మైన అస్వాభావికమైన శిక్షణమున్నదో ఇందువలన తెలియు చున్నది.

ప్రభుత్వముక్రింద ప్రజాకోర్టులు, పోలీసు సిబ్బంది, జైలు ఖానాలు ఉండుటయే కాక, రహస్యపు పోలీసుయొక్క నిగహా, కమ్యూనిస్టుపార్టీ సభ్యులయొక్క పర్యవేక్షణ, సర్వత్ర వ్యాపించి యున్నవి. 1952 వ సంవత్సరములో పోలీసు చట్టములన్నియు పునర్నిర్మాణము గావింప బడినవి. ప్రతి ఫ్యాక్టరీలోను, ప్రతి సంస్థలోను, స్కూలులోను, బస్తీలలోని వీథులలోను, ప్రతిగ్రామములోను దేశసురక్షిత కమిటీలు (సెక్యూరిటీ కమిటీలు) దేశమంతటను స్థాపింపబడినవి. దేశసురక్షిత మంత్రియైన లోజూచింగు కొద్ది కాలములో కోట్లకొలది సురక్షితకమిటీలను ఏర్పాటుచేసినామని ప్రకటించినాడు. రెండు సంవత్సరములకు పిమ్మట నవి క్రొత్త నిబంధనలచేత కొంచెముగ మార్చబడినవి. 1954 వ సంవత్సరములో

**దేశములో అత్యంత నిర్బంధ విధానము**

చైనాప్రజల కాంగ్రెసుయొక్క స్థాయీసంఘ సలహాప్రకారము ప్రభుత్వముచే మూడురక ములైన కమిటీలు ఏర్పరచబడ్డవి. (1) బస్తీప్రజల కమిటీలు. అవి ప్రజలక్షేమము కొరకును, ప్రజలు చెప్పుకొనే విషయములను తెలుసుకొనుటకును, ప్రభుత్వము యొక్క ఉత్తరువులను ప్రజలకు తెలుపుట కొరకును, ప్రజలలో కలిగే వివాదములను పరిష్కరించుట కొరకును, కమ్యూనిస్టు పార్టీయొక్క సురక్షితము కొరకును ఏర్పరుపబడినవని చెప్పబడి నది. మ్యునిసిపాలిటీయొక్క యాజమాన్యమున ఈ కమిటీలు (ఉపసంఘములు) పనిచేయుచున్నవి. కొంతమంది సభ్యులు జీతము లిచ్చినవారుగను మిగిలినవారు గౌరవ సభ్యులుగను నున్నారు. రెండవరకపు కమిటీలు బస్తీ వీథి ఆఫీసులై యున్నవి. షుమారు ఆరువందల ఇండ్లకు ఒక ఆఫీసు కలదు. ఆ ఆఫీసులు కేవలము రహస్యపోలీసు యొక్క పనిని చేయును. వీటి ఖర్చు కేంద్రప్రభుత్వము పెట్టుకొనును. మూడవ రకమైన కమిటీలు గ్రామములలో నున్నవి. వాటిలో సంఘసేవతో పాటు పోలీసు కార్యములుకూడ చేయబడును. ఈ రెండు రకములైన సంఘ ములయొక్క ఉద్దేశ్యము విప్లవ విరోధులను పట్టి ఇచ్చుట, విప్లవ మును కూలద్రోయు కార్యములను అణచివేయుట, బందిపోటు దొంగల ఇతర నేరస్థుల కార్యక్రమములను జరగకుండ చేయుట, చట్టప్రకారము విప్లవ వ్యతిరేకులను, ఇతర నేరస్థులను నిగహాలో పెట్టుట, నాటకములు, సినీమాలు, పూటకూళ్ళ గృహములు, రేడియో విక్రయశాలలు మొదలైన వాటిమీద యాజమాన్యము వహించుట, విప్లవ కార్యక్రమమును గూర్చియు ప్రభుత్వ శాసన

ములను అమలులో పెట్టుటను గూర్చియు శాంతిభద్రతలను గూర్చియు ప్రజలనీతిని గూర్చియు ప్రచారము చేయుట, అయ్యున్నవి. 1951 వ సంవత్సరములో ప్రతి ఇంటిలో ఒక జనాభా పుస్తకము ఉంచి తీరవలెనని, అందులో ఆ ఇంటిలో కాపురమున్న వారి పేర్లన్నియు ఎక్కించవలెనని, ఎవరైన వారిలోనుంచి మరియొక యూరికి పోయినపుడు వారెక్కడికి పోయినది తెలుపుచు వారిపేరు ఆ పుస్తకములోనుంచి కొట్టి వేయవలెనని, కొత్తవారెవరైన తమ ఇంటికి వచ్చినపుడు ఆ పుస్తకములో వారిపేరు చేర్చవలెనని, అటుల మూడు రోజులలో చేర్చక పోయినట్లయిన అది నేరమగునని, ప్రతి ఇంటిలో ఎప్పటి కప్పుడు సరియైన పేరులను ఆ పుస్తకములో చేర్చి దానిని సమీపమున నున్న పోలీసు భద్రతా కమిటీకి తీసుకొని పోయి చూపించవలెనని శాసించబడినది. పోలీసు భద్రతా కమిటీవారు ఈ మార్పులను తమ రికార్డులలో నమోదు చేసెదరు. ఈ విధ ముగ ప్రతి ఇంటికి వచ్చేవారు పోయేవారు ఎప్పుడు ఎక్కడికి పోయేది వచ్చేది పోలీసు భద్రతా కమిటీలకు తెలియుచుండ వలెను. అటులనే ఆస్పత్రులలో చేరే రోగుల పేర్లు, వెళ్ళిపోయే రోగుల పేర్లు నమోదుచేసి ఆ రికార్డులను పోలీసు భద్రతా కమిటీలకు దాఖలు చేయవలెను. పూటకూళ్ళ గృహములు నడిపేవారుకూడ తమవద్దకు వచ్చేవారియొక్క పోయేవారియొక్క పేర్లను, చిరునామాలను ఆ పోలీసు భద్రతా కమిటీలకు దాఖలు చేయవలెను. ఈ పూటకూళ్ల గృహములవారు ప్రతిరోజు పోలీసు భద్రతా కమిటీలకు తమ పుస్తకములను దాఖలు చేయవలెను.

మామూలు గృహస్థులు మూడు రోజుల కొకసారి దాఖలు చేయవలెను. తమ వద్దకు వచ్చిన విప్లవ వ్యతిరేకులను, నేరస్థులను ఈ రిపోర్టుల ద్వారా పట్టిఇచ్చినవారికి బహుమతులు ఇవ్వబడును. ప్రతి పౌరుడు తాను ఎచటి కాపురస్థుడో, తాను ఎక్కడ పని చేయుచున్నాడో రిజిష్టరుచేసుకోవలెను. స్కూలు విద్యార్థులు కూడ అటుల రిజిష్టరుచేసుకొని తమ వద్ద ఆ రిజిష్టరు నకలును ఎప్పుడూ కూడా ఉంచుకొనియే తిరుగవలెను. అటుల రిజిష్టరు చేసుకొనుట పోలీసు భద్రతా కమిటీ ఆఫీసులలోనే జరుగవలెను. "ఎప్పుడూ మీ రిజిష్టరు కార్డును మీతోనే ఉంచుకోవలెను, దానిని పోగొట్టకూడదు" అని విద్యార్థుల యొక్క ప్రవర్తనా నిబంధనలలో విద్యాధికారులు శాసించియున్నారు.

విప్లవమునకు వ్యతిరేకముగ కార్యక్రమ మనగ నేమో 1951వ సంవత్సరము ఫిబ్రవరిలో చేయబడిన నిబంధనలలో వివరించ బడ్డది. ప్రభుత్వము ధాన్యమును, పన్నులను, ప్రజలనుండి వసూలు చేసికొనుచుండగ, కూలిపనిని, సైనిక కొలువును ప్రజలచే చేయిం చుకొనుచుండగ అవి చేయవద్దని వాటికి వ్యతిరేకముగ నడవవలె నని ప్రజలతో చెప్పుట; ప్రభుత్వమునకును, ప్రజలకును మధ్య విరోధ భావమును కలుగచేయుట; ప్రభుత్వ శక్తియైన కమ్యూ నిస్టు పార్టీని వ్యతిరేకించుట; అటుల వ్యతిరేకించువారిని గూర్చి పోలీసులకు జాడ ఇవ్వకుండుట; ఇవన్నియు వాటిలో చేర్చ బడినవి. సామాన్యమైన నేరములకు మూడు సంవత్సరముల కంటె ఎక్కువ శిక్ష విధించబడును. ఎక్కువ తీవ్రమైన నేరములకు యావ జ్జీవఖైదు గాని, మరణశిక్ష గాని విధింపబడును. దీని క్రింద తమ

బంధువులెవరైన విప్లవమునకు వ్యతిరేకముగ నడచుచున్న ఎడల వారిని గురించి పోలీసులకు వెంటనే తెలుపవలసియుండును. వెంటనే వారిని పట్టిఇవ్వవలసియుండును. ఇంతేకాకుండ ఒక చోట నుండి మరియొకచోటికి పోవునపుడు అనుమతి పత్రము ప్రభుత్వ ఆఫీసుల నుండి పొందవలెను. అటుల అనుమతి పత్రము లేనిది ఒకచోటనుండి మరియొకచోటికి ప్రయాణముచేయకూడదు. తమకు విరోధముగ నున్న దేశములను గూర్చి అబద్ధపుప్రచారము తీవ్రముగ చేయుట కమ్యూనిస్టుచైనాలో బాగుగ జరుగుచుండు నని కొందరు గ్రంథకర్తలు వ్రాసినారు. అటుల చేసినను దానిని అడ్డుపెట్టువారు లేరు. ఈ విధముగ కమ్యూనిజమునకు వ్యతిరేక మైన ఎట్టి మాట, ఎట్టి భావము, ఎట్టి వార్త, ఎట్టి ప్రచారము దేశములో జరుగకుండ నిర్బంధములు గట్టిగ చేయబడినవి. ప్రథ మమున కమ్యూనిస్టుప్రభుత్వములో, కొద్దిమందిని డెమోక్రాటిక్ పార్టీవారిని తమకు లోబడిన ఇతరులను కూడ చేర్చుకొన్నారు. వారిని చేర్చుకొనునపుడే కమ్యూనిస్టు కార్యక్రమమును అంగీక రించెదమని దస్కతులు పెట్టించుకొనినారు. తరువాత ఇతర పార్టీలవారిని చేర్చుకోవడము మానివేసినారు. కమ్యూనిస్టులను మాత్రమే ప్రభుత్వములో అన్ని రంగములలోను చేర్చుకొన్నారు.

ప్రతి కమ్యూనిస్టు వ్యతిరేకులను ప్రజాకోర్టులకు పంపక వారిని ప్రబోధము వలననే కమ్యూనిజమువైపుకు త్రిప్పవలెనని అటుల పూర్తిగ తిరిగినారని దృఢపడువరకును వారి మీద నిగహా యుంచవలెనని ప్రభుత్వ ఆదేశమైయున్నది. చాలమందికి ఇటుల మెదడు మరమ్మతుచేయుటయే జరిగినది. భయమువలననైతే

నేమి, ప్రచారము వలన నేర్పడిన భావపరిణామము వలన నైతే నేమి దేశమంతటిలోను ఐక్యత, శాంతి భద్రతలు గట్టిగా స్థాపింప బడియున్నవనుటలో నతిశయోక్తిలేదు. రైతులయొక్క పైరులను, ఆస్తులను దోచుకొనిపోయే బందిపోటుగాండ్రు మటుమాయమైనారు. నూతన కమ్యూనిస్టుప్రభుత్వము తమదేశమును అన్ని విధముల ఆర్థికముగ, సాంఘికముగ, వైజ్ఞానికముగ త్వరితముగా అభివృద్ధిచెందించుటకు ప్రయత్నించుచున్నది. 1953 మొదలుకొని ప్రథమ పంచవర్ష ప్రణాళికను ప్రారంభించి 1957 వ సంవత్సరమునకు జయప్రదముగ ముగించినది. పిమ్మట 1958 మొదలు 1962 వరకు ద్వితీయ పంచవర్ష ప్రణాళిక సాగించుచున్నది. ప్రథమ పంచవర్ష ప్రణాళిక క్రింద 14 వందల కోట్ల రూప్యములు ఖర్చుపెట్టబడినవి.

ప్రథమ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలు

## 3

నూతన కమ్యూనిస్టు చైనా ప్రభుత్వము అన్నిటికంటె ప్రథమమున భూఖామందు వర్గమును నాశనము గావించి స్వయముగ భూములను వ్యవసాయముచేయు రైతాంగము యొక్క, సొంతభూములు లేక నితరులవద్ద కౌలుకు పుచ్చుకొను వ్యవసాయికులయొక్క వ్యవసాయ కూలీలయొక్క, సత్వర ఆర్థికాభివృద్ధికి కృషి సలుప ప్రారంభించినది. పారిశ్రామిక రంగములోకూడ బాగుగనే అభివృద్ధి జరిగినది. గాని వ్యవసాయ వ్యాపకము, వ్యవసాయ సరకుల

వ్యవసాయాభివృద్ధి

అధికోత్పత్తి, నీటిపారుదల, భూసార అభివృద్ధి, వరదలనుండి లక్షల కొలది ఎకరముల భూములను సంరక్షించుట మొదలైన విషయములలో జరిగిన గొప్పకృషి అందరిని ఆకర్షించినది. చైనా ప్రభుత్వముయొక్క లెక్కల ప్రకారము మొదటి పంచవర్ష ప్రణాళిక పూర్తి అగువరకు అనగ 1957 ఆఖరువరకు ఆ ప్రణాళిక ప్రారంభ కాలముకంటె వ్యవసాయసరకుల యుత్పత్తిలో నూటికి 23 వంతుల అభివృద్ధి కలిగినదనియు, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక పూర్తియగు 1962 ఆఖరున 1957 సంవత్సరపు ఉత్పత్తిమీద నూటికి ముప్పదిఅయిదు వంతుల అభివృద్ధి జరుగుననియు చెప్పబడుచున్నది. అందువల్ల ప్రారంభములో దేశములో అత్యధిక సంఖ్యాకులైన రైతాంగమునకు, వ్యవసాయ కూలీజనమునకు నూతన కమ్యూనిస్టు ప్రభుత్వమునందు అత్యంత విశ్వాసము కలిగినది. మావోసిటుంగు తమను రక్షించుటకు పుట్టిన అవతార మూర్తియని వారు భావించసాగిరి. నూతన కమ్యూనిస్టు ప్రభుత్వము చేసిన భూసంస్కరణములు మొదలగు అభివృద్ధి కృషి, ముందుగ పల్లెటూళ్ళలోని అడుగుభాగమునకు వ్యాపించి వాటి వలన ఆ ప్రజలకు తిండి, బట్ట కొంతవరకు సంతృప్తిగ కలిగినందున మావోసిటుంగు ప్రభుత్వము విశేషముగ ప్రజానురంజకముగ నైనదని చెప్పుటలో నతిశయోక్తిలేదు.

ఇండియాలో వలెనే చైనాలోకూడ నూటికి ఎనుబదిమంది భూమిమీదనే తమ జీవనోపాధి కొరకు ఆధార పడుచున్నారు. 1936 లో చ్యాంగు కేషకుతో జరిపిన సియాను ఒడంబడిక ప్రకారము కమ్యూనిస్టులు భూఖామందులనుంచి భూములను లాగు

కొని రైతులకు పంచిపెట్టు విధానమును మానుకొని భూ

భూఖామందుల నాశనము, రైతాంగములోని తరగతులు

భూఖామందులకు రైతులు చెల్లించుచుండిన మక్తా శిస్తును సగానికి సగము తగ్గించినారు. కాని పిమ్మట 1946 వ సంవత్సరము మేనెలలో ఈనానులో జరిగిన తీర్మానముల ననుసరించి కమ్యూనిస్టులు భూఖామందులను, భాగ్యవంతులగు రైతులను వెడలగొట్టి వారి భూములను భూములులేని వారికిని, కొద్ది భూములున్న వారికిని పంచిపెట్టువిధానమును పూర్తిగ నవలంబించినారు. ఎదురుతిరిగిన భూఖామందులను, భాగ్యవంతులగు రైతులను హత్యగావించినారని, ఇటుల హత్యగావింపబడినవారు ఐదులక్షల వరకు నుందురని చెప్పబడుచున్నది. లోబడి యొప్పుకొన్న భూఖామందులకు భాగ్యవంతులగు రైతులకు చిన్న రైతులతోపాటు జీవనోపాధి కొరకు కొంచెముగ భూమినిచ్చినారు. 1949 వ సంవత్సరము వరకు ఇటుల తమ భూములలోనుండి వెళ్లగొట్టబడిన భూఖామందుల, భాగ్యవంతులగు రైతుల కుటుంబముల సంఖ్య ఉత్తర చైనాలోను, మంచూరియాలోను 1 కోటి 50 లక్షలుండును. చైనాప్రజల రిపబ్లికు ఏర్పడినపిమ్మట 1950 వ సంవత్సరము జూన్ నెలలో మావోసిటుంగు చైనాకు నూతన భూ సంస్కరణముల చట్టమును మంజూరుచేయించెను. ఆగస్టు నెలలో చైనా ప్రభుత్వమువారు గ్రామములలోని రైతాంగముయొక్క వివిధ తరగతులను నిర్ణయించుచు నిబంధనలను గావించిరి. గ్రామములలోని వ్యవసాయముమీద ఆధారపడువారిని 1. భూఖామందులు, 2. భాగ్యవంతులగు రైతులు, 3. మధ్యమతరగతి రైతులు, 4.

పేదరైతులు, 5. వ్యవసాయకూలీలు అని ఐదు తరగతులుగ విభజించిరి. డాక్టరు సన్యటు సేనుకూడ భూస్వామందు పద్ధతిని రద్దు పరచి భూమిని దున్నువారికి భూమిలో శాశ్వతహక్కు కలుగ చేయవలెననియే చెప్పియుండెను. కాని వారికి ప్రభుత్వము నష్ట పరిహారమివ్వవలసి యుండెను. ఐనను చ్యాంగుకేషకు, సన్యటుసేను ఆదేశించిన భూ సంస్కరణములను అమలుజరుపలేదు. ఆయన పలుకుబడిగల భూస్వామందుల పెద్దరైతుల పక్షమున నుండెను. ఇపుడు కమ్యూనిస్టు ప్రభుత్వము చేసినదేమనగ భూస్వామందు లందరి యొక్క అన్నిభూములను ఎట్టి నష్ట పరిహార మివ్వకుండ స్వాధీనపరచుకొని భూములు లేనట్టి కాని అతి తక్కువగ భూమి యున్నట్టి కాని వారికి పంచిపెట్టుచు యున్నది. భూమియందు హక్కు కలిగి భూమిని స్వంతముగ దున్నక ఇతరులకు కౌలు కిచ్చుకొనువా రందరును భూస్వామందులని పిలువబడిరి. వీరిలో కొందరికి వేలయెకరముల భూమి యుండవచ్చును. కొందరికి ఐదు యెకరములే యుండవచ్చును. అందరు భూస్వామందులే. వీరు సాధారణముగ బస్తీలలో కాపురముండువారు. ప్రభుత్వోద్యోగ ముల వల్ల కాని, పారిశ్రామిక రంగములో కాని వడ్డి వ్యాపా రమువల్లకాని జీవనము చేయువారు. భూస్వామందుల దగ్గరనుంచి భూములను కౌలుకు పుచ్చుకొని తాము వ్యవసాయము చేయక వాటిని ఇతరులకు కౌలుకిచ్చువారు ఉప భూస్వామందులని పిలువ బడిరి. వారుకూడ భూస్వామందుల క్రిందనే వచ్చిరి. వీరందరి భూములు పూర్తిగ లాగుకొనబడినవి. నష్టపరిహార మిచ్చుటలేదు. వీరుకూడ స్వంత వ్యవసాయము చేసుకొనదలచిన ఎడల తక్కిన

రైతులతోపాటే కొంచెముగ భూమిని వారికిచ్చిరి. భూస్వామందుల తరగతివారు రైతాంగములో నూటికి అయిదువంతులు మాత్రమున్నను వారిక్రింద మొత్తము భూమిలో నూటికి అరవైవంతులవరకుండెనని చెప్పబడుచున్నది. బ్రతికియున్న భూస్వామందుల ప్రస్తుత స్థితిని గూర్చి సర్. సి. పి. రామస్వామి అయ్యరు గారు తాను చైనాలో చూచిన యొక విషయము నీవిధముగ వ్రాసియున్నారు :—"అదివరకు భూస్వామందుగా నున్న యొకరి గ్రామమునకు నన్ను తీసుకొనిపోయిరి. ఆయనకు భూసంస్కరణములకు పూర్వము ఒక వెయ్యి ఎకరముల భూమి, చాలగదులు గల పెద్ద భవనముండేది. ఇపుడాయనకు రెండు ఎకరాలభూమి మాత్రము ఇవ్వబడినది. మిగిలినదానినంతను ఎట్టి నష్ట పరిహారము ఇవ్వకుండగ కమ్యూనిస్టు ప్రభుత్వము లాగుకొని పేదలకందరికిని పంచియిచ్చినది. ఆయనయొక్క భవనములో నొకగదిలో మాత్రము ఆయన నుండనిచ్చినారు. మిగతా అన్ని గదులలో పేదరయితులను కాపురమునకు ప్రవేశపెట్టినారు. మా సుహృద్భావ సంఘమువార మాయనను దర్శించి ఆయనను మీరిపుడు సుఖముగ నున్నారా అని యడుగగా తాను భాగ్యవంతుడుగా నున్నప్పటికంటె భూములలో ఇంటిలో చాల భాగము పోయిన పిమ్మట తాను ఎక్కువ సౌఖ్యముగ నున్నానని ఆయనచెప్పెను. గాని అపుడు మాతోకూడ కమ్యూనిస్టు ప్రభుత్వ అధికారులున్నారని ఆయనకు తెలుసును."

ఈ విధముగ చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము విదేశస్తులకు చూపించుచుండెను. రెండవ తరగతికి చెందిన భాగ్యవంతు

లగు రైతులు భూమియందు హక్కుదారులై కొంతభాగమును తాము స్వంతముగ దున్నుకొనుచు మిగిలినదానిని ఇతరులకు కౌలుకిచ్చినవారు. వీరి భూములలో స్వంతముగ వ్యవసాయము చేసుకొనుచున్న దానిని లాగుకొనక వారు ఇతరులకు కౌలుకిచ్చిన దానిని మాత్రము లాగుకొని భూములులేని వారికి పంచిపెట్టినారు. వారిక్రింద భూమి యెక్కువగనున్నను దానిలో కొంతభాగము లాగుకొని యితరులకు పంచిపెట్టిరి. మూడు నాలుగు తరగతులకు చెందిన మధ్యమతరగతి రైతులయొక్కయు పేద రైతులయొక్కయు భూములను లాగుకొనలేదు. భూఖామందులయొక్క భూములనే గాక వారి వ్యవసాయ పశువులను, వ్యవసాయ పనిముట్లను, వ్యవసాయముకొరకు నిర్మింపబడిన గృహములను కూడ ప్రభుత్వము వశపరచుకొనెను.

దేవాలయపు ఆస్తులను తీసుకొనిరి

ఇంతేకాక పూర్వీకుల ఆరాధనా గృహములయొక్క, బౌద్ధదేవాలయములయొక్క, మఠములయొక్క, క్రైస్తవాలయములయొక్క, పాఠశాలలయొక్క, ఇతర ప్రజాసంస్థలయొక్క భూములన్నిటిని ప్రభుత్వము వశపరచుకొనెను. కాని వాటిలో పాఠశాలలకు, శరణాలయములకు, ఆస్పత్రులకు ఈ భూముల ఆదాయమును పంచిపెట్టి వాటిని పోషించిరి. భూఖామందులు పారిశ్రామిక వర్తక వ్యాపారములకై ఉపయోగించెడి భూములను, వారి ఇతర ఆస్తులను ప్రభుత్వము లాగుకొనలేదు. ప్రభుత్వము లాగుకొనిన భూములనన్నిటిని పేదరైతులకును వ్యవసాయ కూలీలకును పంచిపెట్టిరి. గ్రామములలోని చేతిపనులమీద

జీవించువారికి తమ వృత్తివలన జీవనోపాధి కలగనిచో వారికి కూడ కొంతభూమిని పంచియిచ్చిరి. మత గురువులు, ముల్లాలు కూడ స్వంతముగ వ్యవసాయము చేసికొనినట్లయిన వారికికూడ భూమినిచ్చిరి. కమ్యూనిస్టు సేనలలో చేరిన సైనికులకు కూడ భూములను పంచి ఇచ్చిరి. ఇటుల భూ సంస్కరణములను అమలు జరుపుటకు 'హసియాంగ్స్' అని పిలువబడు గ్రామరైతు సంఘములు ప్రధానముగ నుండెను. వారిలో కమ్యూనిస్టుపార్టీ సభ్యులు ప్రాబల్యమును వహించియుండిరి. భూములను లాగుకొనుటలోను పంచిపెట్టుటలోను కమ్యూనిస్టుపార్టీ ఐచ్ఛిక భటులు చురుకుగ పనిచేసిరి. భూ సంస్కరణలకు అడ్డు తగిలిన వారిని నేరస్థులుగ విచారించి శిక్షించుటకు ప్రజాకోర్టులకు పంపిరి.

## 4

భూములను పంచిపెట్టుటలో కుటుంబములోని ప్రతి వ్యక్తికి, స్త్రీలకు, పురుషులకు, పిల్లలకు కూడ భూమి సమానముగ పంచిపెట్టబడెను. ఇందువలన కోట్లకొలది రైతులకు కమ్యూనిస్టు ప్రభుత్వస్థాపన వలన తమలో ప్రతివారికి కూడ కొంచెము భూమి యైనను లభించెనను తృప్తి కలిగినది. పురుషులతోపాటు స్త్రీలకు మైనరు పిల్లలకుకూడ సమానహక్కు కలిగినది. "చైనా దేశములో సేద్య యోగ్యమగు భూమిలో దాదాపు సగ భాగము పునర్విభజన కార్యక్రమావళి ననుసరించి ఆయా

భూముల పంపిణి కార్యక్రమము

కుటుంబములలో నుండే వ్యక్తులసంఖ్యను బట్టి పంచిపెట్టబడినది. సగటు లెక్కలో ఆ యా ప్రాంతములను బట్టి, ఆయా రాష్ట్రములను బట్టి మార్పుండును. ముక్డను ప్రాంతములో తల ఒక్కంటికి అరఎకరము దాకా వచ్చినది. పికింగు ప్రాంతములలో ఎకరములో మూడవభాగము మాత్రమే వచ్చినది. ఈ ప్రాంతములలో సగటున కుటుంబమునకు ఒక ఎకరము ముప్పదిమూడు సెంట్లభూమి వచ్చినది. దక్షిణ ప్రాంతములలో మనిషికి ఎకరములో నాలుగవ వంతు కంటె ఎక్కువ రాలేదు. ఎంత చిన్నచెక్కయైనను, స్వంత భూమి అనెడు ఎంతోకొంత భూమి, స్వంతభూమి కోసము కరవు వాచియున్న బీదరైతుకు లభించి, ఆ రైతులో సాటిలేని నవ చైతన్యాన్ని సమకూరచేసెను. పునర్విభజనవల్ల దేశముమొత్తము మీద ఉత్పత్తి పెద్దగ పెరిగినను, పెరగకపోయినను భూస్వామందు కిచ్చుకొను శిస్తు, ఇతర బాధలు సామాన్యరైతుకు తప్పినవి. ఇప్పుడు ప్రభుత్వానికి చెల్లించవలసిన పన్నుకూడ వెనుకటిశిస్తుతో పోల్చి చూచుకొంటే స్వల్పమైనదే. పండిన పంటలో సుమారు ఐదవవంతు మాత్రమే ధాన్యరూపముగ ప్రభుత్వమునకు పన్నుగ చెల్లించవలెను. పన్ను డబ్బురూపముగ ఇవ్వనక్కరలేదు. పండించిన పంటలో వెనుకటి కంటె ఇంక నెక్కువ గింజలు తనకు మిగులుట వల్లను, స్వంతభూమి అనేది తనకు, తన కుటుంబ సభ్యులందరికిని ఏర్పడుటవల్లను చైనారైతు మునుపటికంటె ఇప్పుడు కొంచెము మంచి బట్టలు కట్టుకొని, కడుపునిండా తిండి తిని, సంతోష జీవనముతో కనిపించుచున్నాడు......'పునర్విభజనవల్ల సాంఘిక వాతావరణములో ఎన్నో మార్పులు వచ్చినవి. కమ్యూ

నిస్టులు తమ రాజకీయ లక్ష్యసాధన కోసము తరతరాల నుంచి స్తబ్ధులుగ నుండిన రైతులకు మాటలు నేర్పినారు. వెనుకటి పాలకుల మీద తిరుగుబాటు బోధించినారు. వారిలోని దౌర్జన్య శక్తులు ప్రకోపింపచేసినారు. రాజకీయ పదజాలాన్ని నేర్పినారు. కొందరు భూస్వాములు ఈ రైతులకు జడిసి పారిపోయినారు. ఎక్కడికక్కడ రైతు సంఘము లేర్పడ్డవి. రైతు సంఘముల బలమే పెకింగులోని కేంద్ర ప్రభుత్వమునకు పట్టుకొమ్మ. కర్షక స్వప్నాన్ని కమ్యూనిస్టులు నిజముచేసినారు. అందుచేత రైతులందరు కమ్యూనిస్టులు చెప్పినదే వేదవాక్యమని నమ్మసాగినారు." అని నవచైనాను 1952 లో దర్శించిన రాజా హాతీసింగు వ్రాసి యున్నాడు. ఈయన పండిత జవహరులాలు నెహ్రూగారి చెల్లెలి భర్త. "మొదటి మూడు సంవత్సరములలో చైనాలో ఆహారోత్పత్తి ఎంతగ పెరిగినదనే విషయములో కనుక్కొంటే పెకింగు నగర మేయరైన పెంగుచన్ చెప్పినదానికి, పీపుల్సు బ్యాంకు గవర్నరు నాన్‌హాన్‌చన్ చెప్పిన లెక్కలకు భేదముగ నున్నది. పికింగునగర మేయరు రాజకీయవాది. ఆయన ప్రచారధోరణిని చెప్పినదానికంటే బ్యాంకు గవర్నరు లెక్కలే నాకు నిజముగ కనపడ్డవి. ఆయనయొక్క లెక్కల ప్రకారము ప్రత్తి పొగాకు జనపనార యుత్పత్తి పెరిగినదేగాని ఆహారధాన్యముల ఉత్పత్తి అంతగ పెరగలేదు గాన చైనానుంచి ఎగుమతి చేయగల ఆహార ధాన్యములు మిగలడమనేది అసంభవమని తేలినది. అయినప్పటికి నవచైనా 1951 లో 5 లక్షల టన్నుల బియ్యం జొన్నలను 1952 వ సంవత్సరములో 1 లక్ష 50 వేల టన్నుల ఆహార

ధాన్యమును ఇండియాకు సరఫరా చేసినది. రాజకీయ మైత్రి కోసము జరిగిన ఎగుమతులివి. అంతేకాని చైనాలో ఇంత మిగులు లేదని తెలిసినది. అయితే నవచైనా ప్రభుత్వము తాను భూమిపన్నును ఆహార ధాన్యముల రూపకముగ వసూలుచేసి ఆ ధాన్యపు రాసులను ప్రభుత్వ గిడ్డంగులకు చేర్చుకుంటూ యుండిరి. కనుక ప్రభుత్వ గిడ్డంగులనుంచి ఇండియాకు రాజకీయ మైత్రికోసము పైచెప్పబడిన విధముగ ఆహార ధాన్యములను సరఫరా చేసినటుల తలచబడినది. ఏది ఎట్లాగునఉన్నా చైనా రైతు శాంతముగ ఆహార ధాన్యములను ఉత్పత్తిచేసుకొని ఎట్టి భయములు బాధలులేకుండ తన గరిసెలో కొంచెము ధాన్యము మిగుల్చుకుంటున్నాడు. దొడ్లో ఏదో కాయో ఫలమో కాయించుకొని తింటున్నాడు. వంటినిండ బట్ట వేసుకొంటు న్నాడు. తనది అనిపించు పొలము, ఇల్లు వాకిలి కనబడుతున్నవి. అతను సంతృప్తి పొందినాడు. ఏ దేముళ్ళను మొక్కేవాడో ఆ విగ్రహాల జోలికి పోడు. పాత గుళ్ళు గోపురాల స్థానములో కమ్యూనిస్టుపార్టీ నిలబెట్టబడింది. ఆపార్టీవారు పాత విగ్రహాలను ఆ దేవాలయములలోనుంచి బైటికినెట్టి వాటిని విద్యాలయములు గనో సమాజ వికాస కేంద్రములుగానో మార్చినారు. సామాన్య దేవాలయములను స్కూళ్ళుగ మార్చినా చారిత్రక ప్రసిద్ధిగల వాటిని యథాతథముగ ఉంచినదట ప్రభుత్వము. భూఖామందు పద్ధతి అంతరించడముతో పాత సంప్రదాయములు సడలిపోయి నవి. పిల్లలు, తల్లిదండ్రులమాట వినాలని, స్త్రీలు పురుషుల

మాట వినాలని ఉండే ఆచారము పోయినది. స్త్రీలు అక్షర జ్ఞానము సంపాదించారు." అని కూడ ఆయన వ్రాసినాడు.

## 5

చైనాలో భూముల పంపిణి కార్యక్రమము 1951 వ సంవత్సరము ఆఖరు భాగమునకు పూర్తి అయినది. ఇది చిన్న రైతులు, వ్యవసాయకూలీలు, భూస్వామందుల మీదను భాగ్యవంతులగు రైతులమీదను జరిపిన వర్గపోరాటము యొక్క జయము. కాని రైతులు అప్పటికి అధోగతిస్థితిలో నున్నారు. వారికి ప్రభుత్వ సహాయము చాల కావలసియున్నది.

ప్రభుత్వమువారు వ్యవసాయమును అభివృద్ధికరమైన పద్ధతులమీద చేయుటను నేర్పినారు. ఎరువులను, పచ్చిఆకును భూములలో వేయడమునకు సహాయము చేసినారు, మంచి విత్తనములను సరఫరా చేసినారు. రైతులకు వ్యవసాయము కొరకు ప్రభుత్వము అప్పులిచ్చుటకు సహకార సంఘములను విరివిగ స్థాపించినది. వడ్డీరేటు తగ్గించబడినది. దీర్ఘకాలపు ఋణములివ్వబడినవి. రైతులు తమ ధాన్యమును సహకార (కో-ఆపరేటివ్) అమ్మకపు సంఘములద్వారా అమ్ముకొనసాగిరి. ప్రభుత్వమువారు ధరను నిర్ణయించిరి.

ఇందువలన రైతులస్థితి కొంత బాగుపడినది. గాని రైతు కుటుంబములకు వచ్చిన భూమి పెద్దదికాదు. బహుచిన్నదై యున్నది. ప్రతి కుటుంబము వ్యవసాయమును విడివిడిగ చేసు

కొనుటవల్ల తగిన ఆదా పచ్చుటలేదు. దున్నుకొనుటకు పశువులు అతితక్కువగ నుండెను. గావున రైతు కుటుంబములు కలసి వ్యవసాయము చేసికొనుట లాభకరమని వారికి బోధించి ప్రభుత్వమువారు ముందుగ పరస్పర సహాయక సంఘములను విరివిగస్థాపించినారు. కమ్యూనిస్టుపార్టీ ఐచ్ఛిక సేవకులు రైతు కుటుంబములకు బోధించి ఈ పరస్పర సహాయక సంఘములలో చేరునట్లు గావించినారు. 1953 ఆఖరు భాగమునకు 1 లక్ష 50 వేల పరస్పర సహాయక సంఘము లేర్పడ్డవి. రైతు కుటుంబములు తోడి రైతు కుటుంబములకు వ్యవసాయములో సహాయము చేయుటను, వారినుండి సహాయము పొందుటను నేర్చుకున్నారు. ఇవి చాలవని ప్రభుత్వము తలచి రెండవ మెట్టుగా వ్యవసాయఉత్పత్తిదార్ల సహకార సంఘస్థాపనకు పూనుకొనినది.

పరస్పర సహాయక సంఘములు

చైనా ప్రభుత్వము 1953 వ సంవత్సరములో మొదటి పంచవర్ష ప్రణాళికను ప్రారంభించగనే దేశమంతట వ్యవసాయ ఉత్పత్తిదార్ల సహకార సంఘములను విరివిగ స్థాపించి సహకార పద్ధతిమీద పెద్దఎత్తున వ్యవసాయమును సాగించి ఆహారోత్పత్తిని ఎక్కువగ చేయవలెనని సంకల్పించినది. మరియు అనేక సంవత్సరములనుంచి వరదలవల్ల కోట్లకొలది ఎకరములను ముంచివేసి పాడుచేయుచున్న నదులకు వరదకట్టలు కట్టి రైతులయొక్క భూములను వరదలనుండి కాపాడుటకు ప్రభుత్వము నిశ్చయించినది. ఈ కార్యక్రమములో అత్యుత్సాహముతో రైతాంగమంతయు ప్రభుత్వ

వ్యవసాయ ఉత్పత్తిదార్ల సహకార సంఘములు

ముతో పూర్తిగ సహకరించి విశేషమైన లాభమును పొందినది. 1954 వ సంవత్సర ప్రారంభమున పరస్పర సహాయక సంఘము లను వదలి వ్యవసాయ ఉత్పత్తిదార్ల సహకార సంఘములలో చేర వలసినదని ప్రభుత్వపక్షమున రైతుల కందరికిని విన్నపము పంపగ ప్రతిచోటను అత్యుత్సాహముతో రైతులందరు వ్యవ సాయ ఉత్పత్తిదార్ల సహకార సంఘములలో చేరిరి. ఈ వ్యవ సాయ ఉత్పత్తిదార్ల సహకారసంఘములలో చేరిన రైతు కుటుంబముల యొక్క భూములలోని హక్కు ఆ కుటుంబము లకే చెందియుండెను. వ్యవసాయ పశువులు, పనిముట్లు ఏ కుటుంబమువి ఆ కుటుంబమునకే చెందియుండెను. ఈ సహ కార సంఘములకు ప్రభుత్వము సర్వవిధముల సహాయము చేసెను. వ్యవసాయ పనిముట్లను సరఫరా చేసెను. మంచి రకమైన విత్తనములను, ఉన్నంతవరకు యంత్ర పరికరములను, వ్యవసాయ పద్ధతులను అభివృద్ధి చేయుటకు నిపుణులను, వ్యవసాయమును సాగించుటకు స్వల్పవడ్డీకి ఋణములను సహాయము చేసినది. పెద్ద ఖండములుగ కలిపి వ్యవసాయము చేయుటవలన ఉత్పత్తి చాల అధికమైనది. రైతాంగములో అత్యధిక సంఖ్యాకులు ఈ పొలము లలో స్వయముగ పనిచేయుటవలన వారందరికి మజూరి యివ్వ బడినది. చైనాలో వ్యవసాయపశువులు చాలతక్కువగ నున్నందున మానవకష్టమే ఎక్కువ అవసరమగుచున్నది. పశువులు దొరికినంత వరకు వాటి శ్రమకు తగినంత వాటి యజమానులకు చెల్లింప బడును. ఖర్చులన్ని పోగా మిగిలిన ధాన్యములో కొంత రాబోవు సంవత్సరపు అవసరములకు గాను ఉంచుకొని ప్రభుత్వ

మునకు చెల్లించవలసిన శిస్తును ధాన్యరూపేణ చెల్లించి మిగతా ధాన్యమును పొలముల యొక్క పరిమాణములను బట్టి ఆ పొలముల యజమానులైన కుటుంబములకు పంచిపెట్టబడినది. వ్యవసాయ ఉత్పత్తిదారుల సహకారపద్ధతి చైనాలో పూర్తిగ జయప్రదమైనదనుటలో సందేహము లేదు. దీనితో చైనా యొక్క ఆహార సమస్య పూర్తిగ తీరినదని రైతు కుటుంబమునకు వచ్చు ఆదాలో తమ ఖర్చులకు పోగా మిగిలే దానిని పారిశ్రామికాభివృద్ధి కొరకు ప్రభుత్వము యొక్క బ్యాంకులలో వేయుట జరిగినదని, చైనాను దర్శించిన భారతీయులు వ్రాసి యున్నారు. 1956 వ సంవత్సరములో చైనాలో 19 కోట్ల 90 లక్షల టన్నుల ఆహార ధాన్యములు ఈ సహకార వ్యవసాయము ద్వారా ఉత్పత్తియైనవనియు, అట్టి సహకార వ్యవసాయము లేకపోబట్టే ఇండియాలో చాలతక్కువ ఆహార ధాన్యములు ఉత్పత్తియైనవనియు సుహృద్భావ సంఘసభ్యులుగ 1956 లో చైనాను దర్శించిన సుప్రసిద్ధ ఆంధ్ర న్యాయవాది దోర్బల శేషాద్రి శాస్త్రిగారు వ్రాసి యున్నారు. కావున వెంటనే సహకార వ్యవసాయమును (Co-operative farming) పెద్ద పెట్టున ఇండియాలోకూడ సాగించుటవలననే ఇండియా యొక్క ఆహారసమస్య పూర్తిగను, తృప్తికరముగను పరిష్కారమగునని ఆయన రచించిన "ఇండియా చైనాలలో వ్యవసాయిక ఆర్థికము" అను గ్రంథమునందు వ్రాసియున్నారు. ఆ గ్రంథమునకు డాక్టరు సర్ సి. పి. రామస్వామి అయ్యరుగారు మంచి పీఠికను వ్రాసియున్నారు.

"1951 వ సంవత్సరము డిశంబరునెలలో చైనా కమ్యూనిస్టు పార్టీయొక్క కేంద్ర స్థాయీ సంఘము వ్యవసాయ సరకుల అధికోత్పత్తిని వ్యవసాయ ఉత్పత్తిదారుల సహకార సంఘములద్వారా సాగించవలెనని తీర్మానము చేసినపుడు చైనా దేశములో మూడువేల వ్యవసాయ ఉత్పత్తిదారుల సహకార సంఘములు మాత్రముండెను. రెండు సంవత్సరములకు పిమ్మట అనగ 1953 వ సంవత్సరము డిశంబరునెలలో ఇట్టి సహకారసంఘములు 14 వేల వరకును పెరిగెను. 1954 వ సంవత్సరములో వీటిసంఖ్య ఒక లక్షవరకు వృద్ధియయ్యెను. 1955 వ సంవత్సరము జూన్ నెలాఖరుకు ఈ సహకార సంఘములు 6 లక్షల 50 వేల వరకుండెను. ప్రథమమున ఈ సహకారోద్యమము ఉత్తర రాష్ట్రములలో ప్రారంభమయ్యెను. 1955 వ సంవత్సరము జూలై నుంచి ఒక సంవత్సరములలో ఈ ఉద్యమము చైనాయొక్క ఇతరభాగములలోకూడ వ్యాపించి 1956 వ సంవత్సరము జూన్ నెలాఖరున చైనాదేశము యావత్తులో వ్యవసాయ కుటుంబములలో నూటికి తొంబదిరెండువంతులు ఉత్పత్తి సహకారసంఘములలో సభ్యులుగ జేరిరి. పదిలక్షల సహకారసంఘము లేర్పడెను. మూడు పంచవర్ష ప్రణాళికలు పూర్తియైనగాని, అనగ పదిహేను సంవత్సరములకు పిమ్మట కాని రైతు కుటుంబము లన్నింటిని సహకార సంఘములలోకి తెచ్చుటకు వీలుండదని చైనా కమ్యూనిస్టు నాయకులు తలచిరి. కాని వారు అనుకొనిన దానికంటె అతి త్వరితముగ ఈఉద్యమము ప్రజలయొక్క సానుభూతిని మద్దతునుపొంది

ప్లానింగు కమీషన్ రాయబారవర్గ నివేదిక

అత్యంతముగ దృఢపడినది. ఇది చైనాలోను, బైటనున్న వారికిని విశేషమైన ఆశ్చర్యమును కలుగచేసినది. ప్రతి కుటుంబము ప్రత్యేకముగ వ్యవసాయము చేసుకొను పద్ధతి కలిగిన భారత దేశమునుండి వెళ్ళిన మాకు ఇదియొక అద్భుతకార్యముగ కనబడినది. ఇటుల జరుగుటకు చైనాలోని పరిస్థితులేవియో తెలిసికొందము. చైనాప్రజల రిపబ్లికు పర్పడగనే పెద్ద భూసంస్కరణములను సాగించిరి. దానిలో భూస్వామందులను సంపూర్ణముగ తొలగించిరి. వారి భూములన్నియు భూములు లేనివారికి, కొద్దిభూములు గలవారికి పంచిపెట్టిరి. ప్రతి కుటుంబములోని ప్రతి పురుషునికి, ప్రతి స్త్రీకి, ప్రతి మైనరయిన పిల్లవానికి పిల్లకు కూడ సమానముగ భూమిని పంచిపెట్టిరి. దేశములోని మొత్తము 27 కోట్ల 50 లక్షల ఎకరముల వ్యవసాయ భూములలో 11 కోట్ల 80 లక్షల ఎకరముల భూమిని 30 కోట్ల రైతులకు పంచిపెట్టిరి. భూస్వామందుల భూములనే కాక వారి ఇండ్లను, పశువులను, వ్యవసాయ పనిముట్లను, వారి దగ్గర దొరికిన ఆహార పదార్థములను ప్రభుత్వము లాగుకొని వాటిని కూడ పంచిపెట్టిరి. భూస్వామందుల వద్దనుంచి బలవంతముగ లాగుకొనిన ఇండ్ల గదులు 4 కోట్ల 80 లక్షల వరకుండెను. వారి వద్దనుంచి తీసుకొనిన వ్యవసాయ పశువులు 3 కోట్లు, వ్యవసాయ పనిముట్లు 3 కోట్ల 90 లక్షలు, ఆహార ధాన్యములు 50 లక్షల టన్నులు. వాటినన్నిటిని ప్రభుత్వము భూస్వామందుల వద్దనుంచి నష్ట పరిహారములేమీ లేకుండ లాగుకొన్నారు. ఈ ...ముగ భూస్వామందు పద్ధతి మూడు సంవత్సరముల కాలములో

పొంతముగ తీసివేయబడెను. ఈ భూసంస్కరణములు అమలు జరుపుటలో గ్రామములలోని రైతు సంఘముల తోడ్పాటును తీసుకొనిరి. ఇటుల ఒక వర్గమును తుడిచివైచి మిగిలిన వర్గమునకు సంపూర్ణాధికారము, హక్కులు ఇవ్వబడినవి. ప్రభుత్వము, కమ్యూనిస్టుపార్టి కూడ ఈ రైతువర్గముతో సన్నిహిత సంబంధమేర్పరచుకొనెను. చైనా దేశమందంతట కర్షక వర్గ అహంభావము, వ్యక్తిత్వము, భూమియందు వర్గమునందు ద్వేషము పూర్తిగ స్థాపించబడెను. భాగ్యవంతులైన రైతులను తీసివేయనప్పటికి వారికి రైతు సంఘములలో చేరుటకు హక్కులేకుండ చేయబడెను. ఈ భూసంస్కరణములకు పిమ్మట ప్రతి కుటుంబమునకు కొద్దిభూమి వచ్చియుండుట వలనను, స్వంత వ్యవసాయము చేసుకొనుటకు చాలినంతగ లేకపోవుట వలనను రైతులలో కలిసి వ్యవసాయము చేసుకొనుటకు పరస్పరసహాయ సంఘములను ఏర్పాటు చేసుకొనుటకు ప్రభుత్వము ప్రోత్సహించగ నూటికి 60 రైతు కుటుంబములు ఈ పరస్పర సహాయ సంఘములలో చేరెను. అంతటితో చైనా ప్రభుత్వ మాగక వ్యవసాయ ఉత్పత్తిదారుల సహాకార సంఘములను దేశమంతటా స్థాపించి అధికాహారోత్పత్తి గావించుటకు నిశ్చయించెను. వీటికి కమ్యూనిస్టు పార్టీ సభ్యులను ప్రచారముచేసి స్థాపించుటకు నియమించిరి. గ్రామముల వెంట గ్రామములు ఉత్పత్తిదారుల సహాకార సంఘములుగ మార్చుచెందెను. గాని ఈ సహాకార సంఘములలో రైతులకు తమ భూమియందు హక్కు పోలేదు. కొంతకాలము వరకు భాగ్యవంతులగు రైతు

లను, మధ్యమతరగతి రైతులను వీటిలో చేర్చుకొనలేదు. తరువాత నెమ్మదిగ వారినికూడ చేర్చుకొనినారు. 1956 వ సంవత్సరము జూన్ వరకు నూటికి ఎనిమది మంది రైతు కుటుంబములు మాత్రమే సహకార సంఘములకు బైటనే యుండెను. ఈ భూములలో కష్టపడి పనిచేసినరైతులకు ఎక్కువగ మజూరి నిచ్చిరి. సహకార సంఘసభ్యులచేత నొక కార్యనిర్వాహకవర్గ మెన్నుకొనబడెను. సహకార సంఘములను తనిఖీ చేయుటకు ఉపసంఘముల నేర్పరచిరి. లెక్కలను తనిఖీచేయుట కుద్యోగస్థుల నేర్పరచిరి. పశువులు చాల తక్కువైనందున తమ పశువులచేత వ్యవసాయము చేయించిన రైతులకు మజూరి ఇవ్వబడెను. ఏ పైరులు ఎప్పుడు వేయవలసినది చక్కగ నిర్ణయించబడెను. వ్యవసాయ బ్యాంకువారు ఋణములను, నిపుణులను సరఫరా చేసిరి. ధరలు నిర్ణయించబడెను. ఈ సహకార సంఘముల ధాన్యమంతయు సరియైన విక్రయము చేయుటకు విక్రయ సంఘముల నేర్పాటు చేసిరి. చైనా దేశములోని విప్లవము రైతుల విప్లవమైనందున చైనాలోని కమ్యూనిస్టు పార్టీవారు వ్యవసాయాభివృద్ధి విషయములో వ్యవసాయ విప్లవమును తీసుకొని వచ్చుటలో ప్రత్యేక పాత్ర వహించిరి. ఈ రైతులకు పండించిన పంటకు మంచిధర దొరకుటయేగాక వారికి కావలసిన వస్తువులు చవుకగ దొరకునట్లు ఏర్పాటు చేయబడెను. ప్రతి గ్రామములోను, ప్రతి సహకార సంఘములోను ప్రతి జట్టులోను కమ్యూనిస్టు పార్టి సభ్యులు ముఖ్యపాత్రను వహించి ఈ యుద్యమమును జయప్రదముగ గావించిరి. రైతాంగములో కమ్యూనిస్టు

భావములను దృఢముగ వ్యాపింపచేసిరి. ఈ వ్యవసాయ సహకార సంఘముల స్థాపనలోను నిర్వహణలోను కమ్యూనిస్టు పార్టీవారు ప్రథమ పాత్రను, ప్రభుత్వమువారు రెండవ పాత్రను మాత్రమే వహించిరి. ఇంతేకాక ప్రతి గ్రామములోను ప్రజా కోర్టులను స్థాపించి భూస్వామందులను రైతాంగమునకు వ్యతిరేకముగ నేరములు చేసి యున్నారని నేరారోపణ చేసి మరణ శిక్షలను విధించిరి. వర్గపోరాట భావము దీనివల్ల బాగుగ స్థిర పరచబడెను. ఇవి భారతీయులమైన మనకు మిగుల వెగటుగ కన్పించును. ఈ వర్గపోరాటమే పనికిమాలినదని మనకు తోచును. కాని చైనాలో జరుగుచున్న సంగతులను గూర్చియే మనము తెలుసుకొనుచున్నాము. ఈ సహకార సంఘములలో ఐచ్ఛికముగనే రైతు కుటుంబములు చేరినారని చైనా ప్రభుత్వము కమ్యూనిస్టు పార్టీవారు ప్రకటించినారు. చైనాలో ఏకపార్టీ ప్రభుత్వము మాత్రమే యున్నందునను, వ్యక్తి స్వాతంత్ర్యము తక్కువగ నున్నందునను ప్రభుత్వము కోరినదంతయు వెంటనే జరుగుచున్నది. ప్రభుత్వమునకు ఎదురు తిరుగువారు దోషులుగ నెంచబడుదురు. అందువలన కూడ సహకారోద్యమమునకు ప్రతిఘటనము సలుపు మరియొక యుద్యమము చైనాలో సాగుట అసంభవము. ఐనను చైనాలోని పరిస్థితుల వలన రైతాంగము బుద్ధిపూర్వకముగనే ఈ సహకార సంఘములలో చేరినట్లుగ మనము భావించుటకే ఎక్కువ అవకాశము కలదు. ఈ సహకార సంఘములలో చేరిన రైతాంగములో అత్యధిక సంఖ్యాకులు సంతోషముతోను సంతృప్తితోను నున్నటులే మాకు తెలిసినది.

చైనాలోని పల్లెటూళ్లన్నియు కదిలినవి. నూతనచైతన్యము వచ్చినది. తమ కాళ్ళమీద తాము నిలబడ గలిగెదమను ధైర్యము వచ్చినది. ప్రతిచోటను త్యాగము, క్రమశిక్షణ కనబడినవి. వెనుకటికంటె తమ స్థితి చాల అభివృద్ధి చెందినదని రైతులు ప్రతిచోట చెప్పినారు. ఉత్పత్తి చాల అధికమైనదనియు, వెనుకటికంటె తినుటకు ఎక్కువతిండి, కట్టుకొనుటకు బట్ట లభించుచున్నదనియు వారు మాతో చెప్పినారు. లయోనింగు రాష్ట్రములో మూడు లక్షల బావులను త్రవ్వుకొన్నామని చెప్పినారు. కొద్ది సంవత్సరములలోనే నీటిపారుదల క్రిందికి తేబడిన భూమి • రెట్టింపుకు పెరిగినదని తెలిసినది. సహకార సంఘములలో నీ భూములు అభివృద్ధికరమైన విధముగనే చేయబడుచున్నవని, ఆదాయము హెచ్చినదని, సోషలిస్టు సమాజ స్థాపనకై తాము కృషి సలుపుచున్నామని, ప్రతిచోటను రైతులు మాతోచెప్పిరి. రాజకీయ చైతన్యము, ముఖ్యముగ సోషలిస్టు భావచైతన్యము వారిలో నెక్కువగ కనపడెను. ఈ వ్యవసాయ రంగములో జరిగిన అభివృద్ధి ఇతర రంగములలోకూడ అభివృద్ధికి తోడ్పడెను. గ్రామపరిశ్రమలు, గృహపరిశ్రమలుకూడ సహకార పద్ధతినే స్థాపింపబడసాగెను. చైనాలో ప్రభుత్వము, జాతీయ పెట్టుబడిదార్ల వర్గము కలిసి పెద్దపరిశ్రమలను, వర్తకమును సాగించుచున్నారు. పల్లెటూళ్లలో మంచి నాయకత్వము లభించినది. నాయకులు సుశిక్షితులైన ఇరువది, ముప్పది సంవత్సరములమధ్య వయస్సుగల స్త్రీ పురుషులైయున్నారు. ఆదర్శములలోను, ఉత్పత్తిని వృద్ధిచేయుటకు అవలంబించవలసిన పద్ధ

తులలోను వారికి శిక్షణము యివ్వబడినది. ఈ సహకార సంఘములఅధ్యక్షులుగను, ఉపాధ్యక్షులుగను చాలచోట్ల స్త్రీలు ఎన్నుకొనబడినారుగూడ. ప్రతి సహకార సంఘములోను అధ్యక్షురాలుగ గాని, ఉపాధ్యక్షురాలుగ కాని ఒక స్త్రీ యుండితీరవలెనని సాంప్రదాయము స్థాపించబడినది. స్త్రీల నాయకత్వము పురుషుల నాయకత్వముకన్న ఏ విధముగను అసమర్థతను చూపలేదు" అని 1956 వ సంవత్సరములో ఇండియాప్రభుత్వ ప్లానింగుకమిషను పక్షమున చైనా దేశమునకు వెళ్లిన భారత రాయబారవర్గము యొక్క నాయకుడగు శ్రీ ఆర్. కె. పాటిలుగారు సమర్పించిన నివేదికలో వ్రాయబడియున్నది. గాని వీరు వెళ్లిచూచిన కాలమునకే కొన్నిచోట్ల సమష్టి (సాముదాయక) వ్యవసాయ క్షేత్రము లేర్పడినవి. వాటియొక్క మంచిచెడ్డలను గూర్చి వీరు వ్రాసి యుండలేదు. మొత్తముగ సహకార వ్యవసాయమునుగూర్చియే మెజారిటి నివేదికలో వ్రాయబడియున్నది. సమష్టి వ్యవసాయ క్షేత్రములనుగూర్చి ప్రత్యేకముగ ఈ రాయబార వర్గములోని మరి యిద్దరు సభ్యులు విమర్శించి ఖండించినారు. దానినిగూర్చి రాబోవు అధ్యాయములో వ్రాసెదము.

## 6

"హువాంగ్, యాంగ్సీ, ఎల్లో—ఈ మూడు నదులు చైనాదేశపు నడిగడ్డమీదుగ ప్రవహించి దేశమును సస్యశ్యామలముగను, సారవంతముగను చేస్తున్నవి. తిండి పెట్టేవి ఈ నదులే. కాని ఒక్కొక్కప్పుడు విశేషమైన వరదలు వచ్చి లక్షలాది ఎకర

ములను ముంచివేయుచుండెను. 14 వ శతాబ్దమునుంచి ఇంత వరకు హువాయ్ ప్రదేశము 935 సార్లు వరదల వల్ల, కరువుకాటకాలవల్ల పీడింపబడినది. ఈ హువాయ్‌ని చైనీయులు జలకన్య అనే పేరుతో పిలుచుకొని ఎంతో ప్రేమించుచున్నారు. హువాయ్ లోయలో సుమారు 50 లక్షలమంది ప్రజలు జీవించుచున్నారు. కమ్యూనిస్టులు అధికారములోకి రాగానే 1949 వ సంవత్సరములో మావోసిటంగు హువాయ్ నదీజలాలను అదుపులో పెట్టవలెనని ప్రకటించినాడు. చైనాలో అపారమైన జనసంఖ్య యున్నది, గాని సాంకేతికశక్తి బహుకొద్దిగ నున్నది. హువాయ్ నదీలోయ ప్రాజెక్టులో 20 లక్షలమంది ప్రజలు తమంతట తాము వచ్చి పనిచేయుచున్నారని, ఈ బహుళార్థ సాధక ప్రాజెక్టు నిర్మాణముతో ఈ ప్రాంతములలో నివసించుచున్న జనసామాన్యానికి ప్రాణభీతి తప్పినదని, నవచైనా సాధించుచున్న ఘనకార్యములలో ఈ ప్రాజెక్టు ఒకటి అని, విని మేము చూడడానికి వెళ్ళినాము. మాతోపాటే మేము ప్రయాణము చేయుచున్న పడవలోనే ఆ ప్రాజెక్టు డిప్యూటీ చీఫ్ ఇంజనీయరు ఉన్నది. నవచైనా ప్రభుత్వములో స్త్రీ ఉద్యోగులు చాలమంది గలరు. ఉన్నత హోదాలోనున్న స్త్రీఉద్యోగుల నెందరినో మేము చూచినాము. మాతోపాటు పడవలో ప్రయాణము చేయుచున్న స్త్రీ ఇంజనీయరు ఎంతో ప్రతిభావంతురాలు. ఆమె చేతిక్రింద కొన్నివేల మంది ప్రజలు పనిచేయుచున్నారు. ఆమె పేరు చీ ఇన్ చి-ఎంగు. ఈమె 1941 వ సంవత్సరములో షాంఘైకి విద్యార్థినిగ వచ్చి

వరదల నివారణ, నీటిపారుదల

కమ్యూనిస్టుపార్టీలో చేరినది. 1942 లో జపానువారితో పోరాడుటకుగాను లిబరేటెడ్ ఏరియా (విముక్తిచెందిన ప్రాంతము) లోనికి తప్పించుకొని వచ్చినది. హువాయ్ నదీప్రవాహాని కెదురుగ ఒక నూరుమైళ్ళ దూరము ప్రయాణము చేయుచున్నాము మేము. అది రెండురోజుల ప్రయాణము. ఆ రెండు రోజులూ ఆమె మమ్ములను ఆశ్చర్యచకితులనుగ చేసినది. అట్టి యుద్యోగస్థులందరికి ఆమె పూజనీయురాలు. ఆమెపట్ల భయముకాదు, భక్తి విశ్వాసములు. ఆమెలోని ఆత్మవిశ్వాసము గొప్పది. హువాయ్ ప్రాజెక్టును గూర్చిన వివరాలు ఒకరోజు మాతో ఏడుగంటలు ఏకథాటీని మాట్లాడినది. అభివృద్ధి నిరోధక క్యూమింటాంగు పాలన క్రింద ప్రజలు నానా అగచాట్లు పడినారని, 50 లక్షలమంది చనిపోయినారని, మావోసిటుంగు నాయకత్వములో కమ్యూనిస్టుపార్టీ ఇచటి ప్రజల కష్టములను తీర్చేందుకు కృషిచేస్తున్నదని ఆమె చెప్పినది. ఆ ప్రాంతమంతా ఒక పెద్ద మడుగు అయిపోయినది. వరదలవలన కాలువలన్నీ చెరువుగ మారి ఒకే ఏరు అయిపోయినది. 50 వేలమంది కమ్యూనిస్టు మెంబరులు, ఒక లక్షమంది యువజన నాయకులు ఈ వరద నివారణ ప్రాజెక్టు నిర్మాణమునకు కావలసిన జనాభాను పోగుచేయడము మొదలుపెట్టిరి. సభలు, నినాదములు, ఊరేగింపులు జరిపి జపానీయుల దుండగములు, జమీందారుల దౌర్జన్యములు, జ్ఞాపకముచేసి తమకు భూమిని పంచిపెట్టిన ప్రభుత్వముపట్ల భక్తిని ప్రజల మనస్సులలో రేకెత్తునట్లు చేసినారు. 'ఇప్పుడు మనకు భూమి ఇచ్చినాడు. మామటుకు మాకుటుంబమునకు మూడు ఎకరముల భూమి లభించినది. మనము ఈనాడు మన

పొలముల కోసము శ్రమపడుతున్నాము. అందుచేత తామందరు ఈ ప్రాజెక్టుపనిలో పాల్గొననలెను' అని చౌషాన్ అను రైతు నాయకుడు ప్రచారము చేసినాడు. ఇటుల ప్రచారము జరుగగ 22 లక్షలమంది స్త్రీ పురుషులు తమ గునపము, పార తాము తెచ్చుకొని హువాయ్ వరదనివారణ కార్యక్రమములో పాల్గొన్నారు. సంవత్సరములో ఎనుబది రోజులు పనిచేసినారు. ఆ పని చేయుచున్నంత కాలము వారికి భోజనము, ఉండుటకు వసతి, వైద్య సౌకర్యములు ప్రాజెక్టు అధికారులు ఏర్పాటు చేసినారు. ఈ విధముగ చైనా ప్రజలు గడచిన రెండేండ్లలోను 1370 మైళ్ల పొడుగు కాలువలను, 540 మైళ్ల మేర నదిగట్టును పునర్నిర్మితము చేసినారు. అంతమాత్రముననే నదీప్రవాహము కంట్రోలు కాదు. ఎక్కువగ రిజర్వాయరులు కట్టవలసియున్నది. ఇందుకు పదివేలమంది ఇతర ఉద్యోగులు కావలసియున్నది. ఇంతమంది సాంకేతిక నిపుణులు చైనాలో నున్నారా అనునది సంశయము. అందువలన హువాయ్ నదీలోయ ప్రాజెక్టులో పనిచేయుచున్న 24 వేల 672 మందిని 'మోడెలు వర్కర్స్'గ ఎన్నుకొని వారినే ఇంజనీయరులుగ నియమించినారు. ఈ నదీలోయ ప్రాజెక్టువలన బోలెడంత భూమి పంపకానికి ఉంటుంది. ఆ ప్రాజెక్టులో లోపములున్నమాట వాస్తవము. కాని ఆ ప్రజల ఉత్సాహము, కార్యదీక్ష ఎంతో ప్రశంసనీయము" అని 1952 వ సంవత్సరములో చైనాను దర్శించిన రాజా హాతీసింగుగారు వ్రాసినారు. 1954 వ సంవత్సరమువరకు

**విశేషమైన అభివృద్ధి**

నీటిపారుదల కార్యములు విశేషముగ వృద్ధి చేయబడినవి. పెద్దప్రాజెక్టులు, మధ్యమ తరగతి

ప్రాజెక్టులు, చిన్న ప్రాజెక్టులు, చెఱువుల గుంటల మరమ్మతులు చాలగ జరిగినవి. కాలువలు వందల మైళ్లకొలది త్రవ్వబడినవి. వరదల నివారణ కార్యక్రమములు పెద్దఎత్తున జరిగినవి. అడవులలో క్రొత్తచెట్లు నాటి అడవులపెంపకము వృద్ధిచేయుటయే గాక, నదులప్రక్కన అడవులను పెంచి వరదల నివారణకు వాటిని ఉపయోగించిరి. విద్యుచ్ఛక్తి విస్తరింపబడినది. ముఖ్యముగ బావులు ఎంతేని ఉపయోగకరము. కావున వేలకొలది బావులు త్రవ్వబడినవి. విద్యుచ్ఛక్తితో నీరు తోడుటకు పంపులు పెట్టబడినవి. కోట్లకొలది ఎకరములకు నీటి సరఫరా చేయబడినది. వీటి అన్నిటిలో ప్రభుత్వముయొక్క ప్రోత్సాహమువలన కమ్యూనిస్టుపార్టీ సభ్యుల ప్రచారమువలన లక్షలకొలది రైతులు అత్యుత్సాహముతో తమతమ భూముల అభివృద్ధికొరకు తాము పనిచేసుకొనుచున్నామను సంతృప్తితో ముందుకువచ్చి కష్టించి పనిచేసి అతిత్వరితముగ యావత్తు పనులు, నిర్మాణ కార్యక్రమము జయప్రదముగ గావించినారు. 1954 వ సంవత్సరము మేనెలలో ఇండియా ప్రభుత్వమువారు పంపిన సుప్రసిద్ధ ఇంజనీయరులగు కేంద్ర నీటిపారుదల, విద్యుచ్ఛక్తి కమిషను అధ్యక్షుడు శ్రీ కున్వార్ సేను, డాక్టరు కె. యల్. రావుగారలు చైనాలో జరుగుచున్న మహత్కార్యములు చూచివచ్చి తమ నివేదికలో విపులముగ వ్రాసియున్నారు. వారు వ్రాసిన అంశములు కొన్ని "చైనాయొక్క క్రొత్త ఆర్థికము" అని గ్యాన్ చందుగారు వ్రాసిన గ్రంథమునుంచి ఎత్తి వ్రాయుచున్నాము. "అటువంటి, అంతకన్న పెద్ద నిర్మాణములు, ఇంకను చాల

సంఖ్యగల నిర్మాణములు, ఇండియాలో కూడ నిర్మింపబడినవి. కొన్ని నిర్మింపబడుచున్నవి. కాని ఈ నిర్మాణము చైనాలో పూర్తి చేయబడిన త్వరితగతి అత్యంతమైనది. చైనాలో 40లక్షల ఎకరములకు నీటిపారుదల చేయగల గొప్పకాలువ ఉత్తర కియాంగ్సు రాష్ట్రములో చాల ముఖ్యమైనది. ఆ కాలువలో పడవలమీద రాకపోకలు వీలగును. వరదనివారణ జరుగును. ఈ కాలువయొక్క వెడల్పు 420 అడుగులుండును. 25 వేల క్యూసెక్కుల నీటిని తీసుకొని పోవును. దీని యాపత్తు పొడవు నూరుమైళ్లు గలదు. 247 కోట్ల ఘన అడుగుల మట్టిపని ఈకాలువ త్రవ్వకములో జరిగినది.

రైతుల యుత్సాహము అపూర్వమైన శ్రమదానము

ఇట్టి అతి ప్రాముఖ్యమైన కాలువయొక్క త్రవ్వకమును చైనాప్రజలు ఎనుబది రోజులలో పూర్తిచేసినారు. ప్రతిరోజు మూడుకోట్ల ఘనఅడుగుల మట్టిపని జరిగినది. యంత్రము లేమీ లేవు. త్రవ్వడము, మట్టి మోయడము మేము చూచినాము. చాల పరిశుభ్రముగ నున్నది. చక్కగ పనిచేయు చున్నారు. ఇందుకుగాను 12 లక్షలజనులు పనిచేసిరి. ఇంత సంఖ్య గల రైతులను చక్కగ ప్రోగుచేసి పనిచేయించుట చాల కష్ట మైనపని. కాని చైనాలో ఈగొప్పపని బహు చక్కగాను, శాస్త్రీయముగాను చేయబడ్డది. ఇంతేగాక హువాయ్ వరదల నివారణకొరకు జరిగిన అతి గొప్పపనిలో 30 లక్షలమంది వరకు రైతులు పనిచేసినారు. వారికి వ్యవసాయపుపని లేనపుడు శీతా కాలములోను వేసంగిలోను 4, 5 నెలలు ఈపనిలో ఆజనులందరు ప్రవేశించి అత్యుత్సాహముతో కష్టపడి పనిచేసినారు. ఇట్టి పను

లన్నియు రైతులయొక్క లాభము కొరకే చేయబడుచున్న వని వారికి నేర్పిరి. చైనాలోని ప్రాజెక్టుల నిర్మాణము వలన అక్కడ మానవబలము ఎంత ఎక్కువగనున్నదో దానిని ఎంత చక్కగ వినియోగించవచ్చునో, ఎటువంటి అద్భుత కార్యములు జరగగలవో స్పష్టపడుచున్నది. ఇంత త్వరగ ఇట్టి అతి గొప్ప నిర్మాణములు పూర్తియగుట హిందూదేశములో కాని ప్రపంచ ములో మరెచ్చటను కాని జరిగియుండలేదు." అని ఆ ఇంజనీ యరులు ఇద్దరు వ్రాసినారు. ఈ పనులను చేయుచున్న కాలములో ఈ రైతు జనమునకు భోజనము, వైద్యము, గృహవసతి యేర్పాటు చేయుటయే గాక నాటక శాలలు, రేడియోలు, సినిమాలు, కమ్యూనిస్టులచేత చదువు చెప్పించుట, రాజకీయ ఉపన్యాసములు ఏర్పాటు చేయబడినవి.

ఈ యిద్దరు ఇంజనీయరులకు చైనాలో జరుగుచున్న గొప్ప నీటి పారుదల వరదల నివారణ పనిని స్వయముగ చూపించిన చైనా ప్రభుత్వపు నీటిపారుదల మంత్రి డాక్టరు హో గారు తన ప్రారంభోపన్యాసములో "దేశ స్వాతంత్ర్యము స్థాపింపబడినప్పటి నుండియు సామాన్య రైతులకు భూమిని పంచియిచ్చి యున్నాము. వారా భూములకు సొంత హక్కుగల యజ మానులైనారు. కావున తమ భూములను బలపర్చుకొని తమ జీవితమును ఎక్కువ సుఖవంతముగా చేసికొను కోరికతోను గొప్ప యుత్సాహముతోను నీటిపారుదల వరదల నివారణ కార్యక్రమములలో వారు పనిచేసినారు. గత సంవత్సరములలో

రైతులకు సొంతభూమి యున్నందువలననే ఇంతపని జరిగినది

మొత్తము రెండుకోట్లమంది కన్న ఎక్కువమంది రైతులు ఈ పనులలో పనిచేసినారు. ఇందులో ఒక 1951 సంవత్సరములో అరవై తొమ్మిదిలక్షల ఎనుబదివేలమంది పనిచేసినారు. వీరందరు ప్రభుత్వము నిర్వర్తించిన కార్యక్రమములలో పాల్గొన్నవారు. వీరుగాక ఇంక ననేకులు తామే స్వయముగ తమ నీటివనరులను బాగుచేసుకొని యున్నారు. హువాయి వరదల నిరోధపనిలో నిమగ్నులైన చాలమంది రైతుకుటుంబములకు చెందిన యువకులు తమ వివాహములను వాయిదావేసుకొని ఆ పని జయప్రదమైన పిమ్మటనే వివాహము చేసికొందుమని శపథములు చేసి వచ్చినవారు గలరు. పదిహేడు సంవత్సరముల వయసుగల కౌహుసియుయింగు అను కర్షకయువతి మమ్ముల బ్రతిమిలాడి చిన్నవయస్సు కారణముగ మేము వద్దన్నను వినక హువాయి వరదనివారణ పనిలో కష్టించి పనిచేసే ఆదర్శ కార్యకర్త్రియని బహూకరింపబడినది. మేము ఈ పనులలోనే అనేకమంది సాంకేతిక నిపుణులనుకూడ తయారుచేసినాము. అందువలన మా పనులు త్వరితముగ నెరవేరినవి." అని చెప్పియున్నాడు. ఈ వ్యవసాయ ఉత్పత్తిదారుల సహకారోద్యమ ఫలితముగ అధిక ఆహారోత్పత్తి, వ్యవసాయ సరుకుల అధికోత్పత్తి, నీటిపారుదల వ్యాపకము, వరదల నివారణ, అడవుల పెంపకము, క్రొత్త భూములను వ్యవసాయముక్రిందకి తెచ్చుట చాల బాగుగా జరిగినది. 1949 లో నీటిపారుదల క్రిందనున్న భూమి అయిదుకోట్ల యకరములుండగ, 1955 వ సంవత్సరములో ఆరుకోట్ల నలభై లక్షల యకరములకు పెరుగుటయేగాక వగద ముంపులనుండి విముక్తి చెందినది. ఒక్క

1956 లో రెండుకోట్ల అరవై లక్షల యకరములను నీటిపారుదల క్రిందకు తెచ్చుటకు నిర్ణయించి తీవ్రకృషిని సలుపుచున్నారు. అడవులు విశేషముగ నాటబడుచున్నవి. 1954 లో 6 లక్షల 97 వేల యకరములలోను 1955 లో 16 లక్షల అరవై వేల యకరములలోను, అడవులు నాటబడినవి. ఇందువలన, వరదనివారణ, అడవుల అభివృద్ధి, అటవీపరిశ్రమలు బాగుగ వృద్ధిచెందెను. కాని ఇది యావత్తు రైతులకు సొంత భూమియున్న కాలములోనే జరిగినది. ఇటుల వ్యవసాయిక ఉత్పత్తిదారుల సహకార సంఘములను స్థాపించుట, వాటిద్వారా పెద్దఎత్తున వ్యవసాయము జరిపించి వ్యవసాయసరకుల అధికోత్పత్తి గావించుట, రైతులకుత్సాహము కలిగించి అత్యధిక సంఖ్యాకులచేత నీటిపారుదల వరదలనివారణ మరి యితర నిర్మాణ కార్యక్రమములలో పనిచేయించుట, భారత దేశములోకూడ జరగవలసిన పనియని మేము దృఢముగ తలచుచున్నాము. కాని చైనా కమ్యూనిస్టులు ఇంతటితో తృప్తి పొందలేదు. తమ సిద్ధాంతములను అమలు జరుపుటకై రైతులను మరిరెండు స్థాయిల కీడ్చుకొని పోయినారు. వాటిని గూర్చి రాబోవు అధ్యాయములలో వివరించెదము.

# చైనా విప్లవము

## పంచదశాధ్యాయము

### సమిష్టి వ్యవసాయ (Collectivisation) క్షేత్రములు పారిశ్రామిక రంగము

### 1

మావోసిటంగు, చౌఎన్‌లై మొదలైన చైనా నాయకులు ఎట్టి త్యాగములైనను ప్రజలచేత చేయించి ప్రపంచములోకి పెద్దదైన యావత్తు చైనాదేశములో వీలైనంత త్వరితముగ కమ్యూనిజమును పూర్తిగ స్థాపించుటకు దృఢ నిశ్చయులైయున్నారు. కమ్యూనిజమునందు వ్యవసాయ భూములు, పరిశ్రమలు, సమస్త ఉత్పత్తి సాధనములు, రాకపోకల సాధనములు, స్వదేశ విదేశ వర్తకము అన్నియు ప్రభుత్వమునకే చెందవలెను. పౌరులకు ఎట్టి సొంత ఆస్తి ఉండకూడదు. ప్రభుత్వముక్రిందనే వారు కూలీలుగ పనిచేసి జీవించవలెను. ఈ సిద్ధాంతముతో వ్యవసాయ ఉత్పత్తి దారుల సహకార సంఘము (**Agricultural Producers Co-operative Farms**) లను సమిష్టి వ్యవసాయ క్షేత్రములుగ (**Collective Farms**) మార్చుటకు వారు 1955వ సంవత్సరము నుంచియు తీవ్రముగ పనిచేసిరి. కొన్ని వ్యవసాయోత్పత్తిదారుల సహకార సంఘములలో చేరిన భూములను ప్రభుత్వము తీసుకొని వాటిని కలిపి యొక గొప్ప భూఖండముగ గావించి ఈ భూఖండములలో పెద్ద ఎత్తున సమిష్టి సాముదాయ వ్యవసాయము చేయించుటను

సమిష్టి వ్యవసాయ క్షేత్రములు

ప్రారంభించిరి. అందువల్ల వ్యవసాయోత్పత్తి అత్యధికముగ జరుగుననియు, దేశ పరిశ్రమలకు కావలసిన ప్రత్తి, చెరకు, జనపనార, నూనెగింజలు, కాయధాన్యములు మొదలగు ముడిపదార్థములు లభించుననియు, అధికాహారోత్పత్తి జరుగుననియు, వ్యవసాయ ఖర్చులు, వ్యవసాయకులకు మజూరీ నిచ్చినది పోగా మిగిలినదంతయు ప్రభుత్వమునకే చెందుటవలన దానినంతను పారిశ్రామిక రంగములో పెట్టుబడి పెట్టి, త్వరితముగ పరిశ్రమలను అభివృద్ధి చేయగలుగుదుమనియు ప్రభుత్వము తలపెట్టెను.

చైనాదేశము
పరిశ్రమలలో
అధోగతిలో నుండెను

చైనాదేశము పరిశ్రమలలో చాల అధోగతిలో నుండెను. నూరు సంవత్సరముల అరాచకమువలన ఇండియా కంటె కూడ చాల హీనముగ నున్నది. జపానువారు మంచూరియా నాక్రమించి నప్పటినుండియు అనేకకోట్ల విలువగల పరిశ్రమలను స్థాపించినారు. కాని జపానువారోడిపోయి మంచూరియాను విడిచిపెట్టగనే ఆ పారిశ్రామిక యంత్రముల నన్నిటిని, సామగ్రిని గనులలోని సరుకును సోవియటు రుష్యా తీసుకొనిపోయెనని పైన తెలిపియున్నాము. మంచూరియాలో బహుకొద్దిగ పారిశ్రామిక సామగ్రులు నవ్యచైనాకు మిగిలినవి. చైనాలో తూర్పుతీరమున నున్న పరిశ్రమలను యుద్ధకాలమున జపాను నాశనము చేసెను. సూంగు, కంగు, చ్యాంగు, చెన్ అను నాలుగు కుటుంబముల క్రింద నున్న పరిశ్రమలుమాత్రము వారు దేశమును విడిచిపోయినందున కమ్యూనిస్టు ప్రభుత్వముయొక్క స్వాధీనములోనికి వచ్చెను. గాని అవి విశేషమైనవి కావు. తూర్పు చైనాలో చాలకాలము

నుండి పెట్టుబడిపెట్టి పెద్ద పరిశ్రమలను నడుపుచున్న పాశ్చాత్యులు పెక్కు నిర్బంధములకు లోనైనందున చైనానుంచి వెడలిపోయినారు. చైనా దేశీయులైన చిన్న ధనికులను ప్రభుత్వము దేశములో, నుండనిచ్చి వారి పెట్టుబడులవలన కొలది కాలము పారిశ్రామికాభివృద్ధి జరపనిచ్చినారు. గాని వారిమీద నిర్బంధములుపెట్టి వారి పరిశ్రమలనుకూడ వశపర్చుకొని వారిచేత కొంత పెట్టుబడి మాత్రము పెట్టించుకొని ఆ సమష్టి పరిశ్రమలను ప్రభుత్వమే నడపసాగినారు. గావున పారిశ్రామిక అభివృద్ధియొక్క యావత్తు బాధ్యత ప్రభుత్వము క్రిందకే వచ్చినది. అతి త్వరితముగ పారిశ్రామికముగ అభివృద్ధిచెంది చైనా దేశము ప్రపంచములోని గొప్పదేశములలో నొకటిగ కావలెనని చైనా ప్రభుత్వముయొక్క దృఢ సంకల్పము. బ్యాంకులు, నాణెములు, మారకము, రాకపోకల సాధనములు, అన్నియు ప్రభుత్వము తనక్రిందకే తీసుకున్నది.

చైనా కమ్యూనిస్టు ప్రభుత్వమునకు ఇండియా కిచ్చినట్లు అమెరికా, ఇంగ్లండు, పశ్చిమజర్మనీ, జపాను మొదలైన కమ్యూనిస్టేతరదేశములు ధన సహాయమును చేయవు. ఋణము లివ్వవు.

ఆర్థిక సహాయమునకు కేవలము రుష్యామీదనే ఆధారపడవలెను

చైనా కేవలము ఆర్థికసహాయమునకు, ఋణములకు, సాంకేతిక నిపుణులకు, పారిశ్రామికసరుకులకు, యుద్ధ పరికరములకు సోవియటు రుష్యామీదనే ఆధారపడవలసి యున్నది. సోవియటు రుష్యా పాశ్చాత్య దేశములతో సమానముగ ధనవంతమైన దేశముకాదు. తనకు ప్రక్కన యూరపుఖండములో తూర్పున

నున్న పోలెండు, ఫిన్‌లాండు, హంగెరీ మొదలైన కమ్యూనిస్టు దేశములకు కూడ కొంత ఆర్థిక సహాయము చేయవలసియున్నది.

అందువలన చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము దేశములో నుంచియే వ్యవసాయ ఉత్పత్తిని అత్యధికముగ పెంచి దానిలో వ్యవసాయ ఖర్చులక్రిందను ప్రజలకు మజూరిగా నిచ్చిన దాని క్రిందనుపోగా మిగిల్చిన దానినంతను పారిశ్రామిక రంగములోనికి తెచ్చి పారిశ్రామికాభివృద్ధి కొరకు వినియోగించుటకు నిశ్చయించినదే. చైనాయొక్క పారిశ్రామిక సరుకులకు విదేశ అంగళ్ళులేవు. రుష్యా మాత్రము ముడి పదార్థములు కొనును. ముడి పదార్థములు కొద్దిగా తూర్పు యూరపులోని కమ్యూనిస్టు దేశములుకూడ కొనును. ఆ సరుకులను చైనాలోని ప్రజలే కొనవలెను. అటుల కొనుటకు కూడ సమిష్టి క్షేత్రములలో వ్యవసాయికులకు లభించు అధిక మజూరీ వలన కొనుగోలు శక్తిఅధికముచేసి వారిచేత కొనిపించవలెనని కూడ తలచిరి. ఇంతేగాక రైతులకు సొంతఆస్తి లేకుండచేసి వెంటనే కమ్యూనిస్టు సమాజస్థాపన గావించుట చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము యొక్క ప్రధానాశయము. భూసంస్కరణముల వలనను, పరస్పర సహాయక సంఘములను, వ్యవసాయోత్పత్తిదారుల సహకారసంఘములను స్థాపించుటవలనను, నీటి పారుదల వరదల నివారణ కార్యములవల్లను వ్యవసాయ సరుకుల యుత్పత్తి బాగుగ అధికమైన మాట నిజమే. కాని రైతులకు స్వంత ఆస్తియందు మమకారము పూర్తిగ నేర్పడినది. ప్రతి

దేశములోని వ్యవసాయ రంగములో నుంచియే పారిశ్రామికాభివృద్ధి జరుగవలెను

రైతు కుటుంబమునకు వ్యవసాయము వలన వచ్చెడు ఆదాయములో కుటుంబ ఖర్చులకు పోగా మిగిలిన దానితో కొంతవరకు భాగ్యవంతుల మగుదుమను వాంఛ పూర్తిగ కలిగినది. గావున వ్యవసాయ రంగమును పూర్తిగ తమ క్రిందకు తెచ్చుకొనుటకు చైనా ప్రభుత్వము నిశ్చయించినది. 1952 వ సంవత్సరములో సమష్టి వ్యవసాయక్షేత్రములు రెండుమాత్రము స్థాపించబడెనని తెలిసినది. అదివరకు చైనా ప్రభుత్వము, కమ్యూనిస్టుపార్టీ సభ్యులు, రైతులకు వ్యవసాయ ఉత్పత్తిదారుల సహకారపద్ధతిలో గల సుగుణములను బోధించుచుండేవారు. అంతటినుంచి అది చాలదని సమష్టి వ్యవసాయక్షేత్ర స్థాపన అనగ సాముదాయక వ్యవసాయ నిర్మాణ స్థాపన దేశసత్వరాభివృద్ధికి అత్యావసరమైనదని, లాభకరమైనదని రైతులలో పూర్తిగ ప్రచారము చేయసాగినారు. కమ్యూనిస్టు చైనాలో ప్రజలలో పత్రికలమూలమున, కరపత్రముల మూలమున, రేడియోలమూలమున, కమ్యూనిస్టు కార్యకర్తలు ప్రతి గ్రామములోనికివెళ్లి స్వయముగ సమావేశములు జరిపి బోధించుట మూలమున ప్రభుత్వము తలపెట్టిన ప్రతి విషయములోను అఖండ ప్రచారము జరుగును.

సొంతఆస్తి యుండకూడదు

ముఖ్యముగ రేడియో దూరశ్రవణ యంత్రములద్వారా రాత్రింబగళ్లు దేశమంతట ప్రచారము మారుమ్రోగుచున్నది. అట్టి ప్రచారముమీదను, ఎదురుతిరిగినవారిని ప్రజాకోర్టులకు పంపి శిక్షించి భీతావహము కలుగచేయుట మీదను ప్రభుత్వము ఆధారపడు

ఇండియానుగూర్చి విద్యార్థులకు నేర్పిన విషయములు

చున్నది. నిరంతర ప్రచారము, రహస్య పోలీసులవలన భయము ప్రజలను ప్రభుత్వమునకు అతివిధేయులను గావించుచున్నది. ప్రభుత్వమునుగాని, కమ్యూనిజమునుగాని ఖండించే, వ్యతిరేకించే విమర్శించే ప్రచారము జరుగుటకు బొత్తుగా వీలులేదు. కమ్యూనిస్టేతర దేశముల రేడియోలు చైనాలో వినిపించవు. కమ్యూనిస్టులను వ్యతిరేకించే గ్రంథములు, పత్రికలు దేశములో నుండుటకే వీలులేదు. ఇండియాలోని మనకు చైనాలో జరుగుచున్న సంగతులు చాలగ తెలుసును. చైనాను భారతీయులు చూచివచ్చి బహుమర్యాదగ చైనానుగూర్చి వ్రాయుచున్నారు. చైనాలో మన ఇండియాసంగతి గాని ఇతర కమ్యూనిస్టేతర దేశములసంగతి గాని తెలియనివ్వరు. 1958 లో డాక్టరు చంద్రశేఖరు ఆంధ్ర దేశమునుంచి చైనావెళ్లి చూచివచ్చినాడు. అపుడొక కళాశాలకు పోయి యొక ప్రముఖవిద్యార్థిని ఇండియానుగూర్చి ఏమి తెలుసును అని అడిగినాడు. ఆ విద్యార్థి జవాబుచెప్పుచు రెండు ఇండియాలు గలవని, ఉత్తర ఇండియా ధనికవర్గ దేశమని దానికి పండిత జవహరులాలునెహ్రూ ప్రధానమంత్రి యని, కాని నెహ్రూ చైనాకు స్నేహితుడేనని, దక్షిణ ఇండియా కమ్యూనిస్టు దేశమని, దానికి కలరాలోనున్న—కేరళకు బదులు కలరా అని నేర్చుకున్నాడు — నంబూద్రిపాల్ ప్రధానమంత్రి యని చెప్పినాడు. ఇటుల నేర్పినారు విద్యార్థులకు ఇండియానుగూర్చి. సాముదాయ లేక సమష్టి వ్యవసాయ పద్ధతిలో రైతులకు స్వంత భూమి అనేది ఉండనే ఉండదు. రైతు కుటుంబములకు గల యావత్తు భూమిని వ్యవసాయ పనిముట్లను, వ్యవసాయ పశువు

లను ప్రభుత్వము వశపరచుకొని ఈ సమష్టి వ్యవసాయ క్షేత్రములకు నప్పగించేసెను. ఇంటిప్రక్కన కూరగాయలు వేసుకొనుటకు కొంచెము భూమిచిప్పను మాత్రముంచుకొన నిచ్చిరి. రైతులందరు ఈ సాముదాయక లేక సమిష్టి వ్యవసాయ క్షేత్రములలో కష్టపడి పనిచేసి మజూరి పుచ్చుకోవలసిన కూలివాండ్రయినారు. భూములులేని వారిని కూడ నీ క్షేత్రములలో చేర్చి మజూరీనిచ్చి పనిచేయించిరి. చైనాలోని వ్యవసాయ ఉత్పత్తిదారుల సహకార సంఘములలోనుంచి దేశము సాముదాయక వ్యవసాయ క్షేత్రములలోకి పోవుటయే చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము యొక్క ఉద్దేశ్యమని మావోసిటంగు 1952 లోనే చెప్పియున్నాడు. చైనా దేశములోని కోటానుకోట్ల రైతుల నందరిని సొంత ఆస్తిలేని ప్రభుత్వ కార్మికులుగ మార్చి వ్యవసాయ రంగములోను, పారిశ్రామిక రంగములోను, రవాణాసౌకర్యముల నిర్మాణ రంగములోను, గృహ నిర్మాణ రంగములోను పంపిణీచేసి పనిచేయించి ఈ అన్ని రంగములలో సత్వరాభివృద్ధిని గావించవలెనని చైనా కమ్యూనిస్టు ప్రభుత్వ యుద్దేశ్యముగ తేలినది. సమిష్టి వ్యవసాయ క్షేత్రముల సాగుకు, ట్రాక్టర్లు యంత్రములు మిగుల యుపయోగకరము అవసరము కూడాను. ఇరువది సంవత్సరముల క్రింద రుష్యాలో సమిష్టి వ్యవసాయ క్షేత్రములు స్థాపించబడగనే అత్యంతముగ తమ ఫాక్టరీలలో ట్రాక్టర్లను యంత్రములను తయారుచేసి తేలికగా పెద్ద ఎత్తున వ్యవసాయమును సాగించిరి. గాని చైనాలో పెద్ద యెత్తున వ్యవసాయము చేయుటకు అవసరమైన ట్రాక్టర్లు

రైతులనందరిని కూలీలుగ మార్చినారు

లేవు. 1955 లో చైనా ప్రజాస్వామిక మొత్తముమీద రెండు వేల ట్రాక్టర్లుండెను. ఆ కాలములో ఇండియాలో దీనికి ఆరు రెట్లు ట్రాక్టరులుండెను. సాలుకు 15000 ట్రాక్టర్లను తయారు చేయుటకు స్థాపింపబడిన మొదటి ఫ్యాక్టరి 1959 వరకు గాని ట్రాక్టర్లను తయారు చేయజాలదు. చైనాలో వ్యవసాయ పశు

ట్రాక్టర్లు, పశువులు లేవందున మానవ కష్టమే అవసరము

వులు చాల తక్కువగ నున్నవి. పాడిపశువులు మరీ తక్కువగ నున్నవి. త్రాగుటకు పాలు సాధారణముగ దొరకవు. సోయాచిక్కుడు కాయలతో నొకవిధమైన పెరుగు తయారుచేసి దానిని త్రాగె దరు. ఎడ్లు కరువుగ నున్నవి. గాడిదలు, కంచర గాడిదెలు, గుర్ర ములు, దున్నలు వ్యవసాయములో నుపయోగించ బడును. అందు వల్ల పశువుల ఎరువు చాలతక్కువ. మనిషియొక్క అల్పాచమాన, అధికాచమానములు ఎరువుగ నుపయోగించిరి. ఈ విషయములో ఇండియా చాల మంచిస్థితిలో నున్నది. గాని చైనా రైతు తెలివిగలవాడు. అతను ఇండియా రైతుకన్నకూడ ఎక్కువ కష్టించి పనిచేయును. మానవ కూలి పశువుయొక్క కూలికన్న చాలతక్కువ. గావున సమిష్టి వ్యవసాయ క్షేత్రములలో వ్యవ సాయమును సాగించుటకు కొన్ని చిన్న చిన్న పనిముట్లను అభి వృద్ధిచేసి యుపయోగించుటయేగాక మానవ కష్టమునే ప్రభు త్వము పూర్తిగ వినియోగించి జయమును పొందినది.

వైశాల్యములో ఇండియా కంటె ఎంతో పెద్దదైన చైనాలో 1950 నాటికి 22940 మైళ్ళ పొడుగుగల రైలు మార్గము లుండెను. ఆకాలములో పాకిస్తాను కలిసిన సమష్టి

రైళ్ళు, విద్యుచ్ఛక్తి మగ్గముల కండెలు తక్కువగ నున్నవి

ఇండియాలో 66185 మైళ్ళ పొడుగుగల రైలు మార్గ ముండెను. విద్యుచ్ఛక్తి విషయములో 1950లో చైనాలో 225 కోట్ల కిలోవాట్లుండగ ఇండియాలో 506 కోట్ల 30 లక్షల కిలోవాట్లుండెను. 1951 లో చైనాలో 40 లక్షల మగ్గముల కండెలుండగ ఇండియాలో ఒక కోటి ఎనిమిదిలక్షలుండెను. 1954 సంవత్సరములో ఇండియా ప్రభుత్వముచే పంపబడిన ఇంజనీర్లు కన్వారుసేను, డాక్టరు

మోటారుకార్లు నిషేధించినారు

కె. యల్. రావుగార్లు చైనాలో మోటారు కార్ల యుపయోగమును పూర్తిగ నిషేధించిరనియు, ఎంతటివారైనను అందరును ప్రభుత్వ బస్సులలోనే ప్రయాణము చేయవలసి యున్నదనియు, అటులనే తాము, చైనాయొక్క మంత్రులు, ఇంజనీర్లు ప్రభుత్వ బస్సుల లోనేవెళ్ళి వరద కట్టల నిర్మాణమును చూచితిమనియు, గాని అచటికి అత్యుత్సాహముతో వేలాది ప్రజలు చూచుటకు వచ్చి తమకు అఖండమైన స్వాగత మిచ్చిరనియు తెలిపియున్నారు. అన్ని రంగములలోను మానవబలమే అత్యంతముగ కావలసి యున్నందున రైతులనందరిని ప్రభుత్వముక్రింద కార్మికులుగ మార్చినారు. రైల్వేలు రోడ్లు వేయించుటకేగాక కొండలు తొల్చుటకుకూడ మానవ కష్టమునే వినియోగించు చున్నారు.

సమష్టి వ్యవసాయ క్షేత్రములలో చేరుటకు రైతు కుటుంబములు బుద్ధి పూర్వకముగ ముందుకు రాలేదనియు, కమ్యూనిస్టు సభ్యుల నిరంతర బోధలేగాక చాలచోట్ల ఎదురు తిరిగిన వారికి దారుణ శిక్షలుకూడ వేయవలసి వచ్చినదనియు

చైనాను చూచివచ్చిన గ్రంథకర్తలు వ్రాసినారు. సమష్టి వ్యవసాయ క్షేత్రములలో చేర్చిన భూములకు, పశువులకు రైతుకుటుంబములకు నష్టపరిహార మిన్వరు. అందువల్ల చాలచోట్ల పశువుల సొంతదార్లగు రైతులు తమ పశువులను క్షేత్రములకు వప్పగించకుండ చంపివేసి వాటి మాంసమును తామే తినిరి. పశువులను కసాయి వాళ్లకమ్మిరి. ఇతరులెవరైన కొన్నయెడల వారికమ్మిరి. ఇటుల చేసిన కొందరు రైతు నాయకులను ప్రజాకోర్టుల ఎదుట బహిరంగ విచారణ జరిపి కాల్చిచంపి రైతాంగములో భీతావహమును కలుగచేసిరి. గాని పేద వ్యవసాయికులందరును బుద్ధిపూర్వకముగనే ఈ క్షేత్రముల క్రింద చేరిరని చెప్పబడుచున్నది. వారి సంఖ్యయే ఎక్కువగ నుండెను. 1954 సంవత్సరము జనేవరి మొదలు 1955 మే నెల వరకు 3 లక్షల 64 వేల 604 మందిని చైనాలోని ప్రజా కోర్టులలో విచారించి శిక్షించిరి. 1954 ఆఖరు భాగముకన్న 1955 ప్రథమ భాగములో హత్యానేరము క్రింద శిక్షింపబడిన కేసులు నూటికి 27 వంతులు ఎక్కువయ్యేనని, ఇండ్లు, గడ్డివాములు తగలబెట్టిన కేసులు నూటికి 90 వంతున ఎక్కువైనవని చైనా న్యాయవిచారణ మంత్రి షిలియాంగుగారు 1955 జులై 29 తేదీన వ్రాసినారు. 1955 సంవత్సరము జూన్ నెలలో విప్లవ వ్యతిరేకులని 45 వేలమంది కమ్యూనిస్టుపార్టీ సభ్యులకు దారుణ శిక్షలను వేసినారు. వారి నాయకుడైన కియోకాంగు, స్టేటు ప్లానింగు సభ్యుడు, ఆత్మహత్య చేసుకున్నాడు. మరియొక నాయకుడైన సైనిక కౌన్సిలు సభ్యుడు డౌషుషీని శిరచ్ఛేదము

భీతావహమువల్లనే సమష్టి వ్యవసాయ క్షేత్రములలో చేరినారు

గావించిరి. ప్రబోధమువలనను భీతావహామువలనను రైతులను పూర్తిగ లోబర్చుకొని త్వరితముగ సమష్టివ్యవసాయ క్షేత్రములను స్థాపించసాగిరి. 1955 ఆఖరున 29000 సమష్టివ్యవసాయ క్షేత్రములుండెను. 1960 ఆఖరువరకే చైనా దేశములోని అన్ని వ్యవసాయక ఉత్పత్తిదార్ల సహకార సంఘములను సమష్టి వ్యవసాయ క్షేత్రములుగ మార్చగలుగుదుమని మావోసిటుంగు ధైర్యముతో చెప్పెను. గాని 1957 ఆఖరుకే దేశమందంతటను సమష్టి వ్యవసాయ క్షేత్రములు స్థాపితమయ్యెను. ఈ సమష్టి వ్యవసాయ క్షేత్రములలో కష్టించి పనిచేసినందుకు పనినిబట్టి మజూరీని వ్యవసాయికులగు పురుషులకును, స్త్రీలకును ధాన్య రూపకముగ నిచ్చిరి. దానిలో వారి కుటుంబఖర్చులకు పోగా మిగిలినదానిని ప్రభుత్వము నిర్ణయించిన ధరకు ప్రభుత్వమునకే అమ్మవలెను. ఆ వచ్చిన డబ్బుతో తమకవసరమైన వస్తువులను ప్రభుత్వ దుకాణములలోనే కొనవలెను. వర్తకమంతయు ప్రభుత్వము చేతులలోనే ఉన్నది.

1956 వ సంవత్సరములో ఇండియా ప్రభుత్వ ప్లానింగు కమిషను పక్షమున చైనాదేశమునకు వెళ్ళిన భారత ప్రతినిధి వర్గములో చేరిన అఖిల భారత సహకారోద్యమము యొక్క ప్రధాన కార్యదర్శి, శ్రీ బి. జె. పటేలుగారును. బొంబాయి ప్రభుత్వపు సహకార సంఘముల రిజిస్ట్రారు శ్రీ ఎఫ్. ఎన్. రాజా, ఐ. ఎ. ఎస్., గారును సమష్టి వ్యవసాయ క్షేత్రములలో చైనా రైతులు బుద్ధిపూర్వకముగ చేరలేదని, బలవంతముచేతనే చేరినారని

సమష్టి వ్యవసాయ క్షేత్రముల ఖండనము

వ్రాసినారు. "భూసంస్కరణములను, పరస్పర సహాయక సంఘములను, వ్యవసాయోత్పత్తిదారుల సహాకార సంఘములను మెట్టుమెట్టుగ స్థాపించినప్పుడే, చైనా కమ్యూనిస్టు నాయకులు చైనాదేశములో కారల్ మార్క్సు సిద్ధాంతప్రకారము పూర్తిగ కమ్యూనిజమును స్థాపించి రైతుల యొక్క అన్ని సొంతభూములను లాగుకొని సమష్టి వ్యవసాయ క్షేత్రములుగ మార్చి చైనాలోని రైతులనందరిని ప్రభుత్వము క్రింద మజూరీకి పనిచేయు కూలివాండ్రుగ చేయుటకే నిశ్చయించి యుండిరి. రైతులు మొదటిదశలో తమకు కమ్యూనిస్టు నాయకులు రక్షకులని నమ్మి వారు చెప్పిన చొప్పున వ్యవసాయ ఉత్పత్తిదారుల సహాకార సంఘములలో అత్యుత్సాహముతో చేరిరి. అంతటితో రైతులను వదలిపెట్టిన ఎడల వారెంతో కృతజ్ఞతను కలిగియుండెడివారే కాని కమ్యూనిస్టు యంత్రాంగములో కార్మికులే— పారిశ్రామిక కార్మికులు గాని, వ్యవసాయ కార్మికులు గాని— నాయకత్వము వహించి నడుపుటకు నిజమైన అర్హత గలవారు. కమ్యూనిస్టు రాజ్యములో కార్మికుల పెత్తనమే యుండవలెను. వారే వర్గ పోరాటములో నాయకత్వము వహించెడివారు. రైతాంగము త్వరగ విప్లవములో చేరరు. అందువలన చైనా రైతులనందరిని కార్మికులుగ మార్చి ఎట్టి అడ్డులేకుండ పూర్తియైన కమ్యూనిస్టు సంఘమును చైనా దేశమునందంతటను స్థాపించుటకు చైనా కమ్యూనిస్టు నాయకులు నిశ్చయించినారు." అని వారు వ్రాసినారు. వారు తమతోకూడ ప్రతినిధివర్గ సభ్యులుగ వచ్చిన మిగిలిన వారితో నేకీభవించక ఇండియాలో సాము

దాయ (సమష్టి) వ్యవసాయ క్షేత్రములు ఏర్పాటను కూడ ప్రవేశపెట్టకుండ బహుజాగ్రత్త తీసుకొనవలెనని, వ్యవసాయోత్పత్తిదారుల సహకార సంఘములను స్థాపించుటలో ఎట్టి బలవంతము చేయకుండ కేవలము రైతుల ఒప్పుదలమీదను, ఉత్సాహాముమీదను మాత్రమే స్థాపించవలెనని కూడ వ్రాసియున్నారు. సమష్టి వ్యవసాయ క్షేత్రములవలననే చైనాలోని వ్యవసాయ సరకుల ఉత్పత్తి ఎక్కువగ జరిగినదనుటకు వారు ఒప్పుకొనుట లేదు. అధోగతిలోనున్న రైతులకు ప్రభుత్వము అనేక విధముల సహాయము చేసినందున అధికాహారోత్పత్తి జరిగినదని వారి యుద్దేశ్యము. కమ్యూనిస్టు లిచ్చెడి అంకెలను వారు శంకించుచున్నారు. "1950 నుంచి 1954 వరకు మొదటి పంచవర్ష ప్రణాళికలో ఇండియాలో నూటికి 37 వంతుల చొప్పున ఆహారధాన్య ఉత్పత్తి పెరిగినది. గాని చైనాలో 1952 మొదలు 1955 వరకు నూటికి 12 వంతుల చొప్పున మాత్రమే పెరిగినటుల తేలుచున్నది. చైనా రైతు ఇండియా రైతుకన్న ఎక్కువ సమర్థుడు, ఎక్కువ కష్టపడి పనిచేయువాడు అయ్యున్నాడు. అతనేవిధముగ కష్టపడుచున్నాడో మేము చూచియున్నాము. చైనాలో పశువులు లేనందున బండ్లను రైతులే మెళ్ళకొద్ది దూరము ఈడ్చుకొని పోవుచున్నారు. మాకు కనపడినంతవరకు చైనాలోని రైతుల జీవన ప్రమాణము చాల హీనముగ నున్నది. కాని క్రమముగ కొంతవరకు పెరుగు సూచనలు కనపడుచున్నవి. అతనికి దిన చర్యకు కావలసిన సరకులు బజారులలో దొరకుటలేదు. నీటి సప్లయికూడ అపరిశుద్ధముగ నున్నది. ఇండియాలోకంటె చైనా

రైతుయొక్క జీవన ప్రమాణము అన్ని విధముల ఎక్కువ లోపభూయిష్ఠముగ నున్నది. చైనాలో రోడ్లు తక్కువగ నున్నవి. పాఠశాలలకు భవనములులేవు. వైద్యశాలలు చాలతక్కువ. ఇండియాలోని కమ్యూనిటీ ప్రాజెక్టులు, జాతీయ వికాస కేంద్రములలో నున్న రైతులస్థితి చైనారైతుల స్థితికంటె బాగున్నది. గనుక ఇండియాదేశము చైనాను అనుకరించ నక్కరలేదు. రైతు కుటుంబముల యొక్క పొలములను లాగుకొనకూడదు. రైతులను ఒప్పించియే ఉత్పత్తిదారుల సహకార సంఘములను స్థాపించిన ఎడల మాకెట్టి యాక్షేపణ లేదు. రైతులకుండవలసిన భూములమీద సీలింగు అనగ గరిష్ఠప్రమాణము మరీ యెక్కువ గాకుండ మరీ తక్కువ గాకుండ నిర్ణయించవలెను. కౌలుదారుల చట్టమును మార్చవలసి యున్నది. రైతు ఉంచుకొన తగిన గరిష్ఠ పరిమాణమునకు మించిన భూమిని నష్టపరిహారమిచ్చి తీసుకొని భూములులేని వ్యవసాయకులకు పంచిపెట్టవలెను. వెంటనే రైతులకు సేవా సహకార సంఘములుపెట్టి చౌకవడ్డీకి ఋణములిచ్చి రైతుయొక్క ధాన్యమును ప్రభుత్వముకొని వ్యవసాయ అభివృద్ధిలో సర్వవిధముల తోడ్పడవలసి యున్నది. వ్యవసాయ ఉత్పత్తిదారుల సహకార సంఘములలో రైతులు చేరినఎడల వారికి లాభకరము. కమ్యూనిజము మిగుల అపాయకరమైనది. దానివైపుకు పోకుండ మన దేశమును కాపాడవలసి యున్నది" అని పటేలు రాణాగారలు వ్రాసినారు.

నవచైనాలో 1955 నుండియు పశువుల పెంపక కేంద్రములనుకూడ స్థాపించి పశువులను, మేకలను, గొ్రెలను,

వృద్ధిచేసిరి. వ్యవసాయమునకు, ఎరువులకు మాంసాహారమునకు ఇవి యుపయోగపడెను. తూర్పు మంగోలియా, జీహోలు, సింకియాంగు రాష్ట్రములలో పచ్చికబయళ్ళు చాల యున్నందున పశువులు చాల గలవు. వాటిని అభివృద్ధిచేసిరి. 1956 నుండియు ప్రజలు ఒత్తిడిగనున్న షాంటంగు హోపి హోనాన్ ప్రాంతములనుంచి జనసంఖ్య తక్కువగనున్న హావిన్‌కింగు రాష్ట్రమునకు రెండులక్షల అరవై కుటుంబములను తీసుకొనివెళ్ళి కాపురము పెట్టిరి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక పూర్తి అగులోపల ఆరాష్ట్రములో ఇరవైలక్షల యకరముల భూములను వ్యవసాయము క్రిందకుతెచ్చి ఎనిమిదిలక్షల కుటుంబములను ఆభూములలో నివాసము లేర్పరచునటుల నిర్ణయించబడినది. ఇటులనే ఇంకను జీహోలు, సింకియాంగు మొదలైన కొన్ని రాష్ట్రములలోకూడ జనయొత్తిడిగల రాష్ట్రములనుండి ప్రజలనుతెచ్చి ప్రవేశ పెట్టదలచినారు.

పశువుల వృద్ధి లక్షల కొలది ప్రజలను జనసమ్మర్ధములేని రాష్ట్రములలోకి తెచ్చి నివాసము లేర్పరచిరి

దేశములో వ్యవసాయమును పూర్తిగ యంత్ర సహాయముచేత జరుపుటకు ఇంకను ఇరవై అయిదేళ్ళవరకు పట్టునని మావోసిటంగు చెప్పినాడు. అయినను చైనాలో సమష్టి వ్యవసాయ క్షేత్ర స్థాపనవలన 1958 వ సంవత్సరమున 25 కోట్ల టన్నుల ధాన్యము పండెనని, గోధుమపంట ఎకరమునకు ఒకటిన్నర రెట్లు అయ్యెనని, ఈ ఉద్యమము పూర్తిగ జయమును పొందినదని పింగుచియా కుయో తన 'చైనా' అను గ్రంథములో వ్రాసినాడు.

## 2

1945 వ సంవత్సరములో చైనాదేశములో విదేశస్థులు పెట్టిన యావత్తు పెట్టుబడియొక్క మొత్తములో నూటికి 83 వంతులు జపానుదేశస్థులదై యుండెను. చైనాయొక్క పెద్ద పరిశ్రమలలో మూడింట రెండు వంతులను జపాను పారిశ్రామికులు నడుపుచుండిరి. జపాను వారు మంచూరియాలో ఎక్కువగ పెట్టుబడి పెట్టి పరిశ్రమలను సాగించిరి. జపానువారోడిపోయి లేచిపోగనే ఆ పారిశ్రామిక సామగ్రినంతను ఊడదీసి సోవియటు రుష్యావారు తమ దేశమునకు తరలించుకొనిపోయినారని ఇంతకుముందు తెలిపియున్నాము. మిగిలిన కొద్ది సామగ్రిమాత్రము చైనాకు సంక్రమించినది. దాని వలన కొంతవరకు మంచూరియాలో చైనాప్రభుత్వ యాజమాన్యమున పారిశ్రామికాభివృద్ధి కలుగుచున్నది. చైనాలో నాలుగు పెద్దకుటుంబములు నడుపుచున్న పరిశ్రమలను కమ్యూనిస్టు ప్రభుత్వ మేర్పడగనే స్వాధీనమును పొందినదని కూడ పైన తెలిపియున్నాము. ఇవి గొప్పవి కావు. చైనాయొక్క తూర్పు భాగముననున్న రేవు ప్రాంతములలోని పరిశ్రమలలో చాల భాగము జపాను సేనలచే నాశనము గావించబడినవి. అమెరికా వారు చైనాలో పెట్టిన పెట్టుబడిని కమ్యూనిస్టు చైనాప్రభుత్వము వారు ఘనీభవింపచేసి అమెరికాకు లాభములు రాకుండ చేసిరి. కొన్ని అమెరికా వర్తకసంఘములను చైనాప్రభుత్వము కొంచెముగ నష్టపరిహారమిచ్చి స్వాధీనపరచుకొనెను. ఇందువల్ల 1952

పారిశ్రామికరంగము

వరకు చైనాలోని అమెరికా వర్తక సంస్థలను, పారిశ్రామిక సంస్థలను పూర్తిగ మూసివేసి అమెరికావారు చైనాను వదలి పెట్టి లేచిపోయిరి. బ్రిటిషువారు మాత్రము 1949 నుండియు మూడు సంవత్సరములపాటు చైనాలో పరిశ్రమలను నడుపుటకు, వర్తక వ్యాపారములు చేయుటకు ప్రయత్నించిరి. కాని దినదినము బ్రిటిషువారియందు చైనాప్రభుత్వమునకు, చైనా ప్రజలకు గల ద్వేషము వృద్ధియై బ్రిటిషువారికి కష్టములు, చిక్కులు ఎక్కువగ కలుగుచు వచ్చినవి. చైనాలోని తమ వర్తక సంస్థలకు 1950 వ సంవత్సరములో ప్రతి నెల ఇంగ్లండు నుంచి హాంకాంగు నుంచి మూడు లక్షల డెబ్బది యైదు వేల సవరనులను దండుగ క్రింద పంపవలసి వచ్చినది. చైనాలోని బ్రిటిషు సంస్థల యొక్క భాగముల విలువ అతి త్వరితముగ పడి పోయెను. కావున బ్రిటిషు వర్తకము బ్రిటిషు వర్తక సంఘములు 1952 వ సంవత్సరము వేసంగి కాలమునకు పూర్తిగ చైనాలో నుంచి ఎత్తివేయబడెను. అంతటితో బ్రిటిషు వ్యాపారము చైనాతో ఏ మాత్రము లేకుండ పోయినది. ఇటుల విదేశస్థుల పెట్టుబడి, విదేశస్థుల పరిశ్రమలు, విదేశస్థుల వర్తక వ్యాపారములు చైనాతో 1952 వరకు సాంతముగ ఆగిపోయెను. ధనసహాయము, రుణసహాయము సాంకేతిక నిపుణుల ఇంజనీర్ల సహాయము, యంత్రములను పారిశ్రామిక సరుకులను సైనిక సామగ్రిని ఖరీదుకు సప్లయి చేయుటకు ముడిపదార్థములను కొనుటకు వర్తక వ్యాపార సహాయము, గావించుటకు సోవియటు రుష్యా మాత్రమే మిగిలెను.

పాశ్చాత్యులు లేచిపోయిరి

అన్ని విషయములలోను చైనా కేవలము రుష్యామీద ఆధార పడుచున్నది.

చైనాయొక్క పారిశ్రామికాభివృద్ధికి కొంత పెట్టుబడి కావలసియున్నందున చైనా వర్తకులను, పరిశ్రమదారులను కొంతకాలము చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము ప్రోత్సహించి తోడ్పడినది. చైనా వర్తకులకు నిరోధము లేమియు తాము కల్పించమని, వారితో దేశమునకు అవసరమున్నందున వారిని ప్రోత్సహించెదమని, మావోసిటుంగు, చూఏ మొదలైన వారు ప్రకటించిరి. చైనా స్వదేశ పరిశ్రమ లలో కార్మికులు సమ్మెలు కట్టకూడదని కూడ ప్రభుత్వము నిషే ధించినది. చైనా పారిశ్రామికులకును, కార్మికులకును తగాదాలు వచ్చినయెడల చైనా ప్రభుత్వోద్యోగస్థులు వాటిని పరిష్కరించు చుండిరి. 1951 వ సంవత్సరము డిశంబరు వరకు షాంఘాయి, టీన్‌ట్సిన్ పట్టణములలోని చైనా వర్తకుల పారిశ్రామిక సంస్థలు నూటికి ఇరువది ఏడు వంతున వృద్ధియయ్యెను.

స్వదేశ వర్తకులు

వారి పెట్టుబడి నూటికి డెబ్బదివంతులు వృద్ధియయ్యెను. ఇటులనే ముకడన్, పికింగు మొదలైన బస్తీలలో కూడ చైనా వర్తకుల పరిశ్రమలు, వ్యాపారము వృద్ధిచెందినవి. కమ్యూనిస్టు లకు భయపడి హాంకాంగు మొదలైన చోట్లకు పారిపోయిన చైనా పారిశ్రామికులు మరల చైనా దేశములో వచ్చిచేరి తమ పరిశ్రమలను, వర్తకమును వృద్ధిచేసుకొనసాగిరి. ఒక భాగ్యవంతు డైన చైనా వర్తకుడు అటుల మరలివచ్చి ఐదు బట్టలమిల్లులను, కొన్ని పిండి ఫాక్టరీలను నెలకొల్పెను. మరియొక చైనా వర్త

కుడు నిప్పుపెట్టెల, సిమెంటు, ఉన్ని పరిశ్రమలను వృద్ధిచేసెను. ఇటుల కమ్యూనిస్టు చైనాలో చైనా వర్తకులు కూడ లాభములను సంపాదించిరి. చైనా వర్తకుల జీవన విధానము కూడ ఎక్కువ భోగలాలసముగ నుండెను.

కాని 1951 వ సంవత్సరాంతమునకు చైనాలోని పరిశ్రమలను, వర్తకమును పూర్తిగ ప్రభుత్వము క్రిందికి తెచ్చుకొనవలెనను సంకల్పము కమ్యూనిస్టు నాయకులకు కలిగెను. అంతటినుండియు చైనా వర్తకులకును, పారిశ్రామికులకును వారు స్వతంత్రముగ నుండనేరరనియు, ప్రభుత్వముయొక్క ఏజంట్లుగా మాత్రమే పనిచేయవలసి యుండుననియు ప్రభుత్వ పక్షమువారిచేతను, కమ్యూనిస్టుపార్టీచేతను తెలుపబడెను. 1952 వ సంవత్సర ప్రారంభమున చైనా వర్తకులకు, పారిశ్రామికులకు వ్యతిరేకముగ ఊఫాను ఆందోళనము లేవదీయబడినది. వర్తకులలో, పారిశ్రామికులలో ప్రబలిన లంచగొండితనము, పన్నుల ఎగవేత, ప్రభుత్వమునకు రావలసిన ఆదాలను అపహరించుట, కార్మికులను మోసము చేయుట, ప్రభుత్వ సామానులను దొంగిలించుట, ప్రభుత్వ ఆర్థిక రహస్యములను బయలు పెట్టుట అను నేరములకు వర్తక పారిశ్రామిక సంఘములమీద చైనా ప్రభుత్వము బహిరంగవిచారణలు ప్రారంభించెను. నాలుగునెలలు తీవ్రముగ విచారణలు జరిగెను. యువజనులు, కార్మికులు, విద్యార్థులు "లంచగొండులైన బ్లాకు మార్కెటు దారులైన వర్తకులను శిక్షించండి, స్వార్థపరత్వమును రూపుమాపండి" అనే నినాదములతో, ఊరేగింపులను, ఉత్సవము

ఊఫాను తుఫాను

లను వీథులగుండ నడిపిరి. తప్పెటలు వాయించబడెను. వర్తకులు, పారిశ్రామికులువచ్చి తాముచేసిన నేరములను ఒప్పుకొనవలసినదని ప్రకటనలు చేయబడెను. అటుల ఒప్పుకొనువారికి శిక్షలు తేలికగ వేయబడుననియు, ఒప్పుకొనని వారికి ప్రజాకోర్టుల ఎదుట తీవ్ర మైన మరణదండన, దీర్ఘ కాలపు జెయిలుశిక్ష, ఇతరశిక్షలు వేయ బడుననియు నినాదములు చేయబడెను. చైనాలోని పికింగు, షాంగ్ హై, టీన్ట్సిన్, హాంకో, కాంటన్, ముక్డను మొదలైన తొమ్మిది పెద్దపట్టణములలో నాలుగులక్షల ఏబదివేల వర్తక సంస్థ లలో పై నేరములు జరిగెనని కనుగొనబడినది. పికింగు నగర ములో ఏబదివేల వర్తక సంస్థలలో నలుబదివేల సంస్థలు నేరము లను చేసిరి. కాంటన్ నగరములో నలుబదివేల రెండువందల ఇరువది యొక్క సంస్థలలో 34 వేల 590 సంస్థలు నేరములు చేసె నని కనుగొనబడినది. ఈ విధముగ వర్తకులలో ఎక్కువమంది నేరములు చేసినట్లు కనుగొనబడి విచారింపబడి శిక్షలు వేయబడెను. ఈ తుపానుకు భీతిచెంది చాలమంది వర్తకులు ఆత్మహత్య గావించుకొనిరి. చాలమంది వర్తకులమీద అత్యధికమైన జుల్మా నాలను విధించిరి. దానితో వారు దివాలాలు తీసిరి. ప్రభుత్వ మునకు విశేషమైన ద్రవ్యము లభించెను. ప్రభుత్వమునకు ఈ ఉద్యమమువలన 100 కోట్ల రూప్యములు లభించెనని అంచనా వేయబడినది. ఈ వర్తకులయొక్క ఆస్తులలో కొంతభాగము ప్రభుత్వము వశపరచుకొనెను. ఇంతేగాక మొదటినుండియు బూర్జువా ధనికులను వర్తకులను ప్రజాకోర్టులలో హత్యగావించి లేక దేశములోనుంచి వెళ్లగొట్టి వారి ఆస్తులను ప్రభుత్వము

స్వాధీనపర్చుకొనుటవల్ల షుమారు పదివేలకోట్ల రూప్యముల ఆస్తి లభించెనని అంచనా వేయబడినది.

ఈ ఊఫాన్ ఉద్యమము కేవలము ధనసంపాదనకొరకే అవలంబించబడలేదు. ఈ వర్తకులకు తమ యునికి ఖాయమైనది కాదని, తాము కొద్ది రోజులలోనే మాయమై పోయేవారేనని,

ప్రభుత్వ కంట్రాక్టరులుగ మారిరి

ఏమైన పర్తకము వ్యాపారములు చేసుకునే యెడల వాటిని కేవలము ప్రభుత్వముక్రిందనే చేసుకొనవలసి యుండుననియు తెలుపుటకే యుద్దేశింపబడినది. వెంటనే చైనా పరిశ్రమలలో ఉత్పత్తి పడిపోయెను. అప్పుడు ప్రభుత్వమువారు ఆ ఉద్యమమును మాను కొని వర్తకుల నందరిని అప్పటినుంచి ప్రభుత్వ కంట్రాక్టరులుగ పని చేయవలెనని అజ్ఞాపించిరి. ప్రభుత్వమునకు కావలసిన వస్తువులను మాత్రము తయారు చేయవలెను. తయారుచేయు వస్తువులన్నిటిని ప్రభుత్వమునకే అమ్మవలెను. ప్రభుత్వము ద్వారానే ముడిపదార్థములను పొందవలెను. చైనాలోని వర్తకులందరు, పారిశ్రామికులందరు గవర్నమెంటుయొక్క కంట్రాక్టులైరి. కాని వీటివలన వర్తకులకు, పారిశ్రామికులకు నిరుత్సాహము కలిగెను. చాలమంది తమ వద్దనున్న మూలధనముతో పర్తక వ్యాపారములు గాని పరిశ్రమలు గాని సాగించకుండా దాచుకొనిరి. కొంతమంది మాత్రమే ప్రభుత్వము యొక్క ఏజెంట్లుగ పనిచేయసాగిరి.

తరువాత ప్రభుత్వము మరియొక మెట్టునకు పోయెను. ప్రభుత్వముయొక్క పెట్టుబడితో వర్తకుల పెట్టుబడి కలిపి సమష్టి

పరిశ్రమలను స్థాపించసాగిరి. యాజమాన్యము ప్రభుత్వమునకే చెందినది. వర్తకులకు యాజమాన్యములో కొద్ది భాగము మాత్రముండెను. వచ్చిన లాభములో చాలభాగము ప్రభుత్వము తమ పరిశ్రమలలో పెట్టుబడిక్రింద నుపయోగించగ మిగిలిన దానిలో వర్తకులకు పెట్టుబడి పెట్టిన దానికి భాగమిచ్చెదరు. ఈ విధముగ ప్రభుత్వము యొక్క వర్తకుల యొక్క సమిష్టి పారిశ్రామిక సంస్థలను దేశములోని చాల భాగములలో నెలకొల్పిరి. అంతటినుంచి

**ప్రభుత్వపు వర్తకుల సమిష్టి పరిశ్రమలు**

ఏటేటా ప్రభుత్వ పరిశ్రమలు వృద్ధిచేయబడెను. 1957 వ సంవత్సరమునాటికి దేశములో నూటికి 92 పంతులు సమష్టి పరిశ్రమలుగ మారెను. కాని చైనా పరిశ్రమలలో వర్తకుల పెట్టుబడి అత్యంత స్వల్పముగ నున్నది. పెద్ద వర్తకులు నాశనము గావించబడినారు. చిన్న వర్తకులు నిరుత్సాహపడినారు. కావున చైనాపరిశ్రమాభివృద్ధిలో అత్యంత భాగము వ్యవసాయరంగములో ప్రభుత్వమునకు వచ్చు ఆదాయమునుండియే పెట్టుబడి పెట్టినారు. అట్టి ఆదాయము ఎక్కువగ వచ్చుటకే సమష్టివ్యవసాయ క్షేత్రములను, వాటికి పిమ్మట కమ్యూనులను (Communes) నెలకొల్పినారు. ఇట్టి ఆదాతో ప్రభుత్వము 1953 నుండి 1957 వరకు ప్రథమ పంచవర్ష ప్రణాళికను జయప్రదముగ సాగించినది. ప్రథమ పంచవర్ష ప్రణాళిక క్రింద ప్రభుత్వమువారు 1400 కోట్ల రూప్యములను ఖర్చుచేసి తాము వేసుకున్న పారిశ్రామికాభివృద్ధి అంచనాలను సాధించినటుల తెలియుచున్నది. కొన్ని వస్తువుల యుత్పత్తిలో అంచనాకంటె యెక్కువైనను కొన్నిటిలో

తక్కువైనను మొత్తముమీద అంచనాలు జయప్రదముగనే నెర వేరినటులు చెప్పబడుచున్నది. 1958 నుండి 1962 వరకు మరల ద్వితీయ పంచవర్ష ప్రణాళికను ప్రభుత్వమువారు సాగించు చున్నారు. దీని జయముకొరకు 1958 నుండి దేశమందంతటను కమ్యూనులను (Communes) స్థాపించసాగినారు. ఇండియా దేశములో ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలములో (1951-56) 3360 కోట్ల రూప్యములను, ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాల మైన 1956-61 లో 6750 కోట్ల రూప్యములను ఖర్చుచేసి జయ ప్రదముగ సాగినినాడు చైనాదేశము ఇండియాతోపాటు ఖర్చు చేయలేకపోయినది.

## 3

"చైనాదేశపు మొదటి పంచవర్ష ప్రణాళిక 1953 నుండి 57 వరకు జరిగెను. ఇండియాయొక్క ద్వితీయ పంచవర్ష ప్రణా ళిక 1955 వ సంవత్సరమునుండి 1960 వ సంవత్సరము వరకు జరిగెను. ఇండియాలో 1955వ సంవత్సరములో ఉక్కు పదమూడు లక్షల టన్నులు ఉత్పత్తికాగ, 1960 వ సంవత్సరము నాటికి 46 లక్షల ఎనుబదివేల టన్నులవరకు ఉత్పత్తివృద్ధిచెందెను. చైనాలో 1952 వ సంవత్సరమున 13 లక్షల టన్నుల ఉక్కు ఉత్పత్తి చేయ బడగ, 1957 వ సంవత్సరమునకు 41 లక్షల టన్నులకు వృద్ధియైన దని చెప్పబడుచున్నది. రాక్షసిబొగ్గు విషయములో ఇండియాలో 1955 వసం.రలో 3 కోట్ల 80 లక్షల టన్నులు ఉత్పత్తియయ్యెను. 1960 వ సంవత్సరమునాటికి ఆరుకోట్ల టన్నులకు వృద్ధిచెందెను.

చైనాలో 1952 వ సంవత్సరంలో 6 కోట్ల 35 లక్షల టన్నులు ఉత్పత్తియయ్యెను. 1957 వ సంవత్సరమునకు 11 కోట్ల 30 లక్షల టన్నులు ఉత్పత్తి యయ్యెను. విద్యుచ్ఛక్తి విషయములో ఇండియాలో 1955 వ సంవత్సరములో 11 వందల కోట్లకిలోవాట్లు ఉత్పత్తియయ్యెను. 1960 వ సంవత్సరములో 22 వందలకోట్లకు వృద్ధియయ్యెను. చైనాలో విద్యుచ్ఛక్తి 1952 వ సంవత్సరములో 726 కోట్లకిలోవాట్లు ఉత్పత్తియయ్యెను. 1957 వ సంవత్సరములో 1590 కోట్లకిలోవాట్లకు వృద్ధియయ్యెను. సిమెంటు ఇండియాలో 1955 వ సంవత్సరములో 42 లక్షల 80 వేల టన్నులు ఉత్పత్తి యయ్యెను. 1960 నాటికి ఒకకోటి 30 లక్షల టన్నులవరకు పెరిగెను. చైనాలో 1952 వ సంవత్సరములో 29 లక్షలటన్నుల సిమెంటు ఉత్పత్తియయ్యెను. 1957 వ సంవత్సరములో 60 లక్షల టన్నుల సిమెంటు ఉత్పత్తియయ్యెను. అందువల్ల చైనాలో పారిశ్రామిక కమ్యూనిస్టు నాగరికత నిర్మించవలెనని ఎక్కువ ఆందోళనము జరిగినను ఇండియాకంటె ఎక్కువ ఉత్పత్తి పారిశ్రామిక విధానములో జరుగలేదని స్పష్టపడుచున్నది. కాని ఇండియాకు విదేశ పెట్టుబడులు స్వదేశవర్తకుల పెట్టుబడులు ఎక్కువగ లభించుచున్నవి. చైనాకు విదేశ స్వదేశ పెట్టుబడులు చాల తక్కువగ నున్నందున వ్యవసాయ రంగములో ప్రజలు కష్టపడి పనిచేసి సంపాదించిన అధికోత్పత్తి నుండియే పరిశ్రమలకోసము చైనాదేశము పారిశ్రామికాభివృద్ధికి వినియోగించవలసి వచ్చుచున్నది. చైనా ప్రభుత్వ అంకెలప్రకారము

ఇండియాలోనే పంచవర్ష ప్రణాళికల జయమెక్కువగ నున్నది

జాతీయ ఆదాయములో నూటికి 18 వంతులు పరిశ్రమల కొరకు 1953 వ సంవత్సరములో వినియోగింప బడుచుండగ 1956 వ సంవత్సరములో నూటికి 22½ వంతుల చొప్పున వినియోగింప బడినది. కాని మావోసిటంగు ప్రభుత్వము పెద్ద పరిశ్రమల కోసరము చిన్న పరిశ్రమలకన్న ఎక్కువ ఖర్చుపెట్టుచున్నది. ఎందువల్లననగ యంత్రనుులు తయారుచేయుటకు పెద్దపరిశ్రమలు స్థాపింపబడవలసియున్నది. అంతేగాక చైనా పారిశ్రామిక విధానములో ఒక గొప్పలోపము కనబడుచున్నది. యుద్ధ పరికరములను తయారు చేయుటకు మిగతా అన్ని దేశములకంటె చైనా ప్రభుత్వము ఎక్కువగ ఖర్చుపెట్టుచున్నది" అని గ్లాకు సైన్ తన 'మావోయొక్క చైనా' అను గ్రంథములో వ్రాసినాడు.

పరిశ్రమలను నడుపు యంత్రములు దేశములో తయారు చేసిన గాని గొప్ప పారిశ్రామికాభివృద్ధిలో గొప్ప దేశములతో సరితూగజాలరు. అచిరకాలములో ఇంగ్లాండును మించవలెనని చైనా కమ్యూనిస్టు నాయకుల ఆశయము. గాని యంత్రములు అధికముగ చైనాలో తయారు చేసినను వాటికి పనిలేకుండ పోవుట తటస్థించినది. ఫాక్టరీలుకట్టుటకు తగినంత మూలధనము, అవసరమైన ముడి పదార్థములు లేక యంత్రముల నుపయోగించలేక పోయినారు. అంతేగాక ఈ పెద్దపరిశ్రమల స్థాపనలో చిన్న పరిశ్రమలను విడిచిపెట్టుటవలన ప్రజలకు కావలసిన నిత్య జీవితావసర పదార్థము ఉత్పత్తి గాక ప్రజలు చాల బాధలను పొందిరి. గావున కొంత యెక్కువగ చిన్నపరిశ్రమల స్థాపనవైపుకు ప్రభుత్వము మొగ్గవలసి వచ్చినది. చైనాలో ప్రజల జీవితావసర

వస్తువులను తయారుచేయు చిన్న పరిశ్రమలలో ఎక్కువఖర్చు పెట్టవలెనను ఆలోచన 1956 వ సంవత్సరములో కలిగినది. అది వరకు పారిశ్రామికాభివృద్ధిలో నూటికి 11 వంతులు మాత్రమే చిన్నపరిశ్రమలకు ఖర్చుపెట్టబడుచుండగ అంతటినుంచి నూటికి పన్నెండున్నర వంతున ఖర్చుపెట్టుటకు నిశ్చయింపబడినది. 1956 వ సంవత్సరము నుండియు చేతిపరిశ్రమలకు ప్రాముఖ్యమునిచ్చి ఆ సంవత్సరములో ఏబదిలక్షల సభ్యులతో ఒకలక్ష చేతిపనుల సహకార సంఘములను స్థాపించినారు. అవి యింకను పిమ్మట వృద్ధి అయినవి. ఈ మార్పును సమర్థించుచు పీపుల్స్ డెయిలీ పత్రిక ఇటుల వ్రాసినది.—"మన ప్రజాసంఖ్యనుబట్టి ఇతరదేశములలో ఖర్చుపెట్టుచున్న దానికంటె మనము చిన్నపరిశ్రమలకు తక్కువ ఖర్చుపెట్టుచున్నాము. ఉదాహరణముగ బట్టలపరిశ్రమ తీసుకొనిన యెడల ఈ రోజున సోవియటు రుష్యాతో తులదూగవలెననిన మన బట్టలయంత్రశాలలలో పెట్టుబడి పెట్టుచున్న మూలధనము నాలుగు రెట్లకు పెంచవలసి యుండును. మనము నేటి ఇండియాతో సరితూగవలెననిన కూడ పెట్టుబడిని రెండు రెట్లకంటె ఎక్కువగ పెట్టవలసియున్నది. మన ఉన్ని, జనపనార, పట్టు ఫ్యాక్టరీలలోని పెట్టుబడి నాలుగు సంవత్సరములక్రింద నున్న ఇండియాలోనున్న పెట్టుబడితో సరితూగవలెననిన మూడు రెట్లకు వృద్ధిచేయవలసి యున్న"దని వ్రాసెను. ఇండియాయొక్క ద్వితీయ పంచవర్ష ప్రణాళికను, చైనాయొక్క మొదటి పంచవర్ష ప్రణాళికతో పోల్చుటకు కారణమేమనగ ఇండియా ప్రజారాజ్యమైనను చైనా కమ్యూనిస్టు దేశమైనను పంచవర్ష ప్రణాళి

కలు ఒకే పునాదులమీద తయారుచేయబడినవి. కాని వాటిని అమలుజరిపి ఫలితమును పొందు పద్ధతులలో రెండు దేశముల లోను చాల వ్యత్యాసము కలదు.

(1) ఇండియాయొక్క మూలధనపు పెట్టుబడి, జాతీయాదాయము చైనాలోకంటె నెక్కువగనున్నది. (2) ఇండియా చైనాకంటె ఎక్కువగ విదేశముల ఆర్థిక సహాయమును పొందుచున్నది. ఇంకను ఎక్కువగ విదేశములవద్దనుంచి సహాయమును పొందగలుగుదునని ఆశించుచున్నది. 1951 మార్చి మొదలు 1956 వ సంవత్సరము జనవరి వరకు గల మధ్యభాగములో అనగ ఇండియాయొక్క మొదటి పంచవర్ష ప్రణాళిక కాలములో ఇండియాకు 306 కోట్ల రూప్యముల విదేశ ఆర్థిక సహాయము వచ్చినది. ఇంతేకాక అమెరికా సంయుక్త రాష్ట్రములనుండి 95 కోట్ల రూప్యముల విలువగల గోధుమ ఋణము కూడ లభించినది. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో 1960 వరకు 11 వందల కోట్ల రూప్యములు విదేశములనుండి ఇండియాకు లభించునని అంచనావేయబడినది. (3) చైనాలో వలెగాక ఇండియాలో వర్తకులు పెట్టుబడిపెట్టి పరిశ్రమలు నడుపు పద్ధతి ఉన్నది. వర్తకుల మూలధనమును ప్రభుత్వము వశపరచుకొనుటలేదు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో పరిశ్రమలకు పెట్టబడిన మూలధనములో నూటికి 61 వంతులు వర్తకులే స్వంతముగ పెట్టుబడి పెట్టినారు. నూటికి 39 వంతులు మాత్రమే ప్రభుత్వము పెట్టుబడిపెట్టి ప్రభుత్వ పరిశ్రమలను నడుపుచున్నది. (4) ఇండియాలో సమిష్టి

ఇండియాకు గల లాభములు

వ్యవసాయ క్షేత్రములను స్థాపించుటలేదు. వ్యవసాయ ఉత్పత్తి దారుల సహకార సంఘములు రైతుల ఒప్పుదలమీదనే స్థాపించుచున్నారు. వాటికి ప్రోత్సాహ మివ్వబడుచున్నది. (5) ఇండియాలో బలవంతపెట్టి రైతులచేత కూలిపని చేయించుటలేదు. (6) ఇండియాలో చైనాలోవలె కాక చేతి పరిశ్రమలకు ఎక్కువ ప్రాధాన్య మివ్వబడుచున్నది. అందువల్లనే గ్రామములలో నిరుద్యోగ సమస్య పరిష్కారమగునని ఎంచబడుచున్నది. చేతి పరిశ్రమలవలన తయారు చేయబడిన వస్తువులకు ప్రభుత్వ సహాయము లభించుటయేకాక యంత్రములమీద తయారుచేయబడిన వస్తువులమీద సుంకము కూడ విధింపబడుచున్నది. ఇవన్నియు చైనాతో పోల్చిచూచినయెడల ఇండియాకుగల లాభములుగ కనుపించగలవు. అందువల్ల ప్రజారాజ్యముగల ఇండియాలో పారిశ్రామికాభివృద్ధి బాగుగ జరుగుచున్నది. ఏ విధముగను కమ్యూనిస్టు చైనాకంటె తక్కువగలేదు. రైలువేల విషయములో ఇండియాకంటె చైనా చాల వెనుకబడియున్నది. చైనాయొక్క పంచవర్ష ప్రణాళికలలో రైలువేలను వృద్ధి చేయుటకు ఖర్చుపెడుతున్న సొమ్ము చాలినంతగ లేదు. నాలుగు సంవత్సరములలో 2867 మైళ్ళ రైలుమార్గములను మాత్రమే నిర్మించగలిగిరి. ప్రస్తుతము ఉన్న పద్ధతిని రైలువేలు వృద్ధిచేయబడిన యెడల ఇండియాతో సమానమగుటకు అనేక పంచవర్ష ప్రణాళికలు కావలసియుండును. చైనాకు పెట్టుబడి పెట్టు దేశము రుష్యా ఒకటే. 1950 వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో మావోసిటంగు మాస్కో వెళ్లినప్పుడు 30 కోట్ల డాలర్ల ఋణమును రుష్యా దేశము

మంజూరు చేసినది. 1954 వ సంవత్సరము అక్టోబరునెలలో మరల 13 కోట్ల డాలర్ల ఋణమునుసోవియటు రుష్యా చైనా ప్రభుత్వమునకిచ్చెను. 1953 వ సంవత్సరము సెప్టెంబరులో చైనా నుంచి ధాన్యము, లోహములు, పొగాకు, మొదలైన ముడి పదార్థములను రుష్యాకు సప్లయిచేయు షరతుతో చైనాలో 141 పారిశ్రామిక యంత్ర శాలలను నిర్మించుటకు రుష్యా ఒప్పుకొన్నది. మరల 1956 వ సంవత్సరము ఏప్రిలు నెలలో 55 యంత్రశాలలకు కావలసిన సామగ్రిని, ఆర్థిక నిపుణులను పంపి చైనాకు 62 కోట్ల డాలర్లను ఖర్చుపెట్టి నిర్మించుటకు రుష్యా ఒప్పుకొన్నది. ఇందులో చాలభాగము ఋణము క్రిందనే ఇవ్వబడినది. ఇంతేకాక చైనాలో రుష్యా-చైనా సమిష్టి పరిశ్రమలు కూడ కొన్ని స్థాపింపబడినవి కాని అవి నాలుగు సంవత్సరములు సాగి మూసివేయబడినవి. వీటిలో రుష్యాయొక్క పెట్టుబడి భాగమును ముడిపదార్థముల రూపముగ కొన్ని సంవత్సరములలో రుష్యాకు చెల్లించుటకు చైనా ఒప్పుకొన్నది. చైనాలో నుంచబడిన రుష్యా నిపుణులకు చైనాయే జీతము లిచ్చుచున్నది. ఇంతేకాకుండా రుష్యా విశ్వవిద్యాలయములలో వేలకొద్ది చైనా విద్యార్థులకు, విద్యార్థినులకు విద్యనిచ్చుటకు రుష్యా అంగీకరించినది. చైనాకు రుష్యాతోనే వ్యాపారముకలదు. 1954 వ సంవత్సరములో చైనాకు వచ్చుచున్న దిగుమతులలో నూటికి 80కి పంతులు రుష్యానుంచే వచ్చినవి. మిగిలినవి తూర్పు యూరపు ఖండములోనున్న కమ్యూనిస్టు దేశములనుండి వచ్చినవి. మొత్తముమీద చైనాయొక్క విదేశ వ్యాపారము చైనాప్రజల రిపబ్లికు ఏర్పడినప్పటినుంచి

పెరిగినప్పటికిని తక్కిన దేశములతో పోల్చి చూచినయెడల చాలతక్కువగా నున్నది. అమెరికా సంయుక్త రాష్ట్రముల జన సంఖ్యలో తలకు 163 డాలర్లు చొప్పున విదేశవ్యాపారము జరుగు చున్నది. పశ్చిమజర్మనీలో తలకు 138 డాలర్లుచొప్పున, జపానులో 39 డాలర్లు చొప్పున, ఇండియాలో 11½ డాలర్లు చొప్పున విదేశ వర్తకము జరుగుచుండగ, 1955 వ సంవత్సరములో చైనాకు తలకు 6 డాలర్లు చొప్పున మాత్రమే విదేశవర్తకము జరిగినది. చైనాలో తగువైన పారిశ్రామిక యుత్పత్తి, తగువైన విదేశ ఆర్థిక సహాయము లేకుండుటచేత చైనా కమ్యూనిస్టు నాయ కులు త్వరితముగ తమదేశమును పారిశ్రామిక దేశముగ చేయు టకు రైతులమీద ఎక్కువ వత్తిడి కలుగచేసి వ్యవసాయ రంగ ములో నుత్పత్తియయ్యెడు దానిలో విశేషభాగము పారిశ్రామి కాభివృద్ధికై వినియోగించుట తప్పనిసరి యగుచున్నది" అని కూడ గ్లాకుస్టైను తన గ్రంథములో వ్రాసినాడు.

కమ్యూనిస్టు నాయకులచేత "చైనా పునర్నిర్మాణము" అను పత్రికలలో వ్రాయబడిన వ్యాసములో 1953–57 ప్రథమ పంచవర్ష ప్రణాళిక ఫలితముగ చైనాలో 1957 నాటికి నూలు వస్త్రములు 720 కోట్ల గజములు, విద్యుచ్ఛక్తి 1,800 కోట్ల కిలో వాట్లు, సిమెంటు 76 లక్షల టన్నులు, రాతిసి బొగ్గు 12 కోట్ల టన్నులు, ఉక్కు 33 లక్షల టన్నులు, పంచదార 8 లక్షల టన్నులు, కాగితము 8 లక్షల టన్నులు, ధాన్యము 18 కోట్ల టన్నులు ఉత్పత్తియయ్యెనని తెలుపబడినది. చైనా అంకెలు ఏవి నిజమో తెలుసుకొనుట కష్టమైన విషయము. మరల 1958–62

వరకు జరుగవలసిన ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలములో వీటి నన్నిటిని రెండు రెట్లుగ యుత్పత్తి చేయుటకు కృషిసలుప నిశ్చ యించినారని చెప్పబడుచున్నది. ఇటీవల జరిగిన భూగర్భ పరిశోధన ముల ఫలితముగ మంచూరియాలో రాతిసిబొగ్గు గనులు, ఇనుప గనులు, సింకియాంగులో నూనెగనులు కనుగొనబడినవి. త్రవ్వ కపువని మాత్రమిప్పుడిపుడే కొద్దిగ ప్రారంభమగుచున్నది. అవసర మైన మూలధనము యంత్రములు ఇంకనులేవు. వీటిని త్రవ్వి యుపయోగించినచో చైనాదేశము రాతిసిబొగ్గు యుత్పత్తిలో ప్రపంచములో మూడవ దేశముగను, ఇనుముయొక్క యుత్ప త్తిలో ఏడవ దేశముగను విలసిల్లుటకు అవకాశము గలదు. తూర్పు మంగోలియాలో ఇనుప పరిశ్రమలను స్థాపించ యత్నించు చున్నారు. చైనాలో పశ్చిమోత్తర ప్రాంతము చాలా పెద్దది. జనాభా చాలతక్కువ. అక్కడ వ్యవసాయ వ్యాపకముకన్న పారిశ్రామికాభివృద్ధి కెక్కువ అవకాశము కలదు. అచటికి రైలు వేలు వేయవలసి యున్నది. గనులు త్రవ్వవలసియున్నది. పరిశ్ర మలు స్థాపించవలసి యున్నది. జనసమ్మర్దముగల రాష్ట్రముల నుండి ప్రజలను బలవంతపెట్టి తీసుకొనిపోయి అచట కాపురముంచ కుంచవలసియున్నది. దీనికొరకు ఎంతో ఎక్కువగ పెట్టుబడి కావలసియున్నది. ఇది చాల కాలము పట్టును. మొత్తముమీద చైనాప్రజాస్వామికములో పశ్చిమోత్తరభాగము, ఉత్తరభాగము పరిశ్రమలకు చాలా అనుకూలమనియు, తూర్పుభాగము ఆగ్నేయభాగము వ్యవసాయభివృద్ధికి చాల అనుకూలమనియు తలచబడుచున్నది. చైనాప్రభుత్వ పక్షమున వేయబడిన అంచనా

లలో మూడవ పంచవర్ష ప్రణాళిక ముగియునప్పటికి చైనా దేశము పారిశ్రామికాభివృద్ధిలో మొదటితరగతి రాజ్యమగుటకు పునాదులు పడుననియు నలుబది సంవత్సరములలో గాని పూర్తియైన పారిశ్రామికాభివృద్ధి జరగదనియు భావించినారు.

పారిశ్రామికాభివృద్ధి త్వరితముగ జరుగుటకు సోవియటు రుష్యా నుండి ఇంజనీర్లను ఇతర నిపుణులను తెచ్చుకొని, వారిచేత చైనాలో పరిశ్రమలు, వ్యవసాయము, వర్తకము, బ్యాంకింగులకు

కమ్యూనిస్టు సమాజ స్థాపన దృష్ట్యా పారిశ్రామికాభివృద్ధి తీవ్రతరము గావింప బడుచున్నది

తగిన యాజమాన్యము వహించగల నిపుణులను తయారు చేయించుచున్నారు. చైనా ప్లానింగు కమిషన్ యొక్క అధ్యక్షుడైన లిఫూచంగు ఇటుల చెప్పియున్నాడు: "మనయొక్క శాస్త్ర విజ్ఞాన సాంకేతిక నిపుణులలో సరియైన రాజకీయ విజ్ఞానము కావలెను. తమ పనిని విప్లవ దృష్టితోను దేశముయొక్క అవసరములను గుర్తించియు, కష్టములకోర్చి త్యాగములు చేయుటకు సిద్ధపడి పనిచేయు వారినే మనము మన వివిధరంగములలో ఉపయోగించుకొనవలెను. వట్టి ఉద్యోగ వాంఛతో మాత్రము వచ్చేవారివల్ల మనకు తగిన ప్రయోజన ముండదు. అందువల్ల మార్క్సిజము, లెనినిజము, వారిలో ప్రతివారికి నేర్పవలసి యున్నది. వారందరిలోను దేశములో కమ్యూనిస్టు సమాజమును స్థాపించుట కొరకే పారిశ్రామికాభివృద్ధి త్వరితముగ జరుగుచున్నదను భావమును, ఉత్సాహమును కలుగచేయవలసి యున్నది." చైనాలో సాంకేతిక విద్యనిచ్చు ప్రతిష్ఠాపనలలోను, విశ్వవిద్యాలయములలోను కూడ కమ్యూనిస్టు విప్లవ భావము దృఢముగ

నెలకొల్పబడుచున్నది. అదివరకు విప్లవ కాలములో త్యాగములు చేసి కష్టపడిన వారికి యుద్యోగములలో ప్రాధాన్య మివ్వబడు చున్నది. వారు అవసరమైన శిక్షణమును పొంది తగిన స్థానము లలో నియమింపబడు చున్నారు. వారందరికి మార్క్సిజము, లెనినిజముకూడ బాగుగ నేర్పబడుచున్నది. 1951 అక్టోబరు నుండి 1952 అక్టోబరు వరకు 54 వేలమంది స్త్రీ పురుషులను అదివరకు విప్లవ విజయము కొరకు తీవ్రముగ పనిచేసిన వారిని పారిశ్రామిక రంగములోనికి మార్చి బాధ్యతగల ఉద్యోగములలో నియమించి నారు. పురుషులతోపాటు స్త్రీలకు కూడ తగిన స్థానమివ్వబడు చున్నది. టీన్‌ట్సిను నగరమునకు ముప్పదిమైళ్ళ దూరముననున్న క్రొత్త సముద్ర రేవు యొక్క నిర్మాణములో డిప్యూటీ అధ్యక్షుడుగ నున్నవారు గొరిల్లా యుద్ధములలో తీవ్రముగ పనిచేసినవారై యున్నారు. ముప్పదిసంవత్సరముల వయస్సుగల స్వతంత్ర పోరాటములో పనిచేసియున్న ఒక స్త్రీ, ముకడను నగరములోని న్యూమేటిక్ పనిముట్లు తయారుచేయు కంపెనీకి డైరెక్టరుగ నియమింపబడ్డది. చెంచో వస్త్రముల ఫ్యాక్టరీ 1954లో పూర్తియైనపుడు హోనాను రాష్ట్రములో గొరిల్లా యుద్ధములో తీవ్రముగ పనిచేసిన ఆయనను దానికి డైరెక్టరుగ నియమించినారు. ఇటుల పెక్కు ఉదాహరణములు చూప వచ్చును.

ఆర్థిక పునర్నిర్మాణములో చైనా ప్రభుత్వము 1949 మొదలు 1955 వరకు 6 సంవత్సరములలో మొత్తము 5,227 కోట్ల యువనులను అనగ 105 వందలకోట్ల రూప్యములను ఖర్చుపెట్టిన

దని అనగ సాలుఒకటింటికి సగటున 1,750 కోట్ల రూప్యములను ఖర్చుపెట్టినదని గ్యాన్‌చందుగారు తన "చైనాలోని క్రొత్త ఆర్థికము" అను గ్రంథములో వ్రాసియున్నారు. పరిశ్రమలు, రాకపోకల సాధనములు మాత్రమేగాక విద్య, ఆరోగ్యము, సాంఘిక సౌకర్యములు మొదలగు వాటికిచేసిన వ్యయముకూడ ఇందులో చేరియున్నది. పింగు చియాకుయో తన "చైనా నవయుగము" అను గ్రంథములో 1953 మొదలు 1957 వరకు జరిగిన ప్రథమ పంచవర్ష ప్రణాళికక్రింద 140 పందలకోట్ల రూప్యములను ఖర్చు చేసినారనియు, అందులో పదిపందల కోట్లు మాత్రము సోవియటు రుష్యానుంచి వచ్చినదనియు మిగిలిన 130 పందలకోట్ల రూప్యములను చైనాప్రభుత్వము తమ ఆదాయనుంచి స్వంతముగ మిగుల్చుకొనిన దానినుండియే ఖర్చుపెట్టినారనియు వ్రాసినాడు. వర్తక వ్యాపారమంతయు ప్రభుత్వము క్రిందనే యున్నది. దేశములో ప్రతిచోటను ప్రజలకు కావలసిన అన్ని విధములైన సామగ్రిని అమ్ముటకు సహకార విక్రయ శాలలను లక్షలకొలది స్థాపించినారు. ప్రజలు అమ్మేవాటిని కొనుటకు ప్రభుత్వ పక్షమున కొనుగోలుచేయు శాఖలను స్థాపించియున్నారు. ఈరెండు రకములైన శాలలలో ఖరీదులను ప్రభుత్వమువారే ప్రభుత్వ అవసరములనుబట్టి ఎప్పటికప్పుడు నిర్ణయించెదరు.

ఇంతపెద్ద మొత్తములను ఖర్చు పెట్టుటకు అన్నిటికంటె దేశములో వ్యవసాయ రంగములో మిగిలినద్రవ్యమే ఎక్కువ ఉపయోగపడుచున్నది. నిరంతర రేడియో ప్రచారము

వలనను; కమ్యూనిస్టు కార్యకర్తల ప్రచారము వలనను, వ్యవసాయకులు, ఇతర ప్రజలు దేశపు శాశ్వతాభివృద్ధికై ప్రస్తుత కాలమున తమ జీవిత వ్యయమును మిగుల పొదుపుగ గావించు కొనవలెనని ప్రబోధము చేయబడుచున్నది. ఇట్టి పొదుపుకొరకు స్త్రీపురుషులకు, బాలబాలికలకు అందరికి ఒకేవిధమైన నీలివర్ణపు లాగు, బొత్తములుగల నీలివర్ణపు కోటు, కాలరు దుస్తులుగ విధించగ అందరును అట్టి దుస్తులనే విధిగా ధరించుచున్నారు. ఇవియే మావోసెటంగు ధరించే దుస్తులట. ఈ దుస్తులవల్ల స్త్రీలకు, పురుషులకు దగ్గరగ వెళ్ళి మాట్లాడునంతవరకు భేదా కనపడదు. ఇటీవల స్త్రీల లావణ్యమును కనపరచుటకై వివిధ రంగుల దుస్తులను వేసుకొనుటకు స్త్రీలకు అనుమతి నిచ్చినారని తెలియుచున్నది. చైనా కమ్యూనిస్టు రాజ్యమునందంతటను అత్యంత క్రమశిక్షణక్రింద నొక నీలివర్ణపుజాతి యుద్భవించినది. తెల్లవారగే సరికి నీలివర్ణపు దుస్తులను ధరించిన పురుషులు, స్త్రీలు బారులు తీర్చి ఎర్రజండాలు ఎగురుచుండగ కమ్యూనిస్టు భావోద్రేక నినాదములతో వందలకొలది కాదు, వేలకొలది నడచి ప్రభుత్వ పొలములకు, పారిశ్రామికాలయములకు పోయి కష్టపడి పని చేయుచున్నారు.

నీలిరంగు దుస్తులు. అత్యంత క్రమ శిక్షణము

ప్రపంచములోకెల్ల పెద్దదైన కమ్యూనిస్టు పార్టీ చైనాలో నున్నది. 1956వ సంవత్సరము జూన్ నెలలో చైనా కమ్యూనిస్టు పార్టీలో ఒక కోటి ఏడు లక్షలమంది సభ్యులు గలరు. వీరందరును విప్లవోత్సాహముతో

కమ్యూనిస్టు పార్టీ

ప్రభుత్వ కార్యక్రమములలో పూర్తిగ పాల్గొనుటయే కాక పల్లెలలోను, బస్తీలలోను అమలు జరుగుటకు అవసరమైన యావత్తు ప్రచారమును; ప్రబోధమును చేయుచు కమ్యూనిస్టు సమాజస్థాపనకు తీవ్రముగ తోడ్పడుచున్నారు. ఈ కమ్యూనిస్టు పార్టీ సభ్యులే ప్రభుత్వానికి మితిలేని బలము. అంతేగాక అఖిల చైనా కమ్యూనిస్టు కాంగ్రెసు యొక్కయు కేంద్రస్థాయి సంఘము యొక్కయు తీర్మానముల ప్రకారమే చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము అన్ని విధముల నడచుచున్నది. కమ్యూనిజము అన్ని వర్గములలోను దృఢముగ వ్యాపించుటకును, కమ్యూనిస్టు ప్రభుత్వము వారును కమ్యూనిస్టు పార్టీవారును తలపెట్టిన కార్యక్రమమంతయు దేశముయొక్క అన్ని భాగములలోను చక్కగా సాగుటకును కమ్యూనిస్టుపార్టీ కనుబంధములుగా ప్రతి గ్రామములోను రైతు సంఘములు, అఖిల చైనా కార్మిక సంఘముల సమ్మేళనము, అఖిల చైనా సహకార సంఘముల సమ్మేళనము, అఖిల చైనామహిళా సమ్మేళనము, అఖిల చైనావిద్యార్థి సమ్మేళనను, యేర్పడి పనిచేయుచున్నవి. 1954 లో ఈ మహిళా సంఘములలో 7 కోట్ల 60 లక్షలమంది, విద్యార్థుల సంఘములలో 32 లక్షల 90 వేలమంది, వయోజన సంఘములలో ఒకకోటి 80 లక్షలమంది, కార్మిక సంఘములలో ఒకకోటి 24 లక్షల 50 మంది, రైతుసంఘములలో పదికోట్లమంది సభ్యులుగ నున్నారు. ఇవి ప్రజాసముదాయములోని అన్ని వర్గములకు ప్రభుత్వ ఆదేశములను కార్యక్రమమును కొనిపోయి అమలుజరుపుటలో తోడ్పడును. చైనాలో బాగుగ కొంతకాలము పరీక్షించిగాని కమ్యూ

నిస్టుపార్టిలో సభ్యులుగా తీసుకొనరు. కఠినమైన క్రమశిక్షణము నకు వారు లోబడి నడచుచున్నారు. వారి విశుద్ధవర్తనము మిగుల ముఖ్యము. ఎప్పటికపుడు లంచగొండులను పార్టీనుండి వెడల గొట్టుచున్నారు. శిక్షలు వేయుచున్నారు. వారిలో ప్రతివారికి వారి గమ్యస్థానమేమో ఆశయమేమో నేర్పబడుచున్నది. అందు వలన కమ్యూనిస్టుపార్టీ మిగుల బలముగ పనిచేయుచున్నది.

★

# చైనా విప్లవము

## షోడశాధ్యాయము

---

### రాజ్యాంగవిధానము - వైజ్ఞానికరంగము

### 1

నవచైనాలో కమ్యూనిస్టు పార్టీయే ప్రభుత్వమును నడుపుచున్నది. కమ్యూనిస్టుపార్టీ సభ్యులు ప్రభుత్వ సంస్థల యొక్క అన్ని శాఖలలోను ప్రధానస్థానముల నాక్రమించి యున్నారు. శాసన నిర్మాణములో, పరిపాలనా విధానములో, న్యాయవిచారణలో కమ్యూనిస్టుపార్టీ చేసిన తీర్మానములను ఇచ్చిన ఆదేశములను అమలు జరుపుచున్నారు. కమ్యూనిస్టు పార్టీ యొక్క సర్వాధికారముగల అత్యున్నత కేంద్రసంఘము చైనా నేషనల్ కాంగ్రెసు అయ్యున్నది. ఎనిమిదవ కాంగ్రెసు 1956 వ సంవత్సరము సెప్టెంబరు నెలలో సమావేశమై అట్టి కాంగ్రెసును 5 సంవత్సరముల కొకసారి జరుపవలెనని తీర్మానించినది. ఈ జాతీయ కాంగ్రెసు ఒక సెంట్రల్ కమిటీ, లేక స్థాయీ సంఘమును ఎన్నుకున్నది. దానిక్రింద పొలిటికల్ బ్యూరో, మరియు సెక్రటేరియట్ (కార్యదర్శుల సంఘము) నియమింపబడియున్నవి. స్థాయీ సంఘము తరచుగ సమావేశము కానందున పొలిటికల్ బ్యూరో, కార్యదర్శుల సంఘము సంతతము పనిచేయుచు దేశములోని

కమ్యూనిస్టుపార్టీ అంగ విధానము

ాపత్తు పార్టీ మీద అధికారమును చలాయించుచున్నవి. పొలిటి బ్యూరోయొక్క ఆదేశములు, తీర్మానములు అందరూ పాలించవలసి యున్నది. సెక్రటేరియట్ (కార్యదర్శుల ఘము) దానియొక్క తీర్మానములను, ఆదేశములను అమ లో పెట్టుటకు తగిన దినచర్యను జరుపుచున్నది. ఈ కేంద్ర సంఘ ల క్రింద రాష్ట్రముల కాంగ్రెసులు, స్వపరిపాలనా ప్రాంతముల ıtonomous regions) కాంగ్రెసులు, మ్యునిసిపాలిటీల కాంగ్రె లు ఉన్నవి. ఆ కాంగ్రెసుల క్రింద అదేవిధముగ స్థాయీ సంఘ లు, పొలిటికల్ బ్యూరోలు, సెక్రటేరియటులు ఉన్నవి. రాష్ట్ర ల; స్వపరిపాలనా ప్రాంతముల క్రింద జిల్లాలు, చిన్న మ్యునిసి లిటీలు, జిల్లాల క్రింద గ్రామములు, చిన్న బస్తీలు గలవు. వీటన్ని లో కాంగ్రెసులు, అవి నియమించిన స్థాయీ సంఘములున్నవి. ుల కమ్యూనిస్టుపార్టీ పైనుంచి క్రిందవరకును నిర్మాణమగు యేగాక కమ్యూనిస్టుపార్టీ సభ్యులవల్ల నడుపబడెడి కార్మిక, క, సహకార, విద్యార్థి, యువజన, మహిళా సంఘములు మందంతటను శాఖోపశాఖలుగ ఏర్పడినవని మనము తెలుసు ని యున్నాము. దేశములోని వైజ్ఞానిక సంఘములుగూడ మ్యూనిస్టు సభ్యుల యాజమాన్యమునను, పలుకుబడి క్రిందను చేయుచున్నవి. చైనా ఇస్లాము సంఘముయొక్క అధ్యక్షుడు మ్యూనిస్టు అయియున్నాడు. అటులనే ముస్లిం వైజ్ఞానిక సంఘము ుక్క అధ్యక్షుడు కూడ కమ్యూనిస్టు అయి యున్నాడు.

1954 సంవత్సరము సెప్టెంబరు నెలలో నూతన రాజ్యాంగ నము అమలులోకి వచ్చినది. దాని ప్రకారము చైనాప్రజల

రిపబ్లికు యొక్క (పార్లమెంటు) జాతీయ ప్రజల కాంగ్రెసునందు సంపూర్ణ రాజ్యాధికారము కలదు. అది ఎప్పుడో గాని సమావేశము కాదు. అది ఒక స్టాండింగ్ కమిటీని నియమించును. ఆ స్టాండింగు కమిటీ పార్లమెంటు సమావేశము కానపుడు సమస్తమైన ఆదేశముల నిచ్చును. ఆ స్టాండింగు కమిటీలో మావోసిటుంగు, లియోషావ్చి, చౌ-ఎన్-లై, చన్ యున్ సభ్యులై యున్నారు. వీరు నలుగురు కలిసికట్టుగ ఆలోచనచేసి చైనా ప్రభుత్వము నంతను నడుపుచున్నారు. చైనాపార్లమెంటు, చైనా ప్రజల రిపబ్లికుకు అధ్యక్షుడుగ మావోసిటుంగును ఎన్నుకొన్నది. ఆయనయే చైనా కమ్యూనిస్టు పార్టీ యొక్క కేంద్రస్థాయి సంఘమునకును, పొలిటికల్ బ్యూరోకును, కేంద్ర సెక్రటేరియేటుకును, అధ్యక్షుడై యున్నాడు. ఆయన 1959 వ సంవత్సరములో చైనా ప్రజల రిపబ్లికు యొక్క అధ్యక్షపదవిని వదలిపెట్టి కమ్యూనిస్టు పార్టీయొక్క ప్రధాన నాయకత్వమును మాత్రము వహించి యున్నాడు. ఆయనస్థానే, ఆయన తరువాత కమ్యూనిస్టుపార్టీ యొక్క రెండవ నాయకుడగు, లియోషావ్చి ప్రజల రిపబ్లికుకు అధ్యక్షుడుగ నెన్నుకొనబడినాడు. చైనాపార్లమెంటు ఒక స్టేటు కౌన్సిలును కూడ ఎన్నుకొన్నది. అదియే మంత్రివర్గము. దానికి ప్రధానమంత్రి అధ్యక్షుడు. కమ్యూనిస్టు పొలిటికల్ బ్యూరో సభ్యుడైన చౌ-ఎన్-లై ప్రధాన మంత్రిగా నియమింపబడినాడు. చైనాప్రజల రిపబ్లికు అధ్యక్షుడు సుప్రీమ్‌స్టేటు కాన్ఫరెన్సు మీదను, జాతీయ డిఫెన్సు కౌన్సిలుమీదను అధ్యక్షత వహించు

చైనాప్రజల రిపబ్లికు యొక్క రాజ్యాంగ విధానము

యావత్తు పార్టీ మీద అధికారమును చలాయించుచున్నవి. పొలిటికల్ బ్యూరోయొక్క ఆదేశములు, తీర్మానములు అందరూ శిరసావహించవలసి యున్నది. సెక్రటేరియట్ (కార్యదర్శుల సంఘము) దానియొక్క తీర్మానములను, ఆదేశములను అమలులో పెట్టుటకు తగిన దినచర్యను జరుపుచున్నది. ఈ కేంద్ర సంఘములక్రింద రాష్ట్రముల కాంగ్రెసులు, స్వపరిపాలనా ప్రాంతముల (**autonomous regions**) కాంగ్రెసులు, మ్యునిసిపాలిటీల కాంగ్రెసులుఉన్నవి. ఆ కాంగ్రెసుల క్రింద అదేవిధముగ స్థాయీ సంఘములు, పొలిటికల్ బ్యూరోలు, సెక్రటేరియటులు ఉన్నవి. రాష్ట్రముల; స్వపరిపాలనా ప్రాంతములక్రింద జిల్లాలు, చిన్న మ్యునిసిపాలిటీలు, జిల్లాలక్రింద గ్రామములు, చిన్నబస్తీలు గలవు. వీటన్నిటిలో కాంగ్రెసులు, అవి నియమించిన స్థాయీ సంఘములున్నవి. ఇటుల కమ్యూనిస్టుపార్టీ పైనుంచి క్రిందవరకును నిర్మాణమగుటయేగాక కమ్యూనిస్టుపార్టీ సభ్యులవల్ల నడుపబడెడి కార్మిక, కర్షక, సహకార, విద్యార్థి, యువజన, మహిళా సంఘములు దేశమందంతటను శాఖోపశాఖలుగ ఏర్పడినవని మనము తెలుసుకొని యున్నాము. దేశములోని వైజ్ఞానిక సంఘములుగూడ కమ్యూనిస్టు సభ్యుల యాజమాన్యమునను, పలుకుబడి క్రిందను పనిచేయుచున్నవి. చైనా ఇస్లాము సంఘముయొక్క అధ్యక్షుడు కమ్యూనిస్టు అయియున్నాడు. అటులనే ముస్లిం వైజ్ఞానిక సంఘముయొక్క అధ్యక్షుడు కూడ కమ్యూనిస్టు అయి యున్నాడు.

1954 సంవత్సరము సెప్టెంబరు నెలలో నూతన రాజ్యాంగ విధానము అమలులోకి వచ్చినది. దాని ప్రకారము చైనాప్రజల

రిపబ్లికుయొక్క (పార్లమెంటు) జాతీయ ప్రజల కాంగ్రెసునందు

చైనాప్రజల రిపబ్లికు యొక్క రాజ్యాంగ విధానము

సంపూర్ణ రాజ్యాధికారము కలదు. అది ఎప్పుడో గాని సమావేశము కాదు. అది ఒక స్టాండింగ్ కమిటీని నియమించును. ఆ స్టాండింగు కమిటీ పార్లమెంటు సమావేశము కానపుడు సమస్తమైన ఆదేశముల నిచ్చును. ఆ స్టాండింగు కమిటీలో మావోసిటంగు, లియోషాచి, చౌ-ఎన్-లై, చన్‌యున్ సభ్యులై యున్నారు. వీరు నలుగురు కలిసికట్టుగ ఆలోచనచేసి చైనా ప్రభుత్వము నంతను నడుపుచున్నారు. చైనాపార్లమెంటు, చైనా ప్రజల రిపబ్లికుకు అధ్యక్షుడుగ మావోసిటంగును ఎన్నుకొన్నది. ఆయనయే చైనా కమ్యూనిస్టు పార్టీ యొక్క కేంద్రస్థాయి సంఘమునకును, పొలిటికల్ బ్యూరోకును, కేంద్ర సెక్రటేరియెటుకును, అధ్యక్షుడై యున్నాడు. ఆయన 1959 వ సంవత్సరములో చైనా ప్రజల రిపబ్లికు యొక్క అధ్యక్షపదవిని వదలిపెట్టి కమ్యూనిస్టు పార్టీయొక్క ప్రధాన నాయకత్వమును మాత్రము వహించి యున్నాడు. ఆయనస్థానే, ఆయన తరువాత కమ్యూనిస్టుపార్టీ యొక్క రెండవ నాయకుడగు, లియోషాచి ప్రజల రిపబ్లికుకు అధ్యక్షుడుగ నెన్నుకొనబడినాడు. చైనాపార్లమెంటు ఒక స్టేటు కౌన్సిలును కూడ ఎన్నుకొన్నది. అదియే మంత్రివర్గము. దానికి ప్రధానమంత్రి అధ్యక్షుడు. కమ్యూనిస్టు పొలిటికల్ బ్యూరో సభ్యుడైన చౌ-ఎన్-లై ప్రధాన మంత్రిగా నియమింపబడినాడు. చైనాప్రజల రిపబ్లికు అధ్యక్షుడు సుప్రీమ్‌స్టేటు కాన్ఫరెన్సు మీదను, జాతీయ డిఫెన్సు కౌన్సిలుమీదను అధ్యక్షత వహించు

చున్నాడు. స్టేటు ఆర్థిక ప్లానింగు అంతయు మంత్రివర్గము క్రిందనే యున్నది. దేశసంరక్షణశాఖ సైనిక మంత్రిక్రింద నున్నది. చైనా ప్రజల రిపబ్లికుయొక్క అధ్యక్షుడు పార్లమెంటుయొక్క గాని, అది సమావేశము కానపుడు స్టాండింగు కమిటీయొక్క గాని తీర్మానముల ప్రకారము చట్టములను డిక్రీలను జారీచేయును. ప్రధానమంత్రిని, ఉపప్రధాన మంత్రులను, ఇతర మంత్రులను, స్టేటు కౌన్సిలు యొక్క సెక్రెటరీ జనరలును, జాతీయ డిఫెన్సు కౌన్సిలు సభ్యు లను నియమించుటకును తీసివేయుటకును ఆయనకు అధికారము కలదు. సేనలమీద అధిపత్యము ఆయనకే కలదు. జాతీయ డిఫెన్సు కౌన్సిలుమీద అధ్యక్షత వహించును. సైనిక శాసనమును ప్రక టించును. పతకములను, బిరుదులను ఇచ్చును. నేరస్థులకు క్షమా పణ నిచ్చును. చైనా దేశమును ఇరువదిమూడు రాష్ట్రములుగ విభజించినారు. రాష్ట్రములక్రింద కౌంటీలు గలవు. ఇవి రాష్ట్ర మునకు 80 లేక 90 చొప్పున గలవు. కౌంటీలక్రింద జిల్లాలు, జిల్లాల క్రింద గ్రామములు, లేక గ్రామ సముదాయములు, మరియు బస్తీలుగలవు. ఈ రాష్ట్రములే గాక స్వపరిపాలన గల ప్రాంతములును, (**antonomous regions**) పికింగు, షాంఘై, టీన్‌ట్సిన్ నగరముల మునిసిపాలిటీలును, కేంద్ర ప్రభుత్వము క్రింద గలవు. సింకియాంగు, తూర్పు మంగోలియా, టిబెట్టు స్వపరిపాలన గల ప్రాంతములై యున్నవి. స్వపరిపాలన గల ప్రాంతముల క్రింద కూడ కౌంటీలు, వాటిక్రింద జిల్లాలు, వాటి క్రింద గ్రామములు, బస్తీలు గలవు. గ్రామములయొక్క, బస్తీల యొక్క ఓటర్లు సరాసరి తమ కాంగ్రెసులను ఎన్నుకొను

చున్నారు. ఆ కాంగ్రెసులు తమ కౌన్సిళ్లను (Councils) ఎన్ను కొనుచున్నవి. ఈ గ్రామముల, బస్తీల కౌన్సిళ్ళు కలసి జిల్లా కాంగ్రెసు నెన్నుకొనుచున్నవి. జిల్లా కాంగ్రెసు జిల్లా కౌన్సిలు నెన్నుకొనుచున్నది. అన్ని జిల్లాల కౌన్సిళ్ళు కలసి కౌంటీ యొక్క కాంగ్రెసు నెన్నుకొనుచున్నవి. కౌంటీ యొక్క కాంగ్రెసు కౌంటీ యొక్క కౌన్సిలు నెన్నుకొనుచున్నది. మ్యునిసిపాలిటీల యొక్క ఓటర్లు సరాసరి మునిసిపలు కాంగ్రెసుల నెన్నుకొనుచున్నవి. అవి మ్యునిసిపల్ కౌన్సిళ్ల నెన్ను కొనుచున్నవి. కౌంటీల కౌన్సిళ్లు మునిసిపల్ కౌన్సిళ్లు కలసి రాష్ట్రి కాంగ్రెసును ఎన్నుకొనుచున్నవి. రాష్ట్రి కాంగ్రెసు రాష్ట్రి కౌన్సిలు నెన్నుకొనుచున్నది. అటులనే స్వపరిపాలనా ప్రాంతములలోని కౌంటీల కౌన్సిళ్లు స్వపరిపాలనా ప్రాంతము యొక్క కాంగ్రెసును, అది ఆ ప్రాంతము కౌన్సిలును ఎన్ను కొనుచున్నవి. గొప్ప మునిసిపాలిటీలు అయిన మూడు నగరముల ఓటర్లు ఆ మునిసిపాలిటీల కాంగ్రెసులను, ఆ కాంగ్రెసులు ఆ మునిసిపాలిటీల కౌన్సిళ్లను ఎన్నుకొనుచున్నారు. రాష్ట్రిముల కౌన్సిళ్లు, స్వపరిపాలనా ప్రాంతాల కౌన్సిళ్ళు, గొప్ప నగరముల మునిసిపలు కౌన్సిళ్ళు కలిసి కేంద్ర పార్లమెంటును (నేషనల్ పీపుల్సు కాంగ్రెసును) ఎన్నుకొనుచున్నవి. ఈ కాంగ్రెసులు ప్రతి స్థాయిలోను శాసనములను చేయును. ప్రతి స్థాయిలోను కౌన్సిళ్లు వాటిని అమలు పరచును. గాని క్రింది కౌన్సిళ్ళు పై కౌన్సిళ్లకు బాధ్యత వహించును కాని తమ కాంగ్రెసులకు బాధ్యత వహించవు. కౌన్సిళ్ళన్నియు కేంద్ర

స్టేటు కౌన్సిలుక్రింద నున్నవి. స్టేటు కౌన్సిలు కేంద్ర మంత్రి వర్గమై యున్నది. ఇటుల కేంద్రమునుంచి గ్రామములవరకును, బస్తీలవరకును, పరిపాలనా అంగ విధానము ఏర్పడి యున్నది. ప్రతి స్థాయిలోను ప్రతి ఎన్నికకును అభ్యర్థుల జాబితాను అందుకు సంబంధించిన కమ్యూనిస్టు పార్టీ తయారుచేసి యివ్వగా వారినే ఏకగ్రీవముగ ఎన్నుకొనుచున్నారు. అంతేగాని వివిధ అభ్యర్థుల మధ్య పోటీగా నిలచే ఎన్నికలు అనేవి జరగనే జరగవు.

## 2

కమ్యూనిస్టు పార్టీ సభ్యులలోను, ప్రభుత్వోద్యోగులలోను లంచగొండితనము వ్యాపించియున్నదని తెలిసి 1952 లో సాన్ ఫాన్-ఊఫాన్ ఆందోళనమును ప్రభుత్వము లేవదీసినది. "బాల బాలికల ఊరేగింపులు, యువజనుల ఊరేగింపులు, కార్మికుల ఊరేగింపులు, ఈ ఊరేగింపులలో డప్పులు ఆఫ్రికాఖండపు భయంకర సంగీతాన్ని లీలగ జ్ఞాపకము చేసినవి. ఆ డప్పుల చప్పుళ్ళతోపాటు 'లంచములు పుచ్చుకొనే వారిని హతమారుస్తాము. లంచము లిచ్చిన వారిని కూడ అణచివేస్తా' మని నినాదములు బయలుదేరినవి. ఈ భయంకర నినాదాలకు ఎంతమంది చైనీయులు ఆత్మహత్య చేసుకున్నారో చెప్పలేము. పార్టీ సభ్యులలోకూడ పోరాట సమయములోనున్న విప్లవాత్మక చైతన్యము, పోరాటము తగ్గి స్థిమితమయ్యేటప్పటికి మటుమాయమైనదని, వెనుకటి ఆదర్శ కోవిదులు, సుఖాన్వేషులుగా తయారై లంచగొండితనము తల

సాన్ ఫాన్ ఆందోళనము

ఎత్తేందుకు అవకాశము కలుగచేసినారని తలచినారు. అంత ఘనంగా చెప్పుకొనే పార్టీలో నీతి, నిజాయితీలు తప్పినట్లు కొన్ని చోట్ల వినడంవల్ల దేశము బాగుపడాలంటే కొన్ని కఠిన చర్యలు తీసుకొనవలెనని అనుకోవడం ప్రారంభించిరి. 'పార్టీలోపల ఉండే దుష్టబుద్ధులను కూడ మనము హతమార్చాలి. తప్పులుచేసి ఉంటే వాటిని దిద్దుకోగలగాలి. తప్పుదారి పట్టిన వారిని సహించరా'దని లియు షౌచి అన్నాడు. ఆ విధముగ వేరు పురుగుల నివారణ అనే కార్యక్రమము ప్రారంభమైనది. దానికి సాన్‌ఫాన్ అని పేరు. దానిని ప్రభుత్వమే ప్రోత్సహించింది" అని రాజా హాతీ సింగు వ్రాసినాడు. గవర్నమెంటులోని ఉద్యోగులు తాముచేసిన తప్పులు తోటివారి ముందు చెప్పి ఒప్పుకునేవారు. అది ఆత్మ పరిశీలన, ఆత్మపరీక్ష. ఈ ఆత్మపరీక్ష ఒక నాలుగు నెలలు జరిగినది. 1952 జనవరి నాటికి 27 శాఖలలో 1670 ఉద్యోగులు లంచ గొండులని తేలినది. తాము చేసిన నేరము ఒప్పుకొన్న ఉద్యో గులు స్వల్పశిక్షతో వదలివేయబడినారు. ఒప్పుకోని వారిపై కేసులుపెట్టి తగు రీతిని శిక్ష విధించినారు. పార్టీ సభ్యులనుకూడ పార్టీలోనుంచి వెళ్లగొట్టినారు. శిక్షలువేసినారు. లంచగొండులను ఏవిధముగ శిక్షించినదీ, ప్రముఖ కమ్యూనిస్టులను, పెద్ద ఉద్యోగు లను కూడ పికింగు ప్రజాకోర్టు ఎదుట ఏ విధముగా విచారించి కఠిన శిక్షలు విధించినదీ ఇండియన్ డెలిగేషన్ సభ్యులకు షాంఘా

సినిమా ప్రదర్శనము

యిలో ఒక సినిమా చూపించినారు. వేలకొలది ప్రజలు దోషులమీద క్రోధ పూరితమైన నినాదాలు చేయుట ఆ సినిమాలో చూపించ

బడినది. ఆ సినిమాలో న్యాయాధికారి ఇద్దరికి ఉరిశిక్ష, నలుగురికి జైలుశిక్ష వేసినాడు. ఒకాయనను వదలివేసినాడు. ఆ విధముగా ప్రజలలో బీభత్సము పుట్టించినారు. అభివృద్ధి నిరోధకుల కుమార్తెలను వివాహమాడినందుకు ఏడుగురు ఉద్యోగులను డిప్రామోషన్ చేసినారు; అనగ వారిని చిన్న ఉద్యోగానికి తగ్గించినారు. ఇదిగాక బ్లాకు మార్కెట్టు, పన్నుల ఎగవేత మొదలగు ఆర్థిక అక్రమములు చేసిన వర్తకులమీద ఊఫాను అనే ఉద్యమాన్ని లేవదీసిరి. దానిని గురించి పైన తెలిపియున్నాము.

## 3

చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము వారు విద్యా వ్యాపకమునకై బాగుగ కృషి సలుపుచున్నారు. ప్రజలలో నిరక్షరాస్యతను నిర్మూలముచేసి నవీన విజ్ఞానమును కలుగజేయుటయు, దేశములోని విజ్ఞానమంతయు కమ్యూనిస్టు సమాజస్థాపన కుపయోగపడునటుల కావించుటయు వారి యుద్దేశ్యమై యున్నది. ఇంజనీరింగు, వ్యవసాయక, సాంకేతిక, వైద్య విద్యల కెక్కువ ప్రాధాన్య మిచ్చుచున్నారు. విద్య కొరకు విశేషముగ సొమ్మును ఖర్చుచేయుచున్నారు. 1959 వ సంవత్సరములో ప్రైమరీ పాఠశాలలలో 8 కోట్లమంది, మధ్యమ తరగతి పాఠశాలలలో ఒకకోటి 20 లక్షలమంది, విశ్వవిద్యాలయములలోను కళాశాలలలోను 6 లక్షలమంది, విద్యార్థులు, విద్యార్థినులు చదువుకొనుచున్నారని పెంగు చ్యాంగ్ యో తన గ్రంథమునందు వ్రాసినాడు. నిర్బంధ ఉచిత ప్రారంభ విద్యను

విద్యా వ్యాపకము

ఇంకను ప్రవేశపెట్టలేదు. మూడవ పంచవర్ష ప్రణాళికలో దానిని ప్రవేశపెట్టవలెనని ప్రభుత్వము ఆలోచించుచున్నది. మిడిల్ స్కూలులో నుత్తీర్ణుడు కాగానే సాంకేతిక, ఇంజనీరింగు, ప్రకృతి శాస్త్ర, వైద్య విద్యలలో నేదైన నొకదానిని అభ్యసించుటకు విద్యార్థికి, విద్యార్థినికి స్వతంత్రము కలదు. ఒక శాఖను ఏరు కొనిన పిమ్మట ఆ శాఖలోనే దేశము కొరకు పనిచేయవలసి యున్నది. ప్రభుత్వమువారు దేశములో ఇరువది పాలిటెక్నిక్ పాఠశాలలను స్థాపించినారు. భూగర్భ శాస్త్రమునకు సంబంధించిన 26 పాఠశాలలను నూతనముగ స్థాపించినారు. వైద్యకళాశాలలను, విద్యాబోధనా కళాశాలలను వృద్ధిచేసినారు. దేశము యొక్క అన్ని భాగములలోను, వెనుకబడిన ప్రాంతములలో కూడ, పాఠశాలలను, కళాశాలలను పంచిపెట్టినారు. పెద్ద భవనములు, విశాలమైన స్థలములు పాఠశాలలకు, కళాశాలలకు సమకూర్చబడినవి. 1951 వ సంవత్సరములో 14 విద్యా బోధనా కళాశాలలు మాత్రముండగ 1956 లో 53 అట్టి కళాశాలలుండెను. వీటిలో మొత్తము 65 వేలమంది విద్యార్థులు, విద్యార్థినులు శిక్షణమును పొందుచుండిరి. శిక్షణ పొందిన ఉపాధ్యాయులు చాలినంతగలేరు. ఈ కొరత తీర్చుటకు ప్రభుత్వము ప్రయత్నించుచున్నది. 1967 వరకు ఈ కొరత తీర్చ గలుగుదుమని ప్రభుత్వము తలచుచున్నది. విద్యాబోధన శిక్షణలో మానసికశాస్త్ర శిక్షణముతోపాటు మార్క్సిజము కూడ విధిగా నేర్పబడును. అందరు ఉపాధ్యాయులు కళాశాలల ఆచార్యులు మార్క్స సిద్ధాంతమును గట్టిగ నేర్చినవారుగను, బాగుగ

బోధింప గలిగినవారుగను నుండితీరవలెను. దేశములో భావి తరములవారు కమ్యూనిజమును అభ్యసించి కార్యాచరణలో పెట్ట గలిగినవారుగ తయారు కావలెను. క్యూమింటాంగు కాలములో వలెనే కమ్యూనిస్టుల కాలములో కూడ యావత్తు విద్య ఉచిత ముగ నేర్పబడుచుండెను. ఉచితముగనే భోజనము, దుస్తులుకూడ ఇవ్వబడుచుండెను. 1952 వ సంవత్సరమునుండి ఎక్కువ స్థితి గలవారినుంచి విద్యాబోధనకు రుసుముమాత్రము వసూలు చేయబడుచుండెను గాని కమ్యూనులలో చేరినవారివద్ద అట్టి దేమియు వసూలు చెయ్యరు. వయోజన విద్యలో చైనాప్రభు త్వము ఎక్కువ శ్రద్ధ వహించుచున్నది. విద్యార్థులచేత, విద్యార్థి నులచేత నిరక్షరాస్యతను నిర్మూలము గావించుటకు గొప్ప ప్రయత్నము చేయుచున్నది. మరియు వారిచేత కమ్యూనిజ మును బోధింప చేయుచున్నది. గ్రామములలోని దేవాలయము లలో వయోజనవిద్య తరగతుల నేర్పాటు చేసినారు. సాయం త్రమువేళ యంత్రశాలలలో పనిచేసే కార్మికులకు పాఠములు నేర్పబడును. ప్రతివారును తాము విద్య నేర్చుకొనగనే ఇతరులకు దానిని బోధించవలెను. చైనాభాష యొక్క లిపి* బాగుగ సంస్కరింపబడినది. టైపురైటరులకు ఎక్కువ సౌలభ్యము చేయ బడినది. చైనాలోని విద్యార్థులు, విద్యార్థినులు క్రమశిక్షణను పూర్తిగ కలిగియున్నారు. 1967 వ సంవత్సరమున మూడవ పంచవర్ష ప్రణాళిక పూర్తియగునప్పటికి చైనాదేశములో నిరక్ష రాస్యత పూర్తిగ తొలగిపోవునని ప్రభుత్వము ఆశించుచున్నది.

ప్రజల ఆరోగ్యము విషయమునను, వైద్యము విషయము నను కూడ ప్రభుత్వము శ్రద్ధ చూపుచున్నది. ముఖ్యముగ రోగము లను కొనిపోవు పురుగుల నన్నిటిని నాశనము గావించినారు. ఇటుల నాశనము గావించుటలో ప్రజల విమోచన సైన్యము చాలతోడ్పడినది. ఈ సైన్యము వెళ్ళిన చోటనెల్ల పరిశుభ్రత నిర్బంధముగ నేర్పబడినది. ఎలుకలు, పిచ్చుకలు, ఈగలు, దోమలు వీటిని ప్రతిచోటను నాశనముచేయుట ఒకపనిగా పెట్టుకొన్నారు. మంత్రసానులను ఎక్కువగ తయారుచేసినారు. పారిశుద్ధ్యమున కెక్కువ ప్రాధాన్యము నిచ్చినందున కలరా, బంక విరేచనములు, శిశురోగములు, అంటురోగములు చాల వరకు తగ్గిపోయినవి. బిచ్చగాళ్ళను బజారులో తిరగనివ్వరు. వారిని పోలీసులు తీసుకొనిపోయి నిర్బంధముగ పనిచేయించు చున్నారు. బస్తీలలోని రోడ్లు గల్లీలు ఎవరును ఉమ్మివేయకుండా అల్పాచిమానము పొయ్యకుండా వస్తువులేమీ పడవెయ్యకుండా అతిశుభ్రముగా నుంచబడుచున్నవి. శుభ్రతకు నవచైనా బస్తీలు పేరుపొందినవి. ఇంతవరకు ప్రభుత్వోద్యోగులకు, ప్రభుత్వముక్రింద పనిచేయు కార్మికులకు, వ్యవసాయ కూలీలకు, విద్యార్థులకు, విద్యార్థినులకు మాత్రము వైద్యసహాయము ఉచితముగా చేయ బడుచున్నది. ప్రజలందరికి ఉచితముగ వైద్యసహాయము చేయు ఆదర్శముతో వైద్యులను తయారు చేయుచున్నారు. చైనాలో స్వదేశవైద్యము అనేక శతాబ్దములనుండి బాగుగ అభివృద్ధి చెందినది. 1911 వ సంవత్సరములో సన్యటుసేనుయొక్క మొదటి విప్లవమునకు పిమ్మట యూయన్ షికాయ్‌యొక్క

వైద్యము, ఆరోగ్యము

పాలనములో పాశ్చాత్యవైద్యము ఎక్కువగ వ్యాపింప చేయబడి స్వదేశ వైద్యమునకు మిగుల నిరుత్సాహము కలిగినది. అప్పటి నుంచి పాశ్చాత్యవైద్యమే దేశములో బాగుగ వ్యాపించసాగినది. కమ్యూనిస్టులు రాజ్యమునకు వచ్చినపిమ్మట ఏదోయొక విధమైన వైద్యసహాయమును ప్రజలకు చేయుట అత్యవసరమని నమ్మి పాశ్చాత్య వైద్య ఆసుపత్రులతోపాటు స్వదేశ వైద్య ఆసుపత్రులనుకూడ స్థాపించి ప్రజలకు వైద్యసహాయమును చేయసాగినారు. చైనాలోకూడ స్వదేశవైద్యులు నాడీపరీక్షలో నిపుణులు. వైద్యము నవలంబించిన వారందరు కార్మికులకు బాగుగ సేవ చేయుటకై విధిగా కమ్యూనిజమును నేర్చుకొనవలసినదే.

"కమ్యూనిస్టులు తాము చేయదలచుకొన్న మార్పును విద్యార్థుల వద్దనుంచి ప్రారంభించెదరు. విద్యఅనేది కమ్యూనిస్టు సిద్ధాంతానికి అనుగుణముగ నుండవలెను. అలా అనుగుణముగ నున్నదే విద్య, మిగతాది విద్య కానేకాదు. విద్యావ్యాప్తిలోని లక్ష్యము, విప్లవ లక్ష్యసాధనే. ఉయ్యాల తొట్టెలలోని పిల్లలకు కమ్యూనిజమును చెప్పేందుకు సన్యటుసేను స్కూలు ఏర్పడినదా అనిపించుకున్నది. మధ్యతరగతి స్కూళ్ళలో, కాలేజీలలో, విశ్వవిద్యాలయములలో కార్మిక పాఠశాలలలో, రైతు బడులలో ప్రతిచోట విద్యార్థి బృందములకు కమ్యూనిస్టు విధానములోని ఘనవైభవము నేర్పబడుచున్నది. స్కూళ్ళ విద్యార్థులు, విద్యార్థినులు (యూత్ లీగులో) యువజన సంఘములో సభ్యులు. మాప్రతినిధి వర్గములో ఒకాయన ఒకకుర్రవాడిని ఇలాఅడిగాడు, "కన్‌ఫ్యూషియసు ఎవరు?" "ఎందుకూ పనికిరాని బూజుపట్టిన

ప్యూడల్లు వేదాంతి" అని అతడు చెప్పినాడు. ఈవిద్యావిప్లవములో ప్రొఫెసరులు, రచయితలు, తత్వవేత్తలు, తమ దృక్పథాన్ని ప్రభుత్వావసరములకు అనువుగ మళ్ళించుకో గలిగినారు. నవచైనాలో సంస్కృతి అనగ మార్క్సిజము. వెనుకటి విద్యావేత్తలు తమకు తెలిసినది మరచిపోయి క్రొత్త పద్ధతులను నేర్చుకొనవలసి వస్తున్నది. నూతన ప్రజాస్వామ్య పద్ధతులకు అనుగుణముగ మారలేని విద్యావంతుల బ్రతుకు ఘోరాతిఘోరము.

విద్యావంతుల ఆత్మహత్యలు

నాన్ కింగులోని ఒక స్త్రీల కళాశాలలో ప్రొఫెసరుగనున్న "మిస్ ఊ" అను నామె కమ్యూనిస్టు విధానము ననుసరింపలేకపోయినది. ఆకారణముగ ఆమెకు ఉద్యోగము పోయినది. షాంఘైలో నున్న "మిస్ ఊ"ను చూద్దామనుకున్నాము. ఎందుచేతనంటే మా ప్రతినిధి వర్గములో ఒకాయనవద్ద ఆమె కుద్దేశింపబడిన ఒక పరిచయలేఖ ఉన్నది. టెలిఫోనులో మాట్లాడుటకు కూడ ఆమె భయపడినది. ఆమె కంఠములోని భీతావహము మాకు ఆశ్చర్యమును కలిగించినది. మెదడు మరమ్మత్తుకు అంగీకరించక "మిస్ ఊ" ఆత్మహత్య చేసుకొని మరణించినదని ఆతరువాత తెలిసినది. బాగా పేరుప్రతిష్ఠలు సంపాదించిన ఒక బయాలజీ ప్రొఫెసరు పనికూడ అంతే అయినది. కమ్యూనిజమును మత విశ్వాసముగనమ్మి దేశక్షేమముకొరకు స్వార్థరహితముగ పనిచేసే వేలాదివేల చైనా యువకులను చూచినాము. తక్కువ జీతాలతో కష్టపరంపరలకు ఓర్చుకుంటూ ప్రజాసేవకు వారు తమ జీవితమును అంకితము చేసినారు. వారి మొగములలో ప్రభు

త్వానికి, తాము నమ్మిన సిద్ధాంతానికి కట్టుబడి ఉన్నామనే తృప్తి ఒకటి కనిపించుచున్నది. విద్యార్థులు, విద్యార్థినులు, బస్తీలలోను, పల్లెలలోనునున్న వయోజనులకు ఎంతో ఆసక్తితో అక్షరజ్ఞానమును నేర్పుచున్నారు." అని రాజా హాతీసింగు తన గ్రంథములో వ్రాసినాడు.

"పికింగు నగరములోని పుస్తక విక్రయశాల లన్నియు మార్క్స్ వాఙ్మయముతోను, కమ్యూనిస్టు పత్రికలతోను నిండి యుండును. అవి చాలభాగము చైనాభాషలో వ్రాయబడెను. రుష్యాభాషలో వ్రాయబడినవి కూడ చాల యుండెను. కమ్యూనిజమును బోధించు బాల బాలికల వాఙ్మయము విశేషముగ నుండెను.

**పసితనము నుండియు కమ్యూనిస్టు బోధ**

ప్రతి సాయంత్రము నాలుగు గంటలకు స్కూలుపిల్లలందరు గుంపులుగ వెళ్ళి షాపులలో ప్రవేశించి ఆ పుస్తకములను తీసు కొని చదివి మరల అక్కడనే జాగ్రత్తగ పెట్టి వచ్చుచున్నారు. పసితనమునుండియు పిల్లలకు కమ్యూనిస్టు సిద్ధాంతము నేర్పబడు చున్నది. వేరే ఆర్థిక సిద్ధాంతముగాని, మత సిద్ధాంతముగాని నవచైనాలో జొరబడుటకే వీలులేదు. ప్రభుత్వమును వశపరచు కొనగనే కమ్యూనిస్టులు చేసిన మొదటిపని నూతన యువజన సంఘమును స్థాపించుటయై యున్నది. (న్యూ డెమోక్రాటిక్ యూత్ లీగ్). దానిలో ఇరువదియైదు సంవత్సరముల లోపు గల యువజను లందరు సభ్యులుగ చేరవచ్చును. వాటిలో నూటికి 30 మంది యువతులు సభ్యులుగ నుండిరి. దానితోపాటు పది మొదలు పదిహేను సంవత్సరముల వయసుగల బాలబాలికల

కొరకు చైనా యువజన పాయినీర్స్ (బాలబాలికల సంఘము) అను సంఘ మేర్పడెను. దానిలో అనేక లక్షలమంది సభ్యులుండిరి. వీటన్నిటియొక్క ఆశయము చైర్మన్ మావో యొక్క ఆదర్శములను అమలులోనికి తెచ్చుటకు పోరాటము సలుపవలె నసునదియే అయ్యున్నది. చైనా కమ్యూనిస్టు రాజ్యములో మానవుని భావములు తలంపులు ప్రభుత్వముయొక్క సొత్తు అయియున్నవి. ఈ రోజున చైనాలో విశ్వవిద్యాలయములలోను, పాఠశాలలలోను యువజనులయొక్క మనస్సులమీద మార్క్స సిద్ధాంతములు బాగుగ నాటుటకు గొప్ప ప్రయత్నము జరుగుచున్నది. విశ్వవిద్యాలయములలోని అధికసంఖ్యాకు లగు ఆచార్యులు, వాటి అధికారులు విద్యాబోధనలో ఆరితేరినవారు కారు. కాని వారు గట్టి కమ్యూనిస్టుపార్టీ సభ్యులు. ఉత్తరచైనాలోని ముక్డన్ నగరమున గల సుప్రసిద్ధమైన వైద్య విశ్వవిద్యాలయము యొక్క అధ్యక్షుడు ౩౬ సంవత్సరముల వయస్సు గలవాడు. ఆయన తీవ్రమైన విప్లవకారుడై యుండెను. వైద్య శిక్షణమును పూర్తి చేసినవాడు కాడు. కమ్యూనిస్టు విప్లవము యొక్క ఆశయములలో విద్యార్థులకు క్రమశిక్షణ ఇవ్వడమే వైద్య విశ్వ విద్యాలయముయొక్క ప్రధానోద్దేశమని ఆయన చెప్పెను" అని ఫ్రాంకు మోరెసు తన గ్రంథములో వ్రాసినాడు.

యువజన సంఘములు, పాయినీర్స్ సంఘములు

ప్రతి సంవత్సరము చాలమంది చైనా విద్యార్థులను, సోవియటు రుష్యా ప్రభుత్వము తీసుకొనిపోయి రుష్యాలోని విశ్వవిద్యాలయములలో ఉత్తమ విద్యనిచ్చుచున్నారు.

4

చైనాయొక్క భావి సంస్కృతిని గురించి 1942 వ సంవత్సరము మే నెలలో వాఙ్మయము, కళ అను విషయమున మావోసిటంగు ఇచ్చిన యుపన్యాసము కమ్యూనిస్టు రచయితలకు, కళాకారులకు కూడ పరమప్రమాణమై యున్నది. అందులో ఆయన రెండు ప్రశ్నలు వేసి ఈ క్రిందివిధముగ జవాబు చెప్పినాడు.

రచయితలు, కళాకారులు

మొదటిది "వాఙ్మయము, కళ ఎవరికొరకు ఉపయోగింపబడవలెను ?" దీనికి జవాబు నిశ్చలమైనది. "ఆ రెండూ కార్మికులకు, కర్షకులకు, సైనికులకు సేవచేయవలెను"అని ఆయన చెప్పినాడు. రెండవ ప్రశ్న ఏమనగా "వారికి సేవచేయుటెట్లు?" దీనిని గురించి "రచయితలు, కళాకారులు కార్మిక సైనిక కర్షక ప్రజాసముదాయముతో ఏకీభావమును పొందుటవలన వారు సేవచేయగలరు" అనిఆయన చెప్పెను. దేశములోని మధ్యమ తరగతికి చెందిన విద్యావంతులయందు కమ్యూనిస్టులకు ఎక్కువ అనుమానము. వారు విప్లవకారులుగ నున్నటుల కనపడెదరు. కాని వారి ఆదర్శములలో చాల లోపమున్నది. కార్మికులతో సానుభూతి యున్నంత మాత్రముచేత కార్మికులతో వారు ఐక్యము చెందుచున్నారని తలచుటకు వీలులేదు. అందువలన ఈ పరస్పర విరోధ భావములను తీసివేయుటకు గాను చైనాలోని రచయితలను, కళాకారులను మార్క్సిజమును, లెనినిజమును బాగుగ చదవవలసి యున్నదనియు, సంఘములో జరుగుచున్న పరిణామములను పూర్తిగ అర్థముచేసుకొనవలె ననియు, మావోసిటంగు కోరు

చున్నాడు. "వారుపూర్తిగను, శాశ్వతముగను, అసందిగ్ధముగను, హృదయపూర్వకముగను ప్రజాసామాన్యము జరుపుచున్న పోరాటములో భాగస్వాములు కావలెను. నవచైనాలో కళాకారుని యొక్క, రచయితయొక్క ప్రధాన ధర్మము కమ్యూనిస్టు కార్యములను కమ్యూనిస్టుల సుగుణములను ప్రశంసించుచు, అభివృద్ధి నిరోధకులను ఖండనచేయుచు వ్రాయవలెను. చైనాదేశపు పూర్వకాలపుచక్రవర్తులయొక్క చరిత్రలు వ్రాయకూడదు. పాతకాలపు సంస్కృతిలోగల మంచివాటిని మాత్రము కాపాడవలెను. అనగ రాజులయొక్క, రాజ వంశములయొక్క చరిత్రలను వదిలిపెట్టి ప్రజల విజ్ఞానమునుగూర్చి వ్రాయవలెను. పేద ప్రజల నాటకములు, కీర్తనలు, జానపద గేయములు మొదలైన వాటిని క్రొత్త ఉపయోగములోనికి తేవలెను" అని ఆయన చెప్పినాడు. "చరిత్రలో అభివృద్ధినిరోధకులైనవారిని విప్లవకారులని మనము చిత్రించకూడదు. పీటర్ ది గ్రేట్‌ను లెనిన్‌తో సరిపోల్చకూడదు. అటులనే మంచూ చక్రవర్తియైన చీయన్ లింగును మావోసిటంగుతో సరిపోల్చకూడదు" అనికూడ ఆయన చెప్పెను. చైనాలో ఇప్పుడు కర్షక, కార్మిక వర్గములనుండి నూతన రచయితలు బయలుదేరుచున్నారు. ఉదాహరణము : చెంగు టెంగు కో అను రచయిత ప్రజల విముక్తి సైన్యములో చేరిన తరువాత చదువుట వ్రాయుట నేర్చుకొనెను. కాని ఆయన గొప్ప రచయితయై మిసెనెటు, నరక రాజ్యము అను గ్రంథములను వ్రాసినాడు. (వైట్ హైయిర్డు గరల్) తెల్ల వెంట్రుకల పిల్ల అను ప్రసిద్ధ నాటకములో వర్గతత్వము పూర్తిగ ప్రదర్శింపబడియున్నది. ఇందులో కమ్యూనిస్టు వ్యతిరేకులయందు పూర్తి

హైన ద్వేషము, కమ్యూనిస్టు పక్షమువారియందు పూర్తి అభిమానము అను రెండు కమ్యూనిస్టు సిద్ధాంతములు పూర్తిగ ప్రదర్శింపబడినవి. ఈ రెండు సిద్ధాంతముల కొరకే సంగీతము, కీర్తనలు, వాయిద్యములు, గేయాలు, నృత్యము మొదలైనవి విరివిగ ఉపయోగింపబడినవి. 'ది స్టోలెన్ ఇంపీరియల్ హార్స్' (**The Stolen Imperial Horse**) దొంగిలింపబడిన సామ్రాజ్యవాదుల గుర్రము అనునది యొక నృత్యము. ఇది దక్షిణభారతములోని కథాకళి నృత్యమును బోలియున్నది. చైనాలో సినిమా కూడ బాగుగ వృద్ధియగుచున్నది. దానినికూడకమ్యూనిస్టు భావ వ్యాపకమునకే వినియోగించుచున్నారు. నవచైనా ప్రభుత్వము సంగీతమును, నాటకమును, నృత్యమును, సినిమాను బాగుగ వృద్ధిచేయుచున్నారు. చిత్రలేఖనము అంతగా వృద్ధి కాలేదని ఫ్రాంక్ మోరేసు వ్రాసినాడు. చరిత్రాత్మకమైన పాత శిథిలములను, శిల్పకళాశకలములను, కమ్యూనిస్టు ప్రభుత్వము జాగ్రత్తగ సంరక్షించుచున్నది. కన్ఫ్యూషియసు మహర్షియొక్క గృహము, దేవాలయము, సమాధి జాగ్రత్తగా కాపాడబడుచున్నవి. వాటిచుట్టూ ఉన్నవృక్షములబారులు ఆనందమును కలుగ చేయుచున్నవి. తక్కిన సామాన్య దేవాలయములను, చర్చిలను చాలవరకు ఆక్రమించి వాటిలో పాఠశాలలను పెట్టియున్నారు.

## 5

విదేశక్రైస్తవ మతబోధకులు ఎటుల చైనాలో జొరబడి చైనావారిని క్రైస్తవులుగ చేసి యొక గొప్ప స్వదేశక్రైస్తవ

సంఘమును చైనాలో స్థాపించినారో మనము తెలుసుకొని యున్నాము. విద్యాలయములు, వైద్యాలయములు కూడ ఈ క్రైస్తవ మతబోధకులచే తెరువబడి మానవ సేవ, విజ్ఞాన వ్యాపకము గావింపబడెను. గాని ఈ క్రైస్తవ మతబోధకులు తమతమ దేశముల ప్రభుత్వములకు ప్రతినిధులుగ నుండిరి. ముఖ్యముగ ప్రొటస్టెంటు మతబోధకులు అమెరికా ప్రభుత్వ ఏజంట్లుగనుండి చైనాలో జరుగుచున్న రాజకీయ పరిణామములను అమెరికాకు తెలుపు చుండిరి. అమెరికా ప్రభుత్వ రాజనీతియే వీరిదికూడా అయి యుండెను. సంపూర్ణముగ క్యూమింటాంగు నడుపుచున్న జాతీ యోద్యమములో వీరందరు సానుభూతి కలిగియుండిరి. క్యూమిం టాంగు కమ్యూనిస్టు అంతర్యుద్ధము వృద్ధియైన కొలది క్యూమిం టాంగుతోనే వీరి సానుభూతి యుండెను. కాని చ్యాంగుకేషకు ప్రభుత్వములో వ్యాపించిన లంచగొండితనమును ఏవగించిరి. నాణెము విలువ అతిగా పడిపోయి వస్తువుల ధరలు తీవ్రముగ హెచ్చుటకూడ చ్యాంగుకేషకుప్రభుత్వమునందు వీరికివ్యతిరేకతను కలుగచేసెను. ఈ సంగతి అమెరికాలో నున్న క్రైస్తవ సంఘము లకు తెలుపుటవలన చైనానుగూర్చి అమెరికా ప్రజాభిప్రాయము స్థిరపడుచుండెను. ఈ క్రైస్తవ మిషనరీలు చ్యాంగుకేషకును, మదామ్ చ్యాంగుకేషకును దర్శించి క్యూమింటాంగును పరిశుద్ధ పరచవలసిన యావశ్యకతను గూర్చి మాటలాడగ వారిద్దరు క్రైస్తవులే యైనను ఈ మతబోధకులకు తిరస్కారముగ జవాబు చెప్పిరి. ఈ మతబోధకులు చ్యాంగ్ కేషకుతో నిరాశచెందిరి.

కమ్యూనిస్టు చైనాలోని క్రైస్తవ సంఘము

కమ్యూనిస్టులు ఈ మతబోధకులతో తియ్యగ మాటలాడుచు వీరి సానుభూతిని పొందుటకు యత్నించిరి. చైనా స్వదేశ క్రైస్తవు లలో కొందరు కమ్యూనిజమును అవలంబించిరి. కాని కమ్యూనిస్టు రాజ్యమేర్పడగనే క్రైస్తవ మతబోధకులమీద పూర్తియైన నిర్బంధములు విధించబడెను. ముఖ్యముగ అమెరికా మత బోధకులు, తమకు శత్రువులైనట్టియు, సామ్రాజ్య వాదులైనట్టియు అమెరికా ప్రభుత్వపు ఏజంటులనియు, అమెరికాయొక్క పంచ మాంగ దళమనియు చైనా కమ్యూనిస్టులు ప్రచారము చేసిరి. కమ్యూనిజములో ఎవరైన చేరినను వారిని ఎంతోకాలము పరీక్షించికాని నమ్ముటలేదు. "చైనాలోనున్న మిషనరీలు జైళ్లలో పెట్టబడిరి. వారందరు ఏకాంతపు ఖైదు కొట్టులలోనే సాధారణముగ నుంచబడిరి. అచ్చటికి ప్రభుత్వపోలీసులువచ్చి మార్క్సు యందు నమ్మకమును ప్రకటించెదరా ? యని వారి నడిగిరి. వారందుకొప్పుకొనక క్రైస్తవ మత విశ్వాసమును గట్టిగ ధ్రువ పరచిరి. అట్టివారిని ప్రజాకోర్టులలో బహిరంగ విచారణలుజరిపి శిక్షించిరి. ప్రభుత్వసహాయము పొందే టీన్ ఫెంగు అను క్రైస్తవ పత్రిక అటువంటి బహిరంగ విచారణ కథలను విరివిగ ప్రచు రించెను. చాలమంది మిషనరీలు చైనాను వదలిపెట్టి లేచి పోయిరి. చైనా దేశములోనే యుండదలచినవారు క్రైస్తవ మతముతోపాటు కమ్యూనిస్టు పక్షమునకు మార్చుకొనిరి. మొత్తముమీద చైనాలోని క్రైస్తవ సంఘము చాలవరకు నూతన కమ్యూనిస్టు విప్లవములో చేరినది. మూసియుంచబడిన క్రైస్తవ దేవాలయములు మరల తెరువబడ్డవి. క్రైస్తవులు

వాటికి హాజరగుచున్నారు. కొన్ని దేవాలయములు పాఠశాలలు గను, శరణాలయములుగను మార్చబడినవి. క్రైస్తవ మతబోధ, కమ్యూనిజము బోధ రెండు క్రైస్తవ దేవాలయములలో చేయ బడుచున్నవి. కాని క్రైస్తవ మతబోధకులనుండి విద్యాలయము లన్నిటిని ప్రభుత్వము వశపరచుకొన్నది. వాటిలో క్రైస్తవ మతమునకు వ్యతిరేకమైన బోధ చేయబడుచున్నది. అసలు మతమే పనికిరాదని విద్యార్థులకు బోధ చేయుచున్నారు. లోక రక్షకుడు ఏసుక్రీస్తు కాడని, కారలు మార్క్సు అని బోధించు చున్నారు. ఇక క్రైస్తవ మతమునకేగాక ఏ మతమునకు కూడ చైనాలో తావులేదు." అని 'క్రైస్తవ మిషనరీలు, చైనావారు, రాజకీయ వేత్తలు' అను గ్రంథములో పాలు ఏవర్గు వ్రాసి యున్నాడు.

**కాథలికు మతగురువులకు దారుణ శిక్షలు**

చైనాప్రభుత్వము కమ్యూనిజమును అంగీకరించని విదేశ రోమను కాథలికు మత గురువుల మీద దండయాత్ర సలిపెను. వారి నందరిని కమ్యూనిస్టు రాజ్యమును కూలద్రోయు నేరముల క్రింద శిక్షించినది. "చైనా రోమను కాథలిక్కుల దేశాభిమానుల సంఘము" అను నొక సంఘమును కమ్యూనిస్టులు సృష్టించి నారు. వారిని రోములోని పోపునుండియు, ఆయన క్రిందనున్న మత గురువులనుండియు వేరు చేయించినారు. బిషపు కంగ్ పింగ్‌మే గారిని, ఇతర రోమను కాథలిక్కు ప్రముఖులను షాంఘై ప్రజాకోర్టు విచారించి 5 మొదలుకొని 20 సంవత్సర ముల వరకు శిక్షలు విధించినది. అమెరికా రోమను కాథలిక్కు

మత బోధకుడగు బిషపు జేమ్సు ఇ వాల్షును 1958 వ సంవత్సరములో చైనా ప్రభుత్వము అరెస్టుచేసి అప్పటినుంచి జైలులోనే యుంచి తుట్టతుదకు 1960 వ సంవత్సరము మార్చి నెలలో యావజ్జీవ శిక్ష విధించినారు. వారితోపాటు పదముగ్గురు చైనా మతబోధకులనుకూడ దీర్ఘకాలపు ఖైదులను వేసి శిక్షించినారు. విచారణకు షాంఘైకు తీసుకురాబడిన బిషపు వాల్షుగారు తన నేరమును ఒప్పుకొన్నాడనికూడ ప్రకటించినారు. ఆయన వయస్సు 69 సంవత్సరములు. ఆయన ఒక గొప్ప కుట్రను లేవదీసినాడని చైనాలోని రోమను కాథలిక్కులును, మత గురువులును కమ్యూనిస్టు పార్టీకి వ్యతిరేకముగ సంచరించుటకు, ప్రజల ప్రభుత్వమును తోసివేయుటకు ఏర్పాటు చేసినాడని నేరము మోపబడినది. ఆయన 1948 వ సంవత్సరములో చైనాకు వచ్చి అక్కడే పనిచేయుచుండెను. ఆయనతోపాటు రివరెండు చార్లెస్ మెకార్థి, అల్లాండి తెరవానికూడ నేరములు మోపబడి శిక్షింపబడిరి. జార్జి ఎంథోనీ జర్మన్‌గారుకూడ కమ్యూనిస్టు ప్రభుత్వమును కూలద్రోయుటకు ప్రయత్నించినాడని ప్రజాకోర్టుచే శిక్షింపబడిరి. ఈ దారుణమైన శిక్షలకు అమెరికా ప్రభుత్వము ఆశ్చర్యము నొందినది. సెక్రెటరీ ఆఫ్ స్టేట్, క్రిస్టియను హేర్టర్, పికింగు ప్రభుత్వమునకు తమ అసమ్మతిని ఖండితముగ తెలిపినారు. "రివరెండు వాల్షు గారికి యావజ్జీవ శిక్ష విధించుట నాకు, మా ప్రభుత్వమునకు ఎంతో కష్టము కలుగజేసినది. అమెరికా యొక్క గౌరవమైన పౌరుడును, కాథలిక్కు సంఘములో పేరు ప్రసిద్ధులుగన్న నాయకుడును నైన వాల్షు గారికి

ఇట్టి దారుణశిక్ష విధించినందుకు మాత్రోబాటు నాగరిక ప్రపంచ మంతయు చైనా ప్రభుత్వమును ఖండించునని తాను నమ్మెద" నని ఆయన చెప్పెను. వార్సాలో కొలదిరోజులలో జరుగబోవు చైనా-అమెరికా రాయబారుల సమావేశములో అమెరికా ప్రతినిధి ఈ శిక్షను గురించి ప్రస్తావించబోవుచున్నాడని కూడ ఆయన చెప్పెను.

# చైనా విప్లవము

## సప్తదశాధ్యాయము

---

### 1

### కమ్యూనులు (Communes) - రష్యాతో భేదము - వైదేశిక రాజనీతి

1950 వ సంవత్సరములో చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము చేసిన భూ సంస్కరణల చట్టములో భూస్వామందుల వర్గమును తీసివేసి భూములమీద రైతాంగముయొక్క స్వంత హక్కును స్థాపించెదమనియు, ఇందువలన వ్యవసాయ సరుకుల యుత్పత్తి అధికమై నవచైనాయొక్క పారిశ్రామికాభివృద్ధికి తోడ్పడు ననియు వ్రాయబడి యున్నది. అటుల భూములమీద రైతులకు స్వంతహక్కు శాశ్వతముగ నుంచుపద్ధతి ప్రకటింప బడినప్పటికిని అందువలన 50 కోట్ల రైతులకు అత్యంతమైన సంతోషము కలిగి ప్రభుత్వము

చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము రైతులకు కరారు భంగము చేసినది

వారు చెప్పిన చొప్పున నీటి పారుదల, వరదల నివారణ, మొదలగు కార్యములలో అత్యుత్సాహముతో పనిచేసినప్పటికి, అయిదు సంవత్సరములలో ప్రభుత్వముచేసిన వాగ్దానమును వదలిపెట్టి భూసంస్కరణల చట్టమును తోసివేసి రైతాంగము వద్దనుంచి భూముల నన్నిటిని నష్టపరిహార మివ్వకుండగనే లాగుకొని ప్రభుత్వము క్రిందకు చేర్చుకొని వాటిని సమష్టి వ్యవసాయ క్షేత్రముల కిచ్చి చైనా దేశములోని రైతుల నందరిని భూములేమియు

లేని కూలీలుగ మార్చి యుండుట మనము చూచియున్నాము. ఇంతకంటె రైతులమీద జరిపిన గొప్ప వాగ్దానభంగ ముండబోదు.

రైతాంగమునకు స్వంత భూమి లేకుండచేసి సమష్టి వ్యవసాయ క్షేత్రములను స్థాపించినందుకు క్రమముగా రైతాంగములోనేగాక, పార్టీ సభ్యులలోను, వైజ్ఞానికులలోను, బస్తీ ప్రజలలోను వ్యతిరేకత హెచ్చినట్లు కనుగొనబడినది.

"నూరు పుష్పములు వికసించనీ" ప్రకటన, దారుణ శిక్షలు

ప్రజలకు కొంత వాక్స్వాతంత్ర్యము, ప్రకటనా స్వాతంత్ర్యము నిచ్చి వారి మనోభావములను పూర్తిగ తెలిసికొని ఆ పిమ్మటనే ముందుకు సాగిపోవుట మంచిదని మావోసిటంగు భావించినారు. 1956 వ సంవత్సరము మే నెలలో "నూరు పుష్పములు వికసించనీ, నూరు అభిప్రాయ దృక్పథములు వర్ధిల్లనీ" అను భావములను మావోసిటంగు ప్రకటించి ప్రజాభిప్రాయమును కనుగొనుటకు ప్రయత్నించినాడు. కమ్యూనిజమునకు, దేశములోని భావ నిర్బంధములకు, ప్రభుత్వ విధానములకు అత్యంతమైన వ్యతిరేకత చెలరేగినది. పార్టీసభ్యులు, పత్రికా రచయితలు, వైజ్ఞానికులు, రైతు నాయకులు, బస్తీలలోనివారు, ఎవరికితోచినవిధముగ వారు కమ్యూనిస్టువిధానములనుగూర్చి విమర్శనలు చేయసాగినారు. చైనాలో, కమ్యూనిస్టు ప్రభుత్వము పడిపోవునా యనునంత భయోత్పాతము కలిగినది. పార్టీలోని లోపములను సరిదిద్దుటకు మారుగా కమ్యూనిస్టు పార్టీయే తుడుచుకొనిపోవు భావములు బయలుపడినవి. అందుమీద వెంటనే కమ్యూనిస్టు ప్రభుత్వము తెలివి తెచ్చుకొనినది. భావస్వాతంత్ర్యము, పత్రికాస్వాతంత్ర్యము, ప్రకటనా స్వాతంత్ర్య

మును ఇచ్చినయెడల తమ రాజ్యము నిలువదని తెలుసుకొనినది. రుష్యాలో స్టాలిన్ అవలంబించిన క్రూర నిర్బంధ పద్ధతులనే తాముకూడ అవలంబించినవేగాని, తాము ఆదర్శముగా పెట్టుకొన్న కమ్యూనిస్టు సమాజ స్థాపన చైనాలో జరుగనేరదని మావోసిటంగు మొదలైన కమ్యూనిస్టు నాయకులు దృఢనిశ్చయమునకు వచ్చిరి. అందుమీద 1957-వ సంవత్సరము మధ్యభాగమున మరల నిర్బంధ విధానములను తీవ్రముగ సాగించినారు. ప్రభుత్వమునకు వ్యతిరేకముగ నున్నవారిని, ప్రభుత్వమును విమర్శించినవారిని, వ్యతిరేకముగ మాట్లాడినవారిని వ్రాసినవారిని 'ప్రజాకోర్టు'ల ముందుకు తీసుకొనివచ్చి దారుణ శిక్షలను విధించసాగినారు. వీరికందరికి మితవాదులని, విప్లవ వ్యతిరేకులని, దేశద్రోహులని పేరులుపెట్టినారు. చాలమందికి మరణశిక్షలు విధించినారు. కొందరిని ఎక్కడికి మాయము చేసినారో ఎవరికిని తెలియదు. కొందరిని దూర ప్రాంతములలోని కంపల్సరీ లేబరు క్యాంపులకు (నిర్బంధచాకిరీ చేయు కేంద్రములకు) పంపినారు. చాలమందిని తమ అభిప్రాయములు మార్చుకున్నామని, పశ్చాత్తాపము తెలిపినందున క్షమించినారు. అటుల పశ్చాత్తాపములను ప్రకటించలేక కొంతమంది ఆచార్యులు, విద్యార్థులు ఆత్మహత్యలు చేసుకొన్నారు. ఈవిధముగ అత్యంత బీభత్స కృత్యములను కమ్యూనిస్టు ప్రభుత్వము గావించి దేశములో శాంతిని మరల నెలకొల్పినది. దానిని 'శ్మశానశాంతి' అనవచ్చును. అత్యంత భీతావహము వలన ప్రజలు ప్రభుత్వమునకు పూర్తిగ లోబడుటచేత ఏర్పడిన శాంతి.

ఆవిధముగ ఏర్పడిన శాంతిని అవకాశముగ తీసుకొని మావోసిటంగు మొదలైన నాయకులు 1957-వ సంవత్సరము ఆఖరు భాగమునుంచి తాము తలపెట్టిన కార్యక్రమమును ముందుకు సాగించినారు. 1958 నుండి 1962 వరకు ద్వితీయ పంచవర్ష ప్రణాళిక స్థిరపరచి సాగించవలసి యున్నది. సమష్టి వ్యవసాయ క్షేత్రములవలన భూములలో పంట వృద్ధియైనమాట వాస్తవమే. ఇందువల్ల కూలీలుగ మారిన రైతుల కిచ్చిన మజూరి హెచ్చలేదు. వచ్చిన అధిక లాభము ప్రభుత్వమునకు చెంది దానిని పరిశ్రమలలో పెట్టుబడి క్రింద పడవేసినారు. అయినను పారిశ్రామిక రంగమునకు ప్రభుత్వము కోరినంత పెట్టుబడి లభించలేదు. వ్యవసాయ సరుకుల యుత్పత్తి, ఆహారోత్పత్తి ఎక్కువగ పెరిగినను దానితోపాటు చైనాదేశముయొక్క జన సంఖ్య కూడ ప్రతి సంవత్సరము షుమారు ఒక కోటిన్నర పెరుగుచుండుట వలనను, పారిశుద్ధ్యము, వైద్య సేవ మొదలైన వాటి మూలమున దేశములో మరణముల సంఖ్య తగ్గుచుండుట వలనను ప్రభుత్వమునకు మిగులునది కోరినంత ఎక్కువ కాలేదు. కావున యుత్పత్తి పెంచవలసియున్నది. అటుల చేసినకాని ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో నిర్ణయించిన అధిక పారిశ్రామికాభివృద్ధి జరుగనేరదు. ఇంతకంటె ముఖ్యముగ కమ్యూనిస్టు సమాజ నిర్మాణములో మరియొక మెట్టునకు పోవలసియున్నదని, అటుల చేయుటకు సమయము వచ్చినదని, చైనాకమ్యూనిస్టు ప్రభుత్వ నాయకులు తలచినారు. ఈ కారణములచే వెంటనే కమ్యూను

కమ్యూనుల స్థాపనము

లను (Communes) స్థాపించుటకు నిశ్చయించి 1958 వ సంవత్సరము ఏప్రిలు, అక్టోబరు నెలల మధ్య నూటికి 90 వంతుల గ్రామములలోని జనసముదాయమునంతను కమ్యూనులలోనికి మార్చినారు. కమ్యూనిజముకు కారలుమార్క్సు సిద్ధాంతప్రకారము 'కమ్యూను' అంతిమదశ అయ్యున్నది. ఈ కమ్యూనులవలననే ప్రభుత్వము తలపెట్టిన పారిశ్రామికాభివృద్ధి జరిగి అచిరకాలములోనే పారిశ్రామిక రంగములో కూడ చైనాదేశము ఇంగ్లాండును మించిపోవుననియు, ఇందుకుగాను ప్రజలు అధిక త్యాగములను చేసి కష్టపడి పనిచేయవలసి యున్నదనియు కమ్యూనిస్టు కార్యకర్తలు గ్రామములలో జోరబడి ప్రచారము సాగించినారు. రేడియో దూరశ్రవణ యంత్రముల ద్వారా రాత్రింబవళ్లు విధివిరామము లేక కమ్యూనులయొక్క ప్రాశస్త్యమును గూర్చి ప్రతి మారుమూలను ప్రచారము చేసి ఆ భావములను గ్రామప్రజల తలల కెక్కించినారు. కమ్యూనులలో చేరిన గ్రామములలోని అందరు ప్రజలయొక్క స్థిర చరాస్తులన్నియు ప్రభుత్వము తీసుకొని వారికి కావలసిన భోజనము, నివాసము, వస్త్రము, విద్య, వైద్యము, శిశుపోషణ మొదలగు అన్ని సౌకర్యములు ప్రభుత్వమే సమానముగ ఎక్కువతక్కువలు లేకుండ చేయును. వ్యవసాయికులే గాక పారిశ్రామికులు, కార్మికులు, వర్తకులు, విద్యావంతులు మొదలగు కుటుంబముల యొక్క యావత్తు భూములు, ఫ్యాక్టరీలు, గృహములు, నగలు, నగదు, వ్యవసాయ-పారిశ్రామిక పనిముట్లు, పశువులు, బండ్లు, రవాణా సౌకర్యములు అనగ ఆస్తి యంతయు కొంచెమైనను ఆ కుటుం

బములకు, ఆ వ్యక్తులకు లేకుండ ప్రభుత్వము తీసుకున్నది. ప్రభుత్వ యాజమాన్యముననే వ్యవసాయము, సామాన్య పరిశ్రమలు, వర్తకము, విద్య, వైద్యము, రోడ్లు మొదలగు రవాణాలు జలాధారములు నిర్మాణము గావింపబడుచున్నవి. వాటిని ప్రభుత్వ ఉద్యోగులే నడిపెదరు. వారు కమ్యూనిస్టుపార్టీవారు. నాస్తికత్వమును నేర్పెదరు. కుటుంబము, సొంత ఆస్తి, మతము, ఈ మూడు నాశనము చేయబడినవి. అందరును ప్రభుత్వముక్రింద మజూరికి పనిచేయు వ్యక్తులే యైనారు. సంతానోత్పత్తికి మాత్రము భార్యాభర్తల సంబంధ ముంటుంది. గాని ఆ సంతానము ప్రభుత్వముయొక్క ఆస్తి అయ్యున్నది. ప్రతి కమ్యూనులోను నాలుగువేలు మొదలుకొని 10 వేల వరకు గ్రామ కుటుంబములు సభ్యులుగ చేర్చబడినారు. యావత్తు దేశములో 7 లక్షల 50 వేల సమష్టి వ్యవసాయ క్షేత్రములను పంచిపెట్టి 26 వేల కమ్యూనులను నిర్మాణము గావించినారు. మరల 1958 డిశంబరు నెలలో కమ్యూనులయందు ప్రజలలో నేర్పడిన వ్యతిరేకతను గుర్తించి ప్రభుత్వము కొంచెము నెమ్మదిగా పురోగమించమని కార్యకర్తలకు, ఉద్యోగస్థులకు ఆదేశించెను. మరల అంతయు శాంతించగనే కమ్యూనులను కట్టుదిట్టముచేసి వృద్ధిచేసెను. మొత్తముమీద కొలదికాలములోనే ప్రభుత్వము తలపెట్టిన కమ్యూనుల విధానము పూర్తిగ స్థాపితమయ్యెను. కమ్యూనులలో చేరిన స్త్రీ పురుషు లందరిని వివిధ రంగములలో పనిచేయుటకు పంచిపెట్టి వారిచేత పనిచేయించుచున్నారు. ఆయా రంగముల కవసరమైన తరిబీయతు నిచ్చుచున్నారు. ఎవరికిని, స్వంత ఆస్తిగాని, స్వంత

ఇల్లుగాని ఉండకూడదు. ఇండ్లలో వంటచేయు సామానులను కూడ తీసుకొనిరి. అందరుప్రజలు రాత్రిళ్ళు పడుకొనుటకు చిన్న చిన్నగదులుగల బారకాసుల వరుసలను నిర్మించిరి. చిన్న యిండ్లు గలవారు తీవ్రమైన ఆక్షేపణలు తెలుపగ నవి యున్న యెడల వాటిలోనే రాత్రిళ్ళు భార్యాభర్తలు, పిల్లలు పడుకొనుటకు మావోసిటంగు అనుమతి నిచ్చినాడు. గాని ఆ యిల్లు ప్రభుత్వ ముదే. దానిని ప్రభుత్వోద్యోగులు ఎప్పుడైనను ఆక్రమించ వచ్చును. అపుడు భార్యాభర్తలు, పిల్లలు బారకాసులలోని గదు లలో చేరవలెను. స్త్రీలు పిల్లలను పెంచవలసిన పనిలేదు. పిల్లలను ఉయ్యాలలలో పెంచుటకు ప్రత్యేకముగ తర్ఫీయతు పొందిన దాదులకు వప్పగించిరి. స్త్రీలు వంటచేయవలసిన పనిలేదు. ప్రతిచోటను వంటశాలలును, భోజనశాలలును ఏర్పాటు చేయబడి వాటిలోనే యావన్మంది స్త్రీపురుషులు, బాలబాలికలు భోజనము చేయవలసి యుండును. అటుల భోజనము చేయు టకు టిక్కెట్లు నిచ్చెదరు. స్త్రీ పురుషులకు, బాలబాలికలకు నీలపు దుస్తులను ధరించుట కిచ్చెదరు. ఆ దుస్తులను కమ్యూను కుట్టుపని శాఖవారు బాగుగ చేయుచుందురు. పగలంతయు పురుషులు, స్త్రీలు, కమ్యూనుపైన యేర్పడిన వివిధశాఖల యుద్యోగస్తులు నిర్ణయించే వ్యవసాయిక, పారిశ్రామిక, మొద లయిన రంగములలోకి పోయి పనిచేసి, రాత్రిళ్ళు వారుచూపే యిండ్లలో లేక బారకాసులలో పడుకొనవలెను. వారము రోజులు మొదలు, నాలుగు సంవత్సరములవరకు వయస్సు గల పిల్లలనందరిని దాదులే పెంచెదరు. సాధారణముగ రాత్రి

వేళల ఆపిల్లలను తల్లులకు వప్పగించెదరు. అనేక సందర్భములలో తల్లులు రాత్రిళ్ళు పనిచేయవలసి వచ్చినపుడు ఆపిల్లలను రాత్రిళ్లు కూడ దాదులవద్దనే నుంచెదరు. సాధారణముగ భవన నిర్మాణము, రోడ్ల, ప్రాజెక్టుల నిర్మాణములకు పగలొకజట్టు, రాత్రి మరియొకజట్టు స్త్రీ పురుషులు పనిచేయుచుందురు. కమ్యూనులలోచేరిన యావన్మంది వయసువచ్చిన పురుషులకు సైనికశిక్షణ నిచ్చి జాతీయ పౌరసైన్యముగ తయారు చేయుట మరియొక ముఖ్యవిషయము. స్త్రీలకు పురుషులకుకూడ సైనిక కవాతులు నేర్పుచున్నారు. చైనా ప్రభుత్వమువారు మామూలు ప్రభుత్వ సైన్యముగాక పైగా జాతీయ పౌరసైన్యమును తయారుచేసిరి. ఇప్పుడు ప్రభుత్వము జీతములిచ్చి ఉంచుకొన్నసైన్యము ముప్పది లక్షలు కలదు. దీనికిపైగా రెండు కోట్లవరకు జాతీయ పౌర సైన్యము తర్ఫీయతు చేయబడినది.

**కమ్యూనుల వలని నిర్బంధములు**

చైనాలోని ప్రభుత్వము కార్మికవర్గ నియంతృత్వ ప్రభుత్వమై (**Proletariat Dictatorship**) యున్నది. కార్మిక వర్గమునకు ప్రతినిధియైన కమ్యూనిస్టు పార్టీచేతను, దానికి నాయకులైన మావోసిటంగు, చౌ ఎన్ లై లియో షౌచి, చెన్‌యున్ నాయక బృందము చేతను నడపబడుచున్నది. కమ్యూనుల స్థాపన వలన ప్రజల శరీరములు చైనా కమ్యూనిస్టు ప్రభుత్వముయొక్క ఆస్తియైనవి. వారిని ఏవిధముగ నైనను ప్రభుత్వము వాడుకొన వచ్చును. ఇంతేగాక వారియొక్క మెదడులు, మనస్సులు, భావములు, కోరికలుకూడ పూర్తిగా ప్రభుత్వాధీనమైనవి. వారి ఇచ్ఛ

వచ్చినటుల మాట్లాడకూడదు, ఆలోచించకూడదు, ప్రభుత్వనాయకులు ఆదేశించిన విధముననే ఎట్టి ఆలోచనలేకుండ ప్రవర్తించవలెను. ప్రజలకు ఆస్తి లేకపోవటమేకాక ఇల్లు వాకిలి లేవు. ప్రభుత్వోద్యోగులు ఎక్కడ పడుకోమన్న అక్కడ పడుకోవలెను. జైలులోని ఖైదీలకు ముద్ద పెట్టినట్లు ప్రజలకు ప్రభుత్వోద్యోగులు భోజనశాలలలో అన్నము పెట్టెదరు. రుచిగాఉన్నా రుచిగా లేకపోయినా దానినే తినవలెను. ఎవరిఇంటిలో వారు తమకు రుచికరముగా వంటచేసుకొని భోజనముచేసే హక్కునశించినది. కొన్ని వేళల రోజుల కొలది వట్టి ఉడకబెట్టిన చిలగడదుంప, కొంచెము అన్నము పెట్టెదరు. చిలగడదుంప ఎక్కువ పండినందున దానినే నిర్బంధముగ తినవలసి వచ్చినది. అనేకమందికి తినుటకు తిండి చాలలేదని, వారిచేత చేయించుచున్న శరీర కష్టము అత్యధికముగానున్నదని, అందువలన వారికి ఆరోగ్యము చెడుతున్నదనికూడ ఫిర్యాదులు వచ్చుచున్నవి. గృహము లేనప్పుడు గృహధర్మములు లేవు. ఈ విధముగ అనాదికాలమునుండి నాగరిక సంఘములకన్నిటికి పునాదిగానున్న గృహసంస్థను, కుటుంబ సంస్థను చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము నాశనము గావించినది. కమ్యూనులు కేవలము ఆర్థిక ఉత్పత్తిసంఘములు గావు. ప్రజల జీవితమును పూర్తిగ తలక్రిందులు గావించి నూతన పంథాలో నడుపుచున్న సంస్థలు. స్వంత ఆస్తికొరకు మరల ప్రాకులాడుటకు అవకాశము శాశ్వతముగ తీసివేయబడినది. ప్రజలు నేర్చుకోవలసిన విద్య, వినవలసిన రేడియోలు, చూడవలసిన నాటకములు, సినిమాలు, చదువవలసిన పుస్తకములు, పత్రికలు ఇవియన్నియు కమ్యూను

అధికారులే నిర్ణయింతురు. స్త్రీలుగాని, పురుషులుగాని, వ్యవసాయములోనుంచి పారిశ్రామిక రంగమునకుగాని, లేక గనులు త్రవ్వ, లేక కొండలు కొట్టు పనులకుగాని పంపబడవచ్చును. భార్యలు, భర్తలు ఒకచోటనే పనిచేయవలసిన పనిలేదు. వివిధ రంగములలోనేగాక వివిధ ప్రాంతములలోకూడ పనిచేయుటకు వేరువేరుగ పంపబడవచ్చును. చాల కాలము వరకు ఒకరి నొకరు చూడకపోవచ్చును. పిల్లలను తల్లిదండ్రులు చాలకాలము వరకు చూడకపోవచ్చును. డాక్టర్ చంద్రశేఖర్ గారు చైనాలోనుండగా ఒక కమ్యూనిస్టు స్నేహితుడు తాను నాలుగు దినముల క్రిందట వివాహమాడిన యువతిని చూపించెను. వారు ముగ్గురు ఎంతో సంతోషముగ కొంతసేపు కాలము గడపిరి. మరునాడు వారిద్దరు ఆయనవద్దకువచ్చి ఆయువతిని ప్రభుత్వమువారు కొన్ని వందల మైళ్ళ దూరములోనున్న ఒక కమ్యూనులోని ఫ్యాక్టరీలో ఉద్యోగము చేయుటకు పంపినారని, ఆమె వెళ్లుచున్నదని, భర్త ఇక్కడే ఉండునని వారు చెప్పినారు. కమ్యూనిస్టు ప్రభుత్వపు ఆజ్ఞను శిరసావహించక తప్పదు. తమ ఎడబాటును లెక్కచేయక ఆమె సంతోషముతో తప్పక తన ఉద్యోగములోకి వెళ్లునని చెప్పి సెలవు పుచ్చుకొనిరి. అంతేకాక, స్త్రీ పురుషులు పిల్లలతో సహా దూరప్రాంతములకు కాపురమునకు పంపబడుచున్నారు. జనసమ్మర్దములేని సింకియాంగు, పశ్చిమ మంగోలియా, టిబెట్ మొదలైన ప్రాంతములకు విశేషముగ జనముగల రాష్ట్రముల నుంచి లక్షలకొలది జనము పంపబడుచున్నారు. ఈ కమ్యూనులు పౌరులమీద నిర్బంధముగ ప్రవేశపెట్టబడినవని, పౌరులు వీటిని

అంగీకరించుటలేదని, విధిలేక పనిచేయుచున్నారని, హృదయ పూర్వకమైన సంతోషముతో పనిచేయుటలేదని, పైన ఖచ్చితమైన తనిఖీ లేకపోయినప్పుడు పనులలో ఉపేక్ష చేయుచున్నారని, ఎన్ని సంవత్సరములు యీ నిర్బంధపు శ్రమ, ఎవరికొరకు అను కొంటున్నారని అమెరికా రచయిత ఆల్బర్ట్ రావెన్‌హోల్ట్ వ్రాసినాడు. పౌరునిలో అహింసాయుత ఆగ్రహము, నిస్పృహ యత ప్రబలినదనియు, అతనికి అదివరకు జీవితముమీదను, తన పని మీదను వుండిన ఉత్సాహము మృగ్యమైనదనియు కూడ ఆయన వ్రాసినాడు. తన కుటుంబముయొక్క గాని, తన ముసలితనము యొక్క గాని ఆర్థిక సహాయమునకు తాను ఏమియు దాచు కొనలేకపోవుట, తనగోరీని తన సంతతివారు చక్కగా చూడక పోవుట ఆతనిలో నిస్పృహ కలుగచేసినదని కూడ వ్రాసినారు. నవ చైనాలో ఎముకల ఎరువుల కొరకు గోరీలు త్రవ్వించినారని గ్రంథ కర్తలు వ్రాసినారు. మరియు పితృదేవతల గోరీల ఆరాధనకివ్వబడిన భూములను లాగుకున్నారు. పితృదేవతల ఆరాధన చైనా ప్రాచీన నాగరికతకు ప్రాణమువంటిది. "ఇంకొక పార్టీ లేదు. తననుఆదరించు వాడు, ధైర్యము ఇచ్చువాడు లేడు. తన పొలము, తన యిల్లు లాక్కున్నారు. తనవద్ద దమ్మిడి లేదు. తన భార్య, తన కొడుకు, తన మనుమడు ఎవరికివారే అయినారు. తన మాట వినరు. ప్రభు త్వోద్యోగులవద్ద అనుమతిపత్రము లేనిది మరియొక ఊరికి పోవు టకు వీలులేదు. తన పూర్వులు, తాను ఆరాధించిన బుద్ధుడు, కన్‌ఫ్యూషియసు మాయమైనారు. ఎక్కడినుంచియో కారలు మార్క్సు, లెనిన్ వచ్చినారు. తన పూర్వులయొక్క ౩,౯౦౦ ల

సంవత్సరముల నాగరకత పనికిమాలినదని ప్రతి నిమిషము కమ్యూనిస్టులు చెప్పుచున్నారు. రాత్రింబగళ్ళు కమ్యూనిజము అని చెవులో రేడియో రొద. పైగా ప్రతిచోటను రహస్యపు పోలీసు నిఘా. దీనిని వ్యతిరేకించుటకు శక్తి చాలదు" అని చైనా రైతు మనస్సులో బాధపడుచునేయున్నాడు గాని పని చేయక తప్పదు. చైనా కమ్యూనిస్టునాయకులు తమయొక్క పూర్తియైన ఇనుపగుప్పిటిలో 60 కోట్ల చైనాప్రజలను పెట్టు కొనియున్నారు. ఆధ్యాత్మికచింతనము గాని, సృష్టిసౌందర్య మును శాంతముగ ఆనందించుటకు గాని, తనయొక్క తన కుటుంబముయొక్క మంచిచెడుగులను తానే యోచించుటకు కాని యే మానవునికి అవకాశము లేదు. నెమ్మదినెమ్మదిగ ప్రభుత్వమువారు బస్తీలన్నీ కూడ కమ్యూనులుగ మార్చిరి. దేశ మంతయు కమ్యూనులుగ విభజింపబడినది. దేశరక్షణ, రైళ్ళు, బ్యాంకులు, మారకము, పెద్ద పరిశ్రమలు, విశ్వవిద్యాలయములు, అన్నిరకముల కళాశాలలు మొదలైన పెద్ద సంస్థలు సరాసరి ప్రభుత్వముక్రింద నున్నవి. ప్రతి కమ్యూనుమీద యాజమాన్యము వహించుట కొరక ప్రధాన అధికారి, ఉపప్రధాన అధికారి, వారికి తోడ్పడుటకు 24 మొదలు 36 వరకు సభ్యులు గల యొక యుపసంఘము గలదు. వారిక్రింద ప్రభుత్వశాఖలు, ఉద్యోగ బృందము గలదు. ప్రతి కమ్యూను పరిపాలనా సౌలభ్యముకొరకు మూడు, నాలుగు ప్రాంతములుగ విభజింపబడినది. వీటిపైనకూడ ప్రధాన అధికారి, ఉపప్రధాన అధికారి, ఒక ఉపసంఘము, వారి క్రింద ఉద్యోగస్తులు గలరు.

## 2

1958-వ సంవత్సరములో చైనాను దర్శించిన ఆంధ్ర ప్రముఖులు డాక్టర్ చంద్రశేఖర్‌గారు తమ పత్రికా వ్యాసములలో కమ్యూనులనుగూర్చి యీ విధముగ వ్రాసినారు: "ఈ కమ్యూనుల స్థాపన విషయములో నేను చైనాలోనున్న కాలములో గాఢమైన ఆలోచనలు వ్యాపించి యుండెను. వీటిని చూచి చైనా ఉద్యోగస్థులు చాల గర్వపడుచున్నారు. తాము యీ విషయములో సోవియటు రుష్యాకంటె ముందడుగు వేసినామని భావించుచున్నారు. నేను నాలుగు కమ్యూనులను చూచినాను. అందులో ఒకటి అత్యుత్తమ మైనదిగ ఉద్యోగస్థులచేత నాకు చూపించబడినది. దానిలో ఉదయము మొదలుకొని రాత్రివరకు పుట్టుక మొదలుకొని మరణమువరకు మానవ జీవితమంతయు ప్రభుత్వ క్రమశిక్షణముక్రిందనే నడపబడుచున్నది. ఇది హోనాను రాష్ట్రములోని సింగుజో పట్టణమునకు ఉత్తరమున ఎనుబదిమైళ్ళ దూరముననున్న చిలీ యనే ప్రబల కమ్యూను అయ్యున్నది. ఈ కమ్యూనును నాకు సంపూర్ణముగ దాని డైరెక్టరు చూపినాడు. ప్రతిదీ నేను పరీక్షించినాను. యావత్తు దేశమునకు ఇది ఆదర్శమైన కమ్యూను అని నాకు తెలిపినారు. కొద్దికాలము క్రిందనే మావోసిటుంగు దీనిని దర్శించినాడనియు, అప్పుడు రైతాంగమంతయు ఆయనను కలిసి నిజమైన కమ్యూనిజమును స్థాపించవలెనని కోరినారనియు డైరెక్టరు నాతో చెప్పినాడు. అప్పుడు ఉద్యోగస్థులు కొంత తటపటాయించినారు. మావోసి

డాక్టర్ చంద్రశేఖర్ చూచిన విషయములు

టుంగు కమ్యూనులయొక్క ఆవశ్యకతను గురించి రైతులతో నేకీభవించి ఉద్యోగస్థులకంటె రైతులే ఎక్కువ అభివృద్ధికరమైన భావములను కలిగియున్నారని చెప్పినారు. ఆ మరుసటి దినమే 1958 వ సంవత్సరము జూలై 20 వ తేదీన ఈ కమ్యూను స్థాపించ బడినది. ఈ కమ్యూనులో 68 గ్రామములున్నవి. ఈ అన్నిగ్రామ ములలో అన్నిభూములు, అన్నిగృహములు, వ్యవసాయ పని ముట్లు, గృహపరిశ్రమలు, పారిశ్రామిక పరికరములు, వంట సామగ్రి అన్నియు రైతులనుంచి తీసుకొనబడి కమ్యూనుకు వప్పగించబడినవి. వీటిపై హక్కు, యాజమాన్యము కమ్యూనుదే అయ్యున్నది. కొన్ని ఇనుపపొయ్యిలు, మిల్లులు బాగుచేసే కార్ఖానాలు, గోధుమపిండి మరలు, కుట్టు యంత్రములు, పెంకు ఇటుకచేయు కొలుములు, భూములకు కావలసిన ఎరువు ఉత్పత్తి సంస్థలు మొదలైన వన్నియు ఈ కమ్యూనుక్రిందనే చేరినవి. ఈ కమ్యూనుక్రింద స్త్రీపురుషులందరు భోజనశాలలలో భోజనము చేయుటకు 228 పబ్లికు భోజనశాలలు (కాంటీన్‌లు) గలవు. ఒకవారము వయస్సునుండి నాలుగు సంవత్సరముల వయస్సు వరకుగల పిల్లలనుపెంచే దాదుల సంస్థలు 135 గలవు. నాలుగు సంవత్సరములు మొదలు ఆరు సంవత్సరముల వరకు వయస్సుగల పిల్లలకు విద్యనేర్పు 130 కిండర్‌గార్టెన్ పాఠశాలలు గలవు. రెండు మిడిల్‌స్కూళ్లు గలవు. వాటిలో 7 మొదలుకొని 16 వరకు వయస్సుగల మొగపిల్లలు, ఆడపిల్లలు 1450 మంది విద్య నేర్చుకుంటున్నారు. వీటికిపైగా వృత్తి పాఠ శాలలు, సాంకేతికపాఠశాలలు 36 గలవు. అందులో యువకులకు,

యువతులకు వృత్తివిద్య వర్తకపువిద్య ఇవ్వబడుటయే కాకుండ కమ్యూనిజము బాగుగ నేర్పబడుచున్నది. ఈకమ్యూనులో రెండు పెద్ద ఆస్పత్రులున్నవి. వీటి వివిధశాఖలలో చైనాయొక్క స్వదేశీయవైద్య పద్ధతినే రోగులకు చికిత్స చేయుచున్నారు. వయస్సు వచ్చిన స్త్రీ పురుషులందరు 146 జట్టులుగ విభజింపబడి వరి పొలములు, కూరగాయల తోటలు, ప్రత్తి పొలములు, చిన్న పరిశ్రమలు, భోజనశాలలు, దాదులసంస్థలు, విద్యాశాలలు, ఆస్పత్రులు, బట్టలను కుట్టు ప్రాంతములు, వీటన్నిటిలో పనిచేయుటకు పంపబడుచున్నారు. గ్రామములలోని అన్ని ఇండ్లు కమ్యూనుయొక్క ఆస్తి అయ్యున్నవి. ఒక్క ఇల్లు కూడ ఒక్క గదికూడ ఈ వ్యక్తులకు చెందదు. గాని ఈ గదులన్నిటిలో స్త్రీలును, పురుషులును రాత్రిపూట మాత్రము కాపురముండుటకు పంపబడుచున్నారు. పిల్లలందరు దాదుల సంస్థలలోను, కిండర్ గార్టెన్ స్కూళ్లలోను పెంచబడుదురు. ముసలి వారి కందరికి ఉండుటకు కొన్ని గృహాములున్నవి. ఈ ముసలివారి కొరకు స్థాపించబడిన 24 గృహాములలో రెండింటిని నేను చూచినాను. ఈ ఇళ్లన్నియు ఇదివరకు భూఖామందులుగ నున్న వారి వద్దనుంచి తీసుకొనబడినవి. 65 మొదలుకొని 70 వరకు వయస్సు గల స్త్రీ పురుషులు అక్కడ నివసించుచున్నారు. వీరందరు సంతోషముగనే కనపడుచున్నారు. వీరికి భోజనశాలలు వేరుగ నున్నవి. వీరికికూడ కొంత తేలికయినటువంటి పని, ముఖ్యముగ నూలు వడకుట, నేయుట ఇవ్వబడుచున్నవి. ఉదయముననే దూరశ్రవణ యంత్రముల పిలుపుకు స్త్రీలు, పురుషులు నిద్రలేచుచున్నారు. అరగంట సేపు బహిరంగ

వాతావరణములో వీరందరు శరీర పరిశ్రమను చేసెదరు. శరీర దారుఢ్యము చాల ముఖ్యముగ భావింపబడు చున్నది. వెంటనే ఫలహారము కొరకు సమీపమున నున్న క్యాంటీనుకు వీరందరు వెళ్లెదరు. ఫలహారము తీసుకొని వివిధ జట్టులుగ బయలుదేరిపోయి వారికి నియమింపబడిన ఉత్పత్తి సంస్థలలో, పొలములలో, ఫ్యాక్టరీలలో, విద్యాశాలలలో, పారిశ్రామిక సంస్థలలో, వర్తకసంస్థలలో పనిచేసెదరు. భర్తలు, భార్యలు ఒకచోట పనిచేయరు. తల్లి దండ్రులు, వారికి గల వయస్సు ముదిరిన పిల్లలు ఒకచోటనే పని చేయరు. వారి వారి కివ్వబడిన వివిధ సంస్థలలో పనిచేసెదరు. మరల మధ్యాహ్నము వేళ తిరిగి వచ్చెదరు. క్యాంటీన్‌లలో (భోజనశాలలలో) అన్నము, క్యాబేజీ, చిలగడదుంప గల భోజనము చేసెదరు. ఒకొక్కప్పుడు మాంసము కూడ పెట్టెదరు. భోజనము కాగానే మరల తమ పనులకు ఎక్కడి వారక్కడికి జట్టుజట్టులుగ వెళ్లిపోయెదరు. సాయంత్రపు వేళల అందరికి విజ్ఞానమునిచ్చు క్లాసులున్నవి. అప్పుడు రేడియోలను వారందరికి వినిపించెదరు. వాటిలో పీపుల్స్ డెయిలీ పత్రికలో వ్రాయబడిన సంపాదకీయములు, వ్యవసాయక రంగములోను, పారిశ్రామిక రంగములోను, అభివృద్ధిని కనపరచే అంకెలు, అమెరికా సామ్రాజ్యవాదులను, చ్యాంగుకేషకు బృందమును కొట్టివేసే పద్ధతులు, ఎటులనైనా దేశము వివిధమైన పారిశ్రామిక సరకులను తయారు చేయుటలో ఇంగ్లండును మించినదో వీటన్నిటిని గూర్చి ఆ రేడియో ద్వారా వారు విందురు. ఆ పైన ఒక చిన్న నాటకము, ఒక ఆట, ఒక పాట జరుగును. అటు పిమ్మట ప్రతివారు నిర్బంధ

ముగ రావలసిన కమ్యూనిస్టు పార్టీ మీటింగు జరుగును. అక్కడ కమ్యూనిజము బాగుగ బోధింపబడును. ప్రజలువేయు ప్రశ్నలకు పూర్తిగ జవాబులు చెప్పబడును. తరువాత వారు తమ తమ లోపములను సరిదిద్దుకుంటామని అన్ని రంగములలో ఎక్కువగ అభివృద్ధిని చేయుదుమని, ఫార్మోజాను మరల స్వాధీనముచేసుకొనుటకు సిద్ధముగ నున్నామని శపథమును గావించెదరు. ఆ తరువాత రాత్రి తప్పనిసరిగ ఎనిమిది గంటలు (రాత్రి తొమ్మిది మొదలు తెల్లవారుజామున అయిదు గంటలవరకు) నిద్రించుటకు తమకు నిర్ణయమైన గదులలోనికి పోయెదరు. దాదుల సంస్థలో పిల్లలకు జబ్బు చేసినక్లైన తల్లులు వచ్చి చూడవచ్చును. ఈ దాదులు మంచి శిక్షణమును పొందినవారు. తల్లిదండ్రులకు వీలైనంతవరకు తమ పిల్లలమీద ప్రత్యేక అనురాగము లేకుండగనే చేయుచున్నారు. ప్రభుత్వమే పిల్లలకు తల్లిదండ్రులు. తాము ప్రభుత్వమునకు నిర్వర్తించవలసిన పనులనే చేసిన చాలు. ఈ భావమే తల్లిదండ్రులలో కలుగచేయబడుచున్నది. ఈ కమ్యూను సంస్థలలో పదహారు రక్షణలు ఇవ్వబడుచున్నవని ప్రకటింప బడుచున్నది. (1) దుస్తులు (2) భోజనము (3) ఇల్లు (4) చాల దూరముగ వెళ్లి పనిచేయవలసి వచ్చినప్పుడు తీసుకొని పోవు రాకపోకల సాధనము (5) గర్భిణీస్త్రీలకు 45 రోజుల మజూరీ నిచ్చుచు సెలవు (6) ఉచిత వైద్యము (7) ఉచితముగ ముసలివారి సంరక్షణ (8) ఉచితముగ పిల్లల పెంపకము (9) మరణించు వారికి ఉచితముగ శ్మశానము (10) ఉచిత విద్య (11) ఉచితముగ ఆటలాడుట (12) వివాహము చేసుకొనునప్పుడు కొంచెముగ ఖర్చుల నిచ్చుట (13) సంవత్సరము

నకు పన్నెండుసార్లు ఉచితముగ వెంట్రుకలను కత్తిరించుట, (14) సంవత్సరమునకు 20 సార్లు ఉచితముగ స్నానము చేయుటకు వేడి నీళ్లకొరకు టిక్కెట్లు, (15) స్త్రీ పురుషులు తొడుగుకొనే నీలపు దుస్తులను బాగుచేయుట (16) ఉచితముగ విద్యుచ్ఛక్తి, ఇవన్నియు ఈ స్త్రీపురుషులకు ఉచితమేనని హామీ ఇవ్వబడినది. ఇవన్నీ అయిన తరువాత "ఇంకేమి కావలయును?" అని ఆ డైరెక్టరు నన్ను ప్రశ్నించినాడు. "సిగరెట్లు నిచ్చుచున్నారా?" అని నే నడిగితిని. "మేము వారికి మజూరీక్రింద డబ్బు యివ్వకపోయినను కొంచెముగ నెలకు ఒకటి మొదలుకొని ఐదు యువనులను డబ్బు రూపముగ ఇచ్చుచున్నాము (ఒక యువను అనగ ఒక రూపాయి). అంతకంటె ఏ పనివాడైన ఎక్కువ తెలివితేటలు గలవాడై, సమర్థుడై కొత్త విషయాలను కనిపెట్టుటవంటి దేదైనా జరిపినట్లయితే నెలకు ఒక రూపాయ మొదలకొని ఐదు రూపాయల వరకు ఇచ్చెదమని, ఇది ఒక రకమైన బోనసు వంటిదని, కాని ఇంతవరకు దీని నెవరును సంపాదించలే"దని ఆ డైరెక్టరు నాతో చెప్పినాడు. కావున ఈ కమ్యూనులో జంతుప్రదర్శనశాలలోని జంతువులవలె ఈ ప్రజలు నివసించుచున్నారు. భేద మేమనగ ఆ ప్రదర్శనశాలలోని జంతువులు కష్టపడి పనిచేయనక్కరలేదు, నిర్బంధముగ రేడియో విననక్కరలేదు. ఇచట అటులకాదు, ప్రభుత్వము తలపెట్టిన విధముగ ఎంత కష్టమునకైనను ఓర్చి పని చేయవలెను. ఉత్పత్తి పూర్తిగ చూపవలెను. అటుల చూపినకాని ఊరుకొనరు. రాత్రింబవళ్ళు రేడియో వినిపించును. ఏ విధముగను శాంతియుతముగ కొంచెముసేపైన కాలము గడిపి

ఏ విషయమైనను ఆలోచించుకొనుటకు ఎట్టి అవకాశము నీయరు. ఎప్పుడూ రాత్రింపగళ్ళు రేడియో మ్రోగుచుండును. ఆ సంగతులు, మెదడులోనికి పోవుచుండవలెను. అంతకంటె వేరు సంగతులు పోవుటకు వీలులేదు. ఇందువలన యావత్తు చైనా జాతి ఒక సుఖవంతమైన, సంతోషకరమైన కమ్యూనుగ ఏర్పడునని మావోసిటంగు తలచెను కాని చాలమందికి సందేహములు కలిగినవి. దీనికి కొంత నిరోధము, విరోధము ఏర్పడినది. ప్రతికూల పక్షమునకు దారుణశిక్షలు వేయవలసి వచ్చినది. ఇటుల కోట్లకొలది స్త్రీ పురుషులను కమ్యూనులలో నిర్బంధించి నటువంటి చైనాకు భవిష్యత్తు ఏమికలదో కాలమే నిర్ణయించవలసి యున్నది. చైనాలో ప్రతిచోటను ఉద్యోగస్థులు చూపే అంకెలను మనము ఊరకే మ్రింగలేనప్పటికి, వ్యవసాయాభివృద్ధి, వ్యవసాయ సరకుల, ఆహారధాన్యముల అభివృద్ధి బాగుగ జరుగుచున్నదని నమ్మదగి యున్నది." అని ఆయన వ్రాసినాడు.

కుటుంబమును విచ్ఛిన్నము గావించి, గృహమే లేకుండ చేసి, ఆత్మానందమును, ఆత్మశాంతిని, త్యాగబుద్ధిని, ధర్మచింతనమును, ఇతరులయందు ప్రేమను కలుగజేయు మతవిశ్వాసములను తుడిచివైచి, మానవ స్వభావ విరుద్ధమయిన పరిస్థితులను కల్పించినది చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము. ప్రజల స్వేచ్ఛాయుతమైన ఓట్లు పుచ్చుకొని యీ కమ్యూనిస్టు సిద్ధాంతాలను తీర్మానము చేయించి అమలు జరపడములేదు. నలుగురు నాయకులు ప్రజలమీద నిర్బంధించిన కార్యక్రమము ఇది.

ప్రతి కమ్యూను నొక సైనికశిబిరముగ గావించినారు. 16 మొదలు 30 వరకు వయసుగల పురుషులు, 17 మొదలు 22 వరకు వయసుగల స్త్రీలు (రైఫిలు) తుపాకులతో సైనికశిక్షణము నివ్వబడుచున్నారు.

ఈ కమ్యూనులకు చాలచోట్ల ముఖ్యముగ మధ్యమతరగతి వారు వ్యతిరేకించినటుల తెలియుచున్నది. వారిని నిర్బంధవిధాన ములచే అణచవలసివచ్చినది. కొన్ని కమ్యూలలో వంటపదార్థ ములలో విషప్రయోగము చేయగ చాలమంది చనిపోయినారు. ఆ కమ్యూనులలో విచారణమీద నూటికి 17 మంది కమ్యూనుకు శత్రువులున్నటుల తేలినది. వారందరికి దారుణ శిక్షలు వేసినారని ఇండియా క్వార్టర్లీలో మాడరన్ రివ్యూ సంపాదకుడు సర్కారు వ్రాసినాడు. తమ సొంతయింట్లో రాత్రిళ్లు పడుకోకుండా వేరు గదులు భార్యాభర్తలు పడుకొనుటకు చూపినందున పెద్ద అల్లరి సాగినది. చిన్నచిన్న యిండ్లుగలవారిని వారి సొంతయిండ్లలోనే పడుకొనుటకు అనుమతిని ప్రభుత్వ మిచ్చినది. పెద్దయిండ్లు చాల చోట్ల పడగొట్టబడి బారకాసులుగ వేయబడినవి. లేక ప్రభుత్వము తీసుకున్నది గావున కొంచెము పెద్ద యిండ్లుగలవారి యిండ్లు యజమానులకు లేకుండ సొంతముగ పోయినవి.

## 3

చైనాలో కమ్యూనుల స్థాపనవలన సోవియటు రుష్యా కును, చైనాకును ప్రథమ పర్యాయము అభిప్రాయ భేదములు బహిరంగముగ వెల్లడిఅయినవి. చైనా కమ్యూనిస్టు నాయకులు

గ్రామములలోని రైతులద్వారా కమ్యూనిస్టు సమాజమును స్థాపించ యత్నించుటను రుష్యా కమ్యూనిస్టు నాయకుడగు స్టాలిను, కారల్ మార్క్సుబోధించిన కమ్యూనిజమునకు వ్యతిరేకమని తలచెను.

రుష్యాకును చైనాకును భేదము

మరియు చైనా కమ్యూనిస్టులు త్వరితముగ జయమును పొందెదరనికాని, త్వరలో చైనాలో కమ్యూనిస్టు రాజ్యస్థాపన జరుగుననికాని స్టాలిను తలచియుండలేదు. చైనాలో కమ్యూనిస్టుప్రభుత్వ మేర్పడిన కొలదికాలములో 1950 సంవత్సరములో మావోసిటంగు రుష్యాకుపోయి యొక యొడంబడిక గావించుకొనెను. అది చాల ముఖ్యమైనది. చైనాకు రుష్యా ఆర్థికముగ సైనికముగ సర్వవిధముల సహాయముచేయుట కొప్పుకున్నది. రుష్యాకుగల ఆయుధబలముకు చైనాయొక్క మనుష్యబలము కలిపినపుడు, రెండునుకలసి అజేయములగునని, కమ్యూనిస్టు వ్యాపకమునకు గొప్ప దోహదము కలుగునని తలచబడినది. కాని స్టాలినుకాలములో పూర్తియైన సహాయము చైనాకు కలుగలేదు. ఆయన మరణించిన పిమ్మటనే కృశ్చేవు బుల్గానినుల ఆధ్వర్యమున సోవియటు రుష్యావారు 1953 నుండియు చైనా కమ్యూనిస్టులకు పూర్తియైన సహాయ సహకారములను చేయ ప్రారంభించినారు. కృశ్చేవు బుల్గానినులు చైనానుసందర్శించుట, చౌ ఎన్ లై మాస్కోను సందర్శించుట రెండు దేశములకు మరీ యెక్కువైన సన్నిహిత సంబంధాలను కలుగచేసినవి. కాని ఇప్పుడు చైనాలో కమ్యూనులను ఏర్పాటుచేయుట కృశ్చేవుకు ఇష్టముగలేదు. తాము, అనగ, రుష్యావారు వెనుక చాల

కాలముక్రిందట ప్రారంభించి జయప్రదము కానందున వదలి పెట్టిన యుద్ధమని చైనా కమ్యూనులను గురించి ఆయన అమెరికాలో చెప్పినాడు. మరియొక ప్రముఖ రుష్యా నాయకుడగు మికోయాను అమెరికాలోని కాలిఫోర్నియా విశ్వవిద్యాలయములో మాట్లాడుచు కమ్యూనులవల్ల లాభము లేదని బహిరంగముగ చెప్పినాడు. కాని చైనాకమ్యూనిస్టు నాయకులు ఏవిధముగను రుష్యాతో భేదాభిప్రాయము లున్నటుల కనపరచక తమ పనిని తమ ఇచ్చవచ్చినటుల సాగించుకొని యున్నారు. కారల్ మార్క్సు బోధించిన వ్యక్తి ఆస్తి, వ్యక్తి స్వాతంత్ర్యము లేని కేవలము కార్మిక నియంతృత్వ మైనట్టి అసలైన కమ్యూనిజమును స్థాపించుటలో తాము రుష్యాకంటె ముందంజ వేయుచున్నామనియు, తమకే కమ్యూనిస్టు స్థాపనాచార్యులుగ అగ్రస్థానము లభించవలెననియు వారియొక్క దృఢమైనఆశయమైయున్నది. రుష్యా కమ్యూనిస్టునాయకులు 40 సంవత్సరముల అనుభవమువలన కమ్యూనిజములోని మంచిచెడుగులను చాలవరకు గ్రహించినవారు. రుష్యాలో ప్రతి కుటుంబమునకు సొంత యిల్లు, దానిచుట్టూ కొంత పొలము, ఇంటిలో కుర్చీలు, బల్లలు వగైరా సామాను, గ్రంథములు, కొన్ని పశువులు సొంత ఆస్తిగా నుంచుకొననిచ్చినారు. నిపుణులకు పెద్ద పెద్ద జీతముల నిచ్చుచున్నారు. రుష్యాలో క్రూర హత్యలు, దారుణ శిక్షలు తగ్గిపోవుచున్నవి. ప్రజారాజ్యములలో గల సుగుణములను కూడ నేర్చుకొనుటకు, ప్రజారాజ్యములతో శాంతియుతమైన సహజీవనమును గడుపుటకు వారు నిశ్చయించినారు. అచటి విశ్వవిద్యా

లయములలో కొంత మార్పు కలిగినది. భారత వాఙ్మయము అచట బోధింపబడుచున్నది. అచటి ప్రజలకు కొంత భావస్వాతంత్ర్యము, ప్రకటనా స్వాతంత్ర్యము కలుగచేయుచున్నారు. చైనాలో అటులగాక కమ్యూనిజమునందు ఎక్కువ అనుభవము లేని మొదటి తరమువారే యైన నాయకులైనందున వారు కమ్యూనిజముయొక్క తీవ్రతను ఎవ్విధముగను తగ్గించక దానిని రోజురోజుకు అతి కఠినముగ చేయుచున్నారు. రుష్యాలో అపజయము పొంది విడిచిపెట్టబడిన కమ్యూనులు చైనాలో ఎంత వరకు ఎంతకాలము జయప్రదముగసాగునో చూడవలసియున్నది. నూతనముగ చైనాప్రభుత్వము తమ క్రిందకు తెచ్చుకున్న టిబెటులోని ప్రజలమతమును సాంఘిక పద్ధతులను నాశనము గావించి; సమష్టి వ్యవసాయ క్షేత్రములను చొప్పింప ప్రయత్నించినందుకు గొప్ప తిరుగుబాటు సాగుచున్నది. మరియు సింకియాంగులోను, చైనాలో కొన్ని రాష్ట్రములలోను తిరుగుబాట్లు జరుగగ వాటిని కఠినముగ అణచివైచినట్లు వినుచున్నాము. చైనా నుండి యథార్థ వార్తలను కమ్యూనిస్టు ప్రభుత్వము బయటకు రానివ్వదు. మానవులకు ఆస్తిని, గృహమును, ఆత్మ స్వాతంత్ర్యమును, వ్యక్తిత్వమును లేకుండచేసి ప్రభుత్వమునకు బానిసలుగ గావించు కమ్యూనులకన్న మన ఇండియాలో నిపుడు స్థాపించబడుచున్న పంచాయితీ సమితులు, జిల్లాపరిషత్తులు ఎక్కువ బాగున్నవి. ప్రజలు మిగుల శ్రద్ధగాను, యుత్సాహముతోను పనిచేసిన యెడల వీటి సత్ఫలితములు మెండుగ నుండును. ఇవి మతమునకు, ధర్మమునకు, వ్యక్తిస్వతంత్రమునకు, కుటుంబ సౌఖ్య

మునకు అనుగుణ్యముగ నున్నవి. వీటిద్వారా మహాత్మాగాంధి గారు బోధించిన నిర్మాణకార్యక్రమమును, వ్యవసాయాభివృద్ధిని, పశుసమృద్ధిని, చిన్న పరిశ్రమల పునరుద్ధరణమును, సహకార వ్యవసాయమును, బేసికు విద్యావ్యాపకమును, వైద్య, పారిశుద్ధ్యములను, గ్రామ స్వరాజ్యమును స్థాపించినయెడల భారతీయ ప్రజారాజ్యము సుస్థిరముగ విలసిల్లగలదు. కమ్యూనిజము ఇండియాలో వ్యాపించకుండ అరికట్టబడును. శ్రమదానమును రైతాంగము చేయుటను అలవరచుకొనవలెను. విద్యార్థులు, కూలీలు కూడ నందు చేరెదరు.

కమ్యూనిస్టు చైనా ప్రధానమంత్రియగు చౌ ఎన్ లై 1954-వ సంవత్సరములో ఇండియాకు వచ్చినప్పుడు పంచశీల సూత్రములను అంగీకరించుచు వాటి వలననే ప్రపంచశాంతి కలుగునని ఇండియా ప్రధాన మంత్రియగు పండిత జవహర్‌లాల్ నెహ్రూతో కలిసి యొక సంయుక్త ప్రకటన గావించినాడు. ఆవెంటనే బర్మా, ఇండోనేషియా, సింహళ దేశములు ఈపంచశీల సిద్ధాంతములను అంగీకరించినట్లు ప్రకటనలు గావించినవి. ఆ పంచశీల సూత్రముల ప్రకారము సామ్రాజ్యవాదము నవలంబించియున్న ధనిక దేశములును, అనగా అమెరికా, ఇంగ్లండు, పశ్చిమ జర్మనీవంటి దేశములును, ప్రజారాజ్యములను స్థాపించుకొన్న ఇండియావంటి ప్రజాస్వామ్య దేశములును, కమ్యూనిస్టు ప్రభుత్వముగల రుష్యా, చైనావంటి దేశములును, తమలోతాము పోట్లాడుకోకుండ స్నేహముగా

పంచశీల సిద్ధాంతమును అవలంబించినందుకు కృశ్చేవును చైనా ప్రభుత్వము ఖండించుచున్నారు

నివసించవలెను, దేశములమధ్య యేర్పడే తగవులన్నిటిని శాంతముగా పరష్కరించుకొనవలెను, యుద్ధములు రాకుండ చేయవలెను, సైన్యమును తగ్గించవలెను, ఆటంబాంబులను నిషేధించవలెను, ఒకదేశపు ఆంతరంగిక వ్యవహారములలో మరియొక దేశ ప్రభుత్వము జోక్యము కలుగ చేసుకొనకూడదు, ఆయాదేశములలోని ప్రభుత్వ విధానములను మార్చుకొనుటకు ఆయా దేశ ప్రజలకే హక్కుకలదు. ఈ పంచశీల సిద్ధాంతమును అంగీకరించి మొదటి ప్రకటన చేసినవారిలో చైనాప్రధానమంత్రి చౌ ఎన్ లై కలడు. అటువంటి చైనా ప్రభుత్వము నేడు ఈపంచశీల సిద్ధాంతమును అవలంబించినందుకు సోవియట్ రుష్యా నాయకుడగు కృశ్చేవును తీవ్రముగా విమర్శించుచున్నారు. 1960-వ సంవత్సరం జూన్ నెలలో చైనా ప్రభుత్వ పత్రికలన్నియు పంచశీల సిద్ధాంతము సరియైనది కాదనియు, సామ్రాజ్య వాదులకును, కమ్యూనిస్టు ప్రభుత్వములకును, ఎన్నడును సామరస్యము కుదర నేరదనియు, ఈ రెండుపద్ధతులు అవలంబించిన దేశములమధ్య యుద్ధమురాక తప్పదనియు, అట్టియుద్ధములో జయము పొందుటకు, కమ్యూనిస్టు దేశములు సర్వప్రయత్నములు గావించి తయారగుచుండవలెనన్నియు వ్రాసినవి. ధనికతత్వముగల దేశములమీదచేసే యే యుద్ధమునైనను ధర్మయుద్ధమని భావించవలెనని మావోసిటంగు చెప్పినాడు. కృశ్చేవు పంచశీల సిద్ధాంతమును అవలంబించుట, అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సు మొదలగు నికవర్గ ప్రభుత్వములతో రాజీకిప్రయత్నించుట, కూడనిపనియనిరు ధశిఖరాగ్ర సమావేశమునకు పూర్వమే చైనావారు వ్రాసినా.

ఆ సమావేశము విఫలమయినందుకు చైనావారు మాత్రమే సంతోషించుచున్నారు. ఆ సమావేశము యొక్క అపజయము, పికింగు ప్రభుత్వము యొక్క యుద్దేశ్యములు సరియైనవనియు కృశ్చేవు తప్పుచేసినాడనియు రుజువు అయినట్లు చైనా పత్రికలు వ్రాసినవి. ధనికతత్వ దేశముల మధ్యను కమ్యూనిస్టు దేశముల మధ్యను యుద్ధము వచ్చినచో కమ్యూనిస్టులు జయింతురనియు, ధనిక తత్వము గల సామ్రాజ్య దేశములు నాశనమగుననియు చైనా వారు వ్రాసినారు. అందుకు సోవియట్ రుష్యావారు జవాబు చెప్పవలసి వచ్చినది. తుదకు వారు బయట పడినారు. జవాబు చెప్పినారు. పంచశీల సిద్ధాంతమే మంచిదనియు, మరల యుద్ధము వచ్చినచో అన్ని దేశములును ఒకేసారి సర్వనాశనమగుననియు, చైనాదేశము కమ్యూనిజములో శైశవావస్థయం దున్నదనియు నడుచుటకు శక్తిలేకమునుపే పరుగెత్తుటకు ప్రయత్నించు చున్నదనియు రుష్యా ప్రభుత్వ పత్రికలు వ్రాసినవి. చైనావారు రుష్యా వారిని కమ్యూనిజములో ముందుకు పోక మెత్తబడి తృప్తిచెంది ఏదో విధముగా కాలక్షేపము చేయ యత్నించుచున్నారని నిందించుచు జవాబు వ్రాసినారు. చైనావారికి కమ్యూనిజము యొక్క మంచిచెడ్డలు అర్థము కాలేదనియు, తెల్లవారే లోపలనే ప్రపంచములో కమ్యూనిజమును స్థాపించుటకు ప్రయత్నించుచు తాము నిజమైన మార్క్సు శిష్యులమని చెప్పుకొనుటకు ప్రయత్నించు చున్నారనియు రుష్యా పత్రికలు తిరిగి జవాబు చెప్పినవి. సామ్రాజ్యవాదుల స్థితి ప్రస్తుతము తగ్గు స్థితియందున్నదనియు, వారితో స్నేహము కుదురునను భ్రమ పెట్టుకోకుండ ప్రపంచము

లోని కమ్యూనిస్టు లందరును వెంటనే సామ్రాజ్యవాదులతో యుద్ధముచేసి జయమును పొందవలెననియు కమ్యూనిస్టులందరిని కోరుచు, చైనా ప్రభుత్వ పత్రిక యగు ఎర్రజెండా యొక వ్యాసమును ప్రకటించినది. ఈ విధముగా చైనా కమ్యూనిస్టులు తామే సరియైన పురోగతితో ప్రపంచ కమ్యూనిజమును నడిపించు చున్నామని చెప్పుకొనుచు కృశ్చేవు యొక్క నాయకత్వమును ధిక్కరించుచున్నారు. చైనాలో స్థాపించబడిన కమ్యూనులు జయప్రదము కానేరవని రుష్యావారు వేళాకోళము చేయు చున్నారు. 1960 వ సంవత్సరము జూన్ నెలాఖరున బుఖా రెస్టులో జరిగిన ప్రపంచ కమ్యూనిస్టు దేశముల మహాసభలో సంచశీల సిద్ధాంతమును ఖాయపర్చి, ధనిక తత్వవాదులకును, కమ్యూనిస్టులకును శాంతియుత సహజీవనము కుదరదనియు ఉభ యులమధ్య యుద్ధము జరిగితీరవలెననియు వాదించుచున్న చైనా నాయకుల వాదమును పూర్తిగ ఖండించి, కృశ్చేవునందు సంపూర్ణ విశ్వాసమును ప్రకటించియున్నారు. ఇది చైనాకు అపజయము, రుష్యాకు అఖండ విజయము.

ఫార్మోజా జాతీయ ప్రభుత్వముతోను అమెరికాతోను వ్యతిరేకత

1960 వ సంవత్సరము జూన్ నెల మధ్య భాగమున అమెరికా అధ్యక్షుడు ఐసెన్‌హోవరు ఫార్మోజా ద్వీపమును సందర్శించెను. ఆ ద్వీపపు జాతీయ ప్రభుత్వాధ్యక్షుడగు ఛ్యాంగు కేషకు ఆయనకు గొప్ప స్వాగతమిచ్చెను. లక్షలాది ప్రజలు సమావేశమై అమెరికా అధ్యక్షునియెడ తమ గౌరవమును కోలాహల ముగ చూపిరి. ఛ్యాంగుకేషకు ప్రభుత్వము ఫార్మోజాలో సరి

హైయెన ప్రజా రాజ్యముగ నడచుచు ప్రజలకు సర్వతోముఖమైన అభివృద్ధిని కలుగచేయుచున్నందుకు ఐసెన్‌హోవరు తన సంతసమును ప్రకటించినాడు. "స్వతంత్రముగనున్న ప్రజల రాజకీయ ఆర్థిక సాంఘిక జీవితమును తేజోవంతముగ చేయుటలో మీరు ఈ ద్వీపములో అవలంబించుచున్న పద్ధతులు నాకు చాల సంతృప్తి కలుగచేయుచున్నవి. చైనా భూఖండములో నున్న స్వతంత్రమును కోరు ప్రజలకు మీరు ఒక ఆశాజ్యోతిగ నున్నారు. వారు ప్రస్తుతము కమ్యూనిస్టు బానిసత్వములో నున్నారు. మీ స్వేచ్ఛాయుతమైన అభివృద్ధి వారికి కూడ అచిరకాలములో స్వతంత్రమును కలుగచేయుటకు తోడ్పడునని నేను ఆశించుచున్నాను." అని ఆయన చెప్పెను. క్విమోయి, మట్సూ లంకలలోని చైనా ప్రజలమీద చైనా కమ్యూనిస్టులు బాంబులనువేసి హత్య గావించుట మిగుల అనాగరికమైన కృత్యమైయున్నదని, అట్టి కమ్యూనిస్టుల హింసా పద్ధతులనుండి కాపాడుకొనుటకును, చైనా కమ్యూనిస్టుల యొక్క సవాళ్లను ఎదుర్కొనుటకును అమెరికా ప్రభుత్వము ఫార్మోజా జాతీయ ప్రభుత్వము సమష్టిగా పనిచేయునని ఉభయ అధ్యక్షులును ప్రకటించిరి. అమెరికాలోని వైజ్ఞానికులు కొందరు ఫార్మోజాలోని చైనా జాతీయ ప్రభుత్వమును, చైనా భూభాగములోని కమ్యూనిస్టు ప్రభుత్వమును రెంటిని అంగీకరించి శాంతియుతమైన సహజీవనమును స్థాపించుట యుక్తమని వ్రాయుచున్నారు. అట్టి దానిని అమెరికా అధ్యక్షుడగు ఐసెన్‌హోవర్ అంగీకరించుటలేదు. ఫార్మోజా జాతీయ ప్రభుత్వమును మాత్రమే చైనా ప్రజాస్వామికము యొక్క పునాది

జాతీయ ప్రభుత్వముగ అమెరికా అంగీకరించుననియు తరువాత వచ్చిన చైనా కమ్యూనిస్టు ప్రభుత్వమును అంగీకరించజాలమనియు ఐసెన్‌హోవరు ఖండితముగ తెలిపినాడు. ఫార్మోజాలో స్థాపితమై యున్న జాతీయ ప్రభుత్వము సుపరిపాలనము జరిపి ప్రజల అభివృద్ధికి తోడ్పడుట వలన క్రమముగ చైనా కమ్యూనిస్టు రాజ్యములోని ప్రజలు కమ్యూనిజముతో విసుగుచెంది ఆ ప్రభుత్వమున కెదురుతిరిగి జాతీయప్రభుత్వ స్థాపనకు పూనుకుందురని అమెరికా అధ్యక్షుడు ఆశించుచున్నాడు. అమెరికా అధ్యక్షుడు ఫార్మోజాలోకి ప్రవేశించినపుడు, ఫార్మోజాను విడిచిపెట్టి వెళ్ళినప్పుడు చైనా కమ్యూనిస్టులు క్విమోయి, మాట్సూ లంకల మీద 43 వేల తుపాకి గుండ్లను కాల్చిరి. అమెరికా అధ్యక్షునితో ప్రయాణము చేయుచున్న పత్రికా విలేఖరులతో చ్యాంగు కేషకు మాట్లాడుచు మాట్సూ, క్విమోయి ద్వీపములను తా మెన్నటికిని వదులుకొనమనియు, అవి ఫార్మోజాయొక్క స్వాతంత్ర్యమునకు చాల ముఖ్యమనియు చెప్పెను. ఎప్పటికైనను చైనా భూఖండము మీద దండయాత్రసలిపి అచటి ప్రజలను కమ్యూనిస్టు బానిసత్వము నుండి విముక్తి చెందించి, అచట సన్యటుసేను సిద్ధాంతముల ప్రకారము జాతీయప్రభుత్వ స్థాపనచేయుట తమయొక్క విధియని ఆయన వక్కాణించెను. అటువంటి అవకాశము ఎప్పుడు తమకు దొరకునో అది భగవంతుని చేతిలో నున్నదని ఆయన చెప్పెను. కాని ఎప్పటికైనను దానికొరకే తాము తయారై సిద్ధపడి యుండవలెనని వ్రాక్రుచ్చెను. అచిరకాలములో చైనా భూఖండమందు ప్రజలు కమ్యూనిస్టు ప్రభుత్వముపై తిరుగుబాటు

చేసెదరా, అట్టి అవకాశము లున్నవా ? అని పత్రికాప్రతినిధులు చ్యాంగు కేషకు నడుగగ అటువంటి అవకాశములు లేకపోలేదని, ఎప్పుడుపడితే అప్పుడు అటుల జరుగవచ్చునని, దానిని తాము అవకాశముగ తీసుకొని జాతీయప్రభుత్వమును చైనా భూగడ్డపై స్థాపించుటకు సిద్ధముగ నుందుమని ఆయన చెప్పెను.

1950 వ సంవత్సరము వేసవికాలములో చైనా సోవియటు యొడంబడిక జరిగినది. దానివలన చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము రుష్యా కమ్యూనిస్టు ప్రభుత్వము పరస్పర సంరక్షణము గావించుకొనుటయే గాక కమ్యూనిజమును బలపరచు యుద్ధములలో పరస్పర సహాయము చేసుకొనుటకుకూడ అంగీకరింపబడినది. వెంటనే కొరియా, ఫార్మోజాలను స్వాధీనపరచుకొనుటకు స్టాలిను మావోసీటంగులు పన్నాగము పన్నినారు. ఆ రెండు దేశములను జయించగనే జపానుదేశమును తమ వైపుకు తిప్పుకొనవచ్చునని వారు ఆశించినారు. ఆపైన ఫ్రెంచివారి నోడించి ఇండోచైనాను కూడ తమ క్రిందికి తెచ్చుకొనవలెనని యోచించినారు. కొరియా, ఫార్మోజాలను తమ క్రిందికి తెచ్చుకొని నట్లయిన ఆశియా ఖండములో అమెరికావారి ప్రతిష్ఠ నాశనమగును. అప్పుడు జపాను దేశము అమెరికాను వదలిపెట్టి తమ వైపునకు వచ్చును. ఈ పన్నాగము ననుసరించి 1950 వ సంవత్సరము ఫిబ్రవరి నెల నుండియు కమ్యూనిస్టుగ నున్న ఉత్తర కొరియా ప్రభుత్వమును దక్షిణ కొరియాపై దండెత్తుటకు తయారు చేయించిరి. తాము కూడ సైన్యములను సిద్ధపరచిరి. చైనా, రుష్యా, ఉత్తర కొరియా

చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము యొక్క వైదేశిక రాజనీతి

దేశముల సైన్యములు కలసి దండెత్తినచో ఎవరును వాటి ముందర నిలువజాలరు. అమెరికావారు ఈ యుద్ధములోజోక్యము పుచ్చుకొనరు. అమెరికా ప్రజలకు మరియొక యుద్ధములో ప్రవేశించుటకు ఇష్టము లేదు. ఈ యూహాలను పెట్టుకొని సోవియటు రుష్యావారి యాజమాన్యము క్రింద ఉత్తర కొరియా వారు దక్షిణ కొరియాపైన దండెత్తునట్లును, చైనావారు ఫార్మోజాను ముట్టడించునట్లును ఏర్పాటుచేసుకొనిరి. ఇండోచైనాలో నుత్తరముననున్న కమ్యూనిస్టు రాజ్యమగు వియత్‌మిన్‌కు సహాయము చేయుటకు కూడ నిశ్చయించిరి. ఇంతేగాక 1950 సంవత్సరములోనే చైనాసేనలు అప్పటికి స్వతంత్రముగ నున్న టిబెటు దేశముపై దండయాత్ర జరిపి ఆదేశమును చైనారిపబ్లికు క్రింద స్వపరిపాలనగల ప్రాంతముగ గావించినారు.

కొరియా యుద్ధము

ముందుగ 1950 సంవత్సరము జూన్ 25 వ తేదీన కమ్యూనిస్టుసేనలు దక్షిణకొరియాలో జొరబడెను. 38 పారలలు గీతను దాటి దక్షిణమునకు పోవుచుండిరి. ఇంతలో ఐక్యరాజ్య సమితివారు మేల్కొని దక్షిణ కొరియాకు సహాయార్థముగ సేనలను పంపుటకు తీర్మానించిరి. అమెరికా అధ్యక్షుడైన ట్రూమను, అమెరికా సైన్యములను జనరల్ మెకార్థరు సేనాని క్రింద దక్షిణ కొరియాకు పంపెను. అమెరికావారి 7 వ నౌకాదళము ఫార్మోజాను సంరక్షించుటకు అచట సముద్రములోకి వచ్చెను. వీటివలన కమ్యూనిస్టుల ఆట కట్టినది. ఫార్మోజాను ముట్టడించలేకపోయినారు. దక్షిణ కొరియాను జయించలేకపోయినారు. అమెరికా సంయుక్త

రాష్ట్రముల సైన్యములు ఉత్తరకొరియాలోకూడ ప్రవేశించినవి. ఉత్తరకొరియానుంచి కమ్యూనిస్టుసైన్యములను వెంటబడి తరుమగ వారు మంచూరియాలో ప్రవేశించిరి. కమ్యూనిస్టుచైనా సైన్యములు ఉత్తరముగ వెనుకకు పోయెను. గాని ఉత్తర కొరియాను సంరక్షించుటకు చైనాలో సైన్యములను పోగు చేయవలసివచ్చెను. చైనాదేశ మంతటను ఉత్తరకొరియా సంరక్షణార్థము రావలసినదని ప్రచారముచేసి, సైన్యములను వృద్ధిచేసి, ఉత్తరకొరియాను సంరక్షించుటకు తీవ్రప్రయత్నము జరిగెను. రుష్యాకంటె ఉత్తరకొరియాను సంరక్షించు బాధ్యత ఎక్కువగ చైనామీద పడెను. అప్పుడు జరిగిన యుద్ధములో చైనావారును, అమెరికావారును చాలమంది హతులైరి. లక్షల సైన్యములు చైనానుంచి దిగెను. ఉత్తరకొరియాను సంరక్షించుట చైనా యొక్క ఆత్మగౌరవ చిహ్నముగ నేర్పడెను. సోవియటు రుష్యా వారు చైనావారికి కావలసినంత సైనికసామగ్రిని సమకూర్చిరి. 1950 నవంబరు మొదలుకొని 1951 జూలై వరకును ఈ యుద్ధము సాగెను. అప్పుడు యుద్ధమువలన ప్రయోజనము లేదని ఉభయ పక్షముల వారును రాజీపడుటకు సిద్ధపడిరి. ఆ రాజీ జరుగుటకు రెండు సంవత్సరములు పట్టెను. ఐక్యరాజ్యసమితిలో రాజీనామా ప్రయత్నములు సోవియటు రుష్యావారు చేసిరి. ఇండియా కూడ దానిని సమర్థించెను. ఇండియా ప్రతినిధి చెప్పిన చొప్పుననే రాజీనామా కుదిరెను. కాని ఈ కాలములో ఉత్తరకొరియా మీద మావోసేటుంగు యొక్క పలుకుబడి రుష్యాయొక్క పలుకుబడికంటె అత్యధికముగ హెచ్చెను. 1953.వ సంవత్సరము జూలై

నెలలో తాత్కాలిక రాజీనామామీద దస్కతులు చేయబడెను. పేరలలు గీతదాటి ఉత్తర, దక్షిణ కొరియా సేనలు అటు ఇటు పోకూడదని నిర్ణయించబడెను. అప్పటినుంచి చైనాలో అమెరికా సంయుక్తరాష్ట్రములమీద మితిలేని ద్వేషానలమును వ్యాపింప చేసిరి. దక్షిణకొరియానుంచి విదేశసైన్యము లన్నియు తీసివేయ వలెననియు, ఉత్తర దక్షిణకొరియాలు రెంటిని ఏకము గావించ వలెననియు చైనాదేశమంతట ఆందోళనము జరిగెను. ఇప్పటికిని ఆ ఆందోళన జరుగుచునే యున్నది. కాని దక్షిణకొరియావారు ఉత్తరకొరియాతో చేరుటకు అంగీకరించుటలేదు.

వియత్ మిన్

ఇండోచైనాలో మాత్రము ఈశాన్యముననున్న వియత్ మిను ప్రాంతములోని కమ్యూనిస్టుసేనలు దక్షిణముననున్న ఫ్రెంచి వారిక్రిందనున్న వియత్‌నాము మీదికి దండెత్తగ వియత్‌మినుకు చైనావారు సహాయముపంపిరి. ఇచట కొరియాలో వలె ఐక్యరాజ్య సమితివారికి సంబంధములేదు. వియత్ మిను బలపడెను. వియత్‌మిను వారే వియత్‌నాము సేనలమీద జయమును పొందిరి. ఫ్రెంచివారోడిపోవు చుండిరి. పారిస్‌లోని ఫ్రెంచి ప్రభుత్వము సంధి చేసుకొనుటకు ఆత్రపడెను. 1954 వ సంవత్సరము ఏప్రిలులో జరిగిన జనీవా కాన్ఫరెన్సుకు కమ్యూనిస్టు చైనాను కూడ పిలిచిరి. అప్పుడు ఉత్తరముననున్న వియత్‌మినును స్వతంత్ర కమ్యూనిస్టు రిపబ్లికుగ అంగీకరించిరి. ఇందువల్ల పికింగుమాస్కోలకు ప్రతిష్ఠ చాలగ హెచ్చెను. జినీవాలో వియత్‌మిను తరఫున చౌ ఎన్ లై, మాలటోవ్ లిద్దరు వాదించి అనుకూలమైన రాజీనామా కుదిర్చిరి.

కొరియా ఫార్మోజాల విషయమున కమ్యూనిస్టులు పొందిన అపజయమునకు వియత్‌మినులో సంపాదించిన జయము కొంత వరకు భర్తీచేసెను. అప్పటినుంచి వియత్‌మిను ప్రభుత్వముయొక్క అధ్యక్షుడగు హోచిమిన్ పికింగు ప్రభుత్వమునుండియే అన్ని విధములైన సహాయమును పొందుచు పికింగుకు దాదాపుగ లోబడియుండెను.

జినీవా కాన్ఫరెన్సు జరిగినప్పటినుండియు కమ్యూనిస్టు చైనా ప్రభుత్వము విదేశ రాజనీతిలో నూతనమార్గము నవలంబించెను. సైనిక బలముచే క్రొత్తదేశములను స్వాధీనముచేసుకొను పద్ధతిని తాత్కాలికముగ మానెను. ఆశియా ఖండములోని అన్ని జాతులతో స్నేహమును సంపాదింపవలెనని, వీలైతే ఆశియాఖండ దేశములకు యాజమాన్యమును పొందవలెనని ప్రయత్నములు చేయసాగెను. ఇందువల్ల అమెరికాకు ప్రతిఘటనము సలుపుటకు కూడ తమకు బలముకలుగునని తలచెను.

**ఆశియా ఖండములో కమ్యూనిస్టు తిరుగబాట్లు జరుగునను ఆశ విఫలమయ్యెను**

కొంతకాలము ఆశియా ఖండములోని ఇతర దేశములలో కూడ రైతులు, కార్మికులు తిరుగుబాట్లు గావించి కమ్యూనిస్టుపార్టీల నాయకత్వము క్రింద కమ్యూనిస్టు రాజ్యములను స్థాపింతురని ఆశించెను. కాని వియత్‌మినులో తప్ప ఇతర ఆశియాఖండ దేశములలో ఎచ్చోటను కమ్యూనిస్టు రాజ్యములు స్థాపనము కాలేదు. అందువల్ల పికింగు ప్రభుత్వము శాంతియుతమైన సహజీవనమును స్థాపించే పంచశీల సూత్రమును తాత్కాలికముగా అవలంబించినది. జపానువద్ద నుంచి పారసీక సముద్రము వరకు

మధ్యనున్న దేశములన్నిటితోకూడ స్నేహసంబంధములను పెట్టు కొనుటకు పికింగు ప్రభుత్వము నిశ్చయించినది. ఆ కాలములో అమెరికావారు ఆశియా ఖండజాతులను కలుపుకొని ఆగ్నే యాశియా రక్షణసమితి (SEATO) నొకదానిని పరస్పర సంరక్షణ కొరకు స్థాపించ యత్నించిరి. కాని సీటోకు తగిన బలము కలుగ లేదు. ఫిలిపైనులతోపాటు పాకిస్తాను, తాయిలాండు మాత్రమే అందులో చేరినవి. తక్కినవి అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సు, న్యూజి లాండు దేశములై యున్నవి.

ఆశియా ఖండ దేశములలో అధిక సంఖ్యాకులైన వారు సీటోలో చేరక రుష్యా అమెరికా బ్లాకుల మధ్య తటస్థముగ నుండుటకును, తమతమ ప్రజా రాజ్యములను బలపరచుకొనుట కును ప్రయత్నములు చేయుచుండిరి. అట్టి సమయములో 1954 వ సంవత్సరములో చైనాప్రభుత్వ ప్రధానమంత్రియగు చౌ ఎన్‌లై ఇండియా బర్మా దేశముల రాజధానులను సందర్శించి వాటి నాయకులైన పండిత జవహరులాల్ నెహ్రూ, యూ నూ లతో సంప్రతింపులు జరిపి స్నేహ సంబంధములను పెట్టుకొనెను. 1954 వ సంవత్సరములో ఢిల్లీలో నుండగ పంచశీల సిద్ధాంతమును ఒప్పు కొనుచు, దానివలననే ప్రపంచ శాంతికలుగునని చౌ ఎన్‌లై, పండిత జవహరులాల్ నెహ్రూ గారలు ఒక సంయుక్త ప్రకట

పంచశీల నంగీకరించుట

నను గావించిరి. చౌ ఎన్‌లై కి నిజముగ పంచ శీల యందు నమ్మకము లేదు. వీలైనపుడు సైనిక బలము ద్వారా ఆశియాఖండ దేశములను లోబరుచుకొని కమ్యూనిస్టు రాజ్యస్థాపన చేయుటయే ఆయన ఆశయము.

అయినప్పటికిని పైకి ఎంతో శాంతవర్తన, స్నేహ భావములు గలవాడివలె నటన జరిపెను. దానిని ఇండియా బర్మా ప్రధాన మంత్రులు నిజమేనని విశ్వసించిరి.

బాండుంగుసమావేశములో పాల్గొనుట

అటుపిమ్మట 1955 వ సంవత్సరములో ఏప్రిలు 18 వ తేదీ నుంచి 24 వ తేదీవరకు ఇండోనీషియాలోని బాండుంగు పట్టణములో జరిగిన ఆశియా, ఆఫ్రికా ఖండజాతుల సమావేశమునకు చౌ ఎన్ లై హాజరయ్యెను. ఆశియా, ఆఫ్రికా ఖండజాతులలో స్వతంత్రమును, పరస్పర సహకారమును కలుగచేసి ఆత్మ విశ్వాసమును, ఆత్మశక్తిని పెంపొందచేసి, అటు అమెరికా కూటము ఇటు రుష్యా కూటము వాటిమీద తెచ్చే ఒత్తిడినుండి కాపాడుకొనుట ఈ సమావేశముయొక్క ఉద్దేశ్యము. ఈ బాండుంగు సమావేశమునకు ఇండోనీషియా ప్రధానమంత్రి శాస్త్రో మిడ్జోజో అధ్యక్షత వహించెను. ఆహ్వానింపబడిన ముప్పదిదేశములలో ఒక మధ్య ఆఫ్రికా ఫెడరేషనువారు మాత్రము ఆ తేదీలు తమకు అనుకూలముగ లేవని ప్రతినిధులను పంపలేదు. తక్కిన 29 ఆశియా, ఆఫ్రికాఖండ దేశముల ప్రభుత్వముల ప్రతినిధులు హాజరై పాల్గొన్నారు. సోవియటు రుష్యాను ఆహ్వానించలేదు. కమ్యూనిస్టుచైనా ఆహ్వానించబడినది. ఇస్రాయిలును, ఉత్తర దక్షిణ కొరియాలను, జాతీయ చైనాను పిలువలేదు. ప్రపంచములోని మూడింట రెండువంతుల జనసంఖ్యను పాలించుచున్న ప్రభుత్వములయొక్క ప్రతినిధుల మహాసభ అది. గొప్ప ప్రభుత్వములమీద తిరుగుబాటులను జరిపి వాటిని లక్ష్యపెట్టక నూతనముగ స్వతంత్రమును సంపాదించి

ప్రతి చిన్నజాతికి స్వతంత్రము, స్వయంనిర్ణయాధికారము ఉండవలెనని దృఢముగ కోరుచున్న జాతుల ప్రతినిధుల సమావేశము అది. వచ్చిన ప్రతినిధు లందరును ప్రభుత్వ హోదాలో వచ్చినవారే. ఇండియా, చైనా, పాకిస్తాను, బర్మా, ఇండోనీషియా, సింహళము, ఈజిప్టు, లావోస్, లెబనాన్, సౌదీ అరేబియా, సూడాన్, ఎమెన్ దేశములపక్షమున ప్రధానమంత్రులు, తక్కినదేశములపక్షమున ఇతరమంత్రులు హాజరై పాల్గొన్నారు. సైప్రస్ స్వతంత్రోద్యమ నాయకుడైన ఆర్చి బిషపు మకారియోస్, జెరూసెలమ్ యొక్క మాజీ ముఫ్టీ, ఆఫ్రికన్ జాతీయమహాసభ ప్రతినిధి, అమెరికా నీగ్రోజాతి ప్రతినిధి ఎ. డి. పోవెల్ ప్రేక్షకులుగ వచ్చిరి.

చౌ ఎన్ లైకు పండిత జవహరులాలు నెహ్రూయొక్క సహాయము

వచ్చిన ప్రతినిధులలో పాశ్చాత్య సామ్రాజ్య తత్వముతోపాటు కమ్యూనిస్టు సామ్రాజ్య వ్యాపకమును కూడ తీవ్రముగ ఖండించినవారే ఎక్కువమంది కలరు. వారికి చౌ ఎన్ లై జవాబు చెప్పవలసివచ్చినది. పండిత జవహరులాల్ నెహ్రూగారు వారుభయుల మధ్య కొంత శాంతింప చేయవలసివచ్చినది. కర్నల్ నాసర్, మిగతా అరబుజాతుల ప్రతినిధులు మిగుల ఉత్సాహముగ పాల్గొన్నారు. బాండుంగుమహాసభవారు ఐదు ఉపసంఘముల నేర్పరచగ అవి నాలుగు దినములు సమావేశమై తమ తమ నివేదికలను మహాసభకు సమర్పించిరి. ఈ జాతులలో మొత్తముమీద ఐకమత్యమే కలిగినప్పటికి కమ్యూనిస్టులకు వ్యతిరేకతను, వారియందు భయమును సింహళము, గోల్డుకోస్టు,

ఇరాకు, జపాను, జోర్డాను, లెబనాను, లైబీరియా, లిబియా, పాకిస్తాను, పర్షియా, ఫిలిప్పైనులు, సయాం, సుడాను, తురుష్కము, దక్షిణ వియత్నాము ప్రతినిధులు ప్రదర్శించిరి. తక్కిన దేశములవారు తటస్థ భావములను, తటస్థ విధానమును దృఢముగ బలపరచిరి. వీరికి ఇండియా, ఈజిప్టు ప్రధానులు నాయకత్వము వహించిరి. ఆటంబాంబును తయారు చేసుకొని పరస్పర ద్వేషముతో ఒకరిమీద నొకరు నిందలు సల్పుచున్న పాశ్చాత్యజాతుల, కమ్యూనిస్టు జాతులమధ్య మధ్యవర్తిత్వము వహించి రాజీకుదిర్చి లోకశాంతిని కలుగచేయుటకు ఆశియా, ఆఫ్రికా జాతులకే అర్హతకలదని సింహళ ప్రధానమంత్రి సర్ జాన్ కోటెలవాలా తన ఉపన్యాసములో చెప్పెను. ఒక జాతియొక్క వ్యవహారములలో రెండవజాతి జోక్యము కలుగ జేసుకొనకుండ ప్రతి జాతికి తమ ఇచ్చవచ్చిన రాజకీయ ఆర్థిక విధానములను అవలంబించుటకు హక్కు కలిగి యుండుట ప్రధాన సూత్రములని కల్నల్ నాసర్ చెప్పెను. ఇందువలన కమ్యూనిస్టు రాజ్యముల బూటకపు స్నేహములందు కూడ ఆశియా ఆఫ్రికా ఖండజాతులకు విశ్వాసము లేదని స్పష్టపడినది. 1959 వ సంవత్సర ప్రారంభము నుండి కమ్యూనిస్టుల వలన ఈజిప్టుకును, సిరియాకును, ఇరాకుకును కలుగుచున్న చిక్కులు, ఇటీవల టిబెట్టు డలేలామాకు టిబెట్టు కాందిశీకులకు శరణ్యమిచ్చినంత మాత్రముననే చైనా కమ్యూనిస్టులకు ఇండియాపై బెదిరింపులతో కూడిన వ్యతిరేకత, ప్రజారాజ్య (డెమాక్రసీ) హాదులైన ఆశియా ఆఫ్రికా ఖండదేశములు కమ్యూనిస్టులను నమ్మకూడదని ధృవపరచుచున్నవి. వీటి

వలన ఒకవైపున పాశ్చాత్య దేశముల, రెండవ వైపున కమ్యూని‌స్టుల, వలలనుండి తప్పించుకొనుట ఎంతఅవసరమో బోధపడుచున్నది. సింహళ ప్రధానమంత్రి సర్ జాన్ కోటెలవాలా కామిన్‌ఫారమును రద్దు పరచుటను గూర్చి చైనా ప్రధానమంత్రి చౌఎన్‌లైని ప్రశ్నించినప్పుడు అది సోవియటు రుష్యాకు సంబంధించినదనియు, చైనా కమ్యూనిస్టులతో నెట్టి సంబంధము లేదనియు జవాబు చెప్పెను. బాండుంగు సమావేశములోని వాతావరణము చూచి అమెరికా సంయుక్త రాష్ట్రములతో చైనాప్రజలు యుద్ధమునకు పోదలచుకొనలేదనియు, ఫార్మోజా విషయములో కూడ తగువులు లేకుండ పరిష్కరించు కొనుటకై అమెరికాతో రాయబారములు జరుపుటకు తాము సిద్ధముగ నున్నామనియు చౌఎన్‌లై తమ యుపన్యాసమునందు చెప్పెను. అంతేకాక తాయిలాండు, సింహళము, ఫిలిప్పైనులు మొదలైన చిన్నదేశముల యొక్క రక్షణమునకు తాము కూడ బాధ్యత వహించెదమనియు ఆయనచెప్పెను. ప్రతి విషయములోను ఆయన తనఉపన్యాసములలో స్నేహభావములను,రాజీ యుద్దేశ్యములను ప్రకటించుచు వచ్చినందున బాండుంగు సమావేశము శాంతియుతమైనచల్లని వాతావరణములో సాగిపోయినది. ప్రాథమిక మానవ హక్కులను స్థాపించవలెననియు, పెద్ద చిన్న భేదములు లేకుండ అన్నిజాతులకు సమానత్వమును అంగీకరించవలెననియు, ఇతర దేశముల ఆంతరంగిక వ్యవహారములలో ఏ విధముగను జోక్యము పుచ్చుకొనకూడదనియు, అంతర్జాతీయ వ్యవహారము లన్నియు రాజీలు, ఒడంబడికలు, పంచాయితీలు, కోర్టులో తీర్పులు మొద

లైన శాంతియుతమైన పద్ధతులద్వారానే నిర్ణయించుకోవలె ననియు పది సూత్రములు బాండుంగు మహాసభలో ఏకగ్రీవముగ ఆమోదింపబడి ఆ మహాసభ కోలాహలముగ ముగిసినది.

బాండుంగు మహాసభ వలన తమకు ఆశియా ఆఫ్రికా ఖండ జాతులయొక్క నాయకత్వము రాజాలదని చౌ ఎన్ లై కి స్పష్టముగ తెలిసినది. మరల పికింగు ప్రభుత్వము తన వైదేశిక నీతిని మార్చుకొనినది. "యుద్ధకాలములోవలెనే శాంతి సమయమున కూడ శత్రువు మనమీదికి వచ్చుచున్నప్పుడు మనము వెనుకకు తగ్గవలెను. శత్రువు వెనుకకు పోవు చున్నప్పుడు మనము అతనిని వెంబడించవలెను. అతను శ్రమవలన విసిగియున్నప్పుడు మనము ముట్టడించవలెను" అను మామూలుపద్ధతినే పికింగుప్రభుత్వము అవలంబించుచున్నది.

కమ్యూనిస్టు కామన్వెల్తు

1955 వ సంవత్సరములో ఫార్మోజాకు పశ్చిమోత్తరముననున్న టాసినులాంగులను చైనా స్వాధీనపరచు కొన్నది. అటులనే మట్సూ క్వెమోయి లంకలను స్వాధీన పరచుకొనుటకు ప్రయత్నించగ అమెరికా అడ్డము తగిలినందున జయమును పొందలేదు. 1957 వ సంవత్సరము జనవరిలో చౌ ఎన్ లై మాస్కో, వార్సా, బుడాపెస్టు నగరములను సందర్శించి కమ్యూనిస్టు దేశములన్నియు ఐకమత్యముతో మెలగవలెనని సందేశమిచ్చెను. కమ్యూనిస్టు దేశములన్నియు ఒక కామన్‌వెల్తుగ ఏర్పడవలెనని కూడ ఆయన చెప్పివచ్చెను. విదేశాంగ రాజనీతిని ఎప్పటికప్పుడు తమ అవసరముల వెంట మార్చి నడుపుటలో చౌ ఎన్ లై చాల గట్టివాడని ఎంచబడుచున్నది. కావున ఆయన చెప్పు తియ్యని

మాటలను నమ్మినయెడల ప్రమాదము కలుగును. 1959 లో టిబెట్టులో తీవ్ర నిర్బంధములు జరుపగ దాని పాలకుడైన దలైలామా ఇండియాకు పారిపోయి శరణు చొచ్చినాడు. ఆయనకును ఆయన పరివారమునకును ఇండియా శరణ్యమిచ్చినది. ఇంకను కొన్ని వేలమంది టిబెట్టియనులు ఇండియాకు పారిపోయి వచ్చినారు. వారినందరిని ఇండియా ఆదరించి నివాస సౌకర్యములు కలుగజేసినది. అప్పటినుండి చైనా కమ్యూనిస్టు ప్రభుత్వమునకు ఇండియా ప్రభుత్వముమీద, ఇండియా దేశముమీద విశేషమైన ఆగ్రహాము కలిగినది. ఇండియా భూభాగములోని పన్నెండువేల చదరపుమైళ్ళ ప్రదేశముమీద చైనా ప్రభుత్వము దురాక్రమణ చేయుటయేగాక, ఇంకను నలుబదివేల చదరపుమైళ్ళ ప్రదేశము ఇండియాలోనుంచి తమకు రావలెనని కోరుచున్నది. ఇటుల ఇండియామీద చైనా దురాక్రమణ చేయుట రుష్యాకిష్టము లేదు. 1960 జులై నెలలో ఇండియా రిపబ్లికు అధ్యక్షుడగు డాక్టరు రాజేంద్ర ప్రసాదుగారు రుష్యాను దర్శించగ రుష్యా ప్రభుత్వము, ప్రజలు బహుగొప్పగ సన్మానములనుచేసి ఇండియా యొక్క పంచశీల సిద్ధాంతములను, తటస్థ విధానములను అత్యంతముగ ప్రశంసించి ఇండియాతో శాశ్వతమైత్రిని వెల్లడించినారు. ఇండియా ఆర్థికముగ, సాంఘికముగ చేయుచున్న అభివృద్ధిని మెచ్చుకొనినారు. ఈ కాలములోనే చైనా కమ్యూనిస్టు ప్రభుత్వ అధికార పత్రికలలో ఇండియాలో పేదరికము, ఆకలి, రోగము, ప్రజల అసంతృప్తి, రైతుల తిరుగబాట్లు విశేషముగ వ్యాపించియున్నవనియు, ఇండియా ప్రభుత్వము మిగుల అసమర్థముగ

నున్నదనియు, వ్రాయుచు ఇండియా ప్రభుత్వపు రైల్వే పోస్టు టెలిగ్రాం మొదలగు శాఖల నౌకర్లు కోరిన కోరికలతోను, జరుపు చున్న సమ్మెతోను తమ సానుభూతిని పూర్తిగ తెలిపినది. గాని సమ్మె విఫలమై చాలించుకోబడినది. చైనాయొక్క జోక్యమును సమ్మెనాయకులు ఖండించినారు. చైనా ప్రభుత్వము పత్రికలు ఎడతెగకుండ ఇండియాకు వ్యతిరేకముగ ప్రవర్తించు చున్నారు.

*

# చైనా విప్లవము

## అష్టాదశాధ్యాయము

### టిబెటు దేశముపై చైనాయొక్క దురాక్రమణ

### 1

చైనా కమ్యూనిస్టు నాయకులు గొప్ప కమ్యూనిస్టు సామ్రాజ్యమును గాని లేదా తమ నాయకత్వమున కమ్యూనిస్టు కామన్‌వెల్తును గాని స్థాపించ కోరిక గలవారు. ఆశియా ఖండమున కధినేతలుగ నుండదలచిన వారు. తమకన్న బలహీనమైన దేశములపై దురాక్రమణలు జరిపి రాజ్యవిస్తరణ చేయుటలో వెనుకంజ వేయువారు కారు. కొరియా, వియత్‌మిను, ఫార్మోజా లంకల విషయములో ఎటుల ప్రవర్తించినది మనము చూచి యున్నాము. పశ్చిమ మంగోలియాను కూడ స్వాధీనపర్చుకోవలెనను కోరిక యున్నట్లు ప్రకటనము జరిగినది గాని రుష్యామీద ఆర్థికముగ తాము ఆధారపడి యున్నందున రుష్యాతో పోట్లాడుటకు భయపడి యూరుకున్నారు. ఎప్పటికైనను పశ్చిమమంగోలియా పైన దురాక్రమణను చైనావారు జరుపుదురను భయము, అనుమానము రుష్యావారికి లేకపోలేదు. తమకు గల అరవై [illegible] జనసంఖ్యను నమ్ముకొని అతి త్వరితముగ గొప్ప పారిశ్రామి[illegible]వృద్ధిని గావించి, ప్రపంచములో ఉన్నతస్థానమును పొందు

*చైనాకమ్యూనిస్టుల సామ్రాజ్యతత్వము*

టయే గాక, తమ ప్రక్కనున్న ఇండియా, బర్మా, సయాం, మలయా, సింగపూరు, ఇండోనీషియా, వియత్నాం, కాంబోడియా, ఫిలిప్పైన్ దేశములను లిబరేటు చేయుటకు అనగ ధనికతత్వ బూర్జువా ప్రభుత్వములనుండి మార్చి కమ్యూనిస్టు దేశములుగ చేయదలచినట్లు ఇటీవలనే 1960 వ సంవత్సరములో చైనా కమ్యూనిస్టు నాయకులు ఇండియా-చైనా సరిహద్దు తగాదా కలిగినపిమ్మట స్పష్టముగ చెప్పినటుల పత్రికలలో చదివినాము. ఇదివరకు జపాను ప్రకటించిన సామ్రాజ్య కాంక్షవంటిదే యిది. జపాను తన సామ్రాజ్య పటములలో చైనాను చేర్చి, ఇండియాను వదలిపెట్టినది. ఇపుడు చైనా తన కమ్యూనిస్టు సామ్రాజ్యములో జపానును వదలిపెట్టి ఇండియాను చేర్చినది. ఇండియాలో పదకొండువేలమంది చైనీయులు, పై మిగిలిన అన్నిదేశములలో కలసి ఒకకోటి ముప్పదిలక్షల చైనీయులు వర్తకులుగనున్నారు. పలుకుబడికలిగియున్నారు. దాదాపుగ వారికందరికి చైనా కమ్యూనిస్టు ప్రభుత్వముతో సానుభూతి కలదు. పైగా ఈ దేశములన్నిటిలో బలమైన దేశీయ కమ్యూనిస్టు పార్టీలు గలవు. ఈ చైనీయులు చైనాదేశ పౌరస్వత్వములను వదలుకొన లేదు. వీరందరిసహాయముతో ఆశియాలో గొప్ప కమ్యూనిస్టు సామ్రాజ్యము స్థాపించగలుగుదుమని చైనా నాయకుల దురాశ.

ఇట్టి సామ్రాజ్య కాంక్షతోనే 1950 వ సంవత్సరములో చైనా ప్రభుత్వము చైనాకు పశ్చిమమున అనుకొని యున్న, అప్పటికి సర్వస్వతంత్రము ననుభవించుచున్న టిబెటుదేశముపై

దురాక్రమణ జరిపి ఆ దేశమును వశపరచుకొనెను. టిబెటు దేశమును ముందుగ లిబరేటు చేసినది. టిబెటు దేశము 4,69,294 చ. మైళ్ళ వైశాల్యము గలిగి, ఉత్తరమున సింకియాంగు, తూర్పున చైనా, దక్షిణమున నేపాల్, భూటాన్, సిక్కిమ్ మరియు ఎనిమిది వందల మైళ్ళ పొడుగుగల భారతదేశములోని పర్వత ప్రాంతము, పడమర కాశ్మీరములోని లడకు, సరిహద్దులు గలిగి యున్నది. ఈ దేశము 16 వేల అడుగుల ఎత్తున నున్నది. దక్షిణ టిబెటులో నున్న లాసాపట్టణము ఈ దేశము నకు రాజధాని. టిబెటు దేశమునుండియే సింధు, బ్రహ్మపుత్ర నదులు హిమవత్పర్వతములలో నుత్తరపు వైపున పుట్టి భరతవర్షములో ప్రవహించుచున్నవి. టిబెటు యొక్క తూర్పు సరిహద్దు లోపలను, బైట చైనాలోను, ఖంబాలు, నలోకులు అను శూరులైన స్వతంత్రేచ్ఛగల తెగవారు నివసించుచున్నారు. వారికి ప్రక్కనున్న అందోలు తెగవారు కూడ అట్టివారే. టిబెటు దేశపు జనసంఖ్య 27 లక్షలు ఉండును. ఆ దేశపు సరిహద్దులు దాటి చుట్టుపట్ల మరొక 20 లక్షలమంది టిబెటనులు నివసించుచున్నారు. టిబెటును డలైలామా యను యను బౌద్ధమతగురువు పాలించుచున్నాడు. ఆయన ఆధ్యాత్మిక అధికారము టిబెటులో నివసించునట్టియు, ప్రక్కనలడకు, సిక్కిమ్, భూటాన్, సింకియాంగు, తూర్పు మంగోలియా ప్రాంతములలో నివసించునట్టియు టిబెటను లందరిమీదను చెలామణియగుచున్నది.

**టిబెటు స్వతంత్రదేశము**

టిబెటు దేశపు చరిత్ర క్రీస్తుశకము 7 వ శతాబ్దమువరకు బహుకొద్దిగ తెలియును. క్రీస్తుశకము 620 మొదలు 650 వరకు

సంగుస్సెను గాంపో అను రాజు ఈ దేశముపైన రాజ్యము చేసెను. ఆయన దేశమును అభివృద్ధిచేసి పేరుప్రసిద్ధులు పొందెను. ఉత్తర బర్మాను, పశ్చిమ చైనాను జయించి చైనా రాజకుమార్తెను వివాహమాడెను. ఆమె పేరు వెన్‌చెంగు దేవి. ఆయన యొక్క మరియొక భార్యయగు భృకుటిదేవి నేపాలు రాజకుమార్తె. ఆ ఇద్దరు రాణులును బౌద్ధమతమునందు విశేషభక్తి గలవారు. ఆయన కాలములో టిబెట్టు దేశమునందు బౌద్ధమతము పునరుద్ధరింపబడెను. ఆయనయే లాసా పట్టణమును తన రాజధానిగ చేసికొనెను. క్రీస్తు శకము 8 వ శతాబ్దము యొక్క రెండవ భాగమున హిందూదేశమునుండి పద్మసంభవ అను బౌద్ధ భిక్షువు టిబెట్టుకు పోయి రాజపోషణమునుపొందెను. ఆయన బౌద్ధమతమును మరల ప్రజ్వాలింపచేసెను. ఆయనకు గురులింపోషి అనికూడ పేరు. ఆయనయే బౌద్ధమతములో నొక నూతన శాఖను (లామాయిజము) లామాల మతము అను పేర టిబెట్టులో స్థాపించి వ్యాపింప చేసెను. ఆ కాలములో చైనా దేశమే టిబెట్టు రాజుకు కప్పము చెల్లించుచుండెను. క్రీస్తుశకము 13 వ శతాబ్దములో చైనా చక్రవర్తియైన కుబ్లైఖాను లామాయిజమును అవలంబించెను. ఆయన సహాయముతో శాక్య లామాల మతగురువు టిబెటునకు రాజయ్యెను. అదివరకు గల రాజవంశ మంతరించెను. గాని ఆ కాలమునందే చైనాచక్రవర్తి మొట్టమొదట టిబెట్టు దేశముపైన సార్వభౌమాధికారమును వహించెను. క్రీ. శ. 1368 వ సంవత్సరమున మింగువంశపు రాజు మంగోలురాజులను వెళ్ళగొట్టి చైనామీద తన రాజ్యస్థాపన

చేసుకొనగ మరల టిబెట్టుదేశము సంపూర్ణముగ స్వతంత్రమును పొందెను. క్రీ. శ. 1605 నుండి జెన్‌టన్ డైప్రిపా అను లామా యిజముయొక్క జి. లు. పా. శాఖకు చెందిన మతగురువు వజ్రధర డలైలామా యను బిరుదముతో స్వతంత్రరాజుగ టిబెట్టుదేశమును పాలించెను. అప్పటినుండి డలైలామాల ప్రభుత్వము సాగుచున్నది. అప్పుడు చైనాను పాలించుచున్న మంచూచక్రవర్తులు ఆయనను సంపూర్ణ స్వతంత్రుడుగనే గౌరవించిరి. ఆయనయే పొటాలాను పునర్నిర్మాణము గావించెను. చైనాచక్రవర్తులు ఆయన స్నేహమును కోరిరి. ఆయనకాలములో అంద్రాడు అను పేరుగలిగిన పోర్చుగీసువాడొకడు టిబెట్టుదేశములో ప్రవేశించి లాసాపట్టణమును చేరుకొనకుండగనే మరలిపోయెను. ఇదియే యూరపియనులు టిబెట్టుకు ప్రథమ పర్యాయము వచ్చుట. పంచనులామాకూడ జి. లు. పా. శాఖకు జెందినవాడే. ఆయనను డలైలామాకు ఆధ్యాత్మిక సలహాదారుగ నెన్నుకొనిరి. ఆయనకు కొన్ని మహాధికారములు తప్ప రాజ్యాధికారము లేదు. క్రీ. శ. 1652 సంవత్సరమున అయిదవ డలైలామా చైనా రాజధాని యగు పికింగును దర్శించినపుడు మంచూ చక్రవర్తి ఆయనను స్వతంత్ర రాజుగనే గొప్ప సత్కారము గావించెను. క్రీ. శ. 1328 మొదలు 1726 వరకు టిబెటు సర్వస్వతంత్ర దేశముగ డలైలామాలచే పాలించబడెను. 1727 వ సంవత్సరములో ఏడవ డలైలామా చైనావారిచే నోడించబడి చైనా చక్రవర్తియొక్క సార్వభౌమత్వమును అంగీకరించెను. చైనా ప్రభుత్వ ప్రతినిధి యొకడు లాసా పట్టణమున యుంచబడెను.

13 వ డలైలామా యగు టువ్‌టెన్ కియాట్సో 1893 మొదలుకొని 1933 వరకు టిబెట్టు దేశమును సర్వస్వతంత్రుడుగనే పాలించెను. 1910 వ సంవత్సరములో ఆయన చైనావారితో పోట్లాడి ఇండియాకు పారిపోయెను. 1911 వ సంవత్సరములో టిబెట్టుకు మరలివచ్చి చైనావారిని వెడలగొట్టి టిబెట్టును సర్వస్వతంత్రమైన దేశముగ గావించెను. అప్పటి నుంచియు చైనా ప్రభుత్వమునకు సార్వభౌమాధికారము టిబెట్టుమీద లేకుండెను. టిబెట్టు సర్వస్వతంత్రమైన దేశముగ నుండెను.

1904 వ సంవత్సరములో భారతదేశములో కర్జనుప్రభువు ఆంగ్లరాజప్రతినిధిగ నుండగ టిబెట్టు రాజైన పదమూడవ డలైలామా రుష్యావారితో కుట్ర చేయుచున్నాడని ఇండియానుండి సర్ ఫ్రాన్సిస్‌యంగ్ హజ్‌బెండు క్రింద నొక సైన్యము లాసాకు పంపబడెను. డలైలామా లాసాను విడిచి పారిపోయి మంగోలియాలో దాగుకొనెను. 1909 వ సంవత్సరములో ఆయన టిబెట్టుకు మరలివచ్చి టిబెట్టును స్వతంత్ర దేశముగ గావించెను. ఒకవైపున చైనావారు రెండవ వైపున బ్రిటిషువారు మూడవ వైపున రుష్యావారు ముగ్గురిమధ్య తాను స్వతంత్రుడుగ వ్యవహరించుచుండెను. మొత్తముమీద టిబెట్టీయులు తమ చరిత్రలో అత్యంత భాగము స్వతంత్రమును కాపాడుకొనుచు వచ్చిరి. చైనావారు మిగుల బలవంతులుగ నున్న కొన్ని సంవత్సరములలో మాత్రము చైనా యొక్క సార్వభౌమత్వమును టిబెట్టు దేశముపైన డలైలామా అంగీకరించక తప్పినది కాదు. ముఖ్యముగ 1911 మొదలుకొని

**విదేశములతో సంబంధములు**

1950 వరకు నలుబది సంవత్సరములు ఏకధాటిగా నిర్వివాదముగా టిబెట్టుదేశము చైనాదేశము నుండి సంపూర్ణ స్వతంత్రమును అనుభవించినది. 1904 వ సంవత్సరములో యంగ్ హజ్ బెండు దండయాత్రకు పిమ్మట లాసా కన్వెన్షను జరిగినది. బ్రిటిషు ప్రభుత్వము వారు లాసా కన్వెన్షనులో సరాసరి టిబెట్టు ప్రభుత్వముతోనే రాయబారములు జరిపిరి. టిబెట్టు వారితో ఇంగ్లీషు వారు చేసుకొన్న సంధిని చైనా ప్రభుత్వమునకు కూడ చూపించి వారిచేతకూడ ఒప్పించుకొనిరి. ఆ కన్వెన్షను యొక్క తొమ్మిదవ ఆర్టికిలు ప్రకారము బ్రిటిషువారియొక్క అనుమతిలేనిది టిబెట్టువారు తమ ప్రతినిధులను విదేశములకు పంపకూడదు. ఏ విదేశ ప్రభుత్వముయొక్క జోక్యమును టిబెట్టు వ్యవహారములలో కలుగనివ్వ కూడదు. ఇందువలన టిబెట్టు ప్రభుత్వము చైనాతోకూడ నెట్టిసంబంధము పెట్టుకొనకూడదు. 1906-వ సంవత్సరములో జరిగిన పికింగు కన్వెన్షనువల్ల చైనా ప్రభుత్వము లాసా కన్వెన్షనును అంగీకరించినది.' వర్తక విషయ ములలో మాత్రము కొద్ది మార్పులను చేసినది. కాని బ్రిటిషు వారు రుష్యానుండి చైనాను దూరముగ నుంచుటకై టిబెట్టు యొక్క స్వతంత్రమును కాపాడుబాధ్యత చైనా ప్రభుత్వముదే ననియు, టిబెట్టులో ఏవైన ప్రత్యేక హక్కులను 'పొందుటకై చైనాకు మాత్రమే హక్కు కలదనియు వ్రాసుకొన్నారు. ఆపికింగు సమావేశముతో టిబెట్టు ప్రభుత్వమువారికి సంబంధము లేదు. 1907-వ సంవత్సరములో రుష్యావారికిని, ఇంగ్లీషు వారి కిని జరిగిన ఒడంబడికలో చైనా ప్రభుత్వమునకు టిబెట్టుపైన

సార్వభౌమాధికారము ఉన్నటులను, రుష్యావారును ఇంగ్లీషు వారును టిబెట్టుతో ఏదైన రాయబారములు జరిపినప్పుడు చైనా ద్వారానే జరుపునట్లును వ్రాసుకొనిరి. దీనిని టిబెట్టుతో సంప్రతించి చేయలేదు. ఇది టిబెట్టుపైన చెల్లదు. ఇంగ్లండుకు టిబెట్టులోనుంచి రుష్యావారి పలుకుబడిని దూరము చేయుటయే యుద్దేశ్యము కాని నిజముగ టిబెట్టును చైనాక్రింద చేర్చ వలెనని కాదు. టిబెట్టు దేశమును ఇండియా చైనాదేశముల మధ్య తటస్థదేశముగ స్థాపించుటకే వారు ప్రయత్నించినారు. ఆ యొడంబడికలో టిబెట్టుయొక్క స్వపరిపాలనమును పూర్తిగ అంగీకరించుచు టిబెట్టుపై చైనా వారి సార్వభౌమత్వమును మాత్రము పేర్కొనిరి. కాని 1914-వ సంవత్సరములో సిమ్లాలో మూడు ప్రభుత్వముల సమావేశము జరిగినపుడు చైనా టిబెట్టు దేశములను సంపూర్ణ స్వతంత్ర దేశములుగనే బ్రిటిషుప్రభుత్వము ఆహ్వానించినది. టిబెట్టు ప్రతినిధులకు బ్రిటిషు చైనా ప్రతినిధులతోపాటు సంపూర్ణ స్వతంత్రమైన సమానస్థితి అంగీకరించబడ్డది. బ్రిటిషువారు కూడ టిబెట్టుయొక్క సర్వస్వతంత్రమును అంగీకరించుచు ఒడంబడికలు చేసుకొన్నారు.

## 2

కమ్యూనిస్టులు చైనా ప్రజాస్వామికముపైన తమ ప్రభుత్వమును స్థాపించుకొనిన పిమ్మట 1950 వ సంవత్సరము అక్టోబరు నెలలో తమ రాజ్యమును టిబెట్టుపైన విస్తరింపజేయుటకు సమకట్టిరి. చైనాప్రభుత్వ సైన్యములు అక్రమముగ టిబెట్టులో

జొరబడెను. టిబెట్టుపైన అపుడు చైనాకు ఎట్టి సార్వభౌమాధి కారము లేదు. చైనాప్రభుత్వము టిబెట్టుపైన పశుబలముతో కేవలము దురాక్రమణ జరిపినది. అప్పటికి పదునాల్గవ డలైలామా మైనరైనందున యొక రీజెంటు (సంరక్షకుడు) టిబెటుపై పాల నము గావించుచుండెను. పదునాల్గవ డలైలామాయొక్క అసలు పేరు లమో థండాప్ అయ్యుండెను. ఆయన 1935 వ సంవత్స రము జూన్ నెల 6 వ తేదీన చైనాదేశములోని చింగుహైలో నొక పేద టిబెటియనురైతుకుటుంబమునందు జన్మించెను. ఆయన నాలుగున్నర సంవత్సరముల వయస్సు గల బాలుడై యుండగ 13 వ డలైలామా మరణించినందున పోటాలావద్ద బంగారుసింహా సనముమీద 14 వ డలైలామాగ పట్టాభిషిక్తు డయ్యెను. ఆయన పక్షమున దేశమును పాలించుట కొక రీజెంటును (ప్రతినిధిని) యెన్నుకొనిరి.

**టిబెటుపై చైనావారి దురాక్రమణ**

1950 వ సంవత్సరము అక్టోబరు నెలలో కమ్యూనిస్టుచైనావారు టిబెట్టుమీద దండయాత్ర చేసినపుడు ప్రస్తుత డలైలామా పదునారు సంవత్సరముల వయస్సు గలవాడు. చైనాసేనలు లాసాలో దిగగా చైనావారికి భయపడి డలైలామాను తీసు కొని రీజెంటు ఇండియాసరిహద్దుకు పారిపోయెను. చైనావారికి వ్యతిరేకముగ ఇండియాదేశము టిబెటుకు సహాయము చేసే స్థితిలో లేదు. టిబెటుదేశమును చైనావారు సైన్యములతో లోబరుచుకొనుట అక్రమమని ఇండియాప్రభుత్వము చైనాకు తెలిపెను. టిబెట్టుపైన తమకు హక్కు కలదనియు, టిబెటుపైకి తమ సేనలను పంపి లోబర్చుకొనినపుడు ఇండియావంటి ఏ విదే

శము ఆ విషయమున జోక్యము కలుగచేసుకొన కూడదనియు, అది కేవలము తమ అంతర్వ్యవహారమనియు చైనాప్రభుత్వము జవాబు చెప్పినది. నవంబరు నెల 7 వ తేదీన టిబెటుప్రభుత్వము తమ దేశముపైన చైనా జరిపిన దురాక్రమణను గూర్చి విచారించి తమ స్వతంత్రమును కాపాడవలెనని ఐక్యరాజ్యసమితికి విన్నప మును పంపెను. ఎల్. సెల్వాడరు దేశప్రతినిధి టిబెటుపైన చైనాప్రభుత్వము జరిపిన దురాక్రమణను ఖండించవలెననియు, టిబెటుకె వ్విధమైన సహాయము చేయవలెనో యోచించుట కొక కమిటీని వేయవలెననియు, తీర్మానమును ఐక్యరాజ్య సమితిలో ప్రవేశపెట్టెను. ఎవరును దానిని బలపర్చలేదు. ఏదో విధముగ రాజీపడవలెనని ఇండియా చెప్పినమీదట టిబెటు ప్రభుత్వమే సరాసరి చైనాతో రాయబారములు జరుపవలెనని నిశ్చయించెను. 1950 వ సంవత్సరము నవంబరు 17 వ తేదీన డలైలామాచేత ప్రభుత్వ స్వీకారము చేయించిరి. ఆయన చైనావారు దేశమును నాశనము గావింతురను భయముచే 1951 వ సంవత్సరము సెప్టెంబరు 9 వ తేదీన రాజీనామామీద దస్కతు పెట్టెను. కాని తన ముద్రను దానిమీద వేయలేదనియు, అట్టి ముద్ర లేనిది చెల్లదనియు, చైనావారే ఆయనయొక్క ముద్రను సృష్టించి దానిమీద వేసినారనియు డలైలామా పిమ్మట కొంతకాలము నకు ప్రకటించెను. ఆ రాజీ ప్రకారము డలైలామా టిబెటు పైన చైనాయొక్క సార్వభౌమత్వమును అంగీకరించెను. టిబెటులో నున్న రాజ్యాంగవిధానమును గాని, డలైలామా యొక్క హోదాను అధికారములను కాని ఎవ్విధముగ

మార్చబోమని చైనాకమ్యూనిస్టులు హామీ నిచ్చిరి. టిబెటు ప్రజలయొక్క మత విశ్వాసములను, ఆచారములను, సాంప్రదాయములను కూడ గౌరవించెదమని వారు వాగ్దానము చేసిరి. టిబెటులో జరిగే సంస్కరణముల విషయములో అవి ప్రజల యొక్క ఒప్పుదలమీద నెమ్మదిమీద జరుగవలెనే కాని చైనా యొక్క బలవంతమేమీ యుండదనికూడ వ్రాసుకొనిరి. టిబెట్టు ప్రభుత్వమే తనఅంతట తాను దేశములో సంస్కరణములను ప్రవేశ పెట్టవలెను. ప్రజలు అట్టి సంస్కరణములను కోరినపుడు దేశములోని ప్రముఖులతో సంప్రదించి వాటిని ప్రవేశపెట్టవలెను అని కూడ వ్రాయబడినది.

కాని 1951 లో కమ్యూనిస్టులు కొన్ని సంస్కరణములను ప్రవేశపెట్ట యత్నించినారు. అందుకు టిబెట్టు దేశీయులు వ్యతిరేకించినారు. 1952-వ సంవత్సరములో టిబెట్టు దేశీయులు కొందరు భూసంస్కరణలు కావలెనని కోరుచు మావోసిటంగును దర్శించినప్పుడు "టిబెట్టు దేశములోని భూమిని పంపకముచేయుట ఇప్పుడు ఆలోచించ దగినదికాదు. ఇకముందు భూమిని పంచవలెనా, లేదా అనే విషయము టిబెట్టుప్రజలే నిర్ణయించవలెను. భూమి పంపకము జరిగినపుడు టిబెట్టు ప్రజలచేతనే అట్టిపంపకము చేయించవలె" నని ఆయన చెప్పెను. కాని కమ్యూనిస్టులు దేశములో వ్యాపించుట, తమ సిద్ధాంతములను బోధించుట, ప్రజలపై యాజమాన్యము వహించుట జరుగుచుండెను. దీనిని టిబెట్టుప్రజలు ప్రతిఘటించుచుండిరి. 1954-వ సంవత్సరములో ఇండియా ప్రధానమంత్రియగు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ

గారు పికింగులో నున్నప్పుడు, ఆయన ఎదుటనే అక్కడికి పంచను లామాతోకూడ అతిథిగ వచ్చియున్న దలైలామాతో, టిబెట్టుయొక్క అంతర్ వ్యవహారములతో, స్వపరిపాలనలో తాము జోక్యము పుచ్చుకొనమనియు, టిబెట్టుకు కలిగిన అంతర్ వ్యవహార స్వాతంత్ర్యము చైనాప్రజల రిపబ్లికులోని ఏరాజ్యము లోను లేదనియు, మావోసిటంగు చెప్పెను. కాని టిబెట్టులోని జనసంఖ్యను ఒక కోటివరకు వృద్ధిచేయుట అవసరమనియు అందు లకుగాను చైనానుండి టిబెట్టు ప్రజలకు ఐదురెట్లుగ నుండునట్లు చైనావారిని టిబెటులోకి కాపురమునకు పంపెదమనియు 1952 లో మావోసిటంగు చెప్పియుండెను. ఆ ప్రకారము చైనా వారిని టిబెటులోనికి కాపురమునకు పంపసాగిరి. చైనావారు, ముఖ్యముగ కమ్యూనిస్టులు టిబెటులో కాపురమునకు ప్రవేశించి తమపై పెత్తనము చేయుట టిబెటుప్రజలలో ఆగ్రహమును కలుగచేసెను.

1952 వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో చైనా సైనిక స్థానమును లాసాలో స్థాపించిరి. ఆ నెలలోనే చైనావారి ప్రజల బ్యాంకును కూడ లాసాలో ఏర్పాటు చేసిరి. దాని శాఖలు ముఖ్యమైన పట్టణములలో స్థాపించిరి. వాటిద్వారా కమ్యూని స్టులు తమ ఆర్థిక పెత్తనమును టిబెట్టు దేశములో వృద్ధిచేసు కొనసాగిరి. బలవంతపెట్టి దలైలామాచేత తన యిద్దరు ముఖ్య మంత్రులను తీసివేయునట్లు చేసిరి. వారిద్దరిని చైనావారు విచా రణ లేకుండ శిరచ్ఛేదము గావించిరి. టిబెట్టు విదేశ వ్యవహార శాఖను దలైలామా చేత మూసి వేయించిరి. దానికి

పికింగు ప్రభుత్వము యొక్క లాసా విదేశ వ్యవహారశాఖను స్థాపించి విదేశ వ్యవహారములన్నియు చైనాప్రభుత్వము క్రిందికి చేర్చుకొనిరి. అంతేగాక డలైలామాకు పోటీగ పంచనులామాను తీసుకొని వచ్చి ఆయనకు కొన్ని అధికారములను చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము ఇవ్వసాగెను. పంచనులామాకు రాజకీయ అధికారము లేమియు లేవు. ఆయన అదివరకు డలైలామాకు ఒక విధమైన మత సలహాదారుగ నుండెను. 1952 వ సంవత్సరము

**టిబెటులో చైనాప్రభుత్వ దుష్కృత్యములు**

22 వ ఏప్రిలు తేదీన చైనావారి ప్రజలవిముక్తి సైన్యసహాయమున పంచనులామా లాసాలో ప్రవేశించి దానికి సమీపపట్టణమగు షింగ్ట్సేలో నున్న కాషీహుంపో మఠములో ప్రవేశించెను. పంచనులామా యొక్క అధికారమును వృద్ధిచేయ ప్రారంభించిరి. 1951 వ సంవత్సరములో టిబెట్టు దేశములోని చాండో ప్రాంతములో ప్రజలవిముక్తి కమిటీని చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము స్థాపించెను. దానిమీద చైనావారి ప్రభుత్వాధికారము పూర్తిగ స్థాపించి ఖూఖామందు పద్ధతిని రద్దుపరచి చైనావారి రాజ్య వర్తకశాఖలను స్థాపించి పాఠశాలలలో కమ్యూనిజమును బోధించసాగిరి. ఇందువల్ల అచటి ప్రజలలో తీవ్రమైన వ్యతిరేకత కలిగెను. టిబెట్టు దేశమును చైనా కేంద్ర ప్రభుత్వము క్రింద స్వపరిపాలన గల ప్రాంతమని 1954 వ సంవత్సర రాజ్యాంగములో చైనావారు వ్రాసుకొనిరి. ఈ స్వపరిపాలన గల ప్రాంతములు టిబెట్టుతోపాటు సింకియాంగు, తూర్పు మంగోలియా యున్నవి. ఈ మూడును చైనా కేంద్రప్రభుత్వమునుంచి విడిపోకూడదనియు స్వతంత్ర

ముగ నుండకూడదనియు వ్రాయబడినది. టిబెట్టు దేశమును అన్ని విధముల తమ తక్కిన ఇరువదిమూడు రాష్ట్రములతో సమానమైన స్థితికి తెచ్చుటయే చైనాప్రభుత్వ యుద్దేశ్యమై యున్నది. టిబెటు దేశముపైన గావించవలసిన మార్పులకుగాను ప్రెపరేటరీ కమిటీని (దేశమునుతయారుచేయు ఉపసంఘమును) కమ్యూనిస్టు ప్రభుత్వము స్థాపించెను. ఇది కేంద్ర పరిపాలనాసంస్థగా నుండెను. ఈ కమిటీకి మూడు శాఖల నేర్పరచిరి. ఒకటి డలై లామా యొక్క అధ్యక్షతను, రెండవది పంచనులామా యొక్క అధ్యక్షతను, మూడవది చాండోలోని ప్రజల విముక్త కమిటీ క్రిందను స్థాపింపబడినవి. పంచనులామా యొక్క నివాసస్థలమగు షిగ్ట్సె వద్ద నున్న మఠములో పంచన్ కాంపోలిజా అను పేరుగల యొక కౌన్సిలు నేర్పాటుచేసిరి. మధ్య టిబెటులో చేరిన గొప్ప భాగమగు రెండు లక్షల జనసంఖ్య గల సంగు రాష్ట్రము పంచనులామా యొక్క కౌన్సిలుక్రింద యుంచబడెను. ఈ విధముగ టిబెటుదేశమును మూడు పరిపాలనా ప్రాంతములుగ విభజించి ఒకదానిమీదనే డలై లామా యొక్క నిజమైన అధికారమును ఏర్పరచిరి. వీటివల్ల టిబెటుయొక్క ఐక్యత చెడెను. డలై లామా యొక్క అధికారము తగ్గెను. ఈ మార్పులను తయారుచేయు ఉపసంఘము లన్నీ చైనాప్రభుత్వ మంత్రివర్గము క్రిందనే పనిచేయునని ప్రకటింపబడెను. టిబెటులో జరిగే మార్పులన్నిటిని చైనాయొక్క కేంద్రప్రభుత్వమే తమ యుద్యోగుల ద్వారానే నిర్వర్తించును. దీనికి లాసాలోనున్న సైనికశాఖ సహాయము చేయును.

టిబెట్టులో నేర్పరచబడిన మూడు పరిపాలనా కమిటీలలో చైనా కమ్యూనిస్టులకు ప్రధానస్థానము నిచ్చియున్నారు. చైనా కమ్యూనిస్టులు టిబెట్టులో డలైలామాయొక్క అధికారమును సర్వవిధముల తగ్గించుటకును, టిబెట్టు ప్రజలలోను, నాయకులలోను భేదాభిప్రాయములను పుట్టించి వృద్ధిచేయుటకును సర్వ ప్రయత్నములను చేసిరి. ఈ సంగతి డలైలామా ఇండియాకు వచ్చినప్పుడు ముస్సోరీలో ప్రకటించెను. 1952-వ సంవత్సరము మే 1 వ తేదీన చైనా కమ్యూనిస్టు యువజన సంఘముయొక్క టిబెట్టు ప్రాంతపు శాఖను స్థాపించిరి. టిబెట్టు యువకులలో కమ్యూనిజమును బోధించి వారిచేత చైనాయొక్క పరిపాలనను అంగీకరించునట్లును వారందరిని కారల్ మార్క్సు సిద్ధాంతములను బాగుగ నేర్చుకొనునట్లును చేసిరి. ఈ యువజనులచేత దేశములో క్రొత్త భావములను వ్యాపింపచేసి బౌద్ధమతమును, టిబెట్టులో నున్న సంప్రదాయములను, ఆచారములను నాశనము గావించిరి. వందలకొలది టిబెటను యువకులు చైనాకు తీసుకొనిపోబడిరి. అక్కడ వారికి కమ్యూనిస్టు బోధనలు చక్కగచేసి మరల టిబెట్టుకు పంపిరి. 1957-వ సంవత్సరమువరకు 70 ప్రాథమిక పాఠశాలలు ఆరువేలమంది విద్యార్థులతో స్థాపింపబడెను. వాటిలో మతబోధ తీసివేయబడెను. కమ్యూనిజము నేర్పబడెను. వీటిలో ఆడపిల్లలనుకూడ చేర్చుకొనిరి. చైనాభాష నిర్బంధముగ నేర్పబడెను. 1953-వ సంవత్సరములో టిబెట్టు మార్పుల శాఖయొక్క రాజకీయ వర్గముక్రింద టిబెటను న్యూస్

కమ్యూనిజ వ్యాపకము

అను మాసవారీ పత్రిక స్థాపింపబడెను. పిమ్మట టిబెట్టు జీపోఅను దినపత్రిక టిబెట్టు భాషలోను, చైనాభాషలోను స్థాపింపబడెను. తయారుచేయు ఉపసంఘ శాఖలకు అవి ప్రధాన పత్రికలుగ నుండెను.

దేశముయొక్క వివిధ భాగములలో టిబెట్టుభాషలో కమ్యూనిస్టు భావములను వ్యాపింపచేయు వేలకొద్ది కరపత్రములు పంచిపెట్టబడెను. ఇటుల కమ్యూనిస్టు భావములను వ్యాపింప చేయుచున్నందుకు, బౌద్ధమతమును నాశనము చేయుచున్నందుకు ప్రథమమునుంచి టిబెట్టులోని ప్రజలు ప్రతిఘటనమును సలుపసాగిరి. ముఖ్యముగ కమ్యూనిస్టులు భూమి దున్నువారిలోను, చేతిపనులు చేసుకొను వారిలోను ప్రవేశించి వారికి విద్యనేర్పుట, వారిలో కమ్యూనిస్టు భావములను స్థాపించుట చేయసాగిరి. లాసాలోను, షింగ్ట్సేలోను స్థాపింపబడిన కళాశాలలలో కమ్యూనిస్టు భావములను, రాజకీయ విధానములను నేర్పసాగిరి. వ్యవసాయమునకు, పశువుల అభివృద్ధికి కొన్ని శాఖలున్న కళాశాలలను టిబెట్టులో కమ్యూనిస్టులు స్థాపించిరి. పరిపాలనలో, బ్యాంకింగులో, పరిశ్రమలలో శిక్షణ నిచ్చుటకు కళాశాలలను కూడ స్థాపించిరి. ఇవన్నియు కేవలము విద్యనిచ్చునవిగ యున్నయెడల టిబెట్టియనులకు చాల సహాయ పడునవి, టిబెట్టు ప్రజలు చాల సంతోషించునవి అయ్యున్నవి. కాని వీటిద్వారా టిబెట్టులోని మతము, టిబెట్టులోని విజ్ఞానము, టిబెట్టులోని సంప్రదాయములు నాశనము చేయబడి టిబెట్టులోని యువజనులలో కమ్యూనిస్టు భావములు పూర్తిగ వ్యాపింప

బౌద్ధమత నాశనము

చేయుటవల్ల టిబెట్టులోని ప్రముఖులకు, ప్రజలకు వ్యతిరేకత బాగుగనేర్పడెను. టిబెట్టు ప్రభుత్వము సంస్కరణములకు వ్యతిరేకము కాదనియు, కాని మా పాత సంఘమునకు, మా దేశములోని సంప్రదాయమునకు అనుగుణముగ మార్పును తీసుకొనివచ్చుట మా ఉద్దేశ్యమనియు, కమ్యూనిజము బొత్తుగ పనికిరాదనియు దలైలామా ఇండియాకు వచ్చి ముస్సోరీ చేరినప్పుడు చెప్పెను. "పైగా అదివరకు తొమ్మిది సంవత్సరములనుంచి తాను, తన ప్రభుత్వము అనేక సంస్కరణములను ప్రజలలో ప్రవేశపెట్టుటకు ప్రయత్నించగ కమ్యూనిస్టు ప్రభుత్వము అటకాయించినది. టిబెట్టులో చైనా కమ్యూనిస్టులు చేయుచున్న ప్రతి విషయము కమ్యూనిజమును వ్యాపింప చేయుటకు అనువై యున్నది." అని చెప్పెను. 1957 వ సంవత్సరములో చైనా కమ్యూనిస్టు పార్టీ యొక్క టిబెట్టు శాఖ కార్యదర్శియైన ఫాన్ మింగు ఇటుల వ్రాసి యున్నాడు. "ఇప్పుడు టిబెట్టు దేశములో ఐదువేల కమ్యూనిస్టు కమిటీలను టిబెట్టువారి నుండియే ఏర్పాటు చేసినాము. వేయి మంది కంటె ఎక్కువమంది టిబెటియనులు కమ్యూనిస్టుపార్టీ సభ్యులుగ నున్నారు. టిబెట్టు కమ్యూనిస్టు యువజన, వైజ్ఞానిక సంఘములో ఆరువేల మంది, స్త్రీల సంఘములో వేయిమంది సభ్యులు గలరు" అని వ్రాసి యున్నాడు. ప్రతి గ్రామములోను సభ్యులంతా గృహములకు వెళ్ళి కమ్యూనిస్టు పాఠములు నేర్పుచున్నారు.

కాని ఫాన్ మింగే "టిబెట్టు ఆచారములను యువకులు ధిక్కరించుచున్నందున చైనావారియందు టిబెట్టు ప్రజలలో

ఆగ్రహమెక్కువగుచున్న" దని వ్రాసినాడు. టిబెట్టులో జొరబడి చైనావారు తాము "హన్" జాతికి చెందిన వారము, అధికులము, టిబెట్టువారు తమకన్న తక్కువవారు అను భావములతో ప్రవర్తించుచున్నారు. టిబెట్టువారిని నీచముగ చూచుచున్నారు. 1952 వ సంవత్సరములో లాసానగరమున ప్రజల మహాసభ జరిగినది. వీరు డలైలామాకు సంపూర్ణమైన అధికారమును టిబెటు కిందు ఇవ్వవలెననియు, టిబెటులోని చైనా సైన్యమును తగ్గించవలెననియు, టిబెటులోని బౌద్ధమఠముల యొక్క స్థితిని అభివృద్ధి చేయవలెననియు, ఆహారధాన్యముల ధరలు ఎక్కువగుచున్నందున ఆహార సమస్యను తీర్చవలెననియు తీర్మానములు చేసి ఆ ప్రకారమే ఒక మెమోరాండమును డలైలామా ద్వారా చైనా ప్రభుత్వమునకు పంపియున్నారు. టిబెటు దేశాభిమాన సంఘము స్థాపించబడినది. దాని పేరు 'మిమాంగు' అనగ జనసముదాయమని అర్థము.

టిబెటు దేశాభిమానుల మహాసభ

ఈ విధముగ టిబెటులో కమ్యూనిజముకు, చైనాకమ్యూనిస్టు ప్రభుత్వమునకు తీవ్రమైన వ్యతిరేక భావము కొద్దిమంది భూస్వాములలోను, గ్రామాలలోను మాత్రమేగాక దేశమంతట వ్యాపించినది. ఈ సంగతిని గ్రహించియే మావోసిటంగు, చౌ ఎన్ లై లు 1957 వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో చైనా యొక్క ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలములో టిబెటు దేశములో తీవ్ర సంస్కరణములు చేయకూడదని నిశ్చయించినట్లు ప్రకటించినారు. మూడవ పంచవర్ష ప్రణాళికా కాలములో అట్టి

సంస్కరణములను చేయవచ్చునా లేదా అను విషయము ముందు ఆలోచించబడవచ్చునని కూడ వారు చెప్పినారు. దేశమును తయారుచేయు ఉపసంఘముయొక్క మొదటి సంవత్సరోత్స వమునాడు అనగ 1957 వ సంవత్సరము ఏప్రిలు నెల 22 వ తేదీన టిబెట్టులోని రాజకీయ, సాంఘిక సంస్కరణములు 1962 వ సంవత్సరమువరకు వాయిదా వేయబడునని చైనా ప్రభుత్వము ప్రకటించినది. టిబెట్టుదేశములోని స్వల్పసంఖ్యాకులు సంస్కరణములకొరకు ఆత్రత చూపుచున్నప్పటికీ అత్యధిక సంఖ్యాకులు సంస్కరణములకు వ్యతిరేకులుగ నున్నారని 1959 సంవత్సరము ఆగస్టు 23 వ తేదీన జీపోవ్ పత్రిక టిబెట్టునుంచి ప్రకటించినది. అందువలన ఈ సంస్కరణములను ప్రవేశపెట్టక ముందు చైనాకు టిబెట్టుకు మధ్య రైలువేలు, రోడ్లు, ఆకాశవిమానములు వేయుట చాల ముఖ్యమైనదని చైనా కమ్యూనిస్టుప్రభుత్వ కార్యక్రమములో నిర్ణయింపబడినది. 1413 మైళ్ళ పొడవుగల మిగుల గొప్పదగు సైకాంగు టిబెట్టు రోడ్డు వేయబడినది. 13 వేల అడుగుల ఎత్తున కొండలలోగుండా అది పోవుచున్నది. 12 నదులను దాటినది. ప్రపంచములోని మిక్కిలి ఎత్తయిన రోడ్డు అది. పికింగునుంచి కాని, షాంఘుహైనుంచి గాని లాసాకు రోడ్డుమీద 20 రోజులలో ప్రయాణము చేయుటకు అవకాశము కలిగించబడ్డది. ఇదిగాక ఇంక రెండు గొప్ప రోడ్లు చైనానుండి లాసావరకు వేయబడుచున్నవి. టిబెట్టుదేశములో జరుగుచున్న కమ్యూనిస్టు వ్యాపకము డలైలామాకు తెలిసినను ఏమియు చేయజాలక బైటికి తీయని మాటలతో మాట్లాడుచుండెను. 1954 వ

సంవత్సరము మే నెలలో డలై లామా, పంచనులామా ఉభయు లును పికింగుకు ఆహ్వానించబడిరి. వా రిద్దరును చైనాకు వెళ్ళి యున్న సమయములో టిబెట్టులోని కమ్యూనిస్టులు డలై లామాకు వ్యతిరేకముగ కొన్ని గ్రంథములను సృష్టించి వ్యాపింప చేసిరి. లాసా నగరము, దాని చుట్టుపట్టు ప్రాంతము యావత్తు అసలు పంచనులామా యొక్క రాజ్యమేనని బౌద్ధ చరిత్రను తిరుగవ్రాసిరి. దీనిని టిబెట్టు దేశస్థులు ఎవరును నమ్మ లేదు. టిబెట్టు దేశములో కూడ రోడ్లను ఎక్కువగ వేయ సాగిరి. టిబెట్టులోని వేలకొలది ప్రజలచేత రోడ్ల పనులలో కఠిన మైన పనిచేయించినందున కొంతమంది మరణించుటయు, కొంత మంది విశేషబాధలను పొందుటయు సంభవించినది. వీనికి తన విచారమును తెలుపుచు డలై లామా ప్రకటనమును గావించెను. పంచనులామా చైనా కమ్యూనిస్టులకు స్తోత్రపాఠముల నిచ్చెను.

ఖంబా జాతులు కాపురమున్న ప్రాంతములలో చైనా వారు కమ్యూనిజమును వ్యాపింప చేయుటవల్లను, తమ భూము లను పశువులను లాగుకొని సమష్టి వ్యవసాయ క్షేత్రములను ప్రవేశపెట్ట ప్రయత్నించినందునను ఖంబా తెగలు 1956 నుండి చైనా ప్రభుత్వముపై తిరుగు బాటులను సాగించిరి. ఆ తిరుగుబాటులు క్రమక్రమముగ తీవ్ర తరమయ్యెను. మంచో నుంచి లాసా వరకు వేయదలచిన రైలుమార్గమును ఆ తిరుగుబాట్లవల్ల చైనా ప్రభుత్వము వేయ లేకపోయినది. పికింగునుంచి లాసాకు ఒక ఆకాశ విమాన మును వేసినది. పదిగంటలలో వెళ్లుటకు వీలయ్యెను. రాక

తిరుగుబాట్లు

పోకల సాధనములు వృద్ధియగుటవలన టిబెటనులకు కలిగిన లాభ మేమియు లేదు. చైనానుంచి ఎక్కువ సరకులు తీసుకొని వచ్చుటకు మూరుగా, చైనానుంచి వేలకు వేలమంది (చైనా) హన్‌జాతివారిని తీసుకొనివచ్చి టిబెటులో కాపురము పెట్టిరి. ధరలు విశేషముగ పెరిగెను. ఆహార పదార్థములు కరువయ్యెను. ఈ సంగతి డలైలామా దేశమును తయారుచేయు ఉపసంఘములో చెప్పెను. భూసంస్కరణములను చైనా ప్రభుత్వము ప్రవేశపెట్టిన చోట్లనెల్ల ప్రజల తిరుగుబాట్లు జరిగెను. ఆ ప్రాంతములలో నాలుగు వేలమంది స్త్రీలను, పురుషులను, పిల్లలను చైనాసేనలు హత్యగావించిరని, ప్రజలమీద ఘోరమైన కృత్యములను చేసిరని, బౌద్ధ మఠములమీద బాంబులు వేసి నాశనము గావించిరని, తెలియుచున్నది. అందువలన తిరుగుబాట్లు తగ్గక పోగా చాండో, డించింగు, నాగ్‌చుకా, లోకా ప్రాంతములలోకి కూడ వ్యాపించినవి. అక్కడి ప్రజలు చైనావారి సైన్యములను ముట్టడించిరి. బౌద్ధమత గురువులగు లామాల భూములను లాగుకొని సమష్టి వ్యవసాయ క్షేత్రములలో కలిపి, వారిచేత బలాత్కారముగ పొలములలో పనిచేయించుట కూడ ప్రజలకు ఆగ్రహకారణ మయ్యెను. 1958 వ సంవత్సరము సెప్టెంబరు నెలలో పండిత జవహరులాల్ నెహ్రూ టిబెటు దేశమును దర్శించ ప్రయత్నించగ చైనా ప్రభుత్వము వద్దని సలహానిచ్చిరి. భూటాను వరకు వెళ్లివచ్చెను. టిబెటులో అశాంతి తిరుగబాట్లు ప్రబలి యున్నవని ఆయన చెప్పెను.

1959 వ సంవత్సరము జనవరి ఒకటవ తేదీన తిరుగుబాటు నాయకులు న్యాయమైన భూసంస్కరణలకు తాము వ్యతిరేకులము కామనియు, నష్టపరిహారమిచ్చి భూములను తీసుకొనుటకు తాము సమ్మతించెదమనియు, ప్రయోజన కూటంగుతో ప్రజలు ఎన్నికలు జరిపిన ప్రజారాజ్యము స్థాపితము కావలెననియు, వ్యక్తిస్వాతంత్ర్యము పూర్తిగ నుండవలెననియు ప్రకటించిరి. "మా ప్రజలయొక్క జీవన ప్రమాణము వృద్ధియగుటకు కావలసిన సమస్త సంస్కరణములకు మేము అనుకూలముగ నున్నాము. ఏ సంస్కరణములు జరిగినా మా దేశము యొక్క, మా ప్రజల యొక్క పరిస్థితులకు, ఆచారములకు, నాగరికతకు అనుకూలమైనవిగ నుండవలెను. వ్యవసాయికుల యొక్క, చేతిపనివారి యొక్క, పశువుల కాపరులయొక్క ఆర్థికస్థితి, శాంతియుతమైన పద్ధతులలో అభివృద్ధి చేయుట మా కిష్టమే" అని వారు ప్రకటించిరి. ఈ ప్రకటన ప్రభువుల యొక్క లామాల యొక్క అంగీకారమే కాక యావన్మంది ప్రజలయొక్క అంగీకారము పొందినది.

టిబెటు జాతీయతత్వము

తిరుగుబాట్లు లాసాకు కూడ వ్యాపించినవి. అందుకు ప్రతీకారముగ చైనాసేనలు మఠములను పాడుచేసెను. లామాలను హత్యగావించెను. చూతేసేనాని 1958 వ సంవత్సరము డిసెంబరు నెలలోనే లక్షలకొలది టిబెటు దేశమునకుపోయి కాపుర ముండవలెనని చైనా యువకులకు గొప్ప విన్నపమును పంపెను. ఈ విదేశీయులగు చైనావారు హాన్ తెగవారు. వీరు ఏబది లక్షలమంది టిబెటుకు

ఏబది లక్షల మంది చైనావారు టిబెటుకు కాపురమునకు పోయిరి

కాపురమునకు వచ్చిరని యొక అంచనా వేయబడినది. ఇంతమంది తమదేశము నాక్రమించుట వలనను తమను అణగ్రదొక్కుట వలనను టిబెటుదేశములో ప్రతిఘటన మెక్కువయ్యెను. టిబెటనుల యొక్క ధాన్యాగారములలోనుంచి ధాన్యమును తీసుకొని పోయిరి. వాటికి ప్రతిఫలమివ్వలేదు. అదివరకు టిబెట్టులోనున్న నాణెములను తీసివేసిరి. చైనా నాణెములను ప్రవేశపెట్టిరి డలైలామా తనక్రిందనున్న సైన్యములను పంపి ఖంబా తెగల తిరుగుబాట్లను అణచలేదని చైనా ప్రభుత్వమునకు ఆయనమీద ఆగ్రహము కలిగెను. ఆయన ఈ తిరుగుబాట్లతో సరికుగ నున్నాడనికూడ చైనా ప్రభుత్వమువారు అనుమానించిరి.

ఇట్టి పరిస్థితులలో 1959 వ సంవత్సరము మార్చినెల మొదటివారములో టిబెట్టులోని చైనాప్రభుత్వ సేనానాయకు డగు టాన్ క్యుయోసునన్ దగ్గరనుంచి డలైలామాకు సరాసరి ఒక యుత్తరము పంపబడెను. డలైలామాకు సరాసరి ఉత్తరములు ఎవరును వ్రాయకూడదు. కాషగ్ అని పిలువబడెడు మంత్రివర్గముద్వారానే ఆయనకు ఉత్తరములను సమర్పించుకొనవలెను. అట్టి ఆచార మును విసర్జించి డలైలామాకు మిగుల అమర్యాదకరమైన వాక్యములతో వెంటనే పరివారము నెవరినీ తనతో తీసుకొని రాకుండ ఆయన టిబెట్టులోని చైనా ప్రభుత్వ ప్రతినిధియైన చాంగ్‌చెంగు ఊ సేనానివద్దకు ఒంటరిగ హాజరు కావలెనని వ్రాయబడియున్నది. అటువంటిది అదివరకెన్నడును కని విని ఎరుగనిది. దానిమీద గొప్ప ఆందోళనము బయలుదేరినది. డలై

డలైలామాకు గొప్ప అవమానము

లామాను స్వాధీనపరచుకొని తమ ఖైదులో నుంచుకొనుటకు, ఆయనను బలవంతపెట్టి తమకు కావలసిన దానినంతను ఆయన చేత వ్రాయించి పుచ్చుకొనుటకు చైనా కమ్యూనిస్టుప్రభుత్వము వారు నిశ్చయించిరను అనుమానము గట్టిగ కలిగినది. ఆ సమయ మున టిబెట్టు సంవత్సరాది పండుగను సలుపుటకు జనులు గుంపులు గుంపులుగ రాజధానియైన లాసా పట్టణమునకు చేరుచుండిరి ఖంబా తెగకు చెందినవారుకూడ కొన్నివేలమంది లాసాకు వచ్చి యుండిరి. ఈ ఉత్తరము సంగతి డలైలామా యొక్క 57 సంవ త్సరముల వయస్సుగల తల్లిగారికి తెలిసెను. ఆమెయొక్క దుఃఖమే ప్రజాసముదాయములో వ్యాపించినది. అనేకమంది స్త్రీలు దుఃఖముతో బిగ్గరగ ఏడ్చుకొనుచు మార్చి 12 వ తేదీన ఒక గొప్ప ఊరేగింపుతో లాసాలోనున్న ఇండియా ప్రభుత్వ రాయబారివద్దకు వచ్చి తమతోకూడ చైనా ప్రభుత్వ ప్రతినిధి వద్దకు ఈ విషయములో ఐక్యము కలుగచేసుకొని ప్రజల అభిప్రాయముల ప్రకారము ప్రవర్తించవలసినదని కోరుటకు రమ్మనిరి. ఆయన అటుల చేయజాలననియు, ఈ విషయము చైనాప్రభుత్వ ప్రతినిధికి తానే తెలియపరచెదననియు చెప్పెను. ముప్పదివేలమంది జనము 10 వ మార్చి తేదీన డలైలామా యొక్క భవనముచుట్టు చేరిరి. ఏమైననుసరే చైనా ప్రతినిధి వద్దకు ఆయన పోకూడదని వారందరు చెప్పిరి. వెంటనే లాసాలో నున్న టిబెట్టు ఉద్యోగస్థులు, సైనికులు కమ్యూనిస్టులతో సాను భూతి కలవారిని అరెస్టుచేసిరి. చైనా కమ్యూనిస్టుప్రభుత్వమునకు వ్యతిరేకములైన కాగితములు పంచిపెట్టబడెను. బౌద్ధ మత

ములలో, ఇతర స్థలములలో ఆయుధములు పోగుచేసి దాచి యుంచబడెను. ఆయుధములను తీసుకొని ఖంబా శూరులు వీథులలో తిరగసాగిరి. కమ్యూనిస్టులను కొందరిని హత్య గావించిరి. అందుమీద చైనా సైన్యములు లాసాలో ప్రవేశించెను. వారివద్దనున్న ఆయుధములు మిక్కిలి బలమైనవి. టిబెట్టు దేశీయులు ఇంత ప్రతిఘటనమును తమకు గావింతురని వారను కొనలేదు. అక్కడక్కడ మరఫిరంగులను నిలిపిరి. దలైలామా యొక్క మఠమగు నార్బులింగ్కా సౌధములో దలైలామా యొక్క మంత్రులు మొదలైనవారు సమావేశమై ఆలోచనలు జరిపిరి. జాతీయ ఎసెంబ్లీయొక్క సభ్యులలో అత్యధిక సభ్యులు దలైలామా వెంటనే లాసాను వదలిపోవుట మంచిదని సలహా నిచ్చిరి. మార్చి 17 వ తేదీన చైనా సైన్యములయొక్క కొన్ని తుపాకిగుళ్ళు దలైలామాయొక్క సౌధపుతోటలో పడెను. దీనిని చూచి వెంటనే లాసాను వదలిపెట్టుటకు దలైలామా నిశ్చయించెను. కాని మార్చి 11 వ తేదీ, మార్చి 17 వ తేదీలమధ్య దలైలామా చైనావారియొక్క తీవ్రతను, అపనమ్మకములను తగ్గించుటకుగాను వారితో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుచుండెను. మొదట ఆ ఉత్తరములు నిజమైనవి కావని చెప్పినప్పటికిని భారతదేశమునకు వచ్చినపిమ్మట దలైలామా ఆ ఉత్తరములు తనవేనని ఒప్పుకొనెను. మార్చి 10 వ తేదీన తనకు చైనా ప్రతినిధి వద్దకు రావలెనని ఉన్నప్పటికి రానివ్వకుండ చుట్టూ జనసముదాయము తనను అటకాయించెనని, అందువల్ల రాలేకపోయినానని యు చైనాతో స్నేహముగ నుండుటయే తనకిష్టమనియు

వ్రాసెను. అటువంటివి మూడు ఉత్తరములు గౌరవకరమైన భాషలో వ్రాయబడెను. చైనావారి నుంచి వచ్చిన జవాబులు మిక్కిలి అమర్యాదకరముగ నుండెను.

గాని దలైలామా దేశమును విడచి పారిపోవునని వారు తలచలేదు. ఆయన మంత్రులు, జాతీయ ఎసెంబ్లీ యొక్క సభ్యులు మాత్రమేగాక, టిబెట్టులోనున్న డ్రీవెంగు, సేరా, ఖండెన్ అను మూడు గొప్ప బౌద్ధమఠముల యొక్క ప్రతినిధులు కూడ ఆయన తక్షణము దేశమును వదలి వెళ్ళవలెనని గట్టిగ సలహానిచ్చిరి. ఆయన యొక్క వయస్సు 24 సంవత్సరములు. "నేను వెళ్లుటవలన నా ప్రజలకు లాభకరమైనచో నేను వెళ్లెదను. కేవలము నా ప్రాణమును కాపాడుకొనుటకు మాత్రమే నేను భయపడి వెళ్లదలచుకొనలే"దని ఆయన చెప్పెను. అప్పుడు వారందరు ఆయన కాళ్ల మీద సాష్టాంగపడి ఏమైనను సరే వెళ్లవలసినదని ఆయనను ప్రార్థించిరి. ఆయన వెళ్లుటకు నిశ్చయించెను. ఆయన తల్లి, సోదరి, సోదరుడు, విద్యచెప్పు గురువులు, మంత్రులు, గొప్ప ఉద్యోగస్థులు అందరూ కూడ కొన్ని గంటలలో లాసాను విడిచి వెళ్లవలెనని తీర్మానించబడెను. సాయంత్రమయ్యే టప్పటికే, ఇంకను రాత్రి ప్రారంభించక ముందే లాసాలో ఒక గాలిదుమారము లేచి యావత్తు మబ్బుగా నున్నందున ఆ వెంటనే బయలుదేరుటకు నిశ్చయించి దలైలామా తన సౌధమును విడిచి బయలుదేరి వెళ్ళెను. ఆ వెళ్లుటకు మునుపే త్రోవలో వారికి కావలసిన భోజన సదుపాయములు, వారిని తీసుకొని పోవుటకు గుర్రములు,

దలైలామా ఇండియాకు చేరుట

కంచర గాడదలు అన్నియు సిద్ధపరచబడెను. నూతన సంవత్సర మైనందున ప్రజలు గుంపులు గుంపులుగ వీధులవెంట తిరుగు చున్నందున చైనావారికి ఈ సంగతి ఏమియు తెలియలేదు. డలైలామాతో వచ్చినవారు చిన్నచిన్న బృందములుగ విడిపడి పోయి వేరువేరు త్రోవలలో లాసాకు 35 మైళ్లు దక్షిణముననున్న చేథంగులో కలియుటకు తీర్మానించిరి. లాసానుండి ఇండియా యొక్క సరిహద్దుకు కాకిపోవు మేరకు 150 మైళ్లు ఉండును. కాని చుట్టుతిరిగి మూడువందల మైళ్లు ప్రయాణము చేయవలసి వచ్చెను. 15 రోజులు ప్రయాణముచేసిరి. కొంత కాలినడక, కొంత గుర్ర ముల మీద, కొంత కంచరగాడిదల మీద రోజుకు ఇరువది మైళ్లు చొప్పున ప్రయాణముచేసిరి. ట్సాంగ్‌పో నదికి దక్షిణమున నున్న ప్రాంతములో ప్రజలు ఖంబాల తిరుగుబాటుతో సానుభూతి గల వారై యున్నందున డలైలామా బృందము గ్రామ గ్రామము నకు నెమ్మదిగ వెళ్లుటకు, అక్కడ భోజన వసతులను పొందుటకు ప్రజలవల్ల సన్మానములను పొందుటకు వీలైనది. ఐనను ప్రజలు ఉండమన్నను ఉండక త్వరత్వరగ వెళ్లుటకే వారు నిశ్చయించిరి. ఈయన వెళ్లిపోయినాడన్న సంగతి చాల ఆలస్యముగ చైనా వారికి తెలిసెను. ఆయన భూటానుకు వెళ్లినాడని ఒక వార్తను ఈయన పక్షము వారు వ్యాపింపచేసినందున ఆ వైపుకే చైనా వారు తమ మనుష్యులను పంపిరి. తమ ఆకాశ విమానములు కూడ ఆ వైపుకే వెళ్లినవి. ఆయన బయలుదేరి వెళ్లగనే టిబెట్టు రాజధానియైన లాసాలో గొప్ప తిరుగుబాటు సాగినందున దానిని అణచుటకే చైనా సేనలు పనిచేయవలసి వచ్చినది. మార్చి

22 వ తేదీనాటికి తిరుగుబాటు చాలవరకు అణచివేయబడెనని చైనావారు ప్రకటించిరి. నాలుగు వేలమంది టిబెటనులను ఖైదీలుగ తీసుకున్నామని, రెండు వేలమందిని చంపినామని ప్రకటించిరి. ముఖ్యముగ లామాల మీద కసి తీర్చుకొనుటకు మఠములను నాశనము చేయుటకు చైనావారి సైన్యములు తలపెట్టెను. లాసా నుండి టిబెట్టువారిని పదిహేను వేలమందిని పట్టుకొని దూర ప్రాంతమునకు పంపిరి. అనేకమందిని శిరచ్ఛేదము గావింప చేసిరి. దలైలామా బృందము బ్రహ్మపుత్ర నదిని దాటి ఇండియాలో ప్రవేశించెను. ఇండియా దేశములోని నేఫాకు వచ్చుటకు ఇంకను రెండు రోజు లుందనగ తనను, తన పరివారమును ఇండియాలో ప్రవేశించనివ్వవలెనని, అక్కడ తమకు శరణ్యమివ్వవలెనని అయన ఇండియా ప్రభుత్వమును ప్రార్థించుచు చారులను పంపెను.

31 వ తేదీ మార్చి సాయంత్రముకు దలైలామా, ఆయన తల్లి, సోదరుడు, సోదరి, ముగ్గురు మంత్రులు, కొందరు ఉపాధ్యాయులు భారతదేశసరిహద్దులలోని చూతంగుమూలో ప్రవేశించగ టేవాంగు సబ్ డివిజన్ యొక్క ఇండియా ప్రభుత్వపు అసిస్టెంటు రాజకీయ ఆఫీసరు వారిని సన్మానించెను. తక్కిన వారందరు కొద్దికాలములో అచట చేరిరి. ఏప్రిలు 3 వ తేదీన లోకసభలో దలైలామా హిందూదేశములో సురక్షితముగ చేరెనని పండిత జవహారులాల్ నెహ్రూగారు ప్రకటించిరి. ఆ క్రిందటి దినముననే హాంకాంగులోని చైనా పత్రికలు ఈ సంగతి ప్రకటించెను. 31 వ మార్చి తేదీన అనగ, దలైలామా భారతదేశ సరిహద్దులలో

ప్రవేశించిన దినముననే పికింగులోని పీపుల్స్ డెయిలీ అను దిన పత్రిక ఇండియాదేశము చైనాయొక్క గొప్ప స్నేహము గల ఇరుగు పొరుగు దేశమని చెప్పుచు టిబెటు వ్యవహారములలో ఇండియా వంటి విదేశ ప్రభుత్వ మెవరైనను జోక్యము పుచ్చు కొన్నచో తాము సహించబోమని హెచ్చరిక చేసెను. టిబెటు వ్యవహారములు కేవలము చైనాదేశ ప్రభుత్వముయొక్క అంతర్ వ్యవహారములని గట్టిగ చెప్పెను. కాలింపాంగు పట్టణములో టిబెటులోని చైనా ప్రభుత్వముమీద తిరుగుబాటుచేయు కుట్రలు చేయబడుచున్నవనియు, అక్కడ చైనాకు వ్యతిరేక బృందము ఉన్నదనియు ఆ పత్రిక వ్రాయగ ఇండియా ప్రధానమంత్రి దానిని అబద్ధమని ఖండించెను. లోకసభలోని కమ్యూనిస్టు సభ్యులుకూడ కాలింపాంగు పట్టణములో చైనాకు వ్యతిరేకమైన కుట్రలు జరుగుచున్నవని చెప్పగ పార్లమెంటులోని ఇతర పక్షములవారు వారిని ఖండించిరి. డలైలామా పార్టీ చూతంగుమూ నుంచి గొప్ప బౌద్ధక్షేత్రమగు టూపంగుకు అక్కడనుంచి బొండిల్లామీదుగ సురక్షితముగ టేజ్‌పూరు చేరిరి.

లాసాను విడిచిపెట్టక ముందు డలైలామా యొక్క మంత్రివర్గము 1951 వ సంవత్సరము మే 23 వ తేదీన చైనా టిబెటుల మధ్య జరిగిన ఒడంబడికను రద్దుపరచిరి. ఒడంబడికకు వ్యతిరేకముగ చైనా ప్రభుత్వము టిబెటుపైన అనేకమైన అక్రమములు జరిపినందున ఒడంబడిక అంతటినుంచి చెల్లనేరదనియు, టిబెటు దేశము సర్వస్వతంత్రముగ నుండుననియు తీర్మానించిరి. అదియే

1951 చైనా టిబెటు ఒడంబడిక రద్దుపరచబడ్డది

ఇప్పుడు టిబెటు దేశీయులకు స్వతంత్ర ప్రకటనాపత్రమై యున్నది. టిబెటు దేశీయులు తాము సర్వస్వతంత్రుల మనియు, తమపై పరిపాలించుటకు చైనావారికెట్టి హక్కు లేదనియు దృఢముగ భావించుచున్నారు. స్వతంత్రమును పొందుటకొరకే గొప్ప తిరుగుబాట్లను గావించుచు అఖండమైన త్యాగములను చేయుచున్నారు.

డలైలామా తనయొక్క ద్రోహులైన సలహాదారుల వలన బలవంతముగ తన దేశములోనుంచి బైటికి తీసుకొనిపోబడినాడని చైనా ప్రభుత్వము ప్రకటించినందున అది సరియైనది కాదనియు, డలైలామా బుద్ధిపూర్వకముగనే లాసాను విడిచిపెట్టి ఇండియాకు వచ్చెననియు, టిబెటుదేశములో అత్యధిక సంఖ్యాకులైన జనులు ఆయనకు వ్యతిరేకముగ నున్నారని చైనావారు చెప్పుట సాహస కృత్యమనియు, పండిత జవహరులాల్ నెహ్రూగారు లోకసభలో ప్రకటించిరి. అందువలన పికింగులోని చైనా ప్రభుత్వమునకు ఎక్కువ ఆగ్రహము కలిగెను. చైనా ప్రభుత్వముయొక్క పత్రిక యగు నవచైనా వార్తా ప్రచార సంఘము హిందూదేశమునకు టిబెటును లోబరచుకొని తమలో కలుపుకొనవలెనను సామ్రాజ్యతృష్ణ కలదనియు, ఇటువంటి అవమానకరమైన భావమును బ్రిటీషువారినుండి వారసత్వముగ పొందినారనియు వ్రాసెను. దానిని నెహ్రూగారు సరికాదని చెప్పి ఇండియాకు టిబెటుమీద రాజకీయ యాజమాన్యము వహించవలెనని ఎట్టి కోరిక లేదని ఖండితముగ చెప్పిరి. డలైలామా ఇండియాలో

చైనాకు ఇండియామీద ఆగ్రహము

ఖైదీగ నుంచబడెనని చైనావారు చెప్పిన మరియొక మాటను కూడ ఆయన ఏప్రిలు 27వ తేదీన లోకసభలో ఖండించెను. అది అసత్యమైనదని, వెర్రిమాటలని అటువంటివి ఒక గొప్ప దేశమగు చైనాయొక్క ప్రభుత్వము అనదగిన మాటలు కావనియు చెప్పెను.

అటుపిమ్మట 9 రోజులకు తేజ్‌పూరులో డలైలామాయే ఒక పత్రికా ప్రకటన చేయుచు తాను ఇండియాలో ఖైదులో లేననియు, సర్వస్వతంత్రుడుగ నున్నాననియు, తిరుగుబాటు

డలైలామా తేజపూరు స్టేటుమెంటు

దారులు తనను తన దేశమునుండి బైటకు పంపినట్లు చైనావారు చెప్పే నేరారోపణ అసత్యమనియు చెప్పెను. ఆ కాలముననే పికింగులో రెండవచైనా జాతీయప్రజల కాంగ్రెసు జరుగుచుండెను. దానికి పంచనులామా హాజరై బంగారు అంచుగల దుస్తులను ధరించి చౌఎన్‌లై ప్రక్కన కూర్చుండెను. తాను బుద్ధిపూర్వకముగనే టిబెటును వదలి ఇండియాకు వచ్చితిననియు, ఇక్కడ తన కెట్టి నిర్బంధములు లేవనియు, తన ప్రజలు తనపట్ల మిగుల భక్తి విశ్వాసములు కనపరచినందుననే మిక్కిలి కంటకావృత మైన అరణ్యములగుండా తాను, తన పరివారముతో ఇండియాకు రాగలిగినాననియు డలైలామా తన స్టేట్‌మెంటులో చెప్పెను. ఆ సంగతులన్నీ అబద్ధములని పంచనులామా జవాబు చెప్పుచూ డలైలామా చేసిన ప్రకటనలు బుద్ధిపూర్వకముగ చేసినవి కావని, అభివృద్ధి నిరోధకులు బలవంతపెట్టి ఆయనచేత అట్టి ప్రకటనములు చేయించుచున్నారనియు చెప్పెను. తేజ్‌పూరులో 18 ఏప్రిలు

తేదీన డలై లామా చేసిన స్టేట్ మెంటులో ఇంకా కొన్ని ముఖ్య మైన మాటలున్నవి. టిబెట్టు దేశీయులు హాన్ ప్రజలకు అనగ చైనా ప్రజలకు సంబంధములేని వారనియు, టిబెటు ప్రజలకు ఎల్లప్పుడును స్వతంత్రమును అనుభవించవలెనని దృఢమైన కోరిక యున్నదనియు, టిబెటు దేశచరిత్రలో వీలైనపుడెల్ల టిబెటు దేశము పోరాడి తన స్వతంత్రమును నిలబెట్టుకొనిన దనియు 1951 వ సంవత్సరములో చైనా టిబెటుల మధ్య చైనాయొక్క సార్వభౌమత్వము నంగీకరించుచు జరిగిన ఒడంబడిక బుద్ధిపూర్వక ముగ చేయబడినది కాదనియు, భయోత్పాతము వలన జరిగిన దనియు, అది క్రమముగ జరిగినను టిబెటుకు ఉండవలసిన అంతర్ వ్యవహార స్వపరిపాలనను చైనా ప్రభుత్వము వారు గౌరవించక సర్వవిధముల నాశనము చేసినందువల్లను టిబెటుదేశము యొక్క అంతర్ వ్యవహారములలో అనుక్షణము చైనావారు జోక్యము కలుగచేసుకొని పూర్తియైన అధికారములు చెలాయించుచుండుట వలనను ఆ ఒడంబడిక రద్దయినదని ఆయన చెప్పెను. ఒక చిన్న దేశ మైన టిబెటు, సామ్రాజ్యకాంక్షగల ఒక పెద్ద ఇరుగుపొరుగు దేశమైన చైనాతో ఎటుల పోట్లాడవలసి వచ్చినదో ఆయన వివరించెను. 1955 సంవత్సరములోనే ఖమ్ రాష్ట్రములో చైనా ప్రభుత్వముపైన తిరుగుబాటు ప్రారంభమైనదనియు, 1956 వ సంవత్సరమునకు ఇది విశేషముగ వృద్ధిచెందినదనియు, 1956 వ సంవత్సరము ఫిబ్రవరి నెల నాటికి చైనాకు టిబెటుతో గల స్నేహసంబంధము పూర్తిగ చెడిపోయినదనియు, అప్పటినుంచి చైనావారు అనేక దురాక్రమ ణలను, దుష్కృత్యములను చేసిరనియు, అందువల్ల ఇండియాకు

తాను రావలసివచ్చెననియు ఆయన చెప్పెను. ఇండియా ప్రజలు, ఇండియా ప్రభుత్వము తనకు ఇచ్చిన శరణ్యమునకు చూపిన ప్రత్యేకపు స్నేహభావమునకు తానెంతో కృతజ్ఞతతో నున్నా ననియు ఆయన ప్రకటించెను. ఇండియాకును, టిబెటుకును అనాదికాలమునుంచి మత, వైజ్ఞానిక, వర్తక సంబంధములు ఎడతెగకుండ నున్నవనియు, ఇండియాదేశము బుద్ధభగవానుని జన్మదేశమైనందున మిగుల విజ్ఞానవంతమైన దేశమనియు ఆయన వ్రాక్రుచ్చెను. ఇండియావారు టిబెటును తమతో సరిసమానముగ చూడవలెననియు, తమమీద ఆధారపడి తమకు లోబడిన దేశముగ ఎంచవద్దనియు ఆయన ప్రార్థించెను. కాని తమ వ్యవహారము లన్నియు ఐక్యరాజ్యసమితిలో చెప్పుకొనుటకు తాము సిద్ధముగ నున్నామని, 1951 వ సంవత్సరపు ఒడంబడికకు పూర్వము తాము అనుభవించుచున్న సంపూర్ణ స్వాతంత్ర్యమును తాము మరల వాంఛించుచున్నామనియు ఆయన చెప్పెను. రక్తప్రవాహము లేకుండ టిబెటు వ్యవహారములు పరిష్కారమగునని ఆయన ఆశించెను. టిబెటు ప్రజలయొక్క కల్యాణమే, వారి పవిత్రమైన మతమునకు స్వేచ్ఛయే, ఆ దేశముయొక్క స్వతంత్రమే ఆయనకు మిక్కిలి ప్రేమాస్పదమైనదని ఆయన చెప్పెను. దీనిమీద చైనా కమ్యూనిస్టులు ఆగ్రహావేశులైరి. ఆయన చెప్పిన సంగతులన్నిటిని కాదనిరి. డలైలామాను నీచముగ నిందించిరి. టిబెటుకు ఎప్పుడును స్వతంత్రము లేదని, టిబెటుపైన చైనాకు 13 వ శతాబ్దము మొదలుకొని 18 వ శతాబ్దమువరకు పూర్తియైన అధికార మున్న దని వారు చెప్పిరి. టిబెటీయులును, హానులును వేరువేరు

తెగవారు అని వారు ఒప్పుకొన్నారు. తుదకు వారు, మంగోలియనులు, మంచూలుకూడ వేర్వేరు తెగలనియు, కాని వీరందరు స్వతంత్రులుగ నుండక మాతృదేశమైన చైనాక్రిందనే యుండి తీరవలెననియు వారు చెప్పిరి. టిబెటులో గల తిరుగుబాటుదారులంతా అభివృద్ధి నిరోధకులని, సంస్కరణములకు వ్యతిరేకులని స్వలాభపరులని, నిందించిరి. పంచనులామా హిందూదేశము సామ్రాజ్యతత్వముగల దేశమనియు బుద్ధుడియొక్క మతమును వెళ్ళగొట్టిన దేశమే ఇపుడు బౌద్ధమతముమీద ప్రేమను చూపుట కపటనాటకమనియు ఆయన ఇండియాను నిందించెను.

దలైలామాకు తేజ్‌పూరు మొదలుకొని ముస్సోరికి ప్రయాణము చేసినపుడు ప్రతి స్టేషనులోను మిగుల ఉత్సాహవంతులైన వేలకొలది జనము మూగి ఆయనకు గొప్ప సత్కారములను చేసిరి. ఆయన ఏప్రిలు 18 వ తేదీనాడు తేజ్‌పూరులో రైలులో బయలుదేరి వెళ్ళినప్పుడు తేజ్‌పూరు పౌరులు ఆయనకు గొప్ప వీడ్కోలు సభను జరిపి పంపించిరి. ఆయన యొక్క గొప్ప ఆశీర్వచనములను పొందిరి. ఆయన యొక ప్రత్యేక రైలులో బయలుదేరెను. మరుసటి దినము పశ్చిమ బెంగాల్‌లో సిలిగురి స్టేషనులో ఆ రైలు డెబ్బదియైదు నిమిషములు ఆగినపుడు వేలకొలది జనము అక్కడికి వచ్చి ఆయనను దర్శించి కోలాహలముగ ఆయనయందు గౌరవమును చూపిరి. దలైలామాయొక్క అన్నగారి పిల్లలుకూడ వచ్చి ఆయనను దర్శించిరి. సిక్కిమ్ మహారాజ కుమారుడు తన కుటుంబముతోకూడ వచ్చి ఆయనను

దలైలామా ముస్సోరికి ప్రయాణము త్రోవలో అఖండ స్వాగతములు

దర్శించెను. అనేకమంది మతగురువులు ఆయన దర్శనమునకు వచ్చిరి. సంగీతమును పాడిరి. వాయిద్యములను వాయించిరి. 'చైనా సామ్రాజ్యతత్వము కూలిపోవును గాక' అని ఆ వేలాది జనములు నినాదము జరిపిరి. అక్కడినుంచి ఆ రైలు బీహారు రాష్ట్రముగుండా పోయెను. ఆ రాష్ట్రమే బౌద్ధమతమ్ముయొక్క జన్మస్థానము. ఆ రాష్ట్రములోని చోప్రా స్టేషనులో ఆగినప్పుడు అటులనే వేలకొలది జనములువచ్చి ఆయనకు సన్మానము జరిపిరి. తరువాత ఆ రైలు బుద్ధుడు ధర్మచక్రమును ప్రప్రథమమున త్రిప్పిన సారనాథములో ఆగెను. రైలుస్టేషనువద్ద ఒక వేదిక మిగుల శృంగారముగ అమర్చబడెను. సిలోను, బర్మా, థాయ్ లాండ్, కంబోడియా, వియత్నామ్, ఇండియా నుంచి వచ్చిన బౌద్ధభిక్షువులు ఆయన దర్శనమునకు వచ్చిరి. ఆయన తన పరివారముతో 'థామాకు స్థూపము' వద్దకు వెళ్ళెను. అది అశోక చక్రవర్తి నిర్మాణము గావించినది. అక్కడ ఆయన ప్రార్థన చేసెను. అక్కడనున్న బుద్ధునియొక్క బంగారుప్రతిమకు సాష్టాంగ ప్రణామమొనర్చి మరల రైలులోకి వచ్చెను. తరువాత కాశీలో ఆ రైలు ఆగెను. అక్కడ కూడ వేలకొలది జనములు ఆయనను దర్శించిరి. అక్కడ మరియొక రైలులోకి వారు మారి ముస్సోరీకి వెళ్ళిరి. ఆయన ముస్సోరీకి చేరినప్పుడు మోటారుకారులో బిర్లా భవనమునకు వెళ్ళెను. అది లాసాకు పదిహేనువందల మైళ్ళ దూరమున నున్నది. అంతటితో ఆయన ప్రయాణము పూర్తి యయ్యెను. అప్పుడు అక్కడి మునిసిపలు ఛైర్మను సన్మానసభను చేసెను.

లోకసభలో డలై లామా యొక్క స్థితి, ఆయనకు ఇండియాలో హక్కులేమేమి గలవు అని ప్రశ్నించినపుడు డలై లామా హిందూదేశములో తనయొక్క మత కార్యక్రమములను స్వేచ్ఛగ చేసుకొనవచ్చుననియు, రాజకీయ కార్యక్రమములను ఆయన జరపడము సరియైనది కాదనియు ఇండియా ప్రధానమంత్రి పండిత జవహరులాల్ నెహ్రూగారు చెప్పిరి.

పండిత జవహర్‌లాల్ నెహ్రూగారు ముస్సోరీలో కలసి మాట్లాడిరి

స్వతంత్ర సభ్యులైన డాక్టర్ కుంజ్రూగారు ఇంగ్లండులో విదేశీయ రాజకీయవాదికి శరణ్యమిచ్చినపుడు ఆయన తన అభిప్రాయములను స్వతంత్రముగ వ్యాపింప చేయవచ్చును గాని ఆయుధములు ధరించ కూడదనియు, యుద్ధ ప్రయత్నములు ఏమియు చేయకూడదనియు నను సాంప్రదాయము మాత్రము గలదని చెప్పెను. నెహ్రూగారు దానిని కూడ స్పష్టీకరించుట కష్టమనిచెప్పెను. కాని తమ దేశమునకును చైనాకును తగాయిదా వచ్చేకార్యము లేమియు డలై లామా ఇండియాలో చేయకూడదని ఆయన చెప్పెను. ఏప్రిలు 24 వ తేదీన నెహ్రూగారు డలై లామాను ముస్సోరీలో కలిసిరి. ఆయనతో సంతృప్తికరముగ మాట్లాడితినని ఆయన చెప్పెను. తనకు మరియొక కార్యక్రమము ఉన్నందున ఇంకను కొంత కాలము డలై లామాయొద్ద గడపలేకపోతిననియుకూడ చెప్పెను. ఇండియాకు టిబెటుతోగల సంబంధము ముఖ్యముగ రాజకీయమైనది కాదనియు, చారిత్రాత్మిక, ఆధ్యాత్మిక సంబంధమనియు చెప్పెను. టిబెటు వ్యవహారములను శాంతముగ పరిష్కరించు

కొనుటయే తన ఉద్దేశ్యమనియు, ఆవిధముగ పరిష్కరించుకొను టకు సహాయపడుదుననియు అందుకుగాను పంచనులావాగాని అటువంటి అధికారముగల వారెవరైనను ఇండియాకు వచ్చిన తనకు చాల సంతోషముగ నుండుననియు చెప్పెను. వారెవరైన వచ్చి డలైలామాను కలుసుకొనవచ్చుననికూడ చెప్పెను. త్వర లోనే టిబెటులో శాంతియుత పరిస్థితులేర్పడునని తాను ఆశించు చున్నానని, అప్పుడు డలైలామా మరల టిబెటుకు తిరిగి వెళ్లు టకు అవకాశము ఉండునని తాను భావించుచున్నానని ఆయన చెప్పెను. మేము డలైలామాయొక్క వాక్స్వాతంత్ర్యమునకు నిర్బంధములు విధించ దలచుకొనలేదు, కాని ఆయనయే మాకు ఇబ్బందులు లేకుండ సంచరించుచుండవలెను అని చెప్పెను.

జూన్ 20 వ తేదీన ముస్సోరీలోనే డలైలామా పత్రికా ప్రతినిధులను కలిసెను. అప్పుడు రెండువేల మాటలుగల ఒక స్టేట్‌మెంటును ఇచ్చెను. "ఏమైననుసరే 1951 వ సంవత్సరమునకు పూర్వమున్న స్వతంత్ర హోదాయే టిబెట్టుకు కావలెను. అటులు స్వతంత్రము అంగీకరించనిది చైనావారితో ఎపుడు ఎట్టి రాయబారములు జరుపుటకు తాను సిద్ధముగ లేను. శాంతి కావలె, కాని మా దేశముయొక్క, మా ప్రజలయొక్క స్వతంత్రమునకు అది అనుగుణ్యామైనదిగ నుండవలెను. 1951 వ సంవత్సరములో జరిగిన చైనా టిబెటు ఒడంబడిక బలవంతముమీద జరిగినటువంటిది. తాను దానిమీద తనముద్రను వేయలేదు. అటువంటి ముద్రను చైనా ప్రభుత్వమువారు ఫోర్జరీ చేసినారు. తాను ఎక్కడఉన్నా

డలైలామా
ముస్సోరీ ప్రకటన

టిబెటుప్రజలు తననే వారికి పాలకుడుగ ఎంచుకొనెదరు. తాను సంస్కరణములను తన దేశములో ప్రవేశపెట్ట ప్రయత్నించి నప్పుడు చైనావారే అడ్డుతగిలినారు. పిమ్మట ఒక భయానక పాలనమును చైనావారు టిబెటులో ప్రవేశపెట్టినారు. బలవంత ముగ కూలిపని చేయించినారు. ప్రజల దగ్గరనుంచి బలవంతముగ ధనమును, ధాన్యమును వసూలుచేసినారు. ప్రజలపై దారుణ శిక్షలు విధించినారు. ప్రజలను దోచుకున్నారు. ఆస్తులను లాగు కొన్నారు. వేలమంది టిబెటు దేశీయులను ఖైదులో పెట్టి నారు. వందలకొలది టిబెటనులను శిరచ్ఛేదములను గావించినారు. ఈ విషయములన్నిటిని ఒక అంతర్జాతీయ కమిషనును నియ మించినచో వారిఎదుట ఋజువుచేయుటకు సిద్ధముగ నున్నాము. వారు ఇచ్చెడి తీర్పుకు తాము బద్ధులమై నడచెదము. 1956 వ సంవత్సరమునుంచి చైనావారితో పోట్లాడి సుమారు 65 వేల మంది టిబెటనులు తమ అసువులను కోల్పోయి వీరస్వర్గము నలంకరించిరి. అంతర్జాతీయ న్యాయవాదుల సంఘము వారిఎదుట తాను ఈ విషయమునే తెలుపుచు ఒక రిపోర్టు పంపెదను. టిబెటు లోని చైనా కమ్యూనిస్టు ప్రభుత్వమువారు బౌద్ధమతమును, టిబెటుయొక్క విజ్ఞానమును నాశనము గావించి టిబెటుప్రజలను కమ్యూనిస్టులుగ కావించుటకు ప్రయత్నము చేయుచున్నారు." అని ఆయన చెప్పెను. టిబెటులో స్వతంత్రముకొరకు పోరాడు చున్న దేశాభిమానులకు సహాయము చేయుటకూడ అవసరమే నని ఆయన చెప్పెను. కాని తానుమాత్రము సైనికబలమువల్ల గాక శాంతియుతముగ టిబెటు వ్యవహారమును పరిష్కరించుటకు

సిద్ధముగ నున్నానని వ్రాక్రుచ్చెను. శాంతిని కోరునట్టి, స్వతంత్ర ముగ నున్నట్టి అన్ని నాగరిక దేశములకు తాను విన్నపము పంపుచున్నానని చెప్పెను.

ఆయన ఇంకను ఇండియాలో నున్నాడు. టిబెటు కన్వెన్షను అను నొకదానిని జయప్రకాష్ నారాయణగారి అధ్యక్షతక్రింద ఇండియాలో జరిపినారు. చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము టిబెటుపై జరిపిన దురాక్రమణలను, దుష్కృత్య ములను, క్రూరహింసలను ఖండించినారు. అంతేకాక అంతర్జాతీయ న్యాయవాదుల సంఘమువారుకూడ విచారణచేసి టిబెటును గూర్చి యొక ప్రథమ నివేదికను ప్రకటించినారు. అందులో చైనా వారుటిబెటుపై జరిపిన దురాక్రమణ, టిబెటుప్రజల స్వతంత్రమును అణచుట, ప్రాథమికమానవహక్కులకు భంగకరమని వ్రాసినారు. ఆ సంఘములో వివిధ దేశములనుండియు 22 మంది ప్రతినిధులు గలరు. కెనడాదేశపు సుప్రసిద్ధ న్యాయవాదియైన జోసెఫ్ టి. థార్సనుగారు దానికి అధ్యక్షులు. టిబెటుయొక్క చరిత్రను వారు వివరించుచు "1912 నుండి 1950 వరకు టిబెటు దేశము సర్వస్వతంత్రముగ నుండెను. అచట ఆకాలములో చైనాయొక్క ప్రతినిధిగాని, చైనాయొక్క చట్టముగాని, చైనా న్యాయాధిపతి గాని, చైనా పోలీసులుగాని, చైనా సైనికుడుగాని, . చైనా పత్రికగాని లేకుండెను" అని వ్రాసినారు. "అయినను 1950 సంవత్సరము అక్టోబరునెల 7 వ తేదీన చైనావారు టిబెటుపైన దండయాత్ర జరిపిరి. అక్టోబరు 19 వ తేదీన తూర్పు టిబెటులోని చాండోను ఆక్రమించిరి. 24 వ తేది అక్టోబరున పికింగు ప్రభుత్వము

మూడుకోట్ల టిబెటు ప్రజలను సామ్రాజ్యవాదులనుండి విముక్తిని పొందించుటకుగాను, చైనా సైన్యములకు టిబెటుకుపోయి యావత్తు టిబెటును స్వాధీనపర్చుకోవలెనని ఉత్తరువు లిచ్చినామని ప్రకటించినది. 1956 వ సంవత్సరములో టిబెటును తమ రాష్ట్రములలోనొకటిగ భావించమనియు, స్వపరిపాలనగల ప్రాంతముగ చూచెదమనియు టిబెటులో నిర్బంధముగ కమ్యూనిజమును ప్రవేశపెట్టుదుమని యెవరైన తలచినయెడల అది చాల పొరబాటనియు, సంస్కరణములుకూడ నెమ్మదిగా ప్రవేశపెట్ట దలచినామనియు నెహ్రూగారితో చౌ ఎన్ లై ఇండియాలో చెప్పెను. అపుడు డలైలామాకూడ ఇండియాలోనే యుండెను. ఈ సంగతి నెహ్రూగారు డలైలామాకు తెలియపర్చిరి. 1957 లో మావోసిటంగు టిబెటులో 1962 వరకు సంస్కరణములను ప్రవేశ పెట్టదలచుకొనలేదని చెప్పినాడు. ఆ పిమ్మటకూడ టిబెటు ప్రజల యొప్పుదలమీదనే ప్రవేశపెట్టబడునని చెప్పినాడు. ఈ వాగ్దత్తములకు వ్యతిరేకముగా 1. కమ్యూనిస్టులు టిబెటులో జొరబడి ఆ ప్రజల జీవితవిధానాలను నాశనముగావించ యత్నించిరి. 2. రెండు లక్షలమంది టిబెటు ప్రజలచేత బలవంతముగా రోడ్డుపనులు చేయించిరి. వారిలో నాలుగవవంతు చలివల్ల తిండి సరిగలేక మరణించిరి. 3. 1952 నుండి చైనా దేశీయులు ఏబదిలక్షలమంది టిబెటు వచ్చి కాపురముండిరి. 4. టిబెటులోని మఠముల, వ్యక్తుల, టిబెటు ప్రభుత్వముయొక్క ఆస్తులను బలవంతముగ లాగుకొనిరి. మఠములమీద మోయలేని పన్నులను విధించిరి. 5. టిబెటు ప్రజల నుండి వర్తకమును లాగుకొనిరి. 6. బౌద్ధమతముమీద దండ

యాత్ర సలిపిరి. మఠాధిపతులను జైళ్లలో పడవేసిరి. హత్యగావించిరి. ఒక కేసులో ఒకగొప్ప మఠాధిపతిని తాడుకట్టి మేడమీదనుంచి బలవంతముగా జరజరలాగి క్రింద పడవేసి చంపిరి. 7. ఖాంరాష్ట్రములోనే 250 మఠములను నాశనము గావించిరి. మఠాధిపతులకు త్రాడులుకట్టి గుర్రములచేత ఈడ్పించిరి. చాల మందిని హత్యగావించిరి. నిర్బంధచాకిరి చేయించు కేంద్రమునకు పంపిరి. 8. టిబెటువారిలో 65 వేలమందిని చంపిరి. ఇరవై వేల మందిని ఎవరికిని తెలియకుండ ఎక్కడికో పంపివేసిరి. 9. టిబెటులో మతస్వేచ్ఛను అణచివేసిరి." అనికూడ వారు వ్రాసినారు.

దలైలామా ఇండియాలో నివాసమేర్పరచుకొనినపిమ్మట షుమారు పదమూడువేలమంది టిబెటుదేశీయులు ఇండియాకు పారిపోయివచ్చి శరణుజొచ్చిరి. వారికందరికి ఇండియాప్రభుత్వము, ఇండియా ప్రజలు శరణ్యమిచ్చి వారి సుఖనివాసమునకు అవసరమైన ఏర్పాట్లన్నియు చేసిరి. ఇందుకు చైనా ప్రభుత్వమునకు ఇండియాప్రభుత్వముమీద, పండితజవహరులాల్ నెహ్రూగారిమీద మితిలేని ఆగ్రహము కలిగెను. జవహరులాల్ నెహ్రూ అమెరికా సామ్రాజ్యవాదులవెంట తిరుగుచున్నాడని నిందించిరి. ఇటీవల కొలదినెలల క్రిందట టిఁయోంహౌచి ఇండియాను, మరిప్రక్కనున్న ఆశియాదేశములను లోబరచుకొని కమ్యూనిస్టు దేశములుగ చేయుటకు నిశ్చయించుకున్నామని ప్రకటనమును గావించెను. ఇండియాలో ప్రజాసోషలిస్టులే గాక కాంగ్రెసువాదులుకూడ చైనాకు వ్యతిరేకముగ దుష్ప్రచారము గావించుచున్నారని చైనాప్రభుత్వము ఇండియా ప్రభుత్వముకు ఫిర్యాదుగావించినది.

ఇండియాలో వాక్స్వతంత్రము పూర్తిగా యున్నందున తమను విమర్శించినను తా మెట్టిచర్య తీసుకొన వీలులేదని ఇండియా ప్రభుత్వము బదులుచెప్పి, చైనావారు ఇండియాపై ద్వేషమును పురిగొల్పుట అక్రమమని ఎదురు ఫిర్యాదుగావించినది.

కమ్యూనిజము ప్రతి రంగములోను టిబెటులో వ్యాపింప చేయబడుచున్నది. టిబెటులో అనేక మఠములున్నవి. ఆ మఠము లలో రెండుమూడు లక్షల లామాలు గలరు. వారు వర్తకము చేసుకొనెదరు గాని పొలములు దున్నరు. తమ పొలములను వ్యవ సాయకులచేత వ్యవసాయము చేయించి ఆదాను సంపాదించెదరు. చైనా కమ్యూనిస్టులు ప్రవేశపెట్టిన సంస్కరణములలో అందరి చేతను భూములు దున్నించసాగిరి. లామాలందరిచేత మట్టి తట్టలు మోయించి పొలములలో వ్యవసాయపు పనులను చేయించిరి. ఇటీవలనే లాసానగరములో నొక కమ్యూనును స్థాపించినారు.

మరల 1960 వ సంవత్సరము మే నెలలో దేశవ్యాప్త మైన అతి గొప్ప తిరుగుబాటు టిబెటులో వ్యాపించెను. ఇది ముందుగ పశ్చిమ టిబెటులో ప్రారంభింపబడెను. పంచను లామాకు అనుకూలముగనున్న లామాలందరు ఈతిరుగుబాటులో చేరిరి. చైనా కమ్యూనిస్టు ప్రభుత్వమునకు పంచనులామా ప్రథమ శత్రువని అనుమానించ బడుచున్నాడు. చైనా ప్రభుత్వము సేనలను తీసుకొనివచ్చి టిబెట్టు ఉత్తర సరిహద్దున ఉంచినారు. అవి వెళ్లి తిరుగుబాటు జరిగిన ప్రాంతములో తిరుగుబాటులను అణచవలసి వచ్చినది. చైనావారు టిబెటు దేశీయులను కొన్ని వేలమందిని తమ

**టిబెటులో జాతీయ స్వతంత్ర పోరాటము**

క్రింద సైనికులుగ చేర్చుకొన్నారు. వారందరును తిరుగుబాటు ప్రజ్వరిల్లగనే తమ దేశీయులతోచేరి చైనావారిని ప్రతిఘటించ సాగినారు. టిబెటుదేశములో వేలకొద్ది గొరిల్లాలు తయారు చేయబడినారు. వారందరు చైనాసేనలను బయప్రదముగ ప్రతిఘ టించు చున్నారు. చైనాలోని తక్కిన భాగములన్నిటిలో ఈ తిరుగుబాటు వ్యాపించినది. చైనాకమ్యూనిస్టు సేనలు అతి క్రూరమైన విధానములను అవలంబించుచున్నప్పటికి ప్రాణము లొడ్డి టిబెటీయులు స్వతంత్రము కొరకు పోరాడుచున్నారు. టిబెటులో జాతీయ భావము, స్వతంత్రేచ్ఛ వ్యాపించినది. చైనా కమ్యూనిస్టు ప్రభుత్వమును వెళ్ళగొట్టి జాతీయ ప్రభుత్వమును స్థాపించవలెనను సంకల్పము దృఢముగ కలిగినది.

అనాదినుంచి టిబెటుకును, ఇండియాకును హిమాలయ పర్వతములలోని కనుమలద్వారా వర్తక వ్యాపారములు సాగు చున్నవి. లడకులామాలు కాశ్మీరు ముస్లిములు టిబెటులో నివాస మేర్పరచుకొని వర్తకము విరివిగా చేసుకొనుచుండిరి. వీరందరు ఇండియా పౌరులే. 1954 వ సంవత్సరములో చైనా కమ్యూనిస్టు ప్రభుత్వమునకును ఇండియా ప్రభుత్వమునకును టిబెటును గూర్చిన వర్తక యొడంబడిక జరిగి నది. గాని 1959 సంవత్సరములో డలైలామా ఇండియాకు చేరినదాదిగ టిబెటులోని ఇండియాపౌరులగు వర్త కులమీద అనేక నిర్బంధములు నిగహోలు విధించినారు. రాక పోకలు చాల కష్టతరముగ గావించినారు. చైనా ఇండియా నాణెములు మాన్పి చైనా కరెన్సి కాగితము ఇండియా వర్తకు

ఇండియా వర్తకులకు ఇబ్బందులు

లకు సరుకుల కిమ్మతుగ ఇచ్చెదమన్నారు. ఇండియాప్రభుత్వ వర్తక ఆఫీసు గియాంటుసీలో నున్నదానిని వరదలవల్ల పడిపోగా బాగుచేసుకొననిచ్చుటలేదు. 1958 సంవత్సరము ఆగస్టునెలలో ఇండియా వర్తకులకు, ప్రయాణీకులకు. యాత్రికులకు టిబెటులో కలుగచేయబడుచున్న ఇబ్బందులను గూర్చి ఇండియాప్రభుత్వము చైనాకు తెలిపినది. పిమ్మటకూడ ఉత్తర ప్రత్యుత్తరములు జరిగినవి. వర్తకము దాదాపుగా మృగ్యమైనది. ఇబ్బందులు ఎక్కువగుచున్నవి. చైనావారికి వ్రాసినందున ప్రయోజనము గలుగలేదు.



# చైనా విప్లవము

## ఏకోనవింశాధ్యాయము

### ఇండియా భూభాగముపై చైనా దురాక్రమణ

### 1

1950 వ సంవత్సరములో చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము టిబెటు దేశముపైకి సైన్యమును పంపి స్వాధీనపరచుకొని చైనా ప్రజల రిపబ్లికులో నొక భాగముగ గావించిన తదాది ఇండియా టిబెటుల మధ్యగల సరిహద్దు ఇండియా చైనాలమధ్య గల సరిహద్దుగ భావింపబడవలసి వచ్చినది. ఇండియా టిబెటు సరిహద్దు సమస్యయే ఇండియా చైనా సరిహద్దు సమస్య. సిక్కిమ్, భూటాన్ - టిబెటు మధ్య సరిహద్దుగాక, ఇండియా చైనా సరిహద్దు సుమారు 2,200 ల మైళ్ళ పొడుగున నున్నది. ఈ యావత్తు పొడుగుననున్న సరిహద్దు ఇదివరకే వాడుకవల్లను, అనాది భుక్తమువల్లను, సంధి పత్రములవల్లను పూర్తిగ నిర్దుష్టముగ నిర్ణయించబడి ఆ ప్రకారము మ్యాపులు కూడ తయారుచేయబడి యున్నవి. ఈ సరిహద్దు చెల్లదని, మారవలెనని ఇదివరకు యే టిబెటు ప్రభుత్వము కాని చైనాప్రభుత్వము కాని ఆక్షేపించి యుండలేదు. 1951 వ సంవత్సరము నుండి నూతన చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము ఈ అనాదిసిద్ధమైన నిర్దిష్టముగ నిర్ణయింపబడిన సరిహద్దుకు దక్షిణముగ ఇండియాలోని భూభాగములను చైనాకు అనగ టిబెటుకు చెంది

ఇండియా టిబెటు సరిహద్దు

నట్లు అనిర్దిష్టముగ చూపుచు నూతన పటములను తయారుచేసి యున్నది. ఇదియే ఇండియా చైనా సరిహద్దు తగాదాకు ప్రారంభము. ఈ సరిహద్దులో అత్యంత భాగము హిమాలయ పర్వతముల మీదుగ పోవుచు హిమాలయ పర్వతములకు ఉత్తరమున నున్న టిబెటుకును, దక్షిణముననున్న ఇండియాకును స్వభావ సిద్ధమైన సరిహద్దని నిరూపణ చేయబడినది. కొన్నిచోట్ల మాత్రము ఈ సరిహద్దు హిమాలయపర్వతములను దాటి కొంచెము ఉత్తర ముగ పోయి, అచట సట్లెజ్, గంగానదులు పుట్టినచోట్లు సరి హద్దుగ నిర్ణయించబడి యున్నది.

ఈ సరిహద్దు పశ్చిమమున కొంచెము దూరము జమ్ము కాశ్మీరు రాష్ట్రమునకును చైనాలో భాగమైన సింకియాంగు కును మధ్యనున్నది. అక్కడనుంచి జమ్ము కాశ్మీరు రాష్ట్రము లోని లడకు ప్రాంతమునకును టిబెటు దేశమునకును మధ్యగ సుమారు 11 వందలమైళ్లపొడవున తూర్పుగ సాగినది. లడకు, టిబెటు దేశముల మధ్యనున్న సరిహద్దు అనాదిసిద్ధమైనదని వివరింపబడి 1842 వ సంవత్సరములో చైనా చక్రవర్తి, టిబెటు రాజగు దలైలామా, కాశ్మీరు రాజుయొక్క ప్రతినిధులు త్రైపాక్షిక సమావేశమును జరిపి ఖాయపరచియున్నారు. 1847 వ సంవత్సరములో చైనా ప్రభుత్వము అనాదిసిద్ధమైన వాడుకలో నున్న సరిహద్దని దీని నంగీకరించి మరల ఎప్పుడు దీనిని గూర్చి ఎట్టి యోచన జరగనక్కరలేదని అప్పటికి కాశ్మీరును పాలించు చున్న బ్రిటిషు ఇండియా ప్రభుత్వమునకు తెలియపరచినది. ఈ సరిహద్దు ఇండియా ఉద్యోగస్థులచేత సర్వేచేయబడినది. మ్యాపులు

తయారుచేయబడినవి. ఆ మ్యాపులన్నిటిలో ఈ సరిహద్దే సుస్పష్ట ముగ చూపబడినది. 1893 వ సంవత్సరములో చైనా ప్రభుత్వపు మ్యాపుకూడ ఇండియా ప్రభుత్వ మ్యాపులో నున్న సరిహద్దునే చూపినది. అందువలన లడకు టిబెటుల మధ్యనున్న సరిహద్దును గూర్చి చైనా ప్రభుత్వమువారు తగాదా పెట్టుటకేవలము అక్రమ మైన దురాశ యని చెప్పక తప్పదు.

దీనికి తూర్పుగ సాగిన సరిహద్దు పంజాబు, హిమాచల ప్రదేశ్, ఉత్తరప్రదేశ్ రాష్ట్రముల మధ్యను టిబెటు మధ్యను పర్పడి అనాదినుంచి అసలులో నున్న ఎట్టి సందేహము ఎవరి వల్లను తెలుపబడని సరిహద్దయి యున్నది. ఉత్తర ప్రదేశ్‌కును టిబెటుకును మధ్యనున్న సరిహద్దు హిమాలయ పర్వతములను దాటి ఉత్తరమున సట్లెజ్, గంగానదులు పుట్టినచోటున పర్పడినది.

పంజాబు హిమాచల ప్రదేశ్ ఉత్తరప్రదేశ్‌ల సరిహద్దు

ఉత్తరప్రదేశములో చెందిన గార్వాలు జిల్లాయొక్క రివెన్యూ పుస్తకములలో 1850 వ సంవత్సరములో నీ సరిహద్దు స్పష్టముగ కనపరచబడినది. 1958 వ సంవత్సరమువరకు కూడ చైనా మ్యాపులలో ఈ నదులుపుట్టు ప్రాంతమే సరిహద్దని చూపబడినది. ఇప్పుడు చైనావారు తమవని తగాదా పెట్టుచున్న నీలాంగు, జాధంగు ప్రాంతము, బారాహోటి, లాప్‌తాలు మరియు సంగుచామలా ఇవన్నియు ఈ సరిహద్దుకు దక్షిణమున ఇండియా భూభాగము లోనే ఉన్నవి. నీలాంగు జాధంగు 7 వందల చదరపుమైళ్లు గల ప్రాంతము. అది హిమాలయపర్వతమునకు ఉత్తరముగ ఇండియా టిబెటులకు మధ్యనున్న సరిహద్దుకు దక్షిణముగ నున్నది.

ఈ సరిహద్దుకు తూర్పుగ నేపాలుకును, టిబెటుకును మధ్యనున్న సరిహద్దు కలదు. హిమాలయ పర్వతములు, వాటి యున్నత శిఖరమైన ఎవరెస్టుశిఖరము నేపాలులోనే యున్నటుల చెప్పబడుచున్నది. గాని ఎవరెస్టుశిఖరముమీద చైనాదేశీయులు ఎక్కి చైనాపతాకమును, మూవోసిటంగు విగ్రహమును స్థాపించినారు. అంతేగాక ఇపుడు చైనాసైన్యములు నేపాలులో అనుమతి లేకుండ ప్రవేశించినవి. దీనికి తూర్పుగ వ్యాపించిన సిక్కిమ్ కును, టిబెటుకును మధ్యనున్న సరిహద్దు 1890 వ సంవత్సరములో సిక్కిమ్, పికింగు ప్రభుత్వముల మధ్య జరిగిన ఒడంబడిక వల్ల ఖాయపడినది. 1895 వ సంవత్సరములో ఈ సరిహద్దు భూమి మీద స్పష్టముగ నేర్పరచబడి మ్యాపులలో చూపబడినది. దీనిని గురించి ఎట్టి తగాదా ఉండుటకు కారణములేదు. దీనికి తూర్పున నున్న భూటాన్, టిబెటుల మధ్య సరిహద్దు అంత విస్పష్టముగ నిర్ణయింపబడలేదనుమాట వాస్తవమే. చైనావారి మ్యాపులు భూటాన్‌లోని కొన్ని భాగములను తమకు చెందినటుల చూపుచున్నవి. ఈ విషయములో ఉభయపార్టీలు సమావేశమై పరిష్కరించుకొందుమని భూటాన్ యొక్క విదేశ వ్యవహారములమీద యాజమాన్యము గల ఇండియాప్రభుత్వము చైనాప్రభుత్వమునకు వ్రాసియున్నది.

భూటానుకు తూర్పున ఇండియా, టిబెటుల మధ్యనున్న సరిహద్దు షుమారు వెయ్యిమైళ్లు పొడుగుగలిగి తూర్పున బర్మా, టిబెట్‌ల మధ్యనున్న సరిహద్దుతో కలిసినది. బర్మా, టిబెటులకు మధ్యనున్న సరిహద్దు 120 మైళ్ళ పొడుగు గలది. భూటాను

నుంచి తూర్పుగ ఇండియా టిబెటుల మధ్యను, అటుపిమ్మట బర్మా, టిబెటుల మధ్యను, ఏర్పడిన సరిహద్దుకూడ అనాదిసిద్ధమై అమలులో నున్నదే. దీనియొక్క ప్రత్యేకలక్షణ మేమనగ ఈ సరిహద్దు కేవలము హిమాలయ పర్వతముల నెత్తిమీదుగ పోవుచున్నది. హిమాలయపర్వతశ్రేణులే ఇండియాకును, టిబెటుకును స్వభావసిద్ధమైన సరిహద్దై యున్నవి. ఆ శ్రేణులకు దక్షిణపు వైపున ఇండియాదేశము, ఉత్తరపువైపున టిబెటుదేశము ఏర్పడియున్నవి. ఇటుల నేర్పడిన సరిహద్దుకు దక్షిణమున నున్న ఇండియా భూభాగమునకు నేఫా యని పేరు. అనగ (North East Frontier Agency) ఈశాన్య సరిహద్దు ఏజెన్సీ అని పేరు. ఇది అస్సాము రాష్ట్రమునకు ఉత్తరముననే ఆనుకొని యున్నది. ఈ నేఫాప్రాంతముపైన నిర్వివాదమైన, నిర్దిష్టమైన అధికారమును ఇండియాప్రభుత్వము ఎల్లపుడును చెలాయించుచున్నది.

**మెక్ మోహన్ లైను**

ఇండియాప్రభుత్వముక్రింద నొక ప్రత్యేక ఏజెన్సీ అధికారిచే ఈ నేఫాప్రాంతము పాలింపబడుచున్నది. స్వభావసిద్ధమైన, అనాదిగ అమలులోనున్న ఈ సరిహద్దు 1913 వ సంవత్సరము అక్టోబరు మొదలుకొని 1914 వ సంవత్సరము జులై వరకు ఇండియా, టిబెటు, చైనా ప్రభుత్వముల ప్రతినిధుల మధ్య సిమ్లాలో జరిగిన త్రైపాక్షిక సమావేశములో ఖాయపరచబడినది. ఇండియా ప్రభుత్వపక్షమున మెక్ మోహన్ అను ఉద్యోగి ఆ సమావేశములో పాల్గొనినందున ఈ సరిహద్దునకు అనగ ఇండియా టిబెటులకును, బర్మా టిబెటులకును మధ్యనున్న ఈ సరిహద్దునకు మెక్ మోహన్ లైను అను నామకర

ణము వచ్చినది. ఆ కాలములో బర్మాదేశము ఇండియాలో భాగముగ నున్నది. యావత్తు మెక్‌మోహన్ గీతను గూర్చి ఇండియాప్రభుత్వమే టిబెటు, చైనా ప్రభుత్వములతో సంధి గావించుకొన్నది. ఈ సిమ్లా ఒడంబడిక మీదను, దానితో జతపరచిన మెక్‌మోహన్ లైనుయొక్క మ్యాపుమీదను ఇండియా, టిబెటు ప్రతినిధులు దస్కతులు చేసిరి. చైనా ప్రభుత్వప్రతినిధి కూడ (ఇనిషల్) చిన్న దస్కతు పెట్టెను. ఆ కాలములో చైనాకు టిబెటుమీద సార్వభౌమాధికారము లేకుండెను. ఇండియా, టిబెటు, చైనాల ప్రభుత్వములు సమాన హోదాలోనే ఆ సమావేశమునకు తమ ప్రతినిధులను పంపెను. దానినిగూర్చి చైనాప్రభుత్వము ఎప్పుడును ఆక్షేపించి యుండలేదు. టిబెటు ప్రభుత్వపక్షమున హాజరైన లోన్‌చెన్ షాత్ర ఆ మ్యాపుమీద ప్రచురింపబడిన ఆ సరిహద్దును అంగీకరించవలసినదని, ఖాయపరచవలసినదని తనకు లాసానుండి దలైలామా ప్రభుత్వము ఉత్తరు విచ్చినదని ఉత్తర ప్రత్యుత్తరములలో వ్రాసెను. అప్పుడు చైనాకును, టిబెటుకును మధ్యనున్న సరిహద్దునుగూర్చి రాజీనామా కుదరలేదు. అంతేకాని టిబెటుకును, ఇండియాకును మధ్యనున్న సరిహద్దును గూర్చి రాజీనామా కుదిరినది, అభిప్రాయభేదము లేమియు లేవు.

ఈ మెక్‌మోహన్ లైనుకు దక్షిణముగ నున్న నేఫా ఏజన్సీప్రాంతములోని మోంబా, ఆకా, డాఫ్లా, మిరీ, అబోర్, మిష్మీ జాతుల ప్రజలందరు టిబెటు ప్రజలతో ఎట్టి సంబంధము గలవారు కారు. వారు దక్షిణమున నున్న అస్సాము తెగలతోనే సంబంధము గలవారు. టిబెటు

నేఫా ఏజెన్సీ

ప్రజలు ఎప్పుడును వీరిని తమవారుగ ఎంచుకొనలేదు. తమకు దక్షిణముగ నున్న అనాగరికజాతు లనియే పిలుచుచు వచ్చినారు. ఆ మెక్ మోహన్ గీతకు దక్షిణమున నున్న ప్రాంతము ఎల్లప్పుడును ఇండియాప్రభుత్వపు క్రిందనే నుండెను.

## 2

ఇట్టి పరిస్థితులలో మెక్ మోహన్ లైనుకు దక్షిణమున నున్న నేఫా ప్రాంతములో సుమారు 36 వేల చదరపుమైళ్ల విస్తీర్ణము కల భూభాగమును మరియు లడకు ప్రాంతములో సుమారు 15 వేల చదరపుమైళ్ల విస్తీర్ణము గల భూభాగమును మొత్తము 51 వేల చదరపు మైళ్ల విస్తీర్ణము గల భూభాగము తమకు చెందినట్లు 1951 సంవత్సరమునుండి చైనా ప్రభుత్వ పక్షపు పటములలో చూపబడుచు వచ్చినది. ఆ పటములు కూడ దక్షిణ సరిహద్దును స్పష్టముగ చూపుటలేదు. 1954 వ సంవత్సరము అక్టోబరు నెలలో ఇండియా ప్రధానమంత్రి జవహర్ లాల్ నెహ్రూగారు చైనాను దర్శించినప్పుడు ఈ మ్యాపులను గురించి ప్రస్తావన తెచ్చి చైనా మ్యాపులలో ఇండియాయొక్క భూభాగమును చైనాకు చెందినట్లు చూపుటవలన కొన్ని విషమపరిస్థితు లేర్పడగలవని, అట్టి మ్యాపులను మార్చవలెనని చైనా ప్రధానమంత్రి యగు చౌ ఎన్ లై దృష్టికి తీసుకొనిరాగా, ఆయన ఆ మ్యాపులు పూర్వకాలమున క్యూమింటాంగు ప్రభుత్వముచే వేయబడినవనియు, ఆ మ్యాపు

హిమాలయపర్వతములకు దక్షిణముగా ఇండియాలోని 51 వేల చదరపు మైళ్ల విస్తీర్ణమును కాజేయవలెనని కమ్యూనిస్టు చైనా దురాశ

లకు సంబంధించిన సరిహద్దుననున్న దేశములతో సంప్రతింపులు జరిపి సరియైన విధముగ వాటిని మార్చుటకు యోచించు చున్నామనియు, అందుకు తగిన వ్యవధి తమ ప్రభుత్వమునకు చిక్కలేదనియు జవాబు చెప్పినాడు. అటుల మ్యాపులలో చూపుటయే కాక 1955 వ సంవత్సరమునుంచి చైనా ప్రభుత్వ సైనికులు సరిహద్దు లతిక్రమించి ఇండియాలో జొరబడి కొన్ని ప్రాంతములను ఆక్రమించుచుండగ ఇండియా ప్రభుత్వము అందుకు ఆక్షేపణ తెలుపగ, చైనావారు ఆ ప్రాంతములన్నియు తమవేనని, తమక్రిందనే ఎప్పుడునూ ఉన్నవని జవాబు చెప్పుటయే గాక ఆ ప్రాంతములలో నున్న ఇండియా యొక్క పోలీసులను, సైనికులను తరుమగొట్టుట, ఎదురు తిరిగిన వారిమీద తుపాకులు కాల్చుట, కొందరిని హత్యగావించుట, మరికొందరిని ఖైదీలుగ పట్టుకొని పోవుట మొదలైన ఘోరమైన దుష్కృత్యములను చేయుచు వచ్చినారు. ఇటుల దుష్కృత్యములను జరిపి సుమారు 12 వేల చదరపు మైళ్ల ఇండియా యొక్క భూభాగమును చైనావారు దురాక్రమణ చేసియున్నారు. ఇది ఘోరమైన దురాక్రమణ అని చెప్పవలసి యున్నది. ఈ దురాక్రమణ జరిపిన ప్రాంతము లన్నియు పైన చెప్పబడిన విధముగ ఒక శతాబ్దము పైనుండియు, కొన్ని ఆఖరుకు 50, 60 సంవత్సరములనుండి యైనను, నిర్వివాదముగ సర్వే చేయబడి ఇండియా యొక్క పటములలో చూపబడుచు ఇండియా యొక్క స్వాధీనములో నున్నటుల అందరిచేత అంగీకరింపబడినవి. అటువంటి వాటికి చైనా కమ్యూనిస్టు ప్రభుత్వము తమకేమైన హక్కు కలదని

శోచినచో అందు విషయమై ఇండియా ప్రభుత్వమునకు వ్రాసి తమకెటువంటి హక్కుకలదో నిరూపించి న్యాయమైన విధమున, శాంతియుతమైన పద్ధతుల ప్రకారము తమకు హక్కు కలదని స్పష్టపడిన ప్రాంతములను స్వాధీనము పొందవలసి యున్నది కాని సమంతట తామే దౌర్జన్యముగ జబర్దస్తీగా వాటిలో ప్రవేశించి స్వాధీనపరచుకొనుటకన్న మానవ చరిత్రలో దురాక్రమణ మరియొకటి యుండనేరదు. ఇండియా ప్రభుత్వము అతి శాంతమును వహించి ఎప్పటికప్పుడు చైనా ప్రభుత్వమునకు తమ అసమ్మతిని తెలిపి పోరాటములలోకి దిగకుండ న్యాయముగ పరిష్కరించుకొన యత్నించుచున్నది. 1954 వ సంవత్సరములో ప్రప్రథమమున చైనా ప్రభుత్వ ప్రధానమంత్రి యగు చౌ ఎన్ లై ఇండియా ప్రభుత్వ ప్రధానమంత్రి యగు పండిత జవహరులాల్ నెహ్రూగారితో కలిసి పంచశీల సూత్రములను అంగీకరించుచు సంయుక్త ప్రకటన గావించినందునను, ఇదివరకు శతాబ్దముల నుండి ఎట్టి ఘర్షణ, తగాదా, యుద్ధములేకుండ ఇండియా చైనా దేశములు మైత్రితో మెలగి యున్నందునను జవహరులాల్ ప్రభుత్వము ఈ విషయమును రాజీగ పరిష్కరించుకొన యత్నించుచు వచ్చినది. 1959 వ సంవత్సరము మార్చి నెలలో దలైలామా సపరివారముగ ఇండియాలో చేరుట, ఆయనకు గౌరవకరమైన శరణ్యమును ఇండియా ప్రభుత్వ మిచ్చుట అటుపిమ్మట టిబెటు నుండి పారిపోయి వచ్చిన షుమారు 13 వేల మంది టిబెటు కాందిశీకులకు ఇండియా శరణ్యమిచ్చి భోజన నివాస సదుపాయ

చైనాజరిపిన ఘోరమైన దురాక్రమణ

ములను గావించుట, కమ్యూనిస్టు చైనా ప్రభుత్వమునకు మరింత ఆగ్రహము కలిగించినందున ఇండియా దేశముపై వారు దురాక్రమణలు, దుష్కృత్యములు మరింతఎక్కువగ గావించసాగినారు. ఈ దురాక్రమణలను గూర్చి కొన్ని ఉదాహరణలను మాత్రము ఇందున చూపించ దలచినాము.

1955 వ సంవత్సరము 22 వ జూన్ తేదీన ఒక చైనా సైనిక బృందము ఇండియాలో భాగమైన హోటి మైదానములో ఐదు గుడారములను, 20 గుర్రములను పెట్టుకొని నివాసమేర్పరచుకొని రనియు, ఇండియాకు చైనాకు ఆ సమీపమున సరిహద్దుగ నున్న టాంజుల్లా కనుమను దాటి ఉత్తరముగ పోవలసినదని వారికి ఉత్తరువు ఇవ్వవలసినదనియు, చైనా ప్రభుత్వమునకు ఇండియా ప్రభుత్వమువారు తెలియపరచినారు. 11 జూలై తేదీన తమ మనుష్యులెవరు హోటీ మైదానములోకి ప్రవేశించలేదనియు, గాని అది చైనాకు చెందినదనియు, దానిలో ఇండియా యొక్క సేనలు అక్రమముగ ప్రవేశించిన వనియు, వాటిని తీసివేయవలె ననియు చైనా ప్రభుత్వము జవాబు వ్రాసినది. నవంబరు 5 వ తేదీన బారాహోటిలో చైనా సైనికులు అక్రమముగ ప్రవేశించి మకాము చేయుచున్నారని, వారిని తీసివేయవలసినదని ఇండియా చైనా వారికి వ్రాసినది. ఆ తేదీనే ఇండియాకు టిబెటుకు సరిహద్దయిన నిటీ కనుమకు దక్షిణమున పదిమైళ్ళదూరమున ఇండియాలో నున్న డమ్జూను గ్రామమును చైనా సైనికులు ఆక్రమించిరని ఇండియా సైనికులను అక్కడికి రాకుండ అటకా

బారాహోటి, డమ్జూను

యించినారని ఇండియా తెలియపరచినది. వీటికన్నిటికి చైనా వారు ఆ ప్రాంతములు తమవనిన్ని, వాటిలోకి ఇండియా సైని

నీలాంగు

కులను రానివ్వవద్దని ఇండియాప్రభుత్వమునకు జవాబు వ్రాసినారు. 1956 వ సంవత్సరము మే నెలలో ఇండియాలో చేరిన నీలాంగు గ్రామములో పన్నెండు మంది చైనా సైనికులు ఒక ఆఫీసరుక్రింద స్టెన్‌గన్‌లు మొదలైనవి పట్టుకొని ప్రవేశించినారని ఇండియా ప్రభుత్వము వ్రాయగ టాంజుల్లాకసుమ, బారాహోటి, నీలాంగు ఇవన్నియు టిబెటులోనే యున్నవని, తమ సైనికులు అచట ఉండుట న్యాయమేనని, వారిజోలికి ఇండియా సైనికులు పోకూడదని

హాప్‌సింగ్ ఖాడ్

26 జూలై తేదీన చైనా జవాబు వ్రాసినది. మరల సెప్టెంబరు 8 వ తేదీన పదిమంది చైనా సైనికులు ఇండియాకు చెందిన హాప్‌సింగు ఖాడ్‌లో ప్రవేశించినారని, వారిని తీసివేయవలసినదని చైనాకు ఇండియాప్రభుత్వము వ్రాసినది. ఆ ప్రదేశము తమదేనని చైనా జవాబు చెప్పినది. ఈ ప్రాంతములలోనుంచి చైనావారు తమ సైనికులను తీసివేయలేదు. బారాహోటి విషయములో రెండు ప్రభుత్వములు విచారణ చేసుకొనడానికి ఏర్పాటు చేసుకొన్నారు. ఆ విచారణ వల్ల తేలినదేమీ లేదు. ఎవరిపక్షము వారే చెప్పుకొన్నారు. రెండవ వారు అంగీకరించలేదు.

1956 వ సంవత్సరము ఆఖరుభాగమున చైనా ప్రధాన మంత్రి యగు చౌ ఎన్-లై ఇండియాను దర్శించినప్పుడు ఆయనకును ఇండియా ప్రధానమంత్రియైన జవహరులాల్ నెహ్రూ

గారికిని జరిగిన సంభాషణలో తాను చైనా బర్మాలమధ్య మెక్ మోహాను లైనును సరియైన సరిహద్దుగ నంగీకరించుచున్నాననియు, చైనాకును, ఇండియాకునుగల చిరకాల స్నేహసంబంధములవల్ల మెక్ మోహాన్ లైనే ఇండియాకును, చైనాకును మధ్య సరియైన సరిహద్దని తాము అంగీకరించబోవుచున్నామనియు చౌ ఎన్ లై చెప్పినాడు. ఈ సంగతి జవహారులాలు నెహ్రూగారు తన దినచర్య పుస్తకములో అనగ డైరీలో వ్రాసుకొని యున్నాడు. ఇటుల చెప్పినప్పటికిని చైనావారి దురాక్రమణలు ఆగలేదు. 1957 వ సంవత్సరములో ఇండియాలోని స్పిటి ప్రాంతములో చైనావారి సైన్యములు మకాము చేసినవి. ఆ కాలమునకు టిబెటునుంచి సింకియాంగుకు తాము వేసిన రోడ్డుతో కలియునటుల ఇండియాలోని లడకులో భాగమైన ఆక్సాయి చిన్‌లో వందమైళ్ళపొడుగున చైనావారు రోడ్డువేసి యున్నారు. ఇటుల ఆక్సాయి చిన్‌లో వందమైళ్ళ పొడుగు భూభాగమును చైనావారు దురాక్రమణ చేసినారు.

నెహ్రూగారితో మెక్ మోహానులైనును అంగీకరించెదనని చౌ ఎన్ లై చెప్పెను.

ఆక్సాయి చిన్‌లో నూరుమైళ్ళ రోడ్డు

1958 వ సంవత్సరములో చైనాసైనికులు లడకులోని ఖుర్నాక్ కోటను ఆక్రమించినారు. ఆక్సాయిచిన్‌లో నున్న ఇండియా పోలీసుపార్టీని చైనావారు అరెస్టుచేసినారు. మరియు ఉత్తరప్రదేశ్‌లోని సంక్రుజమాలా, లాప్తాలు అను రెండు ప్రాంతములలో చైనావారు ప్రవేశించినారు. ఇండియా గవర్నమెంటువారు

చైనావారు ఇండియా పోలీసులను అరెస్టుచేసిరి

వీటన్నిటికిని తమ సమ్మతిలేకతను, ఖండనమును తెలిపినారు. అరెస్టు చేయబడిన ఇండియా పోలీసుబృందమును చైనావారు విడుదలచేసినారు. అంతేకాని ఆక్రమించిన స్థలములలోనుండి పోలేదు. 1958 వ సంవత్సరము అక్టోబరు 18 వ తేదీన షింగు లంగులో ఇండియాయొక్క ముగ్గురు సైనికోద్యోగులు, నలుగురు సైనికులు, కొంతమంది బృందముతో కొన్ని గుర్రములతో

ఇండియా సైనికుల ఖైదు

పాట్రోలు చేయుచుండగ వారిని చైనావారు న్యాయముచేసినారనియు, వారి వృత్తాంత మేమియు తమకు తెలియలేదనియు ఇండియా గవర్నమెంటువారు చైనాప్రభుత్వమునకు తెలిపినారు. అందుమీద వీరందరు చైనాకుచెందిన భాగములో తిరుగుచున్నందున చైనా సైనికులు వారిని ఖైదు చేసినమాట వాస్తవమేనని వారిని అక్టోబరు 22 తేదీన ఖురానెకోరం కనుమద్వారా ఇండియాకు పంపించివేసినామని చైనావారు జవాబు చెప్పినారు.

1959 వ సంవత్సరము జనవరి 17 వ తేదీన చైనాయొక్క సైనికోద్యోగి, 50 మంది సైనికులు నేఫాయొక్క లోహద్

లోహద్

సరిహద్దు డివిజన్‌లో ప్రవేశించినారని అక్కడ సర్వేచేయడం మొదలుపెట్టినారని అది అక్రమమని చైనాప్రభుత్వముకు ఇండియావారు తెలియపరచినారు. మిగియడాన్, సంగాన్ శాస్పే ఈ రెండు టిబెటులో చేరినవని, వీటిలో ఇండియాసైనికులు అక్రమముగ ప్రవేశించి అక్కడ చేరిన టిబెటు తిరుగుబాటుదారులైన బందిపోటుదొంగలకు సహాయము చేయుచున్నారని చైనావారు ఇండియాకు జవాబు వ్రాసినారు.

అచట ప్రవేశించిన హైందవసైనికులు కొన్ని వందలమంది గలరని వ్రాసినారు. ఇదియావత్తు అబద్ధమనియు ఇండియాసైనికులు చైనా యొక్క ప్రదేశములోనికి ఎట్టి దురాక్రమణ చేయలేదని ఇండియా ప్రభుత్వము బదులువ్రాసిరి. టిబెటు శరణార్థుల విషయములో చైనాప్రభుత్వమునకు వ్యతిరేకముగ వారికెట్టి సహాయము తాము చేయుటలేదని, పట్టి శరణ్యము మాత్రమే ఇచ్చినామని, వారు ఇండియాలో చేరగానే వారి వద్దనుంచి ఆయుధములను లాగు కొన్నామని ఇండియా గవర్నమెంటువారు జవాబు వ్రాసినారు. 1959 వ సంవత్సరము జూలై 30 వ తేదీన లడకు ప్రాంతము లోని పాంగాంగు సరస్సు ప్రాంతములోనికి ఇరువదియైదు మంది సాయుధపాణులైన చైనా సైనికులు ప్రవేశించి మకాము ఏర్పాటుచేసుకొనుటయే కాక అక్కడ కావలా కాయుచున్న ఇండియా పోలీసు బృందమును 6 గురిని చైనావారు ఖైదుచేసినారని వారిని తక్షణము విడుదల చేయవలసినదని, చైనా సైన్యములను అక్కడినుంచి తీసివేయ వలసినదని ఇండియా ప్రభుత్వము చైనాకు వ్రాసినారు. ఆ ప్రాంతము తమదేనని అక్కడికి ఇండియా పోలీసు బృందము వచ్చుట తప్పని, వారితో వెళ్లమని చెప్పినను వారు వెళ్లకపోవు టచే వారిని ఖైదీలుగ పట్టుకొన్నామని మరల వారిని విడుదల చేసినామని చైనావారు ఆగష్టు 6 వ తేదీన జవాబు వ్రాసినారు. మరల 7 ఆగష్టు తేదీన రెండువందల మంది చైనా సైనికులు ఇండియాలో చేరిన ఖంచేమేనులో ప్రవేశించి అక్కడ కావలా యున్న హైందవ పోలీసులను నెట్టివేసి స్వాధీనపరచుకొన్నారని

లడకులో దురాక్రమణ

ఇండియా ప్రభుత్వమువారు వ్రాసినారు. 13 వ ఆగష్టు తేదీన లాంగ్జూలో చైనా సైనికులు ప్రవేశించి తుపాకులు కాల్చి అక్కడనున్న ఇండియాపోలీసులను వెళ్లగొట్టినారని, తరువాత వారేమైనది మాకు తెలియదని ఇండియా ప్రభుత్వము వ్రాసినారు. అది చైనా యొక్క భూభాగమేనని, దానిని అక్రమించిన పోలీసు వారిని వారు పట్టుకొని విడుదల చేసినామని చైనావారు వ్రాసినారు. 1958 వ సంవత్సరము చైనా పిక్టోరియల్ మేగజైనులో ప్రకటించబడిన చైనా యొక్క మ్యాపులను గురించి ఇండియా గవర్నమెంటు వారు ఖచ్చితమైన ఆక్షేపణ తెలిపినారు. వాటి ప్రకారము (1) నేఫాలోని ఐదు డివిజనులలో నాలుగు డివిజనులు, (2) ఉత్తరప్రదేశ్ రాష్ట్రములో కొన్ని ఉత్తర భాగములు, (3) జమ్ము కాశ్మీరు రాష్ట్రములో చేరిన లడకు లోని గొప్ప భూభాగములు ఇవన్నియు చైనా వారికే చెందినట్లు ఆ మ్యాపులలో కనపరచినారనియు, 1954 వ సంవత్సరము అక్టోబరు నెలలో ఇండియా ప్రధాన మంత్రి జవహర్‌లాల్ నెహ్రూగారు చైనాను దర్శించినపుడు ఆ మ్యాపులు సరియైనవి కావని, వాటిని మార్చవలసినదని వారిని కోరగ తాము వాటిని గురించి యోచించి తగు విధముగ మార్చెదమని జవాబు చెప్పినారనియు, ఆ మ్యాపులలోని మార్పులు త్వరగాచేయక అట్లాగే ఉంచి ప్రపంచ మంతా చైనా ఉద్యోగులచేత పంపకము చేయబడడం అక్రమ మనియు ఇండియా గవర్నమెంటు వ్రాసినది. 1958 వ సంవత్స

నేఫాలోని లాంగ్జూలో ఇండియాపోలీసులను పట్టుకొని పోయిరి

చైనా పిక్టోరియల్ మాగజిన్

రములో ఇండియా ప్రభుత్వము ప్రచురించిన ఇండియాయొక్క రాజకీయ మ్యాపులో ఉత్తర సరిహద్దు స్పష్టముగ చూపించబడి యున్నదనియు, దానిని చైనా ప్రభుత్వమునకు పంపెదమనియు కూడ వ్రాసియున్నారు.

ఈ చైనా మ్యాపులను గురించి ఆక్షేపణ తెలుపుతూ జవహర్ లాల్ నెహ్రూగారు చైనా ప్రధానమంత్రి చౌ ఎన్ లైకి వ్రాయగ, చౌ ఎన్ లై 1959 వ సంవత్సరము 23 వ జనవరి తేదీన ఒక దీర్ఘమైన జవాబు వ్రాయుచు ఈ క్రిందివిధముగ వ్రాసినారు: "చైనా ఇండియా సరిహద్దు ఎప్పుడూ నిర్ణయము కాలేదు. చైనా ఇండియా ప్రభుత్వముల మధ్య ఈ సరిహద్దు విషయమై ఎట్టి సంధి, ఒడంబడిక జరుగలేదు. ఈ మధ్య కొన్ని సంఘటనలు జరిగినపుడు మాత్రము రెండు ప్రభుత్వముల మధ్య ఉత్తరప్రత్యుత్తరములు జరిగిన మాట నిజమే. సింకియాంగు టిబెటు పెద్దరోడ్డుతో మేము కలిపి నిర్మించిన వంద మైళ్లు రోడ్డు ఆక్సాయిచిన్ లోది చైనా ప్రాంతములోనే వేయబడినది. ఆ ప్రాంతము తమదేనని ఇండియా గవర్నమెంటు చెప్పుచున్న సంగతిని మేము ఒప్పుకొనుట లేదు. కాబట్టి ఇండియాకును, చైనాకును సరిహద్దు తగాదా లున్నవని స్పష్టపడుచున్నది. 1954 వ సంవత్సరములో చైనాకును ఇండియాకును మధ్య వర్తకపు విషయములో జరిగిన ఒడంబడిక కాలములో సరిహద్దు ప్రశ్న తీసుకొనిరాలేదన్నమాట నిజమే. కాని అప్పుడు వర్తక విషయములలోనే మాట్లాడినాము కాని సరిహద్దు విషయములలో మాట్లాడలేదు. మెక్ మోహన్ లైను విషయములో అది

మెక్ మోహన్ లైనును ఒప్పుకోమని చైనా ప్రధాని వ్రాసినారు

బ్రిటిషు సామ్రాజ్యవాదులు టిబెటు దేశ ప్రభుత్వమును బెదిరించి ఒత్తిడిచేసి ఏర్పాటు చేసుకొన్న విషయము కాని, టిబెటువారు బుద్ధిపూర్వకముగ అంగీకరించినది కాదు. చైనా ప్రజలలో ఆ మెక్ మోహన్ లైనుపర్పాటు కావడము చాలఆగ్రహ కారణమయ్యెను. ఆ మెక్ మోహన్ లైను శాస్త్రీయమైనది కాదు. చెల్లునది కాదు. మేము దానిని ఒప్పుకోము. నేనిదివరకే ఈసంగతి చెప్పియున్నాను. టిబెటువారికి కూడ అది అసమ్మతముగ నుండెను. మా చైనా దేశములో సరిహద్దులను గురించి ప్రకటించబడిన మ్యాపులన్నియు అదివరకు అనేక సంవత్సరములనుంచి ప్రచురించబడిన పాత మ్యాపులను అనుసరించినవే. వాటిని మేము మార్చినఎడల మా దేశములో అపఖ్యాతి పొలగుదుము. ఇండియాలో ముఖ్యముగ లడకును గూర్చి ప్రచురించబడిన మ్యాపులు మా దేశ ప్రజలకు అసంతృప్తిని కలుగచేసినవి. వాటిని మార్పించుటకు ప్రయత్నించ మని మా ప్రజలు మమ్ములను ఒత్తిడి చేయుచున్నారు. అందువల్ల సరిహద్దులను గురించి మన ఉభయ ప్రభుత్వములు దీర్ఘమైన సమావేశములు జరిపి వాటిని పరిష్కరించవలసినదే గాని మా అంతట మేము మీరు కోరినమీదట మా మ్యాపులను మార్చు కొనుటకు బొత్తుగ వీలులేదు. మా ప్రభుత్వము ఇండియాతో స్నేహము నపేక్షించుచున్నది. అందుకు ఎట్టి సందేహము లేదు" అని వ్రాసినాడు. అందుమీద 1959 వ సంవత్సరము మార్చి 22 వ తేదీన ఇండియా ప్రధానమంత్రి చైనా ప్రధానమంత్రికి జవాబు వ్రాసినాడు. అందులో "ఏది ఎట్లాఉన్నా ఈ సరిహద్దు హిమా లయ పర్వతములమీదుగ వచ్చినందునను, కొన్నిచోట్ల మాత్రము

హిమాలయ పర్వతములను దాటి రెండు ప్రధాననదులు పుట్టు చోటుగ పోవుచున్నందునను దీనికి ఆక్షేపించుట న్యాయము కాదు." అని వ్రాసి సిక్కిమ్, లడకు, మెక్‌మోహన్‌లైను వీటి విషయమై ఇదివరకు జరిగిన ఒడంబడికలను వివరించెను. "ముఖ్యముగ మెక్‌మోహన్‌లైను హిమాలయ పర్వతములమీదుగ పోవుచున్నందున అది స్వభావసిద్ధమైన అనాదియైన సరిహద్దు అని చెప్పుటకు ఎట్టి ఆక్షేపణ ఉండకూడదు. ఇదివరకు చైనావారు కాని టిబెటువారుకాని దీనికేవిధమైన ఆక్షేపణ తెలిపియుండలేదు. బారాహోటి విషయములో మేము సమాలోచనలు చేయుటకు సిద్ధముగనే యున్నాము కాని అక్కడ కొంతమంది చైనా సైనికబృందము ప్రవేశించి శాశ్వతమైన గృహములను కట్టుటకు ప్రయత్నించుట అక్రమమని మాత్రము నేను మీకు మనవి చేయుచున్నాను" అనికూడ వ్రాసినారు. కాని పైన చెప్పినటుల సరిహద్దు తగాదాలకన్న రాజకీయ కారణములు ఉభయదేశముల మధ్య ఎక్కువ ఘర్షణలను వృద్ధిచేయుచున్నటుల తోచుచున్నది. 1958 వ సంవత్సరము జూలై 10 వ తేదీన చైనా ప్రభుత్వము వారు ఇండియాలోని కాలింపాంగు పట్టణములో చైనాకు వ్యతిరేకులైనవారందరు ప్రవేశించినారని అక్కడ చ్యాంగుకేషకుకు అనుకూలముగ, అమెరికాకు అనుకూలముగ, చైనాకు వ్యతిరేకముగ కుట్రలు జరుగుచున్నవని ఆక్షేపించుచు ఇండియాకు వ్రాసినారు. కాలింపాంగునుంచి చైనాకు వ్యతిరేకముగ బయలు దేరిన ఒక కరపత్రమును కూడ పంపించినారు. చైనానుంచి,

కాలింపాంగులోని కుట్రలు

టిబెటునుంచి పారిపోయినవారు అక్కడ చేరినారని, అక్కడ వారు బహిరంగసభలు చేసుకొంటున్నారని తమకు తెలియ వచ్చినదని వ్రాసినారు. టిబెటు ఫ్రీడమ్ లీగ్, బుద్ధిస్ట సంఘము, కాలింపాంగు టిబెటన్ వెల్ఫేర్ కాన్ఫరెన్సు ఈ మొదలైన సంఘములన్నియు అక్కడ ఏర్పడి చైనాకు వ్యతిరేకముగ గొప్ప కుట్ర జరుగుచున్నదని ఇండియాప్రభుత్వమునకు తెలిపి నారు. ఇండియాప్రభుత్వము అటువంటి కుట్రలకు అవకాశము లేదని, చైనాకువచ్చిన సమాచారము పొరపాటని, ఇండియాలో చైనాకు వ్యతిరేకమైన ప్రచారమును చేయనిచ్చుటలేదని బదులు వ్రాసినారు.

1959 వ సంవత్సరము ఆగష్టు 26 వ తేదీన నేఫాలో చేరిన లాంగ్జు ప్రదేశములో కాపలాకాయుచున్న ఇండియా పోలీసు దళమును చైనాసైనికులు ముట్టడించి వారిలో నొకరిని చంపి, రెండవవారికి బలమైన గాయములు కలుగచేసినారు.ఇది అక్రమమని ఇండియా ప్రభుత్వము చైనాకు వ్రాసినది. దానికి మెక్‌మోహాన్‌లైనును తాము అంగీకరించుట లేదని ఖింజిమేన్, లాంగ్జు, టమ్‌డాన్ ప్రాంతము లన్నియు తమవేనని చైనా జవాబు చెప్పినది. మరియు గడచిన 5 నెలలలో 13 వేలమంది టిబెటు తిరుగుబాటు దారులు ఇండియా దేశములో ప్రవేశించి, అక్కడ కుట్ర చేయుచున్నారని కూడ వ్రాసినది. అక్టోబరు 20 వ తేదీన ఇండియా యొక్క ముగ్గురు సైనికులు ఆయుధ పాణులై కోంగ్ కా కనుమకు దక్షిణమున నున్న చైనా భాగములో

లాంగ్జులో ఇండియా పోలీసులయొక్క హత్య

ప్రవేశించినారని, వెంటనే చైనా సైనికులు వారిని పట్టుకొని వారి వద్ద ఆయుధములు ఊడలాగుకొని ఖైదులో ఉంచినారని, అందుమీద మరునాడు చాలమంది ఇండియా సైనికులు అక్కడికి వచ్చి చైనా సైనికులమీద తుపాకులు కాల్చినారని చైనా వారి గుర్రములను బలవంతముగ పట్టుకొనుటకు ప్రయత్నించినారని అప్పుడు చైనా సైనికులు తుపాకులు కాల్చగ ఇండియా సైనికులు చెల్లాచెదరై పోయినారని, ఇటువంటివి జరుగకుండ చూడవలసినదని చైనా ప్రభుత్వము 22 వ అక్టోబరు తేదీన ఇండియా ప్రభుత్వమునకు వ్రాసినది.

కోంగ్ కా కనుమ

అందుకు జవాబుగ కోంగ్ కా కనుమ సరిహద్దు ప్రాంతమని, దానికి దక్షిణమున లడకులోని సోక్‌సాలుదగ్గర ఇండియా పోలీసు దళము కాపలా కాయుచుండగ చైనా సైనికులు ఆకస్మికముగ వచ్చి వారిమీద తుపాకులు కాల్చినారని, అందువల్ల ఇండియా పోలీసు దళములో 17 మంది మరణించినారని, ఒక పోలీసు ఆఫీసరు కూడ మరణించినాడని, ఇది చాల అక్రమమని ఇండియా గవర్నమెంటు చైనాకు వ్రాసినది. ఈ కోంగ్ కా కనుమ యొక్క విషయమును గురించి చైనా వారు ఇండియా ప్రభుత్వమునకు జవాబు చెప్పుచు ఆ ప్రాంతమంతయు చైనా వారిదేనని అక్రమముగ ఇండియా పోలీసులు ప్రవేశించుటవలన ఉభయ పార్టీలకు ఘర్షణ జరిగినదని వ్రాసినారు. అంతేకాక చైనా సైనికులు వద్దన్నప్పటికి ఇండియా పోలీసులు చైనా ప్రాంతములో ప్రవేశించినందువల్ల వాళ్లను నిరాయుధులుగ గావించి ఖైదు చేసినారని, అందుమీద

లడకులోని సోకుసాల్ విషాద యుదంతము

డెబ్బది మంది కంటె ఎక్కువ ఇండియా పోలీసులు చైనా వారి దగు ఆ భూమిలోకి వచ్చి వెళ్లిపోక చైనా వారి మీద కాల్పులు కాల్చగ వారు మరల తిరిగి కాల్చగ ఉభయులకును జరిగిన ఘర్షణలో చైనా సైనికులు ఏడుగురు ఇండియా పోలీసులను ఖైదు చేసినారని తొమ్మిదిమంది ఇండియా పోలీసులు మరణించినారని, ఆ మరణించిన వారి శవములను సక్రమముగ పాతిపెట్టినారని, ఏడుగురు ఇండియా పోలీసులను చైనాగవర్నమెంటువారు ఖైదు చేసినారని, మొత్తము పదిమంది ఇండియా పోలీసులు చైనా ప్రభుత్వము యొక్క ఖైదులో నున్నారని, వారిని విడిచిపెట్టుటకును, మరణించిన తొమ్మిదిమంది ఇండియా పోలీసుల శవములను ఇండియా భూభాగములోనికి తీసుకొని పోనిచ్చుటకును, చైనా ప్రభుత్వము సిద్ధముగ నున్నదని చైనావారు వ్రాసినారు. ఇందు విషయములో ఇండియా యొక్క జవాబులో ఆ భాగమంతా ఇండియాదేననియు, లడకుకును టిబెటుకును మధ్య సరిహద్దు 1867-68 సం.లో ఇండియా సర్వేపార్టీచేత తయారుచేయబడిన మ్యాపులలో స్పష్టముగ కనపడుచున్నదనియు, 1868 వ సంవత్సరములోను, 1891వ సంవత్సరములోను, 1900 సంవత్సరములోను లడకు ప్రాంతమంతయు మరల సర్వే చేయబడినదనియు, 1908 వ సంవత్సరములో ప్రచురింపబడిన ఇంపీరియల్ గెజిటీర్ ఆఫ్ ఇండియాలో కూడ ఇదే సరిహద్దు చూపబడినదనియు వ్రాసినారు. ఇంతేగాక చైనావారి మ్యాపులు ఒక్కొక్క కాలములో ఒక్కొక్కవిధముగ నున్నవనియు, పరస్పర విరుద్ధముగ నున్నవనియు తెలియపరచినారు. 1893 లో ప్రచురింపబడిన చైనా

ప్రభుత్వ మ్యాపులు ఆక్సాయిచిన్ ప్రాంతము ఇండియాలో నున్నట్లు కనపరచినవని, 1935 వ సంవత్సరములో ప్రచురింపబడిన చైనాయొక్క అట్లాసులో చాంగ్‌చన్ మోభాగము ఇండియాలో నున్నట్లు కనపరచబడ్డదని, ఈ మ్యాపు ప్రకారము ఈ మధ్య ఉభయపార్టీలకు సంఘర్షణ జరిగినచోటు ఇండియాలో నున్నటుల స్పష్టమగుచున్నదని, 1958 వ సంవత్సరమునకు పిమ్మటనే చైనా వారు క్రొత్త మ్యాపులను తయారుచేసినారని, అవి పరస్పర విరుద్ధములుగ నున్నవని, ఈ జరిగిన సంఘటనము చాల ప్రాముఖ్యమైనదని ఇండియా జవాబు వ్రాసినది. దాని నిజవృత్తాంత మీ విధముగ ఇండియా చైనాకు తెలిపినది. "అక్టోబరు 19వ తేదీన ఇండియా పోలీసు పార్టి హాట్ స్ప్రింగ్స్‌చోట ప్రవేశించి అక్కడ ఒక మకాము నేర్పరచుకొన్నది. మరునాడు ఉత్తరానికి పోయే ముందు కరంసింగు అను పోలీసు అధికారి ఇద్దరు కానిస్టేబుల్సును తూర్పువైపుగ పంపినాడు. ఆ పోలీసు కాన్‌స్టేబుల్సు ఇద్దరు తిరిగి రాలేదు. అందుమీదట వారిని వెదకుటకై ఒక చిన్న పోలీసు దళమును ఆ వైపుకు పంపినాడు. రాత్రి 11 గంటలకు వారు తిరిగివచ్చి ఆ ఇద్దరు కాన్‌స్టేబుల్సు కనపడలేదని చెప్పినారు. మరునా డుదయము పోలీసు ఆఫీసరైన కరంసింగు వాళ్లను వెతుకుకుంటూ తానే వెళ్లుటకు నిశ్చయించినాడు. త్యాగి అను మరియొక ఆఫీసరును వెంటపెట్టుకొని వెళ్ళినాడు. కొంతమంది పోలీసు దళముకూడ ఆయనతో వెళ్ళినది. మొత్తము ఇరువది మంది యైనారు. వారిని వెనుక నడిచిరావలసినదని ఉత్తరువిచ్చి బయలుదేరినాడు. హాట్ స్ప్రింగునుంచి ఆరు మైళ్లు తూర్పునకు,

పోగా ఆ సమీపమున నున్న కొండమీదనుంచి చైనా సైనికులు వారిమీద తుపాకులను కాల్చినారు. కరం సింగు పార్టీ, త్యాగి పార్టీ మరల కాల్చుటకు ప్రయత్నించినారు. కాని వారి కాల్పుల వల్ల ప్రయోజనము లేకపోయినది. కొండమీదనున్న చైనా వారు త్యాగి పార్టీమీద కాల్చి కరంసింగు పార్టీతో కలువకుండ చేసినారు. చాంగ్ చన్ మో నదికి అవతలనున్న చైనా పార్టీ వారు గుర్రములమీద వచ్చి కలిసినారు. కరంసింగు పార్టీలో చాలమంది మరణించినారు. మొత్తముమీద కరంసింగుతోసహా పదిహేడు మంది కనిపించకుండా పోయినారు. అందులో ఒక ఆఫీసరు, మరియు నలుగురు పోలీసు కాన్‌స్టేబుల్సు, ఒక జమేదారు, వీరు మరణించినట్లు స్పష్టపడినది" అని తెలిపినారు. ఈ దుష్కృత్యము జరిగిన పిమ్మట కొంత ఉత్తరప్రత్యుత్తరములు జరుగగ కరంసింగు మొదలైన పోలీసువారిని చైనావారు వదలిపెట్టినారు. కరం సింగును షుమారు మూడు వారములు చైనాయొక్క ఖైదులో నిర్బంధము చేసి నానా హింసలు పెట్టి తాము ప్రవేశించిన ప్రాంతము చైనావారిదేనని, తాము చేసినది నేరమే నని ఒప్పు కొనినట్లు ఒక లేఖను వ్రాయించుకొన్నారు. కరంసింగు విడుదలై ఇండియా చేరునప్పటికి చాల జబ్బుస్థితిలో నున్నాడు. తనను బలవంతపెట్టి వ్రాయించుకున్నారని చెప్పినాడు.

ఇటుల సరిహద్దుతగాదా ఇండియాకును చైనాకును ప్రబలి యున్నది. చైనా ప్రధానమంత్రి, ఇండియా ప్రధానమంత్రి ఉభయులును కలుసుకొని స్నేహముగ మాట్లాడి ఈ సరిహద్దు సమస్యలను పరిష్కరించుకొనుట యుక్తమని ఉభయులును లేఖలు

వ్రాసుకొనిరి. ఇండియాపార్లమెంటులో ఈ సమస్యమీద అనేక సార్లు చర్చ జరిగెను. చైనా చేసినది దురాక్రమణయే నని కమ్యూనిస్టులు తప్ప మిగిలినపార్టీల సభ్యులందరును ఖండితముగ అభిప్రాయములను తెలిపిరి. ఇటుల దురాక్రమణ చేసి, ఆక్రమించిన 12 వేల చదరపు మైళ్ళను విడిచిపెట్టి చైనాప్రభుత్వము వెనుకకు పోయినకాని వారితో ఎట్టి రాజీపడుట యుక్తము కాదని చాలమంది సభ్యులు చెప్పిరి. జవహరులాలు నెహ్రూ గారిని రాజీకై పికింగుకు రమ్మనిరి. ఒప్పుకోలేదు. ఆఖరుకు రంగూనుకు పోవుటకుకూడ సమ్మతించలేదు. అందుమీద 1960 వ సంవత్సరము ఏప్రిలు 18 తేదీన చైనా ప్రధానమంత్రి యగు చౌ ఎన్ లై ఇండియాకు వచ్చి, ఢిల్లీలో ఇండియా ప్రభుత్వ అతిథిగ నుండెను. ఆయనకు ఇండియాప్రజలు ఎట్టి స్వాగత

రాజీకొరకు చౌ ఎన్ లై ఇంఢియా రాక - రాజీ కుదరలేదు

మిచ్చలేదు. ఢిల్లీలో విమానము దిగి నెహ్రూ గారితో కలిసి ఏకాయెకి కారులో రాష్ట్రపతి భవనమునకు వెళ్ళెను. వారమురోజులు సంభాషణలు జరిగిన పిమ్మట రాజీ కుదరలేదని ప్రకటించినారు. కాని ఉభయపక్షముల దస్తావేజులను పరీక్షించి చైనా పక్షపు ఉద్యోగస్థులును, ఇండియాపక్షపు ఉద్యోగస్థులును కలిసి విచారించి ఒక రిపోర్టు తయారు చేయవలసినదనియు, ఈ ఉభయపక్షముల సమావేశము ప్రథమమున పికింగులోను తరువాత ఢిల్లీలోను జరుగవలెననియు నిశ్చయించినారు. చౌ ఎన్ లై ఏప్రిలు 25 వ తేదీన పికింగుకు పయనమై వెళ్లెను. ఉభయపక్షముల ఉద్యోగస్థులు ఈ మధ్య పికింగులో సమావేశమైనారు. ఏదో విచారణ చేయు

చున్నారు. పర్యవసాన మేమగునో చెప్పజాలము. న్యాయముగ చైనా, ఇండియా దేశముల మధ్యనున్న సరిహద్దు తగాదా పరిష్కారమైనచో ఉభయదేశములకు లాభకరముగ నుండును. స్నేహ సంబంధములు మరల బాగుగ నేర్పడును. హిమాలయ పర్వతములు, వేదములలో, పురాణములలో, ఇతిహాసములలో, ప్రబంధములలో, పిమ్మట చరిత్ర కాలములో భారతజాతికి అతి పవిత్రమైనవిగ నెంచబడుచు, పదివేలసంవత్సరముల భారతీయ విజ్ఞానములో ప్రధానస్థాన మలంకరించుచున్నవి. అవి భారత దేశమున కుత్తరసరిహద్దుగానుండి పెట్టనికోటలై భారత స్వతంత్రమును కాపాడుచున్నవి. అట్టి హిమవత్పర్వతములకు దక్షిణమున ఒక చదరపుగజము నైనను చైనావారు ఆక్రమించు టకు భారతీయులు ఒప్పుకొనరు. సర్వ త్యాగములను చేసి ప్రాణము లర్పించి హిమవత్పర్వతములను కాపాడుకొనెదరు. చైనావారు హిమాలయ పర్వతములను దాటి దక్షిణమున ఇండియాలోనున్న ఏబదియొక్కవేల చదరపుమైళ్ళను కావలెనని కోరుచున్నారు. ఈ కోరికకు ఏ భారతీయుడు అంగీకరించడు. అందువల్ల చైనా ఇండియాలమధ్య న్యాయముగ రాజీకుదిరినచో గొప్ప అదృష్టమని భావించతగును.

ఈ సమస్య స్నేహముగ శాంతముగ పరిష్కారమగునని ఆశించుకొని చేతులు ముడుచుకొని కూర్చొనగూడదు. ఇండియా గవర్నమెంటువారు తమయొక్క సైనిక బలమును వృద్ధిచేసు కొన్నారు. చైనావారు ఆక్రమించినది పోగా మిగిలిన దానిని కాపాడుకొనుటకు ప్రతిచోటను తమ సైన్యము నుంచినారు.

చైనావారి దురాక్రమణలు ఆగియున్నవి. చైనా ఇండియా సరిహద్దుతగాదా న్యాయముగకుదరక వ్యవహారములు ముదిరేయడల ఇండియా దేశముయొక్క స్వతంత్రమును, అసలైన సరిహద్దులను కాపాడుకొనుటకు ఇండియా పౌరులెల్లరు సిద్ధముగ నుండవలెను. ఇండియా ప్రజలు ఎక్కువైన ఐకమత్యముతో చైనా సరిహద్దు తగాదాను ఎదుర్కొనవలసియున్నది. ఈ ఒక్క సరిహద్దు తగాదాకే కాక ఎట్టి తగాదా వచ్చినను, భారతదేశము యొక్క స్వతంత్రమును కాపాడుటకు దేశప్రజలు ఎల్లప్పుడును తయారుగ నుండవలెను. బాండుంగు సమావేశములో ఆశియా ఆఫ్రికా దేశముల నాయకత్వము తమకు లేదనియు, ఇండియాకే కలదనియు, ఆ దేశములన్నియు ఒక్క వియత్‌మినుగాక కమ్యూనిజమునకు వ్యతిరేకముగ నున్నవనియు, రుష్యా అమెరికా బ్లాకులలో చేరక, చాలమట్టుకు తటస్థవిధానము నవలంబించి ఇండియా ననుసరించుచున్నవనియు చైనా ప్రధానమంత్రి చౌ ఎన్ లై బాగుగ గ్రహించినాడు. అప్పటి నుంచి చైనా నాయకులు ఆశియా ఆఫ్రికాఖండముల దేశముల వ్యవహారములలో ప్రవేశించి ఇండియాయొక్క నాయకత్వమును కూలద్రోసి చైనాయొక్క నాయకత్వమును స్థాపించ యత్నించుచున్నారు. ఆల్జీరియాలో, కాంగోలో నితర ఆఫ్రికా దేశముల వ్యవహారములలో జోక్యము పుచ్చుకొనుచున్నారు. ఆఫ్రికాలో కమ్యూనిజము వ్యాపింపచేయుటకు ప్రయత్నించుచున్నారు. మరియొకవైపున కమ్యూనిస్టు ప్రపంచములో రష్యాను తోసిరాజని తామే నాయకత్వము వహించ యత్నించుచున్నారు. అంతేగాక యుద్ధము కావలెనని

చైనా సేనానాయకులు అత్రతచూపుచున్నారు. ఇట్టి విషమ పరిస్థితు లలో చైనానుంచి ఎట్టి అపాయము ఎప్పుడు ఏ విధముగ వచ్చునో తెలియదు. కనుక దేశరక్షణ కొరకు భారతదేశ ప్రజలెల్లరు సర్వకాలముల యందు సంసిద్ధులుగ నుండవలెను. వచ్చిన స్వతంత్ర మును సంరక్షించుకొనవలెను.

జై హింద్

## BIBLIOGRAPHY FOR THE FIRST PART


1. Civilisation of China *by H. A. Giles*
2. History of Far East in Modern times *by Doctor H. M. Vinacke*
3. Modern China *by Sih-Gung Cheng*
4. Foundations of modern China *by Tang Leang Li*
5. Inner History of Chinese Revolution *by Tang Leang Li*
6. The Three Principles *by Doctor Sun Yet Sen*
7. The Dawning of a new China *by T. L. Shen*
8. Youth movement in China *by Doctor Tsi C. Wang*
9. China speaks *by China Meng*
10. Eminent Asians *by Joseph Hall*
11. Revolt of Asia *by Upton Close*
12. The problem of China *by Bertrand Russel*
13. Awakening of the East *by Frederick White*
14. China today (Political) Stanely Hornbeck world peace Foundation series
15. Imperialism and world politics *by Doctor Moon*
16. Budhistic age *by V. Satyanarayana*
17. Lytton Commission Report
18. Shanghai Press Union Publication dated 30th May, 1932 re-Chinese boycott.


★

## BIBLIOGRAPHY FOR THE SECOND PART

1. Red Star over China *by Edgar Snow*
2. Two Chinas *by K. M. Panikkar*
3. Revolution in China *by Fitz Gerald*
4. China New Age and New Outlook *by Ping Chia Kuo*
5. Mao's China *by Glukstein*
6. Report on Mao's China *by Frank Moraes*
7. New China *by Raja Hati Singh*
8. The New Economy of China *by Gyansingh*
9. Soviet Russia in China *by Chiang Kai Shek*
10. Revolution and Counter Revolution in China *by M. N. Roy*
11. Outline Histoty of China, China knowledge series
12. China in Transition Selected articles 1952-1956.
13. Missionaries Chinese and Diplomats *by Paul A. Varg*
14. Articles in the Times of India *by Doctor Chandrasekhar*
15. Co-operative Farming in China *by D. Seshadri Sastri*
16. Report of the Indian Delegation to China on Agrarian Co-operatives
17. Constitution and Politics of Eastern countries *by Berger Djanktchu and Burkes*
18. Recent River Valley projects in China *by Kunwar Sen and Doctor K. L. Rao*

19. Articles in Foreign Affairs
20. Articles in China Reconstructs
21. The Revolt in Tibet *by Frank Moraes*
22. Tibet Disappears *by Chanikya Sen*
23. White Paper - Issued by Government of India, 1954—1959.
24. White Paper No. II - Issued by Government of India September — November 1959.
25. India — China Border problem - Issued by Government of India December 22, 1959.

★

•

# పదానుక్రమణిక

# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 11 | నిర్యాణము | నిర్వాణము |
| 5 | 17 | క్రీ. పూ. | క్రీ. శ. |
| 21 | 21 | విదేశాంగమంత్రియును | విదేశాంగమంత్రియను |
| 97 | 15 | పిర్యాదు | ఫిర్యాదు |
| 99 | 22 | యువడగు | యువకుడగు |
| 161 | 1 | టిబెట్టువారికిని | చైనాలోని టిబెటియను లకును |
| 197 | 7 | చారిత్రలు | చరిత్రలు |
| 197 | 9 | పోత్సహించగ | ప్రోత్సహించగ |
| 236 | 14 | పారతంత్రము | పారతంత్ర్యము |
| 247 | శీర్షిక | షష్ఠాధ్యాయము | నవమాధ్యాయము |
| 251 | 12 | కావువ | కావున |
| 252 | 11 | సంవత్సరముస | సంవత్సరమున |
| 253 | 23 | ములు జరుగనేలేదు | ప్రయత్నములు జరుగలేదు |
| 420 | 8 | వక్తికి | వ్యక్తికి |
| 478 | 9 | సాగినినాడు | సాగించినారు. |
| 532 | 8 | నింద్రించుటకు | నిద్రించుటకు |
| 535 | 7 | కమ్యూ్యాలలో | కమ్యూ్యానులలో |
| 540 | 22 | నికవర్గ | ధనికవర్గ |

★